

డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్

ఎం.ఎ., పి.హెచ్.డి., డి.ఎస్.సి., బార్–ఎట్–లా, జె.పి., ఎల్.ఎల్.డి., డి. లిట్.

జననం : 14 ఏప్రిల్, 1891

పరినిర్వాణం : 6 డిసెంబర్, 195

# డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్

# రచనలు – ప్రసంగాలు

## సంపుటం – 4

ప్రధాన సంపాదకులు

ఆచార్య పేర్వారం జగన్నాథం

ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం

సంపాదకులు

డాక్టర్ బి. విజయభారతి

బొజ్జా తారకం

అనువాదం

డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్

హైదరాబాద్

సారథ్యం

తెలుగు విశ్వవిద్యాలయం

కన్వీనర్

ప్రొఫెసర్ జయధీర్ తిరుమలరావు

ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

1994

# Dr. BABASAHEB AMBEDKAR RACHANALU - PRASANGALU VOL - IV


Volumes in English Compiled : Vasant Moon

*Pages :* + xx + 404





*First Edition :*
October 1993

*Second Edition :*
October 1994

*Copies :*
Popular Edition : 4000

*Price :*
Popular Edition Rs. **40/-**

*General Editor :*
**Prof. PERVARAM JAGANNADHAM**

*Editors :*
**Dr. B. Vijaya Bharathi**
**Bojja Tharakam**

*Convenor :*
**Prof. JAYADHIR THIRUMAL RAO**

*Copies can be had from :*
**Registrar,**
Telugu University
Lalita Kala Kshetram, Public Gardens,
Hyderabad - 500 004.

*Cover :* K.C. Reddy

*Printed at :* NAVYA PRINTERS,
Raj Bhavan Road, Hyderabad. Phone : 314147

ఆచార్య పేర్వారం జగన్నాథం,
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం,
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు - 4.

# రెండవ ముద్రణ పీఠిక

నవభారత రాజ్యాంగ నిర్మాత బాబాసాహెబ్ డా. భీంరావు అంబేద్కర్ ఆంగ్ల రచనలను తెలుగులోకి అనువదించి ప్రచురించే కార్యక్రమానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు విశ్వవిద్యాలయాన్ని సారథ్య సంఘంగా నియమిస్తూ అందుకోసం 18 లక్షల రూపాయలు మంజూరు చేసింది. ఈ ప్రణాళికను ప్రోత్సహించి నిధులు మంజూరు చేసిన అప్పటి ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి గారికి, అంబేద్కర్ సంపుటాలను విజయవంతంగా తెలుగు వారికి అందజేయడంలో సహకరిస్తున్న ప్రస్తుత ముఖ్యమంత్రి మాన్యులు శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారికి ఈ సందర్భంగా ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. డా. అంబేద్కర్ భావజాలాన్ని, ఆయన ఆలోచనా సరళిని నేటి యువతరానికి తెలియజేసే దృష్టితో ఈ గ్రంథాలను సంక్షేమ శాఖ హాస్టళ్లకు సరఫరా చెయ్యాలని ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ శాఖ మమ్మల్ని కోరింది. అందుకోసం ఈ సంపుటాలను ప్రత్యేకంగా పునర్ముద్రిస్తున్నాం. ఈ కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించుటకు సహకరిస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి, సాంఘిక సంక్షేమ శాఖాధిపతులకూ, పాఠకులకూ, ఆయా సంపుటాల సంపాదక వర్గానికి మరోసారి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

(పేర్వారం జగన్నాథం)

హైదరాబాదు
ది. 14.10.1994
విజయదశమి

# ముందుమాట

భారత రాజ్యాంగ నిర్మాతగా, దళితవర్గాల నాయకుడిగా, రాజనీతికోవిదుడుగా, న్యాయశాస్త్ర పారంగతుడుగా, ప్రజాభిమానాన్ని చూరగొన్న మనీషి డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్. కులవ్యవస్థలో కూరుకుపోయిన వారికి డా॥ అంబేద్కర్ ఒక ఆశాజ్యోతి. ఒక చైతన్య కేతనం. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వాల మేలు కలయికగా ఉండే సమాజం అంబేద్కర్ లక్ష్యం.

మహర్ కులంలో జన్మించిన అంబేద్కర్ విద్యార్థి దశ నుండే సమాజం చేత ఉద్ధృతమైన అవమానాలను ఎదుర్కొన్నారు. దాంతో చిన్నతనంలోనే ఆయన సంఘ సంస్కరణ, పీడిత జనోద్ధరణే పరమ లక్ష్యంగా ఎన్నుకొన్నారు. ఆయన ఏ వృత్తి చేపట్టినా ఆ లక్ష్యానికి దూరం కాలేదు. ఆ లక్ష్యసాధన కోసం డా॥ అంబేద్కర్ రాజకీయ కార్యకలాపాలు నిర్వహిస్తూ, ఎన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలను కొనసాగించారు. ఆ క్రమంలోనే రచనలు చేయడం, ప్రసంగాలు చేయడం ద్వారా ప్రచారం చేయడం, వంటి ప్రధాన మార్గాలను ఎంచుకున్నారు.

బలహీన వర్గాలలో చైతన్యాన్ని రగిలించి వారికి నాయకత్వం వహించి డా॥ అంబేద్కర్ తన రాజకీయ మహాప్రస్థానానికి శ్రీకారం చుట్టారు. బొంబాయి రాష్ట్ర శాసన సభ్యత్వం, రాజనీతి శాస్త్రంలో విశేష పరిజ్ఞానం డా॥ అంబేద్కర్ కృషికి ఎంతగానో దోహదం చేసినాయి.

డా॥ అంబేద్కర్ అహర్నిశలు ప్రతి దశలోనూ దళితుల అభ్యున్నతి కోసం కృషి చేశారు. రాజ్యాంగంలో దళితులకోసం ఏర్పాటయిన ప్రత్యేక హక్కులు, వసతుల కోసం నిర్విరామంగా కృషి చేసిన విషయం లోకవిదితమే.

దళిత జనాభ్యున్నతి కోసం ఆయన సాగించిన అవిశ్రాంత పోరాటానికి వెన్నుదన్నుగా భారత చరిత్ర, శ్రుతి స్మృతి పురాణాది ప్రాచీన వాఙ్మయాన్ని, అందుకు సంబంధించిన ఆధార గ్రంథాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నారు. తాను చేపట్టిన మహత్తర సంస్కరణోద్యమాన్ని శక్తిమంతంగా నడిపించినారు.

డా॥ అంబేద్కర్ ఏ రంగంలో కృషి చేసినా రచనా వ్యాసంగాన్ని విడనాడలేదు. రాజకీయ, ఆర్థిక, సాంఘిక, ధార్మికాది విషయాలపై అసాధారణ ప్రతిభతో ఆయన రాసిన రచనలు, చేసిన ప్రసంగాలు అంబేద్కర్ జ్ఞాన సంపదకు మణిహారాలు.

అమూల్యమైన అంబేద్కర్ రచనలు – ప్రసంగాలను సేకరించేందుకు 1976లో మహారాష్ట్ర ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఫలితంగాడా॥ అంబేద్కర్

గ్రంథావళిని మహారాష్ట్ర ప్రభుత్వం శ్రీ వసంత్‌మూన్ గారిచే సంకలనం చేయించింది. 1979లో డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ జన్మదినోత్సవ దినాన ఆంగ్లంలో వెలువరించి భారతావనికి అందించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం డా॥ అంబేద్కర్ శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఆయన రచనలు, ప్రసంగాలను తెలుగులోకి అనువదింపజేయాలని నిర్ణయించింది. ఈ విషయంలో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డిగారి ఆసక్తి, ఉత్సాహం అనువాద కార్యక్రమానికి ప్రేరకాలయినాయి. వారు నిధులను కూడా సమకూర్చినారు.

అనంతరకాలంలో ముఖ్యమంత్రి మాన్యశ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డిగారు డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమానికి మరింత చేయూత అందించినారు. అందుకు రాష్ట్ర ప్రభుత్వానికి ధన్యవాదాలు తెలుపుతున్నాను.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ అనువాద కార్యక్రమ నిర్వహణకు సారధ్య సంస్థగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని నియమించింది. తెలుగుశాఖలు ఉన్న కొన్ని విశ్వవిద్యాలయాలు, ఇతర ముఖ్య సంస్థలు ఈ అనువాద కార్యక్రమంలో భాగస్వాములను చేసి తెలుగు విశ్వవిద్యాలయ పూర్వ ఉపాధ్యక్షులు పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ఈ ప్రణాళికకు రూపకల్పన చేశారు. వారి నేతృత్వంలో అనువాద కార్యక్రమానికి ఆరంభం జరిగింది.

పైన పేర్కొన్న వివిధ సంస్థలు డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని బాధ్యతయుతంగా స్వీకరించాయి. అంతేకాదు ఆయా సంస్థలకి చెందిన వ్యక్తులే సంపాదక బాధ్యతలు నిర్వహించినారు. వివిధ రచయితలు, పండితులు చేసిన అనువాదాల్లో సంపాదకులు ఎంత ప్రయత్నించినప్పటికీ కొంత భిన్నత, అనువాదశైలీ భేదాలు చోటుచేసుకోక తప్పలేదు.

డా॥ అంబేద్కర్ రచనలు – ప్రసంగాలు అనువాద కార్యక్రమానికి తగిన సలహాలు, సూచనలు ఇచ్చేందుకు ఒక పరిశీలనా సంఘం ఏర్పాటైంది. పార్లమెంటు మాజీ సభ్యులు శ్రీ కోట పున్నయ్య, ప్రముఖ విద్యావేత్త డా॥ టి.వి. నారాయణ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ మాజీ కార్యదర్శి శ్రీ జె. వీరాస్వామి సభ్యులుగా ఉన్నారు. పరిశీలనా సంఘ సభ్యులు చేసిన సూచనలననుసరించి, వారి మార్గదర్శక సూత్రాలను దృష్టిలో ఉంచుకొని సారధ్య సంఘంగా తెలుగు విశ్వవిద్యాలయం అనువాద కార్యక్రమాన్ని ముందుకు నడిపిస్తున్నది. ఈ సందర్భంగా వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నాను.

డా॥ అంబేద్కర్ రచనలు – ప్రసంగాలు సంపుటాలను అనువదించే బాధ్యతను తెలుగు విశ్వ విద్యాలయం వెంటనే వివిధ విశ్వవిద్యాలయాలకు, కొన్ని సంస్థలకూ అప్పగించింది. ఈ సందర్భంలో రాష్ట్రప్రభుత్వ విద్యాశాఖ, సాంఘిక సంక్షేమ శాఖలు ఏర్పాటు చేసిన సమావేశాలకు తెలుగు విశ్వవిద్యాలయం తరపున రిజిస్ట్రార్ డా॥ తాళ్ల వెంకటరెడ్డి మా ప్రచురణల కార్యక్రమాన్ని క్రమబద్ధం చేశారు.

డా॥ అంబేద్కర్ శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకుని తెలుగు విశ్వవిద్యాలయం

అనువదించి, ముద్రింపజేసిన ఏడవ సంపుటం తిరుపతిలో 14.4.1992నాడు ఆవిష్కృతమైంది.

డా॥ అంబేద్కర్ జయంతిని పురస్కరించుకుని డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌వారు అనువదించిన మొదటి సంపుటం హైదరాబాదులో 14.4.1993నాడు ఆవిష్కృతమైంది.

ప్రస్తుత సంపుటం డా॥ అంబేద్కర్ గ్రంథావళిలో నాల్గవది. దీని అనువాదాన్ని డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ వారు నిర్వహించినారు. ఈ గ్రంథంలో మతపరమైన చిక్కుముళ్లను, సామాజికపరమైన చిక్కుముళ్లను, రాజకీయపరమైన చిక్కుముళ్లను డా॥ అంబేద్కర్ నిశితంగా చర్చించినారు.

ఈ నాల్గవ సంపుటం అనువాదాన్ని డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ ప్రముఖ రచయితలకు, అనువాదకులకు అప్పగించింది. అనువాదాన్ని సకాలంలో అప్పగించడానికి విశేషంగా తోడ్పడిన డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ అధ్యక్షులు శ్రీ కె. ఎస్. ఆర్. మూర్తి, ఐ.ఎ.ఎస్. (రిటైర్డ్), ఉపాధ్యక్షులు శ్రీ కె. మాధవరావు, ఐ.ఎ.ఎస్., ప్రధాన కార్యదర్శి శ్రీ డి. మురళీకృష్ణ, ఐ.ఎ.ఎస్., సంయుక్త కార్యదర్శులు, శ్రీ ఎం. బాబూరావు, ఐ.పి.ఎస్., శ్రీ పి. సైదులు, శ్రీ పి. రత్నం; శ్రీ పి. కమలేశ్వరరావు, ఐ.ఎ.ఎస్., శ్రీ కె. బాబూరావు, శ్రీ టి. జేసుదానం, ఐ.ఎ.ఎస్.; జస్టిస్ డా॥ కొత్తపల్లి పున్నయ్య, డా॥ బోయి భీమన్న తదితరులకు మరియు ట్రస్ట్ తరపున అనువాదాల సమన్వయకర్త, కార్యాలయ కార్యదర్శి శ్రీ గనుమల జ్ఞానేశ్వర్‌గారికి ప్రత్యేక ధన్యవాదాలు. అనువాదకులు డా॥ అంతటి నరసింహం, శ్రీ ఎస్. వి. రమణరావు, శ్రీమతి మొక్కపాటి సుమతి, శ్రీ కె. రాహుల్, ఎం. సుమిత్ర, డా॥ బి. విజయ భారతి, శ్రీ బొజ్జా తారకం, శ్రీ టి. భావనారాయణ, శ్రీ తెన్నేటి విజయచంద్రగార్లకు ధన్యవాదాలు.

దీక్షతో, దక్షతతో త్వరితగతిని అనువాదానికి మెరుగులు దిద్దిన సంపాదకులు డా॥ బి. విజయభారతి, శ్రీ బొజ్జా తారకం గార్లకు నా అభినందనలు తెలియజేస్తున్నాను.

డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహించి, ఉత్సాహంతో ముందుకు నడిపిస్తున్న సాంఘిక సంక్షేమ శాఖాధికారులకీ, ఉన్నత విద్యాశాఖాధికారులకు కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని సకాలంలో అందంగా ముద్రించిన భారతి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు వారికి కృతజ్ఞతలు.

ఈ సంపుటం అందరి హృదయాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం
మరియు
ప్రధాన సంపాదకులు

# తొలిమాట

భారత రాజ్యాంగ ప్రధాన నిర్మాత డా॥ అంబేడ్కర్ ఒక రాజ్యాంగవేత్తగా, పార్లమెంటు వ్యవహర్తగా మాత్రమే ప్రపంచానికి పరిచితుడు కాదు, ఆయన ఒక గొప్ప పండితుడిగా, కార్యశీలి అయిన సంస్కర్తగా విశ్వవిఖ్యాతి గాంచాడు. దళితుల నాయకుడిగా ఆయన హిందూ సమాజంలోని దమన రీతులకు వ్యతిరేకంగా ఎన్నో పోరాటాలు చేశాడు. ఆయన తన జీవితకాలమంతా స్వాతంత్ర్యం, సమానత్వం, న్యాయం, విశ్వమానవ సౌభ్రాత్రతల మీద ఆధారపడిన ఒక కొత్త సామాజిక వ్యవస్థను ఏర్పాటు చేయటానికే కృషి చేశాడు.

వెనుకబడిన వర్గాల సమస్యల పరిష్కారానికి ఆయన చూపిన విప్లవాత్మకమైన, మానవీయమైన మార్గానికి భారతీయ సమాజం ఆయనకు ఎంతో ఋణపడి ఉన్నది.

డా॥ అంబేడ్కర్ జీవితకాలమంతా శ్రమించిన వెనుకబడిన వర్గాలవారి సంక్షేమం కోసం మహారాష్ట్ర ప్రభుత్వం నిబద్ధమై ఉన్నది. డా॥ అంబేడ్కర్ వంటి మహాపురుషుల ఆలోచనలు, బోధనలు కొత్త తరానికి ఎప్పుడూ వెలుగును అందిస్తూనే ఉంటాయి. డా॥ అంబేడ్కర్ రచనలను పూర్తిగా ప్రచురించాలనే పథకంలో భాగంగా ఆయన అముద్రిత రచనలను మూడు భాగాలను వరుసగా తీసుకు వస్తున్నందుకు మా ప్రభుత్వం ఎంతో గర్వపడుతున్నది, ఆనందిస్తున్నది.

ఎస్.బి. చవాన్

మహారాష్ట్ర ముఖ్యమంత్రి

# ముందుమాట

డా॥ అంబేడ్కర్ రచనలలో ఇప్పటివరకూ ముద్రితం కాని ఈ సంపుటాలకు ముందు మాట రాయవలసిందిగా నన్ను అడగటం, నాకెంతో గౌరవాన్ని ఇచ్చినట్టుగా భావిస్తున్నాను.

భారతీయ సమాజ శాస్త్ర కోవిదులలో డా॥ అంబేడ్కర్ అత్యుత్తమ స్థానాన్ని అలంకరిస్తారు. ఆయన రచనల ద్వారా ప్రస్ఫుటమయ్యే ఆయన పాండితీ ప్రకర్ష, మన సాంఘిక మతపరమైన సమస్యలకు ఒక హేతుబద్ధమైన మార్గాన్ని సూచించే కాంతిరేఖలా ఉపకరిస్తుంది.

డా॥ అంబేడ్కర్ సంపూర్ణ రచనలను సంపుటాలుగా వెలువరించే పని మహారాష్ట్ర ప్రభుత్వం చేపట్టింది. ఈ పని నిమిత్తమై పునర్నిర్మితమైన సంఘం ఆయన అముద్రిత రచనలను మూడు సంపుటాలుగా వెలువరించింది. భారతీయ సామాజిక, రాజకీయ పరిణామ అధ్యయనపరులు వీటికోసం ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్నారు.

భారతీయ సమాజంలోని తాత్విక సమస్యలనూ సాంఘిక సమస్యలనూ, చర్చించిన ఈ సంపుటాలు, హేతువాద ప్రాతిపదికపైన జాతీయ సమస్యలకు పరిష్కారాన్ని కనుగొనటానికి ఆత్రుత పడుతున్న నవయువతరానికీ, మేధావులకూ చాలా ఆసక్తిదాయకమవుతాయి.

ఈ సంపుటాలను త్వరితగతిలో తీసుకు రావటానికి చూపిన ఆసక్తికి, అంకిత భావానికి, శ్రద్ధకు సంపాదకవర్గాన్ని అభినందించాలి.

ఆచార్య రామ్ మేఘే

విద్యాశాఖమంత్రి, మహారాష్ట్ర

# ప్రస్తావన

డ్టాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్ సోర్స్ మెటీరియల్ పబ్లికేషన్ కమిటీ సభ్యులు మహారాష్ట్ర ప్రభుత్వం తరపున డ్టాక్టర్ అంబేడ్కర్ అముద్రిత రచనలు ఉన్న ఈ సంపుటిని పాఠకులకు అందించటానికి సంతోషిస్తున్నారు. ఈ సంపుటం ఎన్నో విధాల ప్రాముఖ్యత కలిగినదీ, అసాధారణమైనదీను. మొదటగా ఈ సంపుటంలోని అంశాలు ఇంతవరకూ తెలియనివి. ఇవి డా॥ అంబేడ్కర్ అముద్రిత రచనలు. ఇవి ఇంతవరకు అడ్మినిస్ట్రేటర్ జనరల్ డా॥ అంబేడ్కర్ (ఆస్తి కస్టోడియన్) సంరక్షణలో ఉన్నాయి. ఆయన పాఠకులు, ఆయన విధేయులైన అనుయాయులు, ఈ రచనలు చదవాలని ఎంతో ఆత్రుత పడుతున్నారు. డా॥ అంబేడ్కర్ అనుయాయులు కొంతమంది ఆ రచనలు వారి ఆధీనంలో లేకపోయినా ఆ రచనలను ముద్రించటానికి తమకు అనుమతి ఇవ్వవలసిందిగా కోర్టుకు కూడా వెళ్లారు. ఆ విధంగా ఈ రచనలు ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి. ఒక సమయంలో వీటిని నాశనం చేసేస్తారేమో, పోగొడతారేమో అని భయం కూడా వేసింది.

ఈ సంపుటం ఎందుకింత ప్రాముఖ్యత పొందిందనటానికి రెండో కారణం ఉన్నది. డా॥ అంబేడ్కర్ బహుముఖ ప్రజ్ఞావంతుడిగా పేరొందాడు. తత్వచింతన పైన ఈ పుటలలో ఆయన చేసిన వ్యాఖ్యానం, హిందూ మతాన్ని గురించిన చారిత్రక విశ్లేషణ, ఆయన ఆలోచనపైన కొత్త వెలుగును ప్రసరింప చేస్తాయి.

మూడో అంశం ఏమంటే హిందూ మతంపై డా॥ అంబేడ్కర్ విశ్లేషణ మేధాపరమైన కసరత్తుగా ఉద్దేశించినది కాక, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాత్రత అనే మానవ విలువలు ప్రాతిపదికగా హిందూ సమాజాన్ని పటిష్టం చెయ్యటానికి ఉద్దేశించిన ఒక నిర్దిష్టమైన మార్గం. ఈ విశ్లేషణ అంతిమంగా పతిత జాతుల ఉద్ధరణకు, ఆ జనావళిని ప్రధాన జన ప్రవాహంలోకి తీసుకు వెళ్లటానికి దారి తీస్తుంది.

ఈ రచనలను ప్రచురణ కోసం ఈ సంఘానికి అప్పగించిన విషయమై ఈ సందర్భంలో కొన్ని మాటలు చెప్పటం అప్రస్తుతం కాదు. డా॥ అంబేడ్కర్ తన జీవితకాలంలో చాలా పుస్తకాలు ప్రచురించాడు, అంతేకాదు, చాలా వాటి గురించి పథకాలు తయారు చేశాడు. తన ఆత్మకథను, మహాత్మా పూలే జీవితచరిత్రనూ, భారతసేనా చరిత్రనూ రాయాలనే ఉద్దేశాన్ని కూడా వ్యక్తం చేశాడు, కాని ఆ అంశాలపై పరిశోధన పత్రాలేమీ రాసిపెట్టిన దాఖలాలు లేవు.

1956లో ఆయన మరణానంతరం, ఆయన అముద్రిత రచనలతోపాటు అన్ని పత్రాలను ఢిల్లీ హైకోర్టు కస్టోడియన్ అధీనంలోకి తీసుకున్నారు. దరిమిలా, ఈ కాగితాలను మహారాష్ట్ర ప్రభుత్వ అడ్మినిస్ట్రేటర్ జనరల్‌కు బదిలీ చేశారు. అప్పటి నుంచీ డా॥ అంబేడ్కర్ అముద్రిత రచనల రాతప్రతులు ఉన్న పెట్టెలు ఇంకా అనేక ఇతర పత్రాలు అడ్మినిస్ట్రేటర్

జనరల్ అధీనంలో ఉన్నాయి.

నాగపూర్‌కు చెందిన అడ్వొకేట్ శ్రీ జె.బి. బాన్సోడ్ (J.b. Bansod) నాగపూర్‌లో ఉన్న బొంబాయి హైకోర్టు ధర్మాసనంలో మహారాష్ట్ర ప్రభుత్వం మీద ఒక దావా వేశాడు. ఆ తర్వాత దానిని బొంబాయి హైకోర్టుకు బదిలీ చేశారు. అర్జీదారుడు కోరినది చాలా చిన్న కోరిక, అదేమంటే డా॥ అంబేడ్కర్ అముద్రిత రచనలు జాతీయ ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి కాబట్టి వాటిని ముద్రించటానికి తనకైనా అనుమతి ఇవ్వాలని లేదా ప్రభుత్వమైనా వాటిని ప్రచురించాలనీ ఆయన కోరాడు. ఈ వ్యాజ్యం బొంబాయి హైకోర్టులో చాలా సంవత్సరాలు నిలిచిపోయింది.

ఈ సంఘం ఏర్పడిన తర్వాత, 1978లో శ్రీ వి. డబ్ల్యు. మూన్ ప్రత్యేక అధికారిగా నియామకం అయిన తర్వాత, డా॥ అంబేడ్కర్ అముద్రిత రచనలు సేకరించి చారిత్రక ప్రాముఖ్యం గల ఆధారాలుగా వాటిని ప్రచురించాలని భావించటం జరిగింది. శ్రీ మూన్ డా॥ అంబేడ్కర్ వారసులను, అడ్మినిస్ట్రేటర్ జనరల్‌ని స్వయంగా కలుసుకున్నారు. తమతో సహకరించవలసిందిగా శ్రీ బాన్సోడ్ అడ్వొకేట్‌ని కోరడం కూడా జరిగింది.

శ్రీమతి సవిత అంబేడ్కర్, శ్రీ ప్రకాష్ అంబేడ్కర్ వారి కుటుంబ సభ్యులు, అడ్వొకేట్ శ్రీ బాన్సోడ్, ఎంతో ఆసక్తి కనపరిచి, ముద్రణకై ప్రభుత్వ పథకంతో అంగీకరించి, డా॥ అంబేడ్కర్ రచనలు ఉన్న పెట్టెలు అన్నింటినీ ప్రభుత్వానికి అప్పగించటానికి అంగీకరించినందుకు వారిని తప్పక అభినందించాలి. చివరకు అయిదు ఇనుప పెట్టెలలో ఉన్న అంబేడ్కర్ రచనలు అన్నింటినీ ఈ కమిటీకి అప్పగించటానికి అడ్మినిస్ట్రేటర్ జనరల్ అంగీకరించారు. దాని ప్రకారం ఆ పెట్టెలు అన్నింటినీ ప్రభుత్వం తరపున శ్రీ వసంతమూన్ 18.9.1981నాడు స్వాధీనం చేసుకున్నారు. ఈ అయిదు ఇనుప పెట్టెలను మంత్రాలయం(సచివాలయం)లోని విద్యాశాఖలో అధికారుల గదిలో భద్రంగా ఉంచటమైంది.

డా॥ అంబేడ్కర్‌కు చాలా సన్నిహితుడిగా ఉండటం వల్ల శ్రీ ఎం.బి. చిట్నిస్ ఆయన చేతివ్రాత బాగా గుర్తు పట్టగలడు. ఆయన ఆ సమయంలో సంపాదకవర్గ అధ్యక్షుడు. వ్రాతప్రతులు అందినమీదట వాటినన్నిటినీ ఆయన ఒక పక్షం రోజులు పరిశీలించి ఏవి డా॥ అంబేడ్కర్ వ్రాతప్రతులో నిర్ధారణ చేశాడు. గుర్తుపట్టటం అనే ప్రాథమిక కార్యం అయిన మీదట, వ్రాతప్రతులు చదవటం, వ్యాఖ్యానించటం, దొరికిన వాటిలో వ్రాతప్రతులను సరి చూసుకోవటం, పాఠకులకు ఏ రూపంలో, ఏ క్రమంలో వీటిని అందించాలనే బృహత్కార్య క్రమం మిగిలిపోయింది.

1981లో ఈ పథకం ప్రత్యేకాధికారి శ్రీ మూన్ పనిలోకి దిగాడు. దేనికది చేర్చి పెట్టు కోవటం, వేరు పరచి పెట్టుకోవటం అనే పని చాలా సున్నితమైనదీ, కష్టమైనదీ, చాలా సమయం పట్టేదీ అయింది. డా॥ అంబేడ్కర్ పూర్తి చేయాలని భావించిన ఎన్నో రచనలు అసంపూర్తిగా మిగిలిపోయి, వ్రాతప్రతుల రూపంలో అక్కడ కొన్ని, ఇక్కడ కొన్నిగా, చెల్లా

చెదరయిపోయాయి. చెల్లాచెదరైన భాగాలను ఒకచోట చేర్చి ఒకదానితో ఒకటి పోల్చుకొని ఒక క్రమపద్ధతిలో చేర్చే పని చేపట్టవలసిన అవసరం ఏర్పడింది. ఎన్నో గంటలు ఈ వ్రాతప్రతులనే కాకుండా ఇదివరకే డా॥ అంబేద్కర్ రచనలుగా ప్రసిద్ధి చెందినవాటిని చదివి, ఎంపిక చేసి, తులనాత్మక పరిశీలన చేసిన మీదట మాత్రమే ఈ ప్రస్తుత ఎంపిక ప్రకారం, వ్రాతప్రతులను ఒక క్రమంలో పెట్టటానికి శ్రీ మూన్‌కు సాధ్యమైంది.

ఈ వ్రాతప్రతులు ఉన్న పరిస్థితి దృష్ట్యా ఈ పని మేధోపరంగా కష్టమైనది కావటమే కాకుండా, భౌతికంగా కూడా చాలా కష్టమయింది. ఈ వ్రాతప్రతులన్నీ 30 ఏళ్లపాటు పెట్టెలో పెట్టి మూసి ఉంచారు. వాటిని పురుగులు తినేశాయి. దాని ఫలితంగా ఈ కాగితాల నుంచి చాలా విపరీతమైన వాసన వచ్చేది. శ్రీ మూన్, ఆయన సహచరులకు కొన్ని చర్మవ్యాధులు సోకి చికిత్స చేయించుకోవలసి వచ్చింది.

రెండు సంవత్సరాలు తీవ్రంగా పరిశ్రమించిన మీదట, ఈ పత్రాలన్నీ ముద్రించవలసిన అవసరం ఉండటంవల్ల, వాటిని ఒక క్రమపద్ధతిలో అమర్చి సమర్పించవలసిన విషయమై శ్రీ మూన్ 17.9.83న సంపాదకవర్గానికి ఒక వివరణాత్మకమైన నివేదికను సమర్పించారు. ప్రస్తుత సంపుటి దాదాపు ఈ సూచనలకు అనుగుణంగానే ఉన్నది.

చాలా శ్రమతో కూడిన ఈ పనిలో స్టెనోగ్రాఫర్లుగా పనిచేసిన శ్రీ అనిల్‌కవాలే, శ్రీ ఎల్.ఆర్. మెహెర్, గుమాస్తాగా ఉన్న శ్రీ ఎస్.ఏ. ముంగేకర్‌లు అమూల్యమైన సహాయం అందించారు.

ప్రతిపాదించిన ఏర్పాట్లను డా॥ బాబాసాహెబ్ మూల రచనల ప్రచురణ సంపాదక మండలి 23-9-1986లో జరిగిన సమావేశంలో అంగీకరించిన తర్వాత, శ్రీ మూన్, వారి సిబ్బంది, ప్రచురణ పనిలోకి అంటే, ప్రూఫ్‌లు దిద్దటం, సూచిక తయారు చేయటంలాంటి పని లోకి దిగారు.

సంపాదక మండలి పరిశీలించిన పత్రాలలో అముద్రిత రచనలు 51 వరకు ఉన్నాయి. ('రిడిల్స్ ఇన్ హిందూయిజం' శీర్షికన ఉన్న 26తో కలిపి). వీటికి అదనంగా బొంబాయిలోని సిద్ధార్థ కాలేజిలో లైబ్రేరియన్‌గా పనిచేసిన శ్రీ ఎస్.ఎస్. రేగే, డా॥ అంబేద్కర్‌గారి అముద్రిత వ్యాసాలు 14 పంపించారు. క్రింద ఇచ్చిన జాబితాలో శ్రీ రేగే అందజేసిన వ్యాసాలను '*' గుర్తుతో చూపటం జరిగింది. ఈ వ్యాసాలు అన్నీ సంపూర్ణంగా లేవు. ఈ వ్యాసాలు అన్నింటిని మూడు సంపుటాలుగా కూర్చటం జరిగింది.

**మూడో సంపుటం**

1. ఫిలాసఫీ ఆఫ్ హిందూయిజం
2. ది హిందూ సోషల్ ఆర్డర్ : ఇట్స్ ఎసెన్షియల్ ప్రిన్స్‌పుల్స్
3. ది హిందూ సోషల్ ఆర్డర్ : ఇట్స్ యునీక్ ఫీచర్స్
4. సింబల్స్ ఆఫ్ హిందూయిజం

5. ఎన్షెంట్ ఇండియా ఆన్ ఎగ్జ్యుమేషన్
6. ది ఏన్షెంట్ రెజిమ్ - ది స్టేట్ ఆఫ్ ది ఆర్యన్ సొసైటి
7. ఎ సంకెన్ ప్రీస్ట్‌హుడ్
8. రిఫార్మర్స్ అండ్ దెయిర్ ఫేట్
9.* ది డిక్లైన్ అండ్ ఫాల్ ఆఫ్ బుద్ధిజం
10. ది లిటరేచర్ ఆఫ్ బ్రాహ్మణిజం
11.* ది ట్రయింఫ్ ఆఫ్ బ్రాహ్మణిజం
12. ది మోరల్స్ ఆఫ్ ది హౌస్ - మనుస్మృతి ఆర్ ది గాస్పెల్ ఆఫ్ కౌంటర్ రివల్యూషన్
13. ది ఫిలసాఫిక్ డిఫెన్స్ ఆఫ్ కౌంటర్ - రివల్యూషన్ : కృష్ణా అండ్ హిజ్ గీతా
14. ఎనలిటికల్ నోట్స్ ఆఫ్ విరాట్ పర్వ అండ్ ఉద్యోగపర్వ
15. బ్రాహ్మిన్స్ వెర్సెస్ క్షత్రియాస్
16. శూద్రాస్ అండ్ కౌంటర్ రివల్యూషన్
17. ది వుమన్ అండ్ కౌంటర్ రివల్యూషన్
18. బుద్ధా ఆర్ కార్ల్‌మార్క్స్
19. స్కీమ్స్ ఆఫ్ బుక్స్

**నాలుగో సంపుటం**

రిడిల్స్ ఇన్ హిందూయిజం (మొదటిదానితో కలిపి 27 అధ్యాయాలు శ్రీ ఎస్.ఎస్. రెగే పంపించినవి).

(ఈ సంపుటిని ముద్రించాలనుకున్నప్పుడు 24 రిడిల్స్, 8 అనుబంధాలతో కలిపి మొత్తం 32 వచ్చాయి).

**అయిదో సంపుటం**

1. అన్‌టచబుల్స్ ఆర్ చిల్డ్రన్ ఆఫ్ ఇండియాస్ ఘెట్టో
2.* ది హౌస్ ది హిందూస్ హేవ్ బిల్ట్
3.* ది రాక్ ఆన్ విచ్ ఇటీస్ బిల్ట్
4.* వై లాలెస్‌నెస్ ఈజ్ లాఫుల్?
5.* టచబుల్స్ వెర్సెస్ అన్‌టచబుల్స్
6.* హిందూయిజం అండ్ ది లెగసీ ఆఫ్ బ్రాహ్మణిజం
7.* పేరలల్ కేసెస్
8. సివిలైజేషన్ ఆర్ ఫెలొనీ
9. ది ఆరిజన్ ఆఫ్ అంటచబులిటీ
10. ది కర్స్ ఆఫ్ కేస్ట్
11.* ఫ్రమ్ మిలియన్స్ టు ఫ్రేక్షన్స్
12. ది రివోల్ట్ ఆఫ్ అన్‌టచబుల్స్

13. హెల్డ్ ఎట్ బే
14. ఎవే ఫ్రమ్ ది హిందూస్
15. ఎ వార్నింగ్ టు ది అన్‌టచబుల్స్
16. క్యాస్ట్ అండ్ కన్వర్షన్
17.* క్రిస్టియనైజింగ్ ది అన్‌టచబుల్స్
18.* ది కండిషన్ ఆఫ్ ది కన్వర్ట్
19.* అండర్ ది ప్రావిడెన్స్ ఆఫ్ మిస్టర్ గాంధీ
20.* గాంధీ అండ్ హిజ్ ఫాస్ట్

డా॥ అంబేద్కర్ అసలు రచనల ప్రచురణల విషయంలో రేగిన అన్ని అనుమానాలను తీర్చటంకోసం వ్రాతప్రతుల విషయంలో లేవనెత్తిన అన్ని ప్రశ్నల విషయం ఈ ఉపోద్ఘాతంలో ప్రస్తావించాలనుకున్నాం.

డా॥ అంబేద్కర్ (1) రిడిల్స్ ఆఫ్ హిందూయిజం, (2) ది బుద్ధా అండ్ కార్ల్ మార్క్స్ (3) రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్ అనే మూడు గ్రంథాలను పూర్తి చేశారని సాధారణంగా డా॥ అంబేద్కర్ అనుయాయులు విశ్వసిస్తున్నారు. "రిడిల్స్ ఆఫ్ హిందూయిజం" వ్రాతప్రతులు వేరే ఒక ఫైలులో కట్టకట్టి ఉన్నాయి. వీటిలో డా॥ అంబేద్కర్ చేతితో స్వయంగా చేసిన కొట్టివేతలు, చెరిపివేతలు, మార్పులు మొదలైనవి ఉన్నాయి. అదృష్టవశాత్తు ఈ పుస్తకానికి డా॥ అంబేద్కర్ రాసిన ఉపోద్ఘాతం కూడా లభ్యంగా ఉన్నది. అయినప్పటికీ, ఈ సంపుటం తుది ప్రతి లభ్యం కాలేదని చెప్పటానికి విచారిస్తున్నాం. ఈ పుస్తకానికి ఉపోద్ఘాతంలో డా॥ అంబేద్కర్ పెట్టిన "రిడిల్స్ ఇన్ హిందూయిజం" అనే పేరును కమిటీ అంగీకరించింది.

"ది బుద్ధా అండ్ కార్ల్‌మార్క్స్" పుస్తకం కూడా డా॥ అంబేద్కర్ పూర్తి చేసినట్టు చెపుతారు. కాని వ్రాతప్రతులలో ఆ పుస్తకం మాకు దొరకలేదు. అయితే "గౌతమ ది బుద్ధా అండ్ కార్ల్‌మార్క్స్" (ఏ క్రిటిక్ అండ్ కంపేరిటివ్ స్టడీ ఆఫ్ దెయిర్ సిస్టమ్స్ ఆఫ్ ఫిలాసఫీ) అనే పేరు మీద లూక్ (Leuke) రాసిన పుస్తకం (విజయ పబ్లిషింగ్ హౌస్, కొలంబో - ప్రచురణ సంవత్సరం పేర్కొనలేదు) టైపు ప్రతి ఒకటి అందులో ఉన్నది. అయితే "బుద్ధ ఆర్ కార్ల్ మార్క్స్" అనే పేరు మీద డా॥ అంబేద్కర్ రాసిన 34 పేజీల చిన్న వ్యాసం ఒకటి దొరికింది. దానిని మూడో సంపుటిలో చేర్చాం. "రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్" అనే పుస్తకాన్ని కూడా డా॥ అంబేద్కర్ పూర్తి చేశారనే విశ్వాసం ఉన్నది. కమిటీ వారికి అందిన పత్రాలలో ఈ గ్రంథానికి ఆయన తయారు చేసి ముద్రించుకున్న పథకం మాత్రం దొరికింది. ఒకేసారి అనేక అధ్యాయాలు రాయటం డా॥ అంబేద్కర్ మొదలుపెట్టి ఉంటారు. పెట్టెలలో చెల్లాచెదరయిన పుటలు చాలా దొరికాయి. వాటిని ఒకచోటికి చేర్చటం జరిగింది.

ఒక పుస్తకం రాయటానికి డాక్టర్ అంబేద్కర్ ఎంత గొప్ప మహత్తరమైన కృషి చేస్తారో పాఠకులకు తెలియజేయటానికి డా॥ అంబేద్కర్ అసలు పుస్తకం రాసే విధానం అంతా తెలియజేయాలనే కోరిక మాకు కలిగింది. ఆయనకు తనదంటూ ఒక క్రమశిక్షణ ఉండేది. గ్రంథ

రచనకు ఉపక్రమించే ముందు మొత్తం పుస్తకంలో ఏమేమి ఉండాలో, ఎలా ఉండాలో తయారు చేసుకొని ఉంచుకొనేవారు. ఆయనే సిద్ధం చేసుకున్నట్టి, అటువంటి పథకాలు సంపాదకమండలికి దొరికాయి. అవి : "ఇండియా అండ్ కమ్యూనిజం", "రిడిల్స్ ఇన్ హిందూయిజం", "కెన్ ఐ బి ఎ హిందూ?", "రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్", "వాట్ బ్రాహ్మిన్స్ హేవ్ డన్ టు అన్‌టచబుల్స్", "ఎస్సేస్ ఆన్ భగవద్గీత", "బుద్ధా అండ్ కార్ల్‌మార్క్స్" మొదలైనవి. కాని ఇందులో కొన్ని అసలు మొదలు పెట్టనే లేదు. మొదలు పెట్టినవి పూర్తి చేయనూ లేదు. ఒక ఉదాహరణ చెప్పటం చాలా ఆసక్తికరంగా ఉంటుంది. డా॥ అంబేడ్కర్ "ఇండియా అండ్ కమ్యూనిజం" అనే పుస్తకానికి మొత్తం వివరాలు, పథకం రూపొందించుకున్నారు. వివరాలు ఇలా ఉన్నాయి :

| | | |
|---|---|---|
| **మొదటి భాగం** | – | ది ప్రీ రిక్విజిట్స్ ఆఫ్ కమ్యూనిజం |
| అధ్యాయం 1 | – | ది బర్త్ ప్లేస్ ఆఫ్ కమ్యూనిజం |
| అధ్యాయం 2 | – | కమ్యూనిజం అండ్ డెమోక్రసీ |
| అధ్యాయం 3 | – | కమ్యూనిజం అండ్ సోషల్ ఆర్డర్ |
| **రెండో భాగం** | – | ఇండియా అండ్ ది ప్రీ రిక్విజిట్స్ ఆఫ్ కమ్యూనిజం |
| అధ్యాయం 4 | – | ది హిందూ సోషల్ ఆర్డర్ |
| అధ్యాయం 5 | – | ది బేసిస్ ఆఫ్ ది హిందూ సోషల్ ఆర్డర్ |
| అధ్యాయం 6 | – | ఇంపెడిమెంట్స్ టు కమ్యూనిజం ఎరైజింగ్ ఫ్రమ్ ది సోషల్ ఆర్డర్ |
| **మూడో భాగం** | – | వాట్ దెన్ షల్ ఉయ్ డు? |
| అధ్యాయం 1 | – | మార్క్స్ అండ్ ది యూరోపియన్ సోషల్ ఆర్డర్ |
| అధ్యాయం 2 | – | మను అండ్ ది హిందూ సోషల్ ఆర్డర్ |

ఈ పథకంలో నాలుగు, అయిదు అధ్యాయాలను మాత్రం అంటే "ది హిందూ సోషల్ ఆర్డర్", "ది బేసిస్ ఆఫ్ ది హిందూ సోషల్ ఆర్డర్" అనే రెండింటిని మాత్రం డా॥ అంబేడ్కర్ పూర్తి చేశారు. మూడో భాగంలో ఇంకో రెండు అంశాల గురించి రాయాలని ఆయనకు అనిపించినప్పుడు ఆ రెండు అంశాలను ఆయన స్వయంగా రాసి టైపు చేసిన పేజీలో చేర్చారు. టైపు చేసి చక్కగా కట్టిపెట్టిన ఫైలులో, "కెన్ ఐ బి ఎ హిందూ?" అనే శీర్షికతో ఆయన పెన్సిలుతో సంతకం చేసి పెట్టుకున్న ఒక పుట కనిపించింది.తర్వాత పుటలో రాసి ఉన్న విషయ క్రమపట్టిక ఇలా ఉన్నది.

ఉపోద్ఘాతం
సింబల్స్ ఆఫ్ హిందూయిజం
మొదటి భాగం – కులం

రెండో భాగం - కల్ట్ - వర్షిప్ ఆఫ్ డెయిటీస్
మూడో భాగం - సూపర్ మ్యాన్

మూడో పుటలో అంశాల ఉప శీర్షికలు ఇలా ఉన్నాయి :

1. సింబ రిప్రజంట్ ది సోల్ ఆఫ్ ఎ థింగ్
2. సింబ ఆఫ్ క్రిస్టియానిటీ
3. సింబ ఆఫ్ ఇస్లామ్
4. సింబ ఆఫ్ జైనిజం
5. సింబ ఆఫ్ బుద్ధిజం
6. సింబ ఆఫ్ హిందూయిజం
7. వాట్ ఆర్ ది సింబల్స్ ఆఫ్ హిందూయిజం ?

మూడు

1. కేస్ట్
2. కల్ట్
   1) రామా
   2) కృష్ణా
   3) శివ
   4) విష్ణు
   5) సర్వీస్ ఆఫ్ సూపర్‌మ్యాన్

పై విధంగా రూపొందించిన పథకంలో "సింబల్స్ ఆఫ్ హిందూయిజం" అధ్యాయం తప్ప మిగిలినవి అసంపూర్ణంగా మిగిలిపోయాయి.

'బహుశా) "రిడిల్స్ ఇన్ హిందూయిజం" అనే సంపుటి కోసం ఉద్దేశించిన "రిడిల్స్ ఆఫ్ రామా అండ్ కృష్ణా" అనే అధ్యాయం, సంపాదక వర్గానికి దొరికింది. మొదటి పథకంలో అనుకున్న 24 రిడిల్స్ (చిక్కుముడులు) తరచూ పథకం నిర్మాణంలో మారుతూ ఉండేవి. విషయానుక్రమణిక, అధ్యాయాలు, ఫైలు కూర్పు పొసిగేది కాదు. పుస్తకం విషయసూచికలో రాముడు కృష్ణుని మీది అధ్యాయం చోటు చేసుకోలేదు. అయినప్పటికీ రిడిల్స్ ఉన్న సంపుటిలో దీనిని మేము చేర్చుతున్నాం.

డా॥ అంబేడ్కర్ రచనలలో ఇంతవరకూ ప్రచురితం కాని వాటిని సక్రమమైన రీతిలో ముద్రించి సాధారణ జనావళికీ, ఆసక్తిగల పండితులకూ అందుబాటులోకి తెచ్చినపుడు, మేము అందుకై పడిన శ్రమ, వెచ్చించిన కాలమూ వృధాగా పోవనే విశ్వాసం మాకు ఉన్నది.

డా॥ అంబేడ్కర్ సంపూర్ణ రచనలను ముద్రించటానికి ప్రభుత్వానికి అనుమతి ఇచ్చినందుకు శ్రీమతి సవిత అంబేడ్కర్, శ్రీ ప్రకాష్ అంబేడ్కర్ గార్లకూ, వారి కుటుంబ

సభ్యులకూ మేము కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాం. అడ్మినిస్ట్రేటర్ జనరల్, డా॥ అంబేడ్కర్స్ ఎస్టేట్ కస్టోడియనూ అయిన శ్రీ వై.ఐ. దేశాయ్ ప్రభుత్వానికి వ్రాతప్రతులను అందజేసినందుకు అభినందనీయుడు. అలాగే కమిటీతో సహకరించినందుకు అడ్వొకేట్ శ్రీ జె.బి. లాన్సోడ్ కూడా అభినందనీయుడే. ఆరోగ్యం సరిగా లేకపోయినా సమయాన్ని శ్రమను వెచ్చించి సలహాలు ఇచ్చినందుకు కీర్తిశేషులు శ్రీ ఎం.బి. చిట్నిస్‌గారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

వ్రాతప్రతులు అన్నింటినీ ముద్రించటానికి నిర్ణయం తీసుకున్నందుకు మహారాష్ట్ర ముఖ్యమంత్రి, గౌరవనీయులు, శ్రీ శంకర్‌రావు చవాన్, విద్యాశాఖామంత్రి ప్రొఫెసర్ రామ్‌మెఘే, విద్యాశాఖ సహాయమంత్రి కుమారి చంద్రికా కేనియాలకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం. ఎంతో చొరవ తీసుకొని, సలహాలు అందిస్తూ కమిటీ సమస్యలను పరిష్కరించటంలో అమూల్యమైన ప్రయత్నాలు చేసిన కమిటీ ఉపాధ్యక్షులు ఎం.ఎల్.సి. శ్రీ ఆర్.ఎస్. గవాయ్‌కు ధన్యవాదాలు తెలియజేస్తున్నాం. మహారాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి శ్రీ మధుసూదన్ కొల్హాట్‌కర్‌కు వారి అమూల్యమైన సలహాలకు ధన్యవాదాలు. విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ ఆర్.ఎస్. జంభూలే, జాయింట్ డైరెక్టర్ శ్రీ ఎస్.ఏ. దేవ్‌కర్, అసిస్టెంట్ సెక్రటరీ శ్రీ జె.బి. కుల్‌కర్ణి, డిప్యూటీ డైరెక్టర్ శ్రీ ఎం.ఎం. అవాతే, సూపరింటెండెంట్ శ్రీ ఎం. మేష్రాం గార్లకు, ప్రచురణ కార్యక్రమంలో అత్యంత శ్రద్ధాసక్తులు కనపరిచిన విద్యాశాఖ ఉద్యోగులందరికీ ధన్యవాదాలు.

కమిటీ సభ్యులైన డా॥ పి.టి. బొరాలే, శ్రీ ఎస్.ఎస్. రెగే, డా॥ బి.డి. ఫాడ్కే, శ్రీ దయా పవార్‌లు ఎన్నోసార్లు సమావేశమై ఈ సంపుటం సంపాదకత్వంలో అమూల్యమైన సలహాలు అందించినందుకు ప్రత్యేకంగా పేర్కొనవలసి ఉన్నది. వారి సహాయానికి ప్రగాఢమైన అభినందనలు తెలియజేస్తున్నాం.

కమిటీ సభ్యులైన శ్రీ ఎస్.ఎస్. రెగే తన వద్ద ఎన్నో ఏళ్లుగా ఉండిపోయిన డా॥ అంబేడ్కర్ 14 వ్యాసాలను మాకు దయతో అందజేశారు. ఈ మూడు సంపుటాలలో కూర్చిన విషయాలకు ఆ వ్యాసాలు వన్నె తెచ్చాయి. వారి దయకు కమిటీ సభ్యులు ఎంతో రుణపడి ఉన్నారు.

ముద్రణ పనిని ఎంతో జాగ్రత్తతోనూ, చిత్తశుద్ధితోనూ నిర్వహించిన ముద్రణశాఖ డైరెక్టర్ శ్రీ జి.డి. ధోండ్, మేనేజర్లు శ్రీ పి.ఎస్. మోరే, శ్రీ పుర్కార్, డిప్యూటీ మేనేజర్ శ్రీ ఆర్.జె. మహాటేకర్, ఆపరేటర్ ఫిల్మ్ సెట్టర్ శ్రీ జె.ఎస్. నగ్వేకర్ గారలు, ప్రింటింగ్ అండ్ స్టేషనరీ శాఖ సిబ్బంది అందరూ అభినందనీయులు.

సంపాదకులు
డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్ సోర్స్
మెటీరియల్ పబ్లికేషన్ కమిటీ
మహారాష్ట్ర

బొంబాయి,
2 అక్టోబరు, 1987

అనువాదం : బొజ్జా తారకం

# హిందూమతంలో చిక్కుముడులు

ప్రజల మేల్కొలుపు కోసం వివరణ

డా॥ బి.ఆర్. అంబేడ్కర్

ఎం.ఏ., పిహెచ్.డి., డి.యస్‌సి., యల్‌యల్.డి., డి.లిట్., బారిస్టర్–ఎట్–లా

# విషయ సూచిక

## భాగం – 1

### మతపరమైనవి


| | | | |
|---|---|---|---|
| 1. | ఉపోద్ఘాతం | | ... 5 |
| 2. | చిక్కుముడి : 1 | తాను హిందువు ఎలా అయ్యాడో తెలుసుకోవడంలో ఉన్న కష్టం | ... 13 |
| 3. | చిక్కుముడి : 2 | వేదాలమూలం – బ్రాహ్మణుల సంజాయిషీ– డొంక తిరుగుడు కళాసాధన. | ... 17 |
| 4. | చిక్కుముడి : 3 | వేదాల మూలం గురించి ఇతర శాస్త్రాల ప్రామాణ్యాలు | ... 20 |
| 5. | చిక్కుముడి : 4 | వేదాలు అమోఘమైనవనీ ప్రశ్నించరానివనీ బ్రాహ్మణులు హఠాత్తుగా ఎందుకు ప్రకటించారు? | ... 27 |
| 6. | చిక్కుముడి : 5 | వేదాలను మనిషిగాని దైవంగాని రాయలేదని ప్రకటించేటంత దూరం బ్రాహ్మణులు ఎందుకు వెళ్ళారు ? | ... 31 |
| 7. | చిక్కుముడి : 6 | వేద విషయాలు – వాటిలో నైతిక ఆధ్యాత్మిక విలువలు ఏమైనా ఉన్నాయా? | ... 42 |
| 8. | చిక్కుముడి : 7 | మారిన వైఖరి – వేదాలు తమ శాస్త్రాల కంటె అధమాధమమైనవని బ్రాహ్మణులు ఎలా ప్రకటించారు? | ... 63 |
| 9. | చిక్కుముడి : 8 | ఉపనిషత్తులు వేదాలపై యుద్ధం ఎలా ప్రకటించాయి? | ... 73 |
| 10. | చిక్కుముడి : 9 | ఉపనిషత్తులు వేదాలకు విధేయంగా ఎలా మారాయి? | ... 79 |
| 11. | చిక్కుముడి : 10 | హిందూ దేవుళ్ళు ఒకరితో మరొకరు పోట్లాడుకొనేలా బ్రాహ్మణులు ఎందుకు చేశారు | ... 83 |
| 12. | చిక్కుముడి : 11 | బ్రాహ్మణులు హిందూ దేవుళ్ళకు ఉచ్ఛపతన దశలు ఎందుకు కల్పించారు ? | ... 94 |
| 13. | చిక్కుముడి : 12 | బ్రాహ్మణులు దేవుళ్ళను పీఠం దింపి దేవతలకు పట్టం ఎందుకు కట్టారు ? | ... 115 |

14. చిక్కుముడి : 13 అహింస చిక్కుముడి ... 12

15. చిక్కుముడి : 14 అహింస నుంచి మళ్ళీ హింసకు ... 13

16. చిక్కుముడి : 15 ఒక అహింసక దేవునికి రక్తపిపాసి అయిన దేవతనిచ్చి బ్రాహ్మణులు పెళ్ళి ఎందుకు చేశారు ? ... 13

17. అనుబంధం : 1. వేదాల చిక్కుముడి ... 14

18. అనుబంధం : 2. వేదాంతం చిక్కుముడి ... 17

19. అనుబంధం : 3. త్రిమూర్తి చిక్కుముడి ... 185

20. అనుబంధం : 4. స్మార్త ధర్మం ... 202

21. అనుబంధం : 5. వేదాల అమోఘత్వం ... 209


## భాగం – 2 సామాజికపరమైనవి

22. చిక్కుముడి : 16 చతుర్వర్ణాలు, వాటి మూలం బ్రాహ్మణులు కచ్చితంగా ఎరుగుదురా? ... 215

23. చిక్కుముడి : 17 చతురాశ్రమాలు – అవి ఎందుకు, ఎలా వచ్చాయి? ... 232

24. చిక్కుముడి : 18 మనువు ఉన్మాదం లేదా మిశ్రమ కులాల మూలంపై బ్రాహ్మణుల సంజాయిషీ ... 242

25. చిక్కుముడి : 19 పితృస్వామికం నుంచి మాతృస్వామికానికి మార్పు– దీని నుంచి బ్రాహ్మణులు ఏమి సాధించాలనుకున్నారు? ... 256

26. చిక్కుముడి : 20 కలివర్జ్యం – పాపాన్ని పాపం అని అనకుండా నిలుపుదల చేసే బ్రాహ్మణ కళ ... 264

27. అనుబందం : 1. వర్ణాశ్రమ ధర్మ చిక్కుముడి ... 268

28. అనుబంధం : 2. నిర్బంధ వివాహం ... 296


## భాగం – 3 రాజకీయపరమైనవి

29. చిక్కుముడి : 21 మన్వంతర సిద్ధాంతం ... 309

30. చిక్కుముడి : 22 బ్రహ్మ – ధర్మం కాదు. మరి బ్రహ్మ ఇక దేనికోసం? ... 316

31. చిక్కుముడి : 23 కలియుగం, బ్రాహ్మణులు దీనిని ఎందుకు అనంతంగా చేశారు? ... 323

32. చిక్కుముడి : 24 కలియుగం ... 344

33. అనుబంధం : 1. రామకృష్ణుల చిక్కుముడి ... 363

# ఉపోద్ఘాతం

బ్రాహ్మణ మత సిద్ధాంతాలుగా పరిగణనలో ఉన్న విశ్వాసాలను వ్యాఖ్యానించి బహిర్గతం చేసే గ్రంథం ఇది. బ్రాహ్మణులు తమను ఎలాంటి రొంపిలో ఉంచారో తెలుసుకోవలసిన హిందూజన సామాన్యాన్ని జాగృతులను చేసి వారిని హేతుబద్ధమైన ఆలోచనా మార్గంలోకి నడిపించడం ఈ గ్రంథం లక్ష్యం.

హిందూ నాగరికత సనాతనమైనది, నిత్యమైనది, మార్పులేనిది – అనే అభిప్రాయాన్ని ప్రచారం చేశారు బ్రాహ్మణులు. హిందూ నాగరికత స్థిరమైనది అని చెప్తూ చాలామంది ఐరోపా పండితులు కూడా ఆ అభిప్రాయాన్ని బలపరిచారు. ఈ అభిప్రాయం వాస్తవాలకు అనుగుణంగా లేదనీ, హిందూ సమాజం కాలగతిలో మార్పులు చెందుతూ వచ్చిందనీ, తరచుగా ఆ మార్పులు తీవ్రమైన తరహాలో ఉండేవనీ ఈ గ్రంథం ద్వారా రుజువు చెయ్యడానికి పూనుకున్నాను. ఈ సందర్భంలో "హింస నుంచి అహింసకు", (అహింస చిక్కుముడి) "అహింస నుంచి మళ్ళీ హింసకు" అనే చిక్కుముడులను పోల్చి చూడండి. హిందూమతం సనాతనమైనది కాదని ప్రజలు తెలుసుకొనేలా చేయడమే నా కోరిక.

ఈ గ్రంథంరెండో ఉద్దేశం ఏమిటంటే హిందూ సమాజంలోని సామాన్యజనం దృష్టిని బ్రాహ్మణుల యుక్తుల వైపు మరలించి, బ్రాహ్మణులు వారిని ఏ విధంగా మోసగించారో తెలియజేయడం.

బ్రాహ్మణులు ఎలా మారుతూ, మార్పులు చేస్తూ, దారి చేసుకుంటూ పోయారో గమనించాలి. ఒకప్పుడు వారు వైదిక దేవతలను కొలిచేవారు. తరువాత ఆ దేవతలను వదిలేసి అవైదిక దేవతలను కొలవడం మొదలుపెట్టారు. వేదాలలో పేర్కొన్న ఆ దేవతలంతా ఏరి? ఇంద్రుడెక్కడ – వరుణుడెక్కడ – బ్రహ్మ ఎక్కడ – మిత్రుడెక్కడ – అని వారిని అడగవచ్చు. ఇప్పుడా దేవతలంతా వీరి దృష్టి నుంచి అదృశ్యులయ్యారు. ఎందుకంటే ఇప్పుడా ఇంద్రాది దేవతలను కొలవడం లాభదాయకంగా లేదు కనుక! బ్రాహ్మణులు వేదదేవతలను ఆరాధించడం వదిలి వెయ్యడమే కాదు, మహమ్మదీయ పీర్లను సేవించడం మొదలుపెట్టిన సందర్భాలూ ఉన్నాయి. ఈ సందర్భంలో ఒక స్పష్టమైన ఉదాహరణ చెబుతాను – బొంబాయి సమీపంలోని కల్యాణ్ దగ్గర గుట్టపైన "బావామలాంగ్షా" అనబడే పీర్ (ముస్లిం మతగురువు)

---

**ఇది ఏడు పుటల టైపు ప్రతి. దీనిలో డా॥ అంబేడ్కర్ చేసిన దిద్దుబాట్లున్నాయి. ముగింపు పేరాలు అంబేడ్కర్ చేతిరాతలో ఉన్నాయి. –సంకలనకర్త**

సమాధి ఉంది. అది చాలా ప్రఖ్యాతి గలది. ప్రతి సంవత్సరం అక్కడ ఉర్సు (జాతర) జరుగుతుంది. ఆ సందర్భంలో కానుకలు ఇవ్వడం..కూడా ఉంటుంది. ఆ దర్గాలో పురోహితుడుగా వ్యవహరించే వ్యక్తి బ్రాహ్మణుడు. ముస్లింల దుస్తులు ధరించి అక్కడే కూచుని దక్షిణలు అందుకుంటుంటాడు. ఇంతా డబ్బు కోసమే చేస్తున్నాడు! మతమో గితమో – బ్రాహ్మణునికి కావలసింది దక్షిణ! నిజానికి, బ్రాహ్మణులు మతాన్ని వ్యాపారంగా, వాణిజ్య విషయంగా మార్చేశారు. బ్రాహ్మణుల ఈ విశ్వాసరాహిత్యాన్ని యూదులకు వాళ్ళ దేవుని పట్ల గల విశ్వాసంతో పోల్చి చూడండి.

"నెబూచెడ్నిజార్" అనే రాజు యూదులను జయించి, వారిని వారి మతాన్ని వదిలేసి తన మతాన్ని స్వీకరించవలసిందిగా బలవంతం చేసినప్పుడు యూదులు ఒప్పుకోలేదు.[1] నెబూచెడ్నిజార్ అరవై మూరల ఎత్తు, ఆరు మూరల వెడల్పుగల బంగారు విగ్రహాన్ని తయారు చేయించి, బాబిలోన్ రాష్ట్రంలోని "డూరా" మైదానంలో దాన్ని ప్రతిష్ఠింప చేశాడు. రాజైన నెబూచెడ్నిజార్ ప్రతిష్టించిన విగ్రహావిష్కరణ ఉత్సవానికి అందరు రాజకుమారులూ, గవర్నర్లూ, సైనికాధికారులూ, న్యాయాధీశులూ, కోశాధిపతులూ, సలహాదార్లూ, మంత్రులూ (షరీఫ్‌లూ), పాలకులూ రావాలని ఆజ్ఞాపించాడు. రాజాజ్ఞ ప్రకారం నెబూచడ్నిజార్ రాజు ప్రతిష్ఠించిన విగ్రహావిష్కరణ ఉత్సవానికి రాజకుమారులు, గవర్నర్లూ, సైనికాధికారులూ, కోశాధిపతులూ, సలహాదార్లు, షరీఫ్‌లు అన్ని రాష్ట్రాల పాలకులూ వచ్చి ఆయన ప్రతిష్ఠించిన విగ్రహానికి ఎదురుగా నిలబడ్డారు. అప్పుడు ఈ విధంగా బిగ్గరగా చాటింపు వేశారు. "రాజాజ్ఞ ఇది – వివిధ భాషలకు, జాతులకు చెందిన ఓ ప్రజలారా! వినండి. కార్నెట్, ఫ్లూట్ (పిల్లంగ్రోవి), హార్ప్ (తీగవాద్యం), Sackbut (స్వరమండలం), Psaltery (మృదంగం), Dulcimer (సితార) మొదలైన రకరకాల సంగీత వాయిద్యాల ధ్వనులు మీ చెవులబడగానే మీరంతా మన రాజైన నెబూచడ్నిజార్ ప్రతిష్ఠించిన ఈ స్వర్ణ విగ్రహానికి సాగిలబడి మొక్కాలి. ఎవరైతే ఆ విధంగా సాగిలబడకుండా, ప్రార్థించకుండా ఉంటారో వారిని ఆ క్షణమే మండుతున్న కొలిమిలోకి తోసివేయడం జరుగుతుంది" అని. అక్కడ చేరిన అందరూ ఆ విధంగానే నిర్ణీత సమయంలో కార్నెట్, ఫ్లూట్, హార్ప్, సాక్‌బట్, సాల్టెరీ, డల్సిమర్ మొదలైన సంగీత వాద్యాల నాదాలు వినిపించగానే ఒక్కసారిగా రాజు నెబూచెడ్నిజార్ ప్రతిష్ఠించిన స్వర్ణ విగ్రహానికి మోకరిల్లి పూజించారు. ఆ సమయంలో చాల్డీన్‌వాసి ఒకరు దగ్గరగా వచ్చి యూదులను నిందించాడు.

వారు తమలో తాము మాట్లాడుకొని రాజు నెబూచెడ్నిజార్‌కు ఇలా నివేదించారు : "ఓ రాజా! దీర్ఘాయుష్మాన్ భవ! ఓ రాజా! నీవొక ఆజ్ఞ జారీ చేశావు. కార్నెట్, ఫ్లూట్, హార్ప్ వంటి అన్ని వాద్యాల సంగీతమూ చెవులబడగానే, అందరూ స్వర్ణ విగ్రహానికి మోకరిల్లి ప్రార్థించాలి అని. ఆ విధంగా మోకరిల్లి ప్రార్థించకుండా వున్నవారిని భీకరంగా మండుతున్న ఈ కొలిమిలోకి తోసివేస్తానని కూడా ఆజ్ఞాపించావు. అయితే కొందరు యూదులు బాబిలోనియా

1. What follows is from Damet. అధ్యాయం 3 (Old Testament)

రాష్ట్రానికి సంబంధించిన విషయాలు చూడడానికి నీవు నియమించిన షాద్రాక్, మెషాక్, అబెద్నిగో అనబడేవారు, నీ ఆజ్ఞను లెక్క చేయలేదు. వారు నీ దేవతను పూజించలేదు. మీరు ప్రతిష్ఠించిన స్వర్ణ విగ్రహానికి మొక్కలేదు" అని.

ఆ పలుకులు చెవి సోకగానే, నెబూచెడ్నిజార్ ఆగ్రహంతో మండిపోయాడు. షాద్రాక్‌నూ, మెషాక్‌నూ, అబెద్నిగోనూ పట్టుకొని రమ్మని ఆజ్ఞాపించాడు. వెంటనే భటులు వారిని తెచ్చి రాజు ఎదుట నిలబెట్టారు. నెబూచెడ్నిజార్ వారితో ఇలా అన్నాడు :

"ఓ షాద్రాక్, మెషాక్, అబెద్నిగోలారా! ఇది నిజమా? మీరు మా దేవతను కొలవలేదా? నేను ప్రతిష్ఠించిన స్వర్ణ విగ్రహానికి మొక్కలేదా? ఇప్పుడు, మీరు నా సమక్షంలో కార్నెట్, ఫ్లూట్, సాక్బట్, సాల్టెరీ, డల్సిమర్ మొదలైన సంగీత వాద్యాల నాదాలు వినిపించగానే నేను ప్రతిష్ఠించిన స్వర్ణ విగ్రహానికి మోకరిల్లి ప్రార్థించాలి. ఆ విధంగా ప్రార్థించకపోతే మిమ్మల్ని భయంకరమైన మంటల్లోకి తోసి వేయిస్తాను. మిమ్మల్ని నా బారి నుండి తప్పించగల దేవతలెవరో చూస్తాను." అప్పుడు షాద్రక్, మెషాక్, అబెద్నిగో జవాబుగా రాజుతో ఇలా అన్నారు. "నెబూచెడ్నిజార్ రాజా! ఈ విషయంలో మేము నీకు జవాబు చెప్పాలనుకోవటం లేదు. అలాగే జరిగితే మేము కొలిచే మా దేవుడు ఆ భీకరమైన మంటల నుండి మమ్మల్ని రక్షిస్తాడు. అతడే మీ బారి నుండి మమ్మల్ని తప్పిస్తాడు. ఏది ఏమైనప్పటికీ, ఓ రాజా! మేము మీ దేవతలకు గానీ, మీరు ప్రతిష్ఠించిన ఈ స్వర్ణ విగ్రహానికి గానీ మోకరిల్లము."

అప్పుడు నెబూచెడ్నిజార్ రాజు ఆగ్రహంతో కంపించిపోయాడు. షాద్రక్, మెషాక్, ఆబెద్నిగోల పట్ల మరింత క్రుద్ధుడై ఇటువైపు చూసి, మామూలు కంటే ఏడురెట్లు అధికంగా కొలిమిలో మంటలు పెట్టవలసిందిగా భటులకు ఆజ్ఞాపించాడు. తన సైన్యంలో అధిక బలశాలులైన మహావీరులను పిలిచి షాద్రక్, మెషాక్, అబెద్నిగోలను బంధించి ఆ భీకర జ్వాలల్లోకి తోసివెయ్యవలసిందిగా ఆజ్ఞాపించాడు. వారు వెంటనే ఆ ముగ్గురినీ వారి కోటు, మేజోళ్ళు, టోపీ తదితర దుస్తులతోపాటు కట్టివేసి, ఆ భయంకరమైన మంటల్లోకి తోసివేశారు. రాజాజ్ఞ అత్యవసరంగా అమలు జరగవలసి ఉండటంవల్లనూ, మంటలు మితిమీరి భీకరంగా ప్రజ్వరిల్లుతూ ఉన్నందువల్లనూ షాద్రక్, మెషాక్, ఆబెద్నిగోలను పట్టుకొని విసిరిన వారు కూడా ఆ అగ్నికీలల్లో చిక్కుకొని కాలిపోయారు. ఇక ఈ ముగ్గురు మనుష్యులు షాద్రక్, మెషాక్, ఆబెద్నిగోలు కట్టగా ఆ మంటల మధ్యలో పడి కాలిపోయారు."

ఇండియాలోని బ్రాహ్మణులు తమ దేవతల పట్ల అలాంటి విడదీయరానటువంటి, దృఢమైన భక్తినీ, విశ్వాసాన్నీ ప్రదర్శించగలరా?

బకిల్ (Buckle) మహాశయుడు తన "హిస్టరీ ఆఫ్ సివిలిజేషన్" అనే గ్రంథంలో ఈ కింది భావాన్ని వ్యక్తపరిచాడు.

"సందేహం కలిగితే తప్ప పురోగతి అన్నది సాధ్యం కాదని తేటపడుతోంది. ఎందుకంటే, మానవ నాగరికత పురోగమనం మానవ మేధా సంపత్తి వల్ల సాధించిన ఫలితాలపైనా ఆ ఫలితాలు ఎంతవరకూ వ్యాప్తి పొందాయన్న విషయం పైనా పూర్తిగా ఆధారపడి ఉంటుందని మనం స్పష్టంగా తెలుసుకున్నాం గనుక. అయితే, కొందరు – తమకు ఉన్న జ్ఞానంతోనే సంతృప్తి పడి ఆ జ్ఞానాన్ని వృద్ధి పొందించుకొనే ప్రయత్నమే చెయ్యరు. తమ అభిప్రాయాలే నిర్దుష్టమైనవని పూర్తిగా నమ్మిన మానవులు – ఏ మూల కారణాల నుంచి ఆ అభిప్రాయాలు స్థిరపడ్డాయో వాటిని తెలుసుకోడానికైనా ప్రయత్నం చెయ్యరు. తమ పూర్వుల నుంచి సంక్రమించిన భావాలకు, విరుద్ధమైన భావాలు ఎదురైనపుడు వారు ఆశ్చర్యపడతారు. అంతేకాదు, భయభ్రాంతులై సంచలించి పోతారు కూడా. ఆ స్థితిలో తమ నిశ్చితాభిప్రాయాలకు అనుగుణంగా లేని ఎటువంటి కొత్త సత్యాలనైనా సరే స్వీకరించటం వారికి అసాధ్యం అవుతుంది.

ఈ లెక్క ప్రకారం, సమాజ పురోగతికి, అడుగడుగునా సరికొత్త జ్ఞాన సముపార్జన అనేది ముఖ్యమైన ప్రాతిపదిక అవుతుందన్న విషయం వాస్తవమే అయినా, ఆ సముపార్జన వెనుక కుతూహలం ఉండాలి. జ్ఞాన సముపార్జనకు పరిశీలనాప్రియత్వం ప్రాతిపదిక. అంటే సందేహోల్లాసం (ఉత్సుకత) ఉండాలన్నమాట. ఎందుకంటే సందేహం లేకపోతే విచారణకు ఆస్కారం ఉండదు. ప్రశ్న లేకపోతే జ్ఞానమే లేదు. జ్ఞానం అనేది మనకు మనం కోరినా, కోరకపోయినా విధిగా వచ్చే స్తబ్దమైనదీ, నిష్క్రియాత్మకమైనదీ కాదు. మనం దాన్ని పొందాలంటే దాన్ని స్వాధీనం చేసుకోవాలి. ఎంతో శ్రమపడితేనూ, ఎంతో త్యాగం చేస్తేనూ గానీ అది లభించదు.

సాధారణ విషయ పరిజ్ఞానంతో తృప్తిపడే మనుషులు ఆ విధంగా ఊరకనే శ్రమిస్తారనీ, త్యాగం చేస్తారనీ అనుకోవడం అర్థరహితం. అంధకారాన్ని అనుభవించని వారు, వెలుగుకోసం చూడరు. ఏ విషయం మీదనైనా మనం ఒక నిర్ణయానికి చేరుకున్నాక, ఇక ఆ విషయం గురించి పరిశోధించము, ఎందుకంటే, ఆ విషయం మీద ఇంకా ఎక్కువ విచారణ చేయడం ఒక్కోసారి అనవసరమూ, అపాయకరమూ కూడా కావచ్చు. ఒక విషయంపై దర్యాప్తుకు ఉపక్రమించడానికి ముందే సందేహం ఏర్పడాలి. కాబట్టి అన్ని సందర్భాల్లోనూ సందేహం అనేది సాధనకు మూలం అనీ, ప్రగతికి అవసరమైన పూర్వకార్యం అనీ తేలుతున్నది."

ఇప్పుడు బ్రాహ్మణుల విషయానికి వద్దాం. వారు వేదాలు ప్రశ్నాతీతాలు అన్న ఒక తుంటరి సిద్ధాంతాన్ని సృష్టించి, ప్రచారం చేసి జన సామాన్యంలో సందేహాలకు గానీ, ప్రశ్నలకు గానీ తావు లేకుండా చేశారు. ఈ సిద్ధాంతం వల్ల హిందువుల్లో మేధోజ్ఞానం పెరగకుండా ఆగిపోయింది. హిందూ నాగరికతా సంస్కృతులు కుళ్ళు కంపుకొట్టే మురికి గుంటలైనాయి.

ఆ విషయం గుర్తించి ఈ తుంటరి సిద్ధాంతాన్ని కూకటి వేళ్ళతో సహా పెల్లగించి వేయాలి. ఇండియా పురోగమించాలంటే ఇది తప్పదు. వేదాలు శుద్ధ పనికిమాలిన గ్రంథాలు. అవి ప్రశ్నించడానికి వీలుకానివనీ, పవిత్రమైనవనీ, అపౌరుషేయాలనీ, నిత్యమైనవనీ బ్రాహ్మణులు ఎందుకు కల్పించారంటే ఆ తర్వాత వాటిలో చేర్చబడ్డ 'పురుష సూక్తం' అనేదాని వల్ల అవి (వేదాలు) వారిని భూసురులను చేశాయి గనక!

ఈ పనికిమాలిన వేదాల్లో ఉన్నదేమిటి? పవిత్రతా లేదు; ప్రశ్నాతీతత్వమూ లేదు. తమ శత్రువుల నాశనం కొరకూ, వారి ఆస్తులను దోచుకొని వాటిని తమ అనుయాయులకు పంచుకోవడం కోసమూ కొండ దేవతలను ప్రార్థించటం తప్ప మరేమీ లేని ఆ వేదాలను ప్రశ్నించే ధైర్యం ఎవ్వరికీ లేకపోయింది. బ్రాహ్మణులు ప్రచారం చేసి అందరి మెదళ్ళలోకీ చొప్పించిన ఈ అర్థరహిత భావాల పట్టు* నుంచి ప్రతి హిందువూ విముక్తి పొందవలసిన సమయం ఆసన్నమైంది. ఈ విముక్తి లేకపోతే హిందూ దేశానికి భవిష్యత్తు ఉండదు. ఇది ఎంత దుస్సాధ్యమైన కార్యమో తెలిసే, నేనీ పనికి* (విముక్తికి) పూనుకున్నాను. దీనివల్ల కలిగే పరిణామాలకు నేను భయపడటం లేదు. (ఈ విధంగా) జన సామాన్యాన్ని ఉత్తేజపరచటంలో కృతకృత్యుణ్ణి కాగలిగితే సంతోషిస్తాను.

– బి.ఆర్. అంబేడ్కర్

అనువాదం : డాక్టర్ అంతటి నరసింహం

---

* డాక్టర్ అంబేడ్కర్ చేతిరాతలో ఉన్న పేరాలలోని రెండు పదాలు అస్పష్టంగా ఉన్నందున అర్థ సమన్వయం దృష్ట్యా సంకలనకర్త పూరించారు.

చిక్కుముడి : 1

# తాను హిందువు ఎలా అయ్యాడో తెలుసుకోవడంలో ఉన్న కష్టం

ఇండియా అనేక మతాల, సమాజాల కూడలి. ఇందులో పార్శీలున్నారు, క్రైస్తవులున్నారు, ముస్లిములున్నారు, హిందువులూ ఉన్నారు. ఈ సమాజాల ప్రాతిపదిక జాతి పరమైనది కాదు, మతపరమైనది కావచ్చు. ఇదంతా బాహ్య దృక్పథమే. పార్శీ పార్శీగా ఎందుకున్నాడు, క్రైస్తవుడు క్రైస్తవుడుగానే ఎందుకున్నాడు, ముస్లిం ముస్లిముగా, హిందువు హిందువుగానే ఎందుకున్నారు అనేది తెలుసుకోవటం ఆసక్తికరంగా ఉంటుంది.

క్రైస్తవులూ, ముస్లిములూ, పార్శీలు – వీరిని గురించిన విషయం సాఫీగానే ఉన్నది. 'నీవు పార్శీవని ఎందుకు అనుకుంటున్నావు' అని, ఒక పార్శీని అడగండి. ఆ ప్రశ్నకు సమాధానం చెప్పటం అతనికి కష్టం కాదు. 'నేను 'జొరాష్టర్' అనుయాయిణ్ణి గనుక నేను పార్శీని', అని అతడు వెంటనే జవాబు చెబుతాడు. అదే విధమైన ప్రశ్న క్రైస్తవుణ్ణి అడగండి. ఆ ప్రశ్నకు సమాధానం చెప్పటం అతనికీ ఏమంత కష్టం కాదు. "నేను క్రీస్తును నమ్ముతాను గనుక నేను క్రైస్తవుణ్ణి" అని అతడు జవాబు చెబుతాడు. అదే ప్రశ్న ఒక ముస్లిమునడగండి. సమాధానం చెప్పటానికి అతడు ఏ మాత్రం సందేహించడు. "నేను ఇస్లామును విశ్వసిస్తాను గనుక నేను ముస్లిమ్‌ను" అని అతడు జవాబు చెబుతాడు. ఇప్పుడు అదే ప్రశ్న హిందువుకు వెయ్యండి! అతడు సమాధానం చెప్పటానికి తికమక పడతాడనడంలో ఏమాత్రం సందేహం లేదు. జవాబు ఏం చెప్పాలో అతనికి వెంటనే తోచదు. "హిందువులంతా కొలిచే దేవుణ్ణి నేను కొలుస్తాను కాబట్టి నేను హిందువును", అని అతడు ఒకవేళ చెప్పినా, అది నిజమైన జవాబు కాదు. ఎందుకంటే హిందువులందరూ ఒకే దేవుణ్ణి కొలవరు కాబట్టి. హిందువులలో కొందరు

ఏక దేవతారాధకులు. కొందరు బహు దేవతారాధకులు. మరికొందరు సర్వదేవతారాధకులు. ఏక దేవతారాధకులు అని చెప్పబడే హిందువులు కూడా అందరూ ఒకే దేవుణ్ణి కొలవరు. కొందరు విష్ణువును కొలుస్తారు. కొందరు శివుణ్ణి, కొందరు రాముణ్ణి, కొందరు కృష్ణుణ్ణి కొలుస్తారు. కొందరు పురుషదైవతాలను కొలవరు. స్త్రీ దేవతలను కొలుస్తారు. వారు కూడా ఒకే స్త్రీ దేవతను కొలవరు. రకరకాల స్త్రీ దేవతలను కొలుస్తారు. కొందరు కాళికాదేవిని పూజిస్తారు. కొందరు పార్వతిని పూజిస్తారు. మరికొందరు లక్ష్మిని పూజిస్తారు. ఇక బహు దేవతారాధకుల విషయానికి వస్తే, వీళ్ళు అందరు దేవుళ్లనూ పూజిస్తారు. విష్ణువునూ పూజిస్తారు, శివుణ్ణి పూజిస్తారు. అలాగే రాముణ్ణి, కృష్ణుణ్ణి, కాళినీ, పార్వతినీ, లక్ష్మినీ పూజిస్తారు.

శివునికి పవిత్రమైన దినం కాబట్టి హిందువు, శివరాత్రి నాడు ఉపవాసం ఉంటాడు. విష్ణువుకు పవిత్రమైనది కాబట్టి అతడు ఏకాదశినాడు కూడా ఉపవాసం ఉంటాడు. శివుడికి పవిత్రమైనది కాబట్టి అతడు బిల్వ వృక్షాన్ని ప్రతిష్ఠాపిస్తాడు. విష్ణువుకు ప్రీతికరం కాబట్టి తులసి మొక్కనూ నాటుతాడు. హిందువులలోని ఈ బహుదేవతారాధకులు ఒక్క హిందూ దేవతల ఆరాధనతోనే సరిపుచ్చుకోరు. ముస్లిం పీరును గానీ క్రైస్తవ దేవతలను గానీ కొలవడానికి ఏ హిందువూ వెనకాడడు.

వేలాది హిందువులు ముస్లిం పీర్ దగ్గరకు వెళ్ళి కానుకలు సమర్పిస్తారు. వాస్తవానికి కొన్నిచోట్లలో ముస్లిం పీర్‌కు వంశపారంపర్యంగా పౌరోహిత్యం చేస్తూ (ముస్లిం) పీర్ దుస్తులు ధరిస్తున్న బ్రాహ్మణులున్నారు. బొంబాయి దగ్గర్లో వున్న మాంత్‌మౌళి క్రైస్తవ దేవతను పూజించడానికి వేలాది హిందువులు వెళ్తుంటారు.

హిందువులు క్రైస్తవ దేవతలనుగానీ, ముస్లిం దేవతలనుగానీ కొలవడమన్నది, ఆయా ప్రత్యేక సందర్భాల్లోనే. అయితే ఎల్లప్పుడూ మతపరమైన భక్తిని ప్రదర్శించే సందర్భాలు కూడా ఉన్నాయి. హిందువులనబడే చాలామంది మత విధానాలలో మహమ్మదీయ అంశ గాఢంగా ఉండటం కనిపిస్తుంది. ఇలాంటి వారిలో పంచ్‌పేరియా (పద్ధతి) వారిని చెప్పుకోవచ్చు. వీరిది వింత విధానం. వీరు ఇదమిత్థమైన నామరూపాలు లేని అయిదుగురు మహమ్మదీయ గురువులను పూజిస్తారు. కోడిపుంజులను బలిగా సమర్పిస్తారు. ఈ పూజలకోసం వీరు ఒక మహమ్మదీయ దఫలీ ఫకీర్‌ను పూజారిగా నియమించుకుంటారు. ఇండియాలోని చాలామంది హిందువులు పంజాబులోని సాఖీసర్వర్ వంటి మహమ్మదీయ పవిత్ర స్థలాలకు యాత్రలు సాగిస్తూ ఉంటారు. ముఖ్యంగా ముత్రా, ఎట్టా, మైన్‌పురి జిల్లాలకు సంబంధించిన వివిధ కులాల హిందువులు మతాంతరీకరణ పొందగా ఏర్పడినవారే మల్కాణులు, అని బ్లంట్ మహాశయుడు అన్నాడు. ఈ మల్కాణులు రాజపుత్ర, జాట్, బనియాల సంతతికి చెందినవారు. వీరు తమను మహమ్మదీయులుగా చెప్పుకోవటానికి ఇష్టపడరు. సాధారణంగా అసలు కులాల పేర్లే చెబుతారు గాని మల్కాణులమని చాలా అరుదుగా చెప్పుకుంటారు. వారి పేర్లు హిందూ పేర్లే, పూజలు హిందూ ఆలయాల్లోనే ఎక్కువగా చేస్తుంటారు. ఒకరికొకరికి నమస్కారం చెప్పుకునే

టప్పుడు 'రాంరాం' అనే అంటుంటారు. తమ కులాల్లోనే వివాహాలు జరుపుకుంటారు. కాకపోతే మసీదుకు తరచుగా వెళ్తుంటారు. 'సుంతీ' చేసుకొనే సంప్రదాయం పాటిస్తారు. శవాలను ముస్లిం పద్ధతిలోనే ఖననం చేస్తారు. ప్రత్యేకంగా మరీ ముఖ్యమైన మిత్రులయితేనే ఇతర మహమ్మదీయులతో కలిసి సహపంక్తి భోజనాలు చేస్తారు.

గుజరాత్‌లో కూడా ఇలాంటి తెగలు చాలా వున్నాయి. అందులో మాటియా కున్బీలు ఒక తెగ. వీరు ముఖ్యమైన శుభాశుభ కార్యాలకు బ్రాహ్మణ పురోహితులనే పిలుస్తారు కాని, పిరానా గురువైన ఇమాంషా సంప్రదాయాన్నీ అతని వారసులనూ అనుసరిస్తారు. మహమ్మదీయుల లాగే శవాలను పూడ్చి పెడతారు. 'షేఖాదా'లు తమ ఇళ్లలో, వివాహ సందర్భాల్లో, బ్రాహ్మణ పురోహితులనూ, ముస్లిం పురోహితులను కూడా పిలుస్తారు. 'మోమన్లు' సుంతీ పాటిస్తారు. శవాలను ఖననం చేస్తారు. గుజరాతీ (భాషలోని) ఖురాన్ చదువుతారు. కాని, ఇతరమైన అన్ని సందర్భాల్లోనూ హిందూ సంప్రదాయాలనే పాటిస్తారు.

నీవు హిందువు ఎలా అయ్యావు అనే ప్రశ్నకు "హిందువుల మతవిశ్వాసాలను కలిగి ఉన్నాను కాబట్టి నేను హిందువునే" అని అతడు అన్నాడనుకోండి, ఆ మాట సత్యం కావటానికి వీలులేదు. ఎందుకంటే, హిందూయిజానికి ప్రత్యేకమైన మత విశ్వాసం అంటూ ఒకటి ఏదీ లేదనే విషయం స్పష్టంగా ఉంది గనుక. ఈ హిందువులు అనబడేవారు మత విశ్వాసాల విషయంలో క్రైస్తవులలో కంటే, మహమ్మదీయుల కంటే పరస్పరం చాలా విభేదిస్తారు. ఈ విభేదాలను అతి ప్రధాన విషయాలకే పరిమితం చేసి చూసినా కూడా హిందువులు వాటిలోనూ పరస్పరం భేదిస్తున్నారు. కొందరేమో హిందూమత గ్రంథాలన్నిటినీ ప్రమాణాలుగా స్వీకరించాల్సిందే అంటారు. మరికొందరు అందులోంచి తంత్రశాస్త్రాలను మినహాయిస్తారు. కొందరు వేదాలు మాత్రమే అతి ముఖ్యమైనవి అంటారు. 'అసలు కావలసినది కర్మ, పునర్జన్మల సిద్ధాంత విశ్వాసమే' అంటారు మరికొందరు.

వివిధమైన మత విశ్వాసాల, సిద్ధాంతాల, సమ్మేళనమే హిందూయిజం. ఇది, ఏకేశ్వరోపాసకులనూ, బహు దేవతారాధకులనూ, సర్వ దేవతారాధకులనూ అందరినీ తన మహా ప్రాంగణంలో ఇముడ్చుకున్నటువంటిది. ఇందులో శివకేశవులను పూజించేవారూ వారి భార్యలను పూజించేవారూ ఉన్నారు. అమ్మ దేవతలనూ, ప్రకృతి శక్తుల ఆత్మలనూ, చెట్ల, కొండల, నదుల, పర్వతాల ఆత్మలను పూజించేవారూ, గ్రామ దేవతలను పూజించేవారూ అన్నిరకాలవారూ ఉన్నారు. తమ దేవతలను రకరకాలుగా పూజించేవారున్నారు. జంతువులను బలి ఇచ్చి రక్తతర్పణం చేసేవారు, జంతువధ చేయకుండా ఉండడమేకాదు 'వధ' అనే మాటను కూడా తలపెట్టనివారు, మంత్రాలతో, స్తుతులతో సరిపుచ్చుకొనేవారు, మతారాధన పేరుతో చెప్పరాని ఉన్మత్త ప్రమోద కార్యకలాపాలు ఆచరించేవారూ ఉన్నారు. సంప్రదాయ విరుద్ధ శాఖలూ చాలా ఉన్నాయి. వారిలో చాలామంది బ్రాహ్మణాధిక్యతను ఒప్పుకోరు. కొందరు కనీసం బ్రాహ్మణేతర పురోహితులను పెట్టుకుని ఉంటారు.

"హిందువులందరూ పాటించే ఆచారాలనే పాటిస్తున్నాను కాబట్టి నేను హిందువునే"

అని అతడు అన్నాడనుకోండి. అదీ సత్యం కావటానికి వీలులేదు. ఎందుకంటే, హిందువులనబడే వారంతా ఒకే రకమైన ఆచారాలు పాటించటం లేదు గనుక.

ఉత్తర హిందూదేశ సమాజాల్లో దగ్గరి బంధువుల మధ్య వివాహాలు నిషిద్ధాలు. అదే దక్షిణ భారతదేశంలో అయితే మేనత్త మేనమామల బిడ్డల మధ్య వివాహం విహితమే. ఒక్కోసారి ఇంకా దగ్గరి సంబంధాలు కూడా అంగీకారాలే. స్త్రీ పవిత్రతను చాలా విలువైనదిగా అందరూ ఏకగ్రీవంగా ఒప్పుకొంటారు. అయితే కొన్ని కులాల్లో వివాహం అయ్యేంతవరకైనా పవిత్రంగా వుంటే చాలుననుకుంటారు. కొన్ని కులాల్లో ఒక కుమార్తెను మతాచార పద్ధతిలో వ్యభిచారానికి వదిలి పెట్టటం నియమం. కొన్ని ప్రాంతాల్లో స్త్రీలు స్వేచ్ఛగా సంచరించవచ్చు. కొన్ని ప్రాంతాల్లో అది నిషిద్ధం. కొన్నిచోట్ల స్త్రీలు గౌన్లు ధరిస్తారు. మరికొన్ని చోట్ల పైజామాలు వేసుకుంటారు.

"కులవ్యవస్థను ఒప్పుకొంటాను కాబట్టి నేను,హిందువును" అని అతడు అన్నాడనుకోండి. అది కూడా తృప్తికరమైన జవాబు కాదు. ఎందుకంటే ఏ హిందువూ పొరుగువాని విశ్వాసాలను తెలుసుకోవటంలో ఆసక్తి చూపడు అనే మాట నిజం గనుక. హిందువు ఎంతసేపూ ఆ పొరుగువాడితో కలిసి భోజనం చెయ్యవచ్చా అనో అతని చేతి మంచినీళ్ళు తాగవచ్చా అనో మాత్రమే ఆలోచిస్తాడు గనుక. సారాంశమేమిటంటే – కులవ్యవస్థ అనేది హిందూయిజంలోని అతి ముఖ్యమైన లక్షణం. ఒక వ్యక్తి అందులోని గుర్తింపు పొందిన ఏ హిందూ కులానికైనా చెంది వుండకపోతే అతడు హిందువుగా అంగీకరింపబడడు. ఇదంతా వాస్తవమైనా కూడా కులాన్ని పాటించటం ఒకటే అందుకు చాలదు, అని మరిచిపోకూడదు.

చాలామంది మహమ్మదీయులూ, క్రైస్తవులూ కూడా కులాన్ని పాటిస్తున్నారు. సహపంక్తి భోజనాలలో పాటించకపోవచ్చును గాని వివాహాలలో మాత్రం కచ్చితంగా పాటిస్తున్నారు. ఆ కారణం వల్ల వారు హిందువులు కారు కదా. పై రెండు అంశాలూ ఉండే వారే హిందువులు. అంటే అతడు హిందువూ అయి వుండాలి, కులాన్ని పాటిస్తూనూ ఉండాలి. ఇది మళ్లా మనల్ని తిరిగి పాత ప్రశ్నకే లాక్కెడుతున్నది. "హిందువు అంటే ఎవరు?" అని! మళ్లీ మనం మొదటికే వచ్చామన్నమాట!

తన మతంలో మాత్రమే పరిస్థితి ఈ విధంగా, కలవరపరచేదిగానూ, విభ్రాంతపరచేదిగానూ ఉన్నదేమిటి – అన్నది ప్రతి హిందువుకూ ఒక ప్రశ్న కాదా? ప్రతి పార్సీ, ప్రతి క్రైస్తవుడూ, ప్రతి ముస్లిమూ సులభంగా జవాబు చెప్పగలిగే చిన్నపాటి ప్రశ్నకు అతడెందుకు జవాబు చెప్పలేకపోతున్నాడు? తన మతంలోని ఈ అస్తవ్యస్తతకు కారణమేమిటి అని తనను తాను ప్రశ్నించుకొనే తరుణం హిందువుకు ఇంకా రాలేదా?

అనువాదం : డాక్టర్ అంతటి నరసింహం

చిక్కుముడి : 2

# వేదాల మూలం–బ్రాహ్మణుల సంజ్ఞా యుక్తి–డొంకతిరుగుడు కళాసాధన

వేదాలు, తన మతంలోని పరమ పవిత్ర గ్రంథాలని విశ్వసించని హిందువు ఎవరూ ఉండరు. అయినా, వేదాల పుట్టుక గురించి ఏ హిందువునైనా ప్రశ్నించండి; అతి సాధారణమైన ఆ ప్రశ్నకు స్పష్టమైన, నిర్దిష్టమైన జవాబు చెప్పేవారు ఒక్కరూ దొరకరు. ఒకవేళ అదే ప్రశ్నను ఒక వైదిక బ్రాహ్మణుని అడిగామనుకోండి, 'వేదాలు అతి సనాతనమైనవి', అని అంటాడు. కాని ఆ ప్రశ్నకు అది సరైన జవాబు కాదు. అసలు 'సనాతన' అనే పదానికి అర్థం ఏమిటి?

---

'వేదాల మూలం' అనే విషయం గురించి రాసిన 72 పుటలు మాకు లభ్యమైనాయి. ఈ పుటలకు వరుస సంఖ లు లేవు. గ్రంథకర్తగాని, టైపిస్టుకాని పుటలకు నంబర్లు వేయలేదు. మేము ఆ విడికాగితాల ఒక క్రమంలో పెట్టి విషయసూచికలో చూపిన రీతిలో (చిక్కుముడి 2 నుంచి 6 వరకూ) ందువరచే ప్రయత్నం చేశాం. ఆ అధ్యాయాలలోని విషయాలు సమగ్రమైనవిగా పరిగణించటం కష్టం. 'వేదాల చిక్కుముడి' అనే శీర్షికతో విడిగా ఒక అధ్యాయం 61 పుటలతో అనుబంధం–1గా ఇవ్వటం జరిగింది. ఆ అధ్యాయం ఈ 2–6 అధ్యాయాలలోని విషయాంశాలను సమగ్రంగా చర్చిస్తున్నది. చాలా పేరాలు పునరావృతం కావటం కూడా గమనించవచ్చు. ఇక్కడ చేర్చిన 2–6 అధ్యాయాల అసలు రాతప్రతిలో గ్రంథకర్త స్వదస్తూరీతో చేసిన సవరణలు దిద్దుబాట్లు కనిపిస్తున్నాయి. అనుబంధం–1గా చేర్చిన అధ్యాయం, అసలు దిద్దుబాట్లు లేని టైపు చేసిన రెండో ప్రతి. విషయసూచికలోని అనుక్రమణికనే మేము అనుసరించాం. దిద్దుబాటు చేసిన రాతప్రతిలోని పుటల సంఖ్య అదే రీతిలో ఉంది.

–సంకలనకర్త

---

'సనాతన'[1] శబ్దానికి వివరణ మనుస్మృతి ఒకటో ప్రకరణంలోని 22, 23 శ్లోకాలలో కుల్లూకభట్టు వ్యాఖ్యానంలో లభిస్తుంది.

"సనాతన" అంటే అనాది నుండీ నిత్యంగా ఉన్నట్టిది అని ఆయన చెప్పారు. 'వేదాలు అపౌరుషేయాలు' (మానవసృష్టి కాదు) అనే సిద్ధాంతాన్ని మనువు కొనసాగిస్తూ వచ్చాడు. ప్రస్తుత విశ్వసృష్టికి పూర్వం ఈ వేదాలు సర్వోత్కృష్టుడూ, సర్వజ్ఞుడూ అయిన బ్రహ్మస్మృతిలో నిక్షిప్తమైనాయి. అవే వేదాలను ప్రస్తుత కల్పంలో బ్రహ్మ అగ్ని నుండీ, వాయువు నుండీ, సూర్యుని నుండీ తిరిగి తీసుకొని రూపొందించాడు. ఋగ్వేదం అగ్ని నుండీ, యజుర్వేదం వాయువు నుండీ, సామవేదం సూర్యుని నుండీ ఉద్భవించాయి, అని వేదం చెబుతున్నది. వేదాలను గురించిన ఈ పిడివాదాన్ని ఎవరూ ప్రశ్నించడానికి వీలులేదు. కుల్లూకభట్టు వివరణను అర్థం చేసుకోవాలంటే 'కల్పము' అంటే ఏమిటో వివరించటం అవసరం.

'కల్పము' అనేది వేదకాలపు బ్రాహ్మణులు అనుసరించిన కాలగణన. కాలాన్ని వారు (1) వర్షము (2) యుగము (3) మహాయుగము (4) మన్వంతరము (5) కల్పము – అని విభజించారు.

'వర్షము' అంటే అర్థం చేసుకోవడం సులభమే. అది ప్రస్తుతపు 'సంవత్సరం'తో సరిపోతుంది. ఇక 'యుగము' అంటే ఎంత కాలానికి సమానమో చెప్పడానికి ఏకాభిప్రాయం లేదు.

నాలుగు యుగాలు కలిస్తే ఒక మహాయుగం అవుతుంది. యుగాలు అంటే (1) కృతయుగ (2) త్రేతాయుగ (3) ద్వాపరయుగ (4) కలియుగాలు. కాలచక్రంలో ఈ నాలుగు యుగాలూ ఇదే క్రమంలో ఒకదాని వెనుక ఒకటి (అనుసరించి) తిరుగుతూ ఉంటాయి. కాలచక్రం ఒక చుట్టు తిరిగితే ఒక మహాయుగం పూర్తయి మరో కొత్త మహాయుగం ప్రారంభమవుతుంది. ప్రతి మహాయుగమూ కృతయుగంతో ప్రారంభమై కలియుగంతో ముగుస్తుంది.

మహాయుగానికీ కల్పానికీ సంబంధించిన కాలగణనంలో అనిశ్చితత్వానికి తావు లేదు. 71మహాయుగాలు కలిసి ఒక "కల్పం" అవుతుంది. మహాయుగానికీ, మన్వంతరానికీ సంబంధించిన కాల నిర్ణయంలో మాత్రం కొంత సందిగ్ధత ఉంది. ఒక మన్వంతరం అంటే 71 మహాయుగాల పై చిలుకు కాలం అని చెప్పారు. ఆ అధిక కాలం ఎంతో సరిగ్గా చెప్పలేదు. బ్రాహ్మణులు ఈ విషయంలో దీనిని వర్గీకరించి చెప్పలేకపోతున్నారు. తత్ఫలితంగా, మన్వంతరానికీ, కల్పానికీ సంబంధించిన కాలనిర్ణయం అనిశ్చితంగా ఉండిపోయింది.

ఇది మన ప్రస్తుత ప్రయత్నానికి ప్రతిబంధకమేమీ కాదు. ప్రస్తుతానికి 'కల్పం' వరకే మన దృష్టి పరిమితం చేసుకుంటే చాలు.

---

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు. సం. III, పుట 6.

'కల్పం'లోని భావం విశ్వసృష్టికీ, లయానికీ అతి సన్నిహితంగా సంబంధించి ఉంది. ఈ ప్రపంచాన్ని సృజించడాన్ని "సృష్టి" అనీ, దాని వినాశనాన్ని "ప్రళయము"నీ అంటారు. ఈ సృష్టి ప్రళయాల మధ్యగల కాలాన్నే కల్పం అంటారు.

అంచేత వేదాల మూలానికి సంబంధించిన భావం ఈ విధంగా 'కల్పం'తో మరింత సన్నిహిత సంబంధం కలిగి ఉంది. ఈ విధమైన పథకం ప్రకారం ఏం జరుగుతుందంటే - కల్పం ప్రారంభంతో సృష్టి ప్రారంభమవుతుంది. సృష్టి ప్రారంభంలో వేదాల కొత్త వరస ప్రారంభమవుతుంది. కుల్లూకభట్టు చెప్పదలచుకున్నదేమిటంటే - ప్రతి కొత్త కల్పం ప్రారంభంతోనూ కొత్త వేదాల క్రమం ప్రారంభమవుతున్నప్పటికీ - ఆ పాత వేదాలే బ్రహ్మ యొక్క జ్ఞాపకశక్తి నుండి పునరుద్భవిస్తున్నాయి అని. అందుకే, వేదాలు 'సనాతన'మైనవి, అంటే అనాదిస్థితమైనవి, నిత్యమైనవి, అని ఆయన చెప్పాడు.

కుల్లూకభట్టు చెప్పేదేమిటంటే వేదాలు బ్రహ్మస్మృతి నుంచి పునరుత్పాదితమైనాయి అని. అసలు ప్రశ్న, వాటిని మొదట ఎవరు సృష్టించారు? అని. అంతేకాని ఎవరు పునరుత్పాదించారు? అని కాదు. ప్రతి కొత్త కల్పం ప్రారంభంలోనూ పునరుత్పాదన జరుగుతున్నదన్న సిద్ధాంతాన్ని ఒప్పుకున్నప్పటికీ కూడా మొదటి కల్పం ప్రారంభమయినప్పుడు ఎవరు వేదాలను సృజించారు అన్న ప్రశ్న, ప్రశ్నగానే మిగిలిపోతున్నది.

శూన్యం నుంచి వేదాలు ఉద్భవించి ఉండవు. దానికి అంతం లేకపోయినా ఆది మాత్రం ఉండి తీరాలి. ఆ విషయం బ్రాహ్మణులు ప్రకటంగా ఎందుకు చెప్పరు! ఎందుకీ డొంక తిరుగుడు?

అనువాదం : డాక్టర్ అంతటి నరసింహం

చిక్కుముడి : 3

# వేదాల మూలం గురించి ఇతర శాస్త్రాల ప్రామాణ్యాలు

## I

వేదాల మూలం గురించిన అన్వేషణను వేదాలతోనే ప్రారంభించవచ్చు.

ఋగ్వేదం వేదాల మూలం గురించి ఒక సిద్ధాంతాన్ని ప్రవచిస్తున్నది. ప్రసిద్ధి గాంచిన పురుష సూక్తంలో ఇది ఉన్నది. దీని ప్రకారం, పురాణాలకు చెందిన పురుషునికి సంబంధించి ఒక నిగూఢ యజ్ఞం జరిగింది. ఈ యజ్ఞంలో నుంచే మూడు వేదాలు – ఋగ్, సామ, యజుర్ వేదాలు వచ్చాయి.

సామవేదంగాని, యజుర్వేదంగాని వేదాల మూలం గురించి ఏమీ చెప్పటం లేదు. ఇక మిగిలిన అథర్వణ వేదం ఒకటే ఈ విషయం గురించి ప్రస్తావన తెస్తున్నది. వేదాల మూలం గురించి ఇది అనేక వివరణలు ఇస్తున్నది. ఒక వివరణ[1] ఇలా ఉన్నది –

"కాలం నుంచి ఋగ్ శ్లోకాలు ఉద్భవించాయి. యజుస్ కూడా కాలం నుంచే ఉద్భవించింది.

ఈ విషయం మీద అధర్వణ వేదంలో మరో రెండు ఇతరమైన ప్రతిపాదనలు కూడా ఉన్నాయి. వాటిలో మొదటిది అంత ప్రజ్ఞావంతమైనది కాదు. దాని భాషలోనే ఇస్తే అది ఇలా

---

1. అథర్వ వేద XIX 54.3 మూయిర్ ఉదహరించినది 1. III. 4 పుట.

ఉన్నది.[1] -

"ఎవరిపై ఆదిమ ఋషులు, ఋక్, సామ, యజుస్సులు, భూమి, వేదార్థ ద్రష్ట అయిన ఆ ఒక ఋషి ఆధారపడి ఉన్నారో ఆ స్కంభ ఆధారసూత్రం లేదా ధారణ చేసే పరమాత్మ ఎవరో చెప్పు."

"ఎవరి నుంచి ఋక్ శ్లోకాలను తెంపుకున్నారో, యజుస్సును గీరుకున్నారో, ఎవరికి సామ (వేద) శ్లోకాలు వెంట్రుకలుగాను, అధర్వ శ్లోకాలు (అంగిరసలు) ముఖంగానూ ఉన్నాయో ఆ స్కంభ ఎవరో ప్రకటించు. (చెప్పు)"

ఋక్, సామ, యజుర్వేదాలు స్కంభ నుంచి ఉద్భవించాయని ఎవరో చేసిన ప్రకటనకు సవాలుగా ఇది విసిరినట్టు కనిపిస్తున్నది.

అథర్వణ వేదంలో ఇచ్చిన రెండవ వివరణ ఏమంటే వేదాలు ఇంద్రుని[2] నుంచి ఉద్భవించాయని.

## II

తమ మూలం గురించి వేదాలు చెప్పుకున్నదంతా ఇదే. వేదాల తరువాత క్రమంలో వచ్చేవి బ్రాహ్మణాలు. అందువల్ల ఇవి ఈ విషయం మీద ఏం చెబుతాయో పరిశీలన చేయవలసి ఉన్నది. వేదాల మూలం గురించి వివరించటానికి ప్రయత్నం చేసిన బ్రాహ్మణాలు - శతపథ బ్రాహ్మణం, తైత్తిరేయ బ్రాహ్మణం, ఐతరేయ బ్రాహ్మణం, కౌషితకి బ్రాహ్మణం మాత్రమే.

శతపథ బ్రాహ్మణంలో రకరకాల వివరణలు ఉన్నాయి. ఒకటేమో వేదాల మూలం ప్రజాపతి[3]కి ఆపాదిస్తున్నది. దీని ప్రకారం :

"మొదట్లో ఈ విశ్వం అంతటా ప్రజాపతి ఒక్కడే ఏకైక జీవి. అతడు "నేను జీవిస్తాను, నేను వృద్ధి పొందుతాను" అని వాంఛించాడు. కఠోరభక్తితో తపస్సు ఆచరించాడు.

"అంత శ్రమపడి కఠోర తపస్సు ఆచరించిన మీదట అతని నుంచి మూడు లోకాలు - భూమి, గాలి, ఆకాశం సృష్టి అయ్యాయి. ఈ మూడు లోకాలకు తేజస్సును కల్పించాడు. ఆ తర్వాత, వాటి నుంచి మూడు జ్యోతులు ఉద్భవించాయి - అగ్ని (నిప్పు) ఇది పునీతం చేసేది, పవన లేదా వాయువు (గాలి), సూర్యుడు. ఈ మూడు జ్యోతులలోకి వేడి ప్రవేశపెట్టాడు. వేడెక్కిన వాటి నుంచి మూడు వేదాలు జనించాయి – అగ్ని నుంచి ఋగ్వేదం,

---

1. అథర్వవేద IX 7.14 మూయిర్ ఉదహరించినది. సం 1, III. పుట 3.
2. మూయిర్ సంస్కృత గ్రంథాలు III. పుట 4
3. మూయిర్ సంస్కృత గ్రంథాలు III. పుట 5.

వాయువు నుంచి యజుర్వేదం, సూర్యుని నుంచి సామవేదం. ఈ మూడు వేదాలకు ప్రకాశాన్ని అందించాడు. అప్పుడు వాటి నుంచి జాజ్జ్వల్యమానమైన సారత్రయం వెలువడింది. ఋగ్వేదం నుంచి భూః, యజుర్వేదం నుంచి భువః, సామవేదం నుంచి స్వః. ఈ విధంగా ఋగ్వేదం నుంచి అధ్వర్యు కార్యం, సామవేదం నుంచి ఉద్గాత్రి విధులూ వచ్చాయి. మూడు శాస్త్రాల (మూడు వేదాల) జాజ్జ్వల్యమానమైన సారం నుంచి బ్రాహ్మణుని కార్యకలాపాలు రూపొందాయి.

వేదాలకు మూలం ప్రజాపతి అనే ఈ వివరణకు శతపథ బ్రాహ్మణం వేరే మరొక పాఠభేదాన్ని కూడా ఇస్తున్నది.[1]

ప్రజాపతి వేదాలను నీటి నుంచి సృజించాడన్నదే ఆ వివరణ. శతపథ బ్రాహ్మణం ఇలా చెబుతున్నది –

"పురుషుడైన ఈ ప్రజాపతి 'నేను ద్విగుణీకృతం కావాలి, నేను వృద్ధి పొందాలి' అని వాంఛించాడు. తీవ్ర నిష్ఠాపరుడైనాడు. ఉత్సుకతతో కఠోర తపస్సు ఆచరించాడు. అలా చేసిన తరువాత మొదటగా వేదత్రయ పవిత్ర విజ్ఞానాన్ని సృష్టించాడు. ఇది అతనికి ఒక ఆధారం అయింది. అందువల్లనే 'పవిత్ర జ్ఞానమే ఈ విశ్వానికి ఆధారం' అని జనులు అంటుంటారు. వేదాలను చదివిన మానవునికి ఒక స్థిరమైన ఆధారం దొరుకుతుంది; ఎందుకంటే పవిత్ర జ్ఞానం అతని పునాది అవుతుంది గనుక. ఈ ఆధారం మీదనే ప్రజాపతి కఠోర తపస్సు ఆచరించాడు. వచస్సు నుంచి వాటి ప్రపంచంగా జలాలను సృష్టించాడు. వచస్సు అతనిది; అది సృష్టికావించబడింది. అది వ్యాప్తి చెందిన తర్వాత (ఆప్నోతి) ఆ జలాలను ఆపః అని పిలిచారు. మొత్తాన్ని అది ఆవరించిన (ఆవృనోత్) తర్వాత జలాలను 'వర్' అని అన్నారు. 'ఈ జలాల నుంచి నేను వృద్ధి పొందాలి' అని అతడు వాంఛించాడు. ఈ మూడు వేదాల విజ్ఞానంతోనూ అతడు జలాలలో ప్రవేశించాడు. ఒక అండం ఉద్భవించింది. దానికి ఒక ప్రచోదన కలిగించాడు. 'అది కలుగుగాక; అది కలుగుగాక; మళ్ళీ కలుగుగాక' అని అన్నాడు. అపుడు మొదటగా వేదత్రయ విజ్ఞానం ఉద్భవించింది. అందువల్లనే జనులు 'పవిత్ర జ్ఞానం విశ్వంలో మొదట జన్మించినది' అని అంటారు. అంతేకాకుండా, పవిత్ర జ్ఞానం ఆ పురుషుని ముందటి భాగం నుంచి ఉద్భవించింది, అంటే అతనికి నోరు (ముఖం)గా ఏర్పడింది. అందుకే వేద పారంగతుడైన మానవుణ్ణి 'అతను అగ్నివంటివాడు' అని అంటారు. ఎందుకంటే పవిత్రజ్ఞానమే అగ్ని నోరు".

[2]శతపథ బ్రాహ్మణంలో మరో మూడో వివరణ ఉంది –

"ఈ సముద్రం ఆసనంగా నిన్ను ప్రతిష్ఠిస్తాను. మనస్సే సముద్రం. ఆ మనో సముద్రం నుంచి దేవతలు వచస్సును పారగా గ్రహించి మూడు వేదాల విజ్ఞానాన్ని తవ్వి తీశారు. అందుకనే

---

1. ఆదే పుస్తకం. పుట 8.
2. మూయర్ పుటలు 9-10

ఈ కింది అర్థం గల శ్లోకాన్ని పఠించారు.

"పదునైన పారలు తీసుకొని దేవతలు తవ్వి తీసిన నైవేద్యాన్ని ఎక్కడ ఉంచారో ఈ రోజున ప్రకాశమానమైన దేవత తెలుసుకోగలగాలి. మనస్సే సముద్రం. వచస్సు పదునైన పార; మూడు వేదాల విజ్ఞానం నైవేద్యం. దీనిని ప్రస్తావిస్తూ ఆ శ్లోక పఠనం జరిగింది. దీనిని అతను మనస్సులో నిక్షేపించుకుంటాడు."

తైత్తిరేయ బ్రాహ్మణం మూడు వివరణలు ఇస్తున్నది. వేదాలు ప్రజాపతి నుంచి వచ్చాయని ఇది చెబుతున్నది. ప్రజాపతి ముందుగా సోముని రాజుగా సృష్టించాడనీ, అతని తర్వాత మూడు వేదాలను సృష్టించాడనీ[1] కూడా అది చెబుతున్నది. ప్రజాపతితో ఏ మాత్రం సంబంధంలేని మరో వివరణ[2]ను కూడా ఈ బ్రాహ్మణం ఇస్తున్నది. దీని ప్రకారం –

"వచస్సు (మాట) నశ్వరం కాని వస్తువు, క్రతువులో నుంచి మొదట జన్మించినది. వేదాలకు తల్లి, అమరత్వానికి కేంద్ర బిందువు. మనపట్ల సంతోషపడి ఆమె యజ్ఞం వద్దకు వచ్చింది. పండితులైన ఋషులు, వేద మంత్రకర్తలు, దేవతలు తీవ్ర తపస్సుతో కఠినమైన నిష్ఠతో ఏ దేవతనయితే శరణు జొచ్చుతారో, ఆ దేవత నా ప్రార్థన ఆలకించటానికి సిద్ధంగా ఉండాలి."

వీటినన్నిటినీ తలదన్నేటట్టుగా తైత్తిరీయ బ్రాహ్మణం మూడో వివరణ ఇస్తున్నది. వేదాలు ప్రజాపతి గడ్డంలో నుంచి వచ్చాయని అది చెబుతున్నది.[3]

## III

ఉపనిషత్తులు కూడా వేదాల మూలాన్ని వివరించటానికి ప్రయత్నించాయి.

ఛాందోగ్యోపనిషత్తు ఇచ్చిన వివరణ శతపథ బ్రాహ్మణం ఇచ్చిన వివరణే.[4] అంటే ఋగ్వేదం అగ్నిలో నుంచి, యజుర్వేదం వాయువులో నుంచి, సామవేదం సూర్యునిలో నుంచి వచ్చినవని.

బృహదారణ్యకోపనిషత్తు రెండు వివరణలు అందజేస్తున్నది. ఒకచోట అది ఇలా చెబుతున్నది.[5]

"తడికట్టెల నుంచి రాజుకొనే అగ్ని నుంచి వెలువడే పొగయొక్క వివిధ రూపాలలాగా, ఆ మహాపురుషుని ఊపిరులే ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వాంగిరసలు,

1. అదే కం పుట 8.
2. అదే పు కం పుట 10.
3. అదే కం పుట 10.
4. అదే కం పుట 5.
5. మూయి 1 సం. పుట 8.

ఇతిహాసాలు, పురాణాలు, శాస్త్రం, ఉపనిషత్తులు, శ్లోకాలు, స్తోత్రాలు, వివిధ రకాల వ్యాఖ్యానాలూ – ఇవన్నీ అతని ఉచ్ఛ్వాసాలే."

మరొకచోట ఇలా అంటున్నది.[1]

"మృత్యువు లేదా లయకారుడిగా గుర్తింపబడిన ప్రజాపతి వాక్(మాట)ను సృష్టించాడని అంటారు. ఆమె ద్వారా ఆత్మతో కూడుకొని, వేదాలతో సహా సమస్త వస్తువులనూ సృష్టించాడు."

"ఆ వాక్కుతోనూ, ఆ ఆత్మతోనూ సమస్త వస్తువులను అంటే ఋక్, యజుర్, సామ గ్రంథాలు, ఛందస్సులు, యజ్ఞాలు, ప్రాణులు, జంతువులు అన్నింటినీ సృష్టించాడు."

ఈ మూడు వేదాలను మూడు విషయాలతో అంటే వాక్కు, మనస్సు, శ్వాసలతో గుర్తించవచ్చు. వాక్కు ఋగ్వేదం, మనస్సు యజుర్వేదం, శ్వాస సామవేదం."

## IV

స్మృతుల విషయానికి వస్తే, వేదాల మూలం విషయంలో మనుస్మృతిలో రెండు సిద్ధాంతాలున్నట్టు కనిపిస్తుంది. ఒకచోట[2] వేదాలను బ్రహ్మ సృష్టించాడని ఉన్నది.

"అతడు (బ్రహ్మ) మొదట్లో వేదశబ్దాల నుండి సకల జీవరాశుల వివిధమైన పేర్లు, కార్య కలాపాలు, వాటి ప్రత్యేక పరిస్థితులు రూపొందించాడు. ఆ ప్రభువు చేతనమైన సజీవమైన దేవతల చతురగణాన్ని, సాధ్యులను, అనంత యాగాన్నీ కూడా సృష్టించాడు. యజ్ఞం చేసే నిమిత్తం, అతడు అగ్ని నుంచి, వాయువు నుంచి, సూర్యుని నుంచి ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదంగా ప్రసిద్ధి చెందిన అనంత వేదత్రయాన్ని బయటకు తీశాడు.

మరొకచోట[3], ప్రజాపతిని వేదాల మూలంగా చెప్పే కథను అంగీకరించినట్టు కనిపిస్తుంది. అది ఈ క్రింది భాగం నుంచి స్పష్టమవుతుంది.

"ప్రజాపతి మూడు వేదాల నుంచి 'అ', 'ఉ', 'మ' అనే మూడు అక్షరాలను, భూః, భువః, స్వః అనే పదాలను పిండాడు. సర్వోత్కృష్టుడైన ఆ ప్రజాపతియే మూడు వేదాల సారంగా వ్యాహృతులలో 'తత్'తో మొదలయ్యే సవిత్రి (గాయత్రి) అనే మంత్రాన్ని కూడా పిండాడు. ఓంకారాన్ని అనుసరించి వెలువడినదీ, అనశ్వరమైన ఈ మూడు గొప్ప వ్యాహృతులూ (భూః, భువః, స్వః) కలదీ అయిన మూడు పాదాల గాయత్రిని బ్రహ్మ నోరుగా (ముఖంగా) భావిస్తారు."

---

1. మూయిర్ పుట 9.
2. మూయిర్ పుట 6.
3. మూయిర్ పుట 7.

## V

వేదాల మూలం గురించి పురాణాలు ఏం చెబుతున్నాయో తెలుసుకోవటం కూడా చాలా ఆసక్తిదాయకంగా ఉంటుంది. విష్ణు పురాణం[1] ఇలా చెబుతున్నది.

"తన తూర్పువైపు ముఖం నుంచి బ్రహ్మ గాయత్రిని, ఋక్ శ్లోకాలను, త్రివృత్ సోమను, రథంతరను, యజ్ఞము, అగ్ని ష్టోమాలను రూపొందించాడు. దక్షిణ ముఖం నుంచి యజుర్ శ్లోకాలను, త్రైష్టుప ఛందస్సును, పంచదశ స్తోమాన్ని, బృహత్-సామాన్ని, ఉక్త్యను (ఉక్థము) రూపొందించాడు. పశ్చిమపు ముఖం నుంచి సామ శ్లోకాలను, జగతి ఛందస్సును, సప్తదశ స్తోమాన్ని, వైరూప, అతిరాత్రలను రూపొందించాడు. ఉత్తర ముఖం నుంచి ఏకవింశను, అథర్వణను, అనుష్టుప్ వైరాజ ఛందస్సులతో ఆప్తోర్యామాణాన్ని రూపొందించాడు.

భాగవత పురాణం[2] ఏం చెబుతున్నదంటే –

"మునుపటి వలె. సమస్త ప్రపంచాన్నీ ఎలా సృష్టించటం" అని చతుర్ముఖుడు ధ్యానమగ్నుడై ఉండగా వేదాలు ఆ చతుర్ముఖ సృష్టికర్త నుంచి ఉద్భవించాయి. తన తూర్పు ముఖం నుంచీ ఇతర ముఖాల నుంచీ రుక్, యజుర్, సామ, అథర్వణ వేదాలను, స్తోత్రం, యజ్ఞం, కీర్తనలు, ప్రాయశ్చిత్తంతో సహా రూపొందించాడు.[3]

"ఆమె కనుల మధ్య ప్రవేశించి, ఆమె నుంచి మానవాకారంలో నాలుగింతల జీవుడు, బ్రహ్మవలె ప్రకాశిస్తూ, అనిర్వచనీయుడై, అనంతుడై, అక్షయుడై, అనశ్వరుడై, అతీంద్రియుడై (శారీరక భావాలు గాని, లక్షణాలు గాని లేనివాడై), విరాజమాన లక్షణాలతో విలసిల్లుతూ చంద్రుని కిరణాల వలె స్వచ్ఛంగా, ప్రకాశవంతంగా అక్షరరూపంలో ఉద్భవించాడు. భగవంతుడు ఋగ్వేదాన్ని, యజుర్వేదాన్ని తన కన్నుల నుంచి, సామవేదాన్ని నాలుక కొస నుంచి, అథర్వణ వేదాన్ని తల నుంచి రూపొందించాడు. ఈ వేదాలు పుట్టగానే శరీరాన్ని (క్షేత్రం) వెతుక్కున్నాయి. తమ నివాసం కనుక్కున్నాయి కాబట్టి వాటికి వేద లక్షణం వచ్చింది, (విందంతి). ఈ వేదాలు పూర్వం అస్తిత్వంలో ఉండినట్టి శాశ్వతుడైన బ్రహ్మను (పవిత్ర విజ్ఞానం) దేవరూపంలో ఉన్న పురుషునిగా తమ మనోభవ లక్షణాలతో సృష్టించాయి."

ఇది (వేదాలకు) ప్రజాపతే మూలం అని కూడా అంగీకరిస్తున్నది. పరమాత్ముడు ప్రపంచాన్ని సృష్టించాలని తలంచినపుడు, హిరణ్యగర్భుడు లేదా ప్రజాపతి తన నోటి నుంచి 'ఓం' అనే శబ్దాన్ని వదిలి, తనను తాను విభజించుకోవాలనుకున్నాడు – ఆ ప్రక్రియ ఎలా నిర్వహించగలనా అని అతనికే పెద్ద అనుమానం వచ్చింది – హరి వంశం ఇలా చెబుతున్నది.[4]

1. మూయిర్ సం. 1 పుట 11.
2. మూయిర్ పుట 11
3. ఇక్కడ కొంతభాగం లుప్తమైనట్టు కనిపిస్తున్నది; ఎందుకంటే దీనికి తర్వాతి పేరాలతో సంబంధం కుదరటం లేదు.
4. మయిర్ పుట 14.

"అతడు ఆ విధంగా ఆలోచనా మగ్నుడై ఉండగా, అతని నుంచి 'ఓం'కార నాదం వెలువడి, భూమి, గాలి, ఆకాశాల మధ్య ప్రతిధ్వనించింది. దేవాదిదేవుడు దానిని పునశ్చరణ చేస్తూ ఉంటే మనస్సు యొక్క సారం, షట్కారం అతని హృదయంలో నుంచి బయలుదేరింది.ఆ తర్వాత ఘనమైన స్మృతి నుంచి రూపొందిన పవిత్రమైన సర్వశ్రేష్ఠమైన వ్యాహృతులు (భూః, భువః, స్వః) శబ్దరూపంలో, భూమి, గాలి, ఆకాశాల నుంచి ఉద్భవించాయి. అపుడు ఇరవై నాలుగు అక్షరాలతో ఛందో దేవత (గాయత్రి) ప్రత్యక్షమయింది. 'తత్'తో ఆరంభమైన ఆ దివ్య మంత్రాన్ని అవలోకిస్తూ ప్రభువు సావిత్రిని రూపొందించాడు. అపుడు అతడు ప్రార్థనలతో, క్రతువులతో ఋక్, సామ, అధర్వణ, యజుర్వేదాలను రూపొందించాడు."

## VI

ఇక్కడ వేదాల మూలం గురించి పదకొండు విభిన్నమైన వివరణలు మనకు లభ్యమయ్యాయి –

1. పురుషుని నిగూఢ యజ్ఞం నుంచి ఉద్భవించినవని,
2. స్కంభపై ఆధారపడినవని,
3. అతని నుంచి వేరు చేయబడిన వెంట్రుకల నుంచీ, నోటి నుంచీ వచ్చాయని,
4. ఇంద్రుని నుంచి ఉద్భవించినవని,
5. కాలం నుంచి ఉద్భవించినవని,
6. అగ్ని నుంచి ఉద్భవించినవని,
7. ప్రజాపతి నుంచి, జలాల నుంచి ఉద్భవించినవని,
8. బ్రహ్మ ఉచ్ఛ్వాసంగా వచ్చినవని,
9. మనో సముద్రం నుంచి దేవతలు తవ్వి తీసినవని,
10. ప్రజాపతి గడ్డంలో నుంచి వచ్చినవని,
11. వచస్సు సంతతి అని.

ఒక చిన్న ప్రశ్నకు దిగ్భ్రాంతి గొలిపే అనేకమైన సమాధానాలు రావడం అనేది ఒక చిక్కుముడి. ఈ సమాధానాలు అన్నీ ఇవ్వటానికి ముందుకు వచ్చిన రచయితలందరూ బ్రాహ్మణులే. వారందరూ ఒకే వైదిక సిద్ధాంతానికి చెందినవారు. ప్రాచీన మత సంబంధమైన విద్యకు వారు ఒక్కరే రక్షకులు. అటువంటప్పుడు ఒక సాధారణ ప్రశ్నకు ఇటువంటి పరస్పర విరుద్ధమైన, అధ్వాన్నమైన సమాధానాలు వారు ఎందుకు ఇచ్చారు?

అనువాదం : బొజ్జా తారకం

చిక్కుముడి : 4

# వేదాలు అమోఘమైనవనీ ప్రశ్నించరానివనీ బ్రాహ్మణులు హఠాత్తుగా ఎందుకు ప్రకటించారు?

వేదాలు, హిందువుల మత సాహిత్యంలో అత్యున్నత స్థానాన్ని ఆక్రమిస్తున్నాయని చెప్పటం, వాటిని గురించి చాలా తక్కువ చెప్పినట్టే అవుతుంది. వేదాలు హిందువుల పవిత్ర సాహిత్యం అని చెప్పినా, సరిపోనిదే అవుతుంది. ఎందుచేతనంటే వేదాలు హిందువుల పవిత్ర సాహిత్యంగా మాత్రమే కాకుండా, ప్రశ్నించడానికి వీలులేని ప్రామాణిక గ్రంథాలుగా కూడా ఉన్నాయి. అవి తప్పు పట్టడానికి వీలులేనివి. వేదాల ఆధారంగా చేసిన వాదం ఏదైనా సరే అంతిమమైనదీ, నిర్ణాయకమైనదీ అవుతుంది. దానికి తిరుగులేదు. వేద బ్రాహ్మణుల సిద్ధాంతం ఇది. దీనిని హిందువులు సర్వత్రా ఆమోదిస్తారు.

## I

ఈ సిద్ధాంతం దేనిని ఆధారం చేసుకొని ఏర్పడింది? వేదాలు 'అపౌరుషేయాలు' అనే అభిప్రాయంపై ఆధారపడి ఏర్పడింది ఈ సిద్ధాంతం. వేదాలు అపౌరుషేయాలు అని వేద బ్రాహ్మణులు అన్నారంటే, వాళ్ల ఉద్దేశం – అవి మానవ కల్పితాలు కావు అని. మానవ కల్పితాలు కాకపోవడం వల్ల, సాధారణంగా ప్రతి మానవుడూ చేసే తప్పిదాలకూ, దోషాలకూ, పొరపాట్లకూ అవి అతీతంగా ఉంటాయి. అందుచేతనే అవి అమోఘమైనవి.

## II

అటువంటి సిద్ధాంతాన్ని వేద బ్రాహ్మణులు ఎందుకు ప్రతిపాదించారో అర్థం

చేసుకోవటం కష్టం. ఎందుచేతనంటే వేదాల ప్రామాణ్యమే అంతిమమైనదనీ, తుది నిర్ణాయకమనీ చెప్పే విషయంలో వేద బ్రాహ్మణులే పూర్తి భిన్నంగా యోచించిన కాలం కూడా ఉంది. ఈ వేద బ్రాహ్మణులు ఎవరో కాదు. వివిధ ధర్మ సూత్రాలు వ్రాసినవారే!

వేద ప్రామాణ్యంపై ధర్మసూత్రాలు వెలిబుచ్చిన అభిప్రాయాలు ఈ కింది విధంగా ఉన్నాయి :

గౌతమ ధర్మసూత్రంతో మొదలు పెడదాం. వేదాల అమోఘత్వంపై అది ఈ కింది నియమాలను తెలియజేస్తున్నది.

"వేదం ధర్మానికి (పవిత్ర శాసనానికి) మూలం" 1-1

"వేదం తెలిసిన వారి సంప్రదాయమే ఆచారం" 1-2

"సమాన శక్తిగల ప్రమాణాలు, ఒకదానితో ఒకటి భేదించినట్లయితే వ్యక్తి తన అభీష్టం కొద్దీ దేనినైనా అనుసరించవచ్చు." 1-4

వశిష్ఠ ధర్మసూత్రం ఈ క్రింది అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నది.

"వ్యక్తమయిన మూల పాఠాల ద్వారా, అంటే వేదాలూ, ఋషుల ఆచారాల ద్వారా – పవిత్ర శాసనాన్నీ, శిక్షాస్మృతినీ స్థిరపరచడం జరిగింది." 1-4

"ఇవి పని చేయనపుడు శిష్టుల ఆచరణమే ప్రమాణం"1-5

బోధాయనుని అభిప్రాయాలు ఈ కింది విధంగా ఉన్నాయి.

**ఒకటవ ప్రశ్న – ఒకటవ అధ్యాయం – ఒకటవ ఖండిక**

1. ప్రతి వేదంలోనూ ధర్మం (పవిత్ర శాసనం) బోధించారు.
2. దాని ప్రకారం మేము బోధిస్తాం. (దానికే ప్రథమ స్థానం)
3. సంప్రదాయానికీ, స్మృతులు బోధించిన దానికీ రెండవ స్థానం ఉంటుంది.
4. శిష్టుల ఆచారానికి మూడవ స్థానం ఉంటుంది.
5. ఇవన్నీ విఫలమైనప్పుడు కనీసం పదిమందితో కూడిన సభ వివాదాస్పదమైన (శాసన) అంశాలను నిర్ణయించవలసి ఉంటుంది.

ఆపస్తంబ ధర్మసూత్ర దృక్పథం ఈ సూత్రంలోని క్రింది ఉదాహరణలను బట్టి స్పష్టమౌతున్నది.

"అందుచేత, ఇప్పుడు, దైనందిన ఆచారాలలో భాగమయ్యే, ప్రతిభాశీల కార్యాలను ప్రకటిద్దాం." 1-1

"ధర్మం తెలిసిన వారి అంగీకారమే ప్రమాణం." 1-2

"తరువాత (దానికి ప్రమాణం) కేవలం వేదాలే"

శిష్టులకు సంబంధించి వశిష్ఠ ధర్మసూత్రాలూ, బోధాయన ధర్మసూత్రాలూ కూడా శిష్టులుగా పరిగణించబడే వారెవరో నిర్వచించడానికి ప్రత్యేక శ్రద్ధ వహించాయి.

వశిష్ట ధర్మసూత్రం ఇలా చెబుతున్నది.

"ఎవరి హృదయం వాంఛారహితంగా ఉంటుందో అతడు శిష్టుడు" 1-6

శిష్టుల అర్హతలను గురించి బోధాయనుడు ఇంకా ఎక్కువ వివరాలలోకి వెళ్ళాడు. ఆయన ఇలా అంటున్నాడు -

"ఎవరైతే అసూయా రహితులో, గర్వం లేనివారో, పదిరోజుల వరకు సరిపడే ఆహార నిల్వలతో తృప్తి చెందుతారో, కపటం, మిథ్యాచారం, దురాశ, కలవరం, కోపం లేకుండా ఉంటారో వారే సుమా నిజానికి శిష్టులు."

6. "పవిత్ర శాసనానికి అనుగుణంగా ఎవరైతే వేదాలను సాంగంగా అధ్యయనం చేసి వాటి మూలార్థాన్ని గ్రహించగలిగి ఉండి, వాటిలో చెప్పబడిన దానికి ఇంద్రియ గోచరమైన నిదర్శనాలను చూపించడం తెలిసి ఉంటారో వారినే శిష్టులు అంటారు."

బోధాయనుడు, తాను నిర్ణయాధికారం ఇచ్చిన సభ గురించి, ఎంతో ఆసక్తిదాయకమైన విషయాలు చెప్పాడు. ఈ విషయం మీద ఆయన అభిప్రాయాలు ఇవి -

8. "ఇప్పుడు వారు ఈ శ్లోకాలు[1] ఉదహరిస్తారు.

నాలుగు వేదాలలో ఏదో ఒక వేదం తెలిసిన వారు నలుగురు, ఒక మీమాంసకుడు, వేదాంగాలు తెలిసిన వ్యక్తి ఒకరు, పవిత్ర శాసన సంబంధి విషయాలను వల్లించే వ్యక్తి ఒకరు, మూడు విభిన్న శాఖలకు చెందిన ముగ్గురు బ్రాహ్మణులు, కూడి ఉన్నట్లయితే 'సభ' అవుతుంది. అందులో కనీసం పదిమంది సభ్యులుండాలి.

9. "పవిత్ర శాసనాన్ని నిర్ణయించేవారు ఐదుగురుండవచ్చు. లేదా ముగ్గురే ఉండవచ్చు. లేదా దోషరహితుడైన వాడు ఒకడే ఉండవచ్చు. అంతేగాని మూర్ఖులు వేయిమంది వున్నా ఆ పనికి సమర్థులు కాదు.

"విద్యారహితుడైన బ్రాహ్మణుడు – కొయ్యతో చేసిన ఏనుగు వలెనూ, తోలుతో చేసిన దుప్పి వలెనూ కేవలం పేరుకు మాత్రమే, అంతే!

(1) వేదం, (2) సంప్రదాయం (స్మృతి), (3) శిష్టాచారం, (4) సభా నిర్ణయం అనేవి

1. శ్లోకాలు ఇవ్వలేదు.

ఒక వివాదాస్పద విషయంపై నిర్ణయం తీసుకునేటప్పుడు సంప్రదించవలసిన నాలుగు విభిన్నమైన అధికారాలు (ప్రమాణాలు) అని, ఈ ధర్మసూత్రాల[1] సమీక్షవల్ల తేలుతున్నది. వేదాలను పరమ ప్రమాణాలుగా పరిగణించని కాలం ఒకటి ఉండేదనే విషయాన్ని కూడా ఇది చూపుతున్నది. అది వశిష్ఠ, బోధాయన ధర్మసూత్రాలు పరివ్యాప్తి చెందిన కాలం. ఆపస్తంబుడు వేదాలకు ఎటువంటి ప్రామాణ్యమూ అంటగట్టలేదు. వేదజ్ఞానం అనేదాన్ని ధర్మ నిర్ణాయక సభలో సభ్యత్వం పొందడానికి (ఎన్నికకు) అర్హతగా చెప్పాడాయన. ఈ సభలో ఆమోదించిన నిర్ణయం మాత్రమే ధర్మంగా, కచ్చితమైన శాసనంగా అయ్యేది. వేదాన్ని అధికారికమైన ప్రమాణ గ్రంథంగా పరిగణించేవారే కాదు. విజ్ఞుల సభలో కుదిరిన ఒప్పందం మాత్రమే ధర్మంగా, అధికారికమైనదిగా గుర్తింపు పొందేది. గౌతముని కాలంలోనే వేదాలు ఏకైక ప్రమాణంగా గుర్తింపుకు వచ్చాయి. సభలో తీసుకున్న నిర్ణయాన్ని అధికారిక ప్రమాణాలలో ఒకటిగా ఆమోదించిన కాలమూ ఉంది; అది బోధాయనుని కాలం.

శతపథ బ్రాహ్మణంలోని ఈ క్రింది ఉదాహరణ పై నిర్ణయాన్ని బలపరుస్తున్నది. అది ఈ విధంగా చెబుతున్నది.

**(ఈ వ్యాసం అసంపూర్తిగా ఉంది. ఉదాహరణలు, తదుపరి చర్చలు లేవు.)**

– సంకలనకర్త

అనువాదం : యస్.వి. రమణరావు

---

1. మాక్స్‌ముల్లర్ చెప్పిన ప్రకారం ధర్మసూత్రాల కాలం క్రీ.పూ. 600–200 మధ్య కావచ్చు.

చిక్కుముడి : 5

# వేదాలను మనిషిగాని దైవంగాని రాయలేదని ప్రకటించేటంత దూరం బ్రాహ్మణులు ఎందుకు వెళ్ళారు ?

వేద బ్రాహ్మణులు, వేదాలను ప్రశ్నించడానికి వీలుకానివిగా చేసి కూడా తృప్తి చెందలేదు. ఇంకొంచెం ముందుకు సాగి, వేదాలు అపౌరుషేయాలు అని నొక్కి వక్కాణించారు. ఇక్కడ వారి ఉద్దేశం ఏమిటంటే వేదాలు మానవ కల్పితాలు కాదు అని. ఈ సిద్ధాంతం – ప్రశ్నించడానికి వీలులేదనే సిద్ధాంతానికి దారి తీస్తుందనడంలో అనుమానం లేదు. ఎలాగంటే అవి మానవ కల్పితాలు కావు – అనడం వల్ల సామాన్యంగా మానవుల వల్ల కలిగే తప్పిదాలు, పొరపాట్లు, దౌర్బల్యాలూ అందులో ఉండడానికి వీల్లేదని. అందుచేతనే అవి ప్రశ్నాతీతాలు అయ్యాయి. ఏది ఏమైనప్పటికీ ఇది స్వతంత్రమైన సిద్ధాంతం కనుక దీనిని ప్రత్యేకంగా పరిశీలించవలసిన అవసరం ఉంది.

నిజంగా వేదాలను మానవులెవరూ రచించలేదా? అవి నిజంగానే అపౌరుషేయాలా? – ఈ విషయంపై అత్యుత్తమ సాక్ష్యాధారం, ప్రాచీన సంస్కృత సాహిత్యంలో భాగంగా ప్రత్యేకంగా ఉండే అనుక్రమణికల సాక్ష్యమే. అనుక్రమణికలు అంటే మరేమీ కాదు; ప్రాచీన వేద సాహిత్యంలోని వివిధ భాగాలకు ఒక క్రమపద్ధతిలో రాసిన విషయ సూచికలే. ప్రతి వేదానికీ ఒక అనుక్రమణిక ఉంటుంది. ఒక్కొక్కప్పుడు అంతకంటే ఎక్కువ అనుక్రమణికలు ఉంటాయి. ఋగ్వేదానికి ఏడు అనుక్రమణికలు వ్యాప్తిలో ఉన్నట్లు తెలుస్తున్నది. అందులో ఐదు శౌనకుడూ, ఒకటి కాత్యాయనుడూ, ఒకటి ఒక అజ్ఞాత రచయితా రాశారు. యజుర్వేదానికి

ఆత్రేయి, చారయణీయ, మధ్యందిన మూడు శాఖలకూ ఒక్కొక్కటి చొప్పున మూడు అనుక్రమణికలున్నాయి. సామవేదానికి రెండు అనుక్రమణికలున్నాయి. అందులో ఒకటి ఆర్షేయ బ్రాహ్మణం, రెండోది పరిశిష్ట అనే పేరు గలది. ఇక అథర్వణ వేదానికి ఒక అనుక్రమణిక ఉన్నట్టు తెలుస్తున్నది. అది "బృహత్ సర్వానుక్రమణిక"గా ప్రసిద్ధం.

ప్రొ॥ మాక్స్‌ముల్లర్ చెప్పిన దాని ప్రకారం అత్యంత సంపూర్ణమైన అనుక్రమణిక ఏదంటే, ఋగ్వేదానికి కాత్యాయనుడు వ్రాసిన సర్వానుక్రమణిక. దీని ప్రాముఖ్యం అది ఇస్తున్న ఐదు అంశాలను బట్టి తెలుస్తున్నదీ – (1) మంత్రాల (సూక్తాల) మొదటి పంక్తులు, (2) పాద సంఖ్య (3) దానిని రచించిన ఋషి పేరు, వంశం (4) అధిదేవతల పేర్లు (5) ప్రతి సూక్తానికీ వాడిన ఛందస్సు – ఇవన్నీ ఈ అనుక్రమణిక తెలుపుతుంది. సర్వానుక్రమణికను బట్టి చూస్తే ఋగ్వేద మంత్రకర్తలు ఋషులు అనే విషయం విశదమవుతుంది. అందుచేత, ఈ అనుక్రమణిక సాక్ష్యాన్ని బట్టి ఋగ్వేదం మానవులు రచించినదే అని భావించక తప్పదు. ఇతర వేదాల విషయంలో కూడా ఇదే విధంగా నిర్ణయించవచ్చు.

తాము ఆ సూక్తాలను రాశామని ఋషులు వివరిస్తున్న వచనాలు ఋగ్వేదంలో చాలా ఉండటాన్ని బట్టి అనుక్రమణికలు వాస్తవమైనవని నిరూపితమవుతున్నది. అటువంటి వచనాలు కొన్ని ఈ దిగువ చూపడమైంది :

"కణ్వులు నిన్ను ప్రార్థిస్తున్నారు. వారి ప్రార్థనలను శ్రద్ధగా ఆలకించు. అశ్వారూఢుడైన ఓ ఇంద్రా! నీ కోసం గౌతములు ఫలప్రదమైన మంత్రాలను చేయసీ."

"ఐశ్వర్యవంతులైన ఓ అశ్వినులారా! ఈ మంత్రాన్ని మానవులు మీకోసం ఫలప్రదంగా తయారుచేశారు."

"ఓ అశ్వినులారా! ప్రవర్థకమైన ఈ ప్రార్థనా మంత్రాన్ని గృత్సమదులు మీకోసం రాశారు."

"ఓ ఇంద్రా! స్వర్గాన్ని ఆశించి కుశికరుషి నిన్ను ప్రస్తుతిస్తూ ఈ మంత్రాన్ని రచించాడు."

"ఓ ఇంద్రా! సనాతనుడవూ, అశ్వాలు పూన్చేవాడవూ అయిన నీకోసం గౌతముని సంతతి అయిన నోధుడు ఈ క్రొత్త మంత్రాన్ని కూర్చాడు."

"ఓ పరాక్రమవంతుడా! ఉపకారాన్ని ఆశించి మనుషులు పనులు చేసే విధంగా నీ కొరకు గృత్సమదులు ఒక మంత్రాన్ని రూపొందించారు."

"ఋషులు ఇంద్రుని కోసం ఫలవంతమైన ఒక స్తోత్రాన్ని ఉత్పాదించారు."

"ఓ అగ్నిదేవా! నీకోసం ఈ మంత్రాలు రచింపబడ్డాయి. గోవులు, అశ్వాల సమృద్ధిలో

నీ ఔదార్యాన్ని ప్రదర్శించు."

"పవిత్ర సత్య సంభూతమైన, మహితమైన, ఈ సప్తశీర్ష మంత్రాన్ని మా తండ్రి ఆవిష్కరించాడు. సర్వజన మిత్రుడైన ఆయాస్యుడు ఇంద్రుని కీర్తిస్తూ నాలుగవ స్తోత్రాన్ని రూపొందించాడు."

"రహుగణులమైన మేము మకరంద వచస్సులతో అగ్నిని స్తుతిస్తున్నాము. నిరంతర కీర్తనంతో మేము ఆయనను శ్లాఘిస్తున్నాం."

"ఆ విధంగా ఓ ఆదిత్యులారా! జ్ఞాన సంపన్నుడైన 'ప్లాతి' కుమారుడు మిమ్మలను శోభస్కరులను చేశాడు. సనాతనుడైన 'గయ' (గయుడు) స్వర్లోక వాసులను శ్లాఘిస్తున్నాడు."

"ఎవరినైతే ఋషి అనీ, పురోహితుడనీ, పవిత్ర యాగకర్త అనీ, స్తోత్రకారుడనీ, మంత్రోచ్చాటకుడనీ అంటారో, ఎవరికి తేజోమూర్తి అయిన అగ్ని యొక్క మూడు రూపాలు తెలుస్తాయో, అతడు విశేష ఖ్యాతితో వరప్రదాయకుడుగా ప్రసిద్ధుడవుతాడు."

అనుక్రమణికలలో లభించే సాక్ష్యాధారమే కాకుండా, వేదాలు అపౌరుషేయాలనే సిద్ధాంతాన్ని అంగీకరించని ఆధారం మరొకటి ఉంది. ఋషులు సైతం వేదాలు మానవ కల్పితాలనీ, చారిత్రక గ్రంథాలనీ భావించారు. ఋగ్వేద మంత్రాలు ప్రాచీన ఆధునిక ఋషులలో భేదాన్ని గుర్తిస్తున్నాయి. అందులో ఇవి కొన్ని -

"ప్రాచీన ఋషులు, ఆధునిక ఋషులు కూడా స్తుతించదగిన 'అగ్ని', ఇక్కడకు దేవతలను తీసుకొని వస్తాడు."

"నీ సహాయం కోసం నిన్ను ఆవాహనం చేసిన ప్రాచీన ఋషులు".

"ఆధునిక ఋషినైన నా ఈ ఆదునిక మంత్రాన్ని విను."

"దప్పికగొన్న వారికి మంచినీరు వలె నిన్ను స్తుతించిన పూర్వ ఋషులకు ఆనందప్రదాతవైన ఓ ఇంద్రుడా! ఈ మంత్రంతో నిన్ను పదే పదే ఆవాహన చేస్తాను."

"ఉజ్వల జ్ఞానంగల ప్రాచీన ఋషులు పియతముడైన బృహస్పతిని తమ ముందుంచుకొన్నారు."

"ఓ మాధవా! నీ పరాక్రమాన్ని ప్రాచీనులుగాని ఆ తర్వాత మానవులుగాని, ఆధునిక మానవులలో ఎవరుగాని తెలుసుకోలేకపోయారు." ఇంద్రుని పూర్వపు ఆరాధకుల వలెనే మేము కూడా దోష రహితులమూ, అనింద్యులమూ నిరపాయులమూ అగుదుముగాక"!

"శక్తివంతుడవైన ఓ దైవమా! పాత తరాల మానవులూ, మధ్య కాలానికీ, ఆ తర్వాతి కాలాలకూ చెందిన మానవులూ నీకు మిత్రులు; అందుచేత ఓ సంస్తవనీయా! ఇక అత్యంత

ఆధునికులను గురించి ఆలోచించు."

"మన తాతతండ్రులూ, నవాగ్వా ఋషులలోని ఏడుగురూ మంత్రాలతో ఆహారార్థం అతనిని (ఇంద్రుణ్ణి) ఆశ్రయించారు."

"మా క్రొంగొత్త మంత్రంతో మహిమాన్వితుడవై మాకు వంశాభివృద్ధితో ఐశ్వర్యమూ, ఆహారమూ ప్రసాదించుదువుగాక."

ఋగ్వేదాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తే, పాత మంత్రాలకు, కొత్త మంత్రాలకు వ్యత్యాసం ఉన్న విషయం తెలుస్తుంది. అందులో కొన్నిటిని దిగువ పొందుపరచడమైంది.

"మా క్రొంగొత్త మంత్రంతో మహిమాన్వితుడవై మాకు వంశాభివృద్ధితో ఐశ్వర్యమూ, ఆహారమూ ప్రసాదించుదువుగాక."

"ఓ అగ్నీ, దేవతలకు ఈ మా క్రొంగొత్త మంత్ర నివేదనను ప్రకట పరచావా?"

"వీర్యవంతుడవూ, పురాంతకుడవూ అయిన నీవు మా కొత్త మంత్రాలతో శక్తివంత మైన దీవెనలతో మాకు ఆలంబనగా అగుదువుగాక."

"శక్తి పుత్రుడైన అగ్నికి ఆలోచనా సముద్భూతమైన వాక్కుతో ఒక కొత్త శక్తివంత మైన మంత్రాన్ని సమర్పిస్తున్నాను."

"మనోజనితమై ఉద్భవిస్తున్న ఒక కొత్త ఉద్గారాన్ని శక్తియుతుడైన రక్షకునికి సమర్పిస్తున్నాను.

"వీరుడవూ, మేఘ నిస్వనుడవూ అయిన నిన్ను ఈ కొత్త స్తోత్రం మాకు తోడ్పడేటట్లు ప్రేరేపించుగాక!"

"ప్రాచీనుల వలెనే నేను కూడా సనాతనుడవైన నిన్ను కొత్త మంత్రంతో ఉత్తేజపరచాలని కోరుకుంటున్నాను."

"కొత్త మంత్రాలు నిన్ను శ్లాఘించటానికే రూపొందించబడ్డాయి. ఈ ప్రార్థనలు నిన్ను తృప్తిపరచుగాక!"

"ఓ శోభారి! యవ్వన శోభతో, పరాక్రమంతో, తేజస్సుతో అలరారే ఒక కొత్త మంత్రంతో కీర్తించు."

"మేఘ గర్జనుడవూ వృత్రాసుర సంహారివీ అనేకమంది ప్రార్థనలు అందుకుంటున్నవాడవూ అయిన ఇంద్రా! నీ భక్త జనులలోని వారమైన మేము, అపూర్వమైన మంత్రాలను నీకు సమర్పించుకుంటున్నాము."

"ఈ సనాతన దేవతకు నా ఈ క్రొత్త ప్రార్థనను, అతడు ఇష్టపడే రీతిలో వినిపిస్తాను. అతడు మా ప్రార్థన ఆలకించుగాక!"

"అశ్వాలను, పశుగణాన్ని, ఐశ్వర్యాన్ని కోరుతూ (మమ్మల్ని సమీపించవలసిందిగా) నిన్ను ఆమంత్రిస్తున్నాము."

వేదాలు మానవకృతాలు అని రుజువు చేయడానికి ఆధారాలు ఇంత పుష్కలంగా ఉన్నప్పటికీ, వేదాలు మానవ నిర్మితాలు కావనే విపరీతమైన అభిప్రాయాన్ని బ్రాహ్మణులు అంత వృధా శ్రమతో ఎందుకు ప్రచారం చేస్తున్నారో కనుక్కోవడం ఒక చిక్కు ప్రశ్న. బ్రాహ్మణులు ఎందుకు అటువంటి అభిప్రాయాన్ని ప్రచారం చేయవలసి వచ్చింది?

ఇంతేకాకుండా, వేదాల ఆధికారికతను ఆమోదించడానికి సంసిద్ధులైన ప్రముఖ తత్వవేత్తలు సైతం వేదాలు సనాతనమైనవనిగానీ, అపౌరుషేయాలనిగానీ అంగీకరించటానికి సిద్ధంగా లేరు.

తత్వశాస్త్రంలో న్యాయపద్ధతికి (అని చెప్పబడేదానికి)వ్యవస్థాపకుడైన గౌతముడు ఏమన్నాడంటే – సూత్రాలు, ఆయుర్వేదమూ సమర్థులైన వ్యక్తుల నుండి ముందుకు సాగినట్టుగానే వేదాల ప్రామాణికత కూడా కొనసాగింది. వేదాలు సృష్టించిన వారికి సమర్థాధికారం ఉండటంవల్లా, అది సత్య ప్రబోధకం అయి ఉండడం వల్లా అందులోని పదశక్తి ఆ లక్షణమూ, స్వభావమూ కలిగి ఉంది – అన్న వివేచనతో వేదాల ప్రమాణాన్ని ఊహించాలి."

సూత్రాల కర్తృత్వమూ, ఆయుర్వేద కర్తృత్వమూ ఆధారాలుగా ఆయన ఈ విషయం విపులీకరిస్తున్నాడు. "సూత్రాలు అంటే విషం వంటి వాటిని నిష్ప్రభావం చేసే శక్తిగల వాక్యాలు అని అర్థం. ఆయుర్వేద భాగం వేదాలలోని భాగమే. ఈ రెండింటి కర్తృత్వ ప్రమాణాన్నీ సాధారణమైనదిగా ఒప్పుకున్నప్పుడు వేద లక్షణాలు కలిగి ఉండే అన్ని రచనల ఆధికారికతనూ అదే ఉదాహరణను బట్టి ఊహించవచ్చును. ఆధికారికత కనపరచేదీ, గుర్తింపు పొందినదీ ఏదైనా వేదమే అవుతుందని సూత్రీకరణను కొందరు వివరించారు. ఆ విధమైన వేద స్వభావం కలిగిన దేన్నైనా ప్రమాణంగా చెప్పుకోవచ్చును."

వేదాలు ప్రమాణాలు అని వైశేషిక పద్ధతి ఆమోదిస్తున్నది. అయితే, దాని నిర్ణయానికి ఆధారాలు ఇలా ఉన్నాయి.

1. వేదాలు బుద్ధి సూక్ష్మత గల మేధ నుండి ఉద్భవించాయి.

2. అవి దేవుని నోట వెలువడినవి. అందుచేతనే అవి ప్రమాణాలు.

కపిలుని సాంఖ్యదర్శనం వేదాలకు శాశ్వతత్వాన్ని ఆపాదించడానికి వీలులేదనే అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది. ఎందుచేతనంటే వేదాలలోని అనేక మూలమంత్రాలు అవి రచింపబడినవన్న విషయాన్ని ప్రకటిస్తున్నాయి. ఎవరో ఒక దివ్య పురుషుడు తన సంకల్ప

శక్తితో వేదాలు సృష్టించాడనే విషయాన్ని ఇది నిర్ద్వంద్వంగా నిరాకరిస్తున్నది. సాంఖ్య దర్శనం ప్రకారం వేదాలు సూర్యుని వలె స్వయం ప్రకాశకాలై స్వయం సంపూర్ణతత్వాన్ని ఎరుక పరచటమే కాకుండా - భూత భవిష్యత్తులూ ఉచ్ఛనీచాలు, దూర సమీపాలూ - వంటి అన్ని ఇతరమైన విషయాలనూ స్పష్టం చేయడంలో కూడా తమ అంతర్గత శక్తిని ప్రదర్శిస్తున్నాయి. వేదాంతంగా ప్రసిద్ధమైన తత్వపద్ధతి కూడా రెండు భిన్నాభిప్రాయాలను బలపరుస్తున్నట్లుగా ఉంది. ఇది వేదాల మూలాన్ని లేదా కారణాన్ని బ్రహ్మకు ఆపాదిస్తున్నది. ఇక్కడ 'బ్రహ్మ' అనే పదాన్ని - పరమాత్మను సూచించే (నపుంసక లింగంగా) అర్థంలో వాడారు. అంతేకాని, సృష్టికర్తగా (పుంలింగంలో) వాడలేదు. అంతే కాకుండా, వేదాల శాశ్వతత్వాన్ని గురించి స్వయం ఆధారిత కర్తృత్వాన్ని గురించి కూడా ఇది చెబుతున్నది.

వేదాలు మానవ నిర్మితాలు కావనే వాదంతో మాత్రమే బ్రాహ్మణులు తృప్తి చెంది ఊరుకోలేదు. ఇంకొంత ముందుకు సాగి భగవంతుడు కూడా వాటిని సృష్టించలేదు అని అన్నారు. పూర్వ మీమాంస కర్త జైమిని ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. తన సిద్ధాంతాన్ని బలపరచటానికి ఆయన చేసే వాదన చాలా విచిత్రంగా ఉంటుంది. ఆ వైచిత్ర్యాన్ని తెలుసుకోవాలంటే వాటిని అర్థం చేసుకోవలసిన అవసరం ఉంది.

బ్రాహ్మణ తత్వజ్ఞాన గ్రంథమైన ఈ పూర్వ మీమాంసలోనే వేదాలు అపౌరుషేయాలు అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం జరిగింది. ఆ గ్రంథం నుంచి తీసిన ఈ క్రింది ఉదాహరణలు ఆ వాదన స్వభావాన్ని విశదపరుస్తాయి.

పూర్వ మీమాంస గ్రంథ రచయిత జైమిని, మొదటగా నైయాయికుల వాదనను చర్చించి "వేదాలు పరమేశ్వర కృతాలు" అని చాటే 'నైయాయిక' వాదాన్ని స్పష్టపరుస్తున్నాడు.

మీమాంసకుల వాదం ఈ విధంగా ఉంది :

"మాట్లాడేందుకు అవసరమైన శరీర అంగాలు అంగుడు మొదలైనవి లేనటువంటి నిరాకారుడైన పరమేశ్వరుడు (భగవంతుడు) అక్షరాలను ఉచ్ఛరించలేడు. కాబట్టి వేదాక్షరాలను అతడు ఉచ్ఛరించినట్లు చెప్పడానికి వీలులేదు.

(నైయాయికులకు సమాధానం ఇచ్చే) ఈ అభ్యంతరం తృప్తికరంగా లేదు. ఎందువల్లనంటే పరమేశ్వరుడు అశరీరుడైనప్పటికీ తన లీల చేత, తనను ఆరాధించే భక్తుల కోసం, వారి ననుగ్రహించి లీలామానుష విగ్రహుడై వీటిని సృష్టించి ఉండవచ్చు గదా! ఫలితంగా వేదాలు వ్యక్తులెవ్వరూ రచించలేదనే సిద్ధాంతాన్ని బలపరచే వాదం అనిశ్చితంగా నిలిచిపోయింది."

తర్వాత మీమాంసకుల సిద్ధాంతాన్ని బలపరుస్తూ ఆయన తన వాదాన్ని కొనసాగిస్తున్నాడు.

"ఇప్పుడు నేను ఈ చిక్కులన్నిటినీ విడదీస్తాను. రుజువు చేయవలసి ఉన్న

పౌరుషేయత్వానికి (వైయక్తిక రచయిత అనే భావంలో వచ్చినది) అర్థం ఏమిటి? (1) మనలాటి మానవులు రోజూ ఉచ్చరించే విధంగానే ఒక వ్యక్తి నోటి గుండా నిరంతరాయంగా వేదాలు (వాటి ఉత్పన్నత) వెలువడ్డాయా? లేక (2) మనలాటి వ్యక్తులు ఏ ఉద్దేశంతో ఒక గ్రంథాన్ని రచిస్తారో అదే విధంగా అనేకమైన ఆధారాల ద్వారా సముపార్జించిన విజ్ఞానాన్ని వ్యక్తపరచడానికి ఇది ఒక ఏర్పాటా? ఇందులో మొదటిదే ఉద్దేశ్యమయితే, ఇక ఎటువంటి వివాదానికీ ఆస్కారం ఉండదు.

రెండవ అర్థమే ఉద్దేశించినట్లయితే నాకు కొన్ని సందేహాలున్నాయి. వేదాన్ని (1) దాని అనుమాన ప్రమాణాన్ని బట్టి ప్రమాణీకృతమైనదిగా భావిస్తున్నారా, లేక (2) అతీత సమాచార(ఆగమబలం) శక్తులవల్ల సృష్టింపబడింది కాబట్టి దానిని ప్రమాణంగా భావిస్తున్నారా, అని. ఇందులో మొదటి ప్రత్యామ్నాయం (ఎ) అంటే, ఊహాత్మకతను బట్టి వేదం ప్రామాణికతను సంతరించుకున్నదని చెప్పడం సరికాదు. ఎందుచేతనంటే, ఈ సిద్ధాంతాన్ని (ప్రమాణంతో ప్రమేయంలేని ఊహాత్మక రచనలైన) మాలతీ మాధవం లేదా అలాంటి ఇతర లౌకిక గ్రంథాలకు అన్వయిస్తే అది వీగిపోతుంది. అలా కాకుండా (బి) వేదంలో చెప్పిన విషయాలు, ప్రామాణికత గల ఇతర గ్రంథాలలోని విషయాల కంటే విశిష్టమైనవి అని అంటే ఈ వివరణ కూడా ఒక తాత్వికుని తృప్తి పరచలేదు. ఎందుకంటే, ఏ ఇతర సాక్ష్యంతోనూ ఆధారంతోనూ కూడా నిరూపించడానికి వీలుకానట్టి విషయాలను నిరూపించేవిగా వేద వాక్యాలను నిర్వచించటం జరిగింది.

ఈ వేదవాక్యాలు, ఇతర సాక్ష్యాధారాల ద్వారా రుజువు చేయగలిగిన విషయాలను రుజువు చేయడం కంటే అధికంగా మరేమీ చేయటం లేదని మనం నిరూపించగలిగితే అది ఎలా ఉంటుందంటే ఎవరైనా తన తల్లి గొడ్రాలు అని చెప్పుకున్నట్టుగా (విరుద్ధంగా) ఉంటుంది.

పరమేశ్వరుడు లీలామానుష విగ్రహుడైనాడని ఒప్పుకున్నప్పటికీ అతడు ఇంద్రియాతీతంగా వస్తువులను తెలుసుకోగలడనుకోవడం ఊహించలేని విషయం. ఎందుకంటే తన నుండి దూరంగా వుంచిన వస్తువులను, ఆ సమయంలో ప్రకృతిలోనే లేనటువంటి వస్తువులను, ఎటువంటి సాధనాలు లేకుండా ఉన్న పళంగా ఇంద్రియాతీతంగా తెలుసుకోవడం ఎలా సాధ్యం? ఆ పరమేశ్వరుని కళ్ళకూ ఇతర ఇంద్రియాలకూ మాత్రమే అలాటి జ్ఞానాన్ని పొందింపచేసే (గ్రహించగల) శక్తి ఉన్నదని భావించాలా? ఎందుచేతనంటే, ఎవరైనా తాము ఇంద్రియాల ద్వారా గ్రహించిన వాటికి సంబంధించి మాత్రమే భావనలు ఏర్పరచుకోవడం ఉంది.

సర్వజ్ఞుడైన కర్త ఒకరు ఉన్నారనే అభిప్రాయాన్ని ఖండిస్తూ గురువు (ప్రభాకర పండితుడు) ఇదే విషయాన్ని చెప్పాడు. "ఎక్కడైనా, ఏ వస్తువునైనా (చక్షురింద్రియంతో)

చూచినప్పుడు ప్రత్యేకశరీరాంగం తన క్రమపరిధిలోనే సుస్పష్టంగా ఆ వస్తువును చూడగలుగుతుంది. మరీ దూరంగా ఉన్నదానిని చూడటంలోనూ, సూక్ష్మమైన వివరాలు చూడగలగటంలోనూ దాని సంపూర్ణత కనిపిస్తుంది. అంతేగాని, ఏ అంగం కూడా తన నిర్దిష్ట లక్ష్యాన్ని మించి గ్రహించలేదు. ఉదా : ఆకారాన్ని (రూపాన్ని) చెవి ఎప్పుడూ గుర్తించలేదు.

అందువల్ల సాకారుడైన దైవం పొందిన అతీంద్రియ సమాచారమే వేదం అనడం వేద ప్రమాణాన్ని చెప్పదు."

నైయాయికులు చెప్పిన దానిని విఫలం చేయడానికి (తిరస్కరించటానికి) జైమిని చేసిన వాదనలు ఇవి. ఆటు తర్వాత, ఆయన వేదాలు దైవకృతం కావనీ అంతకంటే గొప్పవనీ చెప్పే వాదనను రూఢి పరచటానికి ఉద్యుక్తుడయ్యాడు.

ఆయన ఏమంటాడంటే -

"పైన పేర్కొన్న సూత్రంలో, పదాలకూ శబ్దాలకూ వాటి అర్థాలకూ (వాగర్థాలకు) గల సంబంధం శాశ్వతమైనదని ప్రకటించడం జరిగింది. ఈ సంబంధపు శాశ్వతత్వం, శబ్దాల - పదాల శాశ్వతత్వంపై ఆధారపడి ఉంటుందనే విషయాన్ని రుజువు చేయగోరి ఆయన ముందుగా ప్రశ్నలోని ప్రథమ భాగాన్ని వివరించటం మొదలుపెట్టాడు. అంటే, శబ్దం శాశ్వతమైనది కాదని వాదించే వారి సిద్ధాంతం, అన్నమాట."

"కొంతమంది అంటే న్యాయ వేదాంత తత్వాన్ని అనుసరించేవారు, 'శబ్దం' అనేది ప్రయత్నఫలితం అని అంటున్నారు. ఎందుకంటే అది ఒక ప్రయత్నం వల్లనే వెలువడుతుంది కాబట్టి. అది శాశ్వతమైనదే కనుక. అయితే ప్రయత్నం అవసరమయ్యేది కాదు."

"అది మార్పుకు లోనవుతుంది గనుక అది శాశ్వతమయింది కాదు. అంటే ఒక క్షణం తర్వాత అది వినిపించదు - నశించి పోతుంది గనుక." శబ్దాలను గురించి మాట్లాడేటప్పుడు, "శబ్దం చేయటం" అని మనం సాధారణంగా అంటుంటాం. శబ్దాన్ని ఉత్పత్తి చేయడం అంటే దాన్ని ప్రయత్నపూర్వకంగా చేయడమన్నమాటే గదా!".

"ఎందుకంటే, వివిధ వ్యక్తులు దానిని (శబ్దాన్ని) ఒకేసారి గ్రహించగలుగుతారు కాబట్టి. దగ్గరలోను, దూరంగాను ఉన్నవారి గ్రహణేంద్రియాలు వెంటనే దానిని గ్రహిస్తాయి గాబట్టి. ఆ శబ్దం కేవలం శాశ్వతమైనదే గనక. అయితే అలా జరగడానికి వీలుకాదు గదా!"

"ఎందుచేతనంటే, శబ్దాలకు మూల రూపమూ, మార్పు చెందిన రూపమూ కూడా ఉంటాయి. ఉదాహరణకు, 'దధి, అత్ర' అనే పదాలు కలిసి 'దధ్యత్ర'గా మారింది. మూలరూపంలోని 'ఇ'కారం నియమానుసారం 'య'కారంగా మారింది. కాబట్టి మార్పుకు లోనయ్యే ఏ పదార్థమైనా శాశ్వతమైనది కాదు."

"ఎందుచేతనంటే, ధ్వనులు, ఉత్పత్తి చేసే వారి సంఖ్యను బట్టి హెచ్చుతూ ఉంటాయి. అందువల్ల శబ్దం, స్వతస్సిద్ధంగా ఏర్పడిందేగాని మానవయత్నం వల్ల సృష్టింపడినది కాదు – అనే మీమాంసకుల అభిప్రాయం పొరపాటు అవుతుంది. ఆవిష్కరించే వారి సంఖ్య అసంఖ్యాకంగా ఉన్నప్పటికీ, వారు వ్యక్తపరిచే వస్తువును పెంచలేదు. ఎలాగంటే, ఒక జాడీని వేయిదీపాల వెలుతురులో చూపినా, దాని పరిమాణాన్ని పెంచడం సాధ్యపడదు గనుక."

ధ్వనులు ఉచ్చరించేవారు కేవలం ఆవిష్కర్తలేగాని సృష్టికర్తలు కారు అనే మీమాంసకుల సిద్ధాంతంపై వచ్చిన ఈ ఆక్షేపణలకు జైమిని సమాధానమిస్తున్నాడు.

జైమిని ఏమంటున్నాడంటే –

"అయితే ఈ రెండు సిద్ధాంతాల ప్రకారం, అంటే శబ్దం సృష్టింపబడుతుందని నమ్మేవారు, అది కేవలం ఆవిష్కరింపబడుతుందని విశ్వసించేవారు – ఈ ఇద్దరి అభిప్రాయాల ప్రకారమూ కూడా అది వినిపించేది ఒక లిప్తకాలంపాటు మాత్రమే. అయితే ఈ రెండు అభిప్రాయాలలో ఆవిష్కరణ సిద్ధాంతం సరియైనదని తదుపరి సూత్రంలో చూపడం జరిగింది."

"శబ్దానికి సదా శాశ్వత అస్తిత్వం ఉంది. అటువంటి శబ్దం ఏదైనా ఒక ప్రత్యేక సమయంలో వినపడకపోవచ్చు. దానికి కారణం, దాన్ని ఉచ్చరించే వ్యక్తికి తన లక్ష్యంతో అంటే శబ్దంతో, సంబంధం లేకపోవడమే! శబ్దం శాశ్వతమయింది. ఎందుచేతనంటే – ఉదాహరణకు, 'క' అనే అక్షరం తీసుకుందాం. దాని ఉచ్చారణ ఎప్పుడూ ఒకే విధంగా వింటూ ఉంటాం. కాబట్టి మనం దాన్ని గుర్తిస్తాం. ఇది అదే అని చెప్పడానికి ఇదే సులభమైన పద్ధతి. శబ్దగ్రహణానికి అడ్డు తగిలే నిశ్చల వాతావరణం వ్యక్తి నోటి నుండి వెలువడే గాలి కదలికల సంయోజన విసంయోజనల వల్ల తొలగింపబడుతుంది. ఆ విధంగా (కంటికి కనబడకపోయినా ఎల్లప్పుడూ అస్తిత్వంలో వుండే) శబ్దం గ్రహణయోగ్యమవుతుంది. దాని మార్పుకు సంబంధించి వచ్చిన ఆక్షేపణకు ఇది సమాధానం."

"శబ్దాలు 'చేయుడం' అనే మాటకు కేవలం వాటిని వినియోగించడం లేదా పలకడం అని అర్థం."

"ఒక సూర్యుడు ఏకకాలంలో వివిధ వ్యక్తులకు కనపడే విధంగానే శబ్దం కూడా ఏకకాలంలో అందరకూ వినపడుతుంది. సూర్యుని వలెనే శబ్దం ఎంతో విస్తృతమైనది. అది ఒక చిన్న వస్తువు కాదు. అందుచేత ఒకరికొకరు దూరంలో ఉన్నప్పటికి వివిధ వ్యక్తులకు ఒకే విధంగా గ్రాహ్యమౌతుంది."

"10వ సూత్రం క్రింద పేర్కొన్న ఉదాహరణ అంటే 'దధ్యత్ర'లోని 'ఇ' స్థానంలో వచ్చిన 'య' అన్నది 'ఇ'కి వచ్చి మార్పు కాదు. అది ఒక ప్రత్యేక అక్షరం. దాని ఫలితంగా శబ్దం

మార్పు చెందలేదు."

"అనేకులు కలిసి ఒకే అక్షరాన్ని ఉచ్చరించినపుడు ధ్వని పెరుగుతుందే కాని అక్షర స్వరూపం (శబ్దం) మారదు. ఈ ధ్వని అనేది వివిధ కోణాల నుంచి శ్రోత చెవిలోనికి ఒకేసారి ప్రవేశించే వాయు తరంగాల సంయోజన వియోజనల వల్ల కలుగుతుంది. ఈ తరంగాల మూలంగానే ధ్వని పెరుగుదల జరుగుతుంది."

"శబ్దం శాశ్వతమైనది. ఎందుచేతనంటే, దాని ఉచ్చారణ శ్రోతలకు ఒకే అర్థాన్ని స్ఫురింపజేస్తుంది. అది శాశ్వతమైంది కాని పక్షంలో, శ్రోత దాని భావాన్ని తెలుసుకొనేంతవరకు కొనసాగదు. అలా కొనసాగకపోతే అది అతనికి వినిపించదు, దాని ఉనికి నశించిపోతుంది."

"శబ్దం శాశ్వతమైనది. ఎందుకంటే, దానిని ఎంతమందైనా ఏ సందర్భంలో అయినా సరిగ్గాను, ఒకే విధంగాను అర్థం చేసుకోగలుగుతారు కాబట్టి. ఇంతమందీ పొరబడడం అనేది ఊహాతీత విషయం కూడా."

"గో" అన్న శబ్దాన్ని పదిసార్లు ఉచ్చరించినపుడు పదిసార్లూ ఉచ్చరించినది ఒక 'గో' శబ్దమే అని శ్రోతలు అంటారు గాని, అవి పది మాటలు అని చెప్పరు. 'శబ్దం' శాశ్వతత్వానికి ఈ విషయాన్ని కూడా ఋజువుగా చూపించవచ్చు.

"శబ్దం శాశ్వతమైనది. ఎందుచేతనంటే దాని వినాశనాన్ని ముందుగా గ్రహించటానికి ఎటువంటి ఆధారమూ లేదు."

"కాని శబ్దం అనేది వాయు సంయోజనం వల్ల పుడుతుంది కనుక, వాయు వికృతి అని చెప్పవచ్చు. శబ్దస్థితిని బట్టి గాలి వస్తుందని "శిక్ష" (ఉచ్చారణ గురించి చెప్పే వేదాంగం) చెబుతున్నది కనుకా ఆ విధంగా అది గాలి నుండి పుడుతుంది గనుకా – అది శాశ్వతమయినది కావడానికి వీలులేదు."

ఈ సమస్యకు సమాధానం 22వ సూత్రంలో ఇచ్చారు.

"శబ్దం అనేది వాయువికృతి (రూపాంతరం) కాదు. అదే అయినట్లయితే, శ్రవణేంద్రియానికి గ్రహణయోగ్య వస్తువు అంటూ ఏదీ ఉండేది కాదు. స్పర్శించటానికి సాధ్యం కాని, శబ్దానికి మాత్రమే స్పందించే గుణం గల శ్రవణేంద్రియం గాలిలో వచ్చే ఎటువంటి వికృతులనూ (స్పర్శించదగినదని నైయాయికులు అంటారు) గ్రహించగలిగి ఉండేది కాదు."

"శబ్దం శాశ్వతత్వాన్ని వేదంలో కనిపించే వాదన ద్వారానే నిరూపించవచ్చును. శాశ్వత స్వరంతో, ఓ విరూపా... అనే ఈ వాక్యం వేరే విషయాన్ని ఉద్దేశించినదైనప్పటికీ భాష శాశ్వతత్వాన్ని వెల్లడిస్తున్నదనడంలో సందేహం లేదు. అందుచేత శబ్దం శాశ్వతం (నిత్యం)

అవుతున్నది.

వేదాలు నిత్యాలనీ వాటిని మానవుడే కాదు, దేవుడు సైతం సృష్టించలేదనీ తన సిద్ధాంతాన్ని బలపరుస్తూ జైమిని చేసిన వాదన ఇది. ఆయన సిద్ధాంతానికి గల యీ ఆధారాలు చాలా సామాన్యమైనవి.

**మొదటిది :** భగవంతునికి శరీరం లేదు. అంగుడు లేదు. అందుచేత వేదాలను ఉచ్చరించలేడు.

**రెండవది :** వేదాలలోని విషయాలు మానవేంద్రియ గ్రహణాతీతాలు. అందువల్ల ఒకవేళ భగవంతునికి శరీరం ఉన్నదనుకున్నప్పటికీ ఇంద్రియాలు గ్రహించలేని విషయాలను, (శరీరధారి) భగవంతుడు కూడా తెలుసుకోలేడు గదా!

**మూడవది :** ఒక శబ్దానికి, దాని అర్థానికి మధ్య ఉండే సంబంధం శాశ్వతమైనది.

**నాల్గవది :** శబ్దం శాశ్వతమైనద (నిత్యమైనది).

**అయిదవది :** శబ్దం శాశ్వతమైనది కనుక, ఆ శబ్దాలతో ఏర్పడే పదాలు కూడా శాశ్వతమైనవే అవుతాయి.

**ఆరవది :** శబ్దాలు శాశ్వతమయినవి కనుక వేదాలు శాశ్వతమైనవి అవుతాయి. వేదాలు శాశ్వతమయినవి కనుక అవి మానవుడు కాని భగవంతుడు కాని సృష్టించినవి కాదు.

పైదంతా జైమిని వాదం. ఈ చర్చ గురించి ఎవరేమి చెప్పగలరు? ఇంతకంటే అర్థం లేని వాదన మరేదైనా ఉంటుందా? మానవేంద్రియాలకు అతీతమైనది ఏదో వేదాలలో ఉంది అంటే ఎవరు ఆమోదిస్తారు? ఒక పదానికీ, దాని అర్థానికీ మధ్య శాశ్వతమైన సంబంధం ఉన్నదీ అంటే ఎవరు ఆమోదిస్తారు? శబ్దం అనేదాన్ని ఎవరూ సృష్టించలేదనీ, ఎవరూ దాన్ని ఆవిష్కరించలేదనీ అది శాశ్వతమయినదనీ ఎవరు ఆమోదించగలరు?

ఇలాంటి అర్థరహితమైన చర్చావాదాలు ఉండగా, బ్రాహ్మణులు ఇలాంటి విషమ నిర్ణయాన్ని ఖాయం చేసే అతి సాహస యత్నం ఎందుకు చేశారు? అని అడగవలసి వస్తుంది. దానివల్ల వారు, ఏ ప్రయోజనం పొందాలని కోరుకున్నారు? బ్రాహ్మణులను అందరికీ అధినాధులుగా చేసే చాతుర్వర్ణ సిద్ధాంతానికి వేదాలు వ్యాఖ్యాన ప్రాయాలైనందువల్లనా?

**అనువాదం : ఎస్.వి. రమణరావు**

చిక్కుముడి : 6

# వేద విషయాలు – వాటిలో నైతిక ఆధ్యాత్మిక విలువలు ఏమైనా ఉన్నాయా?

వేదాలకు విధేయంగా ఉండాలని అవి అపౌరుషేయాలనీ అంగీకరించాలంటే అవి బోధించే విషయాలలో నీతి సంబంధమైన ఆధ్యాత్మిక పరమైన విలువ ఏదైనా ఉండాలి. జైమినిలాంటి ఒక తత్వవేత్త వచ్చి ఒక గుడ్డపేలికను చూపి దానికి కట్టుబడి ఉండాలనీ, అది అపౌరుషేయమనీ వత్తాసు పలికినంత మాత్రాన ఆ గుడ్డపేలికకు ఎవరైనా కట్టుబడి ఉంటారా? అది అమోఘమైనది అవుతుందా? వేదాలలో ఏదైనా నీతి సంబంధమైన ఆధ్యాత్మికమైన విలువ ఉన్నదా? వేదాలు అపౌరుషేయాలని భావించే ప్రతి హిందువూ ఈ ప్రశ్నను పరిశీలించి తీరాలి.

వేదాలలో ఆధ్యాత్మికమైన విలువలు ఏవీ లేవని ఆధునిక రచయితలు అభిప్రాయపడ్డారు. ఇందుకు ఉదాహరణగా ప్రొఫెసర్ మూయిర్ అభిప్రాయాన్ని తీసుకోవచ్చు. ప్రొఫెసర్ మూయిర్[1] ప్రకారం :

ఈ రచనల మొత్తం లక్షణమూ, అవి ఎటువంటి పరిస్థితులలో ఉద్భవించాయో తెలిపే ఆంతరంగిక సాక్ష్యాధారాలూ చూస్తే, అవి వాటిని మొదట గానం చేసిన ప్రాచీన గాయక కవుల వ్యక్తిగతమైన ఆకాంక్షలు, అనుభవాల సహజ వ్యక్తీకరణలు, అని తెలుస్తుంది. అవి అంతకంటే వేరేమీ కాదని కచ్చితంగా చెప్పవచ్చు. ఆ పాటలలో, ఆర్య ఋషులు, తమ ప్రాచీన దేవతల ఘనతను స్తోత్రం చేశారు (అదే సమయంలో వారికి ఆమోదయోగ్యమైన నైవేద్యాలను

---

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు, సం. 3, పుట చెప్పలేదు.

సమర్పిస్తూ వారిని సంతుష్టులను చేసుకోవటానికి ప్రయత్నించారు). సాధారణ మానవులు వాంచించే ఆశీర్వాదాలను – ఆరోగ్యం, సౌభాగ్యం, దీర్ఘాయుష్షు, పశుసంపద, సంతానం, తమ శత్రువులపై విజయం, పాపాన్ని క్షమించటం, కొన్ని సందర్భాలలో స్వర్గసౌఖ్యం వంటివి వారి (ఆ దేవతల) నుంచి కోరుకునేవారు."

విదేశీ పండితులంతా పక్షపాతంతో వ్యవహరిస్తారనీ, అందుచేత వారి అభిప్రాయాలను అంగీకరించనవసరం లేదనీ ఎవ్వరైనా అభ్యంతర పెట్టవచ్చు. అదృష్టవశాత్తూ మనం పూర్తిగా విదేశీయుల అభిప్రాయాల మీదనే మొత్తం ఆధారపడిలేము. దేశీయ సిద్ధాంతాలకు (ఆలోచనా ధోరణికి) చెందిన నాయకులలో ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చినవారు ఉన్నారు. ఇందులో ప్రసిద్ధులైనవారు చార్వాకులు.

చార్వాకుని వ్యతిరేకత ఈ క్రింది ఉటంకింపులో కనిపిస్తుంది. వైదికులకు వ్యతిరేకంగా ఆయన చేసే వాదన ఈ విధంగా ఉంది.

"భవిష్యత్ ప్రపంచంలో (మరో లోకంలో) ఆనందం అనబడేది ఏదీ ఉండదని మీరు అభ్యంతరపెడ్తే, మరి ఎంతో ధనవ్యయంతోనూ, శారీరక శ్రమతోనూ అనుభవంతోనూ చేయవలసిన అగ్నిహోత్రాది యజ్ఞాలన్నీ ఎవరు చేస్తారు? మీ అభ్యంతరం దీనికి సరియైన రుజువుగా అంగీకరించలేము, ఎందుకంటే అగ్నిహోత్రాది కర్మానుష్ఠానాలు జీవనాధారాలుగా మాత్రమే ఉపయోగపడుతున్నాయి. వేదం – అసత్యం, స్వ విరుద్ధత (ఆత్మవైరుధ్యం), పునరుక్తి అనే మూడు దోషాలతో కళంకితమయిపోయింది. అంతేకాకుండా, వైదికపండితులమని చెప్పుకొనే వంచకులు పరస్పర విధ్వంసకారులవుతున్నారు. కర్మకాండను ప్రమాణంగా అంగీకరించేవారు జ్ఞానకాండ ప్రమాణాన్ని త్రోసిపుచ్చుతున్నారు. జ్ఞానకాండను ప్రమాణంగా అంగీకరించే వారు కర్మకాండ ప్రమాణాన్ని త్రోసిపుచ్చుతున్నారు, చివరకు ఈ మూడు వేదాలూ మోసగాళ్ల పరస్పర విరుద్ధమైన సందర్భశుద్ధి లేని మాటలుగా అయ్యాయి. ఈ మేరకు ఒక ప్రసిద్ధమైన లోకోక్తి ఇలా ఉంది –

"అగ్నిహోత్రం, వేదత్రయం, సన్యాసి, మూడు కట్టెలు, విబూది రాసుకోవటం ఇవన్నీ మగటిమీ, లోక జ్ఞానమూ లేని వారి జీవనాధారాలని బృహస్పతి అన్నాడు."

బృహస్పతి కూడా ఇదే ఆలోచనా ధోరణికి చెందినవ వాడు. వేదాల పట్ల వ్యతిరేకత ప్రకటించడంలో చార్వాకుని కంటే బృహస్పతి ఎక్కువ ధైర్యంగా సాహసంగా కనిపిస్తున్నాడు. మాధవాచార్యులు చెప్పిన ప్రకారం బృహస్పతి ఇలా వాదించాడు[1] :

"స్వర్గమూ లేదు, చరమమైన మోక్షమూ లేదు, మరో లోకంలో ఆత్మ అనేదీ ఏదీ లేదు. నాలుగు వర్ణధర్మాలు నాలుగు ఆశ్రమాల క్రమధర్మాలు ఇవేవీ వాస్తవంగా ఫలితాన్ని

1. సర్వదర్శన సంగ్రహం. పుట సంఖ్య లేదు.

[illegible] – అగ్నిహోత్రం, మూడు వేదాలు, సన్యాసి మూడు దశలూ విబూది రాసుకోవటం..... ఇవన్నీ జ్ఞానమూ మగటిమీ లేనివాళ్లకు ప్రకృతి కల్పించిన జీవనాధారాలు. జ్యోతిష్టోమ క్రతువులో బలి ఇచ్చిన (చంపబడిన) జంతువు సరాసరి స్వర్గలోకానికి వెళ్తే మరి యజ్ఞం చేసే వ్యక్తి తన తండ్రినే సమర్పించవచ్చు (సరాసరి స్వర్గానికి పంపవచ్చు) కదా!

శ్రాద్ధం ద్వారా చనిపోయిన వారిని తృప్తిపరచవచ్చు ననుకొంటే, ఇక్కడ కూడా (ఈ లోకంలో) దూర ప్రయాణీకులకు దారిలో బత్యం కింద ఏమీ ఇవ్వనక్కరలేదు.

ఇక్కడ మనం శ్రాద్ధం పెడితే అక్కడ స్వర్గలోకంలో ఉన్నవారు అందుకొని తృప్తి పడతారంటే, ఇంటిపై భాగాన నిలుచుని ఉన్న వారికి కిందనే ఆహారం పెట్టవచ్చు గదా!

జీవితం ఉన్నంతకాలం మనిషిని ఆనందంగా ఉండనీ. అప్పుల పాలై పోయినా సరే నేయి (అప్పు కూడు) తింటూ బ్రతకనీ.

ఒకసారి శరీరం బూడిద అయిపోయిన తర్వాత మళ్లీ అది తిరిగి ఎలా వస్తుంది?

శరీరం వదిలినవాడు పరలోకానికి వెళ్లినా, అతడు మళ్లీ తన బంధువుల ప్రేమకోసం, ఆప్యాయత కోసం అశాంతితో తిరిగి ఎందుకు రావటం లేదు?

ఇవన్నీ ఆలోచించి చూస్తే దీనిని బ్రతుకుతెరువుగా ఇక్కడి బ్రాహ్మణులు ఏర్పరచు కున్నారని విదితమవుతున్నది. ఈ కర్మకాండ అంతా చనిపోయినవారికి. దీని ఫలం ఎక్కడా కూడా కనపడదు. ఈ మూడు వేదాల రచయితలూ కూడా విదూషకులూ, వంచకులూ, పిశాచాలూను.

జర్భరి తుర్భరీ పండితుల ప్రసిద్ధి గాంచిన సూత్రాలు – అశ్వమేధ క్రతువులో రాణికి విధించిన బూతు నియమాలు – ఇవన్నీ విదూషకులు (హాస్యగాళ్లు) కనిపెట్టినవి. పూజారులకిచ్చే వివిధ రకాల బహుమానాల జాబితా కూడా, వారు రూపొందించినదే.

అలాగే మాంస భక్షణం కూడా నిశాచరులు ప్రతిపాదించినదే.

చార్వాక, బృహస్పతుల ఈ అభిప్రాయాలు అంగీకారయోగ్యాలు కావు అని అనుకుంటే వీటికి ఇంకా ఎన్నో ఇతర సాక్ష్యాలున్నాయి. ఈ సాక్ష్యాధారాలు న్యాయ, వైశేషిక, పూర్వ ఉత్తర మీమాంస వంటి వివిధ దర్శన శాస్త్ర గ్రంథాల్లో పొందు పరచబడి ఉన్నాయి. వేదాల ఆధిక్యతను ఉద్ఘాటించే ముందు తమ ప్రతిపక్షుల వాదాలను ఉటంకించటంలో ఈ శాస్త్ర గ్రంథ కర్తలు తీసుకున్న జాగ్రత్త ప్రశంసనీయమైనది. వీటి ద్వారా మనం రెండు విషయాలు నిరూపించే వీలు కలుగుతున్నది. (1) వేదాలను ప్రామాణిక గ్రంథాలుగా గుర్తించడాన్ని సమ్మతించని ఒక దార్శనిక భావన ఉండేదని, (2) ఆ దార్శనికుల అభిప్రాయాలను తప్పనిసరిగా పరిగణనలోకి తీసుకోవలసినంత గౌరవనీయ వర్గంగా వారు ఉండేవారనీ. న్యాయ పూర్వ మీమాంసలలో

ఉటంకించబడిన వ్యతిరేక వర్గీయుల అభిప్రాయాలను కింద పొందు పరుస్తున్నాను.

న్యాయదర్శన ప్రణేత గౌతముడు వేదాల ఆధిక్యతా సిద్ధాంతాన్ని సమర్థించాడు. తన వ్యతిరేకుల వాదనలను కిందివిధంగా క్రోడీకరించాడు.[1]

"అసత్యం స్వీయ వైరుధ్యం పునరుక్తి అనే లోపాలున్న కారణంగా వేదాలలో ప్రామాణికత లేదు. దృశ్యమానమైన పదార్థాలకు భిన్నమైన శాబ్దిక సాక్ష్యానికి (అంటే వేదానికి) ప్రామాణికత లేదు. ఎందువల్ల? ఎందుకంటే దానిలో అసత్యం మొదలైన లోపాలున్నాయి గనుక."

ఈ లోపాలలో అసత్యానికి నిదర్శనంగా కొన్ని సందర్భాలలో పుత్రుని కోసం యజ్ఞం చేసే కార్యక్రమాల వంటివి (పుత్రకామేష్టి మొ॥నవి) ఫలప్రదం కాకపోవటాన్ని చెప్పవచ్చు. ముందుగా చేసిన ప్రకటనకూ ఆ తర్వాత చేసిన ప్రకటనకూ మధ్య అసంగతి ఉండటాన్ని స్వీయ (పరస్పర) విరుద్ధమైన భావనగా చెప్పవచ్చు. ఈ స్వీయ అసంగతత్వానికి వేదం నుంచి కొన్ని ఉదాహరణలు – "అతడు సూర్యోదయం వేళ యజ్ఞం చేస్తాడు"; "అతడు సూర్యోదయం కాకముందే యజ్ఞం చేస్తాడు", "అతడు యజ్ఞం చేశాడు." – (ఈ వాక్యానికి ముగింపు పదాలను వివరించలేనన్నాడు మూయిర్). "సూర్యోదయానికి ముందు యజ్ఞం చేసిన వాని నైవేద్యాన్ని కపిల వర్ణంగల శునకం (?) ఎత్తుకు పోతుంది." "యజ్ఞం చేసినవాడి (నైవేద్యాన్ని)ని ఈ ఇద్దరూ తీసుకుపోతారు." ఇక్కడ యజ్ఞాన్ని ఉద్దేశించి వాడిన పదాలకు అటువంటి క్రతువులు గొప్ప విపత్కర ఫలితాలను కొని తెస్తాయని అధిక్షేపణ చేసే పదాలకు మధ్య వైరుధ్యం లేదా అసంగతి గోచరిస్తుంది. అట్లాగే అర్థ పునరుక్తి పదాడంబరాల కారణంగా కూడా వేదాలకు ప్రామాణికత లోపించిందని చెప్పవచ్చు. ఎందుకంటే "అతడు మొదటి దానిని మూడుసార్లు తిరిగి చెపుతాడు. చివరిదాన్ని మూడుసార్లు తిరిగి చెపుతాడు...." వంటి వాక్యాలు గమనిస్తే పునరావృతమైన అర్థాలతో భావాలతో వీటికి పునరుక్తి దోషం కలిగిందని చెప్పవచ్చు. ఈ ప్రత్యేక వాక్యాలకు ప్రామాణికత లేనందువల్ల నమూనా వాక్యం ద్వారా వేదం మొత్తం పరిస్థితి ఇదే అన్న విషయానికి సాక్షీభూతమవుతుంది. దీనికి కారణం ఈ వేదంలోనే ఇతర భాగాలు రచించిన రచయిత ఒకరే కావటం, లేదా ఇతర భాగాలు కూడా వీటిలాంటి లక్షణాలే కలిగి ఉండటం వంటివే.

జైమిని మహర్షి విషయానికి వస్తే ఆయన వేదాలను వ్యతిరేకించేవారు చెప్పే సారాంశాన్ని తన పూర్వ మీమాంసలోని మొదటి భాగంలోని 28, 32 సూత్రాల ద్వారా ఇట్లా తెలియజేశాడు.

"28వ సూత్రంలో – వేదాలు శాశ్వతం కాదు. దీనికి కారణం వీటిలో శాశ్వతం కాని వ్యక్తుల (అంటే పుట్టుక చావులకు అతీతం కానివారు) ప్రస్తావన కనపడుతుంది. దీనికి ఉదాహరణ "బబర ప్రవాహని ఆశించాడు." "కుసుర్వింద ఔద్దాలకి ఆశించాడు."

ఇవి ఉటంకించబడిన వేద భాగాలను బట్టి చూస్తే (ఈ వాక్యాలు) ఆ వ్యక్తుల జననానికి ముందు ఉండి ఉండటానికి వీలులేదు. అంచేత ఈ వాక్యాలకు ఒక ఆరంభం ఉన్నదని స్పష్టమవుతున్నది. ఈ విధంగా అశాశ్వత విషయాల గురించి ప్రస్తావించే ఈ వేదాలు మానవులు సమీకరించినవే అని నిరూపితమవుతున్నది.

32వ సూత్రం ఈ విధంగా చెప్తున్నది.

'అనంతమైన అనబంద్ధమైన అవాస్తవాలతో కూడిన ఈ వేదాన్ని విధుల ఆచరణకు రూపకల్పనగా ఎట్లా పేర్కొనటం? అట్లాంటి అసంబద్ధతకు ఉదాహరణలు – "పాదరక్షలు, దుప్పటి ధరించిన ఒక ముసలి ఎద్దు ద్వారం దగ్గర నిలుచుని ఆశీస్సులు ఆలపిస్తున్నది"; "సంతానం కావాలనుకునే ఒక బ్రాహ్మణ స్త్రీ అడుగుతున్నది – ఓ రాజా! అమావాస్యనాడు రతిక్రీడ చేయటంలోని అర్థం ఏమిటో వివరించండి' అని; "గోవులు యజ్ఞాన్ని నిర్వహించాయి" లాంటి వాక్యాలు.

నిరుక్త గ్రంథ రచయిత యాస్కుడు కూడా ఇదే అభిప్రాయం వెలిబుచ్చాడు. "..... వెనకటి భాగంలో పేర్కొన్న నాలుగు రకాల పద్య పాదాలలో (అ) భగవంతుడు లేడని సూచించేవి, (ఆ) భగవంతుడు ఉన్నాడని ప్రకటించేవి, (ఇ) ఆరాధకులు ఉండి భగవంతుడు లేడని సూచించేవి అసంఖ్యాకాలు కాగా (ఈ) వక్తను సూచిస్తున్నవి చాలా అరుదు. అట్లాగే ఆశీర్వచనాలు పొందడం కోసం కాకుండా నిస్స్వార్థంగా భగవంతుని స్తుతించే సందర్భాలు కూడా కనబడతాయి. దీనికి ఉదాహరణ – "ఇంద్రుడి వీరోచిత కార్యాలను నేను ప్రకటిస్తున్నాను. (ఋ. 1-32) మొదలైనవి. అట్లాగే ప్రస్తుతించకుండానే ఆశీస్సుల కోసం విన్నపాలు చేసే సందర్భాలు – "నేను నా కళ్ళతో చక్కగా చూడవచ్చా"; "నా ముఖాన్ని కాంతివంతంగా ఉంచు, నా చెవులతో బాగా విననీ"; వంటివి. ఇలాంటివి అథర్వ, యజుర్ వేదాల్లోనూ సిద్ధాంతాలలోనూ తరచుగా కనిపిస్తాయి. అట్లాగే మనకు ఋగ్వేదంలో ఒట్లూ, ప్రమాణాలూ, శాపనార్థాలూ కూడా కనబడతాయి. ఉదా : "నేనే యాతుధానుణ్ణయితే ఈరోజే మరణిస్తాను" (ఋ. Vi-104-14). అట్లాగే కొన్ని ప్రత్యేక పరిస్థితులను వివరించే శ్లోకాలు కూడా గమనించవచ్చు. ఉదా : "అపుడు మృత్యువూ లేదు అమరత్వమూ లేదు. (ఋ. X-129-2) మొదలైనవి. చాలా చోట్ల, కొన్ని పరిస్థితుల ద్వారా ఉత్పన్నమయ్యే శోకస్థితి వర్ణనలు కనిపిస్తాయి. ఉదా : "ఆ సుందరుడు (భగవానుడు) అంతర్ధానమై తిరిగిరాడు..." (ఋ X-95-14).

కొన్నిచోట్ల నిందలు, ప్రశంసలు కూడా కనిపిస్తాయి. ".... ఒంటరిగా తినే మనిషి పాపం చేసినవాడవుతాడు." (ఋ X-117-6). అలాగే పాచికల గురించి చెప్పే శ్లోకంలో జూదం గురించిన అభిశంసనం ఉంది. వ్యవసాయాన్ని ప్రశంసించటమూ కొన్ని శ్లోకాలలో చూడవచ్చు. ఈ విధంగా ఋషుల శ్లోకాలు (మంత్రాలు) పలు విధాలు. యాస్కుడి మాటల్లో

చెప్పాలంటే, "ప్రతి ప్రత్యేక మంత్రంలోనూ ఒక రుషి తాను కోరుకున్న దానికోసం దాని యొక్క అధి దైవతాన్ని ఉద్దేశించి ప్రార్థన చేసేవాడు అని స్పష్టమవుతుంది."

పైన ఉదహరించిన అంశాలు వేదాలకు నైతిక ఆధ్యాత్మిక విలువలు లేవన్న విషయాన్ని నిరూపించటానికి సరిపోవు అని అనుకుంటే మరికొన్ని అంశాలను కూడా పేర్కొనవచ్చు.

నైతికతకు సంబంధించినంతవరకు ఋగ్వేదంలో చర్చ అతి స్వల్పంగా కనబడుతుంది. నైతిక జీవితానికి సంబంధించి అందులో మంచి ఉదాహరణలు కూడా కనిపించవు. పైపెచ్చు అందుకు భిన్నంగా ఉన్న ఉదాహరణలు మూడు చూడవచ్చు. వీటిలో మొదటిది అన్నాచెల్లెళ్ళైన యమ యమిల మధ్య జరిగిన సంభాషణ.

యమి – నా మిత్రుణ్ణి నేను మైత్రికి ఆహ్వానిస్తున్నాను. విశాలమైన నిర్జనమైన సముద్రాలను దాటి వచ్చిన మేధోవంతుడవైన అద్భుత లక్షణాలు కలిగిన నీవు నీ సంతానాన్ని ఈ క్షేత్రంలో ఉంచు (దువుగాక).

యముడు – నీ మిత్రుడు కోరుతున్న మైత్రి ఇలాంటిది కాదు. (ఇది నిషిద్ధం). ఎందుకంటే,(మన) వంశమూలం ఒకటే. రూపం మాత్రం వేరు. భిన్నమైనది. అసురపుత్రులైన వీర కుమారులు ఘనకీర్తి వంతులై స్వర్గరక్షకులుగా ఉన్నారు.

యమి – మర్త్యులకు నిషిద్ధమైన ఈ కలయికలో అమరులు సంతోషం పొందుతారు. నీ మనస్సు నా మనస్సుతో కలవనీ. అందరికీ మూలపురుషుడైన సృష్టికర్త తన కుమార్తెకు భర్త అయినట్టే నీవు నా శరీరాన్ని అనుభవించుదువుగాక.

యమ – ఇంతకు ముందు జరిగినది మనం తిరిగి చేయటం లేదు. ఎందుకంటే ఇప్పుడు ఒక సత్యాన్ని నమ్ముతూ మనం మళ్ళీ దానికి విరుద్ధంగా(అసత్యం కానిదాన్ని) ఎట్లా ఆచరించగలం? గంధర్వుడు (సూర్యుడు) గగన మండలంలో ఉన్నాడు. నీరు అతని వధువు. ఆమె మన ఉమ్మడి తల్లి. వివాహ సంబంధం వల్ల ఏర్పడ్డ దగ్గరి బంధువు.

యమి – సర్వజ్ఞుడూ సృష్టికర్తా అయిన త్వష్ట్రి మనిద్దర్నీ భార్యాభర్తలుగా గర్భంలోనే మలచాడు. ఆయన కార్యాన్ని ఎవరూ భగ్నం చేయలేరు. భూమ్యాకాశాలకు మన ఈ కలయిక తెలుసు.

యమ – అతని తొలినాటి అస్తిత్వం గురించి ఎవరికి తెలుసు. ప్రత్యక్షంగా ఎవరు చూశారు? ఇప్పుడు ఎవరు చెప్పగలరు. మిత్రావరుణుల ఆవాసం విస్తృతమైనది. నీవు చెప్పిన దానికి మనుష్యులకు నరకవాస శిక్ష పడుతుంది.

యమి – యముని మీది వాంఛ, అతనితో ఒకే శయ్యపై పడుకోవాలనే కోరిక నన్ను (యమిని) ఆవహించింది. భార్య తన భర్తకు సర్వం అర్పించినట్టు నేనతనికి సర్వం అర్పిస్తాను.

శకటానికి ఉండే రెండు చక్రాలలాగ మనం కలిసి ఒకేసారి శ్రమిద్దాం. సంయోగంలో వివశుల మవుదాం.

యమ – దేవతల గూఢచారులు నిరంతరం కనులైనా మూయకుండా అవిశ్రాంతంగా భూమిపై తిరుగుతూ ఉంటారు. వారు ఇవన్నీ గమనిస్తుంటారు. ఓ వినాశకారిణీ! నాతో తప్ప వేరే ఎవరితోనైనా కలువు. శకటం రెండు చక్రాల్లాగా మీరు వివశులు కండి.

యమి – యముని కోసం ఆరాధకులు రాత్రింబవళ్ళు యజ్ఞాలు నిర్వహించెదరు గాక. అతనిపై సూర్యనేత్రం పదే పదే పడుగాక. అతని కోసం సజాతీయులైన రాత్రి పగలు, భూమి స్వర్గం ఐక్యమొందుగాక. యమునితో బాంధవ్యం పెంచుకోకుండా యమి ఉండుగాక.

యమ – సోదరి తన సోదరునిగాక ఇతరుని భర్తగా ఎంచుకునే యుగాలు రానున్నాయి. నన్నుగాక మరొకరిని భర్తగా ఎన్నుకొని ఆ సహచరుని కోసం నీ చేతిని దిండుగా అమర్చు.

యమి – భర్త లేని చెల్లెలున్న వాడు కూడా ఒక సోదరుడేనా? సోదరునికి ఆపద కలిగిన ఆమె ఒక చెల్లెలా? కోరిక తీవ్రమైన దాననై నిన్ను గాఢంగా కోరుతున్నాను. నీ శరీరాన్ని నా శరీరంతో కలువు.

యమ – నా శరీరాన్ని నీ శరీరంతో కలపలేను. చెల్లెలిని కోరే వాడిని పాపాత్ముడు అంటారు. నాతో తప్ప వేరే ఎవరితోనైనా నీవు ఆనందించు. పవిత్రుడైన ఈ నీ సోదరునికి అటువంటి వాంఛ లేదు.

యమి – అయ్యో! యమా! నీవు దుర్బలుడివి. నీ మనస్సు, భావం నాకు అర్థం కావటం లేదు. నిన్ను వేరే స్త్రీ, గుర్రానికి వేసిన జీను (తోలుపట్టీ)లాగా వృక్షాన్ని అల్లుకున్న లతలాగా పెనవేసుకుంటుంది.

యమ – ఓ యమీ! నీవు వేరొకర్ని కౌగలించుకో. చెట్టును అల్లుకున్న తీగలాగా మరొకరు నిన్ను కౌగలించుకోనీ. నీవు అతని ప్రేమను పొందు. నీ ప్రేమను అతడు పొందుగాక. మీది ఆనందకరమైన కలయిక అగుగాక."

ఋగ్వేదంలో అధిక సంఖ్యలో పొందు పరచిన శ్లోకాల్లో ఇవి కొన్ని మాత్రమే. ఈ ఉదాహరణలు ఋగ్వేదంలో ఉన్న అనేక శ్లోకాలకు నమూనాగా ఉండి అందులోని విషయానికి అద్దం పడుతున్నాయన్నది సత్య దూరం కాదు.

ఋగ్వేద యజుర్వేదాలలో ఉన్న అనేక అసభ్యకరమైన చరణాలను ఉద్దేశపూర్వకంగానే ఇక్కడ పేర్కొనకుండా వదిలేయడం జరిగింది. ఈ విషయంలో ఆసక్తి గలవారు ఋగ్వేదం (X-85-37) లోనిసూర్యాపూషల సంభాషణ (X-86-6)లోని ఇంద్రుడు ఇంద్రాణిల మధ్య సంభాషణలు చూడవచ్చు.

యజుర్వేదంలోని అశ్వమేధ విభాగంలో కూడా అశ్లీలార్థకమైన శ్లోకాలు కనిపిస్తాయి. ఇలాంటి అశ్లీలతగల శ్లోకాలు పక్కకు పెట్టి ఋగ్వేదంలోని ప్రార్థనా భాగాలకు మాత్రమే పరిమితమైనా కూడా ఆ ప్రార్థనలు నైతికంగా గానీ ఆధ్యాత్మిక దృష్టితో గానీ ఉన్నతమైనవని చెప్పటానికి వీలులేదు.

ఉదా I "రాక్షస వినాశనం చేసే అగ్నిదేవుడు మా ప్రార్థనను మన్నించి రోగరూపంలో నిన్నూ, దుర్నామ రోగంతో నీ గర్భాన్నీ గర్భంలోని పిండాన్నీ తొలుస్తున్న దుష్టశక్తులను తరిమివేయుగాక"

"మన ప్రార్థనలు ఆలకించిన అగ్ని దుర్నామ రోగం లాగ నీ గర్భాన్నీ గర్భంలోని పిండాన్నీ తొలుస్తున్న రాక్షసిని సంహరించుగాక"

"గర్భధారణ శక్తిని ధ్వంసం చేసి కదలాడే అండాన్ని బీజం చేరుకోకుండా గర్భస్థ శిశువును సంహరించే దుష్టశక్తిని తరిమివేద్దాం."

"భార్యాభర్తల మధ్య చేరి వారి తొడలను వేరు చేసి గర్భంలో ప్రవేశించి అండాన్ని తినివేసే దుష్టశక్తిని మనం సంహరిద్దాం."

"సోదరునిలాగ భర్తలాగ విటునిలాగ నిన్ను సమీపించి నీ సంతతిని నాశనం చేసే దుష్టశక్తిని నాశనం చేద్దాం"

"నిద్ర ద్వారా చీకటి ద్వారా నిన్ను మోసగించి సమీపించి నీ సంతతిని నాశనం చేయాలని చూస్తున్న దుష్టశక్తిని నాశనం చేద్దాం."

ఋగ్వేదంలో కనబడే మంత్రాలు, స్తోత్రాలు ఇలా ఉన్నాయి.

1. ఓ వాయుదేవా! నీవెంతో సుందర స్వరూపుడివి. నీకోసం సుగంధ ద్రవ్యాలతో కూర్చిన సోమరసాన్ని తయారు చేశాము. మాకు దర్శనమిచ్చి సోమరసం సేవించి మా ప్రార్థనలు మన్నించు. (ఋ. 1-1-2-1)

2. ఓ ఇంద్రదేవా! మా రక్షణార్థం మాకు సిరిసంపదలు ప్రసాదించు. మీరిచ్చిన సంపదలు సదా పెరుగుతూ మాకు సంతోషం చేకూర్చడం ద్వారా శత్రు సంహారానికి సాయపడుదువుగాక. (ఋ 1-1.8.1)

3. ఓ ప్రజలారా! మీరు యజ్ఞం చేసేటప్పుడు ఇంద్రుడిని అగ్ని దేవుడిని స్తుతించటం మరచిపోవద్దు. గాయత్రీ ఛందస్సులో వారిని స్తుతిస్తూ వారి స్థానం మరింత ఉన్నతం చేయాలి. (ఋ. 1-21-2)

4. ఓ అగ్నిదేవా! సోమరసాన్ని తాగాలని ఉత్సాహపడుతున్న త్వష్టనూ ఇతర దేవపత్నులనూ దయతో ఇక్కడకు తీసుకొని రాగలవు.

5. దైవపత్నులు సంతోషంగా మన దగ్గరకు రావాలని ప్రార్థిద్దాం. (1-22.11)

6. ఇంద్ర వరుణ అగ్నిదేవుల భార్యలను ఇక్కడకు వచ్చి సోమరసం సేవించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

7. ఓ వరుణా! మీ కోపాన్ని ఉపసంహరించుకోవలసిందిగా ప్రార్థిస్తున్నాను. ఓ అసురా! మీరందరూ దివ్యజ్ఞానులు. మమ్మల్ని పాపాల నుంచి విముక్తులను చేయండి. (1-24.14)

8. సోమరసాన్ని స్త్రీలు చిలికి తయారుచేశారు. అట్లాంటి ఈ సోమరసాన్ని ఇక్కడకు వచ్చి సేవించవలసిందిగా ప్రార్థిస్తున్నాను. (1-28-3)

9. మిమ్ము సేవించని మా 'ఈ' శత్రువులు మాయమై (నశించి) మిమ్ము సేవించేవారు వర్ధిల్లుదురుగాక. ఇంద్రా! మాకు అత్యంత శ్రేష్టమైన గోవులను, అశ్వాలను ఇచ్చి ప్రపంచంలో మమ్మలి ప్రఖ్యాతులను చెయ్యి. (1-29.4)

10. ఓ అగ్నిదేవా! మమ్మల్ని రాక్షసుల బారి నుంచి యుక్తిగల, కపటులైన శత్రువుల నుంచి, అయిష్టంతో అంతమొందించడానికి ప్రయత్నించే వారి బారి నుంచి, రక్షించవలసింది.

11. ఓ ఇంద్రా! నువ్వు యోధుడివి. మేము తయారుచేసిన సోమరసాన్ని సేవించి మాకు సిరిసంపదలు ప్రసాదించు. నిన్ను సేవించని వారి వద్దనున్న సంపదలు కొల్లగొట్టి వాటిని మాకు ప్రసాదించు. (1-81-8-9)

12. ఓ ఇంద్రదేవా! అమరత్వాన్ని ప్రసాదించి, మత్తు గొలిపే సోమరసాన్ని ఇక్కడికి వచ్చి సేవించు. (1.84-4)

13. ఓ ఆదిత్యులారా! వచ్చి మీ దీవెనలు మాకు అందించండి. మాకు యుద్ధంలో విజయం ప్రసాదించండి. మీరు సిరిసంపదలు కలిగినవారు, దయామయులు. కఠినమార్గంలో పయనిస్తున్న రథంలాగా ఉన్న మమ్మల్ని, ప్రమాదాల నుంచి కాపాడండి. (1.106-22)

14. మరుత్తులారా! నీ ఇష్టులు నిన్ను స్తుతిస్తున్నారు. మా దగ్గరకు విచ్చేసి మీ కోసమై ఏర్పరచిన పచ్చగడ్డి దిండ్ల మీద ఆసీనులై సోమరసాన్ని ఆస్వాదించ గోరుతున్నాను. (VII-57-1-2)

15. మిత్ర, వరుణులారా! యజ్ఞం ద్వారా మీకు పూజలందించాము. ఆ పూజలందుకుని మమ్మల్ని ప్రమాదాల నుంచి కాపాడవలసింది. (VII-60-12)

ఈ ప్రార్థనలు నైతికంగాగాని ఆధ్యాత్మిక దృక్పథంతో గాని ఉన్నతమైనవని చెప్పవచ్చునా?

తత్వజ్ఞానికి సంబంధించినంతవరకు ఋగ్వేదంలో ఆ ప్రస్తావనే లేదని చెప్పవచ్చు. ప్రొఫెసర్ విల్సన్ గమనించినట్లుగా వేదాలన్నింటికి మూలంగా పరిగణిస్తున్న ఋగ్వేదంలో ఎక్కడా తత్వానికి సంబంధించిన ఆలోచనగాని అనంతరకాలపు సిద్ధాంత దృక్పథం కాని లేదని చెప్పవచ్చు. ప్రపంచ పురోగామిత్వానికి, విశ్వ శ్రేయో సంస్కరణలకు సంబంధించిన జాడలు అందులో లేవు.

వేదాలు ఆర్యుల సామాజిక జీవనాన్ని తెలిపే ఆధారంగా మాత్రమే ఉపయోగపడతాయి. ఆదిమ కాలపు జీవన విధానాన్ని చిత్రీకరించే ఆసక్తికరమైన దృశ్య చిత్రాలుగా వేదాలను తీసుకోవచ్చు. కానీ అందులో ఉన్నతమైనదేదీ కనిపించదు. ఇందులో కొన్ని సద్గుణాలున్నా భ్రష్టత్వం పాలే ఎక్కువ.

## II

ఇప్పుడు మనం అథర్వ వేదంలోని అంశాలను గూర్చి పరిశీలిద్దాం. ఇందులో నేనిప్పుడు చేస్తున్నదల్లా అథర్వవేదంలోని విషయసూచికలోని సారాంశాన్ని కొద్దిగా ఉదహరించటం మాత్రమే.

గ్రంథం 1 : వ్యాధులను, వ్యాధికారక భూతాలనూ నివారించడానికి మంత్రాలు (భైషజ్ఞానం) :

V 22 (తక్మ) జ్వరానికి, సంబంధిత వ్యాధులకు మంత్రాలు.

VI 20 జ్వరానికి మంత్రం

i, 25 జ్వరానికి మంత్రం

vii 116 జ్వరానికి మంత్రం

v, 4 తక్మన్ జ్వర నివారణకు, కుష్ఠ మొక్కకు ప్రార్థన

xix, 39 జ్వర నివారణకూ ఇతర వ్యాధుల నివారణకూ కుష్ఠ మొక్కకు ప్రార్థన.

i, 12 జ్వరానికి, తలనొప్పికి, దగ్గుకు కారణభూతమైన మెరుపును ఉద్దేశించి ప్రార్థన

i, 22 పచ్చ కామెర్లు, సంబంధిత వ్యాధులకు మంత్రం.

vi, 14 హలాసవ్యాధికి మంత్రం.

vi, 105 దగ్గు మంత్రం.

i, 2 శరీరం నుంచి వచ్చే అధిక స్రావాలకు మంత్రం.

ii, 3 ఊటనీరు వల్ల శరీరంలో కలిగే అధిక స్రావాలకు మంత్రం.

vi, 44 శరీరంలో కలిగే అధిక స్రావాలకు మంత్రం.

i, 3 మలబద్ధకానికి, మూత్ర విసర్జన జరగకపోవడానికి నివారణగా మంత్రం.

vi, 90 రుద్రుడి క్షిపణుల కారణంగా, అంతర్గతంగా ఉండే ఉదర సంబంధమైన నొప్పులకు మంత్రం.

vii, 10 ఉబ్బు రోగానికి (శోధ) మంత్రం.

vii, 83 ఉబ్బు రోగానికి మంత్రం.

vi, 24 ఉబ్బు రోగానికి, గుండె జబ్బులకు, రక్త సంబంధమైన, వంశానుగతంగా వచ్చే జబ్బులకు ప్రవహించే నీటి ద్వారా నివారణ.

vi 80 రోగ నివారకుడుగా సూర్యునికి నైవేద్యం.

ii 8 క్షేత్రీయ ఆనువంశిక వ్యాధులకు మంత్రాలు.

ii 10 క్షేత్రీయ ఆనువంశిక వ్యాధులకు మంత్రాలు.

iii 7 క్షేత్రీయ ఆనువంశిక వ్యాధులకు మంత్రాలు.

i, 23 చీకటి మొక్కలతో కుష్ఠవ్యాధి నివారణ.

i , 24 చీకటి మొక్కలతో కుష్ఠవ్యాధి నివారణ

vi, 83 అపకిత (గండమాల) వ్యాధి లక్షణాలతో శుష్కించిన దేహానికి మంత్రం.

vii 76 ఏ. అపకిత (గండమాల) వ్యాధి లక్షణాలతో శుష్కించిన దేహానికి మంత్రం.

బి. గయానా అనే కణితి నివారణకు మంత్రం.

సి. సోమరసాన్ని సేవించి మధ్యాహ్నం ఆలపించే అంత్యాను ప్రాసగల శ్లోకాలు.

Vii 74, ఏ. అపకిత అనే గండమాల వ్యాధి లక్షణాలున్న శుష్కించిన దేహానికి మంత్రం.

బి. అసూయను ఉపశమింపజేసే మంత్రం.

సి. ప్రతిజ్ఞా దైవమైన అగ్నికి ప్రార్థన.

vi, 25 మెడ భుజాల పైన గండమాల వ్యాధితో శుష్కించిన భాగాలకు మంత్రాలు.

vi, 57 గండమాల వ్యాధి లక్షణాలకు మూత్రం (గలాష) తో ఒక నివారణ.

iv 12 విరిగిన ఎముకలకు అరుంధతి (లాక్ష) మొక్కతో చికిత్స.

v 5 పుండ్లకు అరుంధతి మొక్కతో చికిత్సా మంత్రం.

vi 109 గాయాలకు మిరియాలు మొక్కజొన్నలతో నివారణ.

i 17 రక్తస్రావం నిలుపుదలకు మంత్రం.

Vii 31 నులి పురుగులకు మంత్రం.

ii 32 పశువుల్లో, నులిపురుగులకు మంత్రం.

v 23 శిశువులలో నులి పురుగులకు మంత్రం

iv 6 విషం విరుగుడుకు మంత్రం

iv 7 విషానికి మంత్రం

vi 100 విషానికి విరుగుడుగా చీమలు

v 13 పాము విషానికి మంత్రం

vi 12 పాము విషానికి మంత్రం

vii 56 పాములు, తేళ్ళు తదితర సరీసృపాల, కీటకాల విషానికి మంత్రం.

vi 16 కీళ్ళ జబ్బుల నివారణకు మంత్రం

vi 21 జుట్టు పెరగడానికి మంత్రం

vi 136 నితాని మొక్కతో వెంట్రుకల పెరుగుదలకు వేసే మంత్రం.

vi 137 జుట్టు పెరగటానికి మంత్రం.

iv 4 పుంస్త్వాన్ని వృద్ధి పరచే మంత్రం.

vi iii ఉన్మాదానికి మంత్రం.

iv 37 అగశ్రుంగి మొక్కతో రాక్షసులకు అప్సరసలను గంధర్వులను పారద్రోలే మంత్రం.

ii 9 వ్యాధి సంబంధిత రాక్షసుల ఆవాహన పది రకాల చెక్కలతో తయారు చేసిన తాయెత్తు ద్వారా (రక్షరేకు) నివారణ.

iv 36 వ్యాధి కారణభూతమైన రాక్షసులకు పిశాచాలకు వ్యతిరేక మంత్రాలు.

ii 25 "ప్రిస్నిపర్ణి" అనే మొక్కతో కన్వ అనే వ్యాధి సంబంధ రాక్షసులకు వ్యతిరేక మంత్రం.

iv 32 రాక్షసులను పిశాచాలను పారద్రోలటానికి మంత్రం.

ii 4 గంగిదాత్రి నుంచి తయారుచేసిన రక్షరేకుతో వ్యాధులకు రా

xix 34 వ్యాధులకు రాక్షసులకు మంత్రం.

xixi 35 వ్యాధులకు రాక్షసులకు మంత్రం.

vi 85 వరణ వృక్షంతో తయారు చేసిన రక్షరేకుతో వ్యాధులను దయ్యాలను పార దోలే మంత్ర ప్రక్రియ.

vi 127 కిప్పద్రు చెట్టు సర్వరోగ నివారిణి

xix 38 వ్యాధి నయం చేసే లక్షణాలు గల సాంబ్రాణి.

vi 91 జావ, నీరు వీటి సర్వరోగ నివారణ లక్షణాలు.

viii 7 సర్వరోగ నివారిణిగా ఉపయోగపడే మంత్రాలు, ఓషధి మొక్కల సంకీర్తనలు.

vi 96 సర్వరోగ నివారణులుగా మొక్కలు.

ii 33 సంపూర్ణ ఆరోగ్యం పొందడానికి మంత్రాలు.

ix 8 సర్వరోగాల నుంచి రక్షణ పొందటానికి మంత్రం.

ii 29 వ్యాధిని సంక్రమింపజేస్తూ చిరకాల జీవనం అభివృద్ధి పొందటానికి మంత్రం.

## II. దీర్ఘకాల జీవనం, ఆరోగ్యాల కోసం చేసే ప్రార్థన

iii 11 ఆరోగ్యం చిరకాల జీవనం కోసం చేసే స్తోత్రం.

ii 28 దీర్ఘాయుష్షుకు శరీరాన్ని ఉద్దేశించి పఠించే మంత్రం.

iii 3 ఆరోగ్యానికి దీర్ఘాయుష్షుకూ ప్రార్థన.

vii 53 ఎక్కువకాలం జీవించేందుకు ప్రార్థన.

vii 1 మరణ ప్రమాదాల నుంచి తప్పించుకునేందుకు ప్రార్థన.

viii 2 మరణ ప్రమాదాల నుంచి తప్పించుకునేందుకు ప్రార్థన.

v 30 వ్యాధులు మరణాల నుంచి తప్పించుకోవటానికి ప్రార్థన.

iv 9 జీవిత రక్షణకూ అంగాల రక్షణకూ సహాయపడే మంత్రం

iv 10 దీర్ఘాయుష్షు, అభ్యుదయం ప్రసాదించే నిమిత్తం ముత్యంతోనూ ముత్యపు చిప్పతోనూ తయారుచేసే రక్షరేకు, మంత్రం.

xix దీర్ఘకాల జీవనం కోసం తాయెత్తుగా బంగారం.



**రాక్షసులు మాంత్రికులు శత్రువుల పాపాలు, అభిచారికాలు, కృత్య ప్రతిహరణాలు మొదలైన వాటిని నివారించుకునే ప్రార్థనలు.**

i 7 మాంత్రికులు రాక్షసుల నుండి తప్పించుకునేవి.

i 8 మాంత్రికులు రాక్షసుల ప్రయోగాలకు విరుగుడుగా ఉన్నవి.

i 66 రాక్షసులు మాంత్రికుల బాధల నిమిత్తం సీసంతో తయారుచేసిన తాయెత్తు.

vi 2 రాక్షసుల మీద ప్రయోగించటానికి సోమరసంతో తయారుచేసిన నైవేద్యం.

ii 14 మనుషులు జంతువులు గ్రహాలతో వైరమున్న వివిధ రకాల రాక్షస స్త్రీల పీడ నుంచి నివారణ కోసం మంత్రాలు.

ii 9 (పైరుపైన) విష్కంధ, కబవల మీద మంత్రాలు

ii 20 రాక్షసులను శత్రువులను ప్రమాదాలకు గురిచేసే 'దాపృష్ణి' మొక్కతో చేసిన తాయెత్తు.

v 17 మాంత్రికులు రాక్షసులు శత్రువుల మీద ప్రయోగానికి 'అపామార్గ' మొక్కతో చేసిన రక్షరేకు.

iv 19 ఆధ్యాత్మిక శక్తిగల 'అపామార్గ' మొక్కను, రాక్షసులు మాంత్రికులకు విరుగుడుగా ప్రయోగార్థం.

vii 65 శాపాలు పాప కార్యాలకు ప్రతిగా 'ఆపామార్గ' మొక్కతో తయారుచేసిన తాయెత్తు.

x 1 మాయాజాలాలను సమ్మోహన మంత్రాలను తిరగ్గొట్టే మంత్రం.

v 14 మాయాజాలాన్ని మోహమంత్రాలను తిప్పికొట్టే మంత్రం.

v 31 మాయలనూ వశీకరణ మంత్రాలనూ నిరోధించే మంత్రం.

iii 5 రక్షణార్థం స్రక్త్య చెట్టు నుండి తయారుచేసిన తాయెత్తు కోసం ప్రార్థన.

x 3 "వరణ" వృక్షం నుండి చేసిన తాయెత్తు విశిష్టతను స్తుతించడం.

x 6 నాగలి రూపంలో ఉన్న ఖదిర చెక్కతో చేసిన తాయెత్తు విశిష్టతను స్తుతించడం.

ix 16 విశ్వాసఘాతుకమైన ఆలోచనల నుండి రక్షణ కల్పించాలని వరుణునికి ప్రార్థన

ii 12 పవిత్ర కార్యాలకు విఘాతం కలిగించే శత్రువులకు శాపమివ్వడం.

vii 70 శత్రువుల యాగాన్ని నిష్ఫలం చేయడం.

ii 7 ఒక ప్రత్యేకమైన మొక్క ద్వారా శాపనార్థాలను, ప్రతికూల కుట్రలను నివారించే మంత్రం.

iii 6 శత్రువులను నాశనం చేసేదిగా అశ్వత్థ వృక్షం.

vi 75 శత్రువులను అణగదొక్కడానికి నైవేద్యం (హవిస్సు).

vi 37 ప్రతికూల మంత్రగాళ్లను ఉద్దేశించి శాపాలు.

vii 13 శత్రువులకు బలం లేకుండా చేసే మంత్రం.

## IV. స్త్రీలకు సంబంధించిన మంత్రాలు (స్త్రీ కర్మణి)

ii 36 భర్తను పొందటానికి మంత్రం.

vi 60 భర్తను పొందేటందుకు మంత్రం.

vi 82 భార్యను పొందటానికి మంత్రం.

vi 78 వివాహిత దంపతులకు దీవెనలు.

vii 36 పెళ్లి జంట ఉచ్చరించే ప్రేమ మంత్రం.

vii 37 పెళ్లికూతురు, పెళ్లికొడుకులనుద్దేశించి ఉచ్చరించే మంత్రం.

vi 81 గర్భధారణ కోసం తాయెత్తు వంటి కంకణం.

iii 23 కుమారుడు కలగడానికి మంత్రం. (పూసవనం)

vi 11 కుమారుడు కలగడానికి మంత్రం (పూసవనం).

ii 35 స్త్రీని సంతానవతిని చేయడానికి ఉపకరించే మంత్రోచ్చారణ.

vi 17 గర్భస్రావాన్ని అరికట్టే మంత్రం.

i, ii సుఖ ప్రసవానికి మంత్రం.

i 34 స్త్రీ ప్రేమను పొందటానికి మధూమష్ఠకరణితో తయారుచేసిన తాయెత్తు.

ii 30 స్త్రీ ప్రేమను పొందటానికి మంత్రం.

vi 8 స్త్రీ ప్రేమను పొందటానికి మంత్రం.

vi 9 స్త్రీ ప్రేమను పొందటానికి మంత్రం.

vi 102 స్త్రీ ప్రేమను పొందటానికి మంత్రం.

iii 25 స్త్రీ నుండి భావోద్వేగ పూరితమైన ప్రేమను పొందడానికి మంత్రం.

vii 38 పురుషుని ప్రేమను పొందడానికి మంత్రం.

vi 130 పురుషుని భావోద్వేగపూరితమైన ప్రేమను పొందటానికి మంత్రం.

vi 132 పురుషుని భావోద్వేగపూరితమైన ప్రేమను పొందటానికి మంత్రం.

iv 5 ఒకానొక నియమిత కార్యం గురించిన మంత్రం.

vi 77 కర్తవ్యనిష్ఠలేని స్త్రీ తిరిగి రావటానికి మంత్రం.

vi 18 అసూయ తగ్గించే మంత్రం.

i, 14 తన ప్రత్యర్థిని ఆవాహన చేస్తూ స్త్రీలు పఠించే మంత్రం.

ii 18 స్త్రీ తన ప్రత్యర్థిపై గానీ సవతిపైగానీ ప్రయోగించే మంత్రం.

vi 138 మనిషి పుంస్త్వాన్ని నశింపజేసే మంత్రం.

vi 18 ఒక స్త్రీ శరీరం నుండి చెడు లక్షణాలను తొలగించే మంత్రం.

v 110 దుర్ముహూర్తంలో పుట్టిన బిడ్డకు శాంతి చేసే మంత్రం.

vi 140 పాలపళ్లు వంకరగా వచ్చినప్పుడు పఠించే మంత్రం.

## V. రాజరిక (రాజకర్మణి) మంత్రాలు

iv, 8 రాజు నుద్దేశించి శుద్ధి పూర్వకంగా చదివే మంత్రాలు.

ii, 3 ప్రవాసంలో ఉన్న రాజు తిరిగి సింహాసనం అధిష్టించాలని కోరుతూ పఠించే మంత్రాలు.

ii 4 రాజును ఎంపిక చేసేటప్పుడు చదివే స్తోత్రాలు.

iv 22 రాజు ఔన్నత్యాన్ని స్థిరీకరించే మంత్రాలు.

iii 5 రాజరికాన్ని (శక్తిని) బలపరిచేందుకు 'పర్ణ' వృక్షం నుండి తయారు చేసిన తాయెత్తు మంత్రం.

i 9 లౌకిక (ఐహిక) విజయాల కోసం మంత్రం.

vi 38 శక్తి, సముజ్జ్వలతల కోసం ప్రార్థన.

vi 39 ఘనత (యశస్సు) కోసం ప్రార్థన.

viii 8 యుద్ధ మంత్రం.

i 19 బాణం వల్ల తగిలిన గాయాలకు యుద్ధ మంత్రం.

ii 1 శత్రువులను తికమక పెట్టే యుద్ధ మంత్రం.

iii 2 శత్రువులను తికమక పెట్టే యుద్ధ మంత్రం.

vi 99 యుద్ధ సందర్భంగా రాజు ఉచ్చరించే యుద్ధ మంత్రం.

vi 99 యుద్ధ సందర్భంగా రాజు ఉచ్చరించే యుద్ధ మంత్రం.

xi 9 యుద్ధంలో సహాయం చేయవలసిందిగా అర్బుది, న్యర్బుదిలకు ప్రార్థన.

xi 10 యుద్ధంలో సహాయార్థం త్రిషంధికి చేసే ప్రార్థన.

v 20 యుద్ధ భేరిని స్తుతించడం.

v 21 శత్రువులను భయభ్రాంతులను చేసే యుద్ధభేరిని స్తుతించడం.

## VI. సామరస్యాన్ని, సభలో ప్రాబల్యాన్ని పొందడానికి ఇంకా అలాంటి వాటికి ప్రార్థనలు.

iii 30 సామరస్యం సాధించడానికి మంత్రం.

vi 73 వైషమ్యాన్ని అణచివేసే మంత్రం.

vi 74 వైషమ్యాన్ని అణచివేసే మంత్రం.

vii 52 పోరాటాన్ని, రక్తపాతాన్ని నివారించే మంత్రం.

vi 64 వైషమ్యాన్ని అణచివేసే మంత్రం.

vi 42 కోపాన్ని ఉపశమింపజేయడానికి మంత్రం.

vi 43 కోపాన్ని ఉపశమింపజేయడానికి మంత్రం.

viii 12 సమావేశంలో (సభలో) ప్రాభవాన్ని పొందే నిమిత్తం మంత్రం.

ii 27 వట వృక్షం ద్వారా ప్రత్యర్థుల చర్యను ఎదుర్కోవడానికి మంత్రం.

vi 94 ఒకరిని తన ఇష్టానికి అనుగుణంగా లోబర్చుకోడానికి మంత్రం.

## VII. ఇల్లు, పొలం, పశువులు, వ్యాపారం, జూదం వంటివి వృద్ధి పొందటానికి మంత్రం.

iii 12 గృహ నిర్మాణ సమయంలో చేసే ప్రార్థన.

vi 142 ధాన్యం ఎత్తేటప్పుడు చేసే ప్రార్థనలు.

vi 79 ధాన్య సమృద్ధికోసం మంత్రం.

vi 50 పొలంలోని ధాన్యాన్ని పాడుచేసే హానికరమైన కీటకాలను నాశనం చేసే మంత్రం.

vii 11 మెరుపుల నుండి ధాన్యాన్ని రక్షించే మంత్రం.

ii 26 పశుగణాన్ని వృద్ధి చేసే మంత్రం.

iii 14 పశుగణాన్ని వృద్ధి చేసే మంత్రం.

vi 59 పశువులను రక్షించడానికి అరుంధతి మొక్కకు ప్రార్థన.

vi 76 గోవు తన దూడను కలుసుకోవడానికి మంత్రం.

iii 28 కవలదూడలు జన్మించినప్పుడు పాప పరిహార నిమిత్తం మంత్రం.

vi 92 గుర్రానికి చురుకుదనం కలిగించడానికి మంత్రం.

iii 13 నదీ ప్రవాహాన్ని కొత్తదారిలోకి మళ్లించే మంత్రం.

vi 106 అగ్ని ప్రమాదాల నుండి రక్షణ పొందే మంత్రం.

iv 3 దొంగలు, క్రూర జంతువుల మీద ప్రయోగించడానికి పశువుల కాపర్లకు మంత్రం.

iii 15 ఒక వర్తకుని ప్రార్థన.

Viv 38 ఎ) జూదంలో విజయం కోసం ప్రార్థన.

బి) దారి తప్పిపోయిన లేగదూడలు తిరిగి రావడానికి చేసే ప్రార్థన.

vii 50 పాచికలాటలో విజయం సిద్ధించాలని చేసే ప్రార్థన.

vi 56 ఆవరణ నుండి పాములను తరిమివేసే మంత్రం.

x 4 సర్పాలను వధించే (పెడు) అశ్వాన్ని ఆవహించే సర్పాలకు విరుద్ధంగా మంత్రం.

x 2 ప్రమాదాల నుండి రక్షణ కల్పించడానికి 'భవ', 'సర్వ'లకు ప్రార్థన.

iv 28 ప్రమాదాల నుండి రక్షణకోసం భవ, సర్వుల నుద్దేశించి స్తోత్రం.

vii 9 కోల్పోయిన ఆస్తులను పొందడానికి మంత్రం.

vi 128 వాతావరణం గురించి సోది చెప్పేవారి సూచన ప్రకారం (పరిహారంగా) శాంతికోసం మంత్రం.

xi 6 ఆపద నుండి విముక్తి కోసం సర్వదేవతల నుద్దేశించిన ప్రార్థన.

## VIII. పాపాలు, అపవిత్రతల నుండి పరిహారం పొందే మంత్రం

vi 45 మానసిక నేర ప్రవృత్తికి ప్రార్థన.

vi 26 దుష్టత్వాన్ని తొలగించడానికి మంత్రం.

vi 114 యజ్ఞంలో అపరిపూర్ణతను తొలగించే ప్రాయశ్చిత్త సూత్రాలు

vi 115 పాపానికి ప్రాయశ్చిత్త సూత్రాలు.

vi 112 అన్నగారి మీద ఆధిక్యత పొందిన చిన్నవాడు చేసే ప్రాయశ్చిత్త మంత్రాలు.

vi 113 కొన్ని హేయమైన నేరాలకు పాప పరిహార మంత్రాలు.

vi 120 పాప విమోచన తరువాత స్వర్గం కోసం ప్రార్థన.

vi 27 శకునంగా భావించే (శుభ లేదా అశుభ) పావురాల పై మంత్రాలు.

vi 29 శకునపక్షులుగా భావించే పావురాలపై మంత్రాలు.

vi 29 శకున సూచకాలైన పావురాలు, గుడ్లగూబలపై మంత్రాలు.

vii 64 నల్లపక్షి శకునం వల్ల అపవిత్రులైన వారికి పరిహార మంత్రం.

vi 46 పీడ (చెడు) కలల పరిహారానికి మంత్రం.

vii 115 పవిత్రతను చేకూర్చి దుష్ట లక్షణాలు తొలగించడానికి మంత్రం.

III.

ఈ విధంగా అధర్వవేదం ఇంద్రజాల విధులు, మాయా మంత్రాలు, వైద్య విధానాల కూర్పు అని అనుకోవచ్చు. మూడువంతులు ఇది ఒక ఇంద్రజాలం. మంత్రాలతో దేవతలను ఆవాహన చేయడం ద్వారా చికిత్స జరపటం ఒక అధర్వవేదంలోనే ఉన్నదని అనుకోకూడదు. ఋగ్వేదంలో కూడా ఈ ఇంద్రజాల మహేంద్రజాలాలు ఉన్నాయి. ఇందులో దేవతావాహనకు,

ఇంద్రజాలాలకు సంబంధించిన మంత్రాలు పొందుపరచి ఉన్నాయి. దీనికి సంబంధించిన మూడు సూక్తాలను కింద ఉదహరిస్తున్నాను.

## సూక్తం XVII (CXLV)

ప్రత్యర్థి భార్యను వైదొలగించడం ఈ మంత్రం (అధిదేవత) ఉద్దేశం అనుష్టుప్ ఛందస్సు. చివరి పంక్తి మాత్రం పంకతి ఛందస్సులో ఉంది. ఇంద్రాణి ఋషి

1. అత్యంత జన్యుశక్తి గల ఈ ఔషధాలను నేను వెలికి తీస్తున్నాను. దీని ద్వారా గృహిణి తన ప్రతిద్వందిని నాశనం చేయగలుగుతుంది. తను తన భర్తను పొందగలుగుతుంది.
2. దేవతలు పంపిన పవిత్రశక్తి గల ఆకులు పైకి తిరిగి ఉన్న ఓ వృక్షమా! నా ప్రత్యర్థిని తొలగించి, నా భర్తను నాకు మాత్రమే దక్కేట్లు చేయి.
3. ఓ ఉత్తమ వృక్ష రాజమా! నేను నీలాగా శ్రేష్ఠమైన వారిలో శ్రేష్ఠంగా ఉండగలనా (ఉందునుగాక). నా ప్రత్యర్థి స్త్రీ. నికృష్టులలో నికృష్టురాలుగా ఉండుగాక.
4. నేను ఆమె పేరు కూడా ఉచ్ఛరించను. ఏ స్త్రీ కూడా ఆ మనిషితో ఆనందం పొందలేదు. నా ప్రత్యర్థిని (సవతి) దూరానికి తరిమి వేద్దామా!
5. నేను గెలుస్తాను. నీవు గెలుపునిస్తావు. మనమిద్దరం శక్తివంతులం కాబట్టి నా ప్రత్యర్థి మీద విజయం సాధిద్దాం.
6. నిన్ను (ఓషధి మొక్కను) దిండుగా చేసుకొని విజయం సాధిస్తాను. విజయ కారకాలతో బలపరుస్తాను. ఆవు దూడను చేరే విధంగా నీ మనస్సు త్వరగా నన్ను చేరనీ, నీటి ప్రవాహం వలె అది త్వరితంగా వేగంగా రానీ.

## సూక్తం IV (CLV)

1,4, పంక్తులకు అధిదేవత దురదృష్టాన్ని తప్పించే (అలక్ష్మిఘ్ను) దేవత. 2, 3 పంక్తులకు బ్రాహ్మణస్పతి, 5వ పంక్తికి విశ్వదేవుడు, అధిదేవతలు. భరద్వాజ ముని కుమారుడైన శిరుంబితుడు ఋషి. అనుష్టుప్ ఛందస్సు.

1. హేయమైన దుఃఖభాజనమైన కురూపియైన ఓ దేవతా! పర్వతాలపైకి వెళ్లు. శిరుంబితుని అద్భుత కృత్యాలతో నిన్ను భయభ్రాంతం చేసి పారదోలుతున్నాము.
2. పిండాలను నాశనం చేసే ఆమెను ఈ లోకం నుండి పారదోలండి. మరో లోకం నుంచి కూడా వెళ్ళగొట్టండి. వాడి కొమ్ములు గల బృహస్పతి సమీపించి, దుఃఖాన్ని దూరం చేయుగాక.

3. ఓ దేవతా, మానవునికి దూరంగా ఎక్కడో సముద్ర తీరంలో తేలియాడుతున్న చెక్కను స్వాధీనం చేసుకో. అది బలమైనది. దాన్ని నాశనం చేయటం కష్టం. దాని ఆధారంతో మరో దూర తీరానికి వెళ్ళు.

4. ప్రతికూల శబ్దాలు చేసేవారు వేగంగా కదులుతున్నప్పుడు నీవు నిష్క్రమించావు. ఇంద్రుని శత్రువులందరూ వధించబడ్డారు. అంతేకాదు. నీటి బుడగల్లా అదృశ్యమైనారు.

5. ఈ విశ్వదేవులు దొంగిలించబడిన పశువులను తిరిగి తెచ్చారు. నిప్పు తయారు చేశాడు. దేవుళ్ళకు ఆహారం సమకూర్చారు. వారిని అధిగమించగలిగేదెవరు?

## సూక్తం XII (CLX III)

క్షయరోగ నివారకుడు. అధిదైవం. కశ్యపుని కుమారుడైన వివృహానుడు ఋషి అనుష్టుప్ ఛందస్సు.

1. నీ కనుల నుంచి, నీ శిరస్సు నుంచి, నీ ముక్కు నుంచి, నీ చెవుల నుంచి, నీ గెడ్డం నుంచి, నీ మెదడు నుంచి, నీ నాలుక నుంచి రోగాన్ని వెళ్లగొడతాను.

2. నీ మెడ నుంచి, నీ నరాల నుంచి, నీ ఎముకల నుంచి, నీ కీళ్ల నుంచి, నీ భుజ దండం నుంచి, నీ భుజాల నుంచి, నీ మోచేతుల నుంచి రోగాన్ని వెళ్లగొడతాను.

3. నీ పేగుల నుంచి, నీ గుదము నుంచి, నీ గర్భం నుంచి, నీ గుండె నుంచి, నీ మూత్రపిండాల నుంచి, నీ కాలేయం నుంచి, నీ దేహం లోపలి ఇతర పదార్థాల నుంచి రోగాన్ని వెళ్లగొడతాను.

4. నీ తొడల నుంచి, నీ మోకాళ్ల నుంచి, నీ కాలి మడమల నుంచి, నీ కాలి బొటన వ్రేళ్ల నుంచి, నీ నడుము నుంచి, నీ పిరుదుల నుంచి, నీ మర్మావయవాల నుంచి రోగాన్ని వెళ్లగొడతాను.

5. నీ మూత్రనాళరి నుంచి, నీ మూత్రాశయం నుంచి, నీ వెంట్రుకల నుంచి, నీ గోళ్ల నుంచి, నీ మొత్తం శరీరం నుంచి రోగాన్ని వెళ్లగొడతాను.

6. ఒక్కొక్క అవయవం నుంచి, ఒక్కొక్క వెంట్రుక నుంచి, ఒక్కొక్క కీలు నుంచి, నీ మొత్తం శరీరంలోంచి వ్యాధులను పోగొడుతున్నాను. వేదాలలో నైతిక ఆధ్యాత్మిక విలువలకు సంబంధించిన అంశాలు లేవని చెప్పటానికి ఈ ఉదాహరణలు చాలు. వేదాలలోని విషయం కానీ వివరణ కానీ వేదాలకు ఆపాదించిన అమోఘత్వానికి న్యాయం చేయటం లేదు. మరి బ్రాహ్మణులు వేదాలకు పవిత్రతను అమోఘత్వాన్ని ఆపాదించాలని ఎందుకు తాపత్రయపడ్డారు ?

అనువాదం : తెన్నేటి విజయచంద్ర

చిక్కుముడి : 7

# మారిన వైఖరి – వేదాలు తమ శాస్త్రాల కంటె అధమాధమమైనవని బ్రాహ్మణులు ఎలా ప్రకటించారు ?

I

హిందువుల మత సాహిత్యంలో 1) వేదాలు 2) బ్రాహ్మణాలు, 3) అరణ్యకాలు 4) ఉపనిషత్తులు 5) సూత్రాలు 6) ఇతిహాసాలు 7) స్మృతులు 8) పురాణాలు ఉన్నాయి.

ఇంతకు ముందు చెప్పినట్లుగా ఒకానొకప్పుడు వీటన్నిటికి ఒకే విధమైన గౌరవ ప్రతిపత్తి ఉండేది. ఎక్కువ తక్కువ, పవిత్రం – అపవిత్రం, భ్రాంతికారకం – అమోఘం అనే ప్రత్యేకతలు ఉండేవి కావు.

ఆ తర్వాత మనకు కనబడేదేమిటంటే, వేద బ్రాహ్మణులు వేదాలకూ తమ ఇతర రకాల మత సాహిత్యానికీ మధ్య ప్రత్యేకత చూపాలని అభిప్రాయపడ్డారు. వేదాలను, ఇతర రకాల సాహిత్యం కంటే ఉన్నతమైనవిగా మాత్రమే కాకుండా పవిత్రమైనవిగాను తిరుగులేనివిగాను కూడా చేశారు. వేదాలు ప్రశ్నించరానివనే సిద్ధాంతాన్ని రూపొందించడంలో కొన్ని ప్రత్యేకతలు సృష్టించి తమ పవిత్ర రచనలను రెండు తరగతులుగా విభజించారు. అవి 1) శ్రుతులు 2)

---

ఇది 21 పుటల టైపు ప్రతి. Super Session of the Vedas (వేదాలనుకొట్టి పారవేయటం) అనే శీర్షికతో ఉంది. రచయిత స్వయంగా దీనిలో మార్పులు, దిద్దుబాట్లు చేశారు.అధ్యాయం చివరి పేరా రచయిత దస్తూరీతో ఉండటంవల్ల ఇది పూర్తి అయినదనే భావించాలి.

– సంకలనకర్త

శ్రుతేతరాలు. మొదటి భాగంలో ఈ సాహిత్యంలోని ఎనిమిది తరగతులలోను 1) సంహితలు 2) బ్రాహ్మణాలు అనే రెండింటిని మాత్రమే చేర్చారు. మిగిలిన వాటిని శ్రుతే తరాలుగా వారు ప్రకటించారు.

II

ఈ ప్రత్యేక విభేదాన్ని మొట్టమొదట ఎప్పుడు చేశారో చెప్పడం సాధ్యం కాదు, అయితే, ఇంకా అతి ముఖ్యమైన ప్రశ్న ఏమిటంటే ఏ ప్రాతిపదిక మీద ఈ విభజన జరిగింది? అనేది. ఇతిహాసాలను, పురాణాలను ఎందుకు మినహాయించారు? అరణ్యకాలను, ఉపనిషత్తులను ఎందుకు మినహాయించారు? సూత్రాలను ఎందుకు మినహాయించారు? ఇతిహాసాలు, పురాణాలను శ్రుతుల నుండి ఎందుకు వేరు చేశారో అర్థం చేసుకోవచ్చును. ఈ విభజన జరిగిన సమయంలో ఇవి మరీ ప్రాథమిక దశలో, అభివృద్ధిచెందని దశలో ఉండి ఉండవచ్చును. బహుశః బ్రాహ్మణాలలో వీటిని చేర్చి ఉంటారు. అదే విధంగా ఆరణ్యాకాలు శ్రుతిలో భాగంగా నిర్దిష్టంగా ఎందుకు పేర్కొనలేదో కూడా స్పష్టంగానే ఉంది. అవి బ్రాహ్మణాలలో ఒక భాగం. అందుచేత అవి శ్రుతిలో భాగమని మళ్ళీ ప్రత్యేకంగా చెప్పడం బహుశ అనవసరం. ఉపనిషత్తులు, సూత్రాల విషయమే సమస్యగా ఉంది. వాటిని శ్రుతి నుండి ఎందుకు మినహాయించారు? ఉపనిషత్తులకు సంబంధించిన విషయాన్ని మరో అధ్యాయంలో వివరించడం జరిగింది. ఇక్కడ సూత్రాలకు సంబంధించిన విషయాలు మాత్రం చర్చిద్దాం. సూత్రాలు మినహాయించ డానికి కారణాలు తెలుసుకోకుండా ఇది గ్రహించడం సాధ్యం కాదు. బ్రాహ్మణాలను శ్రుతుల వర్గంలో చేర్చడానికి సరియైన కారణాలు ఉన్నప్పుడు అవే కారణాలు సూత్రాలు చేర్చుకునే విషయంలో ఎందుకు వర్తించలేదు? ప్రొఫెసర్ మాక్స్‌ముల్లర్ అభిప్రాయపడినట్లుగా "ఒక జాతి, తన జాతీయ ప్రాచీన కవిత్వం, ప్రత్యేకించి ఆ కవిత్వంలో భగవంతుని ఉద్దేశించిన ధ్యాన శ్లోకాలు, ప్రార్థనలు ఉన్నట్లయితే అది మానవాతీతంగా ఉద్భవించినట్లు ఎలా చెబుతుందో మనం అర్థం చేసుకోవచ్చును. కాని వచన గ్రంథాలయిన బ్రాహ్మణాల విషయం వేరు. మంత్రాల కంటే ఎంతగానో ఆధునికమైనవని తెలుస్తున్న బ్రాహ్మణాలు, శ్రుతి పేరిట అనుమతింపబడడానికి కారణం ఈ వేదాంత రచనలు ప్రాచీన మంత్రాల లాగా కాకుండా బ్రాహ్మణుల అత్యాశతో కూడిన కోర్కెలలో పెక్కింటికి ఊహాజనితమైన దైవిక ప్రమాణం లభింపజేయడమే కావచ్చు. మంత్రాలు బ్రాహ్మణాలు ఒకే సమయంలో పుట్టాయని చెప్పడానికి బ్రాహ్మణులు చేసిన వాదాలకు ఎటువంటి విలువా ఇవ్వవలసిన అవసరం లేనప్పటికీ, సూత్రాలతోనూ, భారతదేశపు అపవిత్ర భ్రష్టసాహిత్యంతోనూ పోల్చి చూసినపుడు బ్రాహ్మణాల మంత్రాల ప్రాచీనత విషయంలో ఉన్న సాధారణ అభిప్రాయాన్ని కూడా విలువలేనిదిగా మనం కొట్టి వేయలేము. పవిత్ర గ్రంథాలకు ఒక నియమం ఉన్నప్పుడు బ్రాహ్మణాల విషయంలో జరిగినట్టే మరీ ప్రాచీన గ్రంథాలతో తదుపరి ఆధునిక రచనలను కలిపి వేయడమనేది సులభంగా జరగవచ్చు. కాని పవిత్ర రచనల సముదాయం నుండి

ప్రాచీనమూ, యదార్థమూ అయిన భాగాలను తీసివేసి వాటికి ఆధునిక కాలాన్ని ఆపాదించడం ఊహించలేని విషయం. ఆ విధంగా ప్రాచీనతను నిరాకరించిన భాగాలలోని కొన్ని సిద్ధాంతాల ప్రమాణాన్ని నిరాకరించడం అనేది ఎవరో ఒకరి ప్రయోజనం కోసం అయితే తప్ప, ఆ విధంగా జరగదు. ఈ విధంగా ఊహించాలని చెప్పడం దరిమిలా సూత్ర సాహిత్యంలో ఎక్కడా లేదు. సూత్రాలు బ్రాహ్మణాలతోను, అంతకు మించి మంత్రాలతోను పోల్చి చూసినట్లయితే అవి అనంతర కాలానివి కావడం తప్ప, వాటిని శ్రుతులుగా వర్గీకరించకపోవడానికి మరో కారణం కనిపించడం లేదు. ఋషులు ఎక్కువగా శ్లోకాలు రచించిన కాలానికీ బ్రాహ్మణాలు అభ్యున్నతి పొందిన కాలానికీ మధ్య కొన్ని యుగాలు గడిచిపోయినట్లు బ్రాహ్మణాలకు తెలుసునా అనే ప్రశ్నకు, 'అవును' అని సమాధానం చెప్పడానికి సందేహించవలసిన పని లేదు. ఏ మాత్రం ఆలోచించకుండానే బ్రాహ్మణాలకూ, మంత్రాలకూ ఒకే గౌరవం, ఒకే కాలం ఆపాదించిన భారతీయ వేదాంతులు సూత్రాలకు అదే విధమైన దివ్య ప్రమాణం ఆపాదించకుండా ఉండటం చూస్తే అందుకు ఏదో గట్టి వింత కారణమే ఉండవచ్చునని తెలుస్తున్నది.

శ్రుతుల వర్గం నుండి సూత్రాలను ఎందుకు మినహాయించారనేది వివరణ కోరదగిన చిక్కు ప్రశ్న. ఈ విషయంలో దర్యాప్తు జరపడానికి ఉద్యుక్తుడయ్యే విద్యార్థికి మరికొన్ని చిక్కు ప్రశ్నలు ఎదురౌతాయి. అవి పదానికీ తత్సంబంధి అధికారిక సాహిత్యంలోని మార్పులకూ, సంబంధించిన ప్రశ్నలు.

అటువంటి చిక్కు ప్రశ్నలలో ఒకటి, బ్రాహ్మణాలు అని వ్యవహరించబడే సాహిత్యవర్గానికి సంబంధించినటువంటిది. ఒకప్పుడు బ్రాహ్మణాలు శ్రుతులలో కలిసే ఉండేవి. ఆ తర్వాత అవి తమ స్థానాన్ని కోల్పోయినట్లు కనిపిస్తున్నది. మనువు, బ్రాహ్మణాలను శ్రుతుల తరగతి నుండి మినహాయించినట్లు తెలుస్తున్నది.[1] ఆ విషయం మనుస్మృతిలోని ఈ క్రింది భాగం నుండి గ్రహించవచ్చు.

"శ్రుతి అంటే వేదమని అర్థం. స్మృతి అంటే న్యాయ నియమాలు. వీటిలోని విషయాలను హేతువుతో ప్రశ్నించడానికి వీలులేదు. ఎందుచేతనంటే అవి విధి జ్ఞానాన్ని తెలుపుతాయి. హేతువాద సిద్ధాంత గ్రంథాలపై ఆధారపడి జ్ఞానానికి సంబంధించిన ఈ రెండు ప్రాథమిక ఆధారాలనూ తోసిపుచ్చే బ్రాహ్మణుని నాస్తికుడుగాను, వేద నిందకుడుగాను భావించి విజ్ఞులు సంఘ బహిష్కారం చేయాలి. విధి జ్ఞానాన్ని పొందగోరేవారికి శ్రుతి మహోన్నత ప్రమాణం". బ్రాహ్మణాలను, శ్రుతి నుండి ఎందుకు మినహాయించారు?

1. వేదంలో బ్రాహ్మణాలు కూడా చేరి ఉంటాయనే ఆధారం మీద కొందరు ఈ విషయంలో వివాదానికి దిగవచ్చు. వాస్తవానికి అది నిజమే. కాని మనువు శ్రుతి అనే పదాన్ని బ్రాహ్మణాలను మినహాయించి పరిమితార్థంలో వాడాడని నాకు అనిపిస్తున్నది. మనుస్మృతిలో బ్రాహ్మణాల ప్రసక్తి "మంత్రభాగం మాత్రమే చదవదగినది". అని చెప్పే ఒకచోట (IV. 100) తప్ప మరెక్కడా లేకపోవటం దీనిని బలపరుస్తున్నది.

III

ఇప్పుడు స్మృతులు అని చెప్పబడే సాహిత్య తరగతికి వద్దాం. వాటిలో మనుస్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి ముఖ్యమైనవి. స్మృతుల సంఖ్య ఎప్పుడూ పెరుగుతూనే వచ్చింది. బ్రిటిష్ వారు వచ్చేవరకు స్మృతుల రచన సాగుతూనే ఉంది. మైత్రామిస్తుడు 57 స్మృతులను నీలకంఠుడు 97 స్మృతులను, కమలాకరుడు 131 స్మృతులను పేర్కొన్నారు. హిందువులు పవిత్రంగా భావించే మత వాఙ్మయంలో ఇతర తరగతులన్నిటిలోకీ కూడా స్మృతి సాహిత్యం అతి పెద్దది.

వేదాలకు స్మృతులకు గల సంబంధం గురించి అనేక అంశాలున్నాయి. స్మృతిని ధర్మశాస్త్ర సాహిత్యంలో భాగంగా గుర్తించలేదనేది అందులో[1] మొదటిది. ఆ శాస్త్ర సాహిత్యానికి ప్రాతినిధ్యం వహించే బోధాయన, గౌతమ, ఆపస్తంబ, ధర్మసూత్రాల వంటివి ఈ విషయం విశదపరుస్తున్నాయి. స్మృతి అనేది మౌలికంగా సమాజంలోని వివేకవంతులైన పెద్దలు ఆమోదించి సిఫార్సు చేసిన సాంఘిక ఆచారాలు, కట్టుబాట్లకు సంబంధించి ఉంటుంది. ప్రొ॥ ఆల్టేకర్ పరిశీలన ప్రకారం :

"మొదట్లో స్మృతులన్నీ స్వభావంలోనూ సదాచారాన్ని చెప్పే విషయాలలోనూ ఒకేరకంగా ఉండేవి. స్మృతులు వ్యాప్తిలోకి వచ్చిన తర్వాత సదాచారపు అవధి సహజంగానే స్మృతులలో క్రోడీకరించిన మేరకు తగ్గిపోయింది. స్మృతులు క్రోడీకరించని పాత ఆచారాలనూ లేదా పూర్వపు ధర్మశాస్త్రాల స్మృతుల క్రోడీకరణ జరిగిన అనంతర కాలంలో సామాజిక ఆమోదం పొందిన క్రొత్త ఆచారాలనూ ఇది సూచిస్తూ వచ్చింది.

గమనించవలసిన రెండవ అంశం ఏమిటంటే వేదాలు, శ్రుతులకంటే స్మృతులు పూర్తిగా భిన్నమైనవిగా వ్యవహారంలో ఉండడం. వాటి ఆమోద ప్రమాణాలకు సంబంధించి నంతవరకు అవి పూర్తిగా భిన్నమైన ప్రాతిపదికపై నిలిచాయి. శ్రుతులకు లభించిన ఆమోదం దైవపరమైనది. స్మృతులకు లభించిన ఆమోదం సంఘపరమైనది. వాటి ప్రమాణం విషయంలో పూర్వ మీమాంస రెండు నియమాలను విధిస్తూ వుంది. ఇందులో మొదటిదేమంటే రెండు శ్రుతుల మూలపాఠాల మధ్య వైరుధ్యం ఉన్నట్లయితే, అవి రెండూ ప్రమాణాలే అవుతాయి. అంటే అందులో ఏదో ఒకదానిని అనుసరించేందుకు వేదాలు అంగీకరిస్తాయనేది అందులోని అంతరార్థం. ఇక రెండవ నియమం ఏమిటంటే స్మృతి మూలపాఠం చెప్పే విషయం శ్రుతి మూలపాఠానికి భిన్నంగా ఉన్నట్లయితే దానిని పూర్తిగా మొత్తంగా నిరాకరించాలి. ఈ నియమాలు కట్టుదిట్టంగా వర్తింపజేయడం జరిగింది. తత్ఫలితంగా స్మృతులు వేదాల ప్రతిపత్తిని గాని ప్రమాణాన్నిగాని పొందలేకపోయాయి.

1. ఈ విషయమై 'Kane Memorial Volume' లో ప్రొ॥ ఆల్టేకర్ రాసిన The Position of Smrutis as a Source of Dharma" అనే విపుల వ్యాసం (పుటలు 18-25) చూడవచ్చు.

ఇక్కడ చిత్రంగా అనిపించవచ్చుకాని, బ్రాహ్మణులు తమ అభిప్రాయాన్ని మార్చుకుని వేదాలకంటే ఉన్నతమైన ప్రతిపత్తి స్మృతులకు ఇచ్చిన కాలం ఒకటి వచ్చింది. ప్రొ॥ ఆల్టేకర్ సూచించినట్లుగా : "స్మృతులు ఆయాకాలాల అవసరాలకు అనుగుణంగా ఉండనటువంటి, లేదా వాటితో నేరుగా విభేదించేటటువంటి శ్రుతులలోని నిర్దిష్టమైన నిబంధనలను కొన్నింటిని అధిగమించి వ్యవహరించాయి. వేదాచారం ప్రకారం దైవకర్మ ప్రాతఃకాలాలలోను, పితృకర్మ మధ్యాహ్న సమయాలలోను జరపాలి. ఆ తర్వాత కాలంలో ఆధునికమైన పితృతర్పణ వాడుకలోకి వచ్చింది. ఉదయం స్నానం చేయటం దైనందిన కార్యక్రమాలలో ఒకటి కావడం వల్ల పితృతర్పణ ఉదయమే చేయడం ఆవిధంగా ప్రారంభమయింది. అయితే ఈ పద్ధతి, పై నియమం ప్రకారం నిర్ణయించిన వేద పద్ధతికి పూర్తి విరుద్ధంగా ఉంది. అయినా 'స్మృతి చంద్రిక' గ్రంథకర్త దేవంభట్టు ఇందులో తప్పేమీ లేదంటాడు. శ్రుతి నియమాన్ని తర్పణకు కాక పితృకర్మకు సంబంధించినదిగా భావించాలి. విశ్వామిత్రుడు తనకు వందమంది కుమారులు జీవించి ఉండగా 'శునశ్శేపుని' పెంచుకున్నట్లు శ్రుతి సాహిత్యం నుండి తెలుస్తున్నది. ఆ విధంగా ఒక వ్యక్తి తన సొంత కుమారులు అనేకమంది జీవించి ఉండగానే మరొకరిని పెంచుకోవడాన్ని అది అనుమతిస్తున్నదన్నమాట. అయితే, మిత్రమిశ్రుడు అటువంటి అభిప్రాయం తప్పు అంటాడు. స్మృతులలోని ఆచారం కూడ శ్రుతి మూలపాఠం మీద ఆధారపడి ఉన్నదని మనం భావించాలి. ఇప్పుడు లభ్యం కాకపోయినా మూలపాఠం ఉన్నట్లే భావించవలసి ఉంటుంది.

'నసేసో గ్నేన్య జాతామస్తి' అనే వేదవచనం కుమారుని పెంచుకునే (దత్తత తీసుకునే) పద్ధతిని నిరాకరిస్తుంది. అయినా ఆ తర్వాత కాలంలోని స్మృతులు దానిని సిఫార్సు చేస్తున్నాయి. స్మృతులు శ్రుతిని త్రోసి పుచ్చుతున్నాయని చెప్పడానికి ఇదొక స్పష్టమైన నిదర్శనం. కాని మిత్రమిశ్రుడు ఈ కార్య విధానంలో తప్పేమీ లేదంటాడు. శ్రుతి వచనం కేవలం అర్థవాదం. అది ఎటువంటి ఆంక్షనూ విధించదు. పైగా స్మృతులు హోమాలు మున్నగునవి క్రమంగా నిర్వహించేందుకు దత్తతను విహితం చేస్తున్నాయి. ఆ విధంగా అర్థవాద శ్రుతి, స్మృతి మూల పాఠం ద్వారా సమర్థంగా త్రోసివేయబడుతూంది. అందులో ఆశయంగా విధి ఒకటి ఉంది."

"తర్వాతి కాలంలో వచ్చిన సతి ఆచారం, ఆత్మహత్యను నిషేధించే వేదాజ్ఞకు పూర్తిగా విరుద్ధం. అయితే "అపరార్కుడు" శ్రుతితో వచ్చిన విభేదం మూలంగా ఆ ఆచారాన్ని రద్దు చేయటం తగదని వాదించాడు. ఎందుచేతనంటే, శ్రుతి వచనం, ఆత్మహత్యను వ్యతిరేకిస్తూ ఒక సాధారణ సూత్రాన్ని చేయగా, స్మృతులు 'విధవ' విషయంలో ఒక ప్రత్యేక మినహాయింపు నిస్తున్నాయి.

సతి, 'దత్తత' అనే ఆచారాలు మంచివో కాదో అనేది వేరే విషయం. ఏదో విధంగా సమాజం వాటిని ఆమోదించింది. స్మృతులు వాటికి నియమబద్ధమైన మంజూరునిచ్చాయి.

వేద ప్రమాణానికి వ్యతిరేకంగా కూడా వాటిని బలపరచడానికి పూనుకున్నాయి.

వేదాలకు సర్వాధిపత్యం ఇవ్వడానికి అంతగా శ్రమించిన బ్రాహ్మణులు ఆ తర్వాత వాటిని కించపరచి, వాటికంటే ఉన్నతమైన స్థానాన్ని స్మృతులకు ఎందుకు అంటగట్టారనేదే ప్రశ్న. దివ్యత్వాన్ని మించిన ఔన్నత్యాన్ని వేదాలకు కల్పించడానికి వారు ఎంతగానో కృషి చేశారు. అటువంటప్పుడు, కేవలం సామాజిక ఆమోదం తప్ప మరేమీ లేనటువంటి స్మృతుల కంటె కూడా వేదాలను కిందికి ఎందుకు లాగారు?

అందుకు వారు తీసుకున్న చర్యలు ఎంత చతురంగాను, కృతకంగాను ఉన్నాయంటే, స్మృతులకు వేదాలకంటే ఉన్నతమైన స్థానాన్ని కల్పించడంలో బ్రాహ్మణులకు ఏదో కచ్చితమైన ఉద్దేశం తప్పక ఉండి ఉంటుందనే అభిప్రాయానికి రాక తప్పదు.

ఈ వాదనలు ఎంత కృతకంగాను, చతురంగాను, అగమ్యంగాను ఉన్నాయో చెప్పడానికి వాటిని గురించి సూక్ష్మంగా తెలపడం అవసరం.

ఆ వాదం కృతకమైనదని చెప్పడానికి నిదర్శనంగా బృహస్పతి చెప్పిన అభిప్రాయం చూడవచ్చును. ఆయన చెప్పిన దాని ప్రకారం శ్రుతి, స్మృతి రెండూ బ్రాహ్మణునికి రెండు కళ్లు. అందులో ఆయన దేనిని పోగొట్టుకున్నా ఒంటికన్ను వాడవుతాడు.

ఆ వాదం చతురమైనదని చెప్పడానికి ఉదాహరణగా కుమారిలభట్టు వాదాన్ని గమనించవచ్చును. అధికారం కోల్పోయిన (అనుపలబ్ధ) శ్రుతి సిద్ధాంతం మీద ఆయన వాదం ఆధారపడి ఉంది. స్మృతులు శ్రుతులతో పూర్తిగా విరుద్ధంగా ఉన్నప్పటికీ, వాటి అభిప్రాయాలను కొట్టి వేయడానికి వీలులేదని స్మృతుల పక్షాన వాదించడం జరిగింది. ఎందుచేతనంటే, ఆ స్మృతులు బహుశః ఒకప్పుడు ఉండిన శ్రుతుల పాఠంపై ఆధారపడినవి కావచ్చును. అందుచేత ఈ వైరుధ్యం శ్రుతిమూల పాఠానికీ, స్మృతి మూల పాఠానికి మధ్య వచ్చిన వైరుధ్యం కాదు. వాస్తవానికి ప్రస్తుతం అమలులో ఉన్న స్మృతి మూల పాఠానికి ఒకప్పుడు ఉండి ఇప్పుడు ఉనికి కోల్పోయిన శ్రుతి మూలపాఠానికీ మధ్య ఏర్పడ్డ వైరుధ్యమే అది. అందుచేత, ఇప్పుడు ఉనికిలో లేని శ్రుతికి ప్రాతినిధ్యం వహించడానికే స్మృతి ఏర్పడింది.

స్మృతులు వేదాలకంటే అధికమైనవి కాకపోయినా కనీసం వాటితో సమానమైనవిగానైనా చేయడానికి బ్రాహ్మణులు అనుసరించిన మూడవ మార్గం ఒకటి ఉంది. ఇది అత్రి స్మృతిలో కనిపిస్తుంది. స్మృతులను గౌరవించనివారు, శాపానికి గురవుతారని అత్రి చెబుతాడు. అత్రి వాదం ప్రకారం, బ్రాహ్మణ్యం అనేది, శ్రుతి, స్మృతుల ఉమ్మడి అధ్యయన ఫలితంగానే వస్తుంది. ఎవరైనా ఒక వ్యక్తి వేదాలను మాత్రమే చదివి స్మృతుల పట్ల తిరస్కార భావం కనపరిస్తే ఆ వెంటనే ఇరవై ఒక్క జన్మలవరకు మృగంగా పుట్టే శాపం అతనికి తగులుతుంది.

స్మృతులకు శ్రుతులతో సమాన స్థానం ఇవ్వడానికి అంత అగమ్య మార్గాలను

బ్రాహ్మణులు ఎందుకు అనుసరించారు? అందులో వారి లక్ష్యం ఏమిటి? ప్రయోజనం ఏమిటి?

స్మృతులకు వేదాలకంటే ఉన్నతస్థానం ఇవ్వడానికి కారణం, వ్యవహార న్యాయానికి అనంతర కాలంలో చట్టబద్ధతను కల్పించడమే అనే ప్రొఫెసర్ అల్టేకర్ వాదం తగినట్టిదిగా ఆమోదించడానికి వీలులేదు. ఎందుకంటే వేదకాలంలో న్యాయం అనేది ఉండి ఆ తర్వాత ఆచారం అనేది పెరిగిన కారణం వల్లగాని, ఆ రెండింటి మధ్య వైరుధ్యం ఉన్నట్లయితే, ఆచారాలలో కనిపించే ప్రగతిశీల సిద్ధాంతాలను గుర్తించడం ద్వారా వైరుధ్యాన్ని అవి చక్కపరచవచ్చుననే కారణంపై గాని, స్మృతులకు ఆధిపత్యం (ఉన్నతస్థానం) ఇవ్వడం జరిగిందనే వాదాన్ని అర్థం చేసుకోవచ్చును. అయితే విషయం అది కాదు. వేదాలలో న్యాయం అనేది ఏదీ లేదు. ప్రొఫెసర్ కాణే సూచించినట్లుగా "న్యాయ శాసనాలన్నీ ఆచారం ద్వారా ఏర్పడ్డవే, ఆచారాలను ప్రజలు గుర్తించడం చేత, వాటికి గుర్తింపు ఇవ్వవలసిన అవసరం లేదు. రెండవది స్మృతులు వేదాలకంటే ఎక్కువ ప్రగతిశీలకమైనవని చెప్పడానికి వీలులేదు. అందరికీ తెలిసిన చాతుర్వర్ణ సిద్ధాంతాన్ని పక్కకుపెడితే పూజా విధానాల విషయాలలో తప్ప మిగతా అన్నింటిలోనూ వేదాలు సమాజం పురోభివృద్ధి చెందేందుకు పూర్తి స్వేచ్ఛనిచ్చాయి. ఇక స్మృతులు ఏమి చేశాయంటే, వేదాలలో ఉండే అభ్యుదయ నిరోధకమైన చాతుర్వర్ణ సిద్ధాంతాన్ని తీసుకొని, దానికి ప్రచారం ఇచ్చి, ప్రజల నెత్తిమీద రుద్దాయి."

అందుచేత, బ్రాహ్మణులు వేదాలకంటే స్మృతులకే సర్వాధిపత్యం ఇవ్వడానికి కారణం మరేదో ఉండాలి.

బ్రాహ్మణులు తమ మొదటి విన్యాసంతో తృప్తి చెందలేదు. మరొకటి చేశారు.

ఒకానొక సమయంలో పురాణాలు స్మృతులను అనుసరించాయి. 18 పురాణాలు, 18 ఉప పురాణాలు కలిసి మొత్తం 36. ఒక విధంగా చూస్తే పురాణాలలో చెప్పే విషయం అంతా ఒకటే. ప్రపంచ సృష్టి, స్థితి, లయల గురించి చెబుతాయి. మిగతా విషయాలలో మొత్తం మీద విభేదిస్తాయి. కొన్ని బ్రహ్మమతాన్ని, కొన్ని శివుని మతాన్ని, కొన్ని విష్ణువు మతాన్ని, కొన్ని వాయువు మతాన్ని, కొన్ని అగ్ని మతాన్ని, కొన్ని సూర్య మతాన్ని, కొన్ని స్త్రీ దేవతలు తదితర దైవతాల మతాన్నీ ప్రబోధిస్తున్నాయి.

ఇంతకు ముందు గమనించినట్లుగా ఒకకాలంలో పురాణాలను శ్రుతులలో చేర్చలేదు. ఆ తర్వాత కాలంలో ఏదో చెప్పుకోదగ్గ మార్పు వచ్చినట్లు తెలుస్తోంది. శ్రుతులలో చేర్చడానికి పనికి రావనుకున్న పురాణాలకు వేదాల మీద ఆధిపత్యం ఇవ్వడం జరిగింది.

వాయు పురాణం ఇలా చెబుతున్నది.[1]

---

1. మూయిర్ సంస్కృత సంపుటాలు.III పుట 27.

"శాస్త్రాలన్నిటిలోనూ, పురాణాన్ని మొదటగా బ్రహ్మ ఉచ్చరించాడు. ఆ తర్వాత వేదాలు ఆయన ముఖం నుండి ఉద్భవించాయి."

మత్స్య పురాణం, సృష్టి క్రమంలో వేదాలకంటే పురాణాలకే ప్రాధాన్యం ఇవ్వడమే కాకుండా, శబ్ద నిత్యత్వానికీ తాదాత్మ్యతకూ సంబంధించిన గుణాల. విషయంలో కూడ పురాణాలకు ప్రాధాన్యం ఇస్తున్నది. ఈ గుణం ఇంతకు ముందు వేదాలకే పరిమితమై ఉండేది.

అది ఏమి చెబుతోందంటే[1] –

దేవతలందరి కంటే ముందు, పితామహుడు (బ్రహ్మ) రూపుదాల్చాడు. ఆ పిమ్మట వేదాలు, వాటి అంగాలతోను, ఉపాంగాలతోను, వాటి వివిధ రకాల మూల పాఠాలతోను ఆవిష్కృతమయ్యాయి. నిత్యమైనదీ శబ్ద రూపమైనదీ, స్వచ్ఛమైనదీ, వందకోట్ల శ్లోకాలు కలదీ అయిన పురాణాన్ని శాస్త్రాలన్నిటిలోకి మొదట బ్రహ్మ ఉచ్చరించాడు. ఆ తర్వాత వేదాలు ఆయన నోటి నుండి వెలువడ్డాయి. మీమాంస న్యాయ శాస్త్రాలు కూడా అష్టముఖ నిరూపణ పద్ధతులతో ఉద్భవించాయి.

భాగవత పురాణం వేదాలతో సమానమైన ప్రమాణాన్ని కోరుతున్నది. అది ఏమి చెబుతున్నదంటే?[2]

"వేదంతో సమానంగా నిలిచే 'భాగవత' పురాణాన్ని బ్రహ్మ రాత్రుడు ప్రకటించాడు."

బ్రహ్మ వైవర్త పురాణం, వేదాల మీద ఆధిపత్యం కోరే ధీమా కలిగి ఉంది. అది ఏమంటున్నదంటే[3] –

"పూజ్య రుషిపుంగవా! మీరు దేనిని (ఏ ఋషిగురించి) అన్వేషిస్తున్నారో, మీరు దేనిని వాంఛిస్తున్నారో అదంతా నాకు తెలుసు. పురాణాలు, ఉపపురాణాలు వేదాలలోని దోషాలను ఖండించే శ్రేష్ఠమైన బ్రహ్మ వైవర్త పురాణం పురాణాల సారం.

తమ పవిత్ర గ్రంథాలకు ప్రాధాన్యతను, అగ్రగామిత్వాన్ని ఆధికారికతను కల్పించడంలో బ్రాహ్మణులు చేసిన విన్యాసాలలో ఇది రెండవది.

వేదాలను అణచివేసే కథ దీంతో పూర్తి కాలేదు. ఇంకా నికృష్టమైనది రాబోతున్నది. పురాణాల తర్వాత తంత్రాలు అనబడే మరొక తరగతికి చెందిన సాహిత్యం వచ్చింది.[4] వాటి సంఖ్య కూడా ప్రబలంగానే ఉంది. శంకరాచార్యులు 64 తంత్రాల గురించి ప్రస్తావించాడు. ఇంకా మరెన్నో ఉండి ఉండవచ్చు. సంప్రదాయ రీత్యా ఈ గ్రంథాల కర్తృత్వాన్ని త్రిమూర్తులైన

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు పుట. 28.
2. మూయిర్ సం. II లో ఉదాహరించినవి.
3. మూయిర్ సం. III లో ఉదాహరించినవి.
4. స్మార్త తాంత్రిక ధర్మాల గురించిన చర్చకోసం అనుబంధం IV, Vలను చూడవచ్చు.

బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరుల అపరావతారం అయిన దత్తాత్రేయుడికి అంటగట్టడం జరిగింది. అందుచేతనే త్రిమూర్తులను సమానంగా ఆవిష్కరింపజేసేవిగా వాటిని భావించడం జరుగుతున్నది. అయితే రూపం విషయానికి వచ్చేసరికి అవి అన్నీ శివుని మీదనే ఆధారపడి ఉన్నాయి. శివుడు ఆయన భార్య దుర్గతోనో లేదా కాళితోనో సంభాషిస్తూ తాంత్రిక సిద్ధాంతాలనూ వాటి ఆచరణనూ వెల్లడిస్తున్నట్టుగా ఇవి ఉన్నాయి. ఆయన భక్తులు వీటిని గ్రహించి ఆచరిస్తున్నారు. అధికారపూర్వకమైన ఈ ఉన్నత సంప్రదాయం శివుని కేంద్ర ముఖం నుండి లేదా పంచమ ముఖం నుండి వెలువడినట్లు కూడా చెబుతారు. ఆ విధంగా ఇది సర్వోత్తమమైన పవిత్రతను, గోప్యతను సంతరించుకున్నది. అందుచేతే ఉపదేశం పొందని వారికి వీటిని తెలపరు. వాటిని ఆగమాలని కూడా వ్యవహరిస్తారు. ఆ విధంగా ఒక్కొక్కప్పుడు వీటిని వేద పాఠాలైన నిగమాల నుండి, ధర్మశాస్త్రాల నుండి ఇతర పవిత్ర గ్రంథాల నుండి భిన్నమైనవిగా పేర్కొంటూ వుంటారు.

తంత్రాలనేవి ప్రత్యేకించి శాక్తులకు వారిలోని వివిధ తెగలవారికి మత గ్రంథాలుగా ఉన్నాయి. విభిన్నమైన ఆచారాలతో కూడిన తాంత్రిక మత శాఖలు అనేకం ఉన్నాయి. బయట వారికి వాటిలోని విభేదాలు అర్థం చేసుకోవడం కష్టం. అయితే దక్షిణాచార వంతులు తంత్రాలలోని కర్మకాండలు శ్రేష్ఠమైనవనీ అవి వేదాలకు అనుగుణంగా ఉన్నాయనీ అంటారు. కాగా వామాచార తంత్రాలు మాత్రం శూద్రులకే ఉద్దేశింపబడ్డాయి.

పురాణాల మాదిరిగా తంత్రాల బోధన ముఖ్యంగా భక్తి మార్గం మీద ఆధారపడి ఉంది. వారి ప్రకారం ఈ భక్తి మార్గం బ్రాహ్మణాలు, ఉపనిషత్తులలో చెప్పిన కర్మ మార్గ, జ్ఞాన మార్గాల కంటే ఉన్నతమైనది. ఇందులో తన సొంత దైవాన్ని ఆరాధించటం, ప్రత్యేకించి పునరుజ్జీవన శక్తికి మూలాధారమైన శివపత్నిని పూజించడం అలవరుస్తారు. ఈ రచనలన్నిటిలోను స్త్రీ సూత్రం మూర్తీభవించి ఉంటుంది. ఆమెకే ప్రాధాన్యతనిచ్చి దాదాపుగా పురుషారాధన మొత్తానికే వర్జిస్తారు.

తంత్రాలకు వేదాలతో సంబంధం ఏమిటి? మనుస్మృతికి ప్రఖ్యాత వ్యాఖ్యానకర్త అయిన కుల్లూకభట్ట శ్రుతి అనేది వైదికము, తాంత్రికము అని రెండు విధాలుగా ఉన్నదని నిస్సంకోచంగా చెప్పాడు. అంటే వేదాలు, తంత్రాలు సమాన ప్రతిపత్తిని కలిగి ఉన్నాయని అర్థం. పోతే వైదిక బ్రాహ్మణులు, కుల్లూకభట్టు మాదిరిగా తంత్రాలు వేదాలకు సమానమైనవని ఆమోదించగా తంత్ర కర్తలు అంతకంటే ముందుకు వెళ్లారు. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, 'సామాన్య స్త్రీ' వంటివనీ తంత్రాలు 'ఉన్నత వంశంలో పుట్టిన స్త్రీ' (భద్ర మహిళ) వంటివనీ అన్నారు. ఆ విధంగా తంత్రాలు వేదాలకంటే ఉన్నతమైనవని తెలియజేశారు. ఈ అవలోకన ద్వారా ఒక విషయం స్పష్టమైంది. తమ మతగ్రంథాలుగా తాము చెప్పుకునే గ్రంథాల పవిత్రత విషయంలో బ్రాహ్మణులకు స్థిరమైన నమ్మకం అంటూ ఏదీ లేదు. వేదాలు పవిత్రమైనవే

కాకుండా దోషరహితమైనవని చెప్పడానికి వారు ఎంతోగానో పోరాడారు. వేదాలు దోష రహితమైనవని చెప్పడమే కాకుండా ఆ (దోషరాహిత్య) సిద్ధాంతాన్ని బలపరచేందుకుగాను కొత్త వాదాలను కనిపెట్టటం కోసం తమ బుద్ధి కుశలతనంతటినీ ఉపయోగించారు. అయినాగాని వేదాల ప్రతిపత్తిని కూలదోసేటప్పుడు అవి మొదట స్మృతులకు, తర్వాత పురాణాలకు ఆఖరున తంత్రాలకు కూడ తక్కువే అని చెప్పడానికి ఏ కొంచెమూ వ్యాకుల పడలేదు. ప్రశ్నలలోకల్లా పెద్ద ప్రశ్న ఏమిటంటే బ్రాహ్మణులు తాము అంత పరమ పవిత్రమైనవిగా భావించిన వేదాల ప్రతిపత్తిని తగ్గించి, వాటిని స్మృతులకు, పురాణాలకు, తంత్రాలకు కింద ఉంచడానికి కారణం ఏమిటి?

అనువాదం : ఎస్.వి. రమణరావు

చిక్కుముడి : 8

# ఉపనిషత్తులు, వేదాలపై యుద్ధం ఎలా ప్రకటించాయి?

వేదాలకు సంబంధించి ఉపనిషత్తుల స్థితి ఏమిటి? అవి ఒకదానికొకటి ఔపచారికాలా? లేక, విరోధిస్తున్నాయా? వేదాలు, ఉపనిషత్తులు ఒకదానికొకటి విరుద్ధమైనవని హిందువులెవరూ ఒప్పుకోరు. పైగా ఆ రెండింటి మధ్య విరోధం లేదనీ, అవి రెండూ ఒకే ఆలోచనా సరళిగల ఏకతత్వంలోని భాగాలనీ విశ్వసిస్తారు. మరి, ఈ నమ్మకానికి సుస్థిరమైన ప్రాతిపదిక ఉన్నదా?

అటువంటి అభిప్రాయం కలగడానికి ప్రధాన కారణం, ఉపనిషత్తులు, వేదాంతం అనే మరో పేరుతో కూడా ప్రసిద్ధం కావడమే. 'వేదాంతం' అనే పదానికి రెండు అర్థాలున్నాయి. ఒక అర్థంలో వేదాంతం అంటే 'వేదాల ఆఖరు భాగం' అని అర్థం. ఇక రెండవ అర్థంలో 'వేదాల సారం' అని అర్థం. 'వేదాంతం' అనే మరొక పేరు ఉండడం వల్ల ఉపనిషత్తులు కూడా ఈ అర్థాలనే పొందజొచ్చాయి. ఈ అర్థాల వల్లనే, వేదాలకూ, ఉపనిషత్తులకు మధ్య విరోధం ఏమీ లేదనే అభిప్రాయం ఏర్పడింది.

ఉపనిషత్తులు అనే మాటకు ఉన్న ఈ అర్థాలు వాస్తవానికి ఎంతవరకు సమంజసమైనవి? మొదటగా 'వేదాంతం' అనే మాటకు అర్థం తెలుసుకోవటం ఉత్తమం. దాని అసలు అర్థం

---

ఈ వ్యాసంపైప్రతిలో (15 పుటలు) రచయిత స్వహస్తాలతో చేసిన సవరింపులున్నాయి. దీని అసలు శీర్షిక, 'వేదాలు ఉపనిషత్తులు' (వేదాలకు పోటీగా ఉపనిషత్తులు) అని. చివరి రెండు పేరాలూ రచయిత స్వయంగా చేర్చినవి. ఆయన చేతిరాతతో ఉన్నాయి. –సంకలనకర్త

ఏమిటి? 'వేదాంతం' అంటే వేదాలలో చివరి గ్రంథమని అర్థమా? ప్రొ॥ మాక్స్‌ముల్లర్ పరిశీలన ప్రకారం :

"వేదాంతం అనేది ఒక సాంకేతిక పదం. దానికి వేదంలోని చివరి భాగాలు అనిగాని, వేద సాహిత్య సంపుటాలలోని చివరి అధ్యాయాలు అనిగాని, మొదట్లో అర్థం ఉండేది కాదు; దానికి "అంతిమ లక్ష్యం" అంటే వేదాల అత్యున్నత పరమార్థం అని అర్థం. తైత్తిరేయ ఆరణ్యకం (రాజేంద్రమిత్రా సంపాదకత్వంలో వెలువడిన గ్రంథం పుట 820) వంటివానిలో కనిపించేటటువంటి వాక్యాల వల్ల వేదాంతం అంటే వేదాల చివరి భాగమని భారతీయ పండితులూ, ఐరోపా దేశ పండితులూ కూడా వాటిని అపార్థం చేసుకున్నారు. 'యో వేదాదు స్వరః ప్రోక్తో వేదాంతే కా ప్రతిష్ఠితాః' – వేదం ప్రారంభంలో పలికే ఓం అనే మాట వేదం చివరలో కూడా ఉంటుంది. ఇక్కడ 'వేదాంతం' అనే మాటను 'వేదాదు' అనే మాటకు వ్యతిరేకార్థంలో వాడారు, అంతే. సాయణాచార్యులు చేసినట్లుగా దానిని వేదాంతం అనిగాని ఉపనిషత్తు అనిగాని అనువాదం చేయడం సాధ్యం కాదు. వేదాంతం అనేది తత్వార్థంలో తైత్తిరేయ ఆరణ్యకం 817 పుటలోను, నారాయణీయ ఉపనిషత్తులో ఒక శ్లోకంలోను, అదే తిరిగి ముండక ఉపనిషత్తు III 2,6లోను మరోచోట 'వేదాంత విజ్ఞాన సునిష్కృతరః'లోనూ కనిపిస్తుంది. 'వేదాల చివరి గ్రంథాల నుండి' అని కాక, 'వేదాంతం నుండి ఉద్భవించే జ్ఞాన లక్ష్యాన్ని బాగా అర్థం చేసుకున్నవారు', అనే అర్థంలో ఇది వాడారు. శ్వేతాశ్వతర – ఉప VI - 22లో, 'వేదాంతే పరమం గుహ్యం' (వేదాంతంలోని అత్యంత రహస్యమైన) అని కనిపిస్తున్నది. ఆ తర్వాత దీనిని బహువచనంలో కూడా వాడడం జరిగింది. ఉదాహరణకు క్షురికోపనిషత్తు – 10లో 'పుండరీకేతి వేదాంతేషు నిగద్యతే' (వేదాంతంలో దీనిని పుండరీకం అంటారు). అంటే వ్యాఖ్యానకర్త చెప్పినట్లు, 'ఛాందోగ్య ఉపనిషత్తు తదితర ఉపనిషత్తులలో దీనిని 'పుండరీక' అని వ్యవహరిస్తుంటారు,' అనే అర్థం గాని 'ప్రతి వేదంలోని చివరి పుస్తకాలలోనూ దీనిని పుండరీకం అంటారు' అని మాత్రం కాదు."

గౌతమ ధర్మ సూత్రాలలో ఈ విషయం మీద మరింత సూటి అయిన సాక్ష్యాధారం ఉంది. 19వ అధ్యాయం 12వ శ్లోకంలో పవిత్రతను గురించి గౌతముడు ఈ విధంగా చెబుతున్నాడు :

"పవిత్రం చేసేవి (గ్రంథాలు) ఏమిటంటే, ఉపనిషత్తులు, వేదాంతాలూ, సంహిత (అన్ని వేదాల కూర్పు)'.... మొదలైనవి.

దీన్నిబట్టి చూస్తే గౌతముని కాలంలో ఉపనిషత్తులు వేదాంతాల కంటే వేరైనవిగానూ, అవి వైదిక వాఙ్మయంలో భాగం కానట్లూ స్పష్టమౌతుంది. హరిదత్తుడు తన వ్యాఖ్యానంలో ఇలా అంటున్నాడు :

1. ఉపనిషత్తులు SBE సం. 1 ఉపోద్ఘాతం. పుటలు LXXXVI

"ఉపనిషత్తులు కానటువంటి ఆరణ్యకాలలోని ఆ భాగాలను వేదాంతాలుగా వ్యవహరిస్తారు." ఉపనిషత్తులు వేద వాఙ్మయ పరిధిలోనికి రావనీ, అవి ఆ సూత్రాలకు వెలుపలనే ఉన్నాయనీ చెప్పడానికి నిరాక్షేపణీయమైన నిదర్శనం ఇది.

భగవద్గీతలో వేదాన్ని పేర్కొనడాన్ని బట్టి కూడా ఈ అభిప్రాయం బలపడుతుంది. 'వేద' అనే పదం భగవద్గీతలో అనేకచోట్ల వాడడం జరిగింది. శ్రీ భట్ అభిప్రాయం ప్రకారం ఆ 'పదం'లో ఉపనిషత్తులను చేర్చకుండానే రచయిత దానిని వాడినట్లుగా స్ఫురిస్తుంది.

ఉపనిషత్తుల్లో చెప్పిన విషయం, వేదాలలో చెప్పినటువంటిది కాదు. ఉపనిషత్తులు వేదాలలో భాగం కాదని చెప్పడానికి ఇది మరొక కారణం. ఉపనిషత్తు అనే మాటకు మూలం ఏమిటి? ఇది కొంతవరకు అస్పష్టంగానే ఉంది. ఉపనిషత్తు అనే మాట 'సద్' అనే ధాతువు నుండి ఉద్భవం అయినట్లు ఐరోపా పండితులు అభిప్రాయపడుతున్నారు. 'సత్' అంటే కూర్చోవడం. దానికి ముందు మరో రెండు ధాతువులున్నాయి. అవి 'ఉప', 'ని' అనేవి.'ఉప' అంటే దగ్గర, 'ని' అంటే క్రింద; వీటిని బట్టి చూస్తే ప్రజలు తమ బోధకుని వద్ద కూర్చొని, ఆయన చెప్పినది వినడానికి చేరిన 'సభ' లేదా సమావేశం అనే అర్థం వ్యక్తమవుతుంది. ఇలా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే 'త్రికాండశేష'లో ఉపనిషత్తు అనే పదానికి 'సమీప సదన' 'ఒక వ్యక్తి దగ్గర కూర్చోవడం' అనే అర్థంలో వివరణ ఇచ్చారు.

కాని ఈ ఉత్పత్తి అర్థాన్ని ఆమోదించడానికి ప్రొ॥ మాక్స్‌ముల్లర్ రెండు ఆక్షేపణలను తెలియజేశారు. మొదటిది ఏమిటంటే అటువంటి పదం ఉపనిషత్తులని వ్యవహరించే అధ్యాయాల తోబాటుగా వేదంలోని ఏ ఇతర భాగానికైనా గాని వర్తిస్తుంది. ఆ అర్థాన్ని ఎందుకు పరిమితం చేశారో ఎక్కడా వివరించలేదు. ఇక రెండవది, ఉపనిషత్తు అనే పదం సమావేశం లేదా సభ అనే అర్థంలో ఎక్కడా లేదు. ఆ పదం ఎక్కడ వచ్చినా సిద్ధాంతం, రహస్య సిద్ధాంతం అనే అర్థాలలోనో లేదా రహస్య సిద్ధాంతం ఉండే తాత్విక గ్రంథం శీర్షికగానో వాడడం జరిగింది.

శంకరుడు తైత్తిరీయ ఉపనిషత్తుపై చేసిన వ్యాఖ్యానంలో (11-9) మరొక వివరణ ఇచ్చినట్లు ప్రొ॥ మాక్స్‌ముల్లర్ చెప్పారు. దాని ప్రకారం ఉపనిషత్తులో బ్రహ్మాండం ఇమిడి ఉంది. (పరం శ్రేయోస్యం నిషణ్ణం). అందుకే దానిని ఉపనిషత్తు అన్నారు. ఈ విషయంలో ప్రొ॥ మాక్స్‌ముల్లర్ ఇలా చెబుతున్నారు.

"ఆరణ్యకాలలో వాడిన అనేక పదాలు సంకల్పించిన అర్థాన్ని ఏదో విధంగా స్ఫురింప చేసేందుకు సహాయపడేవే కాని వాస్తవ అర్థాలను నిర్దేశిస్తున్న పదాలు కావు."

ఏది ఏమైనా ప్రొ॥ మాక్స్‌ముల్లర్ ఉపనిషత్తు అనే మాట 'సద్' అనే ధాతువు నుండి ఉద్భవించినట్లు భావిస్తున్నారు. 'సద్' అంటే 'నాశనం చేయడం' అనే అర్థంలో సంసారానికి

1. 'Sacred Books of the East' సంపుటం II, పుట 275.

కారణభూతమైన అజ్ఞానాన్ని నాశనం చేసే జ్ఞానం అని దానికి అర్థం చెబుతున్నారు. అంటే, మోక్షప్రాప్తికి సాధనమైన బ్రహ్మజ్ఞానాన్ని ఎరుకపరచడం. ఉపనిషత్తు అనే మాటకు ఈ అర్థాన్నే భారతదేశంలోని పండితులందరూ ఏకగ్రీవంగా ఆమోదించటాన్ని ప్రొ॥ మాక్స్‌ముల్లర్ ఎత్తి చూపుతున్నారు.

ఉపనిషత్తు అనే మాటకు ప్రొ॥ మాక్స్‌ముల్లర్ సూచించినదే సరియైన అర్థం అని ఆమోదించినట్లయితే హిందువుల సామాన్య విశ్వాసం తప్పు అనీ, వేదాలలోనూ, ఉపనిషత్తుల లోనూ చెప్పిన విషయాలు పరస్పర పూరకాలుగా కాక విరుద్ధంగా ఉన్నాయనీ చెప్పడానికి అది ఒక సాక్ష్యాధారం అవుతుంది. ఉపనిషత్తులలోని ఆలోచనా విధానం వేదాలలో తెలిపిన దానికి విరుద్ధంగా ఉన్నదన్న విషయంలో సందేహం లేదు. ఈ విషయం నిరూపించటానికి ఉపనిషత్తుల నుంచి కొన్ని ఉదాహరణలు సరిపోతాయి. ముండక ఉపనిషత్తు ఇలా చెబుతున్నది.

1. "దేవతలందరిలోనూ మొట్టమొదట, సృష్టికర్త, లోకరక్షకుడూ అయిన బ్రహ్మ సృష్టింపబడ్డాడు. ఆయన తన పెద్ద కొడుకు అథర్వణుడికి అన్ని జ్ఞానాలకూ ఆధారమైన బ్రహ్మజ్ఞానాన్ని ఎరుకపరిచాడు.

2. తనకు బ్రహ్మ ఉపదేశించిన ఈ జ్ఞానాన్ని అథర్వణుడు అంగికి తెలియపరిచాడు. అంగి తనకు తెలిసిన దానిని భరద్వాజుని సంతతివాడైన సత్యవాహునికి బోధించాడు. ఆయన అనూచానంగా వస్తున్న ఈ జ్ఞానాన్ని అంగిరసునకు తెలిపాడు.

3. మహాసాల శౌనకుడు అంగిరసుని చేరి, ప్రణామాలాచరించి 'పూజ్య మహర్షీ! ఈ యావత్తు విశ్వాన్నీ తెలుసుకోగలిగే జ్ఞానం ఏమిటి?' అని అడిగాడు.

4. అంగిరసుడు దానికి సమాధానంగా 'తెలుసుకోదగ్గవి రెండు రకాల జ్ఞానాలున్నాయి. వాటిని పవిత్రజ్ఞానంగా ఋషులు రాసి ఉంచారు. అవి ఉన్నతమైనవి, నిమ్నమైనవి' అని చెప్పాడు.

5. నిమ్నమైనవాటిలో ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదాలు, ఉచ్చారణ శాస్త్రం, వ్యాకరణం, వ్యాఖ్యానం, ఛందస్సు, జ్యోతిశ్శాస్త్రం చేరి ఉంటాయి. ఉన్నత జ్ఞానం అనేది నాశనరహితమైన దానిని తెలుపుతుంది" అని చెప్పాడు. అంటే ఆయన ఉద్దేశం 'ఉపనిషత్తులు' అని.

ఛాందోగ ఉపనిషత్తు ఈ విధంగా చెబుతున్నది –

1. నారదుడు, సనత్‌కుమారుని వద్దకు వెళ్ళి, 'పూజ్య ఋషివరా నాకు జ్ఞాన బోధ చేయండి' అని అడిగాడు. దానికి సమాధానంగా ఆయన 'ముందు నీకు తెలిసిందేమిటో చెప్పు. అప్పుడు నీవు ఇంకా తెలుసుకోవలసినదేమిటో నేను చెబుతాను' అన్నాడు.

2. అప్పుడు, 'పూజ్య ఋషివరా! ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం, నాల్గవది అయిన అథర్వణ వేదం, ఇతిహాసాలు, వేదాలలో పంచమ వేదమైన పురాణం, పితృకర్మలు, గణితశాస్త్రం, ఉత్పాతాలు, మహోన్నత యుగాలను గురించిన జ్ఞానం, హేతుకళ, నీతిశాస్త్రం, దైవ విజ్ఞానం, ధార్మిక గ్రంథజ్ఞానం, పిశాచవిద్య, యుద్ధ శాస్త్రం, నక్షత్ర విద్య, సర్ప విజ్ఞానం, దేవతా విజ్ఞానం ఇవీ నేను చదువుకున్నవి.

3. ఓ శ్రేష్ఠుడా! నాకు మంత్రాలు మాత్రమే తెలుసు. ఆత్మ గురించి నాకేమీ తెలియదు. అయితే మీవంటి పూజ్య ఋషుల వల్ల ఆత్మజ్ఞానం గలవాడు దుఃఖాన్ని అధిగమిస్తాడు' అని విన్నాను;

'ఓ పూజ్యుడా! ఇప్పుడు నేను దుఃఖంలో ఉన్నాను. మీరు నన్ను దుఃఖ సాగరం నుండి దరి చేరుస్తారా' అని నారదుడు సమాధానం చెప్పాడు. అప్పుడు సనత్ కుమారుడు 'నీవు నేర్చుకున్నదంతా నామ మాత్రమే. అంతకు మించి ఇంకేమీ కాదు,' అని బదులు పలికాడు.

4. ఋగ్వేదం అనేది పేరుకే. అలాగే యజుర్వేదం, సామవేదం, (నాల్గవదైన) అథర్వణ వేదం, ఇతిహాసాలు, వేదాలలో ఐదవ వేదమైన పురాణాలు మొదలైనవి (ముందుచెప్పిన ఇతర శాస్త్ర శాఖలన్నీ ఇక్కడ తిరిగి చెప్పడం జరిగింది) – ఇవన్నీ కేవలం పేర్లు మాత్రమే, పూజ కోసమైన పేర్లు.

5. (బ్రహ్మ అనే భావంతో) 'నామా'న్ని ఆరాధించేవాడు. ఆ నామానికి ఉండే అర్థాలన్నిటి కంటే దానికి ఉన్నతమైన స్థానాన్ని ఆపాదిస్తాడు. నామాన్ని ఆరాధించే వ్యక్తికి ఉండే విశేషాధికారం అటువంటిది. "ఓ పూజ్యుడా నామానికి మించినది మరొకటి ఏదైనా ఉందా' అని ప్రశ్నించాడు నారదుడు. 'ఉన్నది' అన్నాడు సనత్ కుమారుడు. 'నామాన్ని మించినది ఒకటి ఉంది' అని బదులు చెప్పాడు. 'అదేమిటో నాకు చెప్పండి' అన్నాడు నారదుడు.

బృహదారణ్యక ఉపనిషత్తు ఈ విధంగా చెబుతున్నది :

"అందులో (అటువంటి సుషుప్తావస్థలో) తండ్రి తండ్రీకాదు తల్లి తల్లీ కాదు, లోకాలు లోకాలూ కావు. దేవతలు దేవతలూ కారు, వేదాలు వేదాలూ కావు, యాగాలు, యాగాలూ కావు. ఆ స్థితిలో, దొంగ దొంగ కాడు, శిశు హంతకుడు శిశు హంతకుడూ కాదు, పుల్కసుడు పుల్కసుడూ కాదు, చండాలుడు చండాలుడూ కాదు, శ్రమణుడు శ్రమణుడూ కాదు, భక్తుడు భక్తుడూ కాదు. (అటువంటి) ఋషి సత్తమునకు లాభ నష్టాలతోగాని, పాప పుణ్యాలతో గాని ఎటువంటి సంబంధమూ ఉండదు. ఎందుకంటే అప్పటికి అతడు మానసికమైన సమస్త దుఃఖాలను అధిగమించి ఉంటాడు.

కఠోపనిషత్తు ఇలా చెబుతున్నది :

"ఇటువంటి ఆత్మను ఉపదేశం వల్లగాని, తెలివిడి వల్లగాని, ధర్మశాస్త్రాల వల్లగాని సాధించలేము. ఎంచుకునే వ్యక్తి ద్వారానే అది పొందగలిగి ఉంటుంది. ఆ వ్యక్తి శరీరాన్నే తనకు స్వపరంగా ఆత్మ ఎంచుకుంటుంది."

"ఆత్మను తెలుసుకోవడం కష్టసాధ్యమైనప్పటికీ, సముచిత మార్గాలను అనుసరించి సులభంగా దానిని తెలుసుకోవచ్చు. ఈ విషయాన్నే (రచయిత) చెప్తున్నాడు. ఉపదేశం వల్లగాని, బహు వేదాలను అర్థం చేసుకోవడం వల్లగాని, గ్రంథస్థ విషయాల మనన శక్తివల్లగాని, అనేక ధర్మశాస్త్రాల పఠనం వల్ల గాని ఆత్మను పొందడానికి వీలుపడదు; దానిని సాధించటానికి సాధ్యపడదు. అయితే దానిని ఏ విధంగా పొందగలుగుతాము? అనే దానిని ఆయన వెల్లడిస్తున్నాడు."

ఉపనిషత్తులకూ, వాటిలో ఉన్న తత్వచింతనకూ గల వైరుధ్యం ఎంత ఎక్కువగా ఉంటుందో, 'అనులోమ', 'ప్రతిలోమ' అనే పదాల మూలాన్ని గమనిస్తే తెలుస్తుంది. ఈ పదాలను మామూలుగా హిందువులు వారి వివాహ సంబంధాల విషయాలలో వాడుతూ ఉంటారు. ఈ పదాల పుట్టుకను గురించి శ్రీ కాణే పండితుడు ఈ విధంగా చెబుతున్నాడు.[1]

"అనులోమ, ప్రతిలోమ అనే ఈ రెండు పదాలు (వివాహాలకు గాని, సంతానానికి గాని వర్తించే విధంగా) వేద వాఙ్మయంలో ఎక్కడా కనబడవు. బ్రహ్మజ్ఞానం కోసం బ్రాహ్మణుడు క్షత్రియుని దగ్గరకు వెళ్ళేటప్పుడు అనుసరించే ప్రక్రియా విధానానికి 'ప్రతిలోమ' అనే పదాన్ని వాడినట్లుగా బృహ.ఉ. (II 1.5) లోను, కౌషీతకి, బృ. ఉ. (IV 8) లోను ఉంది.

అనులోమ అంటే వారసునికి సంబంధించిన ప్రకారం అని అర్థం. అంటే స్వాభావిక పద్ధతి ప్రకారం అన్నమాట. ప్రతిలోమ అంటే వారసునికి ప్రతిగా అంటే, స్వాభావిక పద్ధతికి విరుద్ధంగా అన్నమాట. శ్రీ కాణే గమనించిన దానిని బట్టి, ప్రతిలోమ అనే పదానికి గల నిర్వచనాన్ని బట్టి చూస్తే, ఉపనిషత్తులు, వేద వాఙ్మయంలో భాగమనే మాట అటుంచి వాటిని వేద బ్రాహ్మణులు హీనమైనవిగా భావించారన్న విషయం విదితమౌతుంది. వేదాలకు, ఉపనిషత్తులకు మధ్య సయోధ్య లేనికాలం ఒకటి ఉన్నదని చెప్పడానికి ఇది అదనపు సాక్ష్యాధారంగా నిలిచిపోతుంది. ఉపనిషత్తులు చదువుకున్న బ్రాహ్మణుల పట్ల వేద బ్రాహ్మణుల కుండే వైఖరికి తార్కాణంగా మరొక ఉదాహరణ చెప్పవచ్చు. అది బోధాయన ధర్మ సూత్రాలలో కనిపిస్తుంది. బోధాయనుడు, తన ధర్మ సూత్రాలలో (ii 8.3), శ్రాద్ధకర్మకు, ఇతర బ్రాహ్మణులు ఎవరూ దొరకనపుడు 'రహస్య విదుని' ఆహ్వానించవచ్చునని చెప్పాడు. రహస్యవిదుడు అంటే ఉపనిషత్తులు చదువుకున్న బ్రాహ్మణుడు అని అర్థం.

వేదాలు, ఉపనిషత్తులు ఒకదానికొకటి ఔపచారికాలు అన్న నమ్మకం వ్యాప్తిలోకి రావడం నిజంగా ఒక చిక్కు ప్రశ్న.

**అనువాదం : ఎస్.వి. రమణరావు**

1. 'History of Dharma Sastra', సంపుటం II, భాగం 1, పుట 52.

చిక్కుముడి : 9

# ఉపనిషత్తులు వేదాలకు విధేయంగా ఎలా మారాయి?

ఇంతకు ముందు అధ్యాయంలో, ఉపనిషత్తులు అసలు మొదట్లో వేదాలలో భాగంగా ఉండేవి కావనీ సిద్ధాంత రీత్యా అవి ఒకదాని కొకటి విరుద్ధమనీ తెలియజేయడం జరిగింది. ఇప్పుడు వేదాలకు ఉపనిషత్తులకు మధ్య ఆ తరువాతి కాలంలో ఏర్పడ్డ సంబంధాన్ని పోల్చి చూడడం ఆసక్తిదాయకంగా ఉంటుంది. వాటి మధ్య దరిమిలా ఏర్పడ్డ సంబంధాలు ఎటువంటివో జైమిని, బాదరాయణుడు అనే ఇద్దరు తత్వవేత్తల మధ్య ఏర్పడ్డ వివాదాన్ని బట్టి చక్కగా తెలుసుకోవచ్చు.

జైమిని 'మీమాంస సూత్రాలు' రచించాడు. బాదరాయణుడు "బ్రహ్మ సూత్రాలు" రచించాడు. జైమిని వేదాలను సమర్థించగా బాదరాయణుడు ఉపనిషత్తులను సమర్థించాడు.

ఇంతకూ వివాదాస్పదమైన అంశం ఏమిటంటే యజ్ఞయాగాదులు చేయవలసిన అవసరం ఉన్నదా? అనేది. వేదాలు, అవసరం ఉన్నదంటాయి. ఉపనిషత్తులు అవసరం లేదంటాయి.

బాదరాయణుడు తన సూత్రాల (2-7)లో జైమిని సిద్ధాంతాన్ని తెలియజేశాడు, శంకరాచార్యుడు తన వ్యాఖ్యానంలో దానిని వివరించాడు.

---

**జైమిని బాదరాయణుడు అనేది ఈ అధ్యాయపు అసలు శీర్షిక. దాన్ని తర్వాత మార్చేశారు. ఇది తొమ్మిది పుటల టైపు ప్రతి. మొదటి రెండు పుటల్లోనూ గ్రంథకర్త స్వహస్తాలతో చేసిన దిద్దుబాట్లున్నాయి. — సంకలనకర్త.**

జైమిని ఈ క్రింది విధంగా అభిప్రాయపడ్డాడు. ఏ వ్యక్తి అయినా గానీ తాను తన శరీరాని కంటే భిన్నమైన వాడననీ మరణించిన తర్వాత, స్వర్గానికి వెళ్ళి, అక్కడ తన యాగ ఫలాన్ని అనుభవిస్తాననీ తెలిస్తేనే తప్ప యాగాలు చేయడు. ఆత్మజ్ఞానాన్ని గురించి వివరించే గ్రంథాలు కేవలం యాగకర్తకు విషయం విశద పరచడానికే ఉపకరిస్తాయి. అందుచేత అవి అటువంటి క్రతుకర్మలకు లోబడి ఉంటాయి. జైమిని మాటలను క్లుప్తంగా చెప్పాలంటే వేదాంతం బోధించేదంతా ఆత్మ అనేది శరీరానికి భిన్నమైనదనీ శరీరంతో నిమిత్తం లేకుండా జీవిస్తుందనీ. అటువంటి జ్ఞానం సరిపోదు. ఆత్మ అనేదానికి స్వర్గం చేరుకోవాలనే ఆకాంక్ష వుండాలి. అయితే వైదిక కర్మలను నిర్వహిస్తే తప్ప, అది స్వర్గాన్ని చేరుకోలేదు. దీనినే కర్మకాండ బోధిస్తున్నది. అందుచేత ఆయన కర్మకాండ ఒక్కటే మోక్షం అంటాడు. ఆ దృష్ట్యా జ్ఞాన కాండ పూర్తిగా నిరుపయోగం. దీనికోసం వేదాంతాన్ని[2] విశ్వసించే వారి ప్రవర్తనపై జెమిని ఆధారపడుతున్నాడు .

"విదేహ రాజైన జనకుడు యజ్ఞం చేసి ఎన్నో బహుమతులు పంచాడు..." (బృ. 3.1.1) "... మహాశయులారా! నేనొక యజ్ఞాన్ని చేయబోతున్నాను....." (ఛాం. 5.11.5) జనకుడు, అశ్వపతి ఇరువురూ ఆత్మజ్ఞానం గలవారు. ఈ ఆత్మజ్ఞానంతో వారు మోక్షసిద్ధి పొందినట్లయితే, వారు యజ్ఞాలు చేయవలసిన అవసరం లేదు. కాని జనకుని యజ్ఞం గురించీ, అశ్వపతి యజ్ఞం గురించీ ఉదహరించిన పై రెండు మూల పాఠాలూ, వారు యజ్ఞాలు చేసినట్లే తెలుపుతున్నాయి. అంచేత యజ్ఞకర్మల ద్వారా మాత్రమే మోక్షం సంప్రాప్తిస్తుంది తప్ప వేదాంతులు అభిప్రాయ పడినట్లుగా ఆత్మజ్ఞానం ద్వారా కాదు అనేది దీనివల్ల రుజువౌతున్నది."

ఆత్మజ్ఞానం అనేది యజ్ఞయాగాల కంటే తక్కువదని[3] పురాణాలు స్పష్టంగా తెలుపు తున్నాయని జైమిని నొక్కి చెప్పాడు. అంతేకాదు, ఈ రెండూ[4] (అంటే జ్ఞానమూ, కర్మకాండ) కలిసే పని చేస్తాయని (శరీరం నుంచి) విడివడే ఆత్మకు ఫలితాలను వదిలిపెడతాయనీ చెబుతూ ఆయన తన వాదాన్ని సమర్థించుకున్నాడు. బాదరాయణుని జ్ఞానకాండకు స్వతంత్ర స్థితిని ఇవ్వటానికి జైమిని నిరాకరించాడు. అందుకు చెప్పే మొదటి కారణం[5] "ఆత్మజ్ఞానం స్వతంత్రంగా ఎటువంటి ఫలితాన్ని ఇవ్వదు" అని.

రెండవ కారణం[6] – "వేద ప్రమాణం ప్రకారం (ఆత్మ) జ్ఞానం కర్మకాండ కంటే తక్కువది" అని.

బాదరాయణుని జ్ఞానకాండ విషయంలో జైమిని అభిప్రాయం ఇది.

---

1. బాదరాయణ సూత్రాలు. 2 శంకరుని వ్యా నం
2. I I I 3 శంకరుని వ్యాఖ్యా నం
3. I I I 4 శంకరుని వ్యా నం
4.. I I I 5 శంకరుని వ్యాఖ్యా నం
5. I I I 6 శంకరుని వ్యాఖ్యా నం
6. I I I 7 శంకరుని వ్యాఖ్యా నం

మరి జైమిని గురించి అతని కర్మకాండ గురించీ బాదరాయణుని అభిప్రాయం ఏమిటి? ఈ విషయాన్ని బాదరాయణుడు 8 నుండి 17 వరకు గల సూత్రాలలో వివరించాడు. బాదరాయణుని మొదటి[1] అభిప్రాయం ఏమిటంటే, జైమిని చెప్పిన ఆత్మ అనేది పరిమితమైనది. ఆత్మను అంటే జీవిలోని ఆత్మనూ పరమాత్మనూ ప్రత్యేకించి చూపాలి. ఈ పరమాత్మ అనేదాన్ని పురాణాలు గుర్తించాయి.

బాదరాయణుని రెండవ అభిప్రాయం[2] ఏమిటంటే, వేదాలు, ఆత్మజ్ఞానాన్నీ, యజ్ఞ యాగాదులనూ రెండింటినీ బలపరుస్తున్నాయని.

ఇక బాదరాయణుని మూడవ అభిప్రాయం ప్రకారం[3] – వేదాలలో విశ్వాసం ఉన్నవారు మాత్రమే యజ్ఞయాగాదులు చేయవలసి ఉంటుంది. అయితే ఉపనిషత్తులను పాటించే వారికి ఆ నిషేధాజ్ఞ లేదు. శంకరాచార్యుడు వివరించినట్లుగా "వేదాలు చదివి యజ్ఞయాగాదుల గురించి తెలిసినటువంటి వారు యజ్ఞాలు చేయడానికి హక్కు కలిగి ఉంటారు. ఉపనిషత్తుల నుండి ఆత్మజ్ఞానం పొందిన వారికి ఇటువంటి యజ్ఞాలు, నిర్ణయించడం జరగలేదు. అటువంటి జ్ఞానం కర్మకాండకు పొసగనిది.

బాదరాయణుడు వెలిబుచ్చిన నాల్గవ అభిప్రాయం ప్రకారం[4] – బ్రహ్మానందం పొందిన వారికి కర్మకాండ అనేది ఐచ్ఛికమైన విషయం.

శంకరాచార్యులు వివరించినట్లుగా –

"కొంతమంది తమంత తాముగా కర్మకాండలు అన్నిటినీ వదిలివేశారు. విషయం ఏమిటంటే ఆత్మజ్ఞానం గలవారు ఇతరులకు మార్గదర్శకంగా ఉండేందుకు ఆత్మజ్ఞానం తర్వాత లేదా దానితోబాటుగా కర్మకాండను ఎంచుకుంటూ ఉండగా మిగిలిన వారు కర్మకాండ మొత్తానికే వదిలివేశారు. కర్మకాండ విషయంలో ఆత్మజ్ఞానులకు ఎటువంటి నిర్బంధమూ ఉండదు. పోతే బాదరాయణుడు చెప్పిన ఆఖరు అభిప్రాయం[5] ఏమిటంటే "ఆత్మజ్ఞానమనేది, యావత్తు కర్మకాండకూ విరుద్ధమైనది. అందుచేత అది కర్మకాండకు అధీనమైనది కావడానికి వీలులేదు."

దీనికి బలవర్ధకంగా సాక్ష్యాధారాలను ఆయన పురాణాల నుంచి[6] తీసుకున్నారు. పురాణాలు, సన్యాసాన్ని నాల్గవ ఆశ్రమంగా గుర్తించి, కర్మకాండ నిర్ణయించిన యజ్ఞ నిర్వహణ నుండి సన్యాసిని తప్పిస్తున్నాయి.

1. బాదరాయణుని సూత్రాలు. 8
2. ! ! !
3. ! ! ! 1
4. ! ! ! 1
5. ! ! ! 1
6. ! ! ! 17

బాదరాయణ సూత్రాలలో ఈ రెండు తత్వశాఖల పండితుల పరస్పర అభిప్రాయాలను సూచించే సూత్రాలు అనేకం కనిపిస్తాయి. అయితే పైన పేర్కొన్న ఒక్క అభిప్రాయమూ అటువంటి ప్రత్యేకతను వ్యక్తపరచడానికి సరిపోతుంది. ఈ విషయాన్ని ఎవరైనా నిశితంగా పరిశీలించదలిస్తే మాత్రం పరిస్థితి విచిత్రమైందిగా మారిపోతుంది. జైమిని వేదాంతాన్ని అసత్యమైన శాస్త్రంగానూ, మాయావాదంగాను, భ్రాంతి జనితమైనదిగాను, నిస్సారమైనదిగాను, అనవసరమైనదిగాను, దుర్బలమైనదిగాను, ఆక్షేపించాడు. ఈ విమర్శకు బాదరాయణుని సమాధానం ఏమిటి? ఉపనిషత్తులు చెప్పినట్లు ఆయన జైమిని కర్మకాండను, అసత్యమైన శాస్త్రంగానూ, మాయావాదంగానూ, భ్రాంతి జనితంగానూ, నిస్సారమైనదిగాను, అనవసరమైనదిగానూ, దుర్బలమైనదిగానూ, ఆక్షేపించాడా? లేదు, ఆయన తన వేదాంత శాస్త్రాన్ని సమర్థించుకున్నాడు అంతే. అంతకంటే ఎక్కువ ఏమైనా చెబుతాడేమోనని అందరూ ఎదురు చూశారు. జైమిని చెప్పిన కర్మకాండను అసత్యమైన మతంగా బాదరాయణుడు ఆక్షేపిస్తాడని అందరూ ఎదురు చూశారు. కాని బాదరాయణుడు మాత్రం ఆ విషయంలో ధైర్యం చూపలేదు. పైపెచ్చు క్షమాపణ కోరే ధోరణిలో ప్రవర్తించాడు. జైమిని కర్మకాండ పురాణాల మీద ఆధారపడి ఉన్నదనీ, ఆ పురాణాలు, ఎదిరించడానికి వీలు లేని ప్రామాణ్యాన్నీ, పవిత్రతనూ కలిగి ఉన్నాయనీ ఆయన ఒప్పుకున్నాడు. ఆయన నొక్కి చెప్పేదల్లా తన వేదాంత సిద్ధాంతం కూడా సత్యమేననీ దానికి కూడా పురాణాల బలం ఉందనీను. విషయం ఇంతటితో పూర్తి కాలేదు. బాదరాయణుడు ఏం చేశాడంటే "వేదాంతం" అనే పదాన్ని ఈ రెండు అర్థాలు స్ఫురింప చేసేటట్లుగా వాడాడు. ఉపనిషత్తులు, వేద సాహిత్యంలో భాగమేనని ఉద్ఘాటించే (రీతిలో) అర్థంలో దానిని వాడాడు.

వేదాంతం లేదా ఉపనిషత్తులలోని జ్ఞానకాండ అనేది, వేదాలలో తెలిపిన కర్మకాండకు వ్యతిరేకం కాదనీ, అవి ఒకదాని కొకటి అనుగుణమైనవనీ నొక్కి చెప్పేందుకు కూడా ఆయన ఆ పదాన్ని వాడాడు. మొత్తం మీద బాదరాయణుడు తన వేదాంత సూత్రాల నిర్మాణ స్వరూపాన్ని ఈ ఆధారం మీదనే నిలబెట్టాడు. వేదాంత సూత్రాలను లయించుకొన్న బాదరాయణుని ఈ సిద్ధాంతం ఉపనిషత్తులు వేద భాగాలనీ వేదాలకు, ఉపనిషత్తులకూ మధ్య ఎటువంటి వైషమ్యమూ లేదనీ ప్రబోధిస్తున్నది. ఇది, ఉపనిషత్తులకూ వాటికి వేదాలతో గల సంబంధానికీ పూర్తి భిన్నంగా ఉంది. బాదరాయణుని వైఖరి అర్థం చేసుకోవడం అంత సులభం కాదు. తన ఎదిరి పక్షపు వాదాన్ని ఆమోదిస్తూ వింత గొలిపే రీతిలో యుద్ధానికి దిగే యోధుని మాదిరిగా ఉంటుంది, బాదరాయణుని తీరు. ఉపనిషత్తులతో భేదించే వేదాల అమోఘత్వంపై జైమిని వాదాన్ని బాదరాయణుడు ఎందుకు ఒప్పుకున్నాడు? ఉపనిషత్తులు ప్రబోధించిన సత్యం కోసం,కేవలం సత్యం కోసం, సత్యం తప్ప మరేమీ కాని దాని కోసం ఆయన ఎందుకు నిలబడలేదు? బాదరాయణుడు తన వేదాంత సూత్రాలలో ఉపనిషత్తులకు ద్రోహం ఎందుకు తలపెట్టాడు? ఆయన ఎందుకు అలా చేశాడు?

అనువాదం : యస్.వి. రమణరావు

చిక్కుముడి : 10

# హిందూ దేవుళ్ళు ఒకరితో మరొకరు పోట్లాడుకొనేలా బ్రాహ్మణులు ఎందుకు చేశారు?

ప్రపంచం విషయంలో హిందూ తాత్త్విక చింతన త్రిమూర్తి సిద్ధాంతం మీద ఆధారపడి ఉంది. ఈ సిద్ధాంతం ప్రకారం ప్రపంచం మూడు దశలకు లోనవుతుంటుంది. అవి సృష్టి, స్థితి, లయాలు. నిర్విరామంగా అనంతంగా ఈ చక్రభ్రమణం జరుగుతూనే ఉంటుంది. ఇందులో జరిగే మూడు రకాల పనులను ముగ్గురు దేవతలు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు నిర్వహిస్తారు. బ్రహ్మ ప్రపంచాన్ని సృష్టిస్తాడు, విష్ణువు సంరక్షిస్తాడు. మహేశ్వరుడు పునః సృష్టికోసం దానిని లయింపజేస్తాడు. ఈ ముగ్గురు దేవతలనే త్రిమూర్తులంటారు. త్రిమూర్తి సిద్ధాంతం ప్రకారం ఈ దేవతలు ముగ్గురు సమాన ప్రతిపత్తి కలిగి వుంటారు. వారు చేసే పనులు ఏకకాలంలోనే సాగుతాయి. పోటీ అంటూ ఉండదు. వారు ముగ్గురూ మిత్రులే. పోటీ పడేవారు కాదు. ఒకరికొకరు సహకరించుకుంటారేగాని, శత్రుత్వం వహించరు.

అయితే ఈ ముగ్గురు దేవతల విధులను వివరించే సాహిత్యాన్ని పరికిస్తే – సిద్ధాంతానికి, ఆచరణకు మధ్య పూర్తిగా భిన్నత్వం కనిపిస్తుంది. ఈ దేవతలు ఒకరికొకరు మంచి మిత్రులుగా కంటే గట్టి శత్రువలుగానే కనిపిస్తారు. ఆధిపత్యం కోసం, సార్వభౌమత్వం కోసం వారిలో వారు పోటీ పడుతూ ఉంటారు. పురాణాలలో కనిపించే కొన్ని ఉదాహరణలు ఈ విషయాన్ని

---

దీనికి అసలు శీర్షిక 'యుద్ధాల్లో దేవతలు' (Gods at War) అని. ఇది 25 పుటల టైపు ప్రతి. దిద్దుబాటు చేసిన ప్రతిలోని ముగింపు పుటలు మూడు, రచయిత దస్తూరీతో ఉన్నాయి.
–సంకలనకర్త

స్పష్టపరుస్తాయి.

ఒక్కోసారి బ్రహ్మ, శివ విష్ణువుల కంటే అధికుడుగా కనిపిస్తాడు. బ్రహ్మ ఈ విశ్వానికి సృష్టికర్త అని చెబుతారు. అంటే మొదటి ప్రజాపతి అన్నమాట. ఆయనే శివుని సృష్టించినవాడు, విష్ణువుకు గురువూను. విష్ణువు ఈ విశ్వాన్ని సంరక్షించేవాడు కావడానికి కారణం – బ్రహ్మ ఆయనను ఆ విధంగా శాసించడమే! బ్రహ్మ ఎంత గొప్పవాడంటే రుద్రుడు, నారాయణుడు పోట్లాడుకున్నా, కృష్ణుడు, శివుడు పోట్లాడుకున్నా ఆయన వాళ్ల మధ్య రాజీ కుదురుస్తూ ఉంటాడు.

అలాగే ఆ తర్వాత బ్రహ్మకు, శివ విష్ణువులకు విరోధం వచ్చినప్పుడు, విచిత్రంగా బ్రహ్మ తన స్థానాన్ని, ఆధిపత్యాన్ని (వాళ్ల ముందు) కోల్పోతాడు. విష్ణువుతో ఆయన విరోధించిన రెండు ఉదాహరణలు ఇక్కడ చెప్పుకోవచ్చు.

అందులో మొదటిది అవతారాల కథ. ఈ అవతారాల విషయంలో బ్రహ్మకు విష్ణువుకు విరోధం వచ్చింది. ఆపదల నుండి మానవాళిని ఆదుకోవడానికి భగవంతుడు ఎత్తిన అవతారాల సిద్ధాంతం బ్రహ్మతో ప్రారంభమయింది. ఆయన వరాహ (అడవి పంది) మత్స్య (చేప) అవతారాలు ఎత్తినట్లు చెబుతారు. అయితే విష్ణుభక్తులు మాత్రం దీనిని ఒప్పుకోరు. ఈ అవతారాలన్నీ బ్రహ్మ దాల్చిన అవతారాలు కావనీ, అవి విష్ణువు అవతారాలనీ వాళ్లు చెబుతారు. ఇవన్నీ విష్ణువుకు అంటకట్టడమే కాకుండా మరికొన్ని అవతారాలను కూడా వారు చేర్చారు.

పురాణాలు, విష్ణువు అవతారాలుగా పెక్కింటిని పేర్కొన్నాయి. వివిధ పురాణాలు వివిధ అవతారాల జాబితాలను తయారు చేశాయి. వాటిని ఈ క్రింద చూడవచ్చు.

## విష్ణువు అవతారాలు

| వరుస సంఖ్య (1) | హరివంశం ప్రకారం (2) | నారాయణీ యాఖ్యానం ప్రకారం (3) | వరాహ పురాణం ప్రకారం (4) | వాయు పురాణం ప్రకారం (5) | భాగవత పురాణం (6) |
|---|---|---|---|---|---|
| 1 | వరాహ | హంస | కూర్మ | నారసింహ | సనత్ కుమారుడు |
| 2. | నారసింహ | కూర్మ | మత్స్య | వామన | వరాహ |
| 3. | వామన | మత్స్య | వరాహ | వరాహ | – |
| 4. | పరశురామ | వరాహ | నారసింహ | కూర్మ | నర నారాయణ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5. | రామ | నారసింహ | వామన | సంగ్రామ | కపిల |
| 6. | కృష్ణ | వామన | పరశురామ | ఆదివాక | దత్తాత్రేయ |
| 7. | – | పరశురామ | రామ | త్రిపురారి | జద్న (యజ్ఞుడు) |
| 8. | – | రామ | కృష్ణ | అంధకార | వృషభ (ఉరుక్రముడు) |
| 9. | – | కృష్ణ | బుద్ధ | ధ్వజ | పృధుడు |
| 10. | | కల్కి | కల్కి | వర్త | మత్స్య |
| 11. | | | | హాలాహల | కూర్మ |
| 12. | | | | కోలాహల | ధన్వంతరి |
| 13. | | | | | మోహిని |
| 14. | | | | | నారసింహ |
| 15. | | | | | వామన |
| 16. | | | | | పరశురామ |
| 17. | | | | | వేదవ్యాస |
| 18. | | | | | శ్రీరామ |
| 19. | | | | | బలరామ |
| 20. | | | | | కృష్ణ |
| 21. | | | | | బుద్ధ |
| 22. | | | | | కల్కి |

ఇక రెండో కథ (సృష్టిలో) మొదట పుట్టిన వారిని గురించి చెప్పడం జరిగింది. ఇది స్కంద పురాణంలో ఉంది. అ కథ ప్రకారం, విష్ణువు ఒకప్పుడు దేవి వక్షస్థలం మీద పడుకుని నిద్రపోతుండగా ఆయన నాభి నుండి ఒక కమలం ఉద్భవించింది. పైకి పోతున్న ఆ పుష్పం, జలం ఉపరితలానికి చేరుకున్నది. బ్రహ్మ ఆ పుష్పం నుండి ఆవిర్భవించి, చుట్టూ కలయజూశాడు. అవధులు లేని విశాల విశ్వంలో ఏ ఒక్క జీవీ కనపడక పోవటం గమనించి, తానే ముందు పుట్టినవాడుగా ఊహించుకున్నాడు. భవిష్య జీవులన్నిటికంటే తానే ముందు

పుట్టినట్లు అర్హత ఆపాదించుకున్నాడు. అయినాగాని ఈ విషయంలో క్షుణ్ణంగా పరిశోధన చేయాలనీ, తన ఆధిపత్యాన్ని కాదనే జీవి ఏదైనా ఈ విశ్వంలో ఉన్నదేమో తెలుసుకోవాలనీ నిర్ణయించుకున్నాడు. కమలం కాడ నుండి క్రిందకు జారి వెళ్ళి అక్కడ నిద్రపోతున్న విష్ణువును చూశాడు. 'నీవెవరు!' అని బిగ్గరగా అరచాడు. 'నేను మొదట పుట్టిన వాడను' అని విష్ణువు జవాబిచ్చాడు. బ్రహ్మ అందుకు ఒప్పుకోకుండా అతనితో యుద్ధానికి దిగాడు. మహాదేవుడు కోపంతో వారి మధ్యకు వచ్చి 'నిజానికి నేనే ముందు పుట్టినవాడను' అని గద్దించేవరకూ వారు పోట్లాడుకుంటూనే ఉన్నారు. మహాదేవుడు వారితో ఇలా అన్నాడు. "మీలో ఎవ్వరైతే నా శీర్షం వెనుకకు చేరుకోగలుగుతారో లేదా నా పాదం మడమ చేరుకోగలుగుతారో వారికి నా స్థానాన్ని అప్పగిస్తాను' అని చెప్పాడు. బ్రహ్మ పైకి విష్ణువు క్రిందికి గమ్యాన్ని వెతుక్కుంటూ వెళ్ళారు. బ్రహ్మ పై కి ఎక్కుతూ వెళ్ళి లక్ష్యాన్ని చేరుకోలేక అలసిపోయాడు. అయినప్పటికీ తన అర్హతను వదలుకోవడానికి ఇష్టపడలేదు. మహాదేవుని వద్దకు తిరిగి వచ్చి, ఆయన శీర్ష శిఖరాన్ని చేరుకుని వచ్చానని చెప్పాడు. అందుకు సాక్ష్యంగా మొట్టమొదట పుట్టిన ఆవును చూపించాడు. ఈ విధంగా బ్రహ్మ గర్వంతో అసత్యం పలికినందుకు ఉగ్రుడైన మహాదేవుడు (శివుడు) బ్రహ్మకు ఏ విధమైన పవిత్ర కర్మలు (పూజలు) జరగరాదని శపించాడు. అంతేకాకుండా ఆవు నోరు అపవిత్రం అయ్యేటట్టు కూడ శాపం ఇచ్చాడు. విష్ణువు తిరిగి వచ్చి తాను మహాదేవుని పాదం చూడలేకపోయానని ఒప్పుకున్నాడు. దానికి మహాదేవుడు (సంతసించి) అతనిని దేవతలందరిలోకి మొదట పుట్టినవాడిగా, అందరికంటే ఉన్నతుడుగా ప్రకటించాడు. ఆ తర్వాతనే మహాదేవుడు బ్రహ్మ ఐదవ ముఖాన్ని ఖండించి వేశాడు. దానితో బ్రహ్మ గర్వం అణిగిపోయింది. అతని అధికారం, ప్రతిష్ట కూడా అడుగంటిపోయాయి.

ఈ కథను బట్టి తాను మొదట పుట్టినవాడనని బ్రహ్మ చెప్పుకోవడం అసత్యం అని తేలింది. ఆ విధంగా చెప్పినందుకు ఆయనను శివుడు శిక్షించాడు. విష్ణువు తాను మొదట పుట్టినవాడనని చెప్పుకునే హక్కు సంపాదించుకున్నాడు. శివుని దయవల్లనే విష్ణువు ఆ హక్కు సంపాదించుకున్నాడు. బ్రహ్మకు వాస్తవంగా దక్కవలసిన దానిని, శివుని తోడ్పాటుతో విష్ణువు పొందినందుకు బ్రహ్మ భక్తులు విష్ణువుపై కోపించారు. ప్రతీకారంగా వారు మరో కథ అల్లారు. దాని ప్రకారం, విష్ణువు బ్రహ్మ నాసికారంధ్రాల నుండి పందిరూపంలో పుట్టి క్రమంగా అడవి పంది రూపం దాల్చాడు. విష్ణువు అవతారాలలోని అడవి పంది రూపానికి ఇది అతి క్షుద్రమైన వివరణ.

దీని తర్వాత బ్రహ్మ, శివునికి విష్ణువుకూ మధ్య వైరం కల్పించడానికి ప్రయత్నించాడు. ఇదంతా తన స్థానాన్ని పదిల పరచుకోడానికే అనేది స్పష్టమౌతుంది. రామాయణంలో ఈ కథ ఉంది. దాని ప్రకారం, "మిథిలాధీశుడైన జనకుని కుమార్తె సీతకు రామునికి వివాహం జరిగిన వెంటనే, జనకుని దగ్గర దశరథ మహారాజు సెలవు తీసికొని తన రాజధానీ నగరానికి తిరిగి వస్తూ ఉన్నప్పుడు కొన్ని ప్రత్యేక రకాల పక్షులు దుశ్శకునాలు పలికాయి. అడవిలో క్రూర మృగాల

సంచారం శుభ సూచకమని వశిష్ఠ మహాముని రాజును శాంతింపజేశాడు. అయితే అది పరశురాముని రాకకు సూచకం అని తర్వాత తెలిసింది. ముందు పెను తుఫాను రావడం, భూమి కంపించడం, చెట్లు నేలకు ఒరిగిపోవడం, కారు చీకటి సూర్యుణ్ణి కమ్మి వేయటం వంటి ఉత్పాతాలన్నీ జరిగాక చూడడానికే భయంకరంగా అగ్నిలా ప్రకాశిస్తూ పరశును చేతపట్టుకొని విల్లు భుజానికి తగిలించుకుని పరశురాముడు దృగ్గోచరమయ్యాడు. వీరంతా గౌరవ మర్యాదలతో ఆయనను ఆహ్వానించారు. ఆయన దానిని సాదరంగా స్వీకరించాడు. దశరథ తనయుడైన రాముని ఉద్దేశించి మాట్లాడుతూ, జనకుని వద్ద నున్న విల్లు విరచడంలో అతడు చూపిన పరాక్రమాన్ని తాను విన్నాననీ, తాను మరొక విల్లు తీసికొని వచ్చాననీ, దానిని వంచి బాణాన్ని సంధించాలనీ చెప్పాడు. ఆ విధంగా చేయగలిగినట్లయితే తాను రామునితో బాహాబాహి యుద్ధానికి తలపడతానన్నాడు. ఈ మాట విని దశరథుడు కలత చెంది మన్నించవలసిందిగా పరశురాముని వేడుకోవటం మొదలెట్టాడు. అయినా పరశురాముడు పట్టించుకోకుండా రాముడు విరచిన ధనువు శివునిదనీ తానిప్పుడు తీసికొని వచ్చిన ధనుస్సు విష్ణువుదనీ, ఈ రెండు దివ్య ధనుస్సులనూ విశ్వకర్మ నిర్మించాడనీ, అందులో ఒకదానిని దేవతలు మహాదేవునికి ఇచ్చారనీ, రెండవ దానిని విష్ణువుకు ఇచ్చారనీ చెప్పాడు.

ఆ తర్వాత కథనం ఇలా సాగింది –

"శితి కంఠుడైన మహాదేవుని యొక్క, విష్ణుదేవుని యొక్క, బలాబలాలు తెలుసుకోగోరి దేవతలందరూ బ్రహ్మను ప్రార్థించారు. ఈ ముగ్గురిలోను శ్రేష్ఠుడైన బ్రహ్మ, దేవతల కోరికను తెలుసుకుని వారిద్దరి మధ్య వైరం కల్పించాడు. అప్పుడు శితికంఠునికీ, విష్ణువుకూ మధ్య భీకరమైన పోరు ప్రారంభమయింది. ఒకరినొకరు జయించాలనే పట్టుదలతో వారు పోరాడారు. అరి భయంకర శక్తిగల శివ ధనువు పటుత్వాన్ని కోల్పోయింది. ముక్కంటి నిర్వీర్యుడై గొణుక్కుంటూ ఉండిపోయాడు. మహోన్నతులైన ఈ దైవాలు ఇద్దరిని అక్కడకు చేరిన దేవతలు, ఋషులు,చారణులు వేడుకోగా వారు శాంతించారు. విష్ణువు పరాక్రమం చేత శివధనువు పటుత్వాన్ని కోల్పోవడం చూసి, దేవతలు, ఋషులు, విష్ణువే గొప్పవాడని గౌరవించారు."

ఆ విధంగా బ్రహ్మ తనకు మహాదేవుని వల్ల జరిగిన అన్యాయానికి పగ తీర్చుకున్నాడు. అయితే విష్ణువు మీద ఆధిపత్యాన్ని నిలుపుకునేందుకు బ్రహ్మకు ఈ యుక్తి కూడ పనికి రాలేదు. బ్రహ్మ తన ఆధిపత్యాన్ని ఎంతవరకు పోగొట్టుకున్నాడంటే ఒకప్పుడు బ్రహ్మ చెప్పినట్లు నడచుకొనే విష్ణువు, ఇప్పుడు బ్రహ్మకే సృష్టికర్త అయ్యాడు.

ఆధిపత్యం కోసం శివునితో పోటీపడి బ్రహ్మ ఇదే విధమైన అపజయాన్ని చవిచూశాడు. ఇక్కడ కూడా ఆయన తన హోదాను పూర్తిగా కోల్పోయాడు. బ్రహ్మ చేత సృష్టింప బడడం కాక, శివుడే బ్రహ్మకు సృష్టికర్త అయ్యాడు. మోక్షాన్నిచ్చే అధికారాన్ని కోల్పోయాడు బ్రహ్మ.

శివుడు మోక్షాన్ని ప్రసాదించే దేవుడయ్యాడు. ఇక బ్రహ్మ మోక్ష ప్రాప్తి[1] నిస్తూ శివుని, శివలింగాన్ని ఆరాధించే సామాన్య భక్తుడయ్యాడు. చివరకు ఆయనను సేవకుని స్థితికి దిగజార్చారు. శివుని ద్వారపాలకుడిగా పనిచేస్తూ ఉండేవాడు బ్రహ్మ.[2]

తన సొంత కుమార్తెతోనే వ్యభిచరించాడనే నెపం మీద చివరకు బ్రహ్మకు పూజార్హత లేకుండా చేశారు. ఈ ఆరోపణ భాగవత పురాణంలో కనిపిస్తుంది. అది ఈ క్రింది విధంగా ఉంది.

"ఓ క్షత్రియా! స్వయంభువు (బ్రహ్మ) అత్యంత మనోహరంగా ఉండే తన కుమార్తె వాక్కు (వాగ్దేవి) పట్ల మరులు కొన్నట్లు మేము విన్నాం. అయితే ఆమెకు మాత్రం ఆయన యెడల ఎటువంటి వాంఛా లేదు. బ్రహ్మ కుమారులైన మునులు తమ తండ్రి దుష్ట తలంపును గమనించి మరీచి నాయకత్వంలో ఆయన వద్దకు వెళ్లి మర్యాదపూర్వంగానే మందలింపుగా ఆయనతో ఇలా అన్నారు. "మహానుభావుడవైన నీవు నీ వాంఛను చంపుకోలేక కామంతో కుమార్తెను సమీపించావు. నీకు ముందున్నవారు గాని నీ తర్వాత వారుగానీ ఎవ్వరూ ఇటువంటి పని చేసి ఉండలేదు, చేయరు. ఓ విశ్వదర్శీ! మహిమాన్వితుల యెడల సైతం ఇది మెచ్చుకోదగింది కాదు, ఇటువంటి పనులకు (వావి వరుసలు) హద్దు లేర్పరిస్తే మానవులు సంతోషిస్తారు. తన తేజస్సుతో, తనలో ఇమిడి ఉన్న విశ్వాన్ని బహిర్గత పరచిన విష్ణువుకు జయమగుగాక! ఆయన ధర్మాన్ని కాపాడుగాక!" ఆ విధంగా మాట్లాడుతున్న తన కుమారులైన ప్రజాపతులను చూసి (ప్రజాపతుల జనకుడైన) బ్రహ్మ సిగ్గుపడి, తన శరీరాన్ని త్యజించాడు. భయానకమైన ఆ శరీరాన్ని దిక్కులు గ్రహించగా చిమ్మచీకటి (తమిస్రనీహారం) పుట్టింది.

ఈ విధంగా బ్రహ్మను దింపివేసి అప్రతిష్ఠపాలు చేయడం, అతనిని పూర్తిగా అధోగతికి త్రోయడానికే అనేది స్పష్టంగానే తెలుస్తున్నది. త్రిమూర్తులలో బ్రహ్మ నామమాత్రావశిష్టుడయ్యాడు. బ్రహ్మపూజ భారతదేశంలో తుడిచిపెట్టుకుపోయిందంటే విచిత్రం కాదు.

బ్రహ్మను రంగంనుంచి పంపి వేసిన తర్వాత ఇక శివుడు, విష్ణువు మిగిలారు. అయితే వారెప్పుడూ సామరస్యంతో లేరు. వారిద్దరి మధ్య శత్రుత్వం కొనసాగుతూనే ఉంది.

శివునికి విష్ణువుకు భక్తులైన బ్రాహ్మణులు సాగించిన అనుకూల, వ్యతిరేక ప్రచారాలతో పురాణాలు నిండి పోయాయి. ఇవి ఎంత చక్కగా నప్పాయో ఈ క్రింది ఉదాహరణల నుండి తెలుసుకోవచ్చు.

విష్ణువుకు, వైదిక దేవుడైన సూర్యునితో అన్వయం పెట్టారు విష్ణు భక్తులు.

1. మహాభారతం మూయిర్ ఉల్లేఖనం IV. పుట 192.
2. మహాభారతం మూయిర్ ఉల్లేఖనం IV. పు. 199.

శివభక్తులు శివునికీ అగ్నికీ సంబంధం ఉన్నదన్నారు. విష్ణువుకు వేదమూలం ఉంటే శివునికి కూడా ఉండాలన్నదే ఇందులో ఉద్దేశం. పుట్టుక గొప్పతనం (వంశ గౌరవం) విషయంలో ఒకరికొకరు తీసిపోలేదు.

శివుడు విష్ణువు కంటే గొప్పవాడై ఉండవచ్చు, అయినా విష్ణువు శివునికంటే తక్కువవాడు కాదు. విష్ణువుకు సహస్ర నామాలున్నాయి. అలాగే శివునికి కూడ సహస్ర నామాలుండాలి గదా! అందుకే ఆయనకు కూడా ఉన్నాయి.

విష్ణువుకు గుర్తుగా కొన్ని చిహ్నాలున్నాయి.[1] అవి నాలుగు. అలాగే శివునికి కూడా ఉండాలి మరి. అలాగే ఆయనకు కూడా ఏర్పడ్డాయి. అవేవంటే (1) ప్రవహిస్తున్న గంగ (2) చంద్రుడు (నెలవంక) (3) శేషుడు (పాము), (4) జట (జటాజూటం). శివుడు, విష్ణువుతో పోటీపడని ఒకే ఒక అంశం ఏమిటంటే, అవతారాలు. అయితే అలా పోటీ పడాలనే కోరిక ఆయనకు లేకపోలేదు. కాని శివుడు అవతారాలు దాల్చడానికి తాత్త్వికంగా ఒక అవరోధం వుంది. నిత్యానంద (శాశ్వతానంద) భావనలో శైవులకు, వైష్ణవులకు సిద్ధాంతపరంగా భేదం ఉంది. శ్రీ అయ్యరు చెప్పినట్లుగా –

"శారీరక, మానసిక శృంఖలాల నుండి, వాటిని పూర్తిగా నిర్మూలన చేయడం ద్వారా అంతిమ మోక్షాన్ని చేరుకోవడమే శైవుల లక్ష్యం. అందుచేత శైవులు రుద్రుణ్ణి నాశరహితునిగా భావిస్తారు. అంటే తాను ఎన్నటికీ నశింపనివాడై, సమస్తాన్నీ నాశనం చేసేవాడని, లేదా ధ్వంసం చేసేవాడని వారి భావం. అందుకే రుద్రుణ్ణి లయకారుడు అంటారు. ఆధ్యాత్మికంగా క్రమ వికాసం చెందిన అంతిమ దశలో పరమేష్ఠికీ భక్తునికీ అంతరం ఉండ కూడదు. మనో వాక్కాయాలకు, సుఖ దుఃఖాలకు, వైరుధ్య, ద్వంద్వాలకు అతీతంగా ఉండాలి. శివునికంటే తాను భిన్నమైనవాడనని భావించలేని దశలో భక్తుడు శివునితో సాయుజ్యం పొందుతాడు. ఆ దశను చేరుకునే వరకు ఆయన ఎంత పవిత్రుడైనప్పటికీ, ఎంత అర్హుడైనప్పటికీ అత్యున్నతమైన సాయుజ్య దశకు పరిపూర్ణుడు కాజాలడు. ఎందుకంటే అర్హులై ఉండే గొప్ప సాధకులు, సాయుజ్య దశకు కిందివైన సాలోక్య, సామీప్య, సారూప్య దశలను మాత్రమే పొందగలిగారు. అవతారాల సిద్ధాంతం శివునికి వర్తించక పోవడానికి ఇది కూడా కారణం కావచ్చును. భగవంతుడు అవతారం ధరించినప్పుడు ఆయన కొన్ని పరిమితులకు లోబడి ఉండే మానవ మాత్రుడే! బంధాల నుండి విముక్తి కలిగించుకునే శక్తి ఆయనకు ఉండవచ్చును కాని బంధాలు లేనటువంటి వాడు మాత్రం కాదు. అయితే వైష్ణవుడు ఇందుకు భిన్నంగా విశ్వసిస్తాడు. ఒక వ్యక్తి చేరుకోగల, చేరుకోవలసిన అత్యున్నత దశ విషయంలో అతనికి కూడా ఇదే విధమైన భావన ఉంటుంది. ఆ దశను తప్పనిసరిగా చేరుకోవాలనడంలోనూ బేదాభిప్రాయం లేదు. అయితే మానవుడు తన వ్యక్తిత్వం పూర్తిగా వదులుకోవాలనడంలో కొంత వివాదం ఉంది.

1. పద్మ పురాణంలో ఇవి చెప్పారు.

పరమాత్మతో ఏకం కావాలి, అలా ఏకమవుతున్న విషయం భక్తుని స్ఫురణలో ఉండాలి. నాశరహితమైన పరమాత్మకు మరో రూపమని భావించే విశ్వంతో మమేకం కావాలి. మరోవిధంగా చెప్పాలంటే పరమ పురుషుని కంటే భిన్నమైనదీ, విశిష్టమైనదీ అయిన విశ్వ విధ్వంసానికి అతడు సుముఖుడు కాడు. కాగా, ఆవిర్భూత (విరాట్) పురుషుని కంటె ఎక్కువగాని తక్కువగాని కానిదైన ఈ విశ్వాన్ని సంరక్షించడానికే అతడు సుముఖంగా ఉంటాడు. అందుచేతనే విష్ణువుకు జగద్రక్షకుడని పేరువచ్చింది. సత్య దర్శనంలో లేదా సత్య భావనలో ఉన్న మార్గ భేదమే ఇందుకు కారణం కావచ్చు. శైవుడు ఈ విశ్వాన్ని బాధా తప్తమైనదిగా దుఃఖభాజనమైనదిగా భావిస్తాడు. అంటే పాశాలు, బంధాలు కలదిగా భావిస్తాడు. (అటువంటి పాశాలతో బద్ధుడౌతాడు కనకనే 'పశువు'); ఈ బంధాలు ఛేదించి ధ్వంసం చేయాలి. వైష్ణవుడు పరమ పురుషుని గొప్పదనానికి నిదర్శనంగా దీనిని భావిస్తాడు. అందుచేతనే రక్షించాలంటాడు. ఈ జగత్తంతా దుఃఖమయమనే అభిప్రాయంతోనే శైవుడు ధర్మశాస్త్రాలను, అర్థ శాస్త్రాలను, ఇతర పురాణాలను అవి ఈ ప్రపంచంలో క్రమ పద్ధతులను నెలకొల్పేందుకు ఉద్దేశించినవైనప్పటికీ, లోక కల్యాణానికి అవసరమైనవైనప్పటికీ, వాటిని గౌరవించడానికి ఇష్టపడడు. నియమాలను, ఆచారాలను తిరస్కరించి వాటిని పాటించకుండా ఉంటాడు. శైవాన్ని పూర్తిగా అర్థం చేసుకున్న శైవుడు, కులతత్వ భావాలను అసహ్యించుకుంటాడు. తన స్థితికి ఎదగని ఇతరులలో అటువంటి భావాలున్నప్పుడు ఆయన కొంతవరకు సహించుకోగలడు. పరమ శివునితో సామీప్య, సాలోక్య, సారూప్య, సాయుజ్యాలకు అర్హత సంపాదించుకున్న వారిని మాత్రమే, వారు ఏ కులానికి చెందినా, గౌరవిస్తాడు, వారితో సాంగత్యం ఏర్పరచుకుంటాడు. ఇక వైష్ణవుడు ప్రపంచంలో శాంతి, సౌఖ్యాలను పెంపొందించగల నియమ నిబంధనలన్నిటిని పరిరక్షించుకోడానికి తాపత్రయపడతాడు. ధర్మం నశిస్తే ప్రపంచం కూడా నశించిపోతుంది. జగత్కర్త అయిన పురుషుని మహిమ వల్ల ఆవిష్కరింపబడ్డ ప్రపంచం నశించకూడదు; కనుక, ధర్మ సంరక్షణ కోసం పరిశ్రమించడం ఆయన విధి. పరిస్థితులు అతని చేయి దాటి పోయినపుడు, విష్ణువే ధర్మ రక్షణకు పూనుకుని అవతారం ఎత్తి వస్తాడని అతని విశ్వాసం. అయితే విష్ణువు భూమి మీదకు అవతరిస్తే అది దుష్టశిక్షణకే అవుతుంది. అంటే ధర్మానికి హాని కలిగించే వారందరిని ఆయన శిక్షిస్తాడన్నమాట. అందుచేత విష్ణువు చేత భయంకరమైన శిక్షకు పాత్రుడు కాకుండా జాగ్రత్త పడడం ఎంతో అవసరం. పోతే, శివభక్తులకు మార్గదర్శకంగా ఉండే ఆగమాలు గాని నియమాలు గాని కులానికి ఎటువంటి ప్రాముఖ్యం ఇవ్వలేదు. సాధారణంగా భక్తుల కర్తవ్యాలను గురించే అందులో చెప్పడం జరిగింది. అటువంటి కర్తవ్యాలను సక్రమంగా నిర్వర్తిస్తే అవి భగవత్ సాక్షాత్కారానికి భక్తులను పాత్రులను చేసి తుదకు శివునిలో ఐక్యమైపోడానికి దోహదం చేస్తాయని చెప్పారు. అయితే, శివభక్తులు కానివారు, వీటిని నింద్యమైనవిగా భావిస్తారు; అవి కుల భావాలకు విముఖంగా ఉండడమే అందుకు కారణం. ఇంతకు ముందు చెప్పినట్లుగా వాటిని గురించి పాత (ప్రామాణిక)

పురాణాలలో ఎక్కడా ఏమీ లేదు."

కీర్తినీ, మహర్షులనూ తెలిపే కృత్యాల విషయాన్ని గమనిస్తే శివుని ప్రాధాన్యాన్ని ఉటంకిస్తూ చేసే ప్రచారం, విష్ణువు గురించిన విరుద్ధ ప్రచారంతో కూడి ఉంటుంది. ఇందుకు ఉదాహరణగా పవిత్ర గంగానది అవతరణ గురించిన కథ గమనించవచ్చు. శివభక్తులు గంగ పుట్టుకను శివునికి అంటగడతారు. గంగ శివుని జడ నుండి ఉద్భవించిందని వారి భావన. అయితే వైష్ణవులు దీనికి సమ్మతించరు. వారు మరో కథ అల్లారు. విష్ణు పురాణం ప్రకారం వరప్రదాయిని అయిన గంగ మొదట విష్ణు నివాసమైన వైకుంఠంలో విష్ణుదేవుని పాదం నుండి ప్రవహిస్తూ కైలాసానికి దిగి శివుని శిరస్సుపై పడుతుంది. ఈ విధంగా చెప్పడంలో ద్వంద్వార్థం కనిపిస్తుంది. మొదటిది గంగ శివుని నుండి రాలేదనీ, రెండవది శివుడు విష్ణువు కంటే తక్కువవాడనీ. అందుచేతనే విష్ణుపాదం నుండి ప్రవహించే నీటిని శివుడు శిరస్సుపై ధరిస్తాడని అర్థం అవుతుంది.

ఇందుకు మరొక ఉదాహరణ, దేవాసురుల సముద్ర మధనానికి సంబంధించిన కథ. సముద్రాన్ని మధించటానికి మందర పర్వతాన్ని కవ్వంగానూ, ఆదిశేషుణ్ణి ఆ పర్వతానికి కట్టే (కవ్వపు) తాడుగానూ వారు ఉభయులూ ఉపయోగించారు. అప్పుడు భూమి కంపించిపోయింది. ప్రపంచమంతా అంతరించిపోతుందని ప్రజలు భయపడిపోయారు. అప్పుడు విష్ణువు కూర్మావతారం ఎత్తి తన వీపుపై భూమిని పట్టి ఉంచాడు. ఆ విధంగా మధనం పూర్తి అయ్యేవరకు భూమి కంపించకుండా ఆపగలిగాడు విష్ణువు. విష్ణువును ప్రస్తుతిస్తూ చెప్పే కథలలో ఇదొకటి. దీనికి శైవులు మరికొంత చేర్చారు. దాని ప్రకారం, మధనం వల్ల సముద్ర గర్భం నుండి పధ్నాలుగు వస్తువులు బయటకు వచ్చాయట. వాటినే చతుర్దశ రత్నాలంటారు. ఈ పధ్నాలుగింటిలోను ప్రాణాంతకమైన గరళం ఒకటి. దీనిని ఎవరో ఒకరు త్రాగకపోతే అది ఈ భూమినంతటినీ భస్మీభూతం చేస్తుంది. లోక సంరక్షణార్థం శివుడు ఒక్కడే సాహసంతో దానిని త్రాగడానికి సిద్ధపడ్డాడు. ఇందులో అంతరార్థం ఏమిటంటే, పరస్పర శత్రువులైన దేవాసురులను సముద్ర మధనం చేసి గరళం తీసికొని రావడానికి అనుమతించడమే విష్ణువు చేసిన తెలివితక్కువ పని. మహిమాన్వితుడైన పరమశివుడు దానిని త్రాగివేసి, విష్ణువు తెలివితక్కువ తనంవల్ల ఉత్పన్నమైన దుష్పరిణామాల బారి నుండి ప్రపంచాన్ని రక్షించాడు.

ఇక మూడవ ఉదాహరణలో విష్ణువు మూర్ఖుడని నిరూపించి, ఎంతో వివేకమూ, ఎంతో శక్తి గల శివుడు, విష్ణువును అతడు చేసిన తప్పిదం నుండి రక్షించినట్లు చెప్పారు. ఇదే అక్రూరాసురుని కథ. అక్రూరుడనేవాడు ఎలుగు ముఖంగల రాక్షసుడు. అతడు ఎడతెగకుండా వేదాలు చదువుతూ పూజాదికాలు చేస్తూ ఉండేవాడు. విష్ణువు అతని భక్తికి మెచ్చి 'వరం ఇస్తాను కోరుకో'మన్నాడు. అప్పుడు అక్రూరుడు, ముల్లోకాలలోను అప్పటికి పుట్టి వున్న ఏ జీవికీ తనను చంపగలిగే శక్తి లేకుండా ఉండేట్టు వరం ఇమ్మన్నాడు. విష్ణువు అతని కోరికను

మన్నించాడు. రాక్షసుడు గర్వంతో దేవతలను అణచివేశాడు. వారంతా దాక్కోవలసి వచ్చింది. ఆ తర్వాత రాక్షసుడు ప్రపంచం అంతటి మీదా ఆధిపత్యం వహించాడు. రాక్షసుని కృతఘ్నతకు విష్ణువు ఎంతగానో కలత చెందాడు. ఆయనకు కోపం పెల్లుబికింది. విష్ణువు అప్పుడు 'కాళి' ఒడ్డున కూర్చుని వున్నాడు. ఇంతకు ముందెన్నడు రానటువంటి ఆగ్రహజ్వాల ఆయన నేత్రాల నుండి సాకారంతో వెలువడింది. అప్పుడు విధ్వంసనశీలుడైన ఆ మహాదేవుడు విజృంభించి విష్ణువు చింతను త్రుటిలో తొలగించాడు.

దీనికి ప్రతిగా భస్మాసురుని కథ చెబుతారు. ఇందులో శివుణ్ణి మూర్ఖుడుగాను, విష్ణువును శివుని తప్పిదం నుండి రక్షించిన మహానుభావునిగాను చిత్రీకరించడం జరిగింది. శివుని ప్రసన్నం చేసుకున్న భస్మాసురుడు ఆయనను ఒక వరం కోరతాడు. అదేమిటంటే భస్మాసురుడు ఎవరి తలపైన అయినా చేయిపెడితే ఆ వ్యక్తి భస్మం అయిపోవాలి. శివుడు వరం ఇచ్చాడు. భస్మాసురుడు ఆ వరాన్ని శివుని మీదే ప్రయోగించి దాని శక్తిని పరీక్షించ బూనుకున్నాడు. అప్పుడు శివుడు భయభ్రాంతుడై రక్షించవలసిందిగా విష్ణువు దగ్గరకు పరిగెత్తాడు. విష్ణువు అతనిని రక్షిస్తానని మాట ఇచ్చి ఒక అందమైన స్త్రీ రూపం ధరించి భస్మాసురుని దగ్గరకు వెళ్లాడు. భస్మాసురుడు ఆమె అందానికి ముగ్ధుడయిపోయాడు. స్త్రీ రూపంలో వున్న విష్ణువు భస్మాసురుని కోరిక తీర్చడానికి షరతు పెట్టాడు. అదేమిటంటే తాను చెప్పిన పనులన్నీ భస్మాసురుడు చేయాలి. అందుకు ఆయన అంగీకరించాడు. అప్పుడు విష్ణువు, భస్మాసురునితో "చేతులు తలపైన పెట్టుకోవాల"ని అన్నాడు. భస్మాసురుడు అలాగే చేశాడు, ఫలితంగా వెంటనే మరణించాడు. శివుడు చేసిన పొరపాటు వల్ల కలిగిన అనర్థం నుండి అతనిని రక్షించిన ఘనత విష్ణువుకు దక్కింది.

"ఈశుడు (మహాదేవుడు) ఏ కారణాల వల్ల అయినా హేతువులకే హేతుభూతుడౌతాడా? మరొకరి లింగాన్ని దేవతలు పూజించినట్లుగా మనం ఎక్కడా వినలేదు. అలా ఎవరైనా విన్నట్లయితే, (మహేశ్వరునిది కాక మరొకరిది ఎవరిదైనా లింగాన్ని ఇప్పుడు పూజిస్తున్నట్లుగా దేవతలు ఎప్పుడైనా ఇంతకు ముందు ఎవరిదైనా పూజించినట్టు) వెల్లడించండి. బ్రహ్మ, విష్ణువు, ఇంద్రాది సమస్త దేవతలు, ఆయన లింగాన్ని నిరంతరాయంగా పూజిస్తుంటారు కాబట్టే ఆయన (మహాదేవుడు) అప్పుడు అందరిలోకీ అతి శ్రేష్ఠుడైనాడు. ఎందుకంటే, బ్రహ్మ కమలం గుర్తుతో కాని, విష్ణువు చక్రం గుర్తుతోగాని, ఇంద్రుని వజ్రాయుధం గుర్తుతోగాని లోకంలో పిల్లలు పుట్టరు. స్త్రీ, పురుష అంగాలతోనే పుడతారు. అందుచేతనే సంతానం మహేశ్వరుని నుంచి వచ్చినదైంది. దేవి అంశతో పుట్టిన వారందరు స్త్రీలుగా, స్త్రీ అంగంతోను, మహేశ్వరుని అంశతో పుట్టినవాళ్లందరు పురుషులుగా పురుష అంగంతోను పుడతారు. ఈ ముల్లోకాలలోను, చరాచర జగత్తు యావత్తు సృష్టికి కారణభూతుడు మహేశ్వరుడు కాదని లేదా దేవీ అంశతో గుర్తించబడని స్త్రీ ఎవరైనా ఉన్నదీ అనిగాని చెప్పే వ్యక్తిని మూర్ఖునిగా భావించి గెంటివేయాలి. పురుష రూపంలో ఉండే ప్రతిదాన్నీ, 'ఈశ్వరుడు'గాను, స్త్రీ రూపంలో ఉండే

ప్రతి జీవిని 'ఉమ'గాను భావించాలి. ఎందుచేతనంటే, ఈ చరాచర జగత్తు అంతా ఈ రెండు (శరీర) శక్తులతోనే నిండి ఉంది.

గ్రీకు తాత్వికుడు జెనోఫేన్స్ బహుళ ఆస్తికత్వత లేదా అనేక దేవతల ఆరాధన ఊహించరాని విషయమని, పరస్పర విరుద్ధమైనదనీ అభిప్రాయపడ్డాడు. ఏకేశ్వరోపాసన ఒకటే వాస్తవమైన సిద్ధాంతం. తాత్విక దృష్టితో చూస్తే జెనోఫేన్స్ అభిప్రాయమే సరియైనది కావచ్చు. అయితే చారిత్రక ఆధారాల దృష్ట్యా ఈ రెండూ స్వాభావికమైనవే. ఏకేశ్వరోపాసన అనేది సమాజం ఒకే ఒక సముదాయంగా ఉన్నప్పుడు సాధ్యమౌతుంది. సమాజం అనేక సముదాయాలతో కూడి ఉన్నప్పుడు బహుదైవారాధన స్వాభావికమూ, తప్పనిసరీ కూడా అవుతుంది. ప్రతి ప్రాచీన మానవ సముదాయంలోను కేవలం ప్రజలే కాదు, వారితోపాటు వారు ఆరాధించే దైవాలు కూడా చేరి ఉండడం చేత, వివిధ సముదాయాలు ఒకటిగా లీనమైపోవడం అసాధ్యమవుతుంది. అలా కలిసిపోవాలంటే ఆ సముదాయం ఆరాధించే దైవాన్ని కూడా మిగిలినవారు స్వీకరించాలి. ఈ విధంగా బహు దైవారాధన అనేది పెరుగుతూ వచ్చింది.

ఇలాంటి పరిణామాల వల్లనే హిందూ సమాజంలో అనేకమంది దేవతలు ఏర్పడ్డారనేది స్పష్టమౌతుంది. ఎందుచేతనంటే హిందూ సమాజం అనేక తెగల సముదాయం. ఆయా తెగలకు వారి వారి ప్రత్యేక దేవతలుంటారు. ఇంతకీ చిత్రంగా తోచే దృగ్విషయం ఏమిటంటే ఈ హిందూ దేవతలు ఒకరితో ఒకరు పోట్లాడుకుంటూ వైరుధ్యాలు పెంచుకుంటూ, ఒకరిపై మరొకరు ఆరోపణలు చేసుకుంటూ ఉండటం. ఇవన్నీ సామాన్య మానవులకు సిగ్గునూ అవమానాన్నీ కలిగిస్తాయి. దీనికి వివరణ కావాలి.

అనువాదం : ఎస్.వి. రమణరావు

చిక్కుముడి : 11

# బ్రాహ్మణులు హిందూ దేవుళ్లకు ఉచ్ఛపతన దశలు ఎందుకు కల్పించారు ?

హిందువులను విగ్రహారాధకులని నిందిస్తుంటారు. విగ్రహారాధనలో తప్పు ఏమీ లేదు. విగ్రహాన్ని తయారు చేయటం 'పెట్టుకోవటం' దేవుని చిత్రపటం ఉంచుకోవటం కంటే ఎక్కువ ఏమీ కాదు. చిత్రపటం పెట్టుకోవటంలో తప్పేమీ లేనపుడు ప్రతిమను పెట్టుకోవటం లోనూ తప్పు ఉండనక్కరలేదు. హిందువుల విగ్రహారాధనలో నిజమైన అభ్యంతరం ఏమంటే అది కేవలం చిత్రపటం పెట్టుకోవటం కాదు, కేవలం ప్రతిమ పెట్టుకోవటం కాదు, దానికంటే ఎక్కువ వేరే ఉన్నది - హిందువుల ప్రతిమ సజీవమైనది, ఒక మానవమాత్రుడు చేసే పనులన్నీ అది చేస్తుంది. ప్రాణ ప్రతిష్ఠ అనే పూజ ద్వారా హిందువులు ప్రతిమకు జీవం పోస్తారు. బౌద్ధులు కూడా విగ్రహారాధకులే; ఎందుకంటే వారు కూడా బుద్ధుని విగ్రహాన్ని పూజిస్తారు. అయితే వారు పూజించేది చిత్రపటం మాత్రమే, ప్రతిమ మాత్రమే. దానిలో ఆత్మ ఉండదు. బ్రాహ్మణులు హిందూ దేవుళ్ళకు ఆత్మలు ఇచ్చి వారిని జీవిస్తున్నవారిలా ఎందుకు చేశారనేది పరిశీలన చెయ్యవలసిందే, చేస్తే ఎన్నో ఆశ్చర్యకరమైన విషయాలు బయటపడతాయి. అయితే ఆ పరిశీలన ఈ అధ్యాయం పరిధిలోకి రాదు.

---

ఇది 43 పుటల టైపు ప్రతి. రచయిత దస్తూరీతో దిద్దుబాట్లు, మార్పులు ఉన్నాయి. ముగింపు పేరా రచయిత దస్తూరీతో ఉంది. "The Rise and Fall of the Gods" (దేవుళ్ళ ఔన్నత్యం-పతనం) అనేది దీని అసలు శీర్షిక. అది నీలిరంగు పెన్సిల్‌తో కొట్టి వేయబడి ఉంది. విషయ భాగాలు కొట్టి వేయటానికి రచయిత సాధారణంగా నీలి రంగు పెన్సిల్ వాడేవారు. – సంకలనకర్త

హిందువుల మీద సాధారణంగా మోపే రెండో అభియోగం ఏమంటే వారు బహు దేవతలను పూజిస్తారని. బహుదేవతలను పూజిస్తారనే నింద ఉన్నవారు ఒక్క హిందువులే కాదు; ఇతర జాతులలో కూడా బహుదేవతలను పూజించే ఆచారం ఉన్నట్టు కనిపిస్తున్నది. వీరిలో ఇద్దరిని మాత్రం ప్రస్తావిస్తాను. గ్రీకులు, రోమన్లు ప్రధానంగా బహుదేవతారాధకులు. వారు కూడా ఎందరో దేవుళ్లను ఆరాధించారు. అందువల్ల ఈ అభియోగంలో అంత బలం లేదు.

హిందువులపై చేయవలసిన నిజమైన అభియోగం చాలామందికి తెలిసినట్టు లేదు. హిందువులు వారి దేవుళ్లను ఆరాధించటంలో ఎప్పుడూ నిలకడగా లేరనేది నిజమైన అభియోగం. నిలకడగా ఒక దేవునిపట్ల విధేయత, విశ్వాసం, భక్తి చూపటం అనేది వీరిలో లేదు. హిందూ దేవుళ్ల చరిత్రలో ఉచ్ఛ పతన దశలు తరచుగా కనిపిస్తాయి.

ఒక కాలంలో కొందరు దేవుళ్లను ఆరాధించటం, ఆ తర్వాత వారిని కొలవటం మానివేయటం, అంతేకాకుండా ఆ దేవుళ్లను చెత్తకుండీలో పారవేయటం అనేది సర్వసాధారణంగా కనిపిస్తుంది. (పాతవారిని వదిలేసి) చాలా కొత్త దేవుళ్లను తెచ్చిపెట్టుకొని ఎంతో భక్తి శ్రద్ధలతో పూజలు చేస్తారు, వారి భక్తి నిండుగా ఉండి అవధులు దాటిపోతుంది. కొన్నాళ్ళకు మళ్లీ ఈ కొత్త దేవుళ్లను విడిచిపెట్టేస్తారు, ఇంకో కొత్త దేవుళ్లను తెచ్చి పెట్టుకుంటారు. ఈ విధంగా హిందూ దేవుళ్ళు ఎల్లప్పుడూ ఔన్నత్య పతనావస్థలలో ఉంటారు. ప్రపంచంలో ఏ జాతుల చరిత్రలోనూ ఈ పద్ధతి కనబడదు.

హిందువులు తమ దేవుళ్లను చాలా చులకన భావంతో చూస్తారనే మాట అంత తేలికగా అంగీకరించటానికి వీల్లేదు. దానికి కొన్ని ఆధారాలు అవసరం. అయితే అదృష్టవశాత్తూ ఇవి బోలెడన్ని ఉన్నాయి. ప్రస్తుతం హిందువులు, నలుగురు దేవుళ్లను ఆరాధిస్తున్నారు, (1) శివుడు, (2) విష్ణువు, (3) రాముడు, (4) కృష్ణుడు. పరిశీలించవలసిన అంశం ఏమంటే హిందువులు మొదటి నుంచీ ఈ దేవుళ్లనే పూజిస్తూ వస్తున్నారా అనేది.

హిందూ దేవతాగణంలో సభ్యులు చాలా ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. జనాభా విషయంలో ఏ మతానికి సంబంధించిన దేవతా గణమూ దీనితో పోటీ పడలేదు. ఋగ్వేద కాలంలో ఈ దేవతల సంఖ్య అపారంగా ఉండేది. రెండుచోట్ల ఋగ్వేదం[1] మొత్తం దేవుళ్ల సంఖ్య మూడు వేల మూడువందల తొమ్మిదిమందిగా పేర్కొన్నది. ఆ పేర్లన్నీ తెలుసుకోవటం చర్చించటం ఇప్పుడు సాధ్యం కాదు. ఈ సంఖ్య ఆ తర్వాత ముప్పై మూడుకే తగ్గిపోయింది. ఇది చెప్పుకోతగ్గ కుదింపు. ఏమైనప్పటికీ, ముప్పై ముగ్గురు ఉన్నా గాని హిందూ దేవతా గణం చాలా పెద్దదిగానే ఉండిపోయింది.

1. ఋగ్వేదం iii 99 X 52:6 Vaj. S. 33.7. మూయిర్ V పుట 12.
2. ఋగ్వేదం I, 139, II iii 6, 9 : viii 28.I viii 30.2 viii 35.3 మూయిర్ V పుట 10.

ఈ ముప్పై మూడు మంది దేవతల వర్గీకరణ నిర్మాణాన్ని శతపథ బ్రాహ్మణం వరించింది. ఎనిమిదిమంది వసువులు, ఏకాదశ (11) రుద్రులు, ద్వాదశ (12) ఆదిత్యులు, ద్యౌ, పృథ్వీలతో (స్వర్గం, భూమి కూడి) ఉన్నదని చెప్పింది. సంఖ్య విషయం కంటే వారి మధ్య ఉండే హోదా సంగతి గమనించటం ముఖ్యమైన విషయం. ఈ ముప్పైమూడు మంది దేవతల మధ్య హోదా విషయంలో వ్యత్యాసం ఏదైనా ఉండేదా? (వ్యత్యాసం ఉన్నట్లే తెలుస్తున్నది).

ఈ ముప్పైమూడుమంది దేవతల పూర్వత్వ విషయంలోనూ, మర్యాదలు అందుకొనే విషయంలోనూ రెండు వర్గాలుగా (గొప్ప చిన్న అని ఒక వర్గం, యువకులు వృద్ధులు అని రెండో వర్గం) విభజన అయి ఉన్నారని సూచించే ఒక శ్లోకం ఋగ్వేదంలో ఉన్నది. ఈ అభిప్రాయం ఋగ్వేదంలోనే అంతకుముందు పేర్కొన్న అభిప్రాయానికి వ్యతిరేకంగా ఉన్నది. మొదటి అభిప్రాయం ఏం చెబుతున్నదంటే :

"ఓ దేవతలారా! మీలో ఎవరూ కూడా ఎక్కువవారూ కాదు. తక్కువ వారూ కాదు (పెద్దవారూ చిన్నవారూ అనే తేడా లేదు). మీరందరూ గొప్పవారే!". ప్రొఫెసర్ మాక్స్ముల్లర్ అభిప్రాయం కూడా ఇదే.

"ఈ దేవతలను విడివిడిగా ప్రార్థించేటపుడు, ఇతర దేవతల శక్తితో పోల్చి హోదాలో ఒకరు గొప్ప వేరొకరు తక్కువ అని ఎంచేవారు కాదు. ఆరాధకుని (భక్తుని) మనసుకు ప్రతి దేవుడూ అతని దేవుళ్లవంటివాడే. ప్రతిఒక్క దేవునిపైన దేవ సమూహానికి సర్వాధికారాలుంటాయి కాబట్టి, ఆ దేవుని అధికారాలు పరిమితమే అని మనకు తోచినా ఆ సమయంలో, అతడు వారికి నిజమైన దైవంగా, సర్వోత్కృష్టుడైన సర్వేశ్వరునిగా అగుపిస్తాడు. (స్తోత్రం చేసేటప్పుడు) అతని దృష్టి నుంచి కడమ దేవతలందరూ అదృశ్యమైపోయి, వాంఛలు తీర్చవలసిన ఆ ఒక్క దేవుడే అతని ముందు దివ్య తేజస్సుతో అగుపిస్తాడు."

"దేవతలలో ఎక్కడా ఏ ఒక్కరు కూడా ఇతరుల బానిసలుగా ప్రాతినిధ్యం వహించరు" ఇది ఇలా కొంతకాలం మాత్రమే జరిగింది. అనంతరకాలంలో దేవతల పట్ల పూర్వ దృక్కోణంలో మార్పు వచ్చినట్టు గోచరిస్తున్నది. ఎందుకంటే వేదంలో అనేక శ్లోకాలలో కొందరు దేవతలు సర్వోత్కృష్టులు, సర్వేశ్వరులుగా అభివర్ణితమయ్యారు.

రెండో మండలం మొదటి శ్లోకంలో, అగ్నిని విశ్వానికి సార్వభౌమునిగా, మానవులకు ప్రభువుగా, జ్ఞానవంతుడైన రాజుగా, తండ్రిగా, సోదరునిగా, కుమారునిగా, మానవుల స్నేహితునిగా, వర్ణించారు, అంతేకాదు ఇతరుల శక్తులు, పేర్లు అన్నీ అగ్నికే ఆపాదించారు.

ఆ తర్వాత అగ్నిపైన రెండో దేవుణ్ణి ప్రతిష్ఠించారు. అతడు ఇంద్రుడు. శ్లోకాలలోను బ్రాహ్మణాలలోను ఇంద్రుణ్ణే బలవంతుడైన దేవుడుగా చెప్పారు. పదవ పుస్తకం (మండలం)లో

1. శత. బ్రా. 5, 7, 2 మూయిర్ V పుట 11.

ఒక శ్లోకం ఎంతవరకూ వెళ్లిందంటే 'విశ్వమద్ ఇంద్ర ఉత్తరః' అంటే 'అందరికంటే ఇంద్రుడు గొప్పవాడు' అని చెప్పింది.

ఆ తర్వాత మూడో దేవుణ్ణి అందరికన్న ఎత్తైన పీఠం మీద కూర్చోబెట్టారు. అతడు సోమదేవుడు. సోముడు గొప్పవానిగానే పుట్టాడనీ అందరినీ జయిస్తాడనీ చెప్పారు. విశ్వానికి రాజుగా అతన్ని పేర్కొన్నారు, నరుల ఆయుష్షును పొడిగించే శక్తి అతనికి ఉన్నదని అంటూ ఒక శ్లోకంలో స్వర్గాన్ని, భూమిని, అగ్నిని, సూర్యుణ్ణి, ఇంద్రుణ్ణి, విష్ణువునూ అతడే రూపొందించాడని అన్నారు. తర్వాత సోమదేవుణ్ణి మరిచిపోయారు. నాలుగో దేవుణ్ణి ప్రతిష్ఠించారు. అతడు వరుణుడు. దేవుళ్లందరిలో వరుణుణ్ణి గొప్పవాడిగా చేశారు. "నీవు ఎల్లరకు, స్వర్గానికి, భూమికి ప్రభువువు" అనీ మరో శ్లోకంలో (ii,27,10) "దేవతలకు, నరులకు అందరికీ రాజువు నువ్వు" అనీ వరుణుని గురించి వైదిక కవులు అభివర్ణించారు. దానికంటే ఇంకా గొప్పగా వరుణుని దేవునిగా సర్వోత్కృష్టునిగా వర్ణించటానికి మానవ భాషలో పదజాలం ఏమి ఉంటుంది!

ఈ ఆధారాల వల్ల, 33 మంది వైదిక దేవతలలో నల్గురు దేవతలు అగ్ని, ఇంద్రుడు, సోముడు, వరుణుడు ప్రధాన దేవతలుగా సుప్రతిష్ఠితులయ్యారు. అంటే, ఇతర దేవతలు దేవతలు కాకుండా పోయారని కాదు, కాని, అందరికంటే పైన ఈ నలుగురినీ ప్రతిష్ఠించారు. శతపథ బ్రాహ్మణ కాలానికి ఆ తర్వాతి కాలంలో వివిధ దేవతల మధ్య తారతమ్య వాదాలలో కొంతమార్పు వచ్చినట్టు కనిపిస్తుంది. ప్రధాన దేవతల హెూదాలో సోమ, వరుణులు తమ స్థానాన్ని కోల్పోయారు. అగ్ని, ఇంద్రుడు తమ స్థానాలను నిలబెట్టుకున్నారు. ఒక కొత్త దేవుడు ఉద్భవించాడు. అతనే సూర్యుడు. దీని ఫలితంగా అగ్ని, ఇంద్ర, సోమ, వరుణులకు బదులుగా అగ్ని, ఇంద్ర, సూర్యులు ప్రధాన దేవతలు అయ్యారు. ఈ విషయం శతపథ బ్రాహ్మణంలో కనిపిస్తున్నది. అదేమంటున్నదంటే :

"మొదట్లో దేవతలందరూ ఒకేలాగ, స్వచ్ఛంగా ఉండేవారు. అలా ఒకేలాగ స్వచ్ఛంగా ఉన్నవారిలో ముగ్గురు అంటే అగ్ని, ఇంద్ర, సూర్యులు 'మేము సర్వోత్కృష్టులం అవుదుముగాక' అని కోరుకున్నారు."

"2 ........ ........

"3. అగ్నిలో మొదట్లో ఇప్పుడు ఉన్నంత కాంతి ఉండేది కాదు. గ్రహణేచ్ఛతో 'కాంతి నాలో ఉండుగాక' అనుకొని దానిని గ్రహించాడు. అప్పుడు ఈ కాంతి అతనిలో వచ్చింది."

"4. మొదట్లో ఇంద్రునిలోనూ ఇంత శక్తి ఉండేది కాదు. (పై మూడో పేరాలో ఉన్నట్టే)".

5. "మొదట్లో సూర్యునిలో ఈ ప్రకాశం ఉండేది కాదు.

అందరికంటే ఉన్నతులుగా సర్వోత్కృష్టులుగా ఎంతకాలం ఈ ముగ్గురు దేవుళ్లూ తమ స్థానాలను నిలబెట్టుకున్నారో చెప్పటం కష్టం. కాని ఆ తర్వాతి కాలంలో పరిస్థితిలో మార్పు వచ్చిందనే దాంట్లో మాత్రం సందేహం లేదు. 'చుల-నిద్దెస్స' పరిశీలనలో ఇది స్పష్టమౌతుంది. 'చుల- నిద్దెస్స' అనేది బౌద్ధ వాంఙ్మయానికి సంబంధించిన గ్రంథం. దీని రచనా కాలం సుమారు...."(కాలం వేయలేదు).

భారతదేశంలో ఆనాటికి ఉన్న తెగల జాబితా 'చుల–నిద్దెస్స' ఇచ్చింది. మత విశ్వాసం, పూజా పద్ధతులను బట్టి వాటి వర్గీకరణ ఈ క్రింది విధంగా ఉంది.

## 1. మత విశ్వాసాలు

| వరుస సంఖ్య | తెగ పేరు | |
|---|---|---|
| 1. | అజీవిక శ్రావక[1] | అజీవిక[2] |
| 2. | నిగత్త శ్రావక | నిగంత[3] |
| 3. | జటిల శ్రావక | జటిల[4] |
| 4. | పరివ్రాజక శ్రావక | పరివ్రాజక[5] |
| 5. | అవరుద్ధ శ్రావక | అవరుద్ధక |

## 2. పూజా పద్ధతులు

| వరుస సంఖ్య | తెగపేరు | ఆరాధ్య దేవత |
|---|---|---|
| 1. | హస్తి వ్రతికులు[6] | హస్తి[7] |
| 2. | అశ్వవ్రతికులు | అశ్వ[8] |
| 3. | గోవ్రతికులు | గా[9] |
| 4. | కుకుర్ వ్రతికులు | కుక్కు[10] |
| 5. | కాకవ్రతికులు | కాక[11] |

1. శ్రావక అంటే శిష్యుడు 2. జీవనభృతి విషయమై ప్రత్యేక నియమాలు పాటించే పరివ్రాజకుడు
3. అన్ని బంధాలు, అడ్డంకుల నుంచి విముక్తుడైన పరివ్రాజకుడు.
4. తలమీద జుట్టు మెలిదిప్పి ముడి వేసుకొనే పరివ్రాజకుడు.
5. సమాజం నుంచి తప్పుకుని తిరిగే పరివ్రాజకుడు.
6. వ్రతికులు అంటే భక్తులు 7. ఏనుగు 8. గుర్రం 9. ఆవు
10. కుక్క 11. కాకి

| | | |
|---|---|---|
| 6. | వాసుదేవ ప్రతికులు | వాసుదేవుడు |
| 7. | బలదేవ ప్రతికులు | బలదేవుడు |
| 8. | పూర్ణభద్ర ప్రతికులు | పూర్ణభద్ర |
| 9. | మణిభద్ర ప్రతికులు | మణిభద్ర |
| 10. | అగ్ని ప్రతికులు | అగ్ని |
| 11. | నాగప్రతికులు | నాగ |
| 12. | సుపర్ణ ప్రతికులు | సుపర్ణ |
| 13. | యక్షప్రతికులు | యక్ష |
| 14. | అసుర ప్రతికులు | అసుర |
| 15. | గాంధర్వ ప్రతికులు | గాంధర్వ |
| 16. | మహారాజ ప్రతికులు | మహారాజ |
| 17. | చంద్ర ప్రతికులు | చంద్ర |
| 18. | సూర్య ప్రతికులు | సూర్య |
| 19. | ఇంద్ర ప్రతికులు | ఇంద్ర |
| 20. | బ్రహ్మ ప్రతికులు | బ్రహ్మ |
| 21. | దేవ ప్రతికులు | దేవ |
| 22. | దీష ప్రతికులు | దీష |

శతపథ బ్రాహ్మణ కాలంలో నెలకొని ఉన్న పరిస్థితిని 'చుల-నిద్దెస్స' కాలంలో ఏర్పడిన దానితో పోల్చి చూసినపుడు ఈ క్రింది అంశాలు స్పష్టమౌతాయి. (1) మొదటి అంశం – అగ్ని సూర్య ఇం ద్రుల ఆరాధన 'చుల-నిద్దెస్స' కాలం వరకు కొనసాగింది. (2) రెండో అంశం – అగ్ని సూర్య ఇంద్రుల ఆరాధన ఆగకపోయినప్పటికీ, ఆధిపత్య స్థానాలను కోల్పోయింది. (3) మూడోది – కొత్త పూజా పద్ధతులలో రెండు ఆ తర్వాత చాలా ప్రాముఖ్యాన్ని పొందాయి. అవి వాసుదేవ (కృష్ణుని) పూజ, బ్రహ్మ పూజ; (4) నాలుగోది – విష్ణుని, శివుని, రాముని ఆరాధనలు ఇంకా మొదలవలేదు.

'చుల- నిద్దెస్స' కాలంలో కనిపించిన పరిస్థితితో పోల్చి చూస్తే ఇప్పటి పరిస్థితి ఏమిటి? ఇక్కడ కూడా మళ్లీ మూడు ప్రతిపాదనలు ప్రస్ఫుటమవుతాయి. మొదటిది – అగ్ని, ఇంద్ర, బ్రహ్మ, సూర్య ఆరాధనలు మాయమై పోయాయి. రెండోది – కృష్ణుడు తన స్థానాన్ని నిలబెట్టుకున్నాడు; మూడోది – విష్ణు, శివ, రాముల ఆరాధనలు 'చుల-నిద్దెస్స' కాలం నుంచి కొత్త పూజా విధానాలుగా బయలుదేరాయి. ఈ పరిస్థితి మూలంగా మూడు ప్రశ్నలు పరిశీలనకు ఉత్పన్నమవుతాయి. ఒకటి ఏమిటంటే, అగ్ని, ఇంద్ర, బ్రహ్మ, సూర్యుల ప్రాచీన ఆరాధన పద్ధతులు ఎందుకు అదృశ్యమయ్యాయి? ఈ దేవతలను పూజించటం ఎందుకు మానివేశారు? రెండోది, కృష్ణ, రామ, శివ, విష్ణు ఆరాధనలు కొత్తగా రావటానికి దారితీసిన పరిస్థితులు ఏమిటి?

మూడోది, కొత్త దేవతలైన కృష్ణ, రామ, శివ, విష్ణువుల స్థానాలు, వారి వారి హోదాలు ఏమిటి?

మొదటి ప్రశ్నకు మనకు సమాధానం దొరకదు. అగ్ని, ఇంద్ర, సూర్య, బ్రహ్మ దేవుళ్లను ఆరాధించటం బ్రాహ్మణులు ఎందుకు మానివేశారో తెలుసుకోవటానికి బ్రాహ్మణ సాహిత్యంలో మనకు ఆధారాలేమీ దొరకవు. బ్రహ్మను ఆరాధించటం ఎందుకు మానివేశారో అనేదానికి మాత్రం కొంత వివరణ దొరుకుతుంది. బ్రహ్మపై బ్రాహ్మణ సాహిత్యం దొరుకుతుంది. బ్రహ్మపై బ్రాహ్మణ సాహిత్యంలో మోపిన అభియోగం మీద ఇది ఆధారపడింది. ఆ అభియోగం ఏమంటే – అతడు తన స్వంత కూతురిని మానభంగం చేశాడు. అందువల్లనే పూజకూ, భక్తికీ అర్హతను పోగొట్టుకున్నాడు అని. ఈ అభియోగంలో నిజం ఎంత ఉన్నప్పటికీ ఇవి బ్రహ్మను త్యజించటానికి సరిపోయే అంశాలు కాదని రెండు కారణాల వల్ల చెప్పవచ్చు. ఒకటి ఏమంటే, ఆ యుగంలో అటువంటి ప్రవర్తన అసాధారణమైనదేమీ కాదు. రెండోది, బ్రహ్మపై మోపిన అభియోగాల కంటే దారుణమైన అవినీతి పనులు కృష్ణుడు చేశాడు. అయినా అతణ్ణి పూజిస్తున్నారు.

బ్రహ్మను త్యజించటానికి కారణాలున్నాయని ఊహించుకున్నా, ఇతరులను విడిచిపెట్టటానికి కారణాలు ఏమీ లేవు. అగ్ని, ఇంద్రుడు, సూర్యుడు, బ్రహ్మ మరుగై పోవటం నిగూఢమైన విషయమే. ఈ రహస్యాన్ని ఛేదించటానికి మార్గం లేదు. హిందూ దేవతలు దేవతలు కాకుండా పోయారనేది ఒక భయంకరమైన విషయం అని చెపితే సరిపోతుంది.

రెండో ప్రశ్న కూడా నిగూఢంగా మిగిలిపోయింది. క్రొత్త దేవుళ్లయిన కృష్ణుడు, విష్ణువు, శివుడు, రాముడు – వీరి ఆరాధన ప్రాముఖ్యం గురించి చెప్పటానికి బ్రాహ్మణ సాహిత్యం సంపూర్ణంగానూ అపారంగానూ ఉన్నది. అయితే ఈ దేవతలు ఎలా ఉద్భవించారనేది చెప్పటానికి బ్రాహ్మణ సాహిత్యంలో ఏమీ లేదు. కొత్త దేవుళ్లను కార్యరంగంలోకి ఎందుకు దింపారనేది కూడా నిగూఢమైన విషయమే. ఈ కొత్త దేవతలలో కొందరు కచ్చితంగా వేదాలకు వ్యతిరేకులని తెలుసుకొనేసరికి ఈ నిగూఢత్వం ఇంకా గాఢమై పోతుంది.

శివుని సంగతి తీసుకుందాం. శివుడు మొదట్లో వైదిక వ్యతిరేకియైన దేవుడనేది చాలా స్పష్టంగా తెలిసిందే. భాగవత పురాణం (మహా భారతంలో కూడా)లో నమోదయిన ఈ క్రింది రెండు సంఘటనలు గమనిస్తే ఈ విషయం మీద ఎంతో సమాచారం బయట పడుతుంది. మొదటి సంఘటన శివునికీ అతని మామ అయిన దక్షునికి వైరం ఎలా వచ్చిందనే దాన్ని తెలుపుతోంది. ప్రజాపతులు నిర్వహించిన యజ్ఞానికి దేవతలు ఋషులు హాజరైనారట; దక్షుడు ప్రవేశించగానే, బ్రహ్మ, శివుడు తప్ప అక్కడ హాజరైన వారందరూ అతనికి నమస్కరించటానికి లేచి నిలబడ్డారు. దక్షుడు బ్రహ్మకు అభివాదం చేసి అతని ఆజ్ఞపై ఆసీనుడయ్యాడు; కాని శివుడు చూపిన అమర్యాదకు బాధపడ్డాడు. శివుణ్ణి అతడు ఇలా సంబోధించాడు.[1]

1. భాగవత పురాణం, అధ్యాయం IV, 379-80 పుటల్లో చెప్పారు.

"తనకంటే ముందుగా ఆసీనుడైన రుద్రుని (శివుణ్ణి) అమర్యాదను చూసి దక్షుడు సహించలేకపోయాడు. మింగివేసే వాడిలా వంకర చూపులతో అతణ్ణి చూస్తూ ఇలా అన్నాడు: "ఓ బ్రాహ్మణ ఋషులారా, అగ్న్యాది దేవతలారా! నామాటలు వినండి- ఇవి మోహంతోనూ, మాత్సర్యంతోనూ చెబుతున్న మాటలు కావు. ఈ సిగ్గుమాలిన శివుడు, దిక్పాలకుల మర్యాదను, ప్రవర్తనను అతిక్రమిస్తున్నాడు. ఒక సన్మార్గుని వలె బంధుజన బ్రాహ్మణ సమక్షంలో అగ్ని సాక్షిగా, సావిత్రితో సమానమైన నా కుమార్తె పాణిగ్రహణం చేయటం మూలంగా (ఇతడు) నా శిష్యుని హోదా పొందాడు. ఈ మర్కటలోచనుడు (కోతి కనులవాడు) లేడి కనుల నా కూతురిని పెళ్లాడి శిష్టభావం పొందాననుకొని నన్ను చూడగానే లేచి నిలబడి – అభివాదం చేయకపోతే పోనీ – మర్యాదకు ఒక మాట కూడా మాట్లాడలేదు. నాకు ఇష్టం లేకపోయినా అశుచి, గర్విష్టి, ఆచారాలను నిర్మూలించినవాడు, మత్త ప్రచారుడూ అయిన ఇతనికి నేను శూద్రునికి వేదవాక్యంలా నా కూతుర్ని ఇచ్చాను. దెయ్యాలు, ప్రేతాత్మలు వెంటరాగా, పిచ్చివానిలాగ, దిగంబరుడై, వెంట్రుకలు వేలాడ వేసుకొని, నవ్వుతూ, ఏడుస్తూ, చితిమీద కాలిన బూడిద రాసుకొని, చనిపోయినవారి పుర్రెలు మెడలో హారంగా వేసుకొని, (మానవ) ఎముకలు ఆభరణాలుగా ధరించి, వాస్తవానికి అశుభం కలిగించేవాడైనా శుభం కలిగించేవాడిలా నటిస్తూ, ఉన్మత్తులకు నాథుడై, ప్రమథ గణాలకు భూతాలకు నాథుడై ప్రధానంగా తామస స్వభావం గల జీవాలకు ప్రభువై, భయంకరమైన శ్మశానాలలో తిరుగాడే వాడితడు. అష్టశౌచుడు, దుష్ట హృదయుడూ అయిన ఇతనికి, అయ్యో! సద్గుణరాశి అయిన నా కూతుర్ని (విధి ప్రేరితుడనై) బ్రహ్మ ప్రోద్బలం మీద ఇచ్చాను." అంటూ గిరీశుని (శివుణ్ణి) నిందించాడు. శివుడు అతనిని వారించలేదు. దక్షుడు, ఆ తర్వాత జలాన్ని గ్రహించి ఉగ్రుడై, శివుణ్ణి ఈ విధంగా శపించాడు. "దేవతలలో అధముడైన ఈ శివుడు, యజ్ఞ సమయాలలో ఇంద్రుడు, ఉపేంద్రుడు (విష్ణువు) తదితర దేవతలతో కలిసి హవిర్భాగాన్ని పొందకుండా ఉండుగాక". ఈ శాపం విధించి దక్షుడు నిష్క్రమించాడు."

మామా అల్లుళ్ల మధ్య శత్రుత్వం కొనసాగింది. ప్రజాపతులలో ముఖ్యుని స్థానానికి బ్రహ్మ దక్షుని పెంచటం మూలంగా దక్షుడు గర్వంతో "బృహస్పతి సవనం" అనే మహాయజ్ఞం తలపెట్టాడు. యజ్ఞానికి ఇతర దేవుళ్లందరూ తమ భార్యలతో వెళ్తున్నారు. పార్వతి తన భర్త శివుణ్ణి కూడా అక్కడకు రమ్మని పట్టుపట్టింది. ఆమె తండ్రి తనను ఏ విధంగా అవమానించాడో చెప్పి ఆమెను అక్కడకు వెళ్లవద్దని సలహా ఇచ్చాడు శివుడు. ఆమె, తన బంధువులను చూడాలనే అపేక్షతో, భర్త హెచ్చరికను పెడచెవిని పెట్టి వెళ్లింది; కాని తండ్రిని (దక్షుని) చూడగానే, తన భర్త పట్ల శత్రుత్వం వహించినందుకు అతనిని నిందించి, తండ్రితో తనకు బాంధవ్యం ఇచ్చిన శరీరాన్ని త్యజించి వేస్తానని బెదిరించింది. ఆ తరువాత ఆమె స్వచ్ఛందంగా శరీరాన్ని త్యజించింది. అది చూడగానే ఆమె వెంట వచ్చిన శివుని భటులు దక్షుని చంపటానికి అతని వైపు వెళ్లారు. అయితే భృగు మహాముని యజ్ఞ సంహారక (మారక)మైన ఒక్క

యజుర్వేద) శ్లోకాన్ని (యజ్ఞ-ఘ్నేన యజుషదక్షిణాగ్నౌ జువావాః) ఉచ్చరిస్తూ దక్షిణాగ్నిలో ఒక ఆహుతి సమర్పించాడు. దీని ఫలితంగా 'రుభు" నామధేయులైన దేవతలు ఉద్భవించి శివుని భటులను పారద్రోలారు. సతి మరణవార్త విని శివుడు ఉగ్రుడైనాడు (5వ భాగం) ఒక జట (వెంట్రుక) పీకి అందులో నుంచి ఒక బ్రహ్మాండమైన రాక్షసుణ్ణి సృష్టించి, దక్షుణ్ణి అతని యాగాన్ని నాశనం చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఈ రాక్షసుడు శివుని భటులను తీసుకొని వెళ్లి తనకిచ్చిన ఆజ్ఞను అమలుపరిచాడు. ఆ ఆజ్ఞను ఎలా అమలు పరిచారో భాగవత పురాణం వివరించింది. అది ఇలా ఉన్నది.

"కొందరు యజ్ఞ పాత్రలను పగలగొట్టారు. కొందరు హోమాగ్నిని ఆర్పారు. కొందరు కొలనుల్లో నీరు నింపారు. కొందరు యజ్ఞ వేదికా మేఖలలు (సరిహద్దు తాళ్ళు) తెంచి వేశారు. కొందరు మునులపై దాడి చేశారు. కొందరు వారి భార్యలను భయపెట్టారు. కొందరు దగ్గర ఉన్న దేవతలను, పారిపోతున్న దేవతలనూ పట్టుకున్నారు. గరిటె పట్టుకొని వైశ్వదేవ్యం సమర్పిస్తున్న భృగువును మణిమంతుడు పట్టుకున్నాడు. గెడ్డాన్ని సవరించుకుంటూ శివుని చూచి అపహసించిన అతని గడ్డాన్ని వీరభద్రుడు ఊడపెరికాడు. దక్షుడు శివుణ్ణి నిందిస్తున్న సమయంలో దక్షునికి సైగచేసిన భృగుని కళ్లు నందీశ్వరుడు పీకివేసి కోపంతో అతణ్ణి కిందపడేశాడు. మహాదేవుణ్ణి శపిస్తున్నపుడు పూష (సూర్యుడు) పళ్లు కనబడేలా నవ్వాడు. అందుకని బలభద్రుడు కళింగుని పళ్ళు రాలగొట్టినట్లుగా చండీశ్వరుడు (శివుడు) అతని పళ్లు ఊడగొట్టాడు. వీరభద్రుడు దక్షుని తల నరికివేశాడు; అందుకు కొంత ప్రయాస పడవలసి వచ్చింది. వీరభద్రుడు దక్షుని యాగం ధ్వంసం చేసి నిజ నివాసమైన కైలాసానికి వెళ్ళిపోయాడు. జరిగినదంతా దేవతలు స్వయంభువు (బ్రహ్మ)కు విన్నవించారు. ఇదంతా జరిగినపుడు బ్రహ్మ, విష్ణువు ఇద్దరూ లేరు. (6వ భాగం). శివుణ్ణి సంతృప్తి పరచవలసిందిగా బ్రహ్మ దేవతలకు సలహా ఇచ్చాడు, ఎందుకంటే వారు శివునికి యజ్ఞంలో వాటా ఇవ్వకుండా తప్పించేశారు. ఆ ప్రకారంగా అజుని (బ్రహ్మ) నాయకత్వంలో దేవతలందరు కైలాసానికి వెళ్లారు.

అక్కడ "భక్తుల కోరిక ప్రకారం లింగం ధరించి బూడిద రాసుకొని, దండధరుడై, జుట్టు ముడివేసుకొని, జింక తోలు ధరించి, చంద్రవంకతో, సాయంకాలపు మేఘంలా ప్రకాశిస్తూ" ఉన్న శివుణ్ణి చూశారు. బ్రహ్మ అతనిని "జగత్కారణునిగా, నిర్వికార బ్రహ్మంగా, లోకాలన్నింటికీ యోని బీజాలైన శివ కారణుని"గా స్తుతించాడు. "శక్తి శివరూపాలతో క్రీడించే శివుడు సాలె పురుగులా తనలో ఏకీభూతమైన అన్నింటినీ రూపొందించి, వృద్ధి చేసి కాపాడి, తిరిగి గ్రహిస్తాడు" అని అన్నాడు. (7వ భాగంలో ఇదే సర్వోత్కృష్టతను బ్రహ్మకూ ఆపాదించారు). బ్రహ్మ ఇంకా ఇలా అన్నాడు – ఈ మహాజీవుడే యాగాన్నీ, బ్రాహ్మణులు శ్రద్ధతో ఆచరించే

1. మూయిర్ IV కే. 383-84లో దీనిని ఉదహరించారు.

ఆచార ప్రకారాలనూ నెలకొల్పాడు. అతను మాయాతీతుడు. "మాయలో పడి పూజా పునస్కారాలకు ప్రాధాన్యం ఇచ్చి భేద బుద్ధితో కర్మ ప్రవర్తనతో మదించిన వారి మీద దయచూపు" అని వేడుకున్నాడు." దక్షుని యజ్ఞం చేయించి నీకు రావలసిన వాటాను రాకుండా చేసిన దుర్మార్గులైన పూజారులపై దయ చూపించాలని వేడుకున్నాడు. మహాదేవుడు కొంత శాంతించాడు. (7వ భాగం). శివుడు వైదిక వ్యతిరేక దేవుడని నిరూపించటానికి దక్షయజ్ఞ వినాశనం కంటే గొప్ప ఆధారం మరేదీ దొరకదు.

ఇపుడు కృష్ణుణ్ణి తీసుకుందాం. పురాణాలలో కృష్ణుని పేరుతో ఉన్నవారు నలుగురు ఉన్నారు. ఒక కృష్ణుడు సత్యవతి కొడుకు. ధృతరాష్ట్ర, పాండు, విదురుల తండ్రికి పుట్టిన వాడు. రెండో కృష్ణుడు సుభద్ర సోదరుడు, అర్జునుని మిత్రుడు. మూడో కృష్ణుడు దేవకీ వసుదేవుల కుమారుడు, మధుర నివాసి. నాలుగో కృష్ణుడు యశోదానందులు పెంచినవాడు, అతనే శిశుపాలుణ్ణి చంపినవాడు. 'కృష్ణునిగా' ఆరాధింపబడుతున్న కృష్ణుడు దేవకి కొడుకైన కృష్ణుడే అయితే ఆ కృష్ణుడు కూడా మొదట్లో వైదిక వ్యతిరేకి దేవుడే అనటంలో సందేహం ఏదీ లేదు. ఛాందోగ్యోపనిషత్తులో ఘోర అంగీరసుని శిష్యుడిగా ఇతడు కనిపిస్తాడు. ఘోర అంగీరసుడు ఇతనికి ఏమి బోధించాడు? అనే విషయంపై ఛాందోగ్యోపనిషత్తు ఇలా చెబుతుంది :

"అంగీరసుల వంశానికి చెందిన ఘోరుడు దీనిని 'పూర్వ గత మార్మిక విజ్ఞానాన్ని' దేవకి కొడుకు కృష్ణునికి ప్రకటించిన తర్వాత, అతడు (అది విన్న తర్వాత) తృష్ణ (కోరిక) నుంచి విముక్తుడయ్యాడు. (చనిపోబోయే ముందు) మనిషి ఈ మూడు వాక్యాలను, 'నీవు నాశనం లేనివాడివి, నీవు అక్షయుడవు, శ్వాస సూక్ష్మ సూత్రానివి నీవు' అనేవాటిని ఆలంబనగా ఆశ్రయించి పఠించుకోవాలి.' ఉపనిషత్తులోని ఈ పాఠాన్ని వ్యాఖ్యాత ఇలా విశదపరుస్తున్నాడు-

"అంగీరస వంశీయుడు ఘోర నామధేయుడైన వ్యక్తి ఒకరు, దేవకి కుమారుడూ తన శిష్యుడూ అయిన కృష్ణునికి యజ్ఞ సిద్ధాంతాన్ని ఇలా ప్రకటపరచి, "చెప్పాడు" అనేమాట ఆ తర్వాత ఎక్కడో కింద వస్తుంది. "ఈ మూడు మొ॥" అనే మాటలతో (వాక్యాలతో) వీటికి మొత్తం మీద సంబంధం ఉన్నది. ఈ సిద్ధాంతాన్ని విన్నమీదట కృష్ణుడు అన్ని రకాల జ్ఞాన తృష్ణ నుంచీ విముక్తుడైనాడు. ఈ విధంగా పురుష యాగ జ్ఞానం, దేవకి కుమారుడైన కృష్ణుణ్ణి ఏ జ్ఞాన తృష్ణ నుంచి అయినా ఎలా విముక్తం చేయగలిగిందో చెప్పి ఆ యాగాన్ని శ్లాఘించాడు. ఆ జ్ఞానాన్ని కృష్ణునికి తెలియజేసిన మీదట ఘోర అంగీరసుడు ఈ కింది మాటలు అన్నాడని ఆయన చెప్తున్నాడు. పై యాగాన్ని తెలుసుకున్నవాడు మరణం ఆసన్నమైనపుడు 'ప్రాణా శంసితమ్' అనే మూడు మాటలు ('ఈ క్షణానివి నీవే, శ్వాస సూక్ష్మ సూత్రానివి నీవు' అనే మాటలు) పలక (ఆశ్రయించ) వలసి ఉంటుంది.

ఘోర అంగీరసుడు కృష్ణునికి బోధించిన తత్వం, ఆత్మ విముక్తి మార్గంగా వేదాలకు,

వేద క్రతువులకు వ్యతిరేకమైనదిగా తెలుస్తూనే ఉన్నది. దీనికి భిన్నంగా విష్ణువు వైదిక దేవుడు అయినా అతని ఆరాధన శివుని ఆరాధన కంటే చాలాకాలం తర్వాత మొదలయింది. విష్ణువును ఎందుకంత అశ్రద్ధ చేశారో తెలుసుకోవటం కష్టం.

అదే విధంగా రాముడు, వేద వ్యతిరేకుడు కాకపోయినప్పటికీ వేదాలలో లేడు. అలాంటప్పుడు అతని ఆరాధన మొదలు పెట్టవలసిన అవసరం – అందులోనూ దేశ చరిత్రలో అంత ఆలస్యంగా మొదలుపెట్టవలసిన అవసరం – ఎందుకు వచ్చింది?

మూడో ప్రశ్నను తీసుకుందాం – పాత పౌరాణిక దేవుళ్లకు, కొత్త దేవుళ్లకు వారి వారి మధ్య హోదాలలో ఎటువంటి సంబంధాలుండాలి?

దీనికి ముందటి అధ్యాయంలో బ్రహ్మ విష్ణు మహేశ్వరుల ఔన్నత్య పతనాల గురించి చెప్పటం జరిగింది. ఏది జరిగినా, హోదా, అధికారాల విషయానికి వచ్చేసరికి ఈ ముగ్గురు దేవతల మధ్యనే పోటీ ఉండేది. ఏ ఇతరుల కంటే కూడా కిందికి వీరిని దించలేదు. అయితే వీరిని "శ్రీదేవి" కింద ఉంచిన సమయం ఒకటి వచ్చింది. ఇదెలా జరిగిందో 'దేవీ భాగవతం' చెబుతున్నది. విశ్వం మొత్తాన్ని 'శ్రీదేవి' సృష్టించిందనీ, బ్రహ్మ విష్ణు మహేశ్వరులను కూడా ఈ దేవియే సృష్టించిందనీ దేవీ భాగవతం[1] చెబుతున్నది. తన అరచేతులు రుద్దుకోవాలని ఒకసారి ఆమెకు (శ్రీదేవికి) అనిపించిందట. ఆమె చేతులు రుద్దుకున్నప్పుడు ఒక పొక్కు వచ్చింది. ఆ పొక్కులో నుంచి బ్రహ్మ పుట్టాడు. బ్రహ్మ పుట్టిన తర్వాత తనను పెళ్లి చేసుకోవలసిందిగా అతనిని దేవి అడిగింది. ఆమె అతని జనన కారణం కాబట్టి 'తల్లి' అని చెబుతూ బ్రహ్మ అందుకు నిరాకరించాడు. దేవి ఆగ్రహం చెంది, కోపంతో బ్రహ్మను కాల్చి వేసింది; 'బ్రహ్మ' అక్కడికి అక్కడే బూడిదైపోయాడు. దేవి రెండోసారి అరచేతులు రుద్దుకొన్నది. అపుడు రెండో పొక్కు వచ్చింది. ఈ రెండో పొక్కు నుంచి రెండో కొడుకు పుట్టాడు. అతనే విష్ణువు. దేవి తనను పెళ్లి చేసుకోవలసిందిగా విష్ణువును అడిగింది. ఆమె తన తల్లి అని చెప్పి విష్ణువు అందుకు నిరాకరించాడు. దేవి ఆగ్రహం చెంది విష్ణువును కాల్చి భస్మం చేసింది. దేవి మూడోసారి అరచేతులు రుద్దుకొన్నది. మూడో పొక్కు వచ్చింది. మూడో పొక్కు నుంచి మూడో కొడుకు పుట్టాడు. అతనే శివుడు(మహేశ్వరుడు). దేవి తనను పెళ్లి చేసుకోవలసిందిగా శివుణ్ణి అడిగింది. "నువ్వు ఇంకో శరీరం ధరిస్తే పెళ్లి చేసుకుంటాను" అన్నాడు శివుడు. దేవి అంగీకరించింది. అపుడు శివుని కళ్లు అక్కడే ఉన్న రెండు బూడిద కుప్పల మీద పడ్డాయి. 'అవి అతని సోదరుల బూడిద అనీ, తనను పెళ్లి చేసుకోవటానికి నిరాకరించినందువల్లి వాళ్లను భస్మం చేశాననీ దేవి చెప్పింది. అప్పుడు శివుడు 'నేను ఒక్కణ్ణే ఎలా పెళ్లి చేసుకుంటాను? ఇంకో ఇద్దరు స్త్రీలను సృష్టించు. మేం ముగ్గురం పెళ్లి చేసుకుంటాం" అని అన్నాడు. దేవి అతడు కోరినట్లుగానే చేసింది. ముగ్గురు దేవుళ్లూ, దేవినీ, ఆమె సృష్టించిన ఇద్దరు స్త్రీలనూ

1. సత్యార్థ ప్రకాశికలో దీనిని సంగ్రహంగా చెప్పారు.

పెళ్లి చేసుకున్నారు. ఈ కథలో రెండు అంశాలున్నాయి. ఒకటి ఏమిటంటే, చెడు చేసేటపుడు కూడా శివుడు తన ఇద్దరు సహచరుల (పోటీదారుల) కంటే అధోగతి పాలవుతాననే భయంతో, బ్రహ్మ విష్ణువుల కంటే ఎక్కువ పాపం చేసినట్టు కనిపించదలుచుకోలేదు. అసలు ముఖ్యమైన విషయం ఏమంటే, బ్రహ్మ విష్ణువు శివుడు ముగ్గురూ హోదా తగ్గిపోయి దేవి సృష్టించిన వారయ్యారు.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల ఔన్నత్యం, పతనం గురించి చర్చించిన తర్వాత, కొత్త దేవుళ్లయిన రామకృష్ణుల ఆరాధనలో మార్పులెలా వచ్చాయో పరిశీలించవలసి ఉంది.



బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల ఆరాధనతో పోల్చి చూసినపుడు కృష్ణుని ఆరాధన కొంచెం కృత్రిమంగా కనిపిస్తుంది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు పుట్టుకతో దేవుళ్లు. కృష్ణుడు ఒక మనిషి, అతణ్ణి దేవుని స్థానానికి ఎత్తారు. అతణ్ణి దేవుని స్థానానికి ఎత్తటానికే బహుశా అతను విష్ణువు అవతారమనే సిద్ధాంతాన్ని కనిపెట్టారు. అయినప్పటికీ కూడా అతని దైవత్వం లోపభూయిష్ఠంగానే ఉండిపోయింది. అతనిని విష్ణువు పాక్షికావతారంగా[2] మాత్రమే భావించారు. అలా ఎందుకు జరిగిందంటే గోపికలతో అతను ఎక్కువగా వ్యభిచరించినందువల్ల. అతడు విష్ణువు సంపూర్ణ సమగ్రమైన అవతారమే అని గనక చెప్పి ఉంటే గోపికల తోడి అతని లీలు క్షమార్హం కాకపోయేవి.



ఇలాంటి (కించపడదగిన) స్థితిలో నుంచి వచ్చినప్పటికీ, కృష్ణుడు అందరికంటే కూడా సర్వోత్కృష్టమైన దేవుని స్థాయికి ఎదిగాడు. అతను ఎంత గొప్ప దేవుడయ్యాడో అనే విషయం భగవద్గీత X నుంచి XIV వరకు గల అధ్యాయాలు చూస్తే తెలుస్తుంది. ఈ అధ్యాయాలలో కృష్ణుడేమంటాడంటే "ఓ కురుశ్రేష్ఠా! సరే, ఇప్పుడు నా (దేవ) అవతారాల గురించి చెబుతాను, కాని ముఖ్యమైన వాటి గురించి మాత్రమే చెబుతాను, ఎందుకంటే నా అవతారాలకు (లీలా విభూతి విస్తారానికి) అంతం లేదు. నేను ఆత్మను. జీవులందరి హృదయాలలో అధిష్టించి అంతర్యామిగా ఉన్నవాణ్ణి. ఓ గుడాకేశ! అన్ని జీవుల ఆది, మధ్యాంతాలు నేనే. ఆదిత్యులలో విష్ణువును నేను. ప్రకాశమానమైన సమూహాలలో జాజ్వల్యమానమైన సూర్యుణ్ణి నేను. మరుత్తులలో మరీచిని నేను, నక్షత్రాలలో చంద్రుణ్ణి నేను. వేదాలలో సామవేదం నేను. దేవుళ్లలో దేవేంద్రుణ్ణి నేను. ఇంద్రియాలలో మనస్సును నేను. జీవులలో చైతన్యం నేను. రుద్రులలో శంకరుణ్ణి నేను, యక్షులు రాక్షసులలో ఐశ్వర్య దేవతను (కుబేరుణ్ణి) నేను. వసువులలో అగ్నిని నేను, పర్వతాలలో మేరు పర్వతాన్ని నేను. (పురోహితులలో) ముఖ్యుడైన బృహస్పతిని నేనే అని గ్రహించు. ఓ అర్జునా! సేనానులలో స్కందుడను నేను. సరస్సులలో సాగరాన్ని నేను. మహర్షులలో నేను భృగుడను. వాక్కులలో ఏకాక్షరమైన ప్రణవాన్ని (ఓం) నేను. యజ్ఞాలలో 'జప' యజ్ఞాన్ని నేను. స్థావరాల

2. ఈ విషయంపై మూయిర్ సంస్కృత గ్రంథాలు. IV పుట 49 చూడండి.

(పర్వతాల)లో హిమాలయాన్ని నేను. సమస్త వృక్షాలలో అశ్వత్థ వృక్షాన్ని నేను. దేవ ఋషులలో నారదుడను నేను. గంధర్వులలో చిత్ర రథుడను నేను. సిద్ధులలో కపిలమునిని నేను. అశ్వాలలో, అమృత మథనంలో జనించిన ఉచ్చైశ్రవంగా నన్ను తెలుసుకో. ఏనుగులలో ఐరావతాన్ని నేను. నరులలో నరాధిపుణ్ణి నేను. ఆయుధాలలో వజ్రాయుధాన్ని నేను. ధేనువు (ఆవు)లలో కామధేనువును నేను. ప్రజల ఉత్పత్తికి కారణభూతమైన కందర్పుణ్ణి (ధర్మయుక్తమైన కామాన్ని) నేను. సర్పాలలో వాసుకిని నేను, నాగుపాములలో అనంతుడను నేను. జలదేవతలలో వరుణుణ్ణి నేను. పితృదేవతలలో అర్యముణ్ణి. (పాపపుణ్యాల ననుసరించి) నియమించే వారిలో యముణ్ణి నేను. దైత్యులలో నేను ప్రహ్లాదుణ్ణి. (శుభాశుభాలను వృద్ధిక్షయాలను) గణించే వాటిలో నేను కాలస్వరూపుడను (కాలాన్ని)"

జంతువులలో జంతురాజును (సింహాన్ని) నేను. పక్షులలో వినత కుమారుడను (గరుత్మంతుణ్ణి) నేను. వేగవంతులలో పవనాన్ని (వాయువు) నేను. ఆయుధాలు ధరించిన వారిలో రాముణ్ణి నేను. జలచరాలలో నేను మకరమత్స్యాన్ని. స్రోతస్సులలో (నదులలో) జాహ్నవి (గంగానది)ని నేను. సృష్టి అయిన సమస్తానికీ ఆది మధ్యాంతరాలను నేనే. ఓ అర్జునా! విద్యలలో నేను ఆధ్యాత్మ విద్యను. వాదాలలో (వాద జల్పవితండ) వాదాన్ని నేను. అక్షరాలలో 'అ'కారాన్ని నేను. సమాసపదాలలో (ఉభయపదాలూ) ద్వంద్వమూ నేనే. అక్షయమైన కాలాన్ని నేను. అన్ని దిక్కులకూ ముఖాలుండే (సర్వతోముఖ) సృష్టికర్తను నేను. అన్నిటినీ అంతం చేసే మృత్యువును నేను. జరగవలసినదానికి ఆధారాన్ని నేను. స్త్రీల యొక్క కీర్తి, జ్ఞానధనాల వల్ల కలిగే సిరి, వాక్కు, జ్ఞాపకశక్తి, మేధా విశేషం, ధృతి (ధైర్యం), క్షమలు నేనే. సామ శ్లోకాలలో బృహత్ సామాన్నీ, ఛందస్సులలో గాయత్రినీ నేనే. మాసాలలో మార్గశీర్ష మాసాన్నీ, ఋతువులలో వసంతాన్నీ నేనే. వంచక వ్యాపారాలలో జూదాన్నీ, తేజోవంతుల తేజస్సునూ నేనే. నేను విజయాన్ని, పవిత్ర ప్రయత్నాన్ని, సాత్వికుల సత్త్వ గుణాన్ని. వృష్ణి వంశస్థులలో వాసుదేవుడనూ, పాండవులలో అర్జునుణ్ణి నేనే. మునులలో వ్యాసుణ్ణి నేనే. కవులలో ఉశనకవిని (శుక్రాచార్యుడను) నేనే. దండించేవారి దండనీతినీ, జిగీషాపరుల నీతినీ (విజయం కాంక్షించే వారి ధర్మ జయోపాయం) నేనే. రహస్యాలలో (కాపాడే) మౌనాన్ని నేను. జ్ఞానవంతుల జ్ఞానం నేను. ఓ అర్జునా! సమస్త వస్తువుల బీజాన్ని కూడా నేనే. నేను లేకుండా చరాచరాత్మకమైనది ఏదీ ఉండదు.

"సూర్యునిలో వసిస్తున్న, ప్రపంచాన్ని మొత్తం కాంతివంతం చేస్తున్న, చంద్రునిలోనూ అగ్నిలోనూ ఉన్న తేజాన్ని నేనే అని తెలుసుకో. భూమిపై ప్రవేశిస్తూ అన్ని వస్తువులకు నా శక్తి వలన ఆధారమవుతాను. రసమయమైన చంద్రుడనై, అన్ని మూలికలను పోషిస్తాను. అగ్నినై, జీవులందరి శరీరాలలో జీవిస్తూ, ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో కలిసి నాలుగు రకాల ఆహారాలను జీర్ణం చేస్తాను. నేను అందరి హృదయాలలోను పరివేష్టించి ఉన్నాను."

"నా నుంచే జ్ఞాపకమూ, జ్ఞానమూ కలుగుతాయి. వాటిని తీసివేసేది కూడా నేనే. వేదాల నుంచి గ్రహించవలసింది నా ఒక్కడినే. వేదాంత (గ్రంథ)కర్తను నేను, వేదాలను నేనొక్కణ్ణే ఎరుగుదును. ప్రపంచంలో రెండు రకాల పదార్థాలున్నాయి. ఒకటి నశ్వరమైనది, రెండోది అనశ్వరమైనది. నశ్వరంలో అన్ని వస్తువులూ ఉంటాయి. మనకు సంబంధం లేనిదానిని అనశ్వరమని పిలుస్తారు. కాని సర్వోత్కృష్టమైన జీవి మరొకటి ఉన్నది, దానిని పరమాత్మ అంటారు. అనంతమైన ఈ ప్రభువు మూడు లోకాలూ వ్యాపించి వాటిని కాపాడతాడు. నశ్వరాన్ని నేను జయించాను కాబట్టి, అనశ్వరం కంటే నేను ఉన్నతుణ్ణి కాబట్టి, వేదాలలోను ప్రపంచంలోను అత్యుత్తమమైన వానిగా నన్ను శ్లాఘిస్తారు."

గీతకు సంబంధించినంతవరకూ కృష్ణునికి మించిన భగవంతుడెవరూ లేరని మనకు స్పష్టమవుతున్నది. అతను 'అల్లాహో అక్బర్'. ఇతర దేవుళ్లందరి కంటే గొప్పవాడు.

ఇపుడు మహా భారతాన్ని చూద్దాం. ఏమి కనబడుతున్నది. కృష్ణుని స్థానంలో మార్పు కనబడుతున్నది. అతని స్థానంలో ఔన్నత్య పతనాలున్నాయి. మొదట శివుని కంటె ఎక్కువ స్థానంలో కృష్ణుణ్ణి కూర్చోబెట్టారు. అంతేకాదు కృష్ణుని గొప్పతనాన్ని శివునిచేత ఒప్పించారు. మళ్లీ కృష్ణుణ్ణి శివునికంటే కిందిస్థానంలోకి దించి వేయటమూ, అతని చేత శివుని గొప్పతనాన్ని అంగీకరింపజేయటమూ కనిపిస్తుంది.

శివునికంటే కృష్ణుని ఎక్కువ చేశారనటానికి సాక్ష్యాధారంగా అనుశాసనిక పర్వంలోని[1] ఈ దిగువ భాగం ఎన్నో వివరాలను అందిస్తుంది.

"అతడు (కృష్ణుడు) బ్రహ్మ (పితామహుడు) కంటే కూడా ఉత్కృష్టుడు. శాశ్వత పురుషుడు. కృష్ణుడు (హరి) సువర్ణ కాంతితో, మేఘాలు లేని ఆకాశంలో ఉదయ సూర్యుని లాగ దశహస్తాలతో, బలాఢ్యుడై, దేవతల శత్రువులను సంహరిస్తాడు. శ్రీవత్స లాంఛనుడైన అతనికి (హృషికేశుని) దేవతలందరూ ఆరాధిస్తారు. అతని నాభి నుండి బ్రహ్మ, అతని శిరస్సు నుండి నేను (మహాదేవుడు), శిరోజాల నుండి వివిధ కాంతులు, శరీర రోమాల నుండి దేవతలు, అసురులు ఉద్భవించారు. ఋషులు అతని నుండే వచ్చారు. అనశ్వరమైన ప్రపంచాలు అతని శరీరం నుంచే ఉద్భవించాయి. పితామహునికీ సమస్త దేవతా కోటికీ అతడు ప్రత్యక్ష ఆశ్రయం. ఈ భూమి సమస్తాన్ని ఆయనే సృష్టించాడు. ముల్లోకాలకు ప్రభువు ఆయనే. చరాచర జీవుల వినాశనకారి ఆయనే. దేవతలలో శ్రేష్ఠుడుగా, దేవతలకు ప్రభువుగా, శత్రువులకు కంటక ప్రాయుడుగా ఆయన అభివ్యక్తమవుతాడు. ఆయన సర్వజ్ఞుడు. కాలమూ దిక్కులూ అతడే.సర్వాంతర్యామి, సర్వోత్కృష్టమైన ఆత్మ. హృషీకేశుడు, సర్వవ్యాపి శక్తివంతుడైన ప్రభువు. అతడే. ముల్లోకాలలోను అతని కంటే ఘనుడు ఎవరూ లేరు. మధురిపునిగా, అనంతునిగా, గోవిందునిగా ఆయన శ్లాఘనీయుడు. గౌరవ ప్రదాత దేవకార్యార్థం పుట్టాడు.

1. మూయిర్ IV. పుటలు 273-274.

మానవ శరీరాన్ని ధరించి, యుద్ధంలో రాజులందరినీ సంహరిస్తాడు. దేవగణాలన్నీ త్రివిక్రముడు లేనందువల్ల తగిన నాయకుడు లేకపోవటం వల్ల దేవకార్యాలను నెరవేర్చ లేకపోయాయి. సమస్త జీవరాసులకు అతడు నాయకుడు, సకల జీవరాసులు అతనిని ఆరాధిస్తాయి.

"దేవతలకు ప్రభువు, దేవకార్యాలకు అంకితమైనవాడు, దేవతలకూ ఋషులకూ నిరంతర ఆశ్రయం అతడే. అతని శరీరంలో బ్రహ్మ నివసిస్తాడు. ఆయన వదనంలో బ్రహ్మ ద్యోతకమవుతాడు. దేవతలందరూ ఆయన శరీరంలో సునాయాసంగా ఆశ్రయం పొందుతారు. ఈ పద్మ దళాక్షుడు, శ్రీని సృష్టించినవాడూ, శ్రీతో కలిసి జీవిస్తున్నవాడూను. దేవతల రక్షణార్థం గొప్పవాడైన మనువు కుటుంబంలో ఉత్కృష్టమైన జ్ఞానం కలవాడై, ప్రజాపతి మను(వు) మార్గంలో పయనిస్తూ, సన్మార్గం కలవాడైన గోవిందుడు ఉద్భవిస్తాడు. (ఇక్కడ గోవిందుని పూర్వీకుల గురించిన ప్రస్తావన ఉన్నది). ఈ వంశంలోని వారు సాహసోపేతులు. సత్ప్రవర్తనకూ, సచ్ఛీలతకూ పేరొందిన పురుషులు, పూజారులు, అత్యంత పవిత్రులు. సురులు. ఆ క్షత్రియులలో సుప్రసిద్ధుడూ, కీర్తివంతుడూ అయిన రాజుకు ఆనక దుందుభి అనే కుమారుడు కలుగుతాడు. వసుదేవునిగా ప్రసిద్ధుడైన ఇతడు వంశ విస్తారకుడై నాలుగు చేతులు కలిగిన చతుర్భుజుడైన కుమారునికి జన్మ ఇస్తాడు. వాసుదేవుడు ఉదారుడు. బ్రాహ్మణులకు హితకారి, చేరుగడ. బ్రహ్మ స్వరూపుడు, బ్రాహ్మణప్రియుడు.

"మీరు దేవతలు. యుక్తమైనది కాబట్టి ఈ దేవుణ్ణి ఆరాధించండి. అనంత బ్రహ్మ అయిన ఇతనిని భక్తి శ్రద్ధలతో సమీపించి మహితమైన స్తోత్రమాలలను సమర్పించండి. నన్ను, బ్రహ్మను, పితరులనూ చూడగోరినవాడు దైవజ్ఞుడూ, దివ్యమైనవాడూ అయిన వాసుదేవుని దర్శించాలి. అతణ్ణి దర్శిస్తే అందర్నీ దర్శించినట్లే. నన్నూ, బ్రహ్మనూ, దేవ ముఖ్యులనూ అందర్నీ చూసినట్లే. ఈ విషయంలో సందేహం లేదు. కఠోర నియమ సంపన్నులైన మీరు దీనిని తెలుసుకోండి."

కృష్ణుణ్ణి దేవతలలో అత్యుత్తమ స్థానానికి తీసుకుని వెళ్ళి తరువాత, స్థాన భ్రష్టత్వం ఎట్లా కలిగించారో ఇప్పుడు చూద్దాం.

శివుని కంటే కృష్ణుడు తక్కువస్థాయి వాడు అని చెప్పడానికి మహాభారతం నిండా సంఘటనలు సందర్భాలు చాలా ఉన్నాయి. వాటన్నిటినీ చెప్పడం చాలా కష్టం కాబట్టి కొన్నింటితో సంతృప్తి పడవలసిందే.

అర్జునుడు జయద్రధుని చంపే సందర్భం చూద్దాం. ఆ మరుసటిరోజే జయద్రధుని చంపడానికి అర్జునుడు నిర్ణయించుకున్నాడు. ప్రతిజ్ఞ చేసిన తరువాత దిగులు పడ్డాడు. జయద్రధుని స్నేహితులు జయద్రధుణ్ణి రక్షించడానికి శాయశక్తులా ప్రయత్నాలు చేస్తారు కాబట్టి, తిరుగులేని ఆయుధాలుంటే తప్ప తన ప్రతిజ్ఞను నెరవేర్చుకోలేనని అర్జునుడు కలతపడ్డాడు. కృష్ణుని దగ్గరికి సలహా కోసం వెళ్లాడు. మహాదేవుని ప్రార్థించి దైత్య సంహారిణి

అయిన పాశుపతాస్త్రాన్ని పొందవలసిందిగా కృష్ణుడు అర్జునునికి సలహా ఇచ్చాడు. ఆ పాశుపతాస్త్రంతోనే మహాదేవుడు అంతకు ముందు దైత్యులను నిర్జించాడు. పాశుపతాస్త్రం గనక దగ్గర ఉంటే జయద్రథుని కచ్చితంగా సంహరించవచ్చునని కృష్ణుడు అన్నాడు.

ఈ కథ ఉన్న ద్రోణ పర్వం ఇల్లా కొనసాగుతుంది.

"ఆ తర్వాత శుద్ధాత్ముడైన వాసుదేవుడూ (కృష్ణుడు), పృథాపుత్రుడైన అర్జునుడూ గగనానికి ఎగసి కైలాసానికి వెళ్ళి శివుని దర్శించారు. (అర్జునుడు) అనంత వేదాలను వల్లె వేస్తూ విశ్వానికి ఆధారమైన వానిని, విశ్వ సృష్టికర్తను, చావు పుట్టుకలు లేని వానిని (నిరస్త సంభవ మరణాది వికృతుని), అనశ్వర ప్రభువును, సర్వోత్కృష్టమైన మనసుకు, ఆకాశానికి, గాలికి ఆధారమైనవానిని, ప్రకాశమానమైన వాటన్నిటికీ ఆశ్రయమైన వానిని, సముద్రాలను సృష్టించినవానిని భువన మయాత్మకుని, దేవతలు, దానవులు, యక్షులు, మానవులు, ఆదిగా గల సమస్తానికి రూపకల్పన చేసినవానిని, ధ్యాన పద్ధతులకు చెందిన పరబ్రహ్మను, సంతుష్టుని, బ్రహ్మజ్ఞానం పొందినవానిని, సృష్టి స్థితిలయకారుని, వినాశనకారియైన క్రోధ స్వరూపుని, ఇంద్ర సూర్యుల మూలరూపాన్ని, అప్రమేయుని, త్రిలోచనుని (శివుని) దర్శించి నేలపై శిరస్సు ఆనించి మోకరించాడు. కృష్ణుడు అప్పుడు అవాఙ్మనస గోచరుడైన పరమేశ్వరుని అనేక రకాలుగా శ్లాఘించాడు. సకలాత్మకుడూ, విజ్ఞులు ఆశ్రయించేవాడూ, సమస్త జీవులకూ ఆరంభకుడూ, భూత భవిష్యత్ వర్తమానాలకు ఆధారమైన వాడూ అయిన ఆ దైవాన్ని అర్జునుడు పదేపదే ఆరాధించాడు. నరనారాయణులు ఇద్దరినీ చూసి శర్వుడు (మహాదేవుడు) అత్యంత సంతుష్టుడై మందహాసంతో ఇల్లా అన్నాడు. "సర్వోత్కృష్టులారా స్వాగతం! అలసట నుంచి తేరుకోండి. మీ మనస్సు ఏమి వాంఛిస్తున్నదో త్వరగా చెప్పండి. మీ అభీష్టం తప్పక నెరవేరుస్తాను."

మహాదేవుని స్తుతిస్తూ కృష్ణుడు, అర్జునుడు చేసిన స్తోత్రం మహాదేవుడిని సర్వజీవుల ఆత్మగా, సర్వ వస్తువుల సృష్టికర్తగా, సర్వాంతర్యామిగా చెప్తున్నది. అప్పుడు అర్జునుడు, కృష్ణుణ్ణీ, మహాదేవుణ్ణీ పూజచేసి, దేవతాస్త్రం కోసం మహాదేవుణ్ణి కోరాడు. (మహాదేవుడు అతని కోరిక మన్నించి) తన విల్లు, అంబులను (అంతకు ముందు) దాచిపెట్టిన కొలను దగ్గరకు వారిని పంపించాడు. అక్కడ వారిద్దరికీ రెండు సర్పాలు కనిపించాయి. అవి నిప్పులు కక్కుతూ భీకరంగా ఉన్నాయి. కృష్ణార్జునులు నియతాత్ములై మహాదేవుని మనసులో నిలుపుకొని శతరుద్రీయం వల్లె వేస్తూ వాటిని సమీపించారు. మహాదేవుని అనుగ్రహం వల్ల ఆ రెండు సర్పాలు ఉగ్రభావం విడిచి విల్లు, అంబులుగా మారాయి. వాటిని కృష్ణార్జునులు మహాదేవుని సన్నిధికి తీసుకొని వచ్చారు. ఈ విధంగా చివరికి అర్జునుడు మహాదేవుని నుంచి జయద్రథుని సంహరించడానికి సమర్థమైన పాశుపతాస్త్రాన్ని (వరంగా) పొందాడు. ఆ తరవాత వారిద్దరూ తమ శిబిరానికి తిరిగి వచ్చారు."

మహాభారతంలోని అనుశాసనిక పర్వంలో యుధిష్ఠిరునికి, భీష్మునికి మధ్య ఒక సంభాషణ ఉంది. మహాదేవుని గుణగణాలను వర్ణించవలసిందిగా యుధిష్ఠిరుడు భీష్మణ్ణి అడిగాడు. దీనికి సమాధానంగా భీష్ముడు ఇల్లా అంటాడు.

"సర్వాంతర్యామి అయినాగాని, అవ్యక్తుడూ, బ్రహ్మ, విష్ణు, ఇంద్రాది దేవతలను సృష్టించినవాడు, బ్రహ్మ నుంచి పిశాచాల వరకు దేవతలందరికీ ఆరాధ్యుడూ, ఆత్మ వస్తు పదార్థాలను అధిగమించినవాడు, యోగ ధ్యానపరులు, సత్యదృష్టికలవారూ అయిన ఋషులు శ్లాఘించేవాడూ, అస్తిత్వంలో ఉండీ (తిరిగి) అస్తిత్వంలో లేనివాడూ, సర్వజ్ఞుడూ అయిన మహాదేవుని లక్షణాలు వర్ణించడం నాకు కష్టం. ప్రకృతి పురుషాత్ముడైన ఆ మహాదేవుడే బ్రహ్మను సృష్టించాడు. సాధారణమైన పుట్టుక కలిగి వినాశనకారి అయిన మృత్యువుకు లోబడే నాలాంటి సామాన్యునికి సర్వోత్కృష్టుడైన ఆ దేవాధిదేవుని, భవుని, వర్ణించటం ఎలా సాధ్యమవుతుంది. శంఖ చక్ర గదాధారి అయిన నారాయణునికి తప్ప అది వేరెవరికి సాధ్యం. జ్ఞాని, సద్గుణరాశి, అజేయుడూ అయిన విష్ణువు దివ్యదృష్టితో అత్యంత శక్తితో ధ్యాననేత్రాలతో అతణ్ణి (శివుని) చూస్తాడు. రుద్రుని పట్ల భక్తి ద్వారా, ఈ ప్రపంచం కృష్ణ వ్యాప్తమవుతుంది. బదరి వద్ద మహాదేవుడిని సంతృప్తి పరచిన తర్వాత, కృష్ణుడు సువర్ణ నేత్రుడైన మహాదేవుని నుంచి ప్రపంచ విభూతి కంటే మిన్న అయిన లక్షణాన్ని పొందుతాడు. వరప్రదాయకుడు, విశ్వానికి గురువూ అయిన శివుని అనుగ్రహం పొందుతూ మాధవుడు (కృష్ణుడు) వెయ్యి సంవత్సరాలు పూర్తిగా కఠోర నియమాలు పాటించాడు. ప్రతి యుగంలోనూ కృష్ణుని భక్తితో మహేశ్వరుడు సంతృప్తి పొందుతూ, ఆ మహాపురుషుని భక్తిని మెచ్చుకుంటూ వచ్చాడు. ఈ అచంచలుడైన కృష్ణుడు, వర్ధిష్ణువై ఆ విశ్వపిత దివ్య ప్రకాశ లక్షణం ఏమిటో దర్శించగలిగాడు. అతనికంటే ఎక్కువ నేనేమీ చూడలేను. దీర్ఘబాహుడైన కృష్ణుడు మాత్రమే దేవాధి దేవుడైన శివుని నామాలను పూర్తిగా చెప్పగలడు. సకలుడు, కల్మషరహితుడు, శాంతి ప్రియుడు అయిన మహేశ్వరుని నిజశక్తిని, లక్షణాలను అతనొక్కడే వర్ణించగలడు."

భీష్మ యుధిష్ఠరుల మధ్య సంభాషణ కృష్ణుని సమక్షంలోనే జరిగింది. ఈ సమాధానం విన్న వెంటనే భీష్ముడు, మహాదేవుని మహాత్యం తెలపవలసిందిగా కృష్ణుణ్ణి కోరాడు. ఈ సర్వోత్కృష్ట దేవుడైన కృష్ణుడు, ఏ మాత్రమూ నొచ్చుకోకుండా అందుకు ఉపక్రమించాడు.

"ఈశుని (మహాదేవుని) లీలలు నిజంగా తెలుసుకోలేము. హిరణ్యగర్భుని నాయకత్వంలో ఉన్న దేవతలుగాని, ఇంద్ర సహితులైన ఋషులుగాని, సూక్ష్మాంశాలను పైతం గ్రహించగలిగే ఆదిత్యులుగాని ఆ దేవుని సారాన్ని గ్రహించలేరు. అటువంటపుడు ఋషులకు ఆశ్రయమైన అతనిని, మానవమాత్రుడు ఎలా తెలుసుకోగలడు? అసుర సంహారి, మతపరమైన ఆచారాలకు అధినేత అయిన ఆ దేవుని గుణగణాలను కొన్నిటిని (మాత్రం) వివరిస్తాను."

ఇక్కడ, శివునికంటే తను తక్కువ స్థానంలో ఉన్న సంగతి కృష్ణుడు అంగీకరించాడన్న

విషయమే కాకుండా, కృష్ణుడు ఓడిపోయాడనీ, తనకంటే ఇక ఎక్కువవాడు కాదనీ, అంతేకాదు, తనతో సమానుడు కూడా కాదనే సంగతి శివుడు గ్రహించిన విషయం కూడా మనకు స్పష్టమౌతుంది. సౌప్తిక పర్వంలో, మహాదేవుడు అశ్వత్థామతో చెప్పిన దాన్నిబట్టి ఈ సంగతి తెలుస్తున్నది.

"శక్తివంతుడూ, క్రియాశీలీ అయిన కృష్ణుడు, నన్ను స్వచ్ఛమైన మనస్సుతో నిష్కల్మషంగా ఔదార్యంతో, కఠోర నియమాలతో, ఆచారాలతో, ఓర్పుతో, జ్ఞానంతో, ఆత్మ నిగ్రహంతో పూజించేవాడు. అందుకనే కృష్ణునికంటే ఎక్కువగా నాకెవరూ ఇష్టులు లేరు."

(ఒకప్పుడు) శివుని కంటే ఇతర అందరు దేవుళ్ళ కంటే పైనున్న కృష్ణుడు, పరమేశ్వరుడైన కృష్ణుడు, అనంతరకాలంలో శివుని మామూలు అనుచరుడుగా చిన్న చిన్న వరాలు వేడుకొనే పరిస్థితికి దిగిపోయాడు.

కృష్ణుని పతన గాథ దీనితో పూర్తి కాలేదు. దీనికంటే ఎక్కువ గర్వభంగానికి గురి అయ్యాడు. శివుని కంటే అధమ స్థానాన్ని అంగీకరించటమే కాకుండా, శివుని గొప్ప శిష్యుడైన ఉపమన్యుని శిష్యుని స్థాయికి కృష్ణుడు జారిపోయాడు. అతని దగ్గర నుంచి శైవమత దీక్ష గ్రహించాడు. కృష్ణుడే ఇలా అంటాడు.

ఎనిమిదవ రోజున శాస్త్రానుసారంగా, ఆ బ్రాహ్మణుడు (ఉపమన్యు) నాకు ఉపదేశించాడు. తల పూర్తిగా గొరిగించుకొని, దేహమంతా నేయి పులుముకొని, చేతిలో కుశగ్రాసం, దండం పట్టుకొని, చెట్టు పార (బెరడు) చుట్టుకొని మేఖల (మొలతాడు) ధరించి ఉన్నాను."

కృష్ణుడు అపుడు ధాన్యం చేశాడట. మహాదేవుడు సాక్షాత్కరించాడు.

ఒక దేవుడు అత్యుత్తమ స్థానంలోకి వెళ్లి ఇంత అథఃపాతాళానికి పడిపోయిన సంఘటన మరొకటి ఏదైనా ఎక్కడైనా ఉంటుందా? ఈ శివుడు కేవలం ఈశ్వరుడే. అతనితో పోల్చి చూసినపుడు కృష్ణుడు పరమేశ్వరుడు. అయినప్పటికీ అటువంటి కృష్ణుడు చివరకు ఈశ్వరునిగా కూడా మిగలలేదు. అతడు వాస్తవంగా శివభక్తుడై, ఉపమన్యులాంటి ఒక మామూలు బ్రాహ్మణుని దగ్గర శివశాస్త్రాలలో దీక్ష తీసుకున్నాడు.

కృష్ణుని కథ కంటే రాముడు దేవుడనే కథ కృత్రిమంగా ఉంటుంది. తాను దేవుడిననే సంగతి మరి రామునికే తెలియదు. రావణుణ్ణి ఓడించి చంపి, సీతను తిరిగి సంపాదించి తెచ్చిన తర్వాత, సీత పాతివ్రత్యం మీద రామునికి అనుమానం కలుగుతుంది. సీత గురించి జనులు నిందాస్పదమైన మాటలు చెప్పుకోవటం విన్న రాముడు ఎంతో దిగులు పడిపోయాడు. రామాయణం ఇలా చెబుతున్నది :

1. మ్యూయిర్ ఉదహరించినది.

"అపుడు కుబేరరాజు, యముడు, దేవతల ప్రభువైన ఇంద్రుడు, శత్రువులను మర్దించే వరుణుడు, నందివాహనుడైన ముక్కంటి మహాదేవుడు, విశ్వానికి సృష్టికర్త, వేద పారంగతులలో అత్యంత శ్రేష్టుడూ అయిన బ్రహ్మ (స్వర్లోక రథంపై గాలిలో కదలాడుతూ) ఆ ప్రదేశానికి వచ్చారు. సూర్య తేజస్సుతో సమానమైన కాంతిగల రథాలమీద వారంతా లంకా పట్టణానికి రాఘవుని (రాముడు) దగ్గరకు వచ్చారు. సర్వశ్రేష్టులైన ఆ దేవతలు, బంగారు సొమ్ములు ధరించిన దీర్ఘ బాహువులను ఎత్తి, ముకుళిత హస్తాలతో ఇలా అన్నారు : మొత్తం విశ్వాన్ని సృష్టించిన సమర్థుడవు. జ్ఞానులలో శ్రేష్ఠుడవు, సర్వాంతర్యామివి, అటువంటి నువ్వే, సీతను అగ్నిలోకి దూకేలా ఎందుకు (ఉపేక్ష) చేశావు? నువ్వు దేవగణాలకు ముఖ్యుడననీ, ఒకప్పుడు వసువులలోని వాడననీ, రుతుధాముడనే పేరుగల వసు ప్రజాపతిననీ ఎందుకు తెలుసుకోలేక పోయావు? ముల్లోకాలను సృష్టించిన ప్రముఖుడివి నువ్వు, స్వయంభువైన ప్రభువువి, రుద్రులలో ఎనిమిదో రుద్రుడివి, సాధ్యులలో అయిదవ వాడివి, (వీర్యవంతుడనే పేరుగలవాడవు) అశ్వినులు నీ చెవులు, సూర్యచంద్రులు నీ కళ్లు."

"నీ శత్రువులకు కంటకప్రాయుడివి, సృష్టి జీవరాసులలో ఆది అంతం నీవే. అయినా ఒక మానవమాత్రుడిగా సీతను ఎందుకు త్యజించావు?"

దేవతలు ఈ విధంగా తననుద్దేశించి అడిగినపుడు, రాముడు ఆశ్చర్యపోయి, ఇలా సమాధానం ఇచ్చాడు.

"నన్ను ఒక మామూలు మనిషిగా, దశరథుని కుమారుడైన రామునిగానే భావించాను. ఓ దేవతలారా! నేనెవరినో, ఎందుకు ప్రభవించానో నాకు తెలియజేయండి!"

రామునికి జవాబిస్తూ బ్రహ్మ ఇలా అన్నాడు :

ఓ సత్యవిక్రమా! "నా సత్యవాక్కును విను. చక్రధారివీ, ప్రకాశవంతుడైన నారాయణుడివీ నువ్వు. ఒంటి కొమ్ము కలిగిన (ఒంటి కొమ్ముతో భూమిని ఉద్ధరించిన) వరాహానివి నువ్వు, భూత భవిష్యత్తులలో (గతించిన, రానున్న కాలాలలో) నీ శత్రువులను సంహరించేవాడివి నువ్వు. నిజమైన బ్రహ్మవు నువ్వు. అంతటికీ ఆది మధ్యము, అంతమూ నువ్వే. ప్రపంచంలో సిద్ధధర్మమూ కర్మమూ నువ్వే. చతుర్బాహుడవు విష్వక్సేనుడవు, శౌరివి, హృషీకేశుడవు, పురుషుడవు, పురుషోత్తముడవు, అజేయుడవు, ఖడ్గధారివి, విష్ణువు, మహాశక్తి సేనానివి, కృష్ణుడవు, గ్రామణీ రత్నానివి. నీవే జ్ఞానానివి, ఓర్పువు, ఆత్మ నిగ్రహానివి. జీవాధారానివి, నాశన హేతువువూ నీవే. ఉపేంద్రుడవు, మధుసూదనుడవు. ఇంద్రుని విధులు నిర్వహిస్తున్న మహేంద్రుడవు. ఎవరి నాభిలో నుంచి పద్మం పుట్టిందో అతనివి నువ్వే. స్వయంభర్తవు హర్తవు నీవే. మహర్షులు దేవ ఋషులు నీ ఆశ్రయం జొచ్చి నిన్ను శరణు వేడతారు. వేలాది శాఖలతో వేదాలను సృజించినవాడువు నీవే. వేయి శీర్షాలు కలిగిన శక్తిమంతుడివి. ముల్లోకాల సృష్టికర్తవు. సిద్ధ సాధ్య సంఘాలకు ఆది పురుషుడివి నీవు. యజ్ఞానివి నీవు. షట్కారానివి నీవే. ఉత్తమోత్తమమైన ఓంకారానివీ నీవే. జీవాధారానివి నాశన హేతువువూ అయిన నిన్ను మానవమాత్రులు

ఎరగరు. అన్ని జీవాలలోనూ నిండి నీవు కనిపిస్తావు. బ్రాహ్మణులలోనూ గోవులలోనూ పర్వతాలలోను నదులలోను అంతటా అన్ని ప్రదేశాలలోను నీవు కనిపిస్తావు. వేయి పాదాలు 'వేయి శీర్షాలు' వేయి నేత్రాలు కలిగి చరాచర జీవులతో నిండి ఉన్న భూతధాత్రిని వహించగల, సహించగల దక్షుడివి నీవు. కల్పాంతవేళ నీటిలో మహా సర్పం పాన్పుగా గలవాడవై ముల్లోకాలను, దేవతలను, గంధర్వులను, దానవులను, ధరించి ఉన్నవాడవు నీవే. నేను నీ హృదయాన్ని. సరస్వతి దేవత నీ నాలుక. దేవ సమూహాలు రోమాలు. నీవు కనులు తెరిస్తే పగలు. కనురెప్పలు మూస్తే రాత్రి. నీ నిశ్వాసాలే వేదాలు. నీవు కానిది ఆవగింజంత కూడా లేదు. ఈ ప్రపంచమంతా నీ శరీరం. భూగోళం నీ స్థైర్యం. అగ్ని నీ ఆగ్రహం. సోముడు నీ ఆనందం. శ్రీవత్సం నీ చిహ్నం. నీవే కదా పూర్వం బలిని దానం కోరి మూడు అడుగులతో ఈ మూడు లోకాలను చుట్టి, బలిని బంధించావు. మహేంద్రుని రాజుగా చేసి పట్టం కట్టావు. ముఖ్యాతిముఖ్యమైన వెలుగుగా పేరొందినదీ, ముఖ్యాతి ముఖ్యమైన చీకటిగా పేరొందినదీ అత్యుత్తమమైన దానికంటే ఉత్తమమైనదీ అయిన పరమాత్మవు నీవు. అత్యుత్తమమైనదిగా శ్లాఘింపబడినవాడివి నువ్వు. క్షరం కంటే అక్షరం కంటే ఉత్తమమైనవాడివి. సృష్టి స్థితి లయాలకు మూలాధారమైనవానిగా నిన్ను మానవులు పేర్కొంటారు."

రాముని ఆరాధనలో కూడా అంతే కృతిమత్వం ఉన్నట్లు కనిపిస్తున్నది. కృష్ణునిలాగానే రాముణ్ణి కూడా దేవుడిగా చేశారు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులలా రాముడు దేవుడిగా జన్మించలేదు. అతని దైవత్వాన్ని స్థిరపరచటానికి బహుశా, అతను విష్ణువు అవతారమనీ, సీత విష్ణువు భార్య అయిన లక్ష్మి అవతారం అనీ కథ కనిపెట్టారు (కల్పించారు).

మరొక కోణంలోంచి చూస్తే రాముడు అదృష్టవంతుడు. బ్రహ్మ, విష్ణు మహేశ్వరులలాగ ఇతనిని ఇతర దేవతల కంటే కింది స్థానానికి దించలేదు. అయితే ఇతణ్ణి బ్రాహ్మణ నాయకుడైన పరశురాముని కంటే కిందికి దించటానికి ప్రయత్నాలు జరిగాయి. ఈ కథ రామాయణంలో చెప్పారు. అది ఇలా ఉన్నది :

"సీతా రాముల పెళ్లి జరిగిన తర్వాత జనకుని దగ్గర సెలవు తీసుకొని దశరథ మహారాజు కొడుకులతో కోడళ్ళతో అయోధ్యకు తిరిగి వస్తుండగా, కొన్ని పక్షులు దుశ్శకునం పలికాయి. దానిని వివరిస్తూ వశిష్ఠ మహర్షి దశరథునితో "వనంలో ఉన్న మృగాలు నీ చుట్టూ పరిభ్రమిస్తుండటంవల్ల ఇది నీకు శుభ సూచకమే" అని హామీ ఇచ్చాడు. దుశ్శకున సూచకమైన ప్రమాదం ఏమిటంటే పరశురాముని ఆగమనం. అతడు వచ్చే ముందు భూమిని కుదిపివేసేంత చెట్లను కూల్చి వేసేటంత, తుఫాను గాలి వచ్చింది. సూర్యుని కప్పివేసేటంత దట్టమైన చీకటి అలముకుంది.

ఆ తర్వాత, చూడటానికి భయంకరంగా, గొడ్డలినీ, విల్లునూ భుజాన వేసుకొని ఉన్న పరశురాముడు కనిపించాడు. అతడు దశరథుని కుమారుడైన రాముణ్ణి సమీపించి, "నీవు జనకుడు ఇచ్చిన విల్లును విరగగొట్టిన శక్తిశాలివని విన్నాను. నేనొక విల్లును తెచ్చాను. దానిని

వంచి దానిలో బాణం పెట్టు" అని అడిగాడు. అలా పెట్టగలిగితే 'నేనొక్కణ్ణే నీతో యుద్ధానికి తలపడతాను' అన్నాడు.

తన విరోధి తన శౌర్య ప్రకృతిని ఎంత అవమానించినప్పటికీ సహించాడు రాముడు. చివరకు పరశురాముని పరుష వాక్యాలు వినలేక కోపంతో పరశురాముని చేతిలోంచి విల్లు లాక్కొని వంచి దానిలోకి బాణం ఎక్కించాడు. తన శత్రువుతో "నువ్వు బ్రాహ్మణుడివి కాబట్టీ నీ జ్ఞాతి విశ్వామిత్రుని మూలంగానూ నీపై బాణం ఎక్కుపెట్టడం లేదు. నిన్ను చంపను; కాని నీకున్న అసాధారణ గమనశక్తిని గాని కఠోర తపస్సు చేసి సమకూర్చుకున్న పుణ్యలోకాలను గాని (పావన ఆశ్రయాలను) నిర్మూలిస్తాను" అన్నాడు. (పరశురాముడు కశ్యపునికి భూమి అంతా దారపోశాడు. పగలు భూమి మీద సంచరించినా, రాత్రుళ్ళు మాత్రం అక్కడ ఉండకుండా మహేంద్రాచలానికి వెళ్ళిపోతుంటానని కూడా కశ్యపునికి వాగ్దానం చేశాడు. అందుకోసం అసాధారణమైన గమనశక్తి సాధించాడు.) ఈ దృశ్యం చూడటానికి దేవతలు దిగి వచ్చారు. పరశురాముడు అధైర్యపడిపోయి దీనుడై తన గమనశక్తిని హరించి వేయవద్దనీ అది లేకపోతే తాను ప్రతి రాత్రీ భూమిని వదిలిపెట్టి వెళతానని కశ్యపునికి ఇచ్చిన వాగ్దానాన్ని చెల్లించుకోలేక పోతాననీ అందుచేత తన పుణ్యలోకాలను నిర్మూలించుకోవచ్చుననీ అణకువతో ప్రతిమాలాడు."

ఈ ఒక్క మినహాయింపు తప్ప రామునికి ఏ ఇతర దేవతలతోనూ వైరం లేదు. తానెక్కడ ఉన్నాడో అక్కడే ఉండేటట్టు చూసుకున్నాడు. ఇతర దేవతల విషయం అలా లేదు. అది చెప్పటానికి వేరే బోలెడు కథలున్నాయి. పాపం, ఆ దేవతలు, బ్రాహ్మణుల చేతిలో ఆటబొమ్మలైనారు. అసలు బ్రాహ్మణులు దేవుళ్లను అంత అగౌరవంగా ఎందుకు చూశారు?

అనువాదం : బొజ్జా తారకం

## చిక్కుముడి : 12

# బ్రాహ్మణులు దేవుళ్ళను పీఠం దింపి దేవతలకు పట్టం ఎందుకు కట్టారు ?

దేవుళ్ళను పూజించటం సాధారణమైన విషయమే. కాని దేవతలను పూజించటం మాత్రం అంత సాధారణమైన విషయం కాదు. దేవుళ్ళు సాధారణంగా పెళ్ళి చేసుకోరు. అందువల్ల దేవతల స్థానంలో ప్రతిష్ఠించటానికి వారికి భార్యలు ఎవరూ ఉండకపోవడమే దానికి కారణం. దేవుడు పెళ్ళి చేసుకుంటాడనే భావన ఎంత అసహ్యకరమైనదో ఈ ఉదంతం వల్ల బాగా తెలుస్తుంది. తొలి క్రైస్తవులు యేసును దేవుని కుమారుడిగా యూదుల చేత ఒప్పించటానికి పడిన కష్టాలు అంతా ఇంతా కాదు. దేవుడు అసలు పెళ్ళే చేసుకోకపోతే ఏసుదేవుని కుమారుడు ఎలా అవుతాడని వారు ఎదురు ప్రశ్న వేశారు.

హిందువుల విషయంలో పరిస్థితి మరో విధంగా వుంది. వారు పురుష దేవుళ్ళనే కాదు స్త్రీ దేవతలను కూడా పూజిస్తారు.

ఋగ్వేదంలో పృధ్వి, అదితి, దితి, నిష్టిగ్రి, ఇంద్రాణి, ప్రిస్ని, ఉష, సూర్య, ఆగ్నేయి, వరుణాని, రోదసి, రాక, సినీవాలి, శ్రద్ధ, ఆరమతి, అప్సర, సరస్వతి వంటి అనేక దేవతల ప్రస్తావన ఉన్నది.

---

**ఈ అధ్యాయం అసలు శీర్షిక 'Vedic and Non Vedic goddesses' ("వైదిక, అవైదిక దేవతలు"). విషయాన్ని బట్టి, ముగింపు పేరాను బట్టి విషయ వివరణ పట్టికకు అనుగుణంగా దీనిని చిక్కుముడి-12గా చేర్చాం. ఇది 21 పుటల టైపు ప్రతి. కొద్దిపాటి సవరణలున్నాయి. ముగింపు పేరా రచయిత దస్తూరీతో ఉంది. —సంకలనకర్త**

పృధ్వి ఆర్యుల అతి ప్రాచీన దేవత. ఆమెను ద్యో (స్వర్గం) లేదా పర్జన్యుని భార్యగా ప్రస్తావించారు. పృధ్వి అనేకమంది దేవుళ్ళకు తల్లి కాబట్టి ఆమె అతి ముఖ్యమైన దేవత అయ్యింది.

వైదిక దేవతల వరుసలో అదితి మరో ప్రాచీన దేవత. ఆమెను దేవుళ్ళ శక్తివంతమైన మాతృమూర్తిగా అభివర్ణించారు. మిత్ర, అర్యమ, వరుణ దేవుళ్ళు ఆమె కుమారులు. ఆమెకు ఎవరితో వివాహం అయిందో ఋగ్వేదంలో ఎక్కడా కనబడదు.

దితి గురించి మనకు అంతగా తెలియదు. అదితితో పాటు దితిని కూడా దేవతగా చెప్పటం జరిగింది. తర్వాత భారతీయ పురాణాలలో దేవతలకు శత్రువులుగా చెప్పబడిన దైత్యులు ఈమె కుమారులని పేర్కొన్నారు.

నిష్టిగ్రి దేవత ఇంద్రుని తల్లి. ఇంద్రాణి దేవత ఇంద్రుడి భార్య. ప్రిస్ని మరుత్తులకు తల్లి ఉషను ఆకాశానికి కుమార్తెగా, భగుని సోదరిగా, వరుణుని బంధువుగా, సూర్యుని భార్యగా అభివర్ణించారు. సూర్య దేవత సూర్యుడి కుమార్తె. ఈమె అశ్వినుల లేదా సోమదేవుళ్ళ భార్య.

ఆగ్నేయి, వరుణాని, రోదసి దేవతలు వరుసగా అగ్నికి, వరుణుడికి, రుద్రుడికి భార్యలు. మిగతా దేవతలలో కొందరు నదులకు మూర్తి కల్పన చేసినట్టివారు. మరికొందరి పేర్లే తప్ప వివరాలు తెలియటం లేదు.

ఈ పరిశీలన వలన రెండు అంశాలు స్పష్టమవుతున్నాయి. మొదటిది హిందూ దేవుడు వివాహం చేసుకోవచ్చు అని. దేవుడు ఒక సామాన్య మానవునిలాగా వివాహం చేసుకోవటం అనేది ఆ భగవంతునికి గాని, ఆయన భక్తులకు కాని ఎలాంటి ఇబ్బందికరమైన విషయమూ కాదు. రెండోది ఆ దేవుని భార్య దేవతగా దేవునితో పాటు భక్తుల పూజలు అందుకుంటుంది.

వైదిక కాలాన్ని వదిలి పురాణ కాలానికి వచ్చేసరికి దేవి, ఉమ, సతి, అంబిక, పార్వతి, హైమావతి, గౌరి కాళి, నిర్రుతి, చండి, కాత్యాయని, దుర్గ, దశభుజ సింహవాహిని, మహిషాసురమర్దిని, జగద్ధాత్రి, ముక్తకేశి, తార ఛిన్న మస్తక, జగత్‌గౌరి, ప్రత్యాంగి, అన్నపూర్ణ, గణేశజనని, కృష్ణక్రోర లక్ష్మి మొదలైన మరింత మంది దేవతల పేర్లు మనకు కనిపిస్తున్నాయి. ఈ దేవతలు ఎవరెవరో వివరాలు చెప్పటం చాలా కష్టం. మొదటిగా ఈ పేర్లన్నీ ఒక్కొక్క స్పష్టమైన ప్రత్యేక దేవతవా? లేక ఇవి అన్నీ ఒకే దేవత పేర్లా? అనేదీ తెలియటం లేదు. వారి తల్లిదండ్రులు ఎవరో చెప్పటం కూడా అంతే కష్టం. వారి భర్తలెవరో ఖచ్చితంగా ఎవరూ చెప్పను కూడా లేరు.

ఒక వివరణ ప్రకారం ఉమ, దేవి, సతి, పార్వతి, గౌరి, అంబిక అనేవి ఒకే దేవియొక్క రకరకాల పేర్లు. మరోచోట దేవి దక్షుని కుమార్తె అనీ, అంబిక రుద్రుని సోదరి అనీ పేర్కొన్నారు. పార్వతి పుట్టుక గురించి వరాహ పురాణంలో ఈ విధంగా ఉంది.[1]

1. విల్కిన్స్ (Wilkins) రాసిన హిందూ మైథాలజీ (Hindu Mythology) 290-91 పుటలలో ఉదహరించారు.

"బ్రహ్మ శివుని సందర్శించటానికి కైలాసానికి వెళ్ళినప్పుడు శివుడు ఆయనతో ఇలా అన్నాడు. ఓ బ్రహ్మదేవా! మీరెందుకు నా దగ్గరకు విచ్చేశారో కారణం తక్షణమే సెలవివ్వండి." "అంధకుడనే (చీకటి) శక్తివంతుడైన అసురుడు దేవతలను పీడిస్తున్నాడు. రక్షణకై వారంతా నా దగ్గరకు వచ్చారు. మీకు వెంటనే ఈ విషయం తెలియజేయాలని వచ్చాను' అని బ్రహ్మ సమాధానం చెప్పాడు. బ్రహ్మ అభిప్రాయం గమనించి శివుడు తలంపుతోనే విష్ణువును స్మరించి తమ సమక్షంలోకి రప్పించుకున్నాడు. ఆ త్రిమూర్తులు పరస్పరం సారించిన దృక్కులలోంచి ఒక అతిలోక సౌందర్యవతియైన కన్య ఉద్భవించింది. త్రివర్ణచ్ఛాయతో నీలి కలువరేకుల వలె వజ్ర వైడూర్యాలతో అలంకృతమైన ఆమె వారి ఎదుట తలవంచుకుని నిలుచుంది. అప్పుడు త్రిమూర్తులు "ఎవరు నువ్వు, నలుపు, తెలుపు, ఎరుపు రంగులలో ప్రత్యేకంగా ఎందుకు కనిపిస్తున్నా"వని అడిగినప్పుడు 'మీ చూపుల నుంచి నేను జన్మించాను. సర్వ శక్తులు కలిగి ఉన్న మీకు మీ శక్తి తెలియదా' అని ఆమె బదులు చెప్పింది. అప్పుడు బ్రహ్మ ఆమెను ప్రశంసిస్తూ ఇలా అన్నాడు. 'ఇక నుంచి నీవు త్రికాల దేవతగా (భూత, వర్తమాన, భవిష్యత్తు) ఈ సృష్టి సంరక్షకురాలిగా పిలవబడతావు. భక్తుల కోర్కెలను ఈడేర్చే దేవతవు నీవు. నిన్ను వేరు వేరు పేర్ల మీద పూజిస్తారు. కాబట్టి ఓ దేవి! వేరు వేరుగా కనబడుతున్న రంగులను బట్టి మూడు రూపాలుగా నిన్ను నీవు విభజించుకో'' అని కోరాడు. అప్పుడు ఆమె బ్రహ్మ కోరిక ప్రకారం తనను మూడు భాగాలుగా విభజించుకున్నది. తెలుపు, ఎరుపు, నలుపు రంగులలో మూడు ఆకారాలు దాల్చింది. తెలుపులో అందమైన, మంగళకరమైన రూపంలో సరస్వతిగా అయింది. ఆమె సృష్టిలో బ్రహ్మకు చేదోడుగా ఉన్నది. ఎర్రనిదేవి లక్ష్మి అయింది. ఆమె విష్ణువు ప్రియురాలు. ఆయనతో కలిసి విశ్వాన్ని సంరక్షించింది. నల్లని దేవి పార్వతి అయింది. శివుని అనేక గుణాలను, శక్తిని సంతరించుకున్నది.

ఇక్కడ సరస్వతి, లక్ష్మి, పార్వతి అనేవారు ఒకే ఒక దివ్యశక్తికి వేరు వేరు రూపాలుగా సూచించడం జరిగింది. బ్రహ్మ భార్య సరస్వతి. విష్ణువు భార్య లక్ష్మి. శివుడి భార్య పార్వతి. వారి భర్తలైన ఈ త్రిమూర్తులు పరస్పరం తలపడుతుండేవారని గుర్తు చేసుకున్నప్పుడు వరాహ పురాణం ఇచ్చిన ఈ వివరణ చాలా వింతగా కనబడుతుంది.

గౌరి ఎవరు? గౌరి పార్వతికి మరోపేరని పురాణం చెబుతున్నది. పార్వతికి గౌరి అనే పేరు ఎలా వచ్చిందో చెప్పటానికి ఒక ఉదంతం ఉంది. శివుడు పార్వతి కైలాసపర్వతంపై నివసిస్తున్నప్పుడు తరచుగా వారిద్దరు పోట్లాడుకుంటూ ఉండేవారు. ఒకసారి ఆమె శరీరం నల్లగా ఉందని నిందించాడు. ఆ ఎత్తిపొడుపు వల్ల ఆమెకు ఎంతో బాధ కలిగి కొన్ని రోజులు శివుణ్ణి విడిచి వెళ్ళిపోయింది. ఘోరమైన తపస్సు ఆచరించింది. దానితో బ్రహ్మ ప్రత్యక్షమై ఆమెకు బంగారు దేహకాంతిని ప్రసాదించాడు. దీనితో ఆమెకు గౌరి అనే పేరు వచ్చింది.

ఇక ఇతర దేవతల విషయానికి వస్తే వారంతా ఒకే దేవతకు సంబంధించి విభిన్న

నామాలు వహించిన వారా? లేక విభిన్నమైన దేవతలా? అనేది అంత ఖచ్చితంగా తెలియదు. మహా భారతంలో అర్జునుడు చేసిన దుర్గా స్తుతిలో ఈ విధంగా ఉంది.

"ఓ సిద్ధ సేనానీ, మందర వాసినీ, నీకు నమస్సులు. కుమారీ (యువరాణీ) కాళీ, కపాలీ, కపిలా, కృష్ణపింగలా, నీకు నమస్సులు. భద్రకాళీ, నీకు నమస్సులు. మహాకాళీ, చండి, చండ, తారిణి (తరింపజేసేది) వరవర్ణని (అందమైన రంగు కలది) సౌభాగ్య, కళ్యాణి, ఓ కరాళీ, ఓ విజయ, ఓ జయ, గోపాల సోదరీ మహిషాసుర మర్దిని (మహిషుని రుధిరంతో ఆనందించేదానా!) ఓ ఉమా, శాకంభరీ, శ్వేతవర్ణినీ, శ్యామవర్ణినీ, కైటభహారిణీ! నీవే బ్రహ్మ జ్ఞానానివి (వేద సారానివి) సమస్త జీవుల సుషుప్తివి, స్కందమాత (కార్తికేయుని తల్లివి), దుర్గాదేవివి (అరణ్యావాసినివి), మహాదేవివి, స్వచ్ఛంద హృదయంతో నిన్ను స్తుతిస్తున్నాను. నీ కృపవల్ల యుద్ధంలో నేనెప్పుడూ అజేయుడిగా ఉందునుగాక".

ఈ స్తుతి పాఠం ద్వారా పైన పేర్కొన్న దేవతా నామాలు దుర్గాదేవికి ఉన్న రకరకాల పేర్లు మాత్రమే అని తెలుస్తున్నది. అదే విధంగా దశభుజ, సింహవాహిని, మహిషాసురమర్దిని, జగద్ధాత్రి, చిన్నమస్తక, జగత్‌గౌరి, ప్రత్యాంగి, అన్నపూర్ణ పేర్లు కూడా దుర్గాదేవివే, అంటే ఆమె వివిధ రూపాలకు చెందినవే.

ఈ విధంగా చూస్తే ప్రధానమైన దేవతలు ఇద్దరున్నారు. ఒకామె పార్వతి. రెండవ ఆమె దుర్గ. మిగతావన్నీ వారి పేర్లు మాత్రమే. పార్వతి దక్ష ప్రజాపతి కుమార్తె, శివుడి భార్య. దుర్గ కృష్ణుడి సోదరి. శివుడి భార్య దుర్గకు, కాళికి మధ్య ఉన్న బంధుత్వం ఏమిటో అంత స్పష్టంగా లేదు. అయితే అర్జునుడు చేసిన స్తుతి ద్వారా దుర్గ, కాళి ఒకరేలాగ కనిపిస్తున్నది. కాని లింగ పురాణం మరొక భిన్నమైన దృక్పథాన్ని సూచిస్తున్నట్టున్నది. దాని ప్రకారం కాళి వేరు, దుర్గ వేరు.

చరిత్ర రాయటమే కాకుండా చరిత్రను విశ్లేషించదలచుకున్న విద్యార్థి ఎవరికైనా వైదిక దేవతలకు, పౌరాణిక దేవతలకు మధ్య తులనాత్మక అధ్యయనం అనివార్యమౌతుంది. ఈ దేవతల మధ్య ఒకచోట తీవ్రమైన వైరుధ్యం కనబడుతుంది. వైదిక దేవతలను పూజించటమనేది కేవలం మర్యాద కోసమే.వారు దేవుళ్ళ భార్యలు కాబట్టి వాళ్ళను పూజిస్తూ ఉండేవారు. కాని పురాణ దేవతలను పూజించే విషయం దీనికి భిన్నమైన ప్రాతిపదిక మీద ఆధారపడి ఉన్నది. వారు దేవుళ్ళ భార్యలు అయినందువల్ల కాకుండా తమ ప్రత్యేకమైన ఉనికి మూలంగానే పూజలందుకునేవారు. ఈ తారతమ్యానికి మూల కారణం ఇది – వైదిక దేవతలు ఎప్పుడూ యుద్ధ రంగానికి వెళ్ళలేదు. వీరోచిత చర్యలు జరపనూ లేదు కాని, పురాణాల దేవతలు మాత్రం యుద్ధ రంగానికి వెళ్ళి వీరోచితంగా పోరాడి వచ్చారు. అందువల్ల వారికి చేసే పూజలు మర్యాదకోసం చేసేవి కాదు. వారి వీరోచిత ఘనకార్యాల మూలానే వారు ఆ పూజలను అందుకున్నారు.

దుర్గాదేవికి ఇద్దరు అసురులకు మధ్య భయంకరమైన యుద్ధం జరిగిందని చెపుతారు. అది దుర్గకు ఎంతో ఖ్యాతిని ఆర్జించి పెట్టింది. మార్కండేయ పురాణం ఆ కథ సవివరంగా ఇలా చెబుతున్నది.

త్రేతాయుగాంతంలో శుంభ, నిశుంభులనే మహారాక్షసులిద్దరు పదివేల సంవత్సరాల పాటు ఘోర తపస్సు చేశారు. వారి తపస్సును మెచ్చి శివుడు కైలాసం నుంచి దిగి వచ్చాడు. ఈ మహా తపస్సు మూలంగా తమకు అమరత్వం ప్రసాదించవలసిందిగా వారు కోరతారని శివుడు ముందే గ్రహించాడు. అందుకే అది తప్ప మరేదైనా వరం కోరుకోవలసిందిగా వారికి చెప్పాడు. తమ తపస్సు ఫలించలేదని ఆ ఇద్దరు రాక్షసులు మరో వెయ్యి సంవత్సరాలు మరింత ఘోర తపస్సు చేశారు. శివుడు తిరిగి ప్రత్యక్షమయ్యాడు. కాని వారు కోరినదానిని ఇవ్వ నిరాకరించాడు. అప్పుడు వారిద్దరూ మంటలపై (అగ్నికీలలపై) తలక్రిందులుగా వ్రేలాడుతూ మెడల నుంచి రక్తం కారే వరకు తపస్సు చేశారు. అలా ఎనిమిది వందల సంవత్సరాల వరకు వారి తపస్సు కొనసాగింది. దేవుళ్ళందరూ ఆ ఘోర తపస్సుకు కంపించిపోయారు. ఆ ఘోర తపస్సుతో తమ సింహాసనాలను ఆ రాక్షసులు ఎక్కడ ఆక్రమించుకుంటారో అని భయపడ్డారు. దేవేంద్రుడు ఒక సమావేశం ఏర్పరచి రానున్న ముప్పును వివరించాడు. దేవతలందరు తమ ఆదుర్దాకు నిజంగానే కారణమున్నదని తెలుసుకున్నారు. అయితే దానికి పరిష్కారమేమిటో ఆలోచించాలన్నారు.

మహేంద్రుడి సలహా మేరకు కందర్పుడు (కామదేవుడు) స్వర్గలోక అప్సరసలూ, అతిలోక సౌందర్యవతులూ అయిన రంభ తిలోత్తమలతో పాటు ఆ రాక్షసుల దగ్గరకు వెళ్ళి వారి మనస్సులను కామోద్రేకంతో నింపటానికి ప్రయత్నించాడు. కందర్పుడు వారిపై తన (పూల) బాణాలు ప్రయోగించాడు. ఆ బాణాలకు తట్టుకొని వారు తిరిగి లేచి చూసేసరికి ఎదురుగా సౌందర్యవతులు కనబడ్డారు. ఆ అందగత్తెల మాయలో పడి ఆ రాక్షసులు తమ తపస్సును విరమించుకొన్నారు. రంభ, తిలోత్తమలతో అయిదువేల సంవత్సరాల పాటు భోగాలు అనుభవిస్తూ గడిపాక తమ తప్పు (ఇంద్రియ సౌఖ్యం కోసం అమరత్వం పొందాలనే ఆశయాన్ని విడనాడిన విషయం) తెలుసుకున్నారు. తమపై విసరిన మోహజాలం అంతా ఇంద్రుడి పన్నాగమని అనుమానించారు. వెంటనే రంభా, తిలోత్తమలను స్వర్గానికి తరిమివేశారు. తిరిగి తమ తపస్సు ప్రారంభించారు. తమ శరీరంలోని మాంసాన్ని కండలు కండలుగా కోసి అగ్నిలో ఆహుతి చేస్తూ శివుడికి నైవేద్యంగా సమర్పిస్తూ తపస్సు చేశారు. వారు ఆ విధంగా ఆ ఘోర తపస్సును వెయ్యి సంవత్సరాల పాటు కొనసాగించారు. చివరకు అస్థిపంజరాలలాగా మిగిలిపోయారు. శివుడు తిరిగి ప్రత్యక్షమై దేవుళ్ళను మించిన శక్తి సంపన్నతను పొందుతారని వారిని దీవించాడు.

శుంభ, నిశుంభులు ఆ వర గర్వంతో విర్రవీగుతూ దేవుళ్ళపై దాడి ప్రారంభించారు.

యుద్ధాలలో ఇరు పక్షాలు గెలుపు ఓటములు పొందినా వీరు మాత్రం ప్రతిచోటా విజయాలే సాధించారు. ఇంద్రుడు, దేవతలు, గత్యంతరం లేక నికృష్టమైన స్థితికి దిగజారిపోయారు. తమను కాపాడవలసిందిగా బ్రహ్మనూ, విష్ణువునూ వేడుకున్నారు. వారిద్దరూ వారిని శివుడి దగ్గరకు వెళ్ళవలసిందిగా సూచించారు. వారు శివుణ్ణి శరణు వేడుకున్నారు. ఆయన తాను ఏమీ చేయలేనని చెప్పాడు. శివుని దీవెన మూలంగానేత మకు ఆ దుర్గతి పట్టిందని వారు గుర్తు చేశారు. దుర్గాదేవిని పూజించవలసిందిగా శివుడు వారికి సూచించాడు. వారు ఆ విధంగానే చేశారు. కొంతకాలానికి దుర్గాదేవి ప్రత్యక్షమై వారిని దీవించింది. ఆమె ఒక సాధారణ స్త్రీగా మారువేషంలో దేవసభ మధ్య నీటిపాత్రతో సంచరించింది. ఆ తర్వాత ఆమె తన నిజరూపాన్ని ధరించి 'నా వైభవాన్ని వారు స్తుతిస్తున్నారు' అన్నది.

ఈ కొత్త దేవత శుంభ, నిశుంభుల దూతలైన చండ, ముండులు నివసిస్తున్న హిమాయల పర్వతాలను అధిరోహించింది. ఆ పర్వతాల్లో సంచరిస్తున్న రాక్షసులు ఆ దేవతను చూసి ముగ్ధులై, ఆమె సౌందర్యాన్ని అభివర్ణించి స్వర్గాన్ని జయించి కొల్లగొట్టిన ఐశ్వర్యాన్నంతా ఆమెకు ధారాదత్తం చేసి అయినా సరే ఆ కొత్త దేవత అనుగ్రహాన్ని పొందాలని తమ ప్రభువులైన శుంభ, నిశుంభులకు సలహా ఇచ్చారు.

శుంభుడు ఆ దేవత దగ్గరికి సుగ్రీవుని వార్తాహరునిగా పంపించాడు. తన ప్రాసాదంలో మూడు లోకాల సంపద ఉన్నదనీ దేవతలకు సమర్పిస్తున్న కానుకలన్నీ ఇపుడు తనకే చెందుతాయనీ, ఆ దేవి తన దగ్గరికి వచ్చే పక్షంలో ఆ కానుకలన్నీ-ఐశ్వర్యం అంతా ఆమెకే అర్పించగలననీ సుగ్రీవుని ద్వారా తెలియపరచాడు. ఆ దేవి ఆ రాక్షసుడి ఉదారత్వాన్ని మెచ్చుకుంటూ సుగ్రీవునితో 'నన్ను పెళ్ళాడే వ్యక్తి నాతో పోరాడి నన్ను మొదట యుద్ధంలో జయించి, నా గర్వాన్ని అణచగలిగినవాడై ఉండాలని నిశ్చయించుకున్నాను' అని చెప్పింది. సుగ్రీవుడు నిరాశతో తిరిగి వెళ్ళడం ఇష్టంలేక ఆమెను సమ్మతింపజేయాలని ప్రయత్నించాడు. కావాలంటే తానే ఆమెను యుద్ధంలో ఓడించి ఆమె అహంకారాన్ని అణచగలనని చెప్పి సుగ్రీవుడు సాధికారంగా 'తన ప్రభువు సమక్షంలో ఈ త్రిలోకవాసులు, దేవతలుగాని, దైత్యులుగాని, మనుషులుగాని ఎవరు కూడా నిలవటానికి సాహసించరనీ అలాంటి మహాశక్తివంతుని ముందు ఒక స్త్రీగా **ఆమె** ఆయన కోరికను నిరాకరించటం దుస్సాహసమనీ చెప్పాడు. తన ప్రభువు ఆజ్ఞాపించి **ఉంటే** వెంటనే తానే ఆమెను ఆయన దగ్గరికి చేర్చి ఉండేవాడను అని కూడా అన్నాడు. దానికి ఆమె 'అదంతా నిజమే కావచ్చు'నని అన్నది. అయితే, తాను ఒక ప్రతిజ్ఞ చేసి ఉన్నాననీ, దానికే కట్టుబడి ఉంటాననీ, అందువల్ల తన దగ్గరకు వచ్చి తన శక్తిని తేల్చుకోవలసిందిగా అతని ప్రభువుకు నచ్చజెప్పి ఒప్పించి యుద్ధానికి తీసుకు రమ్మనీ సుగ్రీవుడికి చెప్పింది.

సుగ్రీవుడు వెళ్ళి ఆమె చెప్పిందంతా శంభునికి వివరించాడు. ఆ మాటలు విని శంభుడు

ఆగ్రహావేశంతో మండిపడ్డాడు. సమాధానం ఏమీ చెప్పకుండా తన సైన్యాధిపతి అయిన ధూమ్రలోచనుడిని పిలిచి వెంటనే హిమాలయాలకు వెళ్ళి, ఆ దేవిని బంధించి తీసుక రావలసిందనీ, ఎవరైనా ఆమెను రక్షించడానికి వస్తే, వారిని హతమార్చవలసిందనీ ఆదేశించాడు.

సైన్యాధిపతి హిమాలయాలకు వెళ్ళి ఆ దేవికి ప్రభువు ఆజ్ఞను నివేదించాడు. ఆమె పకపక నవ్వి సుగ్రీవునితో చెప్పినట్టే చెప్పింది. ఆ వీరుడు ఆమెతో పోరాడాడు. చివరకు ఆమె హుంకారంతో అక్కడే భస్మమై పోయాడు. ఆ తర్వాత ఆమె అతనితో పాటు వచ్చిన సైన్యాన్ని తుదముట్టించింది. ఓటమి వార్త వివరించే నిమిత్తం కొద్దిమంది సైనికులను మాత్రం సజీవంగా వదిలేసింది. శుంభ, నిశుంభులు ఈ వార్త విని కోపోద్రిక్తులై తమ సహచరులైన చండ, ముండులను దేవిపైకి పంపించారు. వారిద్దరూ తమ సైన్యంతో హిమాలయాలను అధిరోహించగానే, ఎదురుగా గార్దభంపై కూచుని నవ్వుతూ ఉన్న స్త్రీమూర్తి కనపడింది. ఆమె వారిని చూడగానే క్రోధంతో పది, ఇరవై, ముప్పై మంది చొప్పున సైనికులను లాక్కొని ఫలాల వలె మింగివేసింది. ఆ తర్వాత ముండుని వెంట్రుకలు పట్టుకొని పైకిలేపి, తలనరికి, నోటి దగ్గర పెట్టుకొని నెత్తురు తాగేసింది. చండుడు తన సహచరుడి దుర్గతిని చూసి రౌద్రంతో ఆమెను సమీపించాడు. ఆమె సింహంపై ఆసీనురాలై అతని మీదికి దూకింది. ముండుని హతమార్చినట్టే అతన్ని కూడా చంపి నెత్తురు తాగింది. మిగిలిన సైన్యాన్ని ఛిన్నాభిన్నం చేసి రక్తపానం చేసింది.

తమ అనుచరుల ఈ ఆందోళనకరమైన వార్త వినీ వినగానే ఆ మహారాక్షసులు (శుంభ–నిశుంభులు) అసంఖ్యాకమైన సైనికదళాలను, యోధానుయోధులను వెంటబెట్టుకొని స్వయంగా యుద్ధానికి బయలుదేరారు. దేవగణమంతా ఆకాశం నుంచి ఆశ్చర్యంగా ఆ సువిశాల సైన్యాన్ని చూస్తూ ఉన్నారు. స్త్రీ దేవతలు మహామాయ (దుర్గ)కు తోడ్పడటానికి కిందికి దిగి వచ్చారు. మహామాయ ఆ రాక్షససైన్యాన్ని మట్టుపెట్టింది. తన సైన్యం యొక్క దుస్థితి చూసి శుంభ–నిశుంభుల ప్రధాన సైన్యాధిపతి రక్తబీజుడు ముందుకు దూకి ఆమెతో తలపడ్డాడు. ఆమె అతనిని తీవ్రంగా గాయపరచింది. కాని ఆ రక్తబీజుడి శరీర గాయాల లోంచి కారుతున్న ఒక్కొక్క మొదలుపెట్టారు. ఆ విధంగా అసంఖ్యాకులైన సైనికులు ఆమెను చుట్టుముట్టారు. భయంకరమైన ఆ దృశ్యం చూసి దేవగణం ఆందోళన చెందింది. అప్పుడు కాళి (దుర్గ)కి ఆ యుద్ధంలో సహాయపడుతున్న చండి వచ్చి రక్తబీజుడి రక్తం బొట్లు కింద పడకుండా కాళి గనక తాగి వేయగలిగితే, తాను (చండి), అతని రక్తపు బొట్టుల్లోంచి పుట్టుకొస్తున్న అపూర్వ రాక్షస సంతానాన్ని నాశనం చేయగలనని చెప్పింది. దానికి కాళి అంగీకరించింది. ఆ విధంగా ఆ మహా రాక్షసుడు, అతని సైన్యం నశించారు.

శుంభ, నిశుంభులు కలత చెందారు. నిస్పృహ చెందిన స్థితిలో దుర్గాదేవితో ద్వంద్వ యుద్ధానికి సిద్ధమైనారు. మొదట శుంభుడు ఆమెతో తలపడ్డాడు. ఇరువురికి భయంకరమైన పోరాటం జరిగింది. చివరికి ఎలాగైతేనేం ఆ ఇద్దరు రాక్షసులను ఆమె హతమార్చి వేసింది.

అప్పుడు కాళికా దేవి ఆ సమరాంగణంలో హతులైనవారి శరీరాలను ప్రీతితో భుజిస్తూ కూర్చున్నది. దేవతలందరూ (స్త్రీ దేవతలు, పురుష దేవుళ్లు) ఆ స్వర్లోక నాయకురాలిని (దుర్గను) స్తుతించారు. ఆమె ఒక్కొక్కరినీ దీవించింది.

దుర్గాదేవి వివిధ రూపాలు ధరించి చేసిన వీరోచిత కార్యకలాపాల గురించి మార్కండేయ పురాణం కూడా చెప్తున్నది. అది క్లుప్తంగా ఇలా ఉంది.

"దుర్గాదేవిగా రాక్షసుల సందేశాన్ని విన్నది. దశభుజగా (పది చేతులుగలది) వారి సైన్యాన్ని సంహరించింది. సింహవాహినిగా (సింహంపై కూర్చొని) రక్తబీజుడితో పోరాడింది. మహిషాసురమర్దనిగా ఆమె (దున్నపోతు ఆకారంలో ఉన్న) దైత్యుని సంహరించింది. జగద్ధాత్రిగా (విశ్వమాతగా) రాక్షస సైన్యాన్ని ఓడించింది. కాళిగా (నల్లని వర్ణంగల స్త్రీగా) రక్తబీజుణ్ణి సంహరించింది. ముక్తకేశిగా (పెద్దగా వేళ్ళాడుతున్న వెంట్రుకలతో) ఆమె రాక్షసుల ఇతర సైన్యాన్ని కూడా తుదముట్టించింది. తార (రక్షకురాలిగా) గా శుంభుడిని అతని ఆకారంలోనే సంహరించింది. ఛిన్నమస్తకగా (తలలేనిదిగా) నిశుంభున్ని సంహరించింది. జగత్‌గౌరి (జగత్తులో పేరుపడ్డ గౌరవర్ణం గల దేవతగా) ఆమె ఆమె దేవుళ్ళ స్తోత్రాలను, ధన్యవాదాలను, మెప్పులను అందుకున్నది.

వైదిక పౌరాణిక దేవతలను పోల్చి చూసినపుడు కొన్ని ఆసక్తికరమైన ప్రశ్నలు తలెత్తుతాయి. ఒక ప్రశ్నయితే తప్పక వస్తుంది. వైదిక సాహిత్యంలో అసురులకు వ్యతిరేకంగా జరిగిన యుద్ధాల గురించి కొలెడంత ప్రస్తావన ఉంది. బ్రాహ్మణాల నిండా అలాంటి ఉదంతాలున్నాయి. అయితే అసురులకు వ్యతిరేకంగా యుద్ధాలు చేసినవారంతా వైదిక దేవుళ్ళే. (వైదిక) స్త్రీ దేవతలు మాత్రం ఎప్పుడూ ఆ యుద్ధాలలో పాల్గొనలేదు. పౌరాణిక దేవతల విషయానికి వచ్చేసరికి మాత్రం పరిస్థితి మొత్తం మారిపోయింది. పురాణకాలంలో, వైదిక కాలంలో లాగానే అసురులకు వ్యతిరేకంగా యుద్ధాలు జరిగాయి. తేడా ఏమిటంటే వైదిక కాలంలో అసురులతో దేవుళ్ళు యుద్ధం చేయవలసి వస్తే పురాణకాలంలో స్త్రీ దేవతలు యుద్ధాలు చేశారు. వైదిక కాలంలో దేవుళ్ళు చేసిన పని పురాణకాలంలో స్త్రీ దేవతలు ఎందుకు చెయ్యవలసి వచ్చింది? పురాణ కాలంలో దేవుళ్ళు లేరని కాదు. పురాణ కాలంలో కూడా బ్రహ్మ, విష్ణువు, శివుడు ఉండి పరిపాలించారు. అసురులతో యుద్ధం చేయడానికి వారు ఉన్నపుడు ఆడదేవతలు యుద్ధంలోకి ఎందుకు దిగారు? ఈ చిక్కుముడిని విప్పవలసిన అవసరం ఉన్నది.

వైదిక దేవతలకు లేకుండా పోయి పౌరాణిక దేవతలకు మాత్రం ఉన్న శక్తికి మూలం ఏమిటి అన్నది రెండో ప్రశ్న. ఈ శక్తి దేవుళ్ల శక్తి అనీ అది దేవతలలో ఉండేదని పౌరాణిక రచయితలు సమాధానమిస్తారు. సాధారణ సూత్రం ఏమంటే, ప్రతి దేవుడిలోనూ బలం, శక్తీ ఉండేది. దానిని సాంకేతికంగా శక్తి అనేవారు. ప్రతి దేవుడి శక్తీ భార్యగా ఉన్న దేవతలో

అంతర్నిహితమై ఉండేది. చివరికి ఈ సూత్రాన్ని అనుసరించి ప్రతీ దేవతా 'శక్తి'గా మారిపోయింది. ఆమెను ఆరాధించిన వారిని శాక్తేయులు అన్నారు.

ఈ సూత్రానికి సంబంధించిన ఒకటి లేదా రెండు ప్రశ్నలకు సమాధానం అవసరం.

మొదటిది ఇది : పురాణాలలో ఆడదేవతల పేర్లు ఎన్నో ఉన్నప్పటికీ వాస్తవంగా మన ముందు అయిదుగురు పౌరాణిక ఆడదేవతల పేర్లు మాత్రమే నిలుస్తాయి. అవి సరస్వతి, లక్ష్మి, పార్వతి, దుర్గ, కాళి. సరస్వతి, లక్ష్మి వరుసగా బ్రహ్మ, విష్ణువులకు భార్యలు.బ్రహ్మ విష్ణువులను శివునితో పాటు పురాణ దేవతలుగా గుర్తిస్తారు. పార్వతి, దుర్గ, కాళి శివుని భార్యలు. సరస్వతి, లక్ష్మి అసురులనెవ్వరిని సంహరించలేదు. వీరోచితమైన పనులేవీ చేయలేదు. ఎందువల్ల? బ్రహ్మ, విష్ణువులలో ఉన్న శక్తి పై సూత్రాన్ని అనుసరించి వారి భార్యలలో కూడా నిబిడీకృతమై ఉండాలి గదా! సరస్వతి, లక్ష్మి కూడా అసురులతో ఎందుకు యుద్ధం చేయలేదు? ఈ పని శివుడి భార్యలకు మాత్రమే ఎందుకు వదిలిపెట్టారు. ఇక్కడ కూడా దుర్గ కంటే పార్వతి పాత్ర భిన్నమైనది. పార్వతిని ఒక సాధారణమైన స్త్రీగానే వర్ణించారు. దుర్గ చేసిన వీరోచిత కార్యాలేవీ పార్వతి చెయ్యలేదు. పార్వతి కూడా శివుడి శక్తియే కదా. మరి పార్వతిలో ఉన్న ఆ శివుని శక్తి నిద్రాణమైపోయి అచేతనంగా ఎందుకు ఉండిపోయింది?

రెండో అంశం. దేవుళ్లతో సంబంధం లేకుండానే ప్రజలే దేవతలను పూజించటం మొదలుపెట్టారు అనటం. సిద్ధాంతాన్ని సమర్థించటానికి ఇది బాగానే ఉంటుంది కాని ఆ సూత్రానికి ఉన్న తార్కికమైన లేదా చారిత్రకమైన ఆధారాన్ని ఆమోదించటం కష్టం. కేవలం తార్కికమైన దృష్టితో ఆలోచిస్తే ప్రతి దేవుడిలోనూ శక్తి ఉన్నప్పుడు వైదిక దేవుళ్ళలో కూడా శక్తి ఉండాలి. అలాంటప్పుడు వైదిక దేవుళ్ల భార్యలకు కూడా ఈ సూత్రాన్ని ఎందుకు వర్తింపజేయలేదు? చారిత్రక దృష్టితో పరిశీలిస్తే పురాణ దేవతలలో శక్తి ఉండేదని చెప్పటానికి ఆధారం ఏమీ లేదు.

దుర్గాదేవి ఒక్కదానినే అసురులను సంహరించగల మహాశక్తి మంతురాలిగా (బ్రాహ్మణులు) రూపొందించినపుడు, తమ దేవుళ్లనందరినీ దౌర్భాగ్యమైన పిరికిపందలుగా చేసుకున్నారనే సంగతి బ్రాహ్మణులు గుర్తించినట్టు లేదు. చివరికి ఇది ఎలా మారిందంటే ఆ దేవుళ్లు అసురుల నుండి తమను రక్షించుకోలేక తమ భార్యలను వచ్చి కాపాడమని వేడుకున్నట్టు అయింది. అసురులకు వ్యతిరేకంగా జరిగిన యుద్ధాలలో బ్రాహ్మణులు తమ పురాణ దేవతలను ఎంత దుర్బలులుగా చిత్రించారో మార్కండేయ పురాణంలో ఒక్క ఉదాహరణ చాలు.

"రాక్షసుల రాజు మహిషుడు యుద్ధంలో దేవుళ్లను ఓడించి వాళ్లకు ఏమీ లేకుండా భూలోకంలో బిచ్చమెత్తుకొనేట్టు చేశాడు. ఇంద్రుడు, ఆ దేవుళ్లను మొదట బ్రహ్మ దగ్గరికి, తర్వాత శివుడి దగ్గరకి తీసుకువెళ్ళాడు. ఆ దేవుళ్లు ఇద్దరూ ఏ సహాయమూ చేయలేకపోతే

అపుడు ఆ దేవతలంతా విష్ణువు దగ్గరకి వెళ్ళారు. ఆ దేవుళ్ళ దౌర్భాగ్యస్థితిని చూసి విష్ణువు బాధపడ్డాడు. అపుడు ఆయన ముఖంలోంచి ఒక కాంతిపుంజం వెలువడింది. అందులోంచి "మహామాయ" (దుర్గాదేవికి మరోపేరు) అనే ఒక స్త్రీ రూపం వెలువడింది. ఇతర దేవుళ్ళ ముఖాల నుంచి కూడా కాంతిపుంజాలు వెలువడి మహామాయలో చేరుకున్నాయి. అపుడు ఆమె అగ్నిపర్వతంలా ఒక తేజస్విని రూపం దాల్చింది. దేవుళ్ళందరూ ఆ భయంకరమైన శక్తికి తమ ఆయుధాలను సమర్పించారు. అపుడు ఆమె వికటాట్టహాసం చేసి ఆకాశంలో అధిరోహించి మహారాక్షసుని సంహరించి దేవుళ్ళకు ఊరట కలిగించింది.

ఇటువంటి పిరికిపందలైన దేవుళ్ళకు అసలు శక్తి ఏదైనా ఉంటుందా? వాళ్ళకే ఏమీ శక్తి లేనప్పుడు వాళ్ళ భార్యలకు ఏమి ఇవ్వగలరు? దేవతలలో శక్తి ఉన్నది కాబట్టి వారిని పూజించాలనటం ఒక చిక్కుముడి మాత్రమే కాదు, అర్థంలేని విషయం కూడా! ఈ శక్తి సిద్ధాంతాన్ని ఎందుకు కనిపెట్టారో వివరణ ఇవ్వవలసి ఉన్నది. మార్కెట్లో కొత్త సరుకులు ప్రవేశపెట్టినట్టు బ్రాహ్మణులు దేవతలను పీఠం ఎక్కించి (ఆరాధించటం ప్రారంభించి) దేవుళ్ళ పరువు తీశారా?

అనువాదం : కె. రాహుల్

చిక్కుముడి : 13

# అహింస చిక్కుముడి

ప్రాచీన ఆర్యుల అలవాట్లతో ఆ తర్వాతి హిందువుల అలవాట్లనూ సాంఘిక ఆచారాలనూ పోల్చి చూసిన వారెవరికైనా సాంఘిక విప్లవమంతటి స్థాయిలో బ్రహ్మాండమైన మార్పు గోచరిస్తుంది.

ఆర్యులు జూదరుల జాతికి చెందినవారు. ఆర్య నాగరికత తొలిరోజులలో జూదాన్ని ఒక శాస్త్రంగా రూపొందించారు. ఈ ఆటకు సంబంధించిన సాంకేతిక పదాలను కూడా వీరు ప్రజలలో ప్రవేశపెట్టారు. కృత, త్రేత, ద్వాపర, కలి అనే పదాలను హిందువులు నాలుగు యుగాల పేర్లుగాను లేదా చారిత్రక కాలాల భాగాల పేర్లుగాను వాడుతున్నారు. వాస్తవానికి అవి ఆర్యులు జూదంలో మొదట ఉపయోగించిన పాచికల పేర్లు. అత్యంత అదృష్టదాయిని అయిన పాచికను కృత అనీ, దురదృష్టకరమైన పాచికను కలి అనీ అన్నారు. త్రేత, ద్వాపర అనేవి ఈ రెండింటికి మధ్యస్థంగా ఉండే పాచికలు. పురాతన ఆర్యులలో జూద క్రీడ అమితంగా అభివృద్ధి చెందడమే కాకుండా పందాలు కూడా హెచ్చుస్థాయిలో ఉండేవి. పెద్ద మొత్తంలో డబ్బు పందెంగా పెట్టి జూదం ఆడటం చాలాచోట్ల ఉండేది కాని, ఆర్యులు ఒడ్డే మొత్తాలతో

---

విషయ వివరణ పట్టిక ప్రకారం "How the Brahmins who were once Cow-killers become the worshippers of the cow" ("ఒకప్పుడు గోవధ చేసిన బ్రాహ్మణులు గోవును ఆరాధించేవారు ఎలాగెవారు") అనేది చిక్కుముడి 13. లభించిన కాగితాలలో ఆ అధ్యాయం కనబడలేదు. అయితే 'అహింస–చిక్కుముడి' పేరుతో కొన్ని కాగితాలు లభించాయి. విషయం అదే కాబట్టి దానిని ఇక్కడ పొందుపరచాం. ఇందులో పది పుటలు మాత్రం ఉన్నాయి. మిగతావి లభించలేదు. కాబట్టి అసమగ్రంగా ఉన్నదనేది స్పష్టం. – సంకలనకర్త

పోలిస్తే ఆ పందాలు లెక్కలోకే రావు. ఆర్యులు, రాజ్యాలను, ఆఖరికి భార్యలను కూడా జూదంలో పందెంగా పెట్టడానికి వెనుకాడేవారు కాదు. నల మహారాజు తన రాజ్యాన్ని పణంగా పెట్టి, ఆ రాజ్యాన్ని పోగొట్టుకున్నాడు. పాండవులు దీనికంటె మరింత ముందుకు వెళ్లారు. వారు తమ రాజ్యాన్నే కాకుండా భార్య అయిన ద్రౌపదిని కూడ పందెంలో పెట్టి ఆ రెండింటినీ పోగొట్టుకున్నారు. ఆర్యులలో జూదమనేది ధనవంతులు ఆడే ఆట మాత్రమే కాదు. ఇది చాలామందిలో ఉన్న వ్యసనం. ఇది ఎంత విపరీతంగా పెరిగిపోయిందంటే ధర్మశాస్త్ర కర్తలందరూ దీనిని ఖండించారు. రాజ్యాధికారాల ద్వారా కఠినమైన శాసనాలు చేసి ఈ జూదం అలవాటును అరికట్టవలసిన అవసరం ఉన్నదని మహారాజులకు చెప్పి ఒప్పించటానికి ప్రయత్నించారు.

మొదట్లో ఆర్యులలో స్త్రీ, పురుష సంబంధాలు అంత కట్టుదిట్టంగా ఉండేవి కావు. ఒక స్త్రీకి ఒక పురుషునికి మధ్య శాశ్వత బంధాలు ఉండేవి కావు. వివాహ బంధం అనేది తెలియని కాలం ఒకటి ఉండేది. ఇతరులెవరి ద్వారానైనా సంతానాన్ని పొందవలసిందిగా పాండురాజు తన భార్య కుంతిని కోరినపుడు ఆమె (తన భర్తకు) ఇచ్చిన సమాధానంలో ఈ ప్రస్తావన ఉన్నట్టు మహాభారతంలో ఉంది. సమీప బంధువులతో లైంగిక సంబంధాల విషయంలో ఆర్యులకు ఎలాంటి నిషేధాలు నియమాలు లేని రోజులుండేవి. సోదరుడు తన సొంత సోదరితో, కుమారుడు తల్లితో, తండ్రి కుమార్తెతో, తాత మనవరాలితో సంసారం చేసిన సందర్భాలు ఉన్నాయి. స్త్రీలు అందరికీ చెందినవారుగా ఉన్న కాలం ఒకటి ఉండేది. స్త్రీల విషయంలో సామ్యవాదం అమలులో ఉండేది. ఒక స్త్రీని ఎంతోమంది పురుషులు పంచుకోవటం, స్త్రీ ఏ ఒక్కరికీ స్వంత ఆస్తిగా కాకుండా అందరికీ సమానంగా చెంది ఉండటం, ఆర్యులలో కనిపిస్తుంది. ఒక స్త్రీ పై ప్రత్యేక హక్కులు కలిగి ఉండకపోవటం ద్వారా ఒక మాదిరి సామ్యవాదం అమలులో ఉండేది. ఈ రకమైన (సామ్యవాదంలో) స్త్రీని 'గణిక' అని పిలిచేవారు. ఆమె చాలామందికి చెంది ఉండేది. ఇది కాక ఆర్యులలో స్త్రీలకు సంబంధించి ఇంకో క్రమబద్ధమైన సామ్యవాద రూపం ఉండేది. ఈ పద్ధతిలో ఒక స్త్రీని ఒక నిర్దిష్టమైన గుంపులోని కొంతమంది పంచుకొంటూ ఉండేవారు. ఆమె ఏ వారం (రోజు) ఎవరిదగ్గరకు వెళ్లాలో నిర్ణయమై ఉండేది కాబట్టి ఆమెను వారాంగన అని పిలిచేవారు. వ్యభిచారం విపరీతంగా వ్యాప్తి చెంది హేయమైన స్థితికి చేరుకున్నది.

బహిరంగంగా లైంగిక సంపర్కానికి వ్యభిచారిణులు ఎక్కడా ఒప్పుకోరు. కాని, ప్రాచీన ఆర్యులలో ఆ పద్ధతి ఉండేది. జంతువులతో సంభోగం కూడ ప్రాచీన ఆర్యులలో ప్రబలంగా ఉండేది. ఇందుకు పాల్పడిన వారిలో అత్యంత పూజనీయులైన కొందరు ఋషి సత్తములు కూడా ఉన్నారు.

ప్రాచీన ఆర్యజాతికి మద్యపాన వ్యసనం కూడా ఉండేది. వీరి మతంలో మద్యం

ముఖ్యమైన పాత్రను వహిస్తుంది. వైదిక దేవుళ్లు మద్యాన్ని సేవించేవారు. దేవుళ్లు తాగే మద్యాన్ని సోమ (సోమరసం) అని పిలిచేవారు. ఆర్యుల దేవుళ్లు మద్యాన్ని సేవించేవారు కాబట్టి మద్యపానం విషయంలో ఆర్యులకు ఎలాంటి శంకలూ ఉండేవి కావు. నిజానికి మద్యం ఆర్యుల మత సంబంధమైన విధులలో ఒక భాగమైంది. ప్రాచీన ఆర్యులు ఎప్పుడూ సోమయజ్ఞాలు చేస్తూనే ఉండేవారు. వారు సోమపానం చేయనిరోజులు చాలా తక్కువ. పై వర్గాలైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు మాత్రమే సోమం పరిమితం అయింది. అంటే శూద్రులు మద్యం తాగేవారు కాదు అని భావించకూడదు, సోమపానం వీరికి నిషిద్ధం కాబట్టి వీరు మామూలుగా బజారులో దొరికే సురను తాగేవారు.

మద్యపానం ఆర్యులలో పురుషులకే పరిమితం కాదు. స్త్రీలు కూడ మద్యాన్ని సేవించేవారు. వివాహ శుభకార్యాలలో పెండ్లికి ముందురోజు రాత్రి సుమంగళులైన స్త్రీలకు నలుగురికి కాని ఎనిమిది మందికిగాని మంచి విందుభోజనం పెట్టి మద్యం తాగించి వారిచేత నాలుగుసార్లు నృత్యం చేయించాలని కౌషీతకి గృహ్యసూత్రం (1.11-12) సూచిస్తున్నది. మత్తును కలిగించే మద్యాన్ని సేవించే అలవాటు కేవలం బ్రాహ్మణేతర స్త్రీలకే పరిమితం కాలేదు. బ్రాహ్మణ స్త్రీలు కూడ దీనికి అలవాటు పడ్డారు. అది పాపం అని వారు అనుకోలేదు. అందులో వారికి చెడు ఏమీ కనబడలేదు. మద్యపానం వ్యసనం అని వారు అనుకోలేదు. చాలా గౌరవప్రదమైన అలవాటుగా దానిని పరిగణించారు. ఋగ్వేదం ఈ విధంగా చెబుతున్నది - "మదిరను సేవించటానికి ముందుగానే సూర్యుణ్ణి పూజించాలి". యజుర్వేదంలో ఈ విధంగా ఉంది :

"ఓ సోమదేవా! సురతో (సురాపానంలో) ఉత్సాహాన్ని తెచ్చుకొని శక్తిమంతుడవై దేవతలను సంతోషపరచు. యజ్ఞకర్తకు రుచ్యమైన ఆహారాన్నీ, బ్రాహ్మణ, క్షత్రియులకు శక్తినీ ప్రసాదించు."

మంత్ర బ్రాహ్మణం ఈ విధంగా చెబుతున్నది. "పురుషుల ఆనందంకోసం ఏది నీటిని మద్యంగా మారుస్తుందో, దేనివలన స్త్రీలు పురుషులకు ఆనందదాయినులు అవుతున్నారో...." మొదలైనవి.

రాముడు, సీత, మద్యం సేవించినట్టు రామాయణంలో ఉంది. ఉత్తరకాండ ఈ విధంగా చెబుతున్నది :

"ఇంద్రుడు తన భార్య శచీదేవి విషయంలో శ్రద్ధ చూపినట్లుగానే రామచంద్రుడు, సీత విషయంలో శ్రద్ధ చూపేవాడు. ఆమె 'మద్యం' అని పిలువబడే శుభ్రపరచిన తేనె తాగేట్టు చూసేవాడు. రామచంద్రుని కోసం సేవకులు మాంసమూ తియ్యని ఫలాలూ తీసుకు వచ్చేవారు."

కృష్ణుడు, అర్జునుడు కూడ ఇలాగే చేశారు. మహాభారతంలోని ఉద్యోగపర్వంలో ఈ విధంగా ఉంది.

"అర్జునుడు శ్రీకృష్ణుడు సువాసనా భరితమైన తీయనితేనెతో చేసిన మద్యం సేవిస్తూ, పూలహారాలు వేసుకొని ధగధగ మెరిసే వస్త్రాలు, ఆభరణాలు ధరించి, వజ్రవైడూర్యాలు పొదిగిన బంగారు సింహాసనం మీద కూర్చున్నారు. శ్రీకృష్ణుని పాదాలు అర్జునుని ఒడిలోనూ అర్జునుని పాదాలు ద్రౌపది, సత్యభామల ఒడిలోనూ ఉండటాన్ని నేను చూశాను."

మరో పెద్ద మార్పు అనేది ముఖ్యంగా ఆహారం విషయంలో జరిగింది. నేటి హిందువులు ఆహారం విషయంలో కచ్చితంగా ఉంటున్నారు. సహపంక్తి భోజనం విషయంలో రెండురకాల పరిమితులున్నాయి.

హిందువు కాని వ్యక్తి వండిన ఆహారాన్ని హిందువు తినడు. ఆహారాన్ని వండిన వ్యక్తి హిందువే అయినా అతడు బ్రాహ్మణుడో, లేదా తన కులానికి చెందినవాడో కాని పక్షంలో హిందువు ఆ ఆహారాన్ని భుజించడు. ఎవరు వండిన ఆహారాన్ని భుజించాలనేదే కాకుండా ఎలాంటి ఆహారాన్ని తీసుకోవాలనే విషయంలో కూడ అతడు కచ్చితంగా ఉంటాడు. ఆహారం విషయం తీసుకుంటే హిందువులను రెండు ప్రధానమైన వర్గాలుగా విభజించవచ్చు. (1) శాకాహారులు, (2) శాకాహారులు కానివారు.

శాకాహారులు మళ్లీ రెండు ఉపవిభాగాల కిందికి వస్తారు. అన్ని రకాల మాంసం చేపలు తినేవారు, కేవలం చేపలు మాత్రమే తినేవారు. మాంసం తినే వారిని ఈ క్రింది ఉపవిభాగాలుగా విభజించవచ్చు.

ఎ) ఆవు మాంసం తప్ప మిగిలిన ఏ జంతువు మాంసమైనా తినేవారు.

బి) ఆవు మాంసంతో సహా ఏ జంతువు మాంసాన్ని అయినా తినేవారు.

సి) ఆవు మాంసమూ కోడి మాంసమూ తప్ప ఏ మాంసమైనా తినేవారు.

భుజించే ఆహారం దృష్ట్యా హిందూ జనాభాను వర్గీకరించినపుడు బ్రాహ్మణులను రెండు తరగతులుగా చెప్పవచ్చును. (1) పంచగౌడ (2) పంచ ద్రావిడ.

వీరిలో పంచద్రావిడులు పూర్తిగా శాకాహారులు. పంచగౌడులలో గౌడ సారస్వత శాఖ తప్పించి మిగతా శాఖల వారంతా కూడ పూర్తిగా శాకాహారులే. హిందూ సమాజంలో అవతలి చివర ఉండే అంటరానివారు మాంసాహారులు. వీరు మేకలు, పక్షుల మాంసాన్నే కాకుండా చనిపోయిన లేదా వధించిన ఆవు మాంసాన్ని కూడ భుజిస్తారు. బ్రాహ్మణులకూ అంటరానివారికీ మధ్యనున్న(వర్గాలకు) బ్రాహ్మణేతరులకు రకరకాల అలవాట్లున్నాయి. కొందరు బ్రాహ్మణుల వలె శాకాహారులు; తక్కినవారు బ్రాహ్మణుల లాగా కాకుండా మాంసాహారులు. గోమాంస

భక్షణాన్ని వ్యతిరేకించడం అనే ఒక్కదానిలో మాత్రం వీరంతా ఒక్కటే.

ఈ ప్రశ్నకు సంబంధించి ప్రస్తావించవలసిన అంశం మరొకటి ఉంది. ఆహారార్థం ఒక జంతువును చంపడం అనేది ఈ ప్రశ్న. ఈ విషయంలో హిందువుల అభిప్రాయం కొంచెం అటూ ఇటూగా ఒకే విధంగా ఉంది. ఆహారం కోసమైనాగాని హిందువు జంతువును చంపడు. చంపి ఇచ్చేవారు వేరే ఉంటారు. 'కటికవారు' అనే ఒక చిన్న కులాన్ని తప్పించి. హిందువులలో ఆహారం కోసం జంతువులను వధించేవారు లేరు. అంటరానివారు కూడ జంతువులను చంపరు. చనిపోయిన ఆవు మాంసాన్ని తింటారు కాని, వారు ఆవును చంపరు. ఇండియాలో ఈనాడు ఆహారం కోసం జంతువులను వధించేవారు ముసల్మానులే. ఏ హిందువు అయినా ఆహారార్థం జంతువును చంపదలుచుకొన్నపుడు ముసల్మానులను ఆశ్రయిస్తాడు. ప్రతి హిందువుకు అహింసలో నమ్మకం ఉంది.

ఇండియాలో శాకాహారమనేది అసలు ఎప్పుడు వచ్చింది? అహింస అనేది ఒక ఆమోదయోగ్యమైన నమ్మకంగా ఎప్పుడు పరిణమించింది? ఈ ప్రశ్నకు సంబంధించిన ఔచిత్యాన్ని అర్థం చేసుకోలేని హిందువులున్నారు. శాకాహారం, అహింస, అనేవి ఇండియాకు కొత్త విషయాలు కాదని వారు విశ్వసిస్తారు.

నేటి హిందువుల పూర్వీకులైన ప్రాచీన ఆర్యులు మాంసాహారులే కాక, గోమాంసాన్ని కూడ భుజించేవారని చెప్పడానికి బలమైన నిదర్శనాలు అపారంగా ఉన్నాయి. ఇందుకు నిదర్శనంగా కింది వాస్తవాలను దృష్టిలో ఉంచుకుంటే సరిపోతుంది. అవి నిర్వివాదమైనవి.

మధుపర్కం విషయాన్ని తీసుకుందాం. ప్రాచీన ఆర్యులలో అతిథిని ఆహ్వానించే విషయంలో నెలకొని ఉన్న సంప్రదాయ పద్ధతిని మధుపర్కం అంటారు. దాని గురించిన విపులమైన వర్ణన వివిధ గృహ్య సూత్రాలలో ఉన్నది. గృహ్యసూత్రాల ప్రకారం మధుపర్కానికి అర్హులైన వారు ఆరుగురున్నారు. వారు (1) యజ్ఞాన్ని నిర్వహించే బ్రాహ్మణుడు లేదా ఋత్విజుడు, (2) ఆచార్యుడు (ఉపాధ్యాయుడు), (3) పెండ్లి కుమారుడు, (4) రాజు, (5) గురుకులంలో అప్పుడే విద్యను పూర్తి చేసిన విద్యార్థి (స్నాతకుడు), (6) ఆతిథ్యమిచ్చేవారికి ప్రియమైన వారెవరైనా (కొందరు ఈ జాబితాలో అతిథిని చేరుస్తారు). ఋత్విజుడు, రాజు, ఆచార్యుడు అనే ముగ్గురినీ తప్పించి మిగతావారందరికీ మధుపర్కాన్ని సంవత్సరానికి ఒకసారి సమర్పిస్తారు. ఋత్విజునికి, రాజుకు, ఆచార్యునికి మాత్రం వారు వచ్చిన ప్రతిసారీ మధుపర్కం సమర్పించవలసి ఉంటుంది. ఆ పద్ధతి ఎలా అంటే మొదట అతిథి పాదాలను గృహస్థు కడగాలి. అనంతరం మధుపర్కాన్ని సమర్పించాలి. దానిని ఆయన కొన్ని నిర్దిష్ట మంత్రాలతో పాటుగా స్వీకరిస్తాడు (తాగుతాడు).

మధుపర్కంలో ఏమేమి ఉంటాయి? మధుపర్కం అంటే అర్థం ఏమంటే, 'అరచేతిపై

తేనె నాకించటమో లేక పోయటమో' అని. మొదట్లో మధుపర్కం సమర్పించటం అంటే ఆ పద్ధతిలోనే అలాగే ఉండేది. కాలక్రమేణా వట్టి తేనె కాకుండా వేరే చాలా పదార్థాలు అందులో చేరాయి. ఒకప్పుడు తేనెలో పెరుగు, వెన్న కలిపి దానిని మధుపర్కంగా పరిగణించేవారు. ఆ తరువాత పెరుగు, తేనె, నెయ్యి, యవలు, బార్లీ అనే అయిదు పదార్థాలు కలిసిన దానిని మధుపర్కంగా పేర్కొన్నారు. అనంతరం అది తొమ్మిది పదార్థాలతో కూడినది అయింది. కౌషీతకి సూత్రం తొమ్మిది రకాల మిశ్రమం గురించి చెబుతున్నది. అవి – బ్రహ్మ (తేనె, పెరుగు), ఐంద్ర (పాయస సంబంధి), సౌమ్య (పెరుగు, నెయ్యి), మౌసల (చీని, నెయ్యి) (దీనిని రాజసూయ, సౌత్రమణి యాగాలలో మాత్రమే ఉపయోగిస్తారు). వరుణ (నీరు, నెయ్యి), శ్రవణ (నువ్వులనూనె, నెయ్యి), పరివ్రాజిక (నువ్వులనూనె, తెలగపిండి). ఆ తర్వాత మనం మానవగృహ్యసూత్రాల కాలంలోకి వస్తాం. మాంసం లేకుండా మధుపర్కమనేది ఉండకూడదని వేదం చెప్తున్నందువల్ల ఆవును మినహాయిస్తే, మేక మాంసాన్ని లేదా పాయసాన్ని సమర్పించాలని అది సిఫారసు చేస్తున్నది. ఇతర మాంసాన్ని కూడ సమర్పించవచ్చునని హారిత గృహ్యసూత్రం (i. 13.14) చెబుతున్నది. ఆవును మినహాయించినపుడు, మేక లేదా పొట్టేలు మాంసాన్ని (జింక వంటి జంతువుల) అర్పించాలని బో.గృ. (1,2,51-54) చెబుతున్నది. మాంసం లేకుండా మధుపర్కం ఉండదు కాబట్టి మాంసాన్ని సమర్పించలేనివారు నేలలోని గింజలను వండవచ్చు. కాని తుదకు మాంసం అనేది మధుపర్కంలో ముఖ్యమైన భాగంగా అయింది. మాంసం లేకుండా మధుపర్కమనేదే లేదని చెప్పేవరకు కొన్ని గృహ్యసూత్రాలు వెళ్లాయి. 'మధుపర్కంలో మాంసం ఉండనివ్వండి' అని ఋగ్వేదం జారీ చేసిన ఒక నిబంధనను వారు దీనికి ఆధారంగా చేసుకున్నారు.

అంచేత మాంసాహారమనేది చాలా సాధారణమైనది. బ్రాహ్మణుల నుంచి శూద్రుల వరకు అందరూ మాంసం తినేవారు. పశువుల, పక్షులు, చేపల మాంసాలను గురించి ధర్మసూత్రాలలో బోలెడు నియాలున్నాయి. ఏదుపంది, కుందేలు (చెవులపిల్లి) స్వవిధ్ (మగ ముళ్లపంది), ఉడుము, ఖడ్గమృగం, తాబేలులను తప్పించి ఏ రకమైన పంచనఖ (అయిదుగోళ్లు కల్గిన) జంతువుల మాంసాన్నీ భుజించకూడదని గౌత. 17-27.31; ఆపస్తంబ ధ.శా. 1,5,17-35, వాసిష్ట ధ.శా. 14,39-40, యజుర్వేదం 1,177, విష్ణు ధ.శా. 51.6, శంఖ లిఖిత (అపరార్కుడు ఉదహరించినది పుట 1167), రామాయణం కిష్కిందకాండ (17.39), మార్కండేయ పురాణం (35.2-4) ప్రతిపాదిస్తున్నాయి. కొన్నింటిలో ఖడ్గమృగాన్ని మినహాయించారు. రెండు దవడలలోనూ పళ్లు ఉండే జంతువులనూ, వెంట్రుకలుండే జంతువులనూ, వెంట్రుకలు లేని పాముల వంటి వాటినీ గ్రామాలలోని కోడిపుంజులు, కుందేళ్లు, ఆవులు ఎద్దులు మొ॥ వాటి మాంసాన్నీ కూడా భుజించడం మానుకోవాలని గౌతమ సూత్రం చెబుతున్నది. ఆపస్తంబ ధర్మశాస్త్రం ఒకే డెక్క గల్గిన జంతువుల మాంసాన్ని, ఒంటె, గవయ మృగం, గ్రామాలలోని కుందేలు, శరభ మృగం, ఆవు మొ॥ వాని మాంసాన్ని మొదట

నిషేధించింది (1.5.17-29-31). కాని ఆ తర్వాత ఎద్దు మాంసం, పాలిచ్చే ఆవుల మాంసం తినవచ్చునని చెప్పింది. వాజసనేయకం ఆ మాంసాన్ని పరిశుద్ధమైనదని పేర్కొన్నది, కనక వాటిని తినవచ్చునన్నది. వేదాలను బోధించే ఉపాధ్యాయుడు మాంసం వాడకాన్ని నిషేధించాలని ఆప.ధ.శా. (II-2,5,1) చెబుతున్నది.

(అసంపూర్ణం. మిగతాభాగం లభించలేదు.)

అనువాదం : కె. రాహుల్

చిక్కుముడి : 14

# అహింస నుంచి మళ్ళీ హింసకు

"హింస నుంచి అహింసకు" అనేది అహింస కథలో ఒక భాగం మాత్రమే. "అహింస నుంచి తిరిగి హింసకు" అనే శీర్షిక క్రింద మాత్రమే వివరించగలిగిన కథాభాగం మరొకటి ఉన్నది. తంత్రాలు తాంత్రిక విద్యలకు సంబంధించిన మతపరమైన ఆచారాలను గ్రహించినప్పుడే కథలోని ఈ రెండో భాగం స్పష్టమవుతుంది. వాటిని ఇదివరకే ప్రస్తావించటం జరిగింది.

తాంత్రిక పూజలోని ముఖ్యాంశాలు పంచ మకారాలు. ఈ అయిదు మకారాలు ఇవి :

| | | |
|---|---|---|
| 1. | వివిధ రకాల మద్యపానం | (మద్యం) |
| 2. | మాంసాహారం | (మాంసం) |
| 3. | చేపలు తినటం | (మత్స్యం) |
| 4. | కాల్చిన లేదా వేపిన గింజలు తినటం | (ముద్ర) |
| 5. | లైంగిక సంపర్కం | (మైథునం) |

మతపరమైన పూజలో ఒక భాగంగా అయిన మైథునం (లైంగిక సంపర్కం) గురించి ఇక్కడ చెప్పవలసిన అవసరం లేదు. మద్య మాంసాల గురించి చెప్పుకుంటే సరిపోతుంది.

ఈ చర్యలలో మొదటి నాలుగింటి విషయంలో తాంత్రికులు పన్నెండు రకాల సారాయిలను, మూడు రకాల మధువును (మద్యాన్ని), మూడు రకాల మాంసాన్ని నిర్దేశించారు.

---

ఈ అధ్యాయం 'అహింస చిక్కుముడి' అనే ముందటి అధ్యాయానికి కొనసాగింపువలె అగుపిస్తున్నది. కొన్ని దిద్దుబాట్లతో ఆరు టైపుపుటలున్నాయి. శీర్షికను గ్రంథకర్తే స్వయంగా రాశారు. —సంకలనకర్త

కొన్ని ధర్మ గ్రంథాలు రాశాడని ప్రసిద్ధిలో ఉన్న ప్రాచీన ఋషి పుల్యస్తుడు కూడా పన్నెండు రకాల మద్యాన్ని ఎంపిక చేసి చెప్పాడు. అవి ఇవి :

| | | |
|---|---|---|
| 1. | పనస పండు నుంచి తీసిన మద్యం | (పనస మద్యం అంటారు) |
| 2. | ద్రాక్షపండ్ల నుంచి తీసినది | (ద్రాక్షాసవం) |
| 3. | ఖర్జూరాల నుంచి తీసినది | (ఖర్జూరి) |
| 4. | తాటిచెట్టు నుంచి తీసినది | (కల్లు) |
| 5. | కొబ్బరిచెట్టు నుండి తీసినది | (నారికేళ) |
| 6. | చెరకు నుంచి తీసినది | (ఇక్షు) |
| 7. | మాధవిక మొక్క నుంచి తీసినది | |
| 8. | పిప్పళ్ల నుంచి తీసినది | (సైర) |
| 9. | కుంకుడు పండు నుంచి తీసినది | (అరిష్ట) |
| 10. | తేనెతో చేసిన సారాయం | (మధూక) |
| 11. | రమ్ లేదా మొలాసిస్ నుంచి తీసిన ఒకరకమైన సారాయం | (గౌడీ అనీ ఒక్కొక్కప్పుడు మైరేయం అనీ అంటారు) |
| 12. | సారాయి లేదా బియ్యం నుంచి ఇతర గింజల నుంచి చేసిన మద్యం | (సుర లేదా వారుణి లేదా పైష్టి) |

పైన చెప్పిన ఈ పన్నెండు రకాల మద్యాలే కాకుండా మరికొన్ని తరచుగా చెప్పే ఇతర రకాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు వెలగపండు నుంచి చేసిన టంక, రేగుపండు నుంచి చేసిన కోలి, ఇక ఆఖరుగా బలరామునికి ప్రీతికరమైన కాదంబరి మొదలగునవి.

మాంసం పక్షులది కావచ్చు, జంతువులది లేదా చేపలది కావచ్చు. కాల్చిన గింజలు బిస్కట్లలాగా మద్యంతోనూ ఘాటైన సారాతోను నంజుకు తింటారు. ఒక్కొక్క పానీయాన్నీ, దాని ప్రత్యేక సామర్థ్యాన్నీ ప్రయోజనాన్నీ గురించి తెలుసుకోవాలి. ఒక సారా ముక్తినిస్తుంది. ఇంకొకటి జ్ఞానాన్ని, మరొకటి శక్తిని, ఇంకొకటి ఐశ్వర్యాన్నీ ఇస్తుంది. మరొకటి శ్రమ పోగొడుతుంది. ఇంకొకటి రోగాలు నివారిస్తుంది, మరొకటి పాపాలను పరిహారం చేస్తుంది. ఇంకొకటి ఆత్మను పునీతం చేస్తుంది.

తాంత్రిక పూజ బెంగాల్‌లో చాలా గాఢంగా పాతుకుపోయింది. రాజేంద్రలాల్ మిత్రా స్వానుభవాన్ని ప్రస్తావిస్తూ ఇలా చెప్పారు.[1] "నేనెరిగిన ఒక పూర్వ సువాసిని గురించి చెప్తాను. ఆమె కలకత్తాలో మిక్కిలి విశిష్టమైన కుటుంబానికి చెందిన అత్యంత గౌరవప్రదమైన మహిళ. కౌలశాఖకు చెందినది. 75 ఏళ్లు బతికింది. పళ్లు కుట్టుకొనే పుల్లను సారా సీసాలో ముంచి తన

1. రాజేంద్రలాల్ మిత్రా, 'Indo Aryans' సంపుటం I, పుటలు 405-6.

నాలుక కొసతో తాకి దేవునికి తాను సమర్పిస్తున్న పూలపై ఆ సారా చుక్కలు చల్లిగాని ఆమె ఎప్పుడూ పూజ పూర్తి చేసేది కాదు (ప్రతిరోజూ, ఉదయం, సాయంత్రం ప్రార్థనలు చేసేదామె). ఆమె జీవిత కాలంలో ఎప్పుడూ ఒక గ్లాసుడైనా సారా తాగి ఉండదని నా అనుమానం. మద్య పానం వలన కలిగే ఆనందం ఎలా ఉంటుందో ఖచ్చితంగా ఆమెకు తెలియదు. కాని విధేయురాలైన కౌల శాఖస్థురాలిగా, ఏ మాత్రమూ పొరపాటు లేకుండా తన మతం ఆదేశించిన విధంగా ఆచారాలను అనుసరిస్తూ వచ్చింది. ఆమెలాగానే కొన్నివేల మంది అలా చేస్తున్నారని నిరభ్యంతరంగా నమ్మవచ్చు. అంత సులువుగా సారా దొరకని కొన్ని బెంగాలు ప్రాంతాలలో భక్తురాండ్రు ఒక ప్రత్యామ్నాయం కనిపెట్టారు. కొబ్బరి నీళ్లను కంచుగిన్నెలోనో రాగి చెంబులోనో వేసి కొన్ని చుక్కలు తాగుతారు. పురుషులు అంత పొదుపుగా లేరు. రోజుకు అయిదు కప్పుల సారా తాగవచ్చునని తంత్ర గ్రంథాలు చెబుతున్నాయి. కప్పు అంటే అయిదు తులాలు లేదా రెండు ఔన్సులు ఉంటుంది. అంటే రోజుకు వారు పది ఔన్సుల వరకు (సుమారుగా ఒక పింట్) సారా తాగవచ్చునన్నమాట".

ఈ తాంత్రిక పూజ బెంగాల్‌లో ఒక చిన్న ప్రాంతానికి మాత్రమే పరిమితం కాలేదు. మహామహోపాధ్యాయ జాదవేశ్వర తర్కరత్న[1] సూచించినట్టుగా :

"అగ్ర కులాలలోని బెంగాలీలు శాక్తులుగా, వైష్ణవులుగా, శైవులుగా, విడిపోయినట్టుగానే కామరూప, మిథిల, ఉత్కళ, కళింగ, కాశ్మీర పండితులు కూడా విడిపోయారు. శక్తిమంత్రం, శైవ మంత్రం, విష్ణు మంత్రం అన్నీ తాంత్రికమే. దక్షిణ దేశస్థులలో మహా మహోపాధ్యాయ సుబ్రహ్మణ్య శాస్త్రి తదితరులు చాలామంది శాక్తులే. కీర్తిశేషులు మహామహోపాధ్యాయ రామమిశ్ర శాస్త్రి, భాగవతాచార్య, వంటివారు వైష్ణవులుగా ఉన్నారు. మహామహోపాధ్యాయ శివకుమార శాస్త్రిలాంటివారు చాలామంది శైవులు. బృందావనంలో చాలామంది శాక్తేయ బ్రాహ్మణులూ వైష్ణవ బ్రాహ్మణులూ ఉన్నారు. మహారాష్ట్రలోను ఇతర దక్షిణ భారత ప్రాంతాలలోనూ అగ్రకులాలలో, శాక్తేయులకంటే శైవులు, వైష్ణవులు, ఎక్కువగా ఉన్నారు. పాశుపత, జంగమ (పూజా) విధానాన్ని అనుసరించేవారేమో శైవులు, మధ్వాచార్యునీ రామానుజాచార్యునీ అనుసరించేవారేమో వైష్ణవులు. తంత్రం ఒక్కదానిలోనే కనిపించే రామ మంత్రం వాయవ్యంలో ప్రచారంలో ఉన్నది. ఇంకా విశేషం ఏమంటే (ఈ రచయిత ప్రకారం), శ్రీ పురుషోత్తముని పండాలు అందరూ శాక్తులు. కామాఖ్యాదేవి పూజారులు అందరూ వైష్ణవులు.

తంత్రాలు, తంత్ర పూజ, సరిగ్గా ఏ కాలంలో వచ్చాయో చెప్పటం సాధ్యం కాదు గాని అవి మనువు తర్వాత వచ్చినవే అనే దాంట్లో మాత్రం ఏమీ సందేహం లేదు. ఈ వాస్తవాన్ని బట్టి చూస్తే తంత్ర పూజ అభివృద్ధి చెందటం అనేది చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. మద్య

1. Avalon తన 'Principles of Tantra' Part I. Introduction page - XXXVIIIలో ఉదహరించారు.

మాంసాలపై మనువు విధించిన నిషేధాలను తాంత్రికులు ఎత్తివేయటమే కాకుండా మద్య పానాన్నీ మాంసాహారాన్నీ ధర్మసూత్రాలుగా చేశారు.

ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే తంత్రాన్నీ తాంత్రిక పూజనూ విస్తరింప జేయటంలో బ్రాహ్మణులు నిర్వహించిన పాత్ర. తంత్రాలకు వేదాల పట్ల గౌరవం లేదు. వేదం అనేది అందరికీ అందుబాటులో ఉండే ఒక సామాన్య స్త్రీ వంటిది అనీ, తంత్రం అంటే ఎవరికీ అందకుండా ఒంటిస్తంభం మేడలో ఉంచి పెంచిన అగ్రకుల సంజాత వంటిది అనీ తాంత్రికులు అంటారు. బ్రాహ్మణులు తంత్రాన్ని ఎప్పుడూ తిరస్కరించలేదు. అంతే కాకుండా దానిని పంచమవేదంగా పరిగణించారు. ప్రసిద్ధ మనుస్మృతి వ్యాఖ్యాత, ఛాందస బ్రాహ్మణుడు అయిన కుల్లూకభట్టు వైదికం, తాంత్రికం అనే తేడాలతో శ్రుతిని రెండు రకాలుగా చెప్పాడు. బ్రాహ్మణులు తంత్రాన్ని వ్యతిరేకించకపోగా తాంత్రిక పూజను ప్రోత్సహించారు. మాతృకా భేదతంత్రం, శివుడు తన భార్య పార్వతిని ఈ విధంగా సంబోధించేలా చేసింది.[1]

ఓ మధుర భాషిణి అయిన దేవతా, బ్రాహ్మణుల ముక్తి, మద్యపానం మీద ఆధారపడి ఉన్నది. ఓ పర్వత పుత్రీ! త్రాగుడుకూ దాని వెంట వచ్చే అలవాట్లకూ విధేయుడైన బ్రాహ్మణుడు తక్షణం శివభక్తుడవుతాడని నేను అంటున్నానంటే ఒక మహాసత్యాన్ని నీకు బోధిస్తున్నానన్నమాట. నీరు నీటితో కలిసినట్టుగా, లోహం లోహంతో కలిసినట్టుగా, పాత్రలో ఉన్న ఖాళీస్థలం పాత్రలో కలిసిపోయినట్టుగా గాలిలో గాలి కలిసినట్టుగా బ్రాహ్మణుడు విశ్వాత్మ అయిన బ్రహ్మలో కలుస్తాడు."

"దీని గురించి ఏ మాత్రమూ సందేహం అక్కర్లేదు. దైవత్వ సారూప్యం, ఇతర మోక్షానంద రూపాలు క్షత్రియులకోసమూ తదితరుల కోసమూ రూపొందాయి. కాని ఉత్సాహకారి అయిన మద్యం త్రాగనిదే నిజమైన జ్ఞానాన్ని ఎప్పటికీ సంపాదించలేరు; కాబట్టి బ్రాహ్మణులు ఎల్లప్పుడూ త్రాగుతూ ఉండాలి. వేదాల తల్లి అయిన గాయత్రిని ఉచ్చరించినంత మాత్రాన ఎవరూ కూడ బ్రాహ్మణులు కాలేరు. బ్రహ్మజ్ఞానం పొందినవాడే బ్రాహ్మణుడవుతాడు. దేవతల అమృతం వారి బ్రహ్మ. అదే భూమి మీద మద్యం అయింది. దాని ద్వారా దేవస్థితికి (సురత్వం) చేరుకుంటారు కాబట్టి, మద్యాన్ని సుర అంటారు".

తండ్రియైన మనువును బ్రాహ్మణులు ఎందుకు తిరస్కరించారు? ఆయన (మనువు) నిషేధించిన మద్యపానాన్నీ మాంసాహారాన్నీ వారు తిరిగి ఎందుకు మొదలు పెట్టారు? ఇది ఒక చిక్కుముడి.

అనువాదం : బొజ్జా తారకం

---

1. 'ఇండో ఆర్యన్స్' గ్రంథంలో రాజేంద్రలాల్ మిత్రా ఉదహరించినది.

## చిక్కుముడి : 15

# ఒక అహింసక దేవునికి రక్తపిపాసి అయిన దేవతనిచ్చి బ్రాహ్మణులు పెళ్లి ఎందుకు చేశారు ?

మద్యపానం మాంసాహారం మొదలుపెట్టిన (తర్వాత) బ్రాహ్మణులు జంతుబలిని ప్రోత్సహిస్తూ పురాణాలు రాయటానికి ఏ మాత్రమూ సంకోచపడలేదు. అందులో ఒక పురాణం గురించి ప్రత్యేక ప్రస్తావన ఇవ్వవలసి ఉంది. దానిని కాళీపురాణం అంటారు. కాళికాదేవి ఆరాధనను ప్రోత్సహించే ఉద్దేశంతోనే ఈ పురాణం రాయటం జరిగింది. ఈ పురాణంలో రుధిరాధ్యాయం అని ఒక అధ్యాయం ఉన్నది. అంటే రక్తమయమైన అధ్యాయం.

రుధిరాధ్యాయం సంగ్రహాన్ని ఈ దిగువ ఇస్తున్నాను. ఈ అధ్యాయంలో[1] శివుడు తన ముగ్గురు కుమారులైన భేతాళుడు, భైరవరుడు, భైరవుడు అనేవారికి ఇలా చెప్తున్నాడు.

"నా కుమారులారా! యజ్ఞాలలో పాటించవలసిన సంస్కారాలూ నియమాలూ మీకు తెలియజేస్తాను. వాటిని సరిగా పాటించినట్లయితే దైవానుగ్రహం కలుగుతుంది."

"వైష్ణవి తంత్రంలో నిర్దేశించిన పద్ధతులను అన్ని సందర్భాలలోనూ అనుసరించాలి. దేవతలకు ఇచ్చే బలులలో వీటిని పాటించాలి.

ఇది 16 పుటల టైపు ప్రతి. మార్పులు గ్రంథకర్తే చేశారు. పుటల కన్నింటికి అంకెలు వేసి ఉన్నాయి. విషయ పరిశీలన సమగ్రంగా ఉన్నది. – సంకలనకర్త

[1] ఈ అధ్యాయాన్ని ఇంగ్లీషులోకి డబ్లు.సి. బ్లాకిర్ (W.C. Blaquiere) అనువదించారు. ఇది ఏషియాటిక్ రిసెర్చెస్ సంపుటిలో (Asiatic Researches Vol.) దొరుకుతుంది.

"పక్షులు, తాబేళ్ళు, మొసళ్లు, చేపలు, తొమ్మిది రకాల అడవి జంతువులు, దున్నపోతులు, ఎద్దులు, మేకపోతులు, అడవి పందులు, ఖడ్గమృగాలు, లేళ్లు, ఉడుములు, జింకలు, సింహాలు, పులులు, మనుషులు, నైవేద్యం సమర్పించే వాని శరీరం నుండి తీసిన రక్తం, ఇవన్నీ చండికకూ భైరవ దేవతలకూ తగిన నైవేద్యాలని అంటారు."

"బలుల ద్వారా రాజకుమారులు ఆనందాన్ని స్వర్గాన్ని, శత్రువులపై విజయాన్ని పొందుతారు."

"చేపతోనూ, తాబేలుతోనూ ఇచ్చిన నైవేద్యం (బలి) వల్ల దేవతకు ఒక నెలపాటు ఆనందం ఉంటుంది. మొసలిని నైవేద్యంగా ఇచ్చినట్లైతే ఆనందం మూడు నెలలు ఉంటుంది. తొమ్మిది రకాల అడవి జంతువుల రక్తంతో ఇచ్చినట్లైతే దేవత తొమ్మిది నెలలు సంతోషిస్తుంది. బలి నివేదించే వాని సంక్షేమానికి తగినట్లుగా ఆ వ్యవధి ఉంటుంది. అడవి ఎద్దు, ఉడుముల రక్తమయితే ఒక ఏడాది పాటు ఆనందాన్నిస్తుంది. లేడి, అడవి పంది అయితే ఆనందం పన్నెండేళ్లు ఉంటుంది. శరభ మృగాల రక్తమైతే దేవతను ఇరవై అయిదు సంవత్సరాల పాటు తృప్తి పరుస్తుంది. ఎద్దు రక్తం, ఖడ్గమృగ రక్తం దేవతకు వంద ఏళ్లు ఆనందాన్నిస్తాయి. పెద్ద పులి రక్తం కూడా అన్నే ఏళ్లు ఆనంద పరుస్తుంది. సింహం కణుజుల వంటి జంతువుల రక్తమూ, మానవుల రక్తమూ అయితే వెయ్యేళ్లు ఆనందాన్నిస్తాయి. వీటి మాంసం కూడ, విడిగా వాటి రక్తం ఇచ్చినన్ని సంవత్సరాలు దేవతకు ఆనందాన్ని ఇస్తుంది." ఖడ్గమృగాన్నీ, లేడి చర్మాన్నీ రోహిత (ఎర్రమీను) చేపనూ నైవేద్యంగా ఇస్తే ఫలితాలు ఎలా ఉంటాయో చూడండి.

"లేడి ఖడ్గమృగాల మాంసం అయిదు వందల సంవత్సరాలు, రోహిత చేప, బర్ద్రీనలు మూడు వందల సంవత్సరాలు, నా ప్రియురాలి (కాళీదేవత)కి ఆనందాన్నిస్తాయి.

ఇరవై నాలుగు గంటలలో రెండుసార్లు మాత్రం నీళ్లు తాగేది, సన్నని కాళ్ళు ఉండి, మందలో ముఖ్యమైనదై, మచ్చలేని మేకను బర్ద్రీనస అంటారు. హవ్య(దేతలకు తర్పణాలు)లలో, కవ్యలలో (చనిపోయిన పూర్వీకులకు తర్పణాలు) ఇది ఉత్తమమైనది అంటారు.

"నీలిరంగు కంఠం, ఎర్రనితల, తెల్లని ఈకలు నల్లటి కాళ్లు ఉన్న పక్షిని 'బర్హీనాశ' అంటారు. అది పక్షిరాజు. అదంటే నాకూ విష్ణువుకూ చాలా ఇష్టం."

"నియమ ప్రకారం నరబలి ఇస్తే దేవత నూరు సంవత్సరాలు సంతోషిస్తుంది. ముగ్గురిని బలి ఇస్తే వంద వెయ్యి సంవత్సరాలు సంతోషిస్తుంది. నరుని మాంసంతో కామాఖ్య, చండిక, నా రూపం ధరించిన భైరవుడు, వెయ్యి సంవత్సరాలు సంతోషపడతారు. ధర్మ శాస్త్రోక్తంగా పునీతమైన రక్త తర్పణం అమృతంతో సమానమైనది; తల కూడా చండిక దేవతకు చాలా ఆనందాన్ని ఇస్తుంది. కాబట్టి విజ్ఞులు దేవతకు అంజలి ఘటించేటప్పుడు రక్తాన్నీ, తలనూ సమర్పించాలి. అగ్ని హెూమాలు చేస్తున్నప్పుడు మాంసం తర్పణం చేయాలి."

యజ్ఞం చేసే వ్యక్తి ఎప్పుడూ కూడా చెడు మాంసం సమర్పించకుండా చూడాలి. ఎందుకంటే తల, రక్తం రెండూ అమృతంతో సమానం.

"బెల్లం, చెఱుకు, సారా, పులిసిన సారా ఇవి ఇతర సమర్పణలతో సమానమైనవే. మేకను బలి ఇస్తే సంతోషం నిలిచినంత కాలం వీటి సమర్పణ వల్ల దేవత సంతోషిస్తుంది.

బలి ఇవ్వటానికి చంద్రహాసం, బాకు వాడటం ఉత్తమమైన పద్ధతి. పార, గొడ్డలి వంటి వానితో తల నరకటం అధమమైన పద్ధతి.

"ఈ ఆయుధాలు తప్ప వేరేవి బల్లెంగాని బాణంగాని (బలి ఇచ్చేటప్పుడు) ఎవరైనా ఉపయోగిస్తే, నైవేద్యాన్ని దేవత స్వీకరించదు. సమర్పించిన వాడు చనిపోతాడు. బలి పశువు లేదా పక్షి తలను తన చేతులతో ఎవరైనా చీల్చి వేస్తే అది బ్రాహ్మణ హత్యతో సమానం అవుతుంది. భయంకరమైన బాధలు అనుభవించవలసి వస్తుంది."

బలి ఇచ్చేముందు ఆయుధానికి శాస్త్రోక్తంగా పూజ చేయాలి. (ఇందుకు పండితులు చెప్పిన పద్ధతులు దిగువ ఇస్తున్నాం). ఆ ప్రకారం పూజ చేసిన మీదటనే ఆవాహనాదులు చెయ్యాలి.

శాస్త్రోక్తమైన ఆవాహన చేయకుండా విజ్ఞులు బలికి గొడ్డలి ఎప్పుడూ ఉపయోగించ కూడదు.

మరీ ముఖ్యంగా దుర్గాదేవతను, కామాఖ్యను, కొలిచేటప్పుడు ఈ ప్రకారం తప్పకుండా పాటించాలి."

బలి ఇచ్చేవ్యక్తి కాళీ శబ్దాన్ని రెండుసార్లు ఉచ్చరించాలి. ఆ తర్వాత "దేవీ వజ్రేశ్వరి! ముద్గర కుంతధారిణీ నమః" అని ఆ తర్వాత ఇలా అనాలి. "జయహో కాళీ! కాళీ, జయహో దేవీ, హుంకార దేవతా, జయహో! ఇనుప రాజదండం గల దేవతా" అంటూ గొడ్డలి చేతిలోకి తీసుకొని మంటలు ప్రజ్వలింపజేస్తూ కాళరాత్రీయ గ్రంథాన్ని చదువుతూ ఇలా ప్రార్థించాలి.

యజ్ఞం చేసే వ్యక్తి ఇలా అనాలి. "హ్రాం, హ్రీం, కాళీ, కాళీ, ఉగ్రదంష్ట్రా!; భుజించు, నరుకు, దుష్టులను సంహరించు, ఈ గొడ్డలితో నరుకు, కట్టివెయ్యి, పట్టుకో, రక్తం తాగు, భద్రం, భద్రం, రక్ష, రక్ష, కాళీ నీకు నమస్కారం" ఇలా ముగుస్తుంది, కాళరాత్రీయ మంత్రం.

పై విధంగా బలికోసం ఎత్తిన ఆయుధాన్ని (గొడ్డలిని) కాళరాత్రీయ మంత్రంతో పూజించటం వల్ల బలి సమర్పించే వాని శత్రువులను సంహరించటం కోసం ఆయుధాన్ని కాళరాత్రి (చీకటి దేవత) అధిష్ఠిస్తుంది.

హోమం చేసే వ్యక్తులు బలికి ముందు, ఆ విధి గురించి తెలిపే అంతకు ముందటి గ్రంథాలనన్నింటినీ తెలుసుకొని ఉపయోగించుకోవాలి. తన గురించి బలిపశువుతో ఇలా

చెప్పాలి.

"యజ్ఞాలలో బలి ఇవ్వటం కోసమే స్వయం ప్రభువు (తాను) జంతువులను సృష్టించాడు. కాబట్టి నీ ప్రాణం తీస్తున్న పాపం ఏదీ నాకు అంటకుండా ఆ విధంగానే నిన్ను బలి ఇస్తున్నాను."

ఆ తర్వాత బలి ఇస్తున్న వ్యక్తి ఏ దేవతకు బలి ఇస్తున్నాడో పేరు చెప్పాలి. ఎందుకోసం బలి ఇస్తున్నాడో చెప్పాలి. బలి పశువు ముఖం ఉత్తరదిశ వైపు లేదా యజ్ఞం చేసే వ్యక్తి ముఖం ఉత్తరం వైపు, బలి పశువు ముఖం తూర్పు దిక్కువైపుకు ఉండగా, పై మాటలు పఠిస్తూ బలి ఇవ్వాలి. బలిపశువును బలి ఇచ్చిన తర్వాత గ్రంథాలలో నిర్దేశించిన విధంగా రక్తంతో పాటు ఉప్పు మొదలైనవి దానిలో కలపాలి.

"రక్తతర్పణ చేయవలసిన పాత్ర బలి ఇచ్చేవాని స్తోమతను బట్టి ఉంటుంది. బంగారం, వెండి, రాగి, ఇత్తడి గిన్నె లేదా ఆకులు కుట్టి చేసిన దొన్నె, లేదా మట్టిపాత్ర లేదా తుత్తునాగం లేదా యజ్ఞంలో ఉపయోగించే కట్టెతో చేసిన ఏ పాత్ర అయినా కావచ్చు."

"ఇనుపగిన్నె వాడకూడదు. జంతువు చర్మంతో చేసిన దానితోగాని చెట్టు బెరడుతో చేసినదానితో గాని సత్తుగిన్నెలోగాని, రేకు లేదా సీసంగిన్నెలో గాని ఇవ్వకూడదు. స్రబ్ లేదా స్రుక్ అనే పవిత్ర పాత్రలో రక్తం తర్పణ చెయ్యకూడదు. నేలమీద పోసి ఇవ్వకూడదు. ఘటం (మట్టికుండ, ఇతర మత సంస్కారాలలోనూ దీనినే వాడతారు)లో ఇవ్వకూడదు. నేలమీద పోస్తూ ఇవ్వకూడదు. ఇతర సమయాలలో దేవతకు ఆహారం సమర్పించే గిన్నెలో పోసి ఇవ్వకూడదు; భాగ్యాన్ని కోరుకునే సత్పురుషుడెవరూ ఈ పాత్రలలో రక్తం ఇవ్వకూడదు. మానవరక్తం ఎప్పుడూ కూడా లోహపు గిన్నెలోగాని మట్టి పాత్రలోగాని ఇవ్వాలి. ఆకులతో లేదా అటువంటి వాటితో చేసిన గిన్నెలో ఎప్పుడూ ఇవ్వకూడదు.

"అశ్వమేధ యజ్ఞంలో తప్ప ఇతరత్రా గుర్రాన్ని బలి ఇవ్వటం తప్పు. అదే విధంగా గజ మేధంలో తప్ప మరెక్కడా ఏనుగును బలి ఇవ్వకూడదు. కాబట్టి ప్రజాపాలకుడు ఆయా సందర్భాలలో తప్ప వీటిని బలి ఇవ్వకూడదు. అశ్వమేధం చేయవలసిన అవసరం వచ్చినపుడు గుర్రానికి బదులుగా 'ఖంద్రర' అనే అడవి ఎద్దును ఎట్టి పరిస్థితులలోనూ బలి ఇవ్వకూడదు.

బ్రాహ్మణుడు ఎప్పుడైనాగాని దేవికి సింహాన్నిగాని పెద్దపులిని గాని తన రక్తాన్ని గాని, సారాగాని తర్పణ చెయ్యకూడదు. బ్రాహ్మణుడు ఎపుడైనా సింహాన్నిగాని, పెద్దపులినిగాని, మనిషినిగాని బలి ఇస్తే నరకానికి వెళ్తాడు. బాధలతో యాతనలతో ఈ ప్రపంచంలో కొద్ది రోజులు మాత్రమే బతుకుతాడు.

"బ్రాహ్మణుడు తన రక్తాన్ని తర్పణ చేస్తే బ్రాహ్మణుని సంహరించినంత పాపం తగులుతుంది, సారా తర్పణ చేస్తే ఇక అతడు బ్రాహ్మణుడిగా మిగలడు.

"క్షత్రియుడు లేడిని తర్పణ చెయ్యకూడదు; అలా చేసినట్లయితే బ్రాహ్మణుని చంపిన దోషం తగులుతుంది. ఒకవేళ సింహాన్నిగాని, పెద్దపులినిగాని, మనుషులను గాని బలి ఇవ్వవలసి వస్తే, పై మూడు వర్గాలవారు ఆ పని చెయ్యాలి. సింహం, పెద్దపులి, మనిషి బొమ్మలను వెన్నతోగాని, పిండిముద్దతోగాని, బార్లీ అన్నంతోగాని చేసి వాటిని బతికి ఉన్న వాటిలాగా భావించి 'నమో' మొదలైన ప్రార్థనలు చేస్తూ శాస్త్రోక్తంగా బలి ఇవ్వాలి.

"అనేక జంతువులను బలి ఇవ్వవలసి వచ్చినపుడు రెండు మూడు తెచ్చి దేవత ముందు బలి ఇస్తే సరిపోతుంది. అపుడు మొత్తం గుంపును తీసుకు వచ్చినట్టే అవుతుంది. ఓ భైరవా! సాధారణ సంస్కారాలు, వాటి విషయాలు, ఎప్పుడు ఏ రకమైన బలులు ఇవ్వాలో అదంతా నీకు వివరించాను. భిన్న పరిస్థితులలో ఏం చేయాలో ఏ మంత్రాలు చదవాలో ఇప్పుడు శ్రద్ధగా విను."

"దేవికిగాని భైరవికిగాని భైరవునికిగాని దున్నపోతును సమర్పిస్తున్నపుడు యజ్ఞం చేసే వ్యక్తి (బలి ఇచ్చే వ్యక్తి) బలి పశువును ఉద్దేశించి (ఆవాహన చేస్తూ) ఈ మంత్రం పఠించాలి.

"ఓ దున్నపోతా! గుర్రాలను నీవు సంహరించినట్టుగా చండికను మోస్తున్న పద్ధతిలో నా శత్రువులను సంహరించు, నాకు భాగ్యాన్ని కలుగజెయ్యి."

అందమైన అనశ్వరమైన రూపంలో ఉన్న ఓ మరణోన్మత్తీ, దీర్ఘాయుష్షును కీర్తిని నాకు ప్రసాదించు, ఓ దున్నపోతా! నీకు నమస్కారాలు.

మానవ రక్త తర్పణకు సంబంధించిన వివరాలను ఇపుడు విను :

"పవిత్రమైన పూజా స్థలం దగ్గర లేదా మృతదేహాలను సమాధి చేసే స్మశానస్థలి దగ్గర నరబలి ఇవ్వాలి. ఇదివరకే వర్ణితమయిన హేరుక అనే స్మశానస్థల భాగంలోగాని కామాఖ్య గుడి వద్దగాని లేదా ఏదైనా పర్వతం పైనగాని బలి జరగాలి. ఇపుడు పద్ధతుల గురించి విను.

"స్మశానం నాకు ప్రాతినిధ్యం వహిస్తుంది. దానిని భైరవ అంటారు. దానిలో తంతరంగేగం అనే భాగం కూడా ఉన్నది. స్మశానాన్ని ఈ రెండు భాగాలుగా హేరుక అనే మూడో భాగంతో పాటుగా విభజించాలి.

"నరబలి భైరవునికి పవిత్రమైన తూర్పు భాగంలో జరగాలి; తలను దక్షిణభాగంలో ఉంచాలి. అది భైరవికి పవిత్రమైన కపాలాలను ఉంచే స్థలం. రక్తాన్ని పశ్చిమ భాగంలో తర్పణ చెయ్యాలి, ఆ స్థలాన్ని హేరుక అంటారు."

అవసరమైన సంస్కారాలన్నింటితో స్మశానం దగ్గర గాని పవిత్ర స్థలంవద్దగాని నరబలి ఇచ్చినపుడు బలి అవుతున్న వ్యక్తి పై చూపులు పడకుండా బలి ఇస్తున్న వ్యక్తి జాగ్రత్తపడాలి."

"ఇతర సందర్భాలలో కూడా హోమకర్త లేదా బలి ఇస్తున్న వ్యక్తి బలి అవుతున్న

వ్యక్తిపై చూపులు పడకుండా చూసుకోవాలి. తల అటు పెట్టవచ్చుకాని చూపులు తప్పించాలి.

బలి అవుతున్న వ్యక్తి మంచి అలంకరణతో ఉండాలి. స్నానం చేయించి, అంతకు ముందు రోజు నైవేద్యంగా ఉంచిన భోజనం పెట్టి, మాంసాహారానికి సంభోగానికి దూరంగా ఉంచాలి. అవసరమైన సంస్కారాలన్నీ చేయించాలి; పూలదండలు వేసి మంచి గంధం పూయాలి.

"అపుడు బలి అవుతున్న వ్యక్తిని ఉత్తరం వైపు ముఖం పెట్టించి యజ్ఞం చేస్తున్న వ్యక్తి బలి అవుతున్న వ్యక్తి శరీరంపై అన్నిభాగాలపై అధిష్టించి ఉండే దేవతలనందరినీ ప్రార్థించాలి; అపుడు బలి అవుతున్న వ్యక్తి స్వయంగా ప్రార్థనలు చెయ్యాలి."

"ఆ విధంగా యజ్ఞం చేస్తున్న వ్యక్తి ఆ సందర్భానికి వర్తించే అన్ని గ్రంథాలనూ, అంతకు ముందు తెలిపిన గ్రంథాలనూ జోడించి వాటిననుసరించి బలి అవుతున్న వ్యక్తిని పూజించాలి."

"నాలుగుకాళ్ల ఆడజంతువునుగాని, ఆడ పక్షినిగాని లేదా స్త్రీనిగాని ఎప్పటికీ బలి ఇవ్వకూడదు. వీటిలో దేనిని బలి ఇచ్చినా నిస్సందేహంగా నరకంలోకి పోతారు. బలి ఇస్తున్న జంతువులు, పక్షులు ఎక్కువ సంఖ్యలో ఉన్నట్లయితే అందులో ఆడదానిని బలి ఇవ్వటం క్షమార్హమవుతుంది. కాని, ఈ నియమం మానవజాతికి వర్తించదు."

బ్రాహ్మణుడినిగాని చండాలుడినిగాని రాజకుమారునిగాని బలి ఇవ్వకూడదు. ఇంతకు మునుపే బ్రాహ్మణునికి గాని దేవునికిగాని సమర్పించిన దానినిగాని యువరాజు సంతతినిగాని యుద్ధంలో జయం పొందినవానినిగాని బ్రాహ్మణుని సంతతినిగాని, క్షత్రియుని సంతతినిగాని, సంతతిలేని అన్ననుగాని, పండితునిగాని, ఇష్టంలేనివానినిగాని, యజ్ఞం చేస్తున్న (బలి ఇస్తున్న) వ్యక్తి మేనమామనుగాని బలి ఇవ్వకూడదు. ఇక్కడ పేర్కొన్నబడనివీ, ఏ జాతికి చెందినవో తెలియని జంతువులూ, పక్షులూ బలికి అనర్హమైనవి. ఇందులో పేర్కొన్నవి లభ్యం కాకపోయినట్లయితే, మగగాడిదను గాని ఒంటెనుగాని తెచ్చి ఆ స్థానాన్ని భర్తీ చేయవచ్చు. ఇతర జంతువులు లభ్యమైతే బలి కార్యక్రమంలో పెద్దపులి, ఒంటె లేదా గాడిదలను బలి ఇవ్వటం తప్పించాలి."

"బలి అవుతున్న మనిషినిగాని, జంతువును గాని, పక్షినిగాని పైన ఆదేశించిన విధంగా పూజించిన తర్వాత, బలి ఇస్తున్న వ్యక్తి 'శాస్త్రాలు' ఆ సందర్భానికి తగినదిగా ఆదేశించిన మంత్రాన్ని పఠిస్తూ అర్పణ చెయ్యాలి. ముందు నిర్దేశించిన విధంగా దేవతను ప్రార్థించాలి.

"బలి అయిన మనిషి తల రక్తం, దేవి కుడి వైపున ఉంచాలి, ఆమె ముందు నిలబడి బలి ఇస్తున్న వ్యక్తి ప్రార్థించాలి. పక్షుల తల, రక్తం దేవి ఎడమవైపున ఉంచాలి. తన రక్తమే అయితే దేవికి ఎదురుగా ఉంచాలి. మాంసాహారంతినే పశువుల పక్షుల తలల నుంచి కారుతున్న

అమృతం దేవి ఎడమవైపున ఉంచాలి. జలచరాల (జంతువుల) రక్తం కూడా అలాగే నివేదించాలి."

"లేడి, తాబేలు, ఖడ్గమృగం, కుందేలు, మొసలి, చేప వీటి తల, రక్తమూ, దేవి ఎదుట ఉంచి నివేదించాలి."

"సింహం తల, రక్తం, కుడివైపున ఉంచాలి, ఖడ్గమృగానివి కూడా అంతే. బలి ఇచ్చినదాని తల, రక్తం ఎప్పుడు కూడా దేవి వెనుకవైపున ఉంచకూడదు. కుడి, ఎడమ ప్రక్కలలో లేదా ఎదురుగా ఉంచాలి.

"పూజా దీపం కుడివైపునగాని ఎదురుగా గాని ఉంచాలి, ఎప్పుడు కూడా ఎడమ వైపున ఉంచకూడదు. ధూపం ఎడమవైపునగాని ఎదురుగాగాని ఉంచాలి, కుడివైపున ఉంచకూడదు. పరిమళ ద్రవ్యాలు, పూలు, నగలు ఎదురుగా ఉంచాలి. వృత్తంలో ఏయే సమర్పణలు ఏయే భాగంలో ఉంచాలో ఇదివరకే చెప్పటం జరిగింది. అన్ని పానీయాలు అయిన తర్వాత మదిర (సారా)ను ఎడమవైపున ఉంచాలి.

"మత్తు పానీయాలు సమర్పించటం తప్పనిసరి అయిన పరిస్థితిలో మొదటి మూడు వర్ణాలకు చెందిన ప్రజలు ఇత్తడి గిన్నెలో కొబ్బరినీళ్లు, రాగిచెంబులో తేనె సమర్పించాలి. ఆపద సమయంలో కూడా మొదటి మూడు వర్ణాలకు చెందిన వ్యక్తులు సారాను సమర్పించకూడదు, పూల నుంచి తీసిన మద్యంగాని, ఉడకబెట్టిన పదార్థాలతో చేసినదిగాని ఇవ్వవచ్చు. యువరాజులు, మంత్రులు, సలహాదార్లు, సారావ్యాపారులు తమ అభ్యుదయం కోసం ఐశ్వర్యం కోసం నరబలి ఇవ్వాలి. (నరబలి ఇచ్చేటట్లయితే) యువరాజు అనుమతి లేకుండా నరబలి ఇస్తే పాపం చుట్టుకుంటుంది. యుద్ధ సమయంలోనూ అవాంతర పరిస్థితులలోనూ యువరాజుల్మూ మంత్రులూ బలులు ఇష్టానుసారం నిర్వహించవచ్చు. వారు తప్ప మరెవరూ బలులు ఇవ్వకూడదు.

"నరబలికి ముందురోజు, బలి చేస్తున్న వ్యక్తిని మనస్తక మంత్రవిధి ప్రకారమూ మూడు దేవీ గ్రంథసూక్తాలు, వద్రంగ మంత్రవిధుల ప్రకారమూ సిద్ధం చెయ్యాలి; అతని తలకు గొడ్డలిని తాకించి, గొడ్డలికి గంధం మొదలైన పరిమళ ద్రవ్యాలు పుయ్యాలి. గొడ్డలి నుంచి గంధాన్ని పరిమళ ద్రవ్యాలను కొంత తీసి బలి చేస్తున్న వ్యక్తి మెడకు పులమాలి."

"ఆ తరువాత, అంబే, అంబికా, మొదలైన గ్రంథ పాఠాలూ, రౌద్ర, భైరవ మంత్రపాఠాలూ చదవాలి. ఆ విధంగా పునీతుడైన వ్యక్తిని రోగాలు సమీపించవు, ఆ వ్యక్తిని దేవి కాపాడుతుంది. అతడు దుఃఖాన్నిగాని తదితరమైన మానసిక కలవరం గాని పొందడు, బంధువు మరణం గాని జననంగాని అతనిని మైలపరచలేవు.

  

బలి ఇస్తున్న వ్యక్తిని తాళ్లతోటీ మంత్రాలతోటీ బంధించిన తర్వాత, అతని శిరస్సు ఖండించి తగు జాగ్రత్తతో దేవికి సమర్పించాలి. ఎవరైనా తన శత్రువుల పెరుగుదల తరుగుదలలకు అనుగుణంగా ఈ బలులు ఇవ్వాలి. శత్రువుల వినాశనం కోసం తలలు నరకవలసి వస్తుంది. పవిత్ర మంత్ర విధుల (పాఠాల) ద్వారా శత్రువు ఆత్మను. బలిగా ఇస్తున్న వ్యక్తి శరీరంలోకి రప్పించి, అపుడు బలి ఇస్తే శత్రువు ప్రాణం కూడా పోతుంది.

"మానసికంగాను శారీరకంగాను పవిత్రమైనట్టి నిర్భయుడైనట్టి వ్యక్తి నుంచి పూజకోసం ఎక్కువ రక్తాన్ని తీయాలి; తామరపువ్వు రేకులో దానిని పట్టి సమర్పించాలి. బంగారు, వెండి, ఇత్తడి లేదా ఇనుపగిన్నెలో అయినా ఇవ్వవచ్చు, తగు పద్ధతిలో శ్లోకాలు చదవాలి."

చాకు, గొడ్డలి, బల్లెం వంటివానితో రంధ్రం చేసి రక్తం తీస్తే ఆయుధ పరిమాణాన్ని బట్టి ఆనందం కలుగుతుంది.

తామరపూరేకు పట్టేటంత దానిలో నాలుగోవంతు పరిమాణం మాత్రమే బలి ఇచ్చే వ్యక్తి సమర్పించాలి. ఏ పరిస్థితిలోనూ అంతకంటే ఎక్కువ ఇవ్వనవసరంలేదు, అవసరమైన దానికంటే ఎక్కువ తన శరీరాన్ని కోసుకోకూడదు. ఇష్టపూర్వకంగా తన శరీరం నుంచి రక్తాన్నీ, మాంసాన్నీ సమర్పించే వ్యక్తి ఎల్లిగిసె విత్తు అంత, మాష మంత, నువ్వుగింజంత, పెసర గింజంత పరిమాణంలో శ్రద్ధాభక్తులతో సమర్పిస్తే అతడు కోరుకున్న దానిని ఆరునెలల్లో పొందగలడు."

ఈ నియమాల ప్రకారం యజ్ఞం (హెూమం) చేసిన వ్యక్తి కోర్కెలు చాలవరకు ఫలిస్తాయి.



కాళీ పురాణం బోధించే ధర్మం ఇది.

మనువు ఆదేశించిన ప్రకారం శతాబ్దాల అహింస తరువాత, తంత్రాలు పూర్తి జోరులో హింసను అనుమతించాయి. మానవ హింస, జంతు హింసతో సహా హింస అత్యంత భీకర రూపంలో ప్రజ్వరిల్లింది. కాళీ పురాణంలో రుధిరాధ్యాయంలో బోధించిన హింసా విధానాలు చాల విస్తృతంగా ప్రచారంలోకి వచ్చాయి. జంతుబలి పునరుద్ధరణ తర్వాత, కలకత్తాలోని కాళీ దేవాలయం వద్ద ఏం జరుగుతున్నదనేది ఇందుకు తిరుగులేని తార్కాణం. కాళీ పురాణం వివరించి ఉండకపోతే దేవతను తృప్తిపరచటానికి రోజూ వందలాది మేకలను బలి ఇచ్చే ఆ దేవాలయం పెద్ద కసాయి దుకాణం అయ్యేది. ఈవాడు కాళీదేవతకు నరబలులు ఇవ్వటం లేదు. అయితే ఇదివరకు ఎప్పుడూ ఇవ్వలేదని అనుకోకూడదు. కాళీ పురాణంలో చెప్పినట్టు జంతుబలి ఇచ్చినట్టుగానే నరబలి కూడా జరుగుతుండేదనే దానికి విస్తారమైన ఆధారాలు ఉన్నాయి.

డా॥ రాజేంద్రలాల్ మిత్రా[1] ఇలా అంటారు :

"హిందూస్థానం అంతటా చాలాకాలంవరకూ నరబలి చాలా సామాన్యంగా జరుగుతూ ఉండేదనేది అందరికీ తెలిసిన విషయమే. ఇప్పటికీ భారతదేశం మారుమూలల్లో దేవి సంతృప్తికోసం మనుషులను చంపుతున్నారని అనుమానించేవారు లేకపోలేదు. వామాచార తెగకు చెందిన పాత కుటుంబాలలో పూర్వం దుర్గా పూజలలోనూ, కాళీ పూజలలోనూ నరబలి ఇస్తుండేవారు. బతికి ఉన్న మనిషికి బదులుగా మనిషి బొమ్మను బలి యిచ్చే ఆచారం ఇంకా కొన్ని కుటుంబాలలో ఉన్నది. ఈ బొమ్మ ఒక అడుగు పొడవు ఉండి, ఎండబెట్టిన పాల (క్షీర్) తో చేస్తారు. కాళికా పురాణంలో చెప్పిన పద్ధతిలోనే దీనిని బలి ఇస్తారు; అదనంగా చేసేదేమిటంటే బొమ్మకు ప్రాణం పోయటం కోసం కొన్ని ప్రత్యేకమైన మంత్రాలు చదువుతారు. నా స్నేహితుడు ఒకరు బాబూ హేమచంద్రకెర్ అనే ఆయన ఇరవై నాలుగు పరగణాలలో డిప్యూటీ మాజిస్ట్రేటుగా ఉండేవారు. బెంగాలులో జౌళి పరిశ్రమ గురించి ప్రశస్తమైన పుస్తకం రాశాడాయన. ఆయన ఒకసారి బెంగాలులో తూర్పు జిల్లాలలో ఈ ఆచారం ఎక్కువగా పాటిస్తారని నాతో చెప్పారు; అయితే ప్రతిమను ఒక్క మనిషే నరికే బదులు కుటుంబంలోని వయోజనులంతా కలిసి వేరు వేరు చాకులతోగాని, అందరూ ఒకే చాకు తీసుకొనిగాని నరుకుతారు. దీనిని "శత్రుబలి" అంటే 'శత్రువును బలి ఇవ్వటం' అని అంటారు. నరబలి, శత్రుబలి ఈ రెండు సందర్భాలలోను బలి ఇవ్వటం రహస్యంగా జరుగుతుంది. సాధారణంగా ఇది అర్ధరాత్రి చేస్తారు. కాళికా పురాణంలో ప్రస్తావించిన నరబలి కాకుండా శత్రుబలి అనేది భిన్నమైన ఆచారం. దీనికి ప్రమాణం "బృహన్నీలతంత్ర"లో కనిపిస్తుంది. అందులో చెప్పిన కొన్ని ఇతర ఆచారాలు జరిపిన పిదట రాజు ఎండుపాలతో చేసిన తన శత్రువు బొమ్మను బలి ఇవ్వాలి" అని. దానిని స్వయంగా అతనే నరకాలి. ఆ బొమ్మను తీక్షణంగా చూస్తూ, బాగా లోతుగా దిగేలాగ ఒక్క దెబ్బతో రెండు ముక్కలయ్యేటట్టు నరికి వేయాలి. ప్రాణ ప్రతిష్ఠ ప్రక్రియతో దానికి ప్రాణం పోసిన తర్వాత నాశనం చేయవలసిన వ్యక్తి పేరు ఉచ్ఛరిస్తూ ఆ పని చెయ్యాలి. ఓ మహేశపత్నీ! ఇలా చేస్తే అతడు తన శత్రువులను నిస్సందేహంగా సంహరించగలుగుతాడు."

ఈ సందర్భంగా గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే కాళి శివుని భార్య అని. దీనితో ఉత్పన్నమయ్యే ప్రశ్న ఏమంటే శివుడు జంతుబలిని స్వీకరిస్తాడా? అనేది. ఈ ప్రశ్నకు సమాధానం ఏమంటే శివుడు ఒకప్పుడు జంతుబలి మీదనే జీవించాడని. ఈ వ్యాఖ్యానం ఈనాటి శివభక్తులకు ఆశ్చర్యం కలిగించవచ్చు. కాని ఇది వాస్తవం. దీనికి రుజువు కావాలనుకొనేవారు ఆశ్వలాయన గృహ్యసూత్రాలు పరిశీలిస్తే దొరుకుతుంది. అందులో శివుని సంతృప్తి పరచటానికి చేసిన ఎద్దుబలిని గురించి విపులమైన వర్ణన ఉన్నది. ఆశ్వలాయన

1. 'ఇండో ఆర్యన్స్' సం. 11, పుటలు 109-111.

గృహ్యసూత్ర పాఠాన్ని యథాతథంగా ఇక్కడ ఇస్తున్నాను.[1]

1. ఇపుడు ఎద్దు (రుద్రునికి బలి ఇవ్వటం జరిగింది)
2. ఆకురాలు కాలం లేదా వసంతరుతువు, ఆర్ద్ర (నక్షత్రం)లో
3. తన మందలో ఉన్నది.
4. అది కుష్ఠ రోగంలేనిది, మచ్చలేనిది.
5. నల్లని మచ్చలు ఉన్నాయి (కొంతమంది ప్రకారం).
6. అనుకుంటే నలుపురంగు, లేదంటే రాగిరంగు.
7. బియ్యం, బార్లీ కలిపిన నీరు దానిపై జల్లుతారు.
8. తల నుంచి తోక వరకు.
9. మహాదేవుడైన రుద్రునికి అంగీకారమయ్యేలా (సూత్రంతో) అభివృద్ధి చెందు.
10. దానిని పెరగనీయాలి, పళ్లు కొరుక్కునే వరకు లేదా ఎద్దుగా అయ్యేవరకు.
11. యాగ సంబంధంగా పునీతమైన (దిఙ్మండలంలో) ఒక పావువంతు వరకు
12. గ్రామానికి కనబడని స్థలంలో
13. అర్ధరాత్రి దాటాక.
14. సూర్యోదయం తర్వాత (కొంతమంది ప్రకారం).
15. పండితుడూ ఆచారాలలో అనుభవజ్ఞుడూ అయిన బ్రాహ్మణుని కూర్చోబెట్టాలి. యజ్ఞస్తంభంగా ఆకులున్న కొమ్మను నేలలో పాతిపెట్టాలి. రెండు లతలను గాని, రెండు కుశతాళ్ళనుగాని చుట్టులాగా తీసుకొని ఒకదానిని యజ్ఞ స్తంభం చుట్టూ కట్టాలి. రెండోదానిని పశువు మెడచుట్టూ చుట్టి, "అర్పణ తీసుకువచ్చిన వానికి ఆమోద యోగ్యంగా నిన్ను బంధిస్తున్నాను" అంటూ దానిని యజ్ఞ స్తంభానికి కట్టాలి.
16. నీళ్ళతో సంప్రోక్షణ చేయటం వంటివన్నీ జంతుబలిలో ఎలా చేస్తారో ఇక్కడా అలాగే అదే పద్ధతిలో చేస్తారు.
17. తేడా ఏమున్నదో మేము చెబుతాము.
18. పేగులుండే తిత్తిని పత్రితో సహా అర్పణ చేయనియ్యి. అది శ్రుతి ద్వారా అర్థమయినదే).

1. S.B. of East Vol. XXIX p. 255-259 (Max Muller)

19. (మంత్రసూత్ర యుక్తంగా) "హరా! సర్వా! మృడా, శివా, భవా, మహాదేవా, ఉగ్రా, భీమా, పశుపతీ, రుద్రా, శంకరా, ఈశానా, స్వాహా!"

20. లేదా ఆ సూత్రంలోని ఆఖరి ఆరింటితో

21. లేదా సూత్రంలోని 'రుద్రా స్వాహా ' అనేదానితో-

22. బలి సమర్పణను సూత్ర సహితంగా కుశలవల కట్టుతో ఒక్కొక్కరికీ నాలుగు వృత్తాల మీద నాలుగు దిక్చక్రాలకూ ఇవ్వాలి.తూర్పు దిక్కు గృహ దేవతలను ఉద్దేశించి – "ఓ రుద్రా! పూర్వదిశలో ఉన్న దేవగణాలకు ఈ నివేదన సమర్పిస్తున్నాను. నాకు ఎటువంటి హానీ కలిగించకండి...!" అంటూ నివేదించాలి. అలానే ఇతర దిక్కులలోని రుద్రుని దేవగణాలను ఉద్దేశించి కూడా నివేదనలు చెయ్యాలి.

23. ఈక్రింది నాలుగు శ్లోకాలతో నాలుగు దిక్కులనూ పూజించాలి. అంటే "రుద్రామనం ఏమి చెయ్యాలి?" "ఈ ప్రార్థనలు రుద్రునికి" "ఓ తండ్రీ నీకు" "ఈ శ్లోకాలు బలిష్ఠమైన విల్లుగల రుద్రునికి" (ఋగ్వేదం I-113, 114; II 33; VII 46)

24. రుద్రుని అన్ని యజ్ఞాలలోను ఈ విధమైన దిక్చక్రభాగాల ఆరాధన జరుగుతుంది.

25. బియ్యపు తవుడు, పొట్టు, (బలిపశువు తాలూకు) తోక, చర్మం, తల, పాదాలు అగ్నిలో వేయాలి.

26. సామవత్య ప్రకారం చర్మాన్ని ఏదో ఒక ఉపయోగానికి వాడాలి.

27. అగ్నికి ఉత్తరంగా, దర్భగడ్డి వరుసలపైన గాని కుశగడ్డి వృత్తాలపైనగాని, వలకట్టుగా చేసి 'బుస్సుమంటూ, శబ్దం చేస్తూ వెదకుతూ పట్టుకొనే ఓ పాముల్లారా, ఇక్కడ ఏది ఉన్నా మీదే. తీసుకోండి' అనే అర్థంగల స్తోత్రం పఠిస్తూ బలిపశువు రక్తాన్ని పొయ్యాలి.

28. తరువాత, ఉత్తరం దిక్కున పాముల కేసి తిరిగి 'బుస్సుమనే పాముల్లారా! ఇక్కడున్నవన్నీ మీవే తీసుకోండి' (అంటారు.) అపుడు అక్కడ నుంచి పారుతున్న రక్తాన్నీ పొట్టలో నుంచీ పేగుల్లోంచీ వచ్చినవాటినీ పాములు గ్రహిస్తాయి.

29. అన్ని పేర్లు, అందరు గృహమేధులు, అన్ని ఘనతలు అతనికే చెందుతాయి. ఇవి తెలిసిన యజ్ఞకర్తకు అతడు ఆనందాన్ని ఇస్తాడు.

30. యజ్ఞకర్మకు ఉపక్రమించి కొంత భాగాన్నయినా మాటలతోనైనా మొదలుపెట్టిన వ్యక్తికి, అతను హాని ఏమీ చెయ్యడు; (ఇది శ్రుతి నుంచి అర్థమవుతున్నది).

31. అతడు యజ్ఞంలో భాగస్వామి కాకూడదు.

32. దానికి సంబంధించిన దేనినిగాని గ్రామంలోకి తీసుకువెళ్లకూడదు. ఎందుకంటే ఈ

దేవుడు మానవ ప్రాణులకు హాని చేస్తాడు.

33. యజ్ఞకర్త, తన వారిని, తాను బలి నిర్వహించిన స్థల పరిసరాలకు దూరంగా ఉంచాలి.

34. వ్యక్తమైన ఆజ్ఞ ప్రకారం మాత్రమే (అతడు) బలి ఆహారాన్ని (నైవేద్యాన్ని) భుజించాలి. అది అతనికి అదృష్టాన్ని ఇస్తుంది.

35. ఎద్దును బలి ఇవ్వటం అనేది కర్తకు ఐశ్వర్యాన్నీ, మడి మాన్యాలను, పవిత్రతను. కుమారులను, పశుగణాన్ని, దీర్ఘాయుస్సును కీర్తిని కలిగిస్తుంది.

36. బలి ఇచ్చిన తర్వాత అతడు మరొక పశువును స్వేచ్ఛగా వదలి వేయాలి.

37. అటువంటి జంతువు లేకుండా అతడు ఉండకూడదు.

38. అపుడు పశుగణం లేకుండా అతడు ఉండడు. (శ్రుతిలో ఈ అర్థం ఉన్నది).

39. సంతతీయ మంత్రం జపిస్తూ అతడు ఇంటికి వెళ్లాలి.

40. అతని పశువులకు వ్యాధి సోకినట్లయితే గోశాల మధ్యలో ఆ దేవతకే బలి ఇవ్వాలి.

41. వండిన అన్నం అంతా సంతర్పణ చెయ్యాలి.

42. అగ్నిలో దర్భగడ్డినీ, అజ్యాన్నీ పోసిన తర్వాత ఆ పొగలో నుంచి ఆవును నడిపించాలి.

43. సంతతీయ మంత్రం జపిస్తూ పశువుల మధ్యలోకి వెళ్లాలి.

44. శౌనకునికి సన్నుతులు, శౌచకునికి సన్నుతులు. ఈరోజుల్లో శివుడు జంతుబలిని అంగీకరించటంలేదు. శివపూజారీతులలో ఈ మార్పు అహింసా సిద్ధాంతాన్ని అంగీకరించిన ఫలితంగా వచ్చింది. బ్రాహ్మణులు హింస నుంచి అహింసకు మారిన తర్వాత శివుణ్ణి కూడా హింసక దేవుని నుంచి అహింసా దేవుడిగా మార్చివేశారు. శివుడు అహింసా దేవుడిగా మారిన చాలాకాలం తర్వాత కాళీపూజ పుట్టింది. అయినప్పటికి అతని భార్య కాళిని హింసా దేవతగానే ఉంచారు. దీని ఫలితం ఏమంటే, రక్త పిపాస లేని దేవునికి రక్త పిపాసి అయిన భార్య ఉండటం అనే క్రూరమైన వ్యత్యాసం. ఇది చిక్కుముడికాదా? బ్రాహ్మణులు ఆ పని ఎందుకు చేశారు?

అనువాదం : బొజ్జా తారకం

అనుబంధం : 1

# వేదాల చిక్కుముడి

వేదాలు హిందువుల పవిత్ర గ్రంథాలు. వాటికి సంబంధించి ఉత్పన్నమయ్యే ప్రశ్నలు అనేకం ఉన్నాయి. వాటి మూలం ఏమిటి? వాటి కర్త ఎవరు? వాటి ప్రామాణికత ఏమిటి? ఇవి ఆ ప్రశ్నలలో కొన్ని.

మొదటి ప్రశ్నతో ప్రారంభిద్దాం. హిందువుల ప్రకారం వేదాలు సనాతనమైనవి. దీని అర్థం ఏమిటంటే అవి "నిత్యంగా-ముందు నుంచీ ఉన్నట్టివి"అని. అధర్వణ వేదంలో ఉన్న ఒక వ్యాఖ్యానం మీద ఇది ఆధారపడింది. అంతకుమించి ఈ అభిప్రాయం సరైనదే అని చెప్పటానికి ఇతర ఆధారాలు ఏమీలేవు. అధర్వణ వేదంలో ఇలా ఉన్నది.[1]

"కాలం నుంచి రుగ్వేదం ఉద్భవించింది. యజుర్వేదం కాలం నుంచి ఉద్భవించింది." కాని దీనిని అంగీకరించని ఇతర అభిప్రాయాలు కూడా ఉన్నాయి.

అధర్వణ వేదం నుంచి ప్రారంభిస్తే, ఈ అభిప్రాయంతో పాటు మరో రెండు అభిప్రాయాలను కూడా అదే వేదంలో ప్రవచించటం జరిగింది. వాటిలో మొదటిది అంతహేతుబద్ధంగా అనిపించదు. దాని భావం ఇలా ఉంది.[2]

---

ఈ సంపుటంలోని 2–6 అధ్యాయాలలో చెప్పిన విషయాలను సమగ్రపరచి చెప్పిన అధ్యాయం ఇది. టైపు ప్రతి 61 పుటలు. ఇది కార్బన్ కాపీ. దిద్దుబాట్లు లేవు – సంకలనకర్త

1. అధర్వవేదం – xix 54-3
2. మూయిర్ సంస్కృత గ్రంథాల నుంచి iii సం.3 పుట.

ప్రాక్తన రుషులు, ఘనమైన రుక్సామ యజుస్సులు, భూమి, (ప్రథమ ఉత్పన్నుడైన) ఆ ఒక రుషి ఆధారపడి ఉన్న స్కంభ[1] (ఆధారసూత్రం) ఏమిటో వివరించు. ఎవరి నుంచి రుక్ మంత్రాలను గ్రహించి సూక్ష్మీకరించారో ఎవరి నుంచి యజుర్వేదాన్ని గీరుకున్నారో ఎవరికి సామవేద శ్లోకాలు వెంట్రుకలు గానూ అథర్వణ అంగీరసలు ముఖంగానూ ఉన్నాయో ఆ స్కంభ ఎవరో చెప్పు"

అధర్వ వేదంలో ఇచ్చిన రెండో వివరణ ఏమంటే వేదాలు ఇంద్రుని నుంచి[3] ఉద్భవించాయని.

ఋగ్వేద వివరణ పురుష సూక్తంలో కనిపిస్తుంది. దాని ప్రకారం, విశ్వవ్యాప్తమైన యజ్ఞం ఒకటి జరిగింది. అందులో యాగపశువు పురుషుడనే మార్మిక జీవి. ఈ పురుష యజ్ఞంలో నుంచి ఋగ్వేదం, సామ, యజుర్వేదాలు మూడూ వచ్చాయి.

సామవేదంలోగాని యజుర్వేదంలోగాని వేదాల పుట్టుకను గురించిన ప్రసక్తి లేదు.

ఇక, బ్రాహ్మణులుగా వ్యవహారంలో ఉన్న రచనలు పరిశీలించినపుడు, శతపథ బ్రాహ్మణం, తైత్తిరీయ బ్రాహ్మణం, ఐతరేయ బ్రాహ్మణం, కౌషితకి బ్రాహ్మణాలలో వేదాల మూలం గురించి వివరణ ఇవ్వటానికి చేసిన ప్రయత్నాలు కనపడతాయి.

శతపథ బ్రాహ్మణంలో అనేక వివరణలున్నాయి. వేదాల మూలం ఇది ప్రజాపతికి ఆపాదిస్తున్నది. దీని ప్రకారం "ప్రజాపతి తన తపోమహిమతో భూమి, గాలి, ఆకాశం అనే మూడులోకాలను సృష్టించాడు. ఈ మూడు లోకాలకూ వెచ్చదనాన్ని కల్పించాడు. ఆ విధంగా వేడి ఎక్కటం వల్ల, వాటిలో నుంచి మూడు జ్యోతులు ఉద్భవించాయి. అవి-అగ్ని, వాయువు, సూర్యుడు. వాటిలో నుంచి మూడు వేదాలు ఉద్భవించాయి. అగ్నిలో నుంచి ఋగ్వేదం, వాయువులో నుంచి యజుర్వేదం, సూర్యునిలో నుంచి సామవేదం ఉద్భవించాయి.

ఐతరేయ కౌషితకి బ్రాహ్మణాలలో కూడా ఇలాంటి వివరణలే ఉన్నాయి. ప్రజాపతి నుంచి వేదాలు ఉద్భవించాయని చెప్పే వివరణకు భిన్నమైన మరో వివరణ శతపథ బ్రాహ్మణం ఇస్తున్నది. అది ఏమిటంటే ప్రజాపతి వేదాలను నీటిలో నుంచి సృష్టించాడని. శతపథ బ్రాహ్మణం ఇలా చెబుతున్నది.

"పురుషుడైన ఈ ప్రజాపతి 'నేను వృద్ధి చెందుదునుగాక. నేను ద్విగుణీకృత మవుదును గాక" అని ప్రస్తుతించాడు. భక్తిలో నిమ్నగమై కఠోరమైన తపస్సు ఆచరించాడు. ఆ విధంగా మొదట త్రివేద శాస్త్రమైన దివ్యజ్ఞానాన్ని సృష్టించాడు. ఇది ఆయనకు ఆధారమైంది.

---

1. స్కంభ అంటే ధారణ చేసే పరమాత్మ, సర్వజగద్ధారకుడు అనే అర్థం చెప్పారు. అథర్వవేదం x-7-14.
2. అథర్వవేదం x 7-20
3. మూయిర్ సంస్కృత గ్రంథాల నుంచి ఉదహరించినది.

అందుకనే జనులు 'దివ్యజ్ఞానమే ఈ విశ్వానికి ఆధారం' అని అంటారు. వేదాలు అభ్యసించిన మనిషికి పటిష్ఠమైన ఆధారం దొరుకుతుంది. ఎందుకంటే దివ్యజ్ఞానమే ఆ ఆధారానికి పునాది గనుక. ఈ పునాది మీద నిలబడి, అతడు (ప్రజాపతి) కఠోరమైన తపస్సు చేశాడు. వచస్సు నుంచి ఆత్మ ప్రపంచంగా జలాలను సృష్టించాడు. వాక్కు (సూత్రాత్మ యొక్క అధిదైవికం) అతనిది. అతడు వాక్కును సృష్టించాడు. అస్థిత్వంలో ఉన్న సమస్తాన్నీ ఆమె ఆవహించింది. ఆమె ఆవహించినందువల్ల (ఆప్నోతి) జలాలను 'ఆపః' అంటారు. సమస్తాన్నీ ఆమె కప్పివేసి ఉంచటం వల్ల (ఆవ్రినాత్) జలాలను "వర్" అని అంటారు (ప్రాణానికి జలం శరీరం) ఈ జలాల నుంచి నేను వృద్ధి అవుదును గాక' అని అతను ప్రస్తుతించాడు. త్రివేద విజ్ఞానంతో అతడు జలాలలోకి ప్రవేశించాడు. అపుడు ఒక అండం ఉద్భవించింది. దానికి ఉద్దీపన కలిగించి అది కలుగుగాక, కలుగుగాక, తిరిగి కలుగుగాక' అని అన్నాడు. అప్పుడు మొదట త్రివేద శాస్త్రమైన దివ్యజ్ఞాన సృష్టి జరిగింది. అందుకనే జనులు ఈ ప్రపంచంలో మొదట ఉద్భవించినది దివ్యజ్ఞానమే అని అంటారు. అంతే కాకుండా, ఆ పురుషుని ముందు భాగం నుంచే దివ్యజ్ఞానం వెలువడింది. అందువల్లనే అది అతని ముఖంగా సృష్టిఅయింది. అందువల్లనే వేద పారంగతుడైన మనిషిగురించి 'అతను అగ్నివంటివాడు అని అంటారు ఎందుకంటే 'దివ్యజ్ఞానమే అగ్నిముఖం.'

"తడిసిన కట్టెలు మంటపెడుతున్నపుడు పొగ వివిధ ఆకారాలలో వెలువడే రీతి గానే, ఆ మహాపురుషుని శ్వాస కూడా (వెలువడింది). ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం అధర్వ – అంగీరసలు ఇతిహాసాలు, పురాణాలు, విద్యలు (ఉపాసనలు), ఉపనిషత్తులు, శ్లోకాలు, నీతి వాక్యాలు, వివిధ రాజుల వ్యాఖ్యానాలు– ఇవన్నీ అతని శ్వాసలే."

శతపథ బ్రాహ్మణంలో మూడవ[1] వివరణ ఇలా ఉన్నది.

"సముద్రం నీ ఆసనంగా నిన్ను ప్రతిష్ఠిస్తాను." మనస్సే సముద్రం. దేవతలు వచస్సును పారగా గ్రహించి ఆ మహాసముద్రం నుంచి మూడు వేదాల విజ్ఞానాన్ని తవ్వి తీశారు. అందుకనే ఈ శ్లోకాన్ని పఠించారు. "పదునైన పారలు తీసుకొని దేవతలు తవ్వి తీసిన నైవేద్యాన్ని ఎక్కడ ఉంచారో ఈ రోజున ప్రకాశమానమైన దేవత తెలుసుకో గలగాలి. మనస్సు సముద్రం. వచస్సు పదునైన పార. మూడు వేదాల విజ్ఞానం నైవేద్యం. దీనిని ప్రస్తావిస్తూ ఆ శ్లోక పఠనం జరిగింది. దీనిని అతడు మనస్సులో నిక్షేపించుకుంటాడు.

తైత్తిరీయ బ్రాహ్మణం మూడు వివరణలు ఇస్తున్నది. వేదాలు ప్రజాపతి నుంచి వచ్చాయని ఇది చెబుతున్నది. ప్రజాపతి ముందు సోమరాజును సృష్టించాడనీ, అతని తర్వాత మూడు వేదాలను సృష్టించాడని కూడా[2] అది చెబుతున్నది. ప్రజాపతితో ఏ మాత్రమూ సంబంధంలేని మరొక వివరణ కూడా[3] ఇది ఇస్తున్నది.

---

1. మూయిర్ 19-10 పుటలు
2. అదే పుస్తకం పుట 8.
3. అదే పుస్తకం, పుట 10.

"వచస్సు (మాట) నశ్వరం కాని వస్తువు, క్రతువులో నుంచి మొదట జన్మించినది వేదాలకు తల్లి, అమరత్వానికి కేంద్ర బిందువు. మనపట్ల సంతోషపడి ఆమె యజ్ఞం వద్దకు వచ్చింది. పండితులైన ఋషులు, వేద మంత్రకర్తలు, దేవతలు తీవ్ర తపస్సుతో కఠినతరమైన నిష్ఠతో ఏ దేవతనయితే శరణు పొందుతారో, ఆ దేవత నాప్రార్థన ఆలకించటానికి సిద్ధంగా ఉండాలి." వీటి అన్నిటి తలదన్నేటట్టుగా తైత్తిరీయ బ్రాహ్మణం మూడో వివరణ ఇస్తున్నది. వేదాలు ప్రజాపతి గడ్డంలోనుంచి వచ్చాయని అది చెబుతున్నది.

వేదాల మూలానికి సంబంధించిన గాథలు ఉపనిషత్తుల్లో కూడా కనిపిస్తాయి.

ఛాందోగ్యోపనిషత్తులో ఇచ్చిన కథ శతపథ బ్రాహ్మణంలో ఇచ్చిన దానివలెనే ఉంటుంది. అంటే ఋగ్వేదం అగ్నిలోనుంచి, యజుర్వేదం వాయువులోనుంచి సామవేదం సూర్యునిలోనుంచి వచ్చినవని.

శతపథ బ్రాహ్మణంలో ఒక భాగమైన బృహదారణ్యకోపనిషత్తు పూర్తిగా భిన్నమైన గాథను చెపుతుంది. అది ఇలా ఉంది.

(మృత్యువు లేదా లయకారుడుగా గుర్తింప బడిన) ప్రజాపతి వాక్(మాట)ను సృష్టించాడని అంటారు. ఆమె ద్వారా ఆత్మతో కూడుకొని (మిధున భావం పొంది) వేదాలతో సహా సమస్త వస్తువులనూ సృష్టించాడు."

ఆ వాక్కుద్వారా, ఆ ఆత్మద్వారా ఋగ్వేదం, యజుర్ సామవేదాలు ఛందస్సులు యజ్ఞాలు, ప్రాణులు, జంతువులు ఒకటేమిటి అన్ని వస్తువులను అతను సృష్టించాడు. మూడు వేదాలూ మూడు వస్తువులతో (వాక్, మనస్సు, శ్వాస) ఏకాత్మక మవుతాయి. వాక్కు ఋగ్వేదం, మనస్సు యజుర్వేదం, శ్వాస (ప్రాణం) సామవేదం".

స్మృతులను తీసుకుంటే, మనుస్మృతిలో వేదాల మూలానికి సంబంధించి రెండు సిద్ధాంతాలు ఉన్నాయి. ఒకచోట, వేదాలను బ్రహ్మ సృష్టించాడని ఉన్నది.

"అతడు (బ్రహ్మ) మొదట్లో వేదశబ్దాల నుండి సకల జీవరాసుల వివిధమైన పేర్లు, కార్య కలాపాలు, వాటి ప్రత్యేక పరిస్థితులు రూపొందించాడు. ఆ ప్రభువు చేతనమైన సజీవమైన దేవతల చతుర గణాన్ని, సాధ్యులను అనంత యాగాన్ని కూడా సృష్టించాడు. యజ్ఞం చేసే నిమిత్తం అతడు అగ్ని నుంచి వాయువు నుంచి సూర్యుని నుంచి ఋగ్వేదం యజుర్వేదం సామవేదంగా ప్రసిద్ధి పొందిన అనంతవేదత్రయాన్ని బయటకు తీశాడు.

మరొకచోట ప్రజాపతిని వేదాలకు మూలంగా చెప్పే కథను అంగీకరించినట్టు కనిపిస్తుంది. అది ఈ క్రింది భాగం నుంచి స్పష్టమవుతుంది.

"ప్రజాపతి మూడు వేదాల నుంచి 'అ', 'ఉ', 'మ' అనే మూడు అక్షరాలను భూః, భువః,

స్వః అనే పదాలను పిండాడు. సర్వోత్కృష్టుడైన ఆ ప్రజాపతియే మూడు వేదాల సారంగా వ్యాహృతులలో 'తత్‌'తో మొదలయ్యే సావిత్రి (గాయత్రి) అనే మంత్రాన్ని కూడా పిండాడు. ఓంకారాన్ని అనుసరించి వెలువడినదీ, అనశ్వరమైనదీ ఈ మూడు గొప్ప వ్యాహృతులూ (భూ, భువః, స్వః) కలిదీ అయిన మూడు పాదాల గాయత్రిని బ్రహ్మ నోరుగా భావిస్తారు."

వేదాల మూలం గురించి పురాణాలు ఏం చెబుతున్నాయో తెలుసుకోవటం కూడా చాలా ఆసక్తి దాయకంగా ఉంటుంది. విష్ణు పురాణం ఇలా చెబుతున్నది.

"తన తూర్పు నోటి నుంచి బ్రహ్మ గాయత్రిని ఋక్ శ్లోకాలను, త్రివృత్‌సోమము రథంతరను, యజ్ఞాలను, అగ్నిష్టోమాలను రూపొందించాడు. దక్షిణముఖం నుంచి యజుర్ శ్లోకాలను, త్రైష్టుప ఛందస్సును, పంచదశ స్తోమాన్ని, బృహత్ సామాన్ని ఉక్త్యను (ఉక్థము) రూపొందించాడు. పశ్చిమపు నోటినుంచి సామశ్లోకాలను, జగతి ఛందస్సును, సప్తదశ స్తోమాన్ని వైరూప అతి రాత్రలను రూపొందించాడు. ఉత్తర ముఖం నుంచి ఏకవింశను (ఇర్వై ఒక్క స్తోమాలను) అధర్వణను, అనుష్టుప్ వైరాజ ఛందస్సులతో ఆప్తోర్యామను రూపొందించాడు.

భాగవత పురాణం ఏం చెబుతున్నదంటే– 'మునుపటి వలె సమస్త ప్రపంచాన్నీ ఎలా సృష్టించటం' అని చతుర్ముఖుడు ఒకానొకప్పుడు ధ్యానమగ్నుడై ఉండగా, వేదాలు ఆచతుర్ముఖ సృష్టికర్తనుంచి ఉద్భవించాయి. తన తూర్పు ముఖం నుంచీ, ఇతర ముఖాల నుంచీ ఋక్, యజుర్, సామ, అధర్వణ వేదాలను, స్తోత్రం, యజ్ఞం, కీర్తనలు, ప్రాయశ్చిత్తంతో సహా రూపొందించాడు.

మార్కండేయ పురాణం ఇలా చెబుతున్నదిః–

"విభాజ్యమైన అండంనుంచి అగోచరమైన పుట్టుక ద్వారా ఉద్భవించిన బ్రహ్మ తూర్పు ముఖం నుంచి, అకస్మాత్తుగా ఋక్ శ్లోకాలు వెడలినాయి. 2. చైనా గులాబీల పోలి ఉండి జ్వాజ్వల్యమానమై, ఒకటి నుండి మరొకటి విడిగా ఉన్నప్పటికీ అంతర్భాగంలో ఒకటిగా ఉండి, రజో గుణంతో విలసిల్లినాయి. 3. ఆతని దక్షిణపు ముఖం నుండి బంగారు రంగులో విడివిడిగా యజుర్ శ్లోకాలు అప్రతిహతంగా వెడలినాయి. 4. ఆ పరబ్రహ్మ పడమటి నోటినుంచి సామవేద శ్లోకాలు ఛందస్సు వెడలినాయి. ఉత్తర దిక్కు ముఖం నుంచి నల్లటి తేనెటీగల, కాటుకరంగులో, ఒక్కోసారి అత్యుగ్రంగానూ ఒక్కోసారి మామూలుగానూ కనిపిస్తూ ఇంద్రజాలికుని మాయలను సైతం మరపించగలిగిన సామర్థ్యంతో పవిత్రత, కల్మషమూ, సౌందర్యమూ, వికారమూ కలగలిసిన లక్షణాలు కలిసి ఉన్న అధర్వణ వేదం వెడలింది. ఋక్‌శ్లోకాలు రజో గుణంతోను యజుర్‌శ్లోకాలు సత్వగుణంతోను, సామశ్లోకాలు తమోగుణంతోను అధర్వణం తమోగుణం, పవిత్ర గుణాలతోను ప్రసిద్ధి చెందాయి.

హరివంశం బ్రహ్మకూ ప్రజాపతికీ ఇద్దరికీ సంబంధించిన సిద్ధాంతాలను బలపరుస్తున్నది.

"ప్రపంచ విముక్తి కోసం బ్రహ్మగాఢ ధ్యానంలో నిమగ్నుడై చంద్రుని ప్రాంతం నుంచి దివ్య ప్రకాశంతో వెలువడి, గాయత్రి హృదయంలోకి చొచ్చుకొని పోయి, ఆమె కనుల మధ్య ప్రవేశించాడు. ఆమె నుంచి మానవాకారంలో నాలుగింతల జీవుడు, బ్రహ్మవలె ప్రకాశిస్తూ, అనిర్వచనీయుడై, అనంతుడై, అక్షయుడై, అనశ్వరుడై అతీంద్రియుడై (శారీరక భావాలు లక్షణాలు లేనివాడై) ప్రకాశ మాన లక్షణాలతో విలసిల్లుతూ చంద్ర కిరణాలవలె స్వచ్ఛంగా ప్రకాశవంతంగా అక్షర రూపంలో ఉద్భవించాడు. భగవంతుడు ఋగ్వేదాన్ని యజుర్వేదాన్ని తన కన్నులనుంచి, సామవేదాన్ని నాలుక కొసనుంచి, అధర్వణను తలనుంచి రూపొందించాడు. ఈ వేదాలు పుట్టగానే శరీరాన్ని (క్షేత్రం) వెతుక్కున్నాయి. తమ నివాసం కనుక్కున్నాయి కాబట్టి (విందంతి) వాటికి వేద లక్షణం వచ్చింది. ఈ వేదాలు పూర్వం అస్తిత్వంలో ఉండిన శాశ్వతుడైన బ్రహ్మను (పవిత్ర విజ్ఞానం) దేవ రూపంలో ఉన్న పురుషునిగా తమ మనోభావ లక్షణాలతో సృష్టించాయి."

ఇది కూడా మూలా ప్రజాపతే అని అంగీకరిస్తున్నది. పరమాత్ముడు ప్రపంచాన్ని సృష్టించాలని తలంచినపుడు, హిరణ్య గర్భుడు లేదా ప్రజాపతి తన నోటి నుంచి 'ఓం' అనే శబ్దాన్ని వదిలి తనను తాను విభజించు కోవాలనుకున్నాడు. ఆ ప్రక్రియ ఎలా చేయగలనా అని అతనికే పెద్ద అనుమానం వచ్చింది. హరివంశం ఇలా చెబుతున్నది.

"అతడు ఆ విధంగా ఆలోచనా మగ్నుడై ఉండగా, అతని నోటినుంచి 'ఓం' కారనాదం వెలువడి, భూమి, గాలి, ఆకాశాల మధ్య ప్రతిధ్వనించింది. దేవాధి దేవుడు దానిని పునశ్చరణ చేస్తూ ఉంటే మనస్సు యొక్కసారం, వషట్కారం అతని హృదయంలో నుంచి బయలు దేరింది.ఆ తర్వాత, ఘనమైన స్మృతినుంచి రూపొందిన, పవిత్రమైన పర్వశ్రేష్ఠమైన వ్యాహృతులు(భూః, భువః, స్వః) శబ్ద రూపంలో భూమి, గాలి, ఆకాశాల నుంచి ఉద్భవించాయి. అపుడు ఇరవై నాలుగు అక్షరాలలో దివ్యమైన ఛందోదేవత (గాయత్రి) ప్రత్యక్షమయింది. 'తత్'తో ఆరంభమైన ఆ దివ్య మంత్రాన్ని అవలోకిస్తూ ప్రభువు సావిత్రిని రూపొందించాడు. అపుడు అతని ప్రార్థనలతో క్రతువులతో ఋక్, సామ, అధర్వణ, యజుర్వేదాలను రూపొందించాడు.

ఇక్కడ వేదాల మూలం గురించి పదకొండు విభిన్నమైన వివరణలు మనకు లభ్యమయ్యాయి. (1) పురుషుని నిగూఢ యజ్ఞం నుంచి ఉద్భవించినవని, (2) స్కంభపై ఆధారపడినవని (3) అతని శరీర భాగాల నుంచీ వెంట్రుకల నుంచీ వచ్చినవని (4)ఇంద్రుని నుంచి ఉద్భవించినవని, (5) కాలం నుంచి ఉద్భవించినవని (6) అగ్నినుంచి ఉద్భవించినవని (7) ప్రజాపతి నుంచీ జలాల నుంచీ ఉద్భవించినవని (8) బ్రహ్మ నిశ్వాసంగా వచ్చినవని (9) మనో సముద్రం నుంచి దేవతలు తవ్వి తీసినవని (10) ప్రజాపతి గడ్డంలోనుంచి వచ్చినవని (11)వచస్సు సంతతి అని.

ఒక చిన్న ప్రశ్నకు దిగ్భ్రాంతి గొలిపే అనేకమైన సమాధానాలు రావటం అనేదే ఒక చిక్కుముడి. ఈ సమాధానాలు అన్నీ ఇవ్వటానికి ముందుకు వచ్చిన రచయితలందరూ బ్రాహ్మణులే. వారందరూ ఒకే వైదిక సిద్ధాంతానికి చెందినవారు. ప్రాచీన మత సంబంధమైన విద్యకు వారు ఒక్కరే రక్షకులు. ఒక సాధారణ ప్రశ్నకు ఇటువంటి పరస్పర విరుద్ధమైన అర్ధాన్నమైన సమాధానాలు వారు ఎందుకు ఇచ్చారు?

## II

వేదాల రచయిత ఎవరు? వేదాలు మానవాతీత శక్తి నుంచి ఉద్భవించాయని హిందువుల నమ్మకం. సాంకేతిక పదం వాడాలంటే వేదాలు అపౌరుషేయాలు, అంటే మనిషి (రచించినవి) చేసినవి కాదు, అని.

ఈ అభిప్రాయాన్ని బలపరచటానికి సాక్ష్యం ఏమిటి? ప్రాచీన సంస్కృత వాఙ్మయంలో అనుక్రమణి(క)లు అనే ఒక తరగతి రచనలు ఉండేవి. ప్రాచీన వైదిక వాఙ్మయంలోని వివిధ భాగాలకు ఇవి క్రమానుగతమైన అనుబంధాలుగా ఉండేవి. ప్రతి వేదానికి ఒక అనుక్రమణి(క) ఉండేది, కొన్ని సార్లు ఒకటికంటే ఎక్కువ అనుక్రమణి(కలు) ఉండేవి. ఋగ్వేదానికి ఏడు అనుక్రమణి(క)లు ఉన్నట్టు తెలుస్తున్నది. అయిదు శౌనకుడు, ఒకటి కాత్యాయనుడు తయారు చేశారు. మరొక దాని రచయిత పేరు తెలియరాలేదు. ఆత్రేయి, చారాయణీయ, మధ్యందిన శాఖలు మూడింటికీ ఒక్కొక్కటి చొప్పున యజుర్వేదానికి మూడు అనుక్రమణిలు ఉన్నాయి. సామవేదానికి రెండు అనుక్రమణిలు ఉన్నాయి. ఒక దానిని ఆర్షేయ- బ్రాహ్మణం అనీ, రెండో దానిని పరిశిష్ట అనీ అంటారు. అధర్వణ వేదానికి ఒక అనుక్రమణి ఉన్నట్టు తెలుస్తున్నది. దీని పేరు బృహత్-సర్వాను క్రమణి(క).

ప్రొఫెసర్ మాక్స్-ముల్లర్ ప్రకారం అనుక్రమణి లన్నింటిలో ఋగ్వేదానికి ఉన్న సర్వానుక్రమణి ఉత్తమమైనది. (1) ప్రతి మంత్రానికి మొదటి పంక్తులు (2) పాద సంఖ్య, (3) దానిని రచించిన ఋషి కుటుంబం (4) అధి దేవతల పేర్లు (5) ప్రతి సూక్తానికి వాడిన ఛందస్సు ఇవ్వటంలో దీని ప్రాముఖ్యత తెలుస్తున్నది. సర్వానుక్రమణిని పరిశీలించినపుడు తెలిసేదేమంటే ఋగ్వేదానికి సమకూర్చిన మంత్రాలను ఋషులు రాశారని. కాబట్టి అనుక్రమణి అందజేసిన సాక్ష్యాన్ని బట్టి ఋగ్వేదం మానవులు తయారుచేసిన గ్రంధం తప్ప వేరేమీ కాదని స్పష్టమవుతున్నది. ఇతర వేదాలకు సంబంధించి కూడా ఇదే నిర్ణయానికి రావచ్చు.

ఋగ్వేదంలో ఉన్న మంత్రాలను తాము రాసుకున్నామని ఋషులు అనేక చోట్ల అభివర్ణించుకున్నందువల్ల ఆ అనుక్రమణి(క)లు వాస్తవమని రుజువవుతున్నది.

అటువంటి భాగాలు కొన్ని క్రింద పొందుపరచటమైంది.

"నిన్ను కణ్వులు ప్రార్థిస్తున్నారు. వారి ప్రార్థనలు శ్రద్ధగా ఆలకించు"

"అశ్వారూఢుడవైన ఓ ఇంద్రా! గౌతములు నీకోసం ఫలప్రదమైన మంత్రాలు చేయనీ.

"ఐశ్వర్యవంతులైన అశ్వినులారా మానసులు ఈ మంత్రాన్ని మీకోసం ఫలప్రదంగా తయారు చేశారు.

"ప్రవర్ధకమైన ఈ ప్రార్థనామంత్రాన్ని ఓ అశ్వినులారా! గృత్సమదులు మీకోసం రాశారు."

"ఓ ఇంద్రా! స్వర్గాన్ని ఆశించి, నిన్ను ప్రస్తుతిస్తూ కుశిక రుషి ఈ మంత్రాన్ని రచించాడు."

ఓ ఇంద్రా! సనాతనుడవూ, అశ్వారూఢుడవూ అయిన నీ కొరకు గౌతముని సంతతివాడైన నాధుడు ఈ కొత్త మంత్రాన్ని కూర్చాడు".

"ఓ పరాక్రమవంతుడా, ఉపకారాన్ని ఆశించి, మనుషులు పనులు చేసే విధంగా నీ కొరకు గృత్సమదులు ఒక మంత్రాన్ని రూపొందించారు."

"ఋషులు ఇంద్రునికోసం ఫలవంతమైన పంటనూ ఒక స్తోత్రాన్నీ ఉత్పాదించారు."

ఓ అగ్నిదేవా! నీకోసం ఈ మంత్రాలు రచింపబడ్డాయి. గోవులు, గుర్రాల సమృద్ధిలో నీ ఔదార్యాన్ని ప్రదర్శించు.

పవిత్ర సత్యసంభూతమైన, మహితమైన ఈ సప్త శీర్ష మంత్రాన్ని మా తండ్రి ఆవిష్కరించాడు. సర్వజన మిత్రుడైన అయాస్యుడు, ఇంద్రుని కీర్తిస్తూ నాల్గవ స్తోత్రాన్ని రూపొందించాడు."

రహు గణానికి చెందిన మేము మకరంద వచస్సులతో అగ్నిని స్తుతిస్తున్నాము. నిరంతర కీర్తనంతో మేము ఆయనను శ్లాఘిస్తున్నాం. "(ఆ విధంగా) ఓ అదితి ఆదిత్యులారా! పాలక శక్తులారా! విజ్ఞుడైన ప్లాతి కుమారుడు మిమ్ములను శోభ స్కరులను చేశాడు. సనాతనుడైన గయ (గయుడు) స్వర్లోక వాసులను శ్లాఘిస్తున్నాడు.

"ఎవరినైతే ఋషి అనీ, పురోహితుడనీ, పవిత్ర యజ్ఞకర్త అనీ మంత్రోచ్చాటన కర్త అనీ అంటారో, ఎవరికి తేజోమూర్తి అయిన అగ్నియొక్క మూడు రూపాలూ తెలుస్తాయో అతడు విశేషఖ్యాతితో వర ప్రదాయకుడుగా ప్రసిద్ధుడవుతాడు" వేదాలు అపౌరుషేయాలనే సిద్ధాంతాన్ని అంగీకరించని సాక్ష్యాధారాలలో అనుక్రమణికలు అందించే ఆధారాలేకాక మరొక సాక్ష్యం కూడ ఉన్నది. ఋషులు సైతం వేదాలు మానవ కల్పితాలనీ, చారిత్రక నిర్మితాలని (గ్రంథాలనీ) భావించారు. ఋగ్వేద మంత్రాలు ప్రాచీన ఆధునిక ఋషులమధ్య వ్యత్యాసాన్ని గుర్తిస్తున్నాయి. అందులో ఇవి కొన్ని-

"ప్రాచీన, ఆధునిక ఋషుల చేత స్తుతింప దగిన అగ్ని, దేవతలను ఇక్కడకు తీసుకొని వస్తాడు."

'నీ సహాయం కోసం నిన్ను ఆవాహనం చేసిన ప్రాచీన ఋషులు శ్లాఘించారు".

"ఆధునిక ఋషినైన నా ఈ ఆధునిక మంత్రాన్ని విను. దప్పిక గొన్న వానికి మంచి నీరువలె నిన్ను పొగిడిన పూర్వ ఋషులకు ఆనంద ప్రదాతవైన ఓ ఇంద్రుడా! ఈ మంత్రంతో నిన్ను పదే పదే ఆవాహన చేస్తాను".

ఉజ్జ్వల జ్ఞానంగల ప్రాచీన ఋషులు ప్రీతికరమైన వాక్కులతో (బృహస్పతిని) ఆహ్వానించుకొన్నారు.

ఓ మాధవుడా! ప్రాచీనులు గాని, ఆ తరువాతి వారుగాని ఈ ఆధునిక మానవులలో ఎవరుగాని నీ శక్తులను తెలుసుకోలేక పోయారు."

"ఇంద్రుని పూర్వపు ఆరాధకుల వలెనే మేము కూడా దోషరహితులము అనింద్యులము నిరపాయులముగా ఉందుముగాక!".

శక్తివంతుడవైన ఓ దైవమా! పాతతరాల మానవులూ మధ్య కాలానికి ఆ తరువాతి కాలానికి చెందిన మానవులూ నీ మిత్రులవలె ఉన్నట్లే ఇప్పుడూ మానవులు నీ ఆరాధకులుగా ఉన్నారు. ఓ సంస్తవనీయా! ఇక అత్యంత ఆధునికులను గురించి ఆలోచించు!"

మన తాత తండ్రులూ, నవగ్వా ఋషులలోని ఏడుగురూ ఆహారం కోసం మంత్రాలతో అతనిని (ఇంద్రుని) ఆశ్రయించారు".

"మా (కొంగొత్త మంత్రంతో మహిమాన్వితుడవై మాకు వంశాభివృద్ధి, ఐశ్వర్యము, ఆహారమూ ప్రసాదించుదువు గాక."

ఋగ్వేదాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తే పాత మంత్రాలకు, కొత్త మంత్రాలకు వ్యత్యాసం ఉన్న విషయం తెలుస్తుంది. వాటిలో కొన్నిటిని దిగువ పొందుపరచడమైంది.

ఓ అగ్నీ! ఈ మా క్రొంగొత్త మంత్ర నివేదనను దేవతలకు ప్రకట పరచావా (ప్రకటపరుస్తావా)"

వీర్య వంతుడవు, పురాంతకుడవు అయిన నీవు మా కొత్తమంత్రాలు విని శక్తివంతమైన దీవనలతో మాకు ఆలంబన (అగుదువుగాక)."

శక్తిపుత్రుడైన అగ్నికి, ఆలోచనా సముద్భూతమైన వాక్కుతో ఒక కొత్త, శక్తివంతమైన మంత్రాన్ని సమర్పిస్తున్నాను".

శక్తియుతుడైన రక్షకునికి, మనోజనితమై (ఇపుడే) ఉద్భవిస్తున్న ఒక కొత్త ఉద్గారాన్ని

సమర్పిస్తున్నాను."

వీరుడవూ, మేఘ నిస్వనుడవూ అయిన నిన్ను ఈ కొత్త స్తోత్రం మాకు తోడ్పడేటట్లు ప్రేరేపించుగాక!"

సనాతనులారా! మీకు ఈ కొత్త స్తోత్రం ద్వారా ప్రేరణ కల్పిస్తాను, జీవం ఆశిస్తాను'.

ఈ కొత్త మంత్రాలు నిన్ను శ్లాఘించటానికే రూపొందించ బడ్డాయి. ఈ ప్రార్థనలు నిన్ను తృప్తి పరచుగాక!"

ఓ శోభరి! యవ్వన శోభతో, పరాక్రమంతో తేజస్సుతో అలరారే దేవతలను ఒక కొత్త మంత్రంతో కీర్తించు.

వృత్రాసుర సంహారీ; మేఘ గర్జనుడవూ అనేకమంది ప్రార్థనలు అందుకుంటున్న వాడవూ అయిన ఓ ఇంద్రా! నీ భక్త జనులలోని వారమైన మేము అపూర్వమైన మంత్రాలను నీకు సమర్పించుకుంటున్నాం".

"ఈ సనాతన దేవతకు నా ఈ కొత్త ప్రార్థనను అతడు ఇష్టపడేరీతిలో వినిపిస్తాను అతడు మా ప్రార్థన ఆలకించుగాక".

అశ్వాలను పశుగణాన్ని, ఐశ్వర్యాన్ని కోరుతున్నవారమై, మమ్మల్ని సమీపించవలసిందిగా నిన్ను ఆమంత్రిస్తున్నాము."

వేదాలు మానవ కృతాలు అని నిరూపించటానికి విస్తారమైన ఆధారాలు ఇంత పుష్కలంగా ఉండగా వేదాలు అపౌరుషేయాలనే విపరీతమైన సిద్ధాంతాన్ని బ్రాహ్మణులు ఎందుకు అంత గట్టిగా ప్రచారం చేస్తున్నారో అనేది ఒక చిక్కుముడి. అటువంటి అభిప్రాయాన్ని బ్రాహ్మణులు ప్రచారం చేయటానికి ఏమిటి కారణం ?

## III

వేదాల ప్రమాణం ఏమిటి? దీనికి సంబంధించి హిందువులలో రెండు స్పష్టమైన సిద్ధాంతాలు వ్యాప్తిలో ఉన్నాయి. మొదటిది వేదాలు శాశ్వతమనీ స్వతః ప్రమాణాలనీ. ఇక్కడ ఒకసారి ఆగి ఈ సిద్ధాంతాన్ని పరిశీలిద్దాం. అసలు ఇటువంటి అభిప్రాయానికి ఆధారం ఏమిటి? ప్రపంచంలోనే వేదాలు అత్యంత ప్రాచీనమైన గ్రంధాలని హిందువులు గనుక విశ్వసిస్తున్నట్లయితే, దానితో ఎవరికీ పేచీ ఏమీలేదు. అసలు వాటికి ఆది అనేదే లేదు అనే అర్థం వచ్చేటట్టుగా అవి శాశ్వతమైనవనే అసాధారణమైన భావన పెట్టుకోవటానికి మాత్రం న్యాయ సమ్మతమైన ఆధారాలు ఏమీలేవు. వేదాలను ఋషులు రచించారని ఒకసారి నిర్ధారణ అయిన తర్వాత, వేదాలకు ఒక మొదలు (ఆది) అంటూ ఉన్నదనీ, అది ఆ ఋషులు కాలంతో సంబంధించి ఉంటుందనీ నిరూపించటానికి ఇంకా అదనపు ఆధారాలు ఏమీ అక్కరలేదు.

వేదాలను రచించిన వారు ఋషులని తేలిపోయిన తర్వాత అవి శాశ్వతమైనవని(నిత్యమైనవని) సిద్ధాంతీకరించటం అర్థం లేనిదే అవుతుంది.

అనేక కారణాలు చూపుతూ ఈ సిద్ధాంతాన్ని నిలబెట్టటానికి ప్రయత్నాలు జరిగాయి. ఆ కారణాలు కూడా అంత అర్థం లేనివీను.

మొదటగా, వేదాలను దేవుడు సృష్టించాడని చెప్పటంతో ఈ సిద్ధాంతం ఆగిపోదు. నైయాయికులనే ఒక తరగతి తత్వవేత్తల ఆలోచన అది. కాని ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే ఈ విషయంలో ఎవరి సిద్ధాంతాలైతే హిందువుల సిద్ధాంతాలుగా రూపొందాయో ఆ పూర్వ మీమాంస రచయిత అయిన జైమిని మాత్రం ఈ వాదనను అంగీకరించటం లేదు. మీ మీమాంసకుల ఈ క్రింది ఉల్లేఖనం ఉదహరించ దగినది.

"కాని,(మీమాంసకుడు ఇలా అడుగుతున్నాడు) అశరీరుడైన పరమేశ్వరునికి(భగవంతుడు) నాలుక గాని, మాట్లాడటానికి మరే ఇతర అంగంగాని లేదుకదా, అటువంటపుడు వేదాలు ఆయన పలికినవని ఎలా చెబుతారు? (వేదాక్షరాలు ఆయన ఎలా పలికి ఉంటాడు? (నైయాయికుడు సమాధానం చెబుతున్నాడు) ఈ అభ్యంతరం అంత సంతోషించదగినది కాదు. ఎందుకంటే పరమేశ్వరుడు స్వభావ సిద్ధంగా అశరీరుడే అయినప్పటికీ, తన లీలద్వారా, తన భక్తులను సంతృప్తి పరచటం కోసం ఒక శరీరం దాలుస్తాడు. ఫలితంగా, వేదాలను ఒక వ్యక్తి ఎవరూ రచించలేదనే వాదనలలో సహేతుకత లేదు.

"(మీమాంసకుడు అంటున్నాడు) ఇపుడు నేను ఈ చిక్కులనన్నీ విడదీస్తాను. నిరూపించాలని ప్రయత్నిస్తున్న ఈ పౌరుషేయత్వం అంటే అర్థం ఏమిటి?" మనవంటి వారు రోజూ ఉచ్చరించే విధంగానే అవి ఒక వ్యక్తి (పురుషుని)ద్వారా వచ్చినట్టివనా? లేక (2) మనలాంటి వ్యక్తులు గ్రంధం రచించే పద్ధతిలోనే, ఇతర రుజు విధానాల ద్వారా సేకరించిన విజ్ఞానాన్ని ప్రత్యక్ష పరిచే ఉద్దేశంతో క్రమబద్ధం చేయటం అనా? మొదటి అర్థాన్ని ఉద్దేశించి నట్లయితే పేచీ ఏమీ లేదు. రెండోది ఉద్దేశించినట్లయితే, అసలు వేదం (అ) అనుమాన ప్రమాణాన్ని బట్టి ప్రామాణికమైనదా (ఆ) మానవాతీతమైన సమాచారం ద్వారా కనుగొన బడినట్టిది కాబట్టి ప్రామాణికమైనదా అని నేను అడుగుతున్నాను. ఇందులో మొదటి ప్రత్యామ్నాయం (అ) అంటే ఊహ మీద ఆధారపడి ప్రామాణికత సంతరించుకున్నదనేది) సరియైనది అవదు. ఎందుకంటే ఈ సిద్ధాంతాన్ని ప్రమాణాలతో ప్రమేయంలేని ఊహాత్మక రచనలైన మాలతీ మాధవం లేదా అలాంటి ఏ ఇతర లౌకిక కావ్యాలలోని వాక్యాలకు అన్వయిస్తే ఇది వీగి పోతుంది. ఇది కాకుండా రెండో వాదన (ఆ) అంటే ప్రామాణికత కలిగిన ఇతర పుస్తకాలకంటే వేదాలలోని అంశాలు భిన్నంగా ఉంటాయని మీరు అంటే ఈ సంజాయిషీ కూడా తత్వవేత్తను తృప్తిపరచలేదు. ఎందుకంటే వేదవాక్యాన్ని అది ఏ ఇతర సాక్ష్యాధారాలతోనూ నిరూపించటానికి వీలులేనటువంటి వాక్యం అని నిర్వచించారు. ఇతర ఆధారాల ద్వారా

నిరూపించగలిగిన విషయాలను నిరూపించటం తప్ప వేదవాక్యం వేరేమీ చేయటం లేదని ఇపుడు నిర్ధారించగలిగితే, తన తల్లి గొడ్రాలు అని ఒక మనిషి చెప్పే వైరుధ్యంలోకి మనం దిగిపోతాం. దీనిని (ఈ విషయం సందర్భంలో) మనిషి ఒప్పుకున్నట్లయితే, స్థలంతో కాలంతో, ప్రకృతితో నిమిత్తం లేకుండా తన నుంచి తొలగించిన వస్తువులను చూడగలిగే సాధనాలు ఏవీ లేకపోయినా ఇంద్రియాలకు అందుబాటులో లేని వస్తువులను అతను చూడగలగాలన్నమాట. లేదా అట్టి జ్ఞానాన్ని ఉత్పత్తి చేసే శక్తి అతని కళ్లకు ఇతర ఇంద్రియాలకు మాత్రమే ఉందనీ అనుకోలేము. ఎందుకంటే మనిషి తాను చూసిన దానితో పోల్చి చూసుకొని మాత్రమే భావనలకు చేరగలడు. సర్వజ్ఞుడైన గ్రంధకర్త ఒకరు ఉన్నారనే అభిప్రాయాన్ని ఖండిస్తూ ఇదే విషయాన్ని గురువు (ప్రభాకరులు) చెప్పారు. 'సంపూర్ణ సాధకతతో (దృష్టి ఇంద్రియంతో) ఎక్కడైనా, ఏ వస్తువునైనా చూసినప్పుడు ఆ గ్రహణ శక్తి ఆ ఇంద్రియపు క్రమ పరిధికి పరిమితమైనది మాత్రమే అవుతుంది. ఎందుకంటే ఏ ఇంద్రియం కూడా తన శక్తిని మించి గ్రహించలేదు. ఉదాహరణకు చెవి ఒక ఆకారాన్ని చూడలేదు. అందువల్ల వేదాల ప్రమాణం సాకారుడైన దైవం పొందిన అతీంద్రియ సమాచారం ద్వారా సంపాదించినది అయి ఉంటుందనే ప్రసక్తే లేదు."

వేదాలు నిత్యమైనవనే సిద్ధాంతం నిలవటానికి హేతువు ఏది అయి ఉంటుంది? జైమిని పూర్వమీమాంసలో చెప్పిన వాక్యాలను ఉదహరిస్తే ఈ హేతువును బాగా గ్రహించగలుగుతారు.

"దీనికి ముందు చెప్పిన సూత్రంలో, శబ్దాలకు వాటి అర్థాలకు ఉన్న సంబంధం శాశ్వతమైనదని ప్రకటించటం జరిగింది. ఈ శాశ్వత సంబంధం శబ్దాల (పదాల) శాశ్వతత్వంపై ఆధారపడి ఉంటుందనే దానిని నిరూపించ గోరి సమస్య మొదటి భాగం అంటే శబ్దం శాశ్వతం కాదని భావించే వారి సిద్ధాంతంతో ప్రారంభించటానికి మొదలు పెట్టాడు.

"కొందరు అంటే న్యాయ తత్వాన్ని అనుసరించే వారు శబ్దం అనేది ప్రయత్న ఫలితం అని అంటారు. ఎందుకంటే ఇది ఒక ప్రయత్నం వల్లనే వెలువడుతున్నదని మనం చూస్తున్నాం కాబట్టి. అది శాశ్వతమైనదే గనక ఇలా అనటానికి వీల్లేదు."

"ఇది (శబ్దం) క్షణభంగురం కావటం వల్ల అంటే, ఒక క్షణం తర్వాత అది మనకు గోచరం కాదు కాబట్టి శాశ్వతంకాదు.

"ఎందుకంటే, దీనికి సంబంధించి 'చేయటం' అనే పదాన్ని మనం ఉపయోగిస్తాం. అంటే శబ్దం చేయటం అని మనం వాడతాం."

"ఎందుకంటే, ఒకేసారి అది వివిధ వ్యక్తులకు గోచరమవుతుంది. ఫలితంగా దూరంగా ఉన్నవారికీ దగ్గరగా ఉన్నవారికీ ఉభయుల ఇంద్రియాంగాలకు వెంటనే అది తాకుతుంది. అది ఒకటే అయి శాశ్వతమైనదే అయితే ఇది సాధ్యంకాదు."

"ఎందుకంటే శబ్దాలకు అసలు (మూల) రూపం ఒకటి మార్పు చెందిన రూపం ఒకటి ఉంటాయి. ఉదాహరణకు, దధి అత్ర అనేది దధ్యత్రగా మొదటి అక్షరం పరస్పర మార్పిడి సూత్రాల వలన మారింది. మార్పు పొందే ఏ వస్తువూ శాశ్వతంకాదు. ఎందుకంటే శబ్దం దానిని చేసేవారి సంఖ్యను బట్టి ఎక్కువవుతూ ఉంటుంది. ఫలితంగా, 'శబ్దం వ్యక్తమవుతుంది అంతే. అది సృష్టించబడదు' అనే మీమాంసకుని అభిప్రాయం, సరియైనదికాదు, ఎందుకంటే వేయి దీపాల కాంతిలో పెట్టి చూపినా జాడీని పెద్దదిగా ఎలా అయితే చేయలేమో ఆ విధంగానే వ్యక్తపరచ వలసిన వస్తువును వ్యక్తపరిచేవారు వేయిమంది వున్నా ఆ వస్తువును పెద్దదిగా చెయ్యలేరు."

శబ్దం చేసే వారి ద్వారా శబ్దం వ్యక్తమవుతుంది గాని సృష్టించబడటం లేదు, అనే మీమాంసకుల సిద్ధాంతానికి వ్యతిరేకంగా ఉన్న అభ్యంతరాలకు సమాధానం, ఈ క్రింది సూత్రాల ద్వారా లభిస్తుంది.

"కాని ఈ రెండు సిద్ధాంతాలు అంటే, శబ్దం సృష్టించబడుతుంది, శబ్దం వ్యక్తం మాత్రమే అవుతుంది (ఆవిష్కరింపబడుతుంది), అనే వాటి ప్రకారం, దాని గ్రహణం, రెండు చోట్లా క్షణమాత్రమే, అయితే ఈ రెండు ఉద్దేశాలలోను, వ్యక్తీకరణ (ఆవిష్కరణ) సిద్ధాంతం సరైనదని తరువాతి సూత్రంలో చూపటం జరిగింది. ఏ ప్రత్యేకమైన సమయంలో అయినా, వాస్తవంగా ఎప్పుడూ ఉండే శబ్దాన్ని గ్రహించలేకపోతే, శబ్దంచేసే వ్యక్తి తన లక్ష్యంతో అంటే శబ్దంతో సంబంధం పెట్టుకోలేదని అర్థం. శబ్దం శాశ్వతమైనది. ఎందుకంటే, ఉదాహరణకు 'కె' అనే అక్షరం మనకు ఎప్పుడూ ఒకేలా వినిపిస్తుంది కాబట్టి దాన్ని గుర్తిస్తాం. ఎందుకంటే ఇది అదే అనే విషయాన్ని చెప్పటానికి ఇది చాల సులువైన మార్గం గనుక. వక్తనోటి నుంచి వెలువడే శబ్ద తరంగాల కదలికల (కలవడం విడిపోవటం) మూలంగా శబ్ద గ్రహణానికి అడ్డుపడే నిశ్చల వాతావరణం తొలగించబడుతుంది. తద్వారా కనిపించకపోయినా ఎప్పుడూ ఉండే శబ్దం వ్యక్తమవుతుంది. అది క్షణ భంగురం" అనే అభ్యంతరానికి ఇది సమాధానం.

"శబ్దం చేయడం" అనే మాటకు అర్థం, దానిని వినియోగించటం లేదా పలకటం అని మాత్రమే.

"ఒకే సూర్యుణ్ణి అందరూ ఏకసమయంలో చూసినట్టుగా ఒక శబ్దం ఒకేసారి వివిధ వ్యక్తులకు వినబడుతుంది" సూర్యుని వలెనే శబ్దం విస్తారమైనట్టిది. అది చిన్న వస్తువుకాదు. ఒకరికొకరు దూరంగా ఉన్నా వివిధ వ్యక్తులకు అది ఒకే విధంగా వినిపిస్తుంది.

10వ సూత్రం క్రింద ప్రస్తావించబడ్డ ఉదాహరణలోని అంటే, దధ్యత్రలోని, 'ఇ'కి బదులుగా వాడిన 'య' అనే అక్షరం, 'ఇ'కి వచ్చిన మార్పు కాదు, అది వేరే అక్షరం. దాని ఫలితంగా శబ్దం మార్పు చెందలేదు.

మాట్లాడే వాళ్లు ఎక్కువగా అయితే పెరిగేది 'గొడవ' మాత్రమే, శబ్దంకాదు. వినేవాని చెవిలోకి వివిధ దిక్కుల నుంచి వాయు తరంగాలు కలుస్తూ విడిపోతూ ఒకేసారి ప్రవేశించటం వల్ల ఈ ధ్వని (గొడవ)లో పెరుగుదల జరుగుతుంది.

"శబ్దం శాశ్వతమైనది, ఎందుకంటే దాని ఉచ్చారణ శ్రోతలకు ఒక అర్థాన్ని అందించేదిగా అది రూపొందించబడింది. అది శాశ్వతం కాక పోయినట్లయితే దానిని వినే వ్యక్తి దాని అర్థాన్ని గ్రహించేటంత వరకూ అది కొనసాగదు. అలా కొనసాగకుండా ఆగిపోయినట్లయితే వినేవ్యక్తి దాని అర్థాన్ని గ్రహించలేక పోతాడు".

"శబ్దం శాశ్వతమైనది. ఎందుకంటే ఒకేసారి అనేక మంది వ్యక్తులు దానిని సరిగ్గానూ ఒకే విధంగానూ గ్రహిస్తారు కాబట్టి. అంతేకాదు, అందరూ ఒకేసారి పొరబడతారని ఊహించటం కష్టసాధ్యం.

"గోవు" శబ్దాన్ని పదిసార్లు ఉచ్చరించినపుడు, వినేవారు 'గో' శబ్దాన్ని పదిసార్లు ఉచ్చరించారు, అనే చెబుతారు కాని, పది మాటలు ఉచ్చరించారు అని అనరు; శబ్దం శాశ్వతమనే దానికి ఋజువుగా ఈ వాస్తవాన్ని 20వ సూత్రంలో ఉదహరించటం జరిగింది."

"ప్రతి శబ్దమూ ఉచ్చరించేటపుడు సంఖ్యా పరంగా అది భిన్నంకాదు."

"శబ్దం శాశ్వతమైనది, ఎందుకంటే అది నాశనమవుతుందని ముందుగా గ్రహించటానికి ఆధారాలు ఏమీలేవు."

"కాని, శబ్దం అనేది గాలి కదలికల (వాయు సంయోజనం) వల్ల వస్తుంది కనుక అది వాయు రూపాంతరం అని చెప్పటానికి అవకాశం ఉంది. ఎందుకంటే శబ్ద పరిస్థితిని బట్టి గాలి వస్తుందని "శిక్ష" (ఉచ్చారణ గురించి చెప్పే వేదాంగం) చెబుతున్నది. అందువల్లనూ, అది గాలి నుంచి ఉత్పత్తి అవుతుంది గనుకనూ అది శాశ్వతం కావటానికి వీల్లేదు". ఈ చిక్కుకు సమాధానం 22వ సూత్రంలో ఉన్నది 'శబ్దం' వాయు వికృతి (రూపాంతరం) కాదు, ఎందుకంటే అదే అయితే, శ్రవణేంద్రియానికి తాను గ్రహించదగిన వస్తువు అంటూ ఏదీ ఉండదు. గాలిలో వచ్చే ఏ వికృతులను గాని (స్పర్శించదగినదని నైయాయికులు అంటారు). శ్రవణేంద్రియం గ్రహించలేదు. స్పర్శించటానికి సాధ్యంకాని శబ్దంతోటే అది వ్యవహరిస్తుంది.

"శాశ్వతమైన స్వరంతో ఓ! విరూపా!" అని వేదంలో కనిపించే ఒక వాక్యం ద్వారా శబ్దం శాశ్వతమని నిర్ధారణ జరిగింది. ఈ వాక్యం మరో అర్థాన్ని ఉద్దేశించినదైనప్పటికీ, అది భాష శాశ్వతమనీ, అందువల్ల శబ్దం 'శాశ్వతమనీ ప్రకటిస్తున్నది.'

సాధారణ వాదానికి దిగితే, శబ్దం నిత్యమైనది. 'వేద వాక్యాలు శబ్ద మయాలు కాబట్టి వేద వాక్యాలూ నిత్యమైనవి. ఈ అసంగతమైన వాదానికి హద్దులు లేవు. చిక్కుముడి ఏమంటే, వేదాలు శాశ్వతం అనే సిద్ధాంతాన్ని బ్రాహ్మణులు ఎందుకు ప్రవచించారు? ఈ సిద్ధాంతానికి

ఆధారంగా అర్థం పర్థంలేని వాదనలను బ్రాహ్మణులు ఎందుకు చేపట్టారు? వేదాలు దేవుని వాక్యమనే దృక్పథాన్ని అంగీకరించటానికి బ్రాహ్మణులు ఎందుకు నిరాకరించారు?

వేదాలకు సంబంధించి రెండో సిద్ధాంతం ఏమిటంటే, అవి పవిత్రమైనవే కాదు, అమోఘమైనవి కూడా అని. వేదాలకు అమోఘత్వాన్ని ఆపాదించటానికి బ్రాహ్మణులు ఎందుకు యత్నించారో తెలుసుకోవటం కష్టం. ధర్మం అనే పదాన్ని కచ్చితమైన అర్థంలో తీసుకుంటే వేదాలలో ధర్మం (శాసనం) లేదు.

నైతికత దృష్ట్యా వేదాలు ధర్మాన్ని ప్రబోధించటం లేదు. వేదాల నుంచి ఈ క్రింది ఉదాహరణలు చూస్తే అవి నైతికతకు ఏ మాత్రమూ అనుగుణంగా లేవు, అని తేలుతుంది. ఋగ్వేదంలోని యమ యమీ (వీరిద్దరూ అన్నాచెల్లెళ్లు) సంవాదం ఇలా ఉంది :

యమి – నా మిత్రుణ్ణి నేను మైత్రికి ఆహ్వానిస్తున్నాను. విశాలమైన నిర్జనమైన, సముద్రాలను దాటి వచ్చిన మేధోవంతుడవైన అద్భుత లక్షణాలు కలిగిన నీవు నీ సంతానాన్ని ఈ క్షేత్రంలో ఉంచుదువు గాక.

యముడు – నీ మిత్రుడు కోరుతున్న మైత్రి ఇలాంటిది కాదు. (ఇది నిషిద్ధం) ఎందుకంటే, (మన) వంశమూలం. ఒకటే. రూపం మాత్రం వేరు. భిన్నమైనది. అసుర పుత్రులైన వీరకుమారులు ఘనకీర్తివంతులై స్వర్గ రక్షకులుగా ఉన్నారు.

యమి – మర్త్యులకు నిషిద్ధమైన ఈ కలయికలో అమరులు సంతోషం పొందుతారు. నీ మనస్సు నా మనస్సుతో కలవనీ, అందరికీ మూల పురుషుడైన సృష్టికర్త తన కుమార్తెకు భర్త అయినట్టే నీవు నా శరీరాన్ని అనుభవించుదువు గాక!

యమ – ఇంతకు ముందు జరిగినది మనం తిరిగి చేయటం లేదు. ఎందుకంటే ఇప్పుడు ఒక సత్యాన్ని నమ్ముతూ మనం మళ్ళీ దానికి విరుద్ధంగా (సత్యం కానిదాన్ని) ఎట్లా ఆచరించగలం. గంధర్వుడు (సూర్యుడు) గగన మండలంలో ఉన్నాడు. నీరు అతని వధువు. ఆమె మన ఉమ్మడి తల్లి. వివాహ సంబంధం వల్ల ఏర్పడ్డ దగ్గరి బంధువు.

యమ – సర్వజ్ఞుడూ సృష్టికర్తా అయిన త్వష్టి మనిద్దర్నీ భార్యా భర్తలుగా గర్భంలోనే మలిచాడు. ఆయన కార్యాన్ని ఎవరూ భగ్నం చేయలేరు. భూమ్యాకాశాలకు మన ఈ కలయిక తెలుసు.

యమ – అతని తొలినాటి అస్తిత్వం గురించి ఎవరికి తెలుసు. ప్రత్యక్షంగా ఎవరు చూశారు? ఇప్పుడు ఎవరు చెప్పగలరు. మిత్రావరుణుల ఆవాసం విస్తృతమైనది. నీవు చెప్పిన దానికి మనుష్యులకు నరకవాస శిక్ష పడుతుంది.

యమి – యముని మీది వాంఛ అతనితో ఒకే శయ్యపై పడుకోవాలనే కోరిక నన్ను

(యమిని) ఆవహించింది. భార్య తన భర్తకు సర్వం అర్పించినట్లు నేనతనికి సర్వం అర్పిస్తాను. శకటానికి ఉండే రెండు చక్రాలలాగ మనం కలిసి ఒకేసారి శ్రమిద్దాం. సంయోగంలో వివశులమవుదాం.

యమ – దేవతల గూఢచారులు నిరంతరం కనులైనా మూయకుండా అవిశ్రాంతంగా భూమిపై తిరుగుతూ ఉంటారు. వారు ఇవన్నీ గమనిస్తుంటారు. ఓ వినాశకారిణీ! నాతో తప్ప వేరే ఎవరితోనైనా కలువు. శకటం రెండు చక్రాల్లాగా మీరు వివశులు కండి.

యమి – యముని కోసం ఆరాధకులు రాత్రింబవళ్ళు యజ్ఞాలు నిర్వహించెదరు గాక. అతనిపై సూర్యనేత్రం పదే పదే పడుగాక. అతని కోసం (సజాతీయులైన) రాత్రి పగలు, భూమి స్వర్గం ఐక్యమొందుగాక. యమునితో బాంధవ్యం పెంచుకోకుండా యమి ఉండుగాక.

యమ – సోదరి తన సోదరునిగాక ఇతరుని భర్తగా ఎంచుకునే యుగాలు రానున్నాయి. నన్నుగాక మరొకరిని భర్తగా ఎన్నుకొని ఆ సహచరుని కోసం నీ చేతిని దిండుగా అమర్చు.

యమి – భర్తలేని చెల్లెలున్న వాడు కూడా ఒక సోదరుడేనా? సోదరునికి ఆపద కలిగిన ఆమె ఒక చెల్లెలా? కోరిక తీవ్రమైన దాననై నిన్ను గాఢంగా కోరుతున్నాను. నీ శరీరాన్ని, నా శరీరంతో కలుపు.

యమ – నా శరీరాన్ని నీ శరీరంతో కలపలేను. చెల్లెలిని కోరే వాడిని పాపాత్ముడు అంటారు. నాతో తప్ప వేరే ఎవరితోనైనా నీవు ఆనందించు. పవిత్రుడైన ఈ నీ సోదరునికి అటువంటి వాంఛలేదు.

యమి – అయ్యో! యమా! నీవు దుర్బలుడివి. నీ మనస్సు, భావం నాకు అర్థం కావటం లేదు. నిన్ను వేరే స్త్రీ, గుర్రానికి వేసిన జీను (తోలుపట్టీ) లాగా వృక్షాన్ని అల్లుకున్న లతలాగా పెన వేసుకుంటుంది.

యమ – ఓ యమీ! నీవు వేరొకర్ని కౌగలించుకో. చెట్టును అల్లుకున్న తీగలాగా మరొకరు నిన్ను కౌగలించుకోనీ. నీవు అతని ప్రేమను పొందు. మీది ఆనందకరమైన కలయిక అగుగాక."

మరికొన్ని ఉదాహరణలు :

"రాక్షస వినాశనం చేసే అగ్నిదేవుడు మా ప్రార్థన మన్నించి, రాగరూపంలో నిన్నూ దుర్నామ రాగంతో నీ గర్భాన్నీ, గర్భంలోని పిండాన్నీ తొలుస్తున్న దుష్టశక్తులను తరిమివేయుగాక."

"మన ప్రార్థనలు ఆలకించిన అగ్ని (దుర్నామ రాగంలాగ) నీ గర్భాన్నీ, గర్భంలోని పిండాన్నీ తొలుస్తున్న రాక్షసిని సంహరించుగాక."

"గర్భధారణశక్తిని ధ్వంసం చేసి కదలాడే అండాన్ని బీజం చేరుకోకుండా గర్భస్థ శిశువును సంహరించే దుష్టశక్తిని తరిమివేద్దాం."

"భార్యా భర్తల మధ్య చేరి, వారి తొడలను వేరుచేసి, నీ గర్భంలో ప్రవేశించి అండాన్ని తినివేసే దుశ్శక్తిని మనం సంహరిద్దాం"

"సోదరునిలాగ, భర్తలాగ, విటుని లాగ నిన్ను సమీపించి నీ సంతతిని నాశనం చేసే దుశ్శక్తిని నాశనం చేద్దాం".

"నిద్ర ద్వారా లేదా చీకటి ద్వారా నిన్ను మోసగించి నిన్ను సమీపించి నీ సంతతిని నాశనం చేయాలని చూస్తున్న దుశ్శక్తిని నాశనం చేద్దాం."

వేదాలలో రెండు విషయాలున్నాయి. మొదటిది- రుషులు వ్యక్తపరచినట్టుగా ఆర్యుల ఆశలు, కోర్కెలు వాటిలో ఉన్నాయి. మ్యూయిర్ పరిశీలించినట్టుగా –

"ఈ రచనల స్వభావాన్నీ అవి ఉద్భవించిన పరిస్థితులనూ అంత సాక్ష్యాధారాలనూ బట్టి చూస్తే, అవి వాటిని తొలుత గానం చేసిన ప్రాచీన కవుల వ్యక్తిగతమైన ఆశలు, భావాల సహజ వ్యక్తీకరణకు అనుగుణంగా ఉన్నవి తప్ప మరేమీ కాదనిపిస్తుంది. ఈ కీర్తనలలో, ఆర్య ఋషులు తమ ప్రాచీన దేవతల స్తోత్ర గానాలు చేశారు (అదే సమయంలో, ఆ దేవతల కిష్టమైన కానుకలు సమర్పించు కొనటంద్వారా వారిని సంతృప్తి పరచటానికి కూడా ప్రయత్నం చేసేవారు) సాధారణంగా మనుషులు వాంఛించే ఆశీర్వాదాలు- ఆరోగ్యం, ఐశ్వర్యం, దీర్ఘాయువు, పశుసంపద, సంతానం, తమ శత్రువులపై విజయం, పాపక్షమాపణ; కొన్ని సందర్భాలలో స్వర్గ సౌఖ్యం (ఇవన్నీ వారు) కోరుకొనేవారు."

నిరుక్తకర్త అయిన యాస్కుని అభిప్రాయం కూడా ఇదే, ఆయన ఇలా అంటున్నాడు.

ఇంతకుముందటి భాగంలో నిర్దిష్టపరచిన నాలుగు రకాల శ్లోకాలలో (ఎ) పరోక్షమైన దేవుడిని ప్రార్థించేవి, (బి) ప్రత్యక్షంగా ఉన్నదేవుని ప్రార్థించేవి ఉన్నాయి. (సి) ఆరాధకులు అక్కడ ఉపస్థితులై ఉండి దేవుడు పరోక్షంగా (కనిపించకుండా) ఉన్నప్పుడు పలికినవి లెక్కలేనన్ని ఉన్నాయి. (డి) అలా కాకుండా వ్యక్తి (రచయిత) తన గురించి చెప్పుకొన్నవి చాలా తక్కువగా ఉన్నాయి. ఏ ఆశీర్వాదాలు ఆశించకుండానే దేవుడిని ప్రార్థించే మంత్రాలు కూడా ఉన్నాయి. ఉదా: 'ఇంద్రుని వీరకృత్యాలను వెల్లడిస్తాను. (ఋ 1.32) లాంటివి. స్తోత్రం చేయకుండానే ఆశీర్వాదాలు ఆశించేవీ ఉన్నాయి. ఉదా: నా వదనంలోని ప్రకాశవంతమైన కనులతో నిన్ను స్పష్టంగా చూతునుగాక, నా చెవులతో స్పష్టంగా విందును గాక, మొదలైనవి. ఇది అధర్వణ (యజుర్)లోనూ యజ్ఞక్రతు సూత్రాలలోను తరచుగా కనిపిస్తుంది. మళ్లీ ఇందులో ప్రమాణాలు, శాపనార్థాలు కూడా కనిపిస్తాయి. ఉదా: "నేను యాతుధానుణ్ణయితే ఈ రోజే నేను మరణింతును గాక" (ఋ vii 104.15) అంతే కాకుండా (వస్తువుల) ఒక

ప్రత్యేకమైన స్థితిని వర్ణించే ఇచ్ఛకూడా మనకు కనిపిస్తుంది. దీనికి ఉదా: "అపుడు చావూలేదు, అమరత్వమూ లేదు (ఋగ్వేదం x 129, 2). పరిస్థితులనుబట్టి (సన్నివేశాలను బట్టి) దుఃఖ వ్యక్తీకరణలుకూడా కొన్ని కనిపిస్తున్నాయి. ఉదా : (ఊర్వశితో పురూరవుడు) నీ ఈ సుందరుడు వినాశనాన్ని కోరి దూరతీరాలకు వెళ్ళిపోతున్నాడు. ఎప్పటికీ తిరిగిరాడు. (ఋ x 95.14) మొదలైనవి. నిందించటం, పొగడటం కూడా అందులో ఉన్నాయి. ఎవరికీ పెట్టకుండా ఒక్కడు మాత్రమే తాను భుజించేవాడు...నశిస్తాడు.. (ఋ x 117.6) జూదం గురించి కూడా ఇలాగే చెప్పారు. (ఋ x 34.13).

జూదంపై నిషేధం ఉన్నది, వ్యవసాయాన్ని పొగడటమూ కనిపిస్తున్నది. ఆ విధంగా ఋషులు గానం చేసిన ఈ మంత్రాల లక్ష్యాలు అనేకరకాలుగా ఉన్నాయి.

## సూక్తం XII (CL XIII)

క్షయరోగ నివారకుడు అధిదైవం; కశ్యపుని కుమారుడైన వివృహాను ఋషి అనుష్టుప్ ఛందస్సు,

1. నీ కనుల నుంచి, నీ శిరస్సు నుంచి, నీ ముక్కునుంచీ, నీ చెవుల నుంచీ, నీ గెడ్డంనుంచీ మెదడు నుంచి, నీ నాలుక నుంచి రోగాన్ని వెళ్లగొడతాను.

2.నీ మెడనుంచి, నీ నరాలనుంచి, నీ ఎముకల నుంచి నీ కీళ్లనుంచి, నీ భుజ దండంనుంచి, నీ భుజాలనుంచి, నీ మోచేతుల నుంచి రోగాన్ని వెళ్లగొడతాను.

3. నీ పేగుల నుంచి, నీ గుదము నుంచి, నీ గర్భంనుంచి, నీ గుండె నుంచి, నీ మూత్ర పిండాలనుంచి, నీ కాలేయం నుంచి, నీ దేహంలోపలి ఇతర పదార్థాల నుంచి రోగాన్ని వెళ్లగొడతాను.

4. నీ తొడల నుంచి, నీ మోకాళ్ల నుంచి, నీ కాలి మడమల నుంచి, నీ కాలి బొటన వ్రేళ్లనుంచి, నీ నడుమునుంచి, నీ పిరుదుల నుంచి, నీ మర్మావయవాల నుంచి రోగాన్ని వెళ్లగొడతాను.

5. నీ మూత్ర నాళం నుంచి, నీ మూత్రాశయం నుంచి, నీ వెంట్రుకల నుంచి, నీ గోళ్లనుంచి, నీ మొత్తం శరీరం నుంచి రోగాన్ని వెళ్ల గొడతాను.

6. ఒక్కొక్క అవయవం నుంచి, ఒక్కొక్క వెంట్రుకనుంచి, ఒక్కొక్క కీలునుంచి, నీ మొత్తం శరీరంలో నుంచి ఎక్కడ నుంచయితే రోగం పుట్టుకు వస్తుందో అక్కడనుంచి రోగాన్ని వెళ్లగొడతాను.

ప్రొఫెసర్ విల్సన్ అభిప్రాయ పడినట్టుగా రుగ్వేదంలో (అదే ముఖ్యమైన వేదం) ఎక్కడా కూడా తత్వానికి సంబంధించిన ఆలోచన గాని, తర్వాత వచ్చిన తాత్విక చింతనలకు

సంబంధించిన సిద్ధాంత దృష్టిగాని కనబడదు. మనోగత భావాల విశ్లేషణ జాడగాని, ప్రపంచ పునరుద్ధరణకు సంబంధించి పదే పదే చెప్పే సిద్ధాంతానికి సంబంధించిన ఏ విషయంగాని అందులో లేదు. ఆర్యుల జీవితానికి సంబంధించిన సమాచారానికి మూలంగా వేదాలు ఉపయోగపడవచ్చు. ఆదిమ జీవిత చిత్రణగా ఇది ఎంతో ఆసక్తిని రేకెత్తించవచ్చును. అంతేగాని అందులో ఔన్నత్యాన్ని అందించేదేమీ లేదు. ఇందులో సుగుణాలు తక్కువగాను దుర్గుణాలు ఎక్కువగాను ఉన్నాయి.

వేద విషయాల స్వభావమూ, సారాంశమూ చూశాక ఇటువంటి మూఢ విశ్వాసాలు ఉన్న గ్రంథాలను అమోఘమైనవిగా బ్రాహ్మణులు ఎందుకు భావించారో అనేది చిక్కు ప్రశ్నగా మిగులుతుంది.

వేద మంత్రాలు రచించిన ఋషులు, అవి అమోఘమైనవని వారే ప్రకటించుకొని ఉన్నట్లయితే వేదాలు అమోఘమైనవనే సిద్ధాంతానికి కొంత కారణం ఉండేది. కాని ఋషులు అటువంటి ప్రకటన ఏదీ చేయలేదనేది స్పష్టంగా ఉంది.

పైగా తమకు ఆసక్తి, ఉత్సుకత ఉన్న విషయాలకు సంబంధించి తమ అజ్ఞానాన్ని వారు ఆయా సందర్భాలలో చెప్పుకున్నారు కూడ. ఋగ్వేదంలోనే ఋషులు చెప్పినట్లుగా ఉన్న ఈ క్రింది ఉవాచను చూడండి:

"అజ్ఞానినై అల్పమతినై, దేవతల రహస్య నివాసాల గురించి తెలుసుకోవాలను కున్నాను; ఒక ఏడాది వయస్సు లేగ దూడ డెక్కకు (అన్ని వస్తువులకూ స్థానమైన సూర్యునిపై) ఋషులు ఏడు దారాలను విసిరి లాగి బిగించారు.

6. జ్ఞాన స్ఫురణ లేని వాడనై అజ్ఞానంతో తెలియని వాడనై, జ్ఞానులనుండి తెలుసుకోవాలనే జిజ్ఞాసతో తత్వవిదులైన ఋషులను (నేను) అడిగాను. అనభివ్యక్త (విదేహ) రూపంలో ఉండి, ఈ ఆరు లోకాలను మోస్తున్నది (అది) ఏది? అని.

ఈ విధంగా ఉంటే (నన్ను) నేను తెలుసుకోలేను. మనోకల్పితమైన జీవన సంసార బంధాలకు కట్టుబడి విభ్రాంత పడిపోతాను. యజ్ఞం (సత్యం)లో నుండి పుట్టిన ప్రథమ పుత్రులు నా వద్దకు వచ్చినపుడు ఆ వాక్కులోని వాటా (వంతు) ఫలం నేను అనుభవిస్తాను."

అనేక పగళ్లూ అనేక ఉషస్సులూ నిరంతరాయంగా గతించి పోతున్నా, నాశనం కాకుండా (అనశ్వరంగా) మనగలుగుతున్న ఈ స్వర్గాన్నీ, భూమినీ ఏ అడవి లోని ఏ చెట్లనుండి రూపొందించారో?

"ఓ ఋషులారా! మూర్తం, అమూర్తం (స్వర్గం, భూమి) ఈ రెండింటిలో ఏది మొదటిది? ఏది చివరిది? అవి ఎలా ఉద్భవించాయి? వీటిని ఎవరు ఎరుగుదురు?"

"ఓ ఋషులారా! ఎన్ని అగ్నులున్నాయి? ఎందరు సూర్యుళ్లు ఉన్నారు? ఎన్ని ఉషస్సులు ఉన్నాయి? ఎన్ని జలాలు ఉన్నాయి? ఆ విషయాలు నిజంగా నాకు తెలియవు. ఓ తండ్రులారా! వాటిని నాకు తెలియ చెప్పండి. వాటిని గ్రహించగోరి ఆసక్తుడనై అడుగుతున్నాను.

5. అంతర్యామి స్వరూప మనదగిన సూత్రాత్మ ఎటు పొడిగింపబడి ఉన్నది, అది పైకి ఉన్నదా? క్రిందికి ఉన్నదా? దానికి కింద ఉత్పాదకతా మూలాలు, గొప్ప శక్తులు స్వధ (స్వయం ఆధారిత సూత్రం), పైన ఆకాశమూ ఆధారంగా ఉన్నాయి.

6. ఈ సృష్టి ఎపుడు మొదలైందో ఎవరు ఎరుగుదురు ! ఎక్కడనుండి (వ్యాపించిందో) వచ్చిందో ఎవరు వెల్లడిస్తారు? దేవతలు కూడ ఈ విశ్వసృష్టి తరువాతి వారే. అంచేత, ఇది ఎప్పుడు ఉద్భవించిందో ఎవరికి తెలుస్తుంది?

7. ఈ సృష్టి ఎపుడు ఉద్భవించింది? దీనిని ఎవరైనా తయారు చేశారా లేదా, అత్యున్నతమైన స్వర్గంలో ఉన్న వ్యక్తి ఈ విశ్వాన్ని తిలకించగలడు– తెలిస్తే నిజంగా అతనికే తెలియాలి. లేదా అతనికి తెలియదేమో."

ఈ అమోఘతా సిద్ధాంతానికి సంబంధించి గుర్తుంచుకోవలసిన అంశాలు ఇతరమైనవి మరికొన్ని ఉన్నాయి.

## IV

మొదటి అంశం ఏమంటే, ఈ సిద్ధాంతం (అమోఘత్వ సిద్ధాంతం) మౌలికమైనదా లేక భారతదేశ చరిత్రలో తర్వాత ఎప్పుడో ఎవరో ఈ కొత్త వివాదాన్ని లేవనెత్తారా? అనేది సాధారణ అభిప్రాయం ఏమంటే ఈ వాదన మౌలికమైనదే అని. ఈ విషయానికి సంబంధించిన తొలి న్యాయ శాస్త్ర గ్రంథాలైన ధర్మ సూత్రాలను పరిశీలిస్తే ఈ వాదన సరియైనది కాదని తెలుస్తుంది. వేదాలు అమోఘమైనవనే విషయంపై గౌతమ ధర్మసూత్రం ఈ క్రింది సూత్రాన్ని ప్రతిపాదిస్తున్నది.

"పవిత్ర శాసనానికి వేదం మూలం 1.1"

"(వేదాలు ఎరిగిన) వారి సాంప్రదాయం, ఆచరణ"

"సమాన శక్తిగల ప్రమాణాలు రెండు విభేదిస్తే ఇష్టాన్ని బట్టి దేనినైనా అనుసరించవచ్చు" 1.4

వశిష్ఠ ధర్మసూత్రం ఈ క్రింది దృక్పధాన్ని ప్రవచిస్తున్నది.

"ఆవిష్కృతమైన గ్రంథాలను బట్టే ఋషుల సంప్రదాయాలను బట్టే పవిత్ర శాసనాన్ని ధారించటం జరిగింది".1.4 "ఈ రెండూ (ఆధారాలలో ఇచ్చిన నియమాలు) విఫలమైతే.

శిష్టుల ఆచరణ ప్రమాణంగా స్వీకరించాలి". 1.5

"ఎవరి హృదయ మయితే వాంఛా రహితంగా (కోరికలు లేకుండా) ఉంటుందో అతనిని శిష్టుడు అని అంటారు".

బోధాయనుని అభిప్రాయాలు ఇలా ఉన్నాయి.

ప్రశ్న 1. అధ్యాయం 1, ఖండిక 1.

1. ప్రతి వేదంలోను పవిత్ర శాసనం బోధించారు.

2. తదనుగుణంగానే మేము (దీనిని) బోధిస్తాము.

3. సంప్రదాయంలో (స్మృతులలో) బోధించిన పవిత్ర శాసనం ద్వితీయంగా నిలుస్తుంది.

4. శిష్టుల ఆచారం మూడోదిగా నిలుస్తుంది.

5. అసూయ లేనట్టివారు, గర్వంలేనట్టివారు, పది రోజులకు సరిపడే ధాన్యపు నిలవలతో తృప్తి పడేవారు, పేరాశ, కపటం, మిధ్యాచారం, దురహంకారం, లోభం, కలవరం, కోపంలేనివారే శిష్టులు.

6. పవిత్ర శాసనానుగుణంగా వేదాలను అనుబంధాలతో సహా చదివిన వారిని, వాటి నుంచి అన్వయాలను గ్రహించటం ఎరిగినవారిని ఆవిష్కృత గ్రంథాలనుండి ఇంద్రియ గ్రాహ్యమైన నిదర్శనాలను చూపగలిగే వారిని శిష్టులని అంటారు.

7. వారు (శిష్టులు) విఫలమయినప్పుడు కనీసం పదిమందితో కూడి ఉండే ఒక సభ వివాదాస్పదమైన శాసనాంశాలను (న్యాయాన్ని) నిర్ణయిస్తుంది.

8 ఇపుడు వారు ఈ క్రింది శ్లోకాలను ఉదహరిస్తారు.

"నాలుగు వేదాలలో ఒక వేదం గురించి అయినా తెలిసిన వ్యక్తులు నలుగురు, ఒక మీమాంసకుడు, అంగాలను ఎరిగిన వ్యక్తి ఒకరు, పవిత్ర శాసనాన్ని దానిపై ఉన్న గ్రంథాలను పఠించగలిగిన వ్యక్తి ఒకరు, (మూడు వివిధ శాఖలకు చెందిన) ముగ్గురు బ్రాహ్మణులు కలిసి కనీసం పదిమంది సభ్యులుండే సభగా ఏర్పడతారు.

9 పవిత్ర శాసనానికి సంబంధించిన అంశాలను నిర్ణయించటానికి నిష్కళంకులైన సభ్యులు అయిదుగురు గాని, ముగ్గురు గాని ఒక్కరుగాని ఉండవచ్చు. అంతే కాని మూర్ఖులు వేయిమంది దీనిని నిర్ణయించలేరు.

10 పామరులయిన బ్రాహ్మణులు కర్రతో చేసిన ఏనుగు లాగనూ, తోలుతో చేసిన జింకలాగనూ వ్యర్థం. ఆ ముగ్గురూ తమ శాఖల పేరుకు మాత్రమే తప్ప మరెందుకూ పనికిరారు.

ఈ క్రింది భాగం నుంచి ఆపస్తంబ ధర్మసూత్ర దృక్పథం స్పష్టమవుతుంది.

ఇపుడు, నిత్య జీవితంలోని ఆచారాలలో భాగమైన ప్రతిభాశీల కార్యాలను (చెప్పుకుందాం) ధర్మం (శాసనం) ఎరిగినవారి అంగీకారమే (సమయ) ఈ విధులకు ప్రమాణం 1.2

(ఆ తరువాతి దానికి ప్రమాణం) వేదాలు ఒక్కటే. 1.3.

ధర్మ సూత్రాల సమీక్ష వేదాలు అమోఘమైనవని చెప్పే సిద్ధాంతం చారిత్రక ఉత్పాదకం ఎలా అయిందో తెలుపుతుంది. అమోఘత్వ సిద్ధాంతానికి సంబంధించి వివాదం వచ్చినప్పుడు 1. వేదం 2. సంప్రదాయం (స్మృతి), 3. శిష్టాచారం 4. సభాసమయం పండిత సభద్వారా జరిగిన నిర్ణయం, ఈ నాలుగు వివిధ ప్రమాణాలలో దేనిని పరిగణనలోనికి తీసుకోవాలనే విషయం ఇది విశదపరుస్తుంది. వేదాలను అమోఘ ప్రమాణాలుగా పరిగణించని కాలం ఒకటి ఉండేదనే విషయం కూడా ఇది చెబుతున్నది. వశిష్ఠ, బౌధాయన ధర్మ సూత్రాలు ప్రాతినిధ్యం వహించిన కాలం అది. గౌతముని కాలంలో మాత్రమే వేదాలు (పూర్తి అధికారంకలవిగా) ప్రామాణికమైనవిగా పరిగణించటం మొదలయింది. సభవారు అంగీకరించిన నిర్ణయాన్ని ఒక ప్రామాణిక ఆధారంగా అంగీకరించిన సమయమూ ఒకటి ఉన్నది. ఇది బౌధాయనుని కాలానికి సంబంధించినది. ఆఖరిగా, వేదం అసలు ప్రామాణిక గ్రంథమే కాదనీ, పండిత సభలో కుదిరిన ఒప్పందమే ప్రామాణిక ఆధారమనీ చెప్పిన కాలం కూడా ఒకటి ఉన్నదని ఈ సమీక్ష చెబుతున్నది. అది ఆపస్తంబుడు[1] ధర్మసూత్రాలు రాసిన కాలం, అంటే క్రీ.పూ.600 నుంచి 200 మధ్యకాలం.[2] వేదాలు పరమ ప్రామాణికాలు అనే వాదం ఒకానొకప్పుడు లేదనీ వాటికి ఆ ప్రమాణాన్ని అంటగట్టటానికి ఉద్దేశ పూర్వకమైన ప్రయత్నం ఒకటి జరిగిందనీ దీనివల్ల స్పష్టమవుతున్నది. వేదాలు పరమ, ఏకైక, అంతిమ ప్రమాణాలని బ్రాహ్మణులు ప్రచారం చేయటానికి దారితీసిన పరిస్థితులు, ఉద్దేశాలు ఏమిటనేదే ఇపుడు సమస్య.

వేదాల అమోఘతా విషయానికి సంబంధించిన రెండో అంశం ఏమిటంటే బ్రాహ్మణులు అమోఘతా లక్షణాన్ని వేదాలలో కొన్ని రచనలకు మాత్రమే ఆపాదించి, మొత్తం అన్నింటికీ లేకుండా వివక్ష ఎందుకు చూపారనేది. ఈ అంశాన్ని అర్థం చేసుకోవాలంటే ముందుగా వైదిక వాఙ్మయం అనే పదానికి అర్థం ఏమిటో తెలుసుకోవలసిన అవసరం ఉన్నది.

వైదిక వాఙ్మయం అనే పదాన్ని రెండు రకాలుగా చెప్పుకో వచ్చు. పరిమిత అర్థంలో అది 1. సంహిత 2. బ్రాహ్మణాలు 3.అరణ్యకాలు, 4.ఉపనిషత్తులు 5.సూత్రాలకు వర్తిస్తుంది.

---

1. ఆపస్తంబ సూత్రాలలో వేదాల గురించిన ప్రసక్తి విషయంలో పొరపాటు పడకూడదు. ఆపస్తంబుడు వేదాలకు ఏ ప్రమాణాన్నీ ఆపాదించలేదు. వేదాల జ్ఞానం సభలో సభ్యత్వానికి ఎన్నిక కావటానికి ఒక అర్హతగా మాత్రమే ఆయన చెప్పాడు. ఈ సభ అంగీకరించిన నిర్ణయమే శాసనం అవుతుంది. ఆపస్తంబుడు అందరికన్నా ప్రాచీనుడు.
2. ఇది సూత్రాలు వచ్చిన కాలమని మాక్స్‌ముల్లర్ నిర్ణయించాడు.

విస్తృతార్థంలో, 6. ఇతిహాసాలు 7. పురాణాలు అనే మరో రెండు శీర్షికలు కూడా చేరతాయి.

ముందుగా గ్రహించవలసిన అంశం ఏమంటే, ఈ రచనలన్నింటినీ ఒకేతరగతిగా పరిగణించి చూసిన కాలం ఒకటి ఉన్నది అని. వాటి మధ్య ప్రకటమైనవి, భ్రష్టమైనవి అనే ప్రాతిపదిక మీద గాని పౌరుషేయాలు, అపౌరుషేయాలు అనే ఆధారం మీద గాని అధికారికాలు అనధికారికాలు అనే ఆధారం మీదగాని తేడా ఏమీ చూపించని కాలం ఒకటి ఉండేది. శతపథ బ్రాహ్మణం వ్యక్తం చేసిన దృక్పథాన్ని బట్టి ఇది స్పష్టమవుతున్నది. అది ఇలా చెబుతున్నది:

"పురుషుడైన ఈ ప్రజాపతి" నేను వృద్ధి చెందుతాను. నేను ద్విగుణీకృతమవుతాను" అని ప్రస్తుతించాడు. భక్తిలో నిమగ్నమై కఠోరమైన తపస్సు ఆచరించాడు. ఆ విధంగా చేసి తర్వాత త్రివేద శాస్త్రమైన దివ్యజ్ఞానాన్ని సృష్టించాడు. ఇది ఆయనకు ఆధారమైంది. అందుకనే జనులు దివ్యజ్ఞానమే ఈ విశ్వానికి ఆధారం అని అంటారు. దాని మూలంగా వేదాలు అభ్యసించిన వానికి పటిష్ఠమైన ఆధారం దొరుకుతుంది. ఎందుకంటే దివ్యజ్ఞానమే ఆ ఆధారానికి పునాది గనుక. ఈ పునాది మీద నిలబడి అతడు (ప్రజాపతి) కఠోరమైన తపస్సు చేశాడు. వచస్సు నుంచి ఆత్మమయంగా జలాలను సృష్టించాడు. జలం అతని శరీరం సూత్రాత్మయొక్క అధిదైవతం వాక్కు. అతడు వాక్కును సృష్టించాడు. అస్థిత్వంలో ఉన్న సమస్తాన్నీ ఆమె ఆవహించింది. ఆమె ఆవహించినందువల్ల (ఆప్నోతి) జలాలను "ఆపః" అంటారు. సమస్తాన్నీ ఆమె కప్పివేసి ఉంచినందువల్ల (అవ్రినాత్) జలాలను "వర్" అని అంటారు 10. ఈ జలాలనుంచి నేను వృద్ధి అవుదునుగాక అని అతను వాంఛించాడు. త్రివేద శాస్త్రంతో అతను జలాలలోకి ప్రవేశించాడు. అపుడు ఒక అండం ఉద్భవించింది. దానికి ఒక ప్రేరణ అందించి అది కలుగుగాక, కలుగుగాక, తిరిగి కలుగుగాక అని అన్నాడు. అపుడు మొదట త్రివేద శాస్త్రమైన దివ్యజ్ఞాన సృష్టి జరిగింది. అందుకనే జనులు, ఈ ప్రపంచంలో మొదట దివ్యజ్ఞానమే ఉద్భవించింది,' అని అంటారు. అంతే కాకుండా ఆ పురుషుని ముందు భాగం నుంచే దివ్యజ్ఞానం వెలువడింది. అందువల్లనే అది అతని నోరుగా అయింది. అందువల్లనే వేద పారంగతుడైన మనిషిగురించి "అతను అగ్నివంటివాడు, ఎందుకంటే దివ్యజ్ఞానమే అగ్నినోరు" అని అంటారు.

"తడిసిన కట్టెలు (ఊదుతూ, విసరుతూ) మంట పెడుతున్నపుడు వివిధ ఆకారాలలో పొగవచ్చినట్టుగానే, ఆ మహా పురుషుని శ్వాసకూడా (వెలువడింది) ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వ–అంగీరసలు, ఇతిహాసాలు, పురాణాలు, శాస్త్రాలు, (విద్యలు), ఉపనిషత్తులు, శ్లోకాలు, నీతి వాక్యాలు, వివిధ రాజుల వ్యాఖ్యానాలు ఇవన్నీ అతని శ్వాసలో".

బ్రాహ్మణులు, వేదాల అమోఘతా సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించాలని అనుకున్నప్పుడు ఒక వ్యత్యాసాన్ని సృష్టించి వేద వాఙ్మయాన్ని రెండు భాగాలుగా విభజించారు. 1. శ్రుతులు, 2. శ్రుతేతరాలు (శ్రుతులు కానివి) మొదటి భాగంలో అందులో రెండింటిని (1) సంహితలు,

(2) బ్రాహ్మణాలు మాత్రమే ఉంచి వాటికి అమోఘత్వాన్ని ఆపాదించారు. మిగిలినవి శ్రుతులు కాదని ప్రకటించారు. అందువల్ల వాటికి ప్రామాణికత ఏదీ లేకపోయింది. ఈ వ్యత్యాసం ఎపుడు చూపారో చెప్పటం సాధ్యంకాదు. వైదిక వాఙ్మయంలోని శ్రుతి భాగానికి చెందిన విభాగం నుంచి ఆఖరి రెండు రకాలనూ ఎందుకు మినహాయించారో ఎవరైనా అర్థం చేసుకోగలరు. అవి మరీ ప్రాథమికమైనట్టివి, పరిణితి చెందనట్టివి, దాదాపుగా బ్రాహ్మణాలలో చేరినట్టివే అవన్నీ'.

ఆరణ్యాకాలను ప్రత్యేకంగా శ్రుతులలో భాగంగా ఎందుకు పేర్కొన లేదో ఎవరైనా తేలిగ్గా అర్థం చేసుకోగలరు. అవి బ్రాహ్మణాలలో భాగం కావటం వల్ల అవి శ్రుతులలోనూ భాగం అయ్యాయి. ఉపనిషత్తుల విషయం స్పష్టంగా లేదు. వాటిని శ్రుతులలో భాగంగా చేర్చక పోయినట్లయితే, వాటిని ఎందుకు మినహాయించారో అందరికీ బాగా అర్థం అవుతుంది. ఇక, సూత్రాల విషయానికొస్తే వాటికి వేరే కారణాలున్నాయి. వాటిని కచ్చితంగా శ్రుతుల తరగతి నుంచి మినహాయించారు. ఏ కారణాల మీద అలా జరిగిందో తెలుసుకోవటం సాధ్యంకాదు. శ్రుతుల తరగతిలో బ్రాహ్మణాలను చేర్చటానికి సబబు అయిన కారణాలున్నట్లయితే ఆ కారణాలతోనే సూత్రాలను కూడా శ్రుతులలో చేర్చటం న్యాయ సమ్మతమని చెప్పటానికి వీలవుతుంది. ప్రొ.మాక్స్‌ముల్లర్ చెప్పినట్లుగా :

ఒకజాతి తమ ప్రాచీన జాతీయ కవిత్వానికి ఆధారాన్ని ఒక మానవాతీతమైన శక్తికి ఆపాదించటానికి ముందుకు రావటాన్ని మనం అర్థం చేసుకోవచ్చు. మరీ ముఖ్యంగా ఆ కవిత్వం నిండా వారి దేవుళ్ళకు చేసిన ప్రార్థనలూ, శ్లోకాలూ, స్తుతులూ ఉన్నప్పుడు. కాని బ్రాహ్మణాలకు సంబంధించిన గద్యరచనల విషయం వేరు. మంత్రాలకంటే చాలా ఆధునికమైన బ్రాహ్మణాలను శ్రుతి పేరుమీద వ్యాప్తిలోకి తీసుకు రావటానికి కారణం ఏమిటి? పాత కవిత్వపు మంత్రాలలోని సామాన్య స్తోత్రాల నుంచి కాకుండా, వేదాంత సంబంధమైన ఈ నైతిక రచనలనుంచి మాత్రమే. అసంఖ్యాకంగా ఉన్న బ్రాహ్మణులకు లాభించే విధంగా దివ్యమైన అలౌకికమైన అధికారికతను తీసుకు రావచ్చునన్నది కారణం కావచ్చు, కాని, మంత్రాలు, బ్రాహ్మణాలు సమకాలీనమైనవని ప్రతిష్ఠించటానికి బ్రాహ్మణులు చేస్తున్న వాదనలకు మనం ఏమంత విలువ ఇవ్వకపోయినప్పటికీ, భారతదేశం లోని సూత్ర వాఙ్మయం తాను ఇతర భ్రష్ట సాహిత్యంతోనూ పోల్చి చూసుకుంటే అందరూ అనుకునే విధంగా బ్రాహ్మణాలకు మంత్రాలకు చాల ప్రాచీనతను ఆపాదించవచ్చుననే వాదనలో ఏమాత్రం పసలేదని తిరస్కరించటానికి మనకు కారణం ఏమీ కనిపించటం లేదు. పవిత్ర గ్రంథాల సిద్ధాంతం అంటూ ఒకటి ఉన్నప్పుడు, బ్రాహ్మణాల విషయంలో జరిగినట్టుగా మరీ ప్రాచీనమైన పుస్తకాలతో కొత్తగా వచ్చిన పుస్తకాలను కలిపి వేయటం చాల సులువుగా జరగవచ్చును. కాని పవిత్ర గ్రంథావళి నుంచి పాతవీ, వాస్తవికమైనవీ అయిన భాగాలను తొలగించి, వాటికి అనంతర కాలాన్ని ఆపాదించటం అంటూ జరగదు. తీసివేసిన భాగాలలో ఉన్న కొన్ని సిద్ధాంతాల ప్రామాణికతను

తిరస్కరించటంలో కొందరికి (ఒకవర్గానికి) ప్రయోజనం ఉంటే తప్ప, అలా జరగదు. అటు వంటిది జరిగిందని సందేహించటానికి, తర్వాత వచ్చిన సూత్ర వాఙ్మయంలో శంకాస్పదమైనదేదీ కనబడటం లేదు. బ్రాహ్మణాలతోనూ (ఇంకా అవతలివైన) మంత్రాలతోనూ పోల్చినపుడు సూత్రాలను శ్రుతుల శ్రేణిలో చేర్చకుండా ఉండటానికి, అవి అనంతర కాలంలో వచ్చాయనేది తప్ప వేరే కారణం ఏదీ కనిపించటం లేదు. ఋషులు శ్లోకాలు అల్లిన కాలానికీ బ్రాహ్మణాలు వెలువడిన కాలానికీ మధ్య ఎన్నో యుగాలు గతించాయన్న విషయాన్ని బ్రాహ్మణాలు గుర్తించాయా అనే ప్రశ్నకు 'అవున'ని సమాధానం చెప్పటానికి మనం ఏమీ సందేహించనవసరం లేదు. కాని మంత్రాలతో పాటు బ్రాహ్మణాలకు కూడా అదే పేరును (శీర్షికను) అదే కాలాన్ని ఆపాదించటానికి వెనుకాడని భారతీయ వేదాంతులు సూత్రాలకు అదే దైవికమైన ప్రామాణికతను ఆపాదించటానికి సంకోచించటంలో ప్రత్యేకమైన బలమైన కారణం ఏదో ఉన్నదని అనిపిస్తుంది."

మూడవ విషయం : శ్రుతిశబ్దానికీ దాని అమోఘత్వ ఉద్దేశంలో వచ్చిన మార్పులకూ సంబంధించినది. మనువు బ్రాహ్మణాలను శ్రుతుల తరగతి నుంచి తొలగించాడు.[1] అది అతని స్మృతిలో ఉన్న దిగువ భాగం ద్వారా తెలుస్తుంది.

"శ్రుతి అంటే వేదం అనీ స్మృతి అంటే శాసన నియమాలు అనీ అనుకుటే వీటిలోని అంశాలను హేతువుతో ప్రశ్నించటానికి వీలులేదు. ఎందుకంటే వాటినుంచే విధికి సంబంధించిన జ్ఞానం (కార్యాచరణ జ్ఞానం) వెలువడింది. హేతుబద్ధమైన గ్రంథాలపై బ్రాహ్మణాలు ఆధారపడి ఉన్నాయి కాబట్టి, (అవి) ప్రాథమిక జ్ఞానాధారాలను తిరస్కరిస్తాయి కాబట్టి ధార్మికులు వాటిని వేదాలను తిరస్కరించేవిగా దూషించేవిగా బహిష్కరించాలి..13. విధికి విధి ధర్మానికి సంబంధించిన జ్ఞానాన్ని పొందాలనుకునే వారికి శ్రుతులు పరమోత్కృష్టమైన ప్రమాణం.

నాలుగో అంశం : సృష్టిక్రమంలో వేదాలకు ముందే శాస్త్రాలు ఉన్నాయని పురాణాలలో చెప్పిన ప్రకటనకు సంబంధించినది.

వాయు పురాణం[2] ఇలా చెబుతున్నది.

శాస్త్రాలన్నింటికంటె ముందుగా "మొట్టమొదటి బ్రహ్మ పురాణాలను ప్రవచించాడు. ఆ తర్వాతనే వేదాలు అతని నోటిలోనుంచి వచ్చాయి."

వేదాలకంటే ముందు పురాణాల సృష్టి జరిగిందని మత్స్య పురాణం చెప్పటమే కాకుండా ఒకప్పుడు వేదాలకు మాత్రమే ఉన్నాయనుకున్న శబ్ద శాశ్వతత్వ తాదాత్మ్యతా

---

1. వేదం అనే పదంలో 'బ్రాహ్మణ'ం కూడా చేరి ఉందనే ఆధారం మీద కొందరు దీనితో విభేదిస్తున్నారు. ఇది వాస్తవమే. కాని బ్రాహ్మణాలను తొలగించే ఉద్దేశంతోనే మనువు శ్రుతి పదాన్ని కొంత పరిమిత అర్థంలో వాడాడని నాకు అనిపిస్తున్నది. ఈ విషయానికి మనుస్మృతిలో బ్రాహ్మణాలకు సంబంధించిన ప్రస్తావన ఎక్కడా లేకపోవటం అనేది బలాన్నిస్తుంది. ఒక్కచోట మాత్రం (iv. 100) మంత్ర భాగం మాత్రమే పఠించాలని అతను అంటాడు.
2. మూయిర్ సంస్కృత గ్రంథాలలో చెప్పినది. సం. III, పుట 27.

లక్షణాలు కూడా వాటికి ఆపాదిస్తున్నది. అది ఇలా చెబుతున్నది.[1]

"అమరులందరికంటె ముందుగా పితామహ (బ్రహ్మ) రూపొందాడు. ఆ తర్వాత వేదాలను సాంగోపాంగంగా, వాటి విషయక్రమ నిర్మాణ వైవిధ్యంతో సహా గ్రంథ భాగాలకు సంబంధించి వివిధ పద్ధతులతో) వ్యక్తపరచాడు."

3. నిత్యమై, స్వచ్ఛమైన శబ్ద మయమైనదై, వందకోట్ల శ్లోకాల పరిమితి కలదైన పురాణాన్ని శాస్త్రాలలో మొదటగా బ్రహ్మ పలికాడు. ఆ తర్వాత వేదాలు అతని నోటి నుంచి వెలువడినాయి. దానితోపాటు ఎనిమిది అంచెల రుజావుతో మీమాంస, న్యాయదర్శనాలు వెలువడ్డాయి. 5. వేదాధ్యయనంలో నిమగ్నుడై సంతతిని వాంఛించిన అతని (బ్రహ్మ) నుంచి మానస పుత్రులు ఉద్భవించారు. అతని మనసునుంచి వారి సృష్టి జరిగింది. కాబట్టి వారిని మానస పుత్రులు అని అన్నారు.

భాగవత పురాణం కూడా వేదాలతో సమానమైన (అధికారికతను) ప్రమాణాన్ని ప్రకటించుకున్నది. ఇలా అంటున్నది :

వేదాలతో సమానంగా నిలిచే బ్రహ్మరాత్రుడు భాగవత పురాణాన్ని ప్రకటించాడు.

బ్రహ్మ-వైవర్త పురాణం చాలధైర్యంగా వేదాలకంటె గొప్పతనాన్ని చెప్పుకుంటున్నది. అది ఇలా అంటున్నది.

'నీవు ఏ ఋషి గురించి (అడుగుతున్నావో) తెలుసుకోవాలని కోరుకుంటున్నావో ఏమి కోరుతున్నావో అదంతా నాకు తెలుసు. పురాణాల సారమైనదీ, పురాణాలు, ఉపపురాణాలు వేదాలలోని దోషాలను ఖండించేదీ అయిన బ్రహ్మవైవర్త ప్రాశస్త్యాన్ని నేనెరుగుదును".

1. వేదాలు పూర్వంనుంచీ శాశ్వతంగా ఉన్నాయని, 2. వాటిని మనుషులుగాని దేవతలుగాని తయారు చేయ (రచించ)లేదని, 3. అవి అపౌరుషమైనవనీ చెప్పే మూడు చిక్కుముడులనే కాక వేదాలకు సంబంధించిన ఇంకా ఎన్నో చిక్కుముడులను ఈ సమీక్ష బహిరంగ పరిచింది. ఇవేకాక వేదాలకు సంబంధించి ఇంతగానూ సంభ్రమ పరిచే చిక్కుముడులు చాలా ఉన్నాయి. ఒకప్పుడు వేదాలకు అగ్రగామిత్వం (ప్రమాణాదర్శత) గాని, అమోఘత్వంగాని ఉండేదికాదు. వేదాలకు ఈ అమోఘత్వాన్ని ఆపాదించాలని బ్రాహ్మణులు ఎందుకు అనుకున్నారు? 'శ్రుతి' పదం నుంచి సూత్రాలను బ్రాహ్మణులు ఎందుకు మినహాయించారు? అమోఘత్వాన్ని వేదాలకు ఆపాదించటం మానేసి పురాణాలకు ఆపాదించాలని బ్రాహ్మణులు ఎందుకు అనుకున్నారు?

**అనువాదం : డాక్టర్ అంతటి నరసింహం**

**బొజ్జా తారకం**

1. **అదే పుస్తకం, పుట 28.**

అనుబంధం : 2

# వేదాంతం చిక్కుముడి

ప్రాచీన భారతీయ వేదాంతులు ప్రవచించిన ఆరు వేదాంత సిద్ధాంతాలలో వేదాంతతత్వం అత్యంత ప్రసిద్ధి చెందింది. ఇది పేరుగాంచినది కావటమే కాకుండా హిందువులలో, దీనితో పోటీపడేవి ఏవీ సాధించలేనంత పట్టు సంపాదించింది. వేదాలను అనుసరించే ప్రతివ్యక్తి వేదాంతం అంటే గర్వపడతాడు. దానిని తనదిగా అంగీకరించటమే కాకుండా, ప్రపంచ తాత్విక ఆలోచనకు అది అమూల్యమైన సహాయం అందించిందని భావిస్తాడు. వేదాల బోధనకు వేదాంతతత్వం అంతిమమనీ వేదాల బోధనలలోని శ్రేష్ఠ భాగమే వేదాంతతత్వమనీ అతడు భావిస్తాడు. వేదాంతత్వం – వేదాలకు విరుద్ధమైనదిగానూ ప్రతికూలమైనదిగానూ ఉండిన కాలం భారతదేశ చరిత్రలో ఒకటి ఉండేది – అనే విషయాన్ని అతడు కలలో కూడా ఊహించలేడు. వేదాంత శబ్దానికి ప్రస్తుతం వాడుకలో ఉన్న అర్థానికి పూర్తిగా భిన్నమైన అర్థం (ఒకప్పుడు) ఉండేదనీ, దాని ప్రకారం, వేద భావన యొక్క అత్యుత్తమ స్థాయిని "వేదాంతం" అని కాకవైదిక వాఙ్మయ భాండాగారానికి వెలుపల ఉన్న మరొక సిద్ధాంత ధోరణిని వేదాంతంగా పేర్కొనేవారు అనీ అంటే అతడు నమ్మలేడు. కాని వాస్తవం మాత్రం అదే.

వేదాంతతత్వ నిర్మితమైన సాహిత్యానికి సాధారణ నామం అయిన 'ఉపనిషత్తు' పదం

---

"The Riddle of Vendanta" అనే శీర్షికతో 21 పుటలు టైపు చేసి ఉన్న మొదటి ప్రతి ఇది. ఈ అధ్యాయం సంపూర్ణంగా ఉన్నది. ఇందులో రచయిత చేసిన మార్పులు ఏవీ లేవు.

– సంకలనకర్త

నుంచి, వేదాలు, వేదాంతాల మధ్య ఉన్న వైరుధ్యం బయట పడలేదు. 'ఉపనిషత్' అనే పదం ఎలా ఉద్భవించినదో అనే విషయంలో శబ్ద వ్యుత్పత్తి శాస్త్రంలో కొంత అభిప్రాయ భేదం ఉన్నది.

చాలామంది ఐరోపా పండితులు 'సత్' అనే మూలం నుంచి అంటే కింద కూర్చోవటం అనే భావంలో ఈ పదం ఏర్పడిందని అంటున్నారు. 'ని' అంటే క్రింద, 'ఉప' అంటే దగ్గర. ఆ విధంగా ఉపనిషత్ అనే పదం వచ్చిందని అంగీకరిస్తున్నారు. ఒక సభలోగాని లేదా ఒక వ్యక్తి దగ్గర గాని కొందరు ప్రజలు కూర్చోవటం అనే అర్థం ఇది వ్యక్తం చేస్తున్నది. ఈ నిర్వచనాన్ని అంగీకరించటంలో రెండు అభ్యంతరాలున్నాయని ప్రొ॥ మాక్స్‌ముల్లర్ సూచించారు. మొదటిగా, అట్టి మాట వేదాలలోని ఏ ఇతర భాగానికయినా– ఉపనిషత్తులుగా వ్యవహారంలో లేని ఏ అధ్యాయాలకయినా – వర్తిస్తున్నట్టు కనిపిస్తుంది. ఈ అర్థం తర్వాత ఎందుకు పరిమిత మయిందో ఎక్కడా వివరణ లేదు. రెండోది సభ లేదా సమావేశం అనే భావంలో 'ఉపనిషత్ పదం ఎక్కడా కుదరలేదు. ఈ పదం ఎక్కడ వచ్చినా, సిద్ధాంతం లేదా రహస్య సిద్ధాంతం, అనే అర్థంలోనే వచ్చింది. దీనిని రహస్య సిద్ధాంతం ఉన్న తాత్విక గ్రంధ శీర్షికగానే వాడటం జరిగింది. తైత్తిరీయ ఉపనిషత్‌పై శంకరుడు చేసిన వ్యాఖ్యానం 11,9లో ఉపనిషత్తులో పరమానందం ఉన్నదని (పరంశ్రేయోస్యం నిషణ్ణమ్) మూడవ వివరణ ఇచ్చినట్టు ప్రొ.మాక్స్ ముల్లర్ ప్రతిపాదించాడు. దీని గురించి ప్రొ.మాక్స్‌ముల్లర్ ఇలా అన్నాడు.

"ఆరణ్యకాల నిండా అటువంటి శబ్ద వ్యుత్పత్తి అర్థాలు ఉన్నాయి. బహుశః ఇవి మాటల గారడీగా కాకుండా ఏదో విధంగా వాటి అర్థాలను తెలపటానికే ప్రయత్నం చేశాయి."

'సద్' అంటే నాశనం అనే మాటనుంచి ఉపనిషత్తు వచ్చిందని ప్రొ॥ మాక్స్‌ముల్లర్ అభిప్రాయ పడ్డాడు. సద్ అంటే అజ్ఞానాన్ని తొలగించే జ్ఞానం, ముక్తి మార్గంగా, బ్రహ్మ జ్ఞానాన్ని బోధపరుస్తూ, సంసార కారణమైన అజ్ఞానాన్ని తొలగించే జ్ఞానం. దేశీయ పండితులు ఉపనిషత్ అనే మాటకు ఇదే అర్థాన్ని ఏకాభిప్రాయంతో ఇచ్చారని ప్రొ॥ మాక్స్ ముల్లర్ సూచించాడు.

ఉపనిషత్ అనే మాటకు ఇదే సరి అయిన వివరణ అని అనుకుంటే వేదాంతం వేదాలకు విరుద్ధమైన ఒక ఆలోచనా విధానంగా భారతదేశ చరిత్రలో వ్యవహరింపబడిన కాలం ఒకటి ఉండేదనే సిద్ధాంతానికి ఇది సాక్ష్యంగా ఉపకరిస్తుంది. ఈ సిద్ధాంతాన్ని బలపరచటానికి శబ్ద వ్యుత్పత్తి శాస్త్రంపై ఆధారపడవలసిన అవసరం లేదు. దానికంటే మంచివి, ప్రత్యక్షంగా ఉండే ఆధారాలు వేరే ఉన్నాయి. మొదటగా, వేదాంత అనే శబ్దం "వేదాలలో చివరి పుస్తకాలు" అనే అర్థం సూచించటానికి ఎప్పుడూ వాడలేదు. కాని అవి చివరివే. ప్రొ.మాక్స్‌ముల్లర్ అభిప్రాయ పడినట్టుగా –

"వేదాంతం" అనేది వేదాల చివరి భాగాలను సూచించే పారిభాషిక పదంగా (మొదట్లో) లేదు. వైదిక వాఙ్మయ సంగ్రహంలో చివరన ఉంచినది అనిగాని నిజంగానే చివరన ఉన్నది అనిగాని అప్పట్లో దాని అర్థం కాదు, అంతిమం అనీ, వేదాల లక్ష్యం అనీ వాటి ఉన్నత ప్రయోజనం అనీ మాత్రమే వేదాంత పదానికి అర్థం ఉండేది. అయితే, తైత్తిరీయ ఆరణ్యకం లోని (రాజేంద్రమిత్రా సంపాదకుడు పుట 820)కొన్ని పేరాలలో ఉన్నట్టుగా ఉన్న, కొన్ని భాగాలు చూసి దేశీయ విదేశీయ పండితులు ఇద్దరూ "వేదాంతం అంటే వేదాల అంతం" అని పొరపాటుగా అభిప్రాయపడ్డారు. యోవోదాదు స్వరఃప్రోక్తో వేదాంతేకా ప్రతిష్ఠితాః, వేదాల ముందు పలికిన ఓం అనే శబ్దం, వేదాల చివరలో కూడా కనబడుతుంది." ఇక్కడ 'వేదాంత' అనేది 'వేదాదు'కు వ్యతిరేక (భిన్నమైన) పదంగా కనపడుతుంది. దీనిని సాయణ చేసినట్టుగా వేదాంతం అనిగాని ఉపనిషత్తు అనిగాని అనువదించటానికి వీలులేదు. తత్వభావనలో "వేదాంత" అనే మాట తైత్తిరీయ ఆరణ్యక (పే.817)లో, నారాయణీయ ఉపనిషత్తులో వస్తుంది. ఇదే ముండకోపనిషత్తు (iii, 2,6)లో కూడ వస్తుంది. మరోచోట, "వేదాంత విజ్ఞానం సునిష్కితరాః" అని వాడారు. అంటే వేదాంతాల నుంచి ఉత్పన్నమైన జ్ఞాన లక్ష్యాన్ని బాగా అర్థం చేసుకున్న వారు అని అర్థం. అంతేకాని 'వేదాల ఆఖరి పుస్తకాల'లో నుంచి ఉత్పన్నమైన... అని కాదు; శ్వేతాశ్వతర ఉపనిషత్తు VI, 22లో వేదాంతే పరమం గుహ్యం' (వేదాంతంలోని నిగూఢరహస్యం) అనేచోట ఈ పదం వాడారు. ఆ తర్వాత దీనిని బహువచనంలో కూడా వాడారు. ఉదాః క్షురికోపనిషత్తు 10,లో (అనుక్రమణిక పుట 210) 'పుండరీకేతి వేదాంతేషు నిగద్యతే'– అంటే 'వేదాంతాలలో దీనిని పుండరీకం అని అంటారు'– అని అర్థం. అంతేగాని ఛాందోగ్య తదితర ఉపనిషత్తుల్లో వ్యాఖ్యాత చెప్పినట్టు– "ప్రతి వేదానికి గల చివరి పుస్తకాలలో దీనిని పుండరీకం అంటారు' అని (అర్థం) కాదు.

దీని విషయంలో ప్రత్యక్ష సాక్ష్యం గౌతమ ధర్మసూత్రాలలో కనిపిస్తుంది. XIX అధ్యాయంలోని 12వ శ్లోకం శుద్ధి గురించి చెబుతున్నది. అందులో–

"ఉపనిషత్తులు, వేదాంతాలు, అన్ని వేదాల సంహితలు శుద్ధి గ్రంధాలు" అని ఇంకా కొన్ని గ్రంధాల పేర్లున్నాయి.

దీనిని బట్టి, గౌతముని కాలానికి ఉపనిషత్తులు వేదాంతాలనుంచి వేరుగా ఉన్నవై, అవి వైదిక వాఙ్మయంలో భాగం కాదని అనుకోవటం జరిగిందని తెలుస్తున్నది. హరదత్తుడు తన వ్యాఖ్యానంలో ఆరణ్యకాలలో ఉపనిషత్తులు కాని భాగాలను వేదాంతాలు అంటారు, అని చెప్పాడు. ఉపనిషత్తులు వైదిక వాఙ్మయ పరిధిలోకి రావని, వైదిక భాండాగారం బయట ఉన్నవని చెప్పటానికి ఇది తిరుగులేని నిదర్శనం.

భగవద్గీతలో 'వేద' పదాన్ని ఉపయోగించటం కూడా ఈ దృక్పథాన్ని బలపరుస్తుంది.

భగవద్గీతలో 'వేద' శబ్దాన్ని చాలచోట్ల ఉపయోగించారు. భట్[1] ప్రకారం ఆ పదంలో ఉపనిషత్తులను గ్రంధకర్త చేర్చలేదనే అర్థం వచ్చేటట్లుగా ఆ పద ప్రయోగం జరిగింది.

మత సంబంధమైన ఆచారాలు, యాగాలు ఒక్కటే ముక్తి మార్గాలని వేదాలు బోధించే అభిప్రాయాలను ఉపనిషత్తు వ్యతిరేకించటం మూలంగా వేద వాఙ్మయ సంచయం నుండి ఉపనిషత్తులను మినహాయించాలనేది రుజువవుతుంది. ఉపనిషత్తులలోని కొన్ని భాగాలు ఉటంకిస్తే అవి వేదాంతాలకు విరుద్ధమని చెప్పటానికి సరిపోతుంది.

ముండకోపనిషత్తు ఇలా అంటున్నది.

"ఈ విశ్వాన్ని సృష్టించిన వాడూ ప్రపంచ రక్షకుడూ అయిన బ్రహ్మ దేవుళ్లలో మొదటగా రూపొందాడు. ఆయన తన పెద్దకొడుకైన అధర్వునికి విజ్ఞానానికి ఆధారమైన బ్రహ్మజ్ఞానాన్ని విశద పరిచాడు. అధర్వుడు బ్రహ్మ తనకు తెలియ చేసిన ఈ శాస్త్రాన్ని అంగికి తెలియ జేశాడు. అంగి దానిని భరద్వాజుని వారసుడైన సత్యవహునికి బోధించాడు. అతడు ఈ సంప్రదాయిక విజ్ఞానాన్ని అంగీరసునికి అందించాడు (3) మహాసాల శౌనకుడు, గౌరవాదరాలతో అంగీరసుని సమీపించి "ఓ మాననీయ మహర్షీ, ఈ విశ్వమంతా విశదపడే జ్ఞానం ఏది?" అని అడిగాడు. (4) అంగీరసుడు ఇలా సమాధానం ఇచ్చాడు. "ఇందుకు రెండు రకాల విజ్ఞానాన్ని తెలుసుకోవాలని పవిత్ర జ్ఞానాన్ని ఎరిగిన ఋషులు చెప్పారు. 1. ఉన్నతస్థాయి జ్ఞానం 2. క్రింది స్థాయి జ్ఞానం.కిందిస్థాయి జ్ఞానాన్నిచ్చే శాస్త్రాలలో ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వవేదం, ధారణ, ఆచారాలు, వ్యాకరణం, వ్యాఖ్యానం, ఛందశ్శాస్త్రం, ఖగోళశాస్త్రం ఉన్నాయి. అనశ్వరమైన దానిని చూడగలిగేది (గ్రహించగలిగేది) ఉన్నత స్థాయిజ్ఞానం".

ఛాందోగ్యోపనిషత్తు ఇలా చెబుతున్నది:

1. నారదుడు సన్యత్కుమారుని సమీపించి మాననీయ మహర్షీ, నాకు ఉపదేశం చెయ్యండి' అని అడిగాడు. "ముందు నీకు తెలిసింది ఏమిటో నాకు చెప్పు. అప్పుడు నీవు ఇంకా తెలుసుకోవలసింది ఏమున్నదో చెబుతాను, అని, అతనికి సమాధానం వచ్చింది. (2) మాననీయ మహర్షీ, నాకు ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం నాలుగోది అయిన అథర్వవేదం, వేదాలలో అయిదవ వేదమయిన ఇతిహాసాలు, పురాణాలు, పితృకర్మకాండ, గణితం, దుశ్శకున జ్ఞానం, ఋతుల జ్ఞానం, పైశాచవిద్య, యుద్ధశాస్త్రం, నక్షత్రాల విద్య, సర్పాల దేవతల శాస్త్రం బోధించారు. ఇవీ నేను నేర్చుకున్నవి. మాననీయ మహర్షీ, నేను మంత్రాలను మాత్రమే ఎరుగుదును, ఆత్మ గురించి నాకు తెలియదు. కాని మీవంటి మహానుభావులైన మహర్షులద్వారా 'ఆత్మను ఎరిగిన వ్యక్తి దుఃఖాన్ని అధిగమించగలడు' అన్న సంగతి తెలుసుకున్నాను. అంచేత ఓ మాననీయ మహర్షీ! నాకు ఇప్పుడు దుఃఖం కలిగింది. ఆ

1. 'Sacred Books of the East', Vol. II, P. 275.

దుఃఖాన్ని అధిగమించేలా చేయి. అని నారదుడు కోరాడు. సనత్ కుమారుడు ఇలా జవాబిచ్చాడు. నీవు చదివినది పేరు తప్ప ఏదీ లేదు. (4) ఋగ్వేదం పేరు, యజుర్వేదం, సామవేదం, నాలుగోది అయిన అధర్వణ వేదమూ అయిదోది అయిన ఇతిహాసాలూ, పురాణాలు తదితరాలు అన్నీ అంతే. (ఇక్కడ విద్యకు సంబంధించిన వివిధ శాఖలను నారదుడు చెప్పినట్టుగానే పేర్కొనటం జరిగింది.) ఇవన్నీ పేర్లు మాత్రమే, ఆ పేరును పూజించాలి. బ్రహ్మ భావంతో పేరును పూజించేవాడు ఆ పేరు తెలిపే దానినంతా సంకల్పంతో అధిగమించ గలుగుతాడు. పేరు (బ్రహ్మ)ను ప్రార్థించేవాని ఆధిక్యత అటువంటిది. నారుదుడు అడిగాడు- 'మాననీయుడా, పేరు కన్న మిన్న అయినది ఏదైనా ఉన్నదా?' (సనత్ కుమారుడు) సమాధానం ఇచ్చాడు 'పేరుకన్న మిన్న అయినది ఒకటి ఉన్నది'. నారదుడు సంతోషంతో 'అది నాకు చెప్పు' అన్నాడు.

బృహదారణ్యకోపనిషత్తు ఇలా అంటున్నది.

"(గాఢనిద్రావస్థలో) తండ్రి తండ్రికాడు, తల్లి తల్లికాదు. మాటలు మాటలు కావు, దేవతలు దేవతలు కారు, వేదాలు వేదాలు కావు, యాగాలు యాగాలు కావు. ఆ స్థితిలో దొంగ దొంగకాడు, పుల్కసుడు పుల్కసుడు కాదు, చండాలుడు చండాలుడు కాదు. శ్రమణుడు శ్రమణుడు కాదు. భక్తుడు భక్తుడు కాదు, ఋషికి పుణ్యంతో కాని పాపంతో గాని, అనుకూలమైన లేదా అననుకూలమైన సంబంధం ఏదీ ఉండదు. ఎందుకంటే అప్పటికే హృదయానికి సంబంధించిన అన్ని దుఃఖాలను అధిగమించి వేసి ఉంటాడు".

కఠోపనిషత్తు ఇలా చెబుతున్నది.

"బోధనద్వారా గాని అర్థం చేసుకోవటం ద్వారా గాని శ్రుతుల ద్వారాగాని ఈ ఆత్మను అందుకోలేము. దేవుడు తాను ఎంచుకున్నవారికి మాత్రమే అందుబాటులో ఉంటాడు. ఆ మనిషి శరీరాన్ని ఆత్మ తన నివాసంగా చేసుకుంటుంది."

ఈ ఆత్మను తెలుసుకోవటం కష్టమే అయినప్పటికీ సరియైన పేర్లను ఉపయోగించటం ద్వారా గ్రహించగలం. బోధన ద్వారా గాని అనేక వేదాలను అంగీకరించటం ద్వారా గాని ఆత్మను అందుకోలేము, అర్థం చేసుకోవటం ద్వారా గాని పుస్తకాలలోని అంశాలను గుర్తు చేసుకోవటం ద్వారాగాని శ్రుతులను ఎక్కువ చదవటం ద్వారాగాని ఆత్మను అందుకోలేము. అయితే మరి దేని ద్వారా వాటిని అందుకోగలం? దీనిని అతడు ప్రకటించాడు.

ఉపనిషత్తులన్నా వాటిలో ఉన్న వేదాంత మన్నా ఎంత వ్యతిరేకత ఉన్నదో హిందువుల వివాహ బంధాల సందర్భంలో సాధారణంగా వర్తింపు చేసే 'అనులోమ', 'ప్రతిలోమ' అనే మాటల మూలం చూస్తే గ్రహించగలుగుతాం. వాటి మూలం గురించి మాట్లాడుతూ ప్రొఫెసర్ కాణే ఇలా అన్నారు.[1]

1. "History of Dharma Sastras" Vol. II, Part 1, P. 52.

"(వివాహానికీ ఉత్తరాధికారానికీ వర్తింపచేసే) 'అనులోమ', 'ప్రతిలోమ' అనే రెండు మాటలూ వైదిక వాఙ్మయంలో ఎక్కడా కనబడవు. (11.1.15), కౌ.బ్ర.ఉ., IV. 18 లో 'ప్రతిలోమ' అనే మాటను బ్రహ్మజ్ఞానం కోసం బ్రాహ్మణుడు క్షత్రియుని దగ్గరకు వెళ్లటానికి ఉపయోగించే విధానానికి ఉపయోగించారు.

అనులోమ అంటే వారసత్వం ప్రకారం ఉన్నాయని, అంటే వస్తువులు సహజ క్రమంలో ఉన్నాయని. ప్రతిలోమ అంటే వారసత్వానికి విరుద్ధంగా ఉన్నాయని, అంటే సహజ క్రమానికి విరుద్ధంగా ఉన్నాయని. ప్రతిలోమ శబ్దానికి ఇచ్చిన నిర్వచనం వెలుగులో కాణే గారి పరిశీలనలు చదివితే, ఉపనిషత్తులను వైదిక వాఙ్మయంలో భాగంగా అంగీకరించక పోవటమే కాకుండా, అసహ్యించుకోక పోయినా వైదిక బ్రాహ్మణులు నీచభావంతో చూసే వారని స్పష్టమవుతున్నది. వేదాంతానికి వ్యతిరేకులైన బ్రాహ్మణులు, ఆ తరువాత వేదాంతాన్ని బలపరిచే వారుగా, కాపాడే వారుగా, మారటం ఒక చిక్కుముడి.

II

ఇది వేదాంతం చిక్కుముడి. ఇందులో ఇంకో చిక్కుముడి ఉన్నది. వేదాలనూ కర్మ కాండద్వారా మోక్షం సాధించవచ్చుననే వేద సిద్ధాంతాన్నీ వ్యతిరేకించేవారు వేదాంతులు ఒక్కరేకారు, సర్వదర్శన సంగ్రహ గ్రంథకర్త అయిన మాధవాచార్యుడు మరో ఇద్దరు వైదిక వ్యతిరేకులను పేర్కొన్నాడు. వారు చార్వాకుడు, బృహస్పతి. వైదికులపైన వారి వ్యతిరేకత తర్కం దృష్ట్యా అత్యంత బలీయంగా ఉంటుంది.

చార్వాకుని వ్యతిరేకత ఈ క్రింది వ్యాఖ్యానంలో కనిపిస్తుంది. ఇది వైదికులకు వ్యతిరేకంగా అతడు చేసిన వాద పద్ధతిని చూపుతుంది.[1]

పై లోకంలో (మరణానంతర లోకంలో) ఆనందం అనేది ఏదీ లేక పోయినట్లయితే, మరి అనుభవజ్ఞులైన వీరంతా అగ్నిహోత్రాన్నీ, ఇతర యజ్ఞాలనూ ఎంతో డబ్బు ఖర్చు పెట్టి, శరీరాయాసాలకు ఓర్చుకొని ఎందుకు చేస్తారు? అని నీవు అభ్యంతర పెడితే దీనికి భిన్నమైన నిదర్శనం ఏదీ లేదు కాబట్టి నీ అభ్యంతరాన్ని అంగీకరించను. అగ్నిహోత్రం మొదలైనవి జీవనోపాధికి మార్గాలుగా ఉపయోగపడతాయి. అసత్యం, ఆత్మవైరుధ్యం, పునరుక్తి అనే మూడు దోషాలతో వేదాలు మలిన మయ్యాయి. వైదిక పండితులమని చెప్పకొనే వంచకులు పరస్పరం నాశనకారులుగా అయ్యారు. ఎందుకంటే జ్ఞానకాండ ప్రమాణాన్ని త్రోసిపుచ్చు తున్నారు. ఆఖరుకు ఈ మూడు వేదాలూ మోసగాళ్ల సందర్భ శుద్ధి లేని అసంగతమైన రాతలైనాయి. దీనికి నిదర్శనంగా వాడుకలో ఉన్న ఈ క్రింది భాగం చూడండి :

"అగ్నిహోత్రం మూడు వేదాలు, సన్యాసుల త్రిదండమూ, బూడిద రాసుకోవటాలూ,

1. సర్వదర్శన సంగ్రహం. కొవెల్, (Cowell) అనువాదం పుట 64

అవన్నీ మగటిమి లేనివారికీ జ్ఞానం లేనివారికీ, జీవనాధారాల"ని బృహస్పతి అన్నాడు.

వైదిక మతాన్ని ఎదిరించటంలో బృహస్పతి చాల ధైర్యవంతుడూ, బలవంతుడూను. బృహస్పతి వాదనను మాధవాచార్యుడు ఇలా ఉటంకించాడు.[1]

"స్వర్గం లేదు అంతిమ ముక్తిలేదు. వేరే ప్రపంచంలో (పైలోకంలో) ఆత్మ అంటూ ఏదీ లేదు.

నాలుగు కులాలు, తరగతులు మొదలైన వాటి చర్యల వల్ల ఫలితం ఏదీ లేదు.

అగ్నిహోత్రం, మూడు వేదాలు, సన్యాసుల త్రిదండం, బూడిద రాసుకోవటాలు, ఇలాంటి వాటిని (ప్రకృతి) జ్ఞానమూ, పనితనమూ, లోపించిన వారికి జీవనాధారంగా చేసింది.

జ్యోతిష్టోమ క్రతువులో బలి ఇచ్చిన జంతువు సరాసరి స్వర్గానికి వెళ్లి పోతుంది. అయినటప్పుడు యజ్ఞం చేసేవాడు సరాసరి తన తండ్రినే ఎందుకు బలి ఇవ్వడు?

శ్రాద్ధం పెడితే చనిపోయిన వారికి తృప్తి కలిగినట్లయితే, ఇక్కడ కూడా, ప్రయాణీకులు బయలు దేరేటపుడు వారి ప్రయాణానికి భత్యం ఏమీ ఇవ్వనవసరంలేదు. బ్రతికినంత కాలం, మనిషి హాయిగా బ్రతకాలి. అప్పుల పాలైనప్పటికి నేతికూడు తినాలి.

ఒకసారి శరీరం బూడిద అయిపోయిన తర్వాత మళ్లీ అది ఎలా తిరిగి వస్తుంది ? శరీరాన్ని త్యజించిన వ్యక్తి వేరే ప్రపంచానికి వెళ్లి ఉన్నట్లయితే మరి అతను బంధువుల మీద బెంగతో ఎప్పుడూ తిరిగి రాడెందుకు? ఇవన్నీ తమకు జీవనోపాధిగా బ్రాహ్మణులు ఏర్పాటు చేసుకున్నవి. చనిపోయిన వారికి చేసే క్రతువులన్నీ నిష్ప్రయోజకమైనవి. వేదాల గ్రంధకర్తలు ముగ్గురూ హాస్యగాళ్లు, మోసగాళ్లు, పిశాచాలు. జర్పరీ, తుర్పరీ పండితుల ప్రసిద్ధిగాంచిన సూత్రాలూ– అశ్వమేధంలో రాణీగారు చేయాలని రాసిపెట్టిన బూతు క్రతువులూ ఇవనీ హాస్యగాళ్లు కనిపెట్టారు., పూజార్లకు ఇచ్చే వివిధ రకాల కానుకలు కూడా అంతే.

మాంసభక్షణం కూడా నిశాచరులైన పిశాచాలే మెచ్చుకున్నాయి."

వైదిక బ్రాహ్మణులు వేదాంతులతో ఎందుకు రాజీపడ్డారు. చార్వాకుడు బృహస్పతితో ఎందుకు రాజీపడలేదు. ఈ చిక్కుముడికి సంజాయిషీ కావాలి.

## III

ఇక మూడో చిక్కుముడి గురించి చెప్పవలసి ఉన్నది. అందుకు ఇది ఎంతో అనువైన సమయం, ఎందుకంటే వేదాలు వేదాంతాల గురించిన ప్రస్తావన ఇక్కడ వాటి సహజ రూపంలో లేదు, తాత్త్విక వేషంలో ఉంది. మీమాంస గ్రంధకర్త జైమిని, బ్రహ్మ సూత్రాల గ్రంథ

---

1. సర్వదర్శన సంగ్రహం, పు 10.

కర్త బాదరాయణుడు సంస్కృత వాఙ్మయ చరిత్రలో ఎంతో ప్రసిద్ధి గాంచిన నిపుణులు. ఈ ఇద్దరు వ్యాకరణ కర్తలూ వేదాలకూ వేదాంతాలకూ చేసిన వాఖ్య ఆ తాత్విక వేషం. వారి గురించి, వారి గ్రంధం గురించి ఇదివరికే ప్రస్తావించటం జరిగింది. వైదిక విశ్వాసాలను వేదాంతపరమైన ఊహాగానాలను రూపొందించటంలో వారి పాత్ర ఏమిటో చెప్పటమూ జరిగింది. ఇపుడు చేయవలసింది ఏమంటే, ఇతరుల తత్వంపట్ల వీరికి ఉన్నదృక్పధాన్ని పోల్చి తారతమ్యాన్ని చూపటమే.

విషయాన్ని ప్రదర్శించటంలో జైమినికి బాదరాయణునికి ఉన్న సామ్యం చూస్తే ఎవరికైనా దిగ్భ్రాంతి కలుగుతుంది. వేదాంత సూత్రాలను కర్మ సూత్రాలకు చాలాదగ్గరగా రూపొందించారని ప్రొ॥ బేల్‌వాల్కర్ అంటాడు. పద్ధతిలోను, పరిభాషలోను బాదరాయణుడు జైమినిని చాలా దగ్గరగా అనుసరించాడు. శ్రుతి గ్రంథాన్ని వ్యాఖ్యానించటంలో జైమిని నియమావళిని అతడు అంగీకరించాడు. జైమిని వాడిన సాంకేతిక పదాలనే అతడూ వాడాడు. అంటే, జైమిని వాడిన పరిభాషనే వాడాడు; జైమిని ఉపయోగించిన ఉదాహరణలనే ఇచ్చాడు.

ఈ సామ్యం ఏం చెబుతున్నదంటే, తాను భిన్నమైన తత్వాన్ని ప్రవచిస్తున్నాననీ, దానిని జైమిని ఎదుర్కొంటున్నాడనీ, ఆ దాడిని ఎదుర్కోటానికి జైమిని పద్ధతినే తానూ ఉపయోగించాలనీ బాదరాయణుడు అనుకున్నాడు.

ప్రశ్న ఏమంటే బాదరాయణుడు జైమినిని వ్యతిరేకించే దృక్పధాన్ని తీసుకున్నాడా?

జైమిని తన ప్రత్యర్థి అనీ, వేదాంతం పట్ల జైమిని దృక్పధానికి తాను వ్యతిరేకిననీ బాదరాయణుడే అంగీకరించాడు. బాదరాయణుడు ఈ విషయాన్ని 2-7 సూత్రాలలో చెప్పాడు. దానిని శంకరాచార్యుడు తన వ్యాఖ్యానంలో వివరించాడు.

జైమిని ఇలా ప్రతిపాదించాడు :

"శరీరం నుంచి తాను వేరు అనీ, మరణం తర్వాత తాను స్వర్గానికి వెళ్తాననీ అక్కడ తన యాగాల ఫలితాలను అనుభవిస్తాననీ నమ్మకం ఉంటే తప్ప ఎవరూ యాగాలను తలపెట్టరు. ఆత్మజ్ఞానం గురించి చర్చించే గ్రంథాలు ఇతరులకు ఆ విషయమై పరిజ్ఞానం కలిగించటానికి మాత్రమే పనికివస్తాయి. ఆ విధంగా అని యజ్ఞ క్రతువుకు సహాయకాలే.

సంగ్రహంగా చెప్పాలంటే జైమిని భావం ఇది. ఆత్మ శరీరం కంటె వేరు అనీ శరీరం నశించి పోయిన తర్వాత కూడా ఆత్మ మనగలుగుతుందనీ. ఇటువంటి జ్ఞానం సరిపోదు. వైదిక యజ్ఞాలను చేస్తే తప్ప (ఆత్మ) స్వర్గంలోకి వెళ్లలేదు. ఇదే కర్మకాండ చెబుతున్నది. అందువల్ల కర్మకాండ ఒక్కటే ముక్తి దాయకం. ఈ దృష్టితో చూస్తే జ్ఞాన కాండ శుద్ధ దండగ. ఇది చెప్పటానికి, జైమిని వేదాంతాన్ని నమ్మిన వారి ప్రవర్తనపైననే ఆధారపడ్డాడు.

1. బాదరాయణ సూత్రం - 3. శంకర వ్యాఖ్యానం చూడండి.

"ఆత్మ జ్ఞానం యొక్క స్థానం యాగ క్రతువుల స్థానంకంటే తక్కువది అని వేదాలు ఖండితంగా ప్రకటిస్తున్నాయని జైమిని స్పష్టంగా చెబుతున్నాడు."[1]

ఆయన ఇందుకు చెప్పే ఉదాహరణలు జనకుని గురించీ, అశ్వపతి గురించీ–

"విదేహ రాజు జనకుడు ఒక యజ్ఞం చేశాడు. అందులో అనేక కానుకలను పంచారు". (బృహ.3.1.1.) "అయ్యా! నేను (అశ్వపతి) ఒక యజ్ఞం నిర్వహించాలనుకున్నాను" (చాం.5.11.5). జనకుడు, అశ్వపతి ఇద్దరూ ఆత్మ నెరిగినవారే. ఆత్మను తెలుసుకోవటం ద్వారా మోక్షం పొందేమాటయితే, యజ్ఞా[illegible]సిన అవసరం వారికి లేదు. కాని పైన చెప్పిన రెండు పాఠభాగాలూ వారు యజ్ఞ[illegible]ంచే చెబుతున్నాయి. యజ్ఞ యాగాలు చేయటం వలన మాత్రమే మోక్షం పొందగలరు గాని, వేదాంతులు అభిప్రాయ పడినట్లుగా ఆత్మజ్ఞానం వలన కాదని ఇది ఋజువు చేస్తుంది".

జైమిని దీనిని సమర్థించాడు. ఆయన ఇలా అంటున్నాడు. "శరీరం నుండి విడివడి వెళ్లిపోతున్న ఆత్మకు ఫలితాలను అందించటానికి జ్ఞానం, కర్మ, రెండూ కలిసే వెళ్తాయి."[2]

బాదరాయణుని జ్ఞాన కాండకు ఒక స్వతంత్ర ప్రతిపత్తిని ఇవ్వటానికి జైమిని నిరాకరించాడు. ఆయన రెండు ఆధారాల మీద ఈ వాదనకు దిగాడు.

మొదటిది[3] "ఆత్మ జ్ఞానం అనేది ఒక్కటీ విడిగా ఏ ఫలితాన్నీ ఇవ్వదు"

రెండోది[4] "వేదాల ప్రమాణం ప్రకారం ఆత్మజ్ఞానం కర్మకాండ కంటే క్రింది స్థానంలోనే ఉంటుంది.

బాదరాయణుని జ్ఞానకాండకు సంబంధించి జైమిని అభిప్రాయం ఇది.

జైమిని పట్ల, అతని కర్మకాండపట్ల బాదరాయణుని వైఖరి ఎలా ఉన్నది? దీనిని బాదరాయణుడు 8 నుంచి 17 సూత్రాలలో వివరించాడు.

బాదరాయణుడు తీసుకున్న మొదటి అంశం ఏమంటే,[5] జైమిని ప్రస్తావించిన 'ఆత్మ' పరిమితార్థంలో చెప్పిన ఆత్మ అని. అంటే, ఆత్మను పరమాత్మను విడివిడిగా గుర్తించి ప్రస్తావించాలి. అని అతని భావం. వేదాలు పరమాత్మను గుర్తించాయి.

బాదరాయణుడు అంగీకరించిన రెండో అంశం.[6] ఏమంటే వేదాలు, ఆత్మజ్ఞానాన్ని

1. బాదరాయణ సూత్రం -4
2. బాదరాయణ సూత్రం చూడండి పుట 5
3. బాదరాయణ సూత్రం 6. శంకరవ్యాఖ్య
4. బాదరాయణ సూత్రం పుట 7.
5. బాదరాయణ సూత్రం పుట 6. శంకరవ్యాఖ్య.
6. బాదరాయణ సూత్రం, పుట 9.

యజ్ఞాలనూ రెండింటినీ బలపరుస్తాయని.

బాదరాయణుడు అంగీకరించిన మూడో అంశం[1] ఏమంటే వేదాలను విశ్వసించే వారు మాత్రమే యజ్ఞాలు నిర్వహించాలనేది. అయితే ఉపనిషత్తులను అనుసరించేవారు ఆ ఆంక్షను పాటించనవసరం లేదు. శంకరాచార్యుడు వివరించినట్టుగా :

"వేదాలు చదివిన వారూ వేదాలను విశ్వసించే వారూ యజ్ఞాలు నిర్వహించటానికి అర్హులు. ఉపనిషత్తుల నుంచి ఆత్మజ్ఞానాన్ని గ్రహించినవారికి యజ్ఞ విధి ఆదేశంకాదు. అట్టిజ్ఞానం కర్మకు సరిపడదు".

బాదరాయణుడు తీసుకున్న నాలుగో అంశం[2] ఏమంటే బ్రహ్మజ్ఞానం పొందినవారికి కర్మ కాండ చేయటం ఐచ్ఛికం. శంకరాచార్యుడు వివరించినట్టు –

"కొందరు తమంత తామే కర్మకాండ (పని) నిర్వహించటం మానివేశారు. విషయం ఏమంటే జ్ఞానం పొందిన తర్వాత కొందరు ఇతరులకు మార్గదర్శకం కావటంకోసం కర్మకాండ మొదలుపెట్టాలనుకోవచ్చు, కొందరేమో మొత్తంగా మానివేయవచ్చు. ఆత్మ నెరిగినవారు కర్మకాండ (యజ్ఞవిధి) చేయాలనే కట్టడి ఏదీలేదు.

ఆఖరిదీ అంతిమమైనదీ ఏమంటే[3]

"ఆత్మజ్ఞానం యావత్తు కర్మకాండకూ వ్యతిరేకం. అందువల్ల అది కర్మకు అధీనమైనది కాదు."

సన్యాసాన్ని నాలుగో ఆశ్రమంగా గుర్తించిన స్మృతులు, కర్మకాండ ప్రకారం నిర్ణయించిన యజ్ఞాలను సన్యాసి నిర్వహించనవసరం లేదని చెప్పటాన్ని అతడు తన వాదానికి సమర్థకంగా గ్రహించాడు.[4]

ఈ రెండు ఆలోచనా ధోరణులలోనూ ఒకదాని పట్ల మరొకదాని వైఖరి ఎలా ఉన్నదో సూచించే సూత్రాలు అనేకం బాదరాయణ సూత్రాలలో కనిపిస్తాయి. కాని పైన చూపించినది ఒక్కటే ఆ వైఖరికి మచ్చుతునకగా సరిపోతుంది. ఈ విషయాన్ని పరిశీలించటానికి ఇక్కడే ఆగిపోతే పరిస్థితి చాల చిత్రంగా అగుపిస్తుంది. జైమిని వేదాంతాన్ని, ఒక అసత్య శాస్త్రమని, ఒక వల అని, ఒక భ్రమ అని, పైపైన కనిపించేది మాత్రమే అనీ, అనవసరమైనదనీ, నిస్సారమైనదనీ నిరసించాడు. ఈ దాడికి ప్రతిగా బాదరాయణుడు ఏం చేశాడు? జైమిని కర్మకాండను అసత్య శాస్త్రమని, వల అనీ, భ్రమ అనీ, పైపైన కనిపించేది అనీ, నిస్సారమైనదనీ, నిరసించాడా? లేదు.

1. బాదరాయణ సూత్రం, పుట 12
2. బాదరాయణ సూత్రం, పుట 15
3. బాదరాయణ సూత్రం, పుట 16
4. బాదరాయణ సూత్రం, పుట 17

అతడు తన వేదాంత శాస్త్రాన్ని కాపాడుకున్నాడు. అంతే. కాని, అతడు ఇంకా ఎక్కువ ఏదో చెయ్యాలని అందరూ ఆశించారు. జైమిని కర్మకాండను ఒక అసత్య మతంగా బాదరాయణుడు నిరసించాలని ఆశించారు. బాదరాయణుడు అంత ధైర్యం ఏమీ చూపలేదు. దానికి విరుద్ధంగా అతడు క్షమాపణ ధోరణి అవలంబించాడు. జైమిని కర్మకాండ స్మృతులపై ఆధారపడినదనీ, స్మృతులకు తిరుగులేని ప్రమాణమూ, పవిత్రతా ఉన్నాయనీ అతడు అంగీకరించాడు. అతడు గట్టిగా చెప్పేది ఒక్కటే. ఏమిటంటే, తన వేదాంత సిద్ధాంతానికి కూడా ధర్మశాస్త్రాల బలం ఉన్నది కాబట్టి అది కూడా నిజమైనదే (ప్రామాణికమే) అని.

ఇంతటితో అయిపోలేదు. బాదరాయణుడు చేసిందేమిటంటే తన భావాలను నిగూఢంగా ఉంచటానికి "వేదాంత" శబ్దాన్ని ఉపయోగించాడు. ఉపనిషత్తులు కూడా వైదిక వాఙ్మయంలో భాగమే అని నొక్కి చెప్పటానికి దానిని ఉపయోగించాడు. ఉపనిషత్తులలోని జ్ఞానకాండ, వేదాలలోని కర్మకాండకు వ్యతిరేకం కాదనీ అవి పరస్పరం సమ్మానించుకొనేవే అని చెప్పటానికి కూడా దానిని ఉపయోగించాడు. నిజానికి, బాదరాయణుడు మొత్తం తన వేదాంత సూత్ర నిర్మాణాన్ని ఈ పునాదిమీదనే నిలబెట్టాడు.

వేదాంత సూత్రాలను చెప్పే బాదరాయణుని ఈ సిద్ధాంతం ఉపనిషత్తులు వేదాలలో భాగమే అని, వేదాలకూ, ఉపనిషత్తులకూ మధ్య వైరుధ్యం ఏదీ లేదని చెప్తున్నది. వాస్తవానికి ఇది ఉపనిషత్తుల స్వభావానికి, వేదాలతో వాటికున్న సంబంధానికి విరుద్ధంగా ఉన్నది. బాదరాయణుని వైఖరి అర్థం చేసుకోవటం అంత సులువు కాదు. శత్రువు సిద్ధాంతపు చెల్లుబాటును అంగీకరిస్తూ శత్రువుతో తలపడే బాదరాయణుని వైఖరి చిత్రంగానూ జాలి గొలిపేదిగానూ ఉన్నా స్పష్టంగానే ఉంది. ఉపనిషత్తులకు విరుద్ధమైన వేదాల అమోఘత్వం సమస్యపై బాదరాయణుడు జైమినికి ఎందుకు లొంగిపోయాడు? అతడు సత్యం కోసం, పూర్తి సత్యంకోసం సత్యం తప్ప వేరేదీ కానిదాని కోసం, స్థిరంగా ఎందుకు నిలబడలేకపోయాడు? ఈ చిక్కుముడికి వివరణ ఇవ్వవలసి ఉన్నది.

అనువాదం : బొజ్జా తారకం

## అనుబంధం : 3

# త్రిమూర్తి చిక్కుముడి

హిందూ సమాజం కులాలతో రూపొందినదని చెప్పటం ఎంత నిజమో, హిందూమతం తెగలతో రూపొందినదని అనటమూ అంతే నిజం. కులాలను పరిశీలించిన దానిలో సగం శ్రద్ధ కూడా మతానికి సంబంధించిన తెగలను పరిశీలించటంలో చూపలేదు. ఇది ఎంత విచిత్రమో అంత దురదృష్టకరం కూడా. భారత దేశ చరిత్రలో కులాలు నిర్వహించినట్టుగానే తెగలు కూడా గొప్ప పాత్రనే నిర్వహించాయి. నిజానికి, ఈనాడు కనబడుతున్న భారతదేశ చరిత్రను కొన్ని కులాలు, నిర్మించి నట్టుగానే తెగలు కూడా నిర్మించాయి.

హిందూ మతాన్ని రూపొందించిన తెగలు, గుంపులకు సంబంధించినవి. వీటి అన్నిటి మూలం పరిశీలించి వాటి సిద్ధాంతాలను పోల్చి చూపటం ఒక్క అధ్యాయం పరిధిలో సాధ్యం కాదు. చెయ్యగలిగిందల్లా అందులో కొన్ని ముఖ్యమైన వాటిని తీసుకొని వాటికి సంబంధించిన సమస్యలను తీసుకొని పరిశీలించటమే. భారత దేశ చరిత్రలో ముఖ్యాతి ముఖ్యమైనవి మూడు తెగలున్నాయి. మొదటిది బ్రహ్మ దేవుణ్ణి విశ్వసించే తెగ, రెండోది విష్ణువును విశ్వసించే తెగ, మూడోది శివుడు లేదా మహేశ్వరుణ్ణి విశ్వసించే తెగ. ఈ తెగల మూలాన్ని పరిశీలించిన చరిత్ర విద్యార్థులను కలవరపరిచే ప్రశ్నలలో కొన్నింటిని, ఈ దిగువ ఇస్తున్నాను.

---

ఈ చిక్కుముడిని 11వ చిక్కుముడితో కలిపి చదవాలి. 'ది రిడిల్ ఆఫ్ త్రిమూర్తి' అసలు విషయ సూచికలో లేదు, ప్రభుత్వం వారికి అందిన రాతప్రతులలోనూ లేదు. ఈప్రతిని అనంతరం శ్రీ ఎస్.ఎస్.రెగే అందజేశారు. —సంకలనకర్త

భారత దేశంలో ఒకప్పుడు ప్రసిద్ధిలో ఉన్న వివిధ తెగలను చుల-నిద్దెస్స అనే బౌద్ధ గ్రంథం ప్రస్తావించింది. మతాన్నీ తెగలనూ బట్టి వర్గీకరణ చేస్తే ఈ క్రింది విధంగా ఆ జాబితా ఇవ్వవచ్చు.

## I. మతాలు

| వరుస సంఖ్య | తెగపేరు | మతసారాంశం |
|---|---|---|
| 1. | అజీవిక శ్రావక[1] | అజీవిక[2] |
| 2. | నిగత్త శ్రావక | నిగొత్త[3] |
| 3. | జటిల శ్రావక | జటిల[1] |
| 4. | పరివ్రాజక శ్రావ క | పరివ్రాజక[2] |
| 5. | అవరుద్ధశ్రావక | అవరుద్ధక |

## II పూజాపద్ధతి

| వరుస సంఖ్య | తెగపేరు | ఆరాధించేదైవం |
|---|---|---|
| 1. | హస్తివ్రతికులు | హస్తి[6] |
| 2. | అశ్వవ్రతికులు | అశ్వ[7] |
| 3. | గోవ్రతికులు | గోవు[8] |
| 4. | కుకుర్వ్రతికులు | కుక్కు[9] |
| 5. | కాకవ్రతికులు | కాక[10] |
| 6. | వాసుదేవవ్రతికులు | వాసుదేవుడు |
| 7. | బలదేవవ్రతికులు | బలదేవుడు |

1. శ్రావక అంటే శిష్యుడు
2. జీవనోపాధికి సంబంధించి ప్రత్యేక నియమాలనుపాటించే సన్యాసులు.
3. అన్ని బంధాలను, అడ్డంకులను త్రెంచుకున్న సన్యాసులు.
4. తలవెంట్రుకలు ముడివేసేసన్యాసి
5. సమాజం నుంచి వైదొలగిన సన్యాసి
6. వ్రతిక అంటే భక్తుడు
7. గుర్రం
8. ఆవు
9. కుక్క
10. కాకి

| | | |
|---|---|---|
| 8. | పూర్ణభద్రవ్రతికులు | పూర్ణభద్రుడు |
| 9. | మణిభద్ర వ్రతికులు | మణిభద్ర |
| 10. | అగ్నివ్రతికులు | అగ్ని |
| 11. | నాగవ్రతికులు | నాగ |
| 12. | సుపర్ణ వ్రతికులు | సుపర్ణ |
| 13. | యక్షవ్రతికులు | యక్ష |
| 14. | అసుర వ్రతికులు | అసుర |
| 15. | గాంధర్వ వ్రతికులు | గంధర్వ |
| 16. | మహారాజ వ్రతికులు | మహారాజ |
| 17. | చంద్రవ్రతికులు | చంద్ర |
| 18. | సూర్య వ్రతికులు | సూర్య |
| 19. | ఇంద్రవ్రతికులు | ఇంద్ర |
| 20. | బ్రహ్మవ్రతికులు | బ్రహ్మ |
| 21. | దేవ వ్రతికులు | దేవ |
| 22. | దీష వ్రతికులు | దీష |

త్రిమూర్తుల పూజా పద్ధతులను ఈ జాబితాలో చూపిన వివిధ దేవతల పూజా పద్ధతులతో పోల్చి చూస్తే రెండు అభిప్రాయాలు స్పష్టంగా అగుపిస్తాయి. ఒకటి ఏమిటంటే విష్ణు, మహేశ్వరుల పూజా పద్ధతులు తర్వాత తయారు చేసినట్టివని, చులనిద్దెస్సలో ప్రస్తావించిన వాటి మూలంకంటే తర్వాత వచ్చినవని. రెండో అభిప్రాయం ఏమంటే పాత పూజా పద్ధతులన్నీ మరుగై పోయాయని. ఈ వింత విధానానికి కారణాలు ఏమయి ఉంటాయా అని వెతికితే, కొత్త పూజా పద్ధతులను ప్రచారంలోకి తీసుకు రావాలని బ్రాహ్మణులు అనుకుంటే తప్ప కొత్త పూజా పద్ధతులు పుట్టుకొచ్చి **ఉండవు** అని స్పష్టంగా తెలుస్తుంది. అదే విధంగా బ్రాహ్మణులు ప్రచారం చేయటం (**ఆచరించటం**) **ఆపివేస్తేనే** తప్ప పాత పూజా పద్ధతులు కూడా కనుమరుగై పోయేవి కావు. చరిత్ర **విద్యార్థిని** కలవర పరిచే అంశం ఏమంటే బ్రాహ్మణులు కొత్త పూజా పద్ధతులను ఎందుకు తయారు చేశారు? పాత పూజా పద్ధతులను ఎందుకు వదిలి వేశారు? అని. ఈ ప్రశ్న కలవరపరచటమే కాదు విద్యార్థికిదిగ్భ్రాంతి కలుగ జేస్తుంది. ఎందుకంటే, ఈ పరివర్తనలో ఎగిరిపోయింది ఏ ఇతర దేవుడోకాదు, సాక్షాత్తు

ఇంద్రుడే. ఇంద్రుడు వైదిక దేవుడు. వైదిక దేవుళ్లలో గొప్పవాడు. బ్రాహ్మణులు ఇంద్రుణ్ణి వేలకొలది సంవత్సరాలు కాకపోయినా కొన్ని వందల ఏళ్ల పాటయినా పూజించి మహోన్నతమైన దేవుడని పొగిడారు. అలాంటి ఇంద్రుణ్ణి వదిలేసి బ్రాహ్మణులు బ్రహ్మవిష్ణు మహేశ్వరుల భక్తులెలా అయ్యారు? బ్రాహ్మణులు ఈ విధంగా విశ్వాసాలను బదలాయించటానికి కారణాలు ఆధ్యాత్మికమైనవా లేక వ్యాపార సంబంధమైనవా?

ఇంద్రుడి స్థానంలో బ్రాహ్మణులు తమ దేవుడిగా ప్రతిష్ఠించుకున్న ఈ శివుడు ఎవరు? దక్ష ప్రజాపతి యజ్ఞకథ, అందులో శివుని పాత్ర, శివుని గురించి ఎంతో సమాచారాన్ని అందిస్తాయి. కథ ఏమిటంటే, హిమాలయాలలో ఎక్కడో దక్షుడు యజ్ఞం చేస్తున్నాడు. ఈ యజ్ఞానికి దేవతలు, దానవులు, పిశాచాలు, నాగులు, రాక్షసులు, ఋషులు అందరూ హాజరయ్యారు. దక్షుడు తనకు ఆహ్వానం పంపని కారణంగా శివుడు యజ్ఞానికి వెళ్లలేదు. శివుణ్ణి ఆహ్వానించకుండా పూజ చేస్తున్నందుకు ఋషులలో ఒకడైన దధీచి దక్షుణ్ణి మందలించాడు. శివుణ్ణి ఆహ్వానించటానికి దక్షుడు తిరస్కరించి, "పోవయ్యా! మీ రుద్రులను చాలమందిని చూశాను. మీ శివుణ్ణి నేను గుర్తించను" అని సమాధానమిచ్చాడు. "మీరందరూ శివునికి వ్యతిరేకంగా కుట్రపన్నారు. జాగ్రత్త, నీయజ్ఞం ఎప్పటికీ ఫలవంతంగా ముగియదు." అని దధీచి అన్నాడు. ఇది తెలుసుకున్న మహదేవుడు, తన నోటినుంచి ఒకరాక్షసుణ్ణి సృష్టించాడు. ఈ రాక్షసుడు దక్షుడు ప్రారంభించిన యజ్ఞాన్ని నాశనం చేశాడు. బ్రాహ్మణులు శివుణ్ణి దేవుడిగా అంగీకరించటానికి తిరస్కరించిన కాలం ఒకటి ఉండేదనీ బ్రాహ్మణుల యజ్ఞ పద్ధతికి శివుడు వ్యతిరేకంగా ఉండిన కాలం ఒకటి ఉండేదనీ దానిని బట్టి తెలుస్తున్నది. ఆర్యులకు అనార్యులకు ఉన్నతేడా సంస్కృతి పరమైనది, జాతిపరమైనది కాదు. సాంస్కృతిక విభేదం రెండు అంశాలచుట్టూ ఉన్నది. ఆర్యులు చతుర్వర్ణాలను నమ్మేవారు. అనార్యులు దానిని వ్యతిరేకించేవారు. యజ్ఞాలు చేయటం తమ మత సారంగా ఆర్యులు విశ్వసించేవారు. అనార్యులు యజ్ఞాన్ని వ్యతిరేకించేవారు. దక్షయజ్ఞ కథను పరిశీలించిన మీదట, దానిలోని వాస్తవాల వెలుగులో తేలేదేమంటే శివుడు అవైదిక, అనార్యదేవుడని. ఇంతకూ ప్రశ్న ఏమిటంటే, వైదిక సంస్కృతికి స్తంభాలుగా నిలిచిన బ్రాహ్మణులు శివుణ్ణి తమ దేవుడిగా ఎందుకు ఎంచుకున్నారు?

చరిత్ర విద్యార్థిని కలవర పరిచే మూడో అంశం ఏమిటంటే శివునికీ విష్ణువుకూ ఉన్న మొదటి ఆకారాలలో బ్రాహ్మణులు సంస్కరణనూ మార్పునూ ఎందుకు చేశారనేది.

శివుడు అవైదిక, అనార్యదేవుడనే సంగతి (చాలమంది) హిందువులు ఎరగరు. వేదాలలో ప్రస్తావించిన రుద్రుడే శివుడని వారు అనుకుంటారు. కాబట్టి, హిందువులకు రుద్రుడు శివుడు ఒకరే. యజుర్వేదంలోని తైత్తిరీయ సంహితలో రుద్రుణ్ణి శ్లాఘించే శ్లోకం ఒకటి ఉన్నది. ఈ శ్లోకంలో రుద్రుణ్ణి అంటే శివుణ్ణి దొంగల, దోపిడి దార్ల, బందిపోటు దొంగల రాజుగాను

అధములు, కుమ్మర్ల, కమ్మర్ల రాజుగానూ వర్ణించి ఉన్నది. ఈ దొంగల దోపిడిదార్ల రాజైన శివుణ్ణి బ్రాహ్మణులు తమ పరమోత్కృష్టమైన దేవుడిగా చేసుకోవటానికి ఎలా సాహసించారు? అనేది ప్రశ్న.

రుద్రుణ్ణి బ్రాహ్మణులు తమ శివదేవుడిగా అంగీకరిస్తూ అతని పాత్రలో కొంత సంస్కరణ చేశారు. ఆశ్వలాయన గృహ్య సూత్రంలో రుద్రుణ్ణి సరిగ్గా పూజించే విధానం చెప్పారు. దీని ప్రకారం రుద్రుణ్ణి పూజించటమంటే ఎద్దును బలి ఇవ్వటం. ఏ ఋతువులో, ఏ నక్షత్రంలో ఈ యజ్ఞం చెయ్యాలో, వాటి వివరాలు ఆ సూత్రం ఇచ్చింది. శాలలో ఉన్న వాటిలో మంచి ఎద్దును గృహస్థు ఎంచుకోవాలని సూత్రం చెబుతున్నది. దాని రంగును కూడా అది నిర్ణయించింది. అది బలిష్ఠంగా ఉండాలని కూడా ఆదేశించింది. దానిని బియ్యం గంజితో గాని బార్లీ గంజితో గాని కడగాలి. అపుడు దానిని వధించి స్తోత్ర సహితంగా రుద్రునికి సమర్పించాలి. దానితోక, చర్మం, తల, కాళ్లు అగ్నిలో ఆహుతి చెయ్యాలి. రుద్రుడికి జంతుబలి అవసరం అయినందువల్ల అతడు 'హింసాత్మక'మైన దేవుడని స్పష్టమవుతున్నది. (మరోవైపున) శివుడు అహింసాత్మకమైన దేవుడు. అతనికి జంతుబలి ఇవ్వరు. ప్రశ్న ఏమంటే, రుద్రుని మాంసాహారం మాన్పించి శాకాహారిగా (శివునిగా) చేయటానికి బ్రాహ్మణులను ఏది బలవంతం చేసిందీ అని.

భారతదేశం అంతటా హిందువులు సిగ్గుగాని, బిడియం గాని లేకుండా లింగపూజ వైభవాన్ని అంగీకరిస్తారు. ఈ లింగపూజ శివునికి సంబంధించినది. శివుణ్ణి నిజంగా ఆరాధించటం అంటే శివలింగాన్ని పూజ చేయటమే అని అందరూ విశ్వసిస్తారు. లింగపూజ ఎప్పుడూ శివునికి సంబంధించే ఉన్నదా? ప్రొ॥ దండేకర్ తన "విష్ణు ఇన్ ది వేదా" అనే వ్యాసంలో కొన్ని ఆసక్తికరమైన వాస్తవాలను వెలికి తీశాడు. ప్రొ॥ దండేకర్ ఇలా అన్నాడు.

"ఈ సందర్భంగా చాల ముఖ్యమైన శబ్దం 'శిపివిష్ట' అనేది. విష్ణువుకు సంబంధించి ఈ శబ్దాన్ని వేదంలో చాల విస్తారంగా వాడటం జరిగింది. ఋగ్వేదం (VII. 99.7; VII 100. 5-6)లో ఈ పదం వచ్చిన భాగాలు అన్నీ ఉద్దేశపూర్వకంగా దాచి పెట్టేశారు. వైదిక పండితులు, శిపివిష్ట పదంతో సూచితమైన విష్ణువు వ్యక్తిత్వ ప్రస్తావన వచ్చినపుడల్లా చాలా జాగ్రత్తగాను, యథాలాపంగాను వ్యవహరించారు. ఈ పదాన్ని వివరించటానికి అనేక ప్రయత్నాలు జరిగాయి. ఏవో కొన్ని తత్వానికి కావలసిన అంశాలు తప్ప వాటిల్లో ఏ ఒక్కటి కూడా విష్ణువు నిజమైన స్వభావాన్ని చూపలేకపోయింది. భాషా శాస్త్రం ప్రకారం శేప (పురుషాంగం) అనే పదాన్ని 'శిపి' అనే పదంతో విడదీయటానికి వీల్లేదు. ఇతర దేశీయ రూపాలు శిఫ (ప్రాకృత ధాతువు 'చిప) లాటిన్ 'ఓయిప్పస్', శీపియో (కట్టె) మొదలైనవి. నిరుక్తం (V.7) కూడా స్పష్టంగా వివరించకపోయినా ఈ అభిప్రాయాన్నే కొంచెం అటూ ఇటూగా సమర్థిస్తున్నది. ఆ పదానికి ధాతురూపం ఒకటి చేరింది. మొత్తానికి ఆ పూర్తిపదం 'మారుతున్న లింగం', 'ఉబ్బుతున్న

తగ్గుతున్న పురుషాంగం' అనే అర్థాన్ని ఇస్తుంది. విష్ణువు ఈ రూపంగురించి వైదిక పండితులు అంత జాగ్రత్తగా, అస్పష్టంగా ఎందుకు మాట్లాడారో ఇప్పుడు మనకు సులువుగానే అర్థం అవుతుంది. ఈ సందర్భంలో, విష్ణువు యొక్క ఈ పేరు గురించి నిరుక్తం (V.8-9) ఏం చెబుతున్నదో గమనించటం చాలా అవసరం. శిపివిష్ట అనేపదం విష్ణువు యొక్క ప్రాచీన పురుషాంగ స్వభావాన్ని భద్రపరిచిందని పొరపాటు లేకుండా చెప్పవచ్చు. వైదిక శ్లోకాలలో క్రతువులలో విష్ణువును సారవంతం(ఫలనం) ఉత్పత్తి, స్వయం జీవం అనే అర్థాలను స్ఫురింప జేసే భావాలతో కలిపి చెప్పే ప్రస్తావనలు చాలా కనిపిస్తాయి.

"వైదిక శ్రాద్ధకర్మకు సంబంధించిన అస్పష్టమైన లక్షణం ఏమంటే, పితరులకు ఉద్దేశించిన నైవేద్యంలో గోరు లేకుండా అంగుష్ఠాన్ని ముంచాలి. ఈ చర్య విష్ణు స్తోత్రంతో కలిపి జరగాలి. అంగుష్ఠం నిస్సందేహంగా పురుషాంగానికి గుర్తు. ఈ క్రతువు వల్ల విష్ణువు, వైదిక క్రతువులో పురుషాంగ వ్యవహారానికి సంబంధించిన వాడు అని స్పష్టమవుతున్నది. తర్వాతి వాఙ్మయంలో విష్ణువును బొటన వ్రేలుతో పోల్చి చూపటం జరిగింది. ఐ.ఎస్.పాఠభాగం (VI.2.4.2)లో దీనికి సంబంధించిన మరొక నిదర్శనం కనిపిస్తుంది. భూమాతలోకి విష్ణువు ప్రవేశించటం అంటే ఫలన క్రతువుకు సంబంధించిన సాంకేతిక వర్ణన. విష్ణువుకు సంబంధించి వాడిన ప్రస్తావనలో (VII.99.1, VIII. 100.2) 'తన్వర్థనా' అనే మాటలు అతని పురుషాంగ స్వభావాన్ని ఉద్దేశించినవే అని అర్థం అవుతుంది. తర్వాత వచ్చిన వాఙ్మయంలో విష్ణువును భావగర్భితంగా హిరణ్యగర్భుడని, నారాయణుడని చెప్పటం జరిగింది. స్త్రీ సంభోగ విధులను పరిరక్షించే గొప్ప పిరుదులు గలదీ అయిన దేవత 'సినీవాలి అథ (VII.46.3)తో విష్ణువుకు ఉన్న దగ్గర సంబంధం విష్ణువు మూర్తి మత్వానికి సంబంధించిన ఈ అంశాన్ని ఎంతగానో విశద పరుస్తుంది. సాంఖ్యాయన- గృహ్య సూత్రం (1.22.13) ప్రకారం మంత్రం గర్భధారణ వేడుకతో కలిసి ఉంటుంది. దీనిని బట్టి గర్భంలోని పిండాలను విష్ణువు చాల జాగ్రత్తగా కాపాడతాడని సూచిస్తున్నారు. అథ (VII.17.4)లో విష్ణువుకు లైంగిక ప్రకార్యాలతో సంబంధం ఉన్నట్టు స్పష్టంగా ఉన్నది. విష్ణనిసిక్తప (VII.36.9) అంటే 'వీర్యరక్షకుడు', 'సుమజ్జని' (1.156.2) అంటే సులభంగా కాన్పుకు వీలు కల్పించేది, అనే రెండు విశేషణాలు అర్థ స్ఫోరకాలు (వాటంతటవే అర్థాన్ని స్ఫురించేవి)గా ఉన్నాయి. 'పౌంస్య' పుంస్త్వం (మగశక్తి) అనే దానిని భావగర్భితంగా విష్ణువుకు సంబంధించి వాడటం జరిగింది (ఋగ్వే. ఇ.155.3-4) వృకపి-శ్లోకం (X.86)లో ఇంద్రుడు అలసి పోయినపుడు, ఒక ధైర్యవంతురాలైన కామాతురత గల కోతి అతనికి ఏదో మందు ఇచ్చింది, దానితో ఇంద్రుడు తిరిగి తన మగశక్తిని తెచ్చుకున్నాడని ఉన్నది. ఈ వృకపిని, ఆ తర్వాతి వాఙ్మయంలో విష్ణువుగా గుర్తించారు. ఈ మాటను విష్ణువుకు ఒక పేరుగా విష్ణు సహస్ర నామాలలో చెప్పారు."

ప్రొ॥ దండేకర్ చూపించిన సాక్ష్యాలను బట్టి చూస్తే లింగపూజ మొదట్లో విష్ణువుతో ముడిపడి ఉన్నది. పురాణాలలో లింగపూజకు విష్ణువుతో సంబంధం ఉన్నట్టు కనబడదు.

పురాణాలలో అది శివునితో సంబంధించి ఉంటుంది. ఇది చాలా దిగ్భ్రాంతి గొలిపే మార్పు. మొదటి నుంచీ లింగపూజతో సంబంధం ఉన్న విష్ణువుకు దానితో ఏమీ సంబంధంలేకుండా చేసి, లింగ పూజతో ఏ మాత్రమూ సంబంధంలేని శివునికి దానితో సంబంధం పెట్టారు. ప్రశ్న ఏమంటే లింగపూజ నుంచి విష్ణువును తప్పించి దానిని బ్రాహ్మణులు శివునికి ఎందుకు తగిలించారు?

ఇక చివరిదీ అతి ముఖ్యమైనదీ అయిన ఒక ప్రశ్న మిగిలి పోయింది. ఇది బ్రహ్మ విష్ణు మహేశ్వరుల అంత స్సంబంధాలకు చెందినది.

బ్రహ్మ విష్ణు మహేశ్వరుల అంతస్సంబంధాల గురించి దత్తాత్రేయుని పుట్టుకను గురించిన కథ చెప్పినంత చక్కగా మరేదీ చెప్పలేదు. సూక్ష్మంగా ఈ కథ ఏమంటే ఒకరోజు మధ్యాహ్నం అయిన తరువాత, ముగ్గురు దేవుళ్ల భార్యలయిన సరస్వతి, లక్ష్మి, పార్వతులు ముగ్గురూ కూర్చుని ముచ్చట్లు చెప్పుకుంటున్నారు. అపుడు లోకసంచారి అయిన నారదుడు వారి దగ్గరకు వచ్చాడు. సంభాషణ సాగుతుండగా లోకంలో అందరికన్న పవిత్రురాలైన స్త్రీ ఎవరు అనే ప్రశ్న వచ్చింది. దానికి నారదుడు అత్రి మహాముని భార్య అనసూయ అందరికన్నా పవిత్రురాలు, పతివ్రత అని చెప్పాడు. అయితే ఆ ముగ్గురూ దానిని తీవ్రంగా ఖండించి (ఒక్కొక్కరూ) తామే ఆ స్థానానికి తగిన వారమని చెప్పుకున్నారు. నారదుడు ఆ మాటను అంగీకరించక వారిలో ఒకరు చేసిన అనేక వ్యభిచారపు పనులను ఏకరువు పెట్టాడు. వారు మాట్లాడలేకపోయారు. కాని, వారికి చాలా కోపం వచ్చింది. అనసూయకు దీటుగా తమ స్థానాన్ని నిలుపుకోవాలని అనుకున్నారు. దీనికి మార్గంగా వారి బుద్ధికి తోచింది ఏమంటే, ఎలా అయినా అనసూయను అక్రమ సంబంధానికి గురిచేయటం అని. వారు చేయవలసిన పనిని నిర్ణయించుకున్న తర్వాత, సాయంకాలం వారి భర్తలు ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత ఆ మధ్యాహ్నం నారదుడు వారి గురించి ఏమన్నాడో చెప్పి తాము అవమానానికి గురి కావటం వారి భర్తల తప్పే అని తమ భర్తలను నిందించారు. ఎందుకంటే, అనసూయతో కూడా వారు (తమ భర్తలు) వ్యభిచరించి ఉంటే అపుడు అందరూ సమానులు అయిపోదురుగదా, అపుడు నారదుడు వారిని కించపరిచే అవకాశమే ఉండేది కాదు. అసలు వారు తమ భార్యలను లక్ష్య పెడుతున్నారా, ఒక వేళ లక్ష్య పెడుతున్నట్టయితే వెంటనే వెళ్లి అనసూయ పాతివ్రత్యాన్ని చెడగొట్టి నారదుడు ఆమెను ఉంచిన సమున్నత పీఠాన్నుంచి క్రిందికి లాగిపార వేయవలసిన ధర్మం వారికున్నది గదా అని తమ భర్తలను వారు అడిగారు. తమ భార్యలు (తమ విధిగా) సూచించిన దాని మీద దేవుళ్లకు అంగీకారం కుదిరింది. ఆ బాధ్యతనుంచి తప్పించుకో కూడదని వారు అనుకున్నారు.

ముగ్గురు దేవుళ్లూ అనసూయ పాతివ్రత్యాన్ని చెడగొట్టే పనిమీద అత్రిముని పర్ణశాలకు బయలుదేరారు. ముగ్గురు దేవుళ్లూ ముగ్గురు బ్రాహ్మణుల లాగా మారువేషం వేసుకున్నారు.

వారు అక్కడకు వెళ్లే సరికి అత్రి లేడు. కాని అనసూయ వారిని ఆహ్వానించి వారికి భోజనం తయారు చేసింది. భోజనం తయారు కాగానే, వారిని కూర్చుని భోజనం చేయమని అడిగింది. ఆమె దిగంబరంగా భోజనం వడ్డిస్తేనే తాము ఆమె ఇంట్లో భోజనం చేస్తామని ఆ ముగ్గురు దేవుళ్లూ బదులు చెప్పారు. ప్రాచీన భారత దేశంలో అతిధి మర్యాదలు ఎలా ఉండేవంటే, ఇంటికి వచ్చిన అతిథి అసంతృప్తితో తిరిగి వెళ్లిపోకూడదు. అతను అడిగిన ప్రతీదీ అతనికి ఇవ్వాలి. ఈ నియమానికి విధేయురాలై దిగంబరంగా భోజనం వడ్డించటానికి ఆమె అంగీకరించింది. దిగంబరంగా ఆమె వడ్డన చేస్తున్న సమయంలో అత్రి వచ్చాడు. అత్రిని చూడగానే ముగ్గురు దేవుళ్లూ అప్పుడే పుట్టిన శిశువుల రూపంలోకి మారిపోయారు. (నవజాత) శిశువు లరూపంలో ఉన్న ముగ్గురు దేవుళ్లనూ అత్రి, ఊయలలో ఉంచాడు. ఊయలలో వారి వారి తలలు మాత్రం విడి విడిగా ఉండి శరీరాలు మాత్రం ఒకటిగా కలిసి పోయాయి. అందులోనుంచి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు ప్రాతినిధ్యం వహిస్తున్న మూడు తలలతో ఒకే శరీరంతో దత్తాత్రేయ దేవుడు ఉద్భవించాడు.

ఈ కథ అవినీతి కంపుతో నిండి ఉన్నది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తమ భార్యల స్థాయికి అనసూయను దిగ జార్చటానికి ఆమె పాతివ్రత్యాన్ని చెడగొట్టిన వాస్తవాన్ని కప్పి పుచ్చటానికి మాత్రం కథ ముగింపును కావాలనే మార్చినట్టు కనిపిస్తున్నది. ఏది ఏమయినప్పటికీ, బ్రహ్మవిష్ణు మహేశ్వరులు ముగ్గురూ సమాన స్థాయిలో ఉండేవారని, వారి విధులు ఒకరితో మరొకరు పోటీపడేట్టు ఉండకుండా పరస్పరం అనుకూలంగా ఉండేవనే విశ్వాసం హిందువులలో ఒకప్పుడు ఉండేదని ఈ కథ మనకు చెబుతున్నది. వారు ముగ్గురూ ఒకటిగా, ముగ్గురిలోనూ ఒకరిగా ఈ ప్రపంచాన్ని బ్రహ్మ సృష్టిచేస్తూ, విష్ణువు రక్షిస్తూ శివుడు నాశనం చేస్తూ, త్రిమూర్తిగా రూపొందారని అనుకొనేవారు.

ఈ సమైక్యత ఎన్నో రోజులు నిలవలేదు. ఈ ముగ్గురు దేవుళ్ళ (మత) బోధకులైన బ్రాహ్మణులు మూడు కూటాలుగా విడిపోయి ఒక్కొక్కరూ ఒక్కో దేవుని భక్తులై, మిగిలిన ఇద్దరు దేవుళ్లనూ మినహాయించారు. దీని ఫలితం ఏమిటంటే, ఒక దేవుని భక్తులైన బ్రాహ్మణులు మిగిలిన దేవుళ్లపైన దూషణ, తిరస్కారాలు చేస్తూ ఒక క్రమ పద్ధతిలో దాడి చేయటం జరిగింది.

బ్రాహ్మణులు బ్రహ్మనేం చేశారో తెలుసుకోవటం చాలా ఆసక్తికరంగానూ జ్ఞాన బోధకంగానూ ఉంటుంది. బ్రాహ్మణులు బ్రహ్మను ఒకప్పుడు అత్యుత్తమ స్థానంలో ఉంచి శక్తివంతుడిగా శ్లాఘించేవారు. విశ్వ సృష్టికర్తగా మొట్టమొదటి ప్రజాపతిగా అతనిని కొలిచారు. అతడు వారి ఏకైక పరమోత్కృష్టమైన దేవుడు. బ్రాహ్మణులు అవతార సిద్ధాంతాన్ని అభివృద్ధి చేశారు. దీనివల్ల భగవంతుడు అవసరమైనపుడు అనేక మానవ లేదా జంతురూపాలలో అవతారం ఎత్తుతాడు. దీనిని వారు రెండు ప్రయోజనాలకు వాడుకున్నారు. ఒకటి వారికి ఇష్టం

ఉన్న దేవుని గొప్పతనాన్ని పెంచటానికి, రెండోది వివిధ రూపాలలో దేవుళ్ల మధ్యవైరుధ్యాన్ని సఖ్యపరచటానికి.

ఈ అవతార సిద్ధాంతంతో బ్రాహ్మణులు సర్వనాశనం చేశారు. వివిధ పురాణాలు వివిధ అవతారాల జాబితాలు ఇచ్చాయి. అవి ఈ దిగువ చూడవచ్చు.

| | హరివంశం ప్రకారం | నారాయణీయం ప్రకారం | వరాహ పురాణం ప్రకారం | వాయు పురాణం ప్రకారం | భాగవత పురాణం ప్రకారం |
|---|---|---|---|---|---|
| 1. | వరాహ | హంస | కూర్మ | నరసింహ | సనత్‌కుమారుడు |
| 2. | నరసింహ | కూర్మ | మత్స్య | వామన | ఎలుగుబంటి |
| 3. | వామన | మత్స్య | వరాహ | వరాహ | |
| 4. | పరశురామ | వరాహ | నరసింహ | కూర్మ | నరనారాయణ |
| 5. | రామ | నరసింహ | వామన | సంగ్రామ | కపిల |
| 6. | కృష్ణ | వామన | పరశురామ | అదివక | దత్తాత్రేయ |
| 7. | | పరశురామ | రామ | త్రిపురారి | జాద్న |
| 8. | | రామ | కృష్ణ | అంధకార | రిషభ |
| 9. | | కృష్ణ | బుద్ధ | ధ్వజ | పృథు |
| 10. | | కల్కి | కల్కి | వర్త | మత్స్య |
| 11. | | | | హాలాహల | కూర్మ |
| 12. | | | | కోలాహల | ధన్వంతరి |
| 13. | | | | | మోహిని |
| 14. | | | | | నరసింహ |
| 15. | | | | | వామన |
| 16. | | | | | పరశురామ |
| 17. | | | | | వేదవ్యాస |
| 18. | | | | | నరదేవ |
| 19. | | | | | రామ |
| 20. | | | | | కృష్ణ |
| 21. | | | | | బుద్ధ |
| 22. | | | | | కల్కి |

ఈ అవతారాలన్నీ బ్రహ్మ అవతారాలని పురాణాలు చెబుతున్నాయి. కాని వరాహ,[1] మత్స్య[2] అనే రెండు అవతారాలను మొదట విష్ణువుకు ఇచ్చి (చెప్పి) ఆతర్వాత బ్రహ్మకు ఇవ్వటం బ్రాహ్మణులు ఎపుడు మొదలు పెట్టారని? మళ్లీ బ్రహ్మతో సమానంగా విష్ణువునూ, ఈశ్వరుణ్ణీ బ్రాహ్మణులు అంగీకరించిన తర్వాత కూడా విష్ణువు కంటె ఈశ్వరునికంటే బ్రహ్మ గొప్పవాడని వారు చెబుతూ వచ్చారు. బ్రహ్మను శివుని[3] పూర్వీకుడిగా (బ్రాహ్మణులు) చేశారు. విష్ణువు[4] విశ్వరక్షకుడు అయ్యాడంటే అది బ్రహ్మ ఆజ్ఞవల్లనే అని బ్రాహ్మణులు అన్నారు. బహుళ దేవుళ్లు ఉండటం మూలంగా వారి మధ్య జగడాలు ఎప్పుడూ వస్తుండేవి. ఆ జగడాలను పరిష్కరించటానికి మధ్యవర్తిగా ఒక దేవుడు ఉండటం కూడా అవసరం అయింది.

పురాణాల నిండా అటువంటి పోరాటాలు చాలా ఉన్నాయి. దేవుళ్ల మధ్య యుద్ధాలు కూడా జరిగాయి. రుద్రునికీ, నారాయణునికీ,[5] కృష్ణునికీ శివునికీ[6] మధ్య పోరాటాలు జరిగాయి. ఈ కొట్లాటల్లో బ్రాహ్మణులు బ్రహ్మను మధ్యవర్తిని చేశారు.

అంతటి ఉత్తమ స్థానానికి బ్రహ్మను తీసుకు వెళ్లిన బ్రాహ్మణులు ఆ తర్వాత అతనికి వ్యతిరేకులై ఆయనను కించపరచడం, బురద జల్లటం మొదలుపెట్టారు. బ్రహ్మ, విష్ణువుకంటే శివుని కంటే వాస్తవానికి తక్కువ అనే సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. ఇంతకు ముందు చేసిన ప్రవచనాలకు విరుద్ధంగా, బ్రహ్మ శివుని[7] నుంచి పుట్టాడని కొందరు బ్రాహ్మణులూ, విష్ణువు[8] నుంచి పుట్టాడని మరికొందరూ ప్రచారం చేయటం మొదలుపెట్టారు.

శివునికి బ్రహ్మకు ఉన్న సంబంధాన్ని బ్రాహ్మణులు పూర్తిగా తలకిందులు చేశారు. బ్రహ్మ ముక్తిని ప్రసాదించే దేవుడు కాకుండా పోయాడు. ముక్తిని ప్రసాదించే దేవుడు శివుడని చెప్పారు. చివరకు బ్రహ్మను ఒక సామాన్య భక్తుని స్థాయికి దించి అతడు కూడా ముక్తికోసం శివుణ్ణి లింగాన్ని పూజచేసే పరిస్థితికి బ్రాహ్మణులు తీసుకువచ్చారు.[9] ఆఖరికి బ్రహ్మను, శివుని నౌకరు స్థాయికి వారుదించి శివుని రథాన్నితోలే వాడుగా[10] చేశారు.

బ్రహ్మను దిగజార్చటంతో బ్రాహ్మణులు ఆగలేదు. సాధ్యమైనంత దుర్మార్గంగా అతని

1. రామాయణం – మూయిర్ సంస్కృత గ్రంథావళి సం.4.పుట 33
2. మహాభారతం – వానపర్వ, లింగపురాణం, మూయిర్ పుట 38–39
3. విష్ణుపురాణం – మూయిర్. పుట 392
4. రామాయణం – మూయిర్ పుట 477
5. మహాభారత శాంతిపర్వం, మూయిర్.సం.4 పుట 240
6. మహాభారత శాంతిపర్వం, మూయిర్ పుట 279
7. మహాభారత అనుశాసనపర్వం–మూయిర్ పుట 188
8. భాగవతపురాణం – పుట 43
9. మహాభారత – మూయిర్ సం.4.పుట 192
10. **మహాభారత – పుట 193**

మీద నిందారోపణ చేశారు. తన స్వంత కూతురయిన సరస్వతిని మానభంగం చేశాడనే కథను ప్రచారం చేశారు. ఇది భాగవత పురాణంలో మళ్లీ కనిపిస్తుంది.[1]

“ఓ క్షత్రియా! స్వయంభువు (బ్రహ్మ) లావణ్యవతీ, మోహనమైన రూపంగలదీ అయిన తన కూతురు వాక్పై మోహం చెందాడనీ, ఆమెకు అట్టి కోరిక ఏదీ లేదనీ మేము విన్నాము. మచి మరీచి నాయకత్వంలో మునులు, అతని కుమారులు, తమ తండ్రిని (దుర్మార్గానికి తలపడినందుకు) బాధతో ఇలా మందలించారు. “ప్రభువైన మీరు, మోహాన్ని అదుపులో పెట్టుకోలేకుండా మీ స్వంత కూతురును సమీపించటం అనేది ఇంతకు ముందు ఎవరూ చెయ్యలేదు, మీ తర్వాత కూడా ఎవరూ చేయరు' అని అన్నారు. ఓ సృష్టికర్తా ! తప్పు చేస్తున్న పెద్దలను అనుకరించి ఆనందపడే మనుషుల విషయంలో కూడా ఇది మెచ్చుకోదగిన విషయంకాదు. తన తేజస్సుద్వారా తనలో నివసిస్తున్న విశ్వాన్ని సాక్షాత్కరింప చేసిన విష్ణువుకు జయమగుగాక! ధర్మాన్ని అతడు కాపాడుగాక! తన కుమారులు, ప్రజాపతులూ తన ముందు అలా మాట్లాడుతుండటం చూసి ప్రజాపతుల అధినేత అయిన బ్రహ్మ సిగ్గుపడి తన శరీరాన్ని త్యజించాడు. దిశా ప్రాంతాలన్నీ ఆ శరీరాన్ని స్వీకరించాయి. అదే మసక చీకటి అయింది.”

బ్రహ్మపైన జరిగిన ఈ దాడి ఏదయితే ఉన్నదో అది అతనిని పూర్తిగా భ్రష్టు పట్టించటం కోసం చేసింది. దీనితో బ్రహ్మను పూజించే పద్ధతి భారత దేశంలో పూర్తిగా తుడిచి పెట్టుకు పోవటంలో ఆశ్చర్యం ఏదీలేదు. త్రిమూర్తులలో నామమాత్రమైన, సిద్ధాంతపరమైన సభ్యుడిగా బ్రహ్మ మిగిలి పోయాడు.

రంగంలో నుంచి బ్రహ్మను పూర్తిగా తరిమివేసిన తర్వాత, బ్రాహ్మణులలో రెండు వర్గాలు మిగిలిపోయాయి. ఒకటి శివుని పక్షం, రెండోది విష్ణువు పక్షం. తమ తమ దేవతల అభిమానులుగా వారు ఏం చేశారో చూద్దాం. ఏ వర్గం కూడా ఎదుటి వర్గం దేవుడి పూజా పద్ధతిని నాశనం చేయలేకపోయారు. శివపూజ, విష్ణుపూజ రెండూ సాగుతూనే, అభివృద్ధి చెందుతూనే వచ్చాయి. ఆ తర్వాత అనేక పూజా పద్ధతులు వెలసినా, ఈ రెండింటినీ మాత్రం మింగి వేయలేకపోయాయి. శివభక్తులూ, విష్ణుభక్తులూ అయిన బ్రాహ్మణులు చేసిన అనుకూల, వ్యతిరేక ప్రచారాలవల్లనే ఇది సాధ్యమయింది. ఈ ప్రచారాలు ఎలాసాగాయో చెప్పటానికి ఈ క్రింది ఉదాహరణలు సరిపోతాయి.

వైదిక దేవుడయిన సూర్యునితో విష్ణువుకు సంబంధం ఉన్నది. శివభక్తులు అతనికి అగ్నితో సంబంధం పెట్టారు. ఒకరికి వైదిక మూలం ఉంటే రెండో వానికి కూడా వైదిక మూలం ఉండాలి. వంశ ప్రతిష్ఠ విషయంలో ఎవరూ ఎవరికీ తీసిపోకూడదు.

---

1. మూయిర్ – సంస్కృత గ్రంథాలు సం.4, పుట 47.

శివుడు విష్ణువుకంటే గొప్పవాడుగా ఉండాలి. విష్ణువు శివునికి ఏమాత్రమూ తీసిపోకూడదు. విష్ణువుకు వెయ్యిపేర్లున్నాయి.[1] కాబట్టి శివునికి కూడా వెయ్యిపేర్లుండాలి.[2] ఉన్నాయి కూడా. విష్ణువుకు కొన్ని చిహ్నాలు ఉన్నాయి.[3] కాబట్టి శివునికి కూడా ఉండాలి. ఉంచారు కూడా.[4]

ఘనకార్యాలు చేసే విషయంలో ఒకరిపట్ల చేసే ప్రచారం, రెండోవానికి సరితూగేటట్లు ఉండాలి. పావనగంగానది పుట్టుకకు సంబంధించిన కథ.[5] దీనికి తగిన ఉదాహరణగా చెప్పుకోవచ్చు. శివభక్తులు దాని మూలం శివునికి ఆపాదిస్తారు. శివుని జటాజూటం నుంచి పుట్టిందని వారు అంటారు. అయితే వైష్ణవులు దీనిని ఒప్పుకోరు. వారు మరొక గాథను పుట్టించారు. వైష్ణవుల కథ ప్రకారం, పావన గంగానది మొదట్లో, వైకుంఠంలో విష్ణువు పాదాల నుండి ప్రవహించిందని. అక్కడ నుండి కైలాసానికి దిగి శివుని నెత్తిమీద పడిందని ఈ కథ ద్వారా రెండు విషయాలను వారు సూచిస్తున్నారు. మొదటిది శివుడు గంగానదికి మూలం కాదని. రెండోది శివుడు విష్ణువుకంటే తక్కువ వాడని. విష్ణు పాదోద్భవ అయిన గంగను నెత్తిమీద ధరించాడని.

దేవాసురుల సముద్ర మథనానికి సంబంధించిన కథ ద్వారా మరో ఉదాహరణ దొరుకుతుంది. మందర పర్వతాన్ని కవ్వంగాను, దానిని తిప్పటానికి శేషుణ్ణి తాడుగాను వారు ఉపయోగించారు. విష్ణువు కూర్మావతారం ఎత్తి తన వీపుమీద భూమిని మోసి, మథనం జరుగుతున్నంత సేపు భూమి కదిలిపోకుండా చేశాడు. విష్ణుకీర్తనంలో ఈ కథ రెండు ప్రయోజనాలు పొందింది. దీనికి శైవులు అనుబంధాన్ని కలిపారు. ఈ అనుబంధం ప్రకారం మథనంవల్ల సముద్రగర్భంలో నుంచి పధ్నాలుగు రత్నాలు బయటపడ్డాయి. ఈ పధ్నాలుగులో కాలకూట విషం ఒకటి. ఈ కాలకూట విషాన్ని ఎవరో ఒకరు మింగకపోయి నట్లయితే దాని తీక్షణత భూమిని సర్వనాశనం చేసేది. శివుడు ఒక్కడే దానిని త్రాగటానికి ముందుకు వచ్చాడు. ఈ కాలకూట విషాన్ని బయటకు తీసుకు రావటానికి దేవతలకు రాక్షసులకు అవకాశం ఇవ్వటంలో విష్ణువు తెలివి తక్కువ పని చేశాడని ఈ కథ సూచిస్తున్నది.

విష్ణువు ఒక మూర్ఖుడనీ శివుడే తన వివేకంతో విష్ణువును తప్పులనుంచి కాపాడుకొస్తున్నాడనీ చెప్పటానికి ఈ మూడో ఉదాహరణ ప్రయత్నిస్తున్నది. ఇదే అక్రూరాసురుని కథ. అక్రూరాసురుడు ఎలుగుబంటి ముఖంతో ఉన్న రాక్షసుడు. అయినప్పటికీ అతడు వేదాలు విడవకుండా నిరంతరంగా చదువుతాడు. పూజా విధులు నిర్వర్తిస్తుంటాడు. అందుకు విష్ణువు చాలా సంతోషించి అతనిని ఇష్టం వచ్చిన వరం కోరుకోమన్నాడు. ఈ ముల్లోకాలలో

---

1. విష్ణు సహస్రనామం చూడండి
2. పద్మపురాణంలో చెప్పారు
3. పైన చూడండి
4. అవి 1.ప్రవహించే గంగ 2. చంద్రుడు 3. సర్పం, 4. జడముడి
5. Moore : Hindu Pantheon. PP. 40-41.

ప్రస్తుతం నివసిస్తున్న ఏ ప్రాణికి గాని తన ప్రాణాన్ని హరించే శక్తి లేకుండా చెయ్యాలని అక్రూరాసురుడు కోరాడు. దానికి విష్ణువు అంగీకరించాడు. కాని ఆ రాక్షసుడు తర్వాత పెద్ద అహంకారి అయిపోయాడు. అతని ధాటికి ఆగలేక దేవతలు ఎక్కడో తలదాచుకోవలసి వచ్చింది. అతడు ప్రపంచాధిపత్యాన్ని వహించాడు. అపుడు విష్ణువు 'కాళి'(నది) ఒడ్డున కూర్చుని ఉన్నాడు. రాక్షసుని అపకార బుద్ధికి, కృతఘ్నతకూ చాలా బాధపడ్డాడు. అపుడు అతని కోపం ప్రజ్వలించి ఎప్పుడూ పుట్టని ఒక శక్తి అతని కళ్లలోంచి వెలువడింది. అదే మహాదేవుడు. అతడు తన వినాశక శక్తితో విష్ణువు ఆత్రుతను ఒక క్షణంలో తొలగించి వేశాడు.

దీనికి జవాబుగా భస్మాసుర కథ వచ్చింది. శివుడు మూర్ఖుడనీ, అతని పొరపాటు నుంచి విష్ణువు అతనిని రక్షించాడనీ చెప్పటానికి ఉద్దేశించిన భస్మాసుర కథతో పై కథను(అక్రూరాసురని కథను) కొట్టి పారవేశారు. శివుణ్ణి సంతృప్తి పరిచిన భస్మాసురుడు ఒక వరం కోరాడు. అదేం వరమంటే భస్మాసురుడు తన చేతిని ఎవరినెత్తిమీద పెడితే వారు భస్మమై పోవాలి. శివుడు ఆ వరాన్ని ప్రసాదించాడు. భస్మాసురుడు ఆవరం మహిమను శివుని మీదనే ప్రయోగించాలని చూశాడు. శివుడు భయభ్రాంతుడై (విష్ణువు దగ్గరకు) పరుగెత్తాడు. విష్ణువు సహాయం చేస్తానన్నాడు. విష్ణువు ఒక సౌందర్యవతి (మోహిని) రూపం ధరించి భస్మాసురుని దగ్గరకు వెళ్లాడు. భస్మాసురుడు ఆమెను మోహించాడు. తనకు లొంగి ఉంటాననే షరతుకు భస్మాసురుడు అంగీకరిస్తే అతని కోరిక తీరుస్తానన్నది మోహిని (విష్ణువు). భస్మాసురుడు అంగీకరించాడు. అపుడు భస్మాసురుణ్ణి నెత్తిమీద చేతులు పెట్టుకోమన్నాడు విష్ణువు(మోహిని). భస్మాసురుడు అలాగే చేశాడు. ఫలితంగా భస్మాసురుడు చనిపోయాడు. విష్ణువేమో శివుని(పొరపాటు నుంచి) రక్షించిన కీర్తి దక్కించుకున్నాడు.

ఈ దేవుళ్ల మధ్యగల శత్రుత్వం గురించీ దాని ఫలితంగా ఏర్పడిన వైరం గురించీ ఈ దేవుళ్లలో మొదట ఎవరు పుట్టారనే కథ బాగా చెబుతుంది. స్కంద పురాణం[2]లో చెప్పిన ఈ కథ ఇలా ఉంది. ఒకసారి విష్ణువు దేవి వక్షస్థలం మీద పడుకొని దీర్ఘ నిద్రలో మునిగిపోయాడు. అతని నాభిలో నుంచి ఒక కమలం పుట్టుకు వచ్చింది. పైకి ఎదుగుతున్న ఆ పూవు వరద ఉపరితలానికి చేరింది. అప్పుడునుంచి బ్రహ్మ ఉద్భవించాడు. చుట్టూ కలయచూసి అంతులేని ఆ విస్మృతిలో ఒక్క ప్రాణి కూడా లేకపోయేసరికి, తానే మొదట జన్మించానని భావించి, భవిష్యత్తులో వచ్చే జీవులందరిలోనూ తానే ప్రథమ శ్రేణిలో ఉంటానని అనుకున్నాడు. అయినా కింద ఎవరైనా ఆ ప్రపంచంలో తన ప్రథమ స్థానానికి దెబ్బతీసే వారు ఉంటారేమో అని పుష్పకాండంలో నుంచి క్రిందికి జారే సరికి నిద్రపోతున్న విష్ణువు కనిపించాడు. గట్టిగా "ఎవరునువ్వు", అని అతనిని అడిగాడు. 'మొదట జన్మించిన వాడిని' అని విష్ణువు అన్నాడు.

---

1 . ఈకథను విష్ణు ఆగమంలో చెప్పారు. మూరే 'హిందూపాంథియన్' అనే పుస్తకంలో దీనిని ఉదహరించాడు. పుటలు 19.20

2. Moore : Hindu Pantheon PP. 17-18.

తన జ్యేష్ఠత్వానికి దెబ్బతగలగానే బ్రహ్మ విష్ణువుతో యుద్ధానికి తలపడ్డాడు. తీవ్రమైన కోపంతో, మహదేవుడు వారిద్దరి మధ్య నిలబడి 'నేను వాస్తవంగా మొదట జన్మించిన వాడిని' అని చెప్పాడు. "అయినా మీ ఇద్దరిలో నా జటాజూటం వెనుక భాగాన్ని గాని, నా అరికాలిని గాని ఎవరు ముందు ముట్టుకుంటారో వారికి నా స్థానాన్ని ఇచ్చివేస్తాను" అన్నాడు. దానికి బ్రహ్మ అంగీకరించాడు. అనంతంగా ఉన్న విశ్వంలో ప్రయోజన శూన్యంగా తిరిగి తిరిగి అలసిపోయాడు. అయినా తన పట్టును వదలడానికి ఇష్టపడకుండా మహదేవుని వద్దకు తిరిగివచ్చి తాను గమ్యం సాధించాననీ మహదేవుని తలపై ఉన్న కిరీటాన్ని చూశాననీ అందుకు సాక్ష్యం మొదట పుట్టిన ఆవు అనీ చెప్పాడు. గర్వం, సత్యం రెండూ కలవటం చూసి మహాదేవునికి కోపం వచ్చింది. పవిత్రమైన పూజలేమీ బ్రహ్మకు జరపకూడదనీ, ఆవునోరు మలినమై పోవాలనీ ఆజ్ఞాపించాడు. అప్పుడు విష్ణువు తిరిగివచ్చి మహదేవుని పాదాలను చూడలేకపోయానని చెప్పాడు. ఆ తర్వాత దేవుళ్లలో తానే మొదట జన్మించిన వాడననీ అందరికంటే తనదే ఉన్నత స్థానమనీ ప్రకటించాడు. దీని తర్వాతనే మహదేవుడు బ్రహ్మ అయిదో తలను నరికి వేశాడు. దానితో బ్రహ్మ గర్వం, శక్తి, ప్రభావం ఉడిగిపోయాయి.

ఈ కథను బట్టి చూస్తే తానే మొదట జన్మించిన వానిగా బ్రహ్మ ప్రకటించుకోవటం అసత్యమని తేలిపోయింది. అలా చేసినందుకు శివుడు అతణ్ణి శిక్షించాడు. తానే మొదట జన్మించిన వానిగా ప్రకటించుకొనే హక్కు విష్ణువు పొందాడు. కాని అది అతనికి శివుని దయ వలన దొరికింది. బ్రహ్మ అనుయాయులు బ్రహ్మకు న్యాయంగా చెందవలసిన దానిని శివుని సహాయంతో విష్ణువు దొంగిలించినందుకు అతనిపై కక్ష సాధించాలనుకున్నారు. అందుకు వారు ఒక కథ[1] అల్లారు. దీని ప్రకారం బ్రహ్మ ముక్కురంధ్రంలో నుంచి విష్ణువు ఒక పంది రూపంలో ఉద్భవించాడని, అది పెరిగి అడివిపంది అయిందని. అంటే విష్ణువు ఒక అడివి పంది లాంటి నీచమైన అవతారం ఎత్తాడని ఈ కథ తాత్పర్యం.

దేవుళ్ల మధ్య ఈ శత్రుత్వం వారి భక్తుల మధ్య తీవ్రమై శివుడు విష్ణువు మీద విష్ణువు శివుని మీద అశ్లీలమైన బూతులు తిట్టుకొనే వరకూ పోయింది.

త్రిమూర్తులను గురించి ఆ తర్వాత జరిగిన చరిత్ర గురించిన వాస్తవాలు ఇవి. త్రిమూర్తి భావనలో కొత్త ఏమీ లేదు. త్రిమూర్తి భావన పాతది, యాస్కునికంటే పాతది. అంతులేని దేవతల సంకుల స్థితిని తగ్గించటం కోసం తొలినాటి బ్రాహ్మణులు, కొందరు దేవుళ్లను ప్రముఖంగా ఎంపిక చేసుకొని మిగిలిన వారిపై ఆ దేవుళ్ళకు ప్రాధాన్యత ఇవ్వాలని చూశారు. అట్టి ప్రధానమైన దేవుళ్ల సంఖ్య మూడుగా నిర్ణయించారు. వీరిలో ఒకరు అగ్ని. రెండోవాడు సూర్యుడు. మూడో స్థానానికి వాయువు. ఇంద్రుల మధ్య పోటీ వచ్చింది. ఫలితంగా అగ్ని, ఇంద్రుడు సూర్యుడు లేదా అగ్ని, వాయువు, సూర్యుడు త్రిమూర్తులుగా వెలిశారు. కొత్త

1. మూరే చెప్పినది. పుట 184

త్రిమూర్తుల భావన పాత భావనతోనే ఏకీభవిస్తుంది. అయితే, వ్యక్తులు మాత్రం మారారు. ఈ త్రిమూర్తులలో ఉన్న ప్రతి ఒక్కరూ కొత్తవారే. మొదటి త్రిమూర్తులను రద్దుచేసిన చాలకాలం వరకు కొత్త త్రిమూర్తులు వచ్చినట్లు కనబడదు. "చులనిద్దేస్స"లో బ్రహ్మ ప్రతికుల ప్రస్తావన మాత్రమే ఉన్నది. విష్ణు ప్రతికుల, శైవప్రతికుల ప్రస్తావన ఎక్కడా లేదు. దీని అర్థం ఏమంటే చులనిద్దేస్స కాలం నాటికి విష్ణు పూజగాని శివపూజగాని పుట్టలేదు అని. బ్రహ్మ పూజకు వాటిని ఆ తర్వాత జోడించి త్రిమూర్తులను తయారు చేశారు. త్రిమూర్తుల పరిణామమూ, ఆ గందరగోళంలో బ్రాహ్మణులు నిర్వర్తించిన పాత్ర, నిశితంగా పరిశీలిస్తే అనేకమైన ప్రశ్నలు ఉత్పన్నమౌతాయి.

మొదటిది ఏమిటంటే, తమ దేవుళ్ళ పట్ల బ్రాహ్మణులు ఎంత అవిధేయులుగా ఉన్నారో అనేది. ఎంతో సులువుగా ఒక వర్గం దేవుళ్లను విడిచిపెట్టి మరొకవర్గం దేవుళ్లను చేరటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈ సందర్భంలో యూదు పూజార్లు, నెబుచడ్-నెజ్-జార్ రాజు గుర్తుకొస్తారు.

"నెబుచాడ్ నెజ్జార్ రాజు[1] ఒక సువర్ణ ప్రతిమను తయారు చేశాడు. దాని ఎత్తు అరవై మూరలు, వెడల్పు ఆరు మూరలు ఉన్నది. దానిని బాబిలోన్ రాష్ట్రంలోని దు-రా మైదానంలో ప్రతిష్టించాడు.

2. నెబుచాడ్ నెజ్జార్ రాజు అపుడు రాజకుమారులను, గవర్నర్లను, సైన్యాధిపతులను, న్యాయమూర్తులను, కోశాధికార్లను, మంత్రులను, అధికార్లను, రాష్ట్ర మండల పాలకులను, తాను ప్రతిష్టించిన ప్రతిమ ఆవిష్కరణ ఉత్సవానికి ఆహ్వానించాడు. "అపుడు రాజకుమారులు, గవర్నర్లు, సైన్యాధిపతులు, న్యాయమూర్తులు, కోశాధికార్లు, మంత్రులు, అధికార్లు, రాష్ట్రాలపాలకులు అందరూ నెబుబాడ్ నెజ్జార్ రాజు ప్రతిష్ఠించిన ప్రతిమ ఆవిష్కరణోత్సవానికి వచ్చారు; నెబ్-ఒ-చాడ్-నెజ్-జార్ నెలకొల్పిన ప్రతిమ ముందు నిలబడ్డారు.

1. ఒక 'రాజోద్యోగి గట్టిగా ఇలా చెప్పాడు- "అన్ని దేశాల, భాషల, ప్రజలారా! మీకు ఆజ్ఞ జారీ అయింది. కార్నెట్, ఫ్లూట్(పిల్లంగోవి), హార్ప్, స్వరమండలం వంటి వాయిద్యాల సంగీత ధ్వనులు వినగానే నెబుచాదీ నెజ్జార్ నిర్మించిన బంగారు ప్రతిమ ముందు మీరు మోకరిల్లి ప్రార్థన చెయ్యాలి. మోకరిల్లకుండా, ప్రార్థించకుండా ఎవరైతే ఉంటారో వారిని వెంటనే కణకణ మండే మంటలలో పడవేస్తారు.

అపుడు ప్రజలందరికీ కార్నెట్, ఫ్లూట్, హార్ప్ వంటి అన్ని రకాల సంగీతాలు వినపడ్డాయి. వెంటనే నెబుచాడ్‌నెజ్జార్ రాజు నిర్మించిన బంగారు ప్రతిమ ముందు అన్ని దేశాల, భాషల ప్రజలు మోకరిల్లి ప్రార్థనలు చేశారు.

---

1. పాత నిబంధన - డేనియల్ అధ్యాయం. 1-23 కీర్తన.

ఆ సమయంలో కొందరు చాల్-డె-యాన్స్ ప్రజలు దగ్గరకు వచ్చి యూదులను నిందించారు. వారు నెబుచాద్ నెజ్జార్ రాజుతో ఇలా అన్నారు. "ఓ రాజా! చిరకాలం జీవించు".

"ఓ రాజా! నీవు కార్నెట్, ఫ్లూట్, హార్ప్ వంటి సంగీత వాయిద్యాల ధ్వనులు వినగానే బంగారు ప్రతిమ ముందు మోకరిల్లి ప్రార్థన చేయాలని ఒక ఆజ్ఞ జారీ చేశావు"

"ఎవరైనా ఆ విధంగా మోకరిల్లకుండా ప్రార్థన చేయకుండా ఉంటే 'కణకణమండే' మంటలలో పడవేయాలి, అని అన్నావు. బాబిలోన్ రాష్ట్ర వ్యవహారాలు చూసుకోవలసిందిగా నీవు బాధ్యత అప్పగించిన యూదులు కొందరున్నారు. ఓ రాజా, వారు షాడ్రక్, మెషాక్, అబెడ్నెగో అనేవారు. వారు నిన్ను గౌరవించటం లేదు. నీ దేవుళ్లను వారు పూజించటం లేదు. నీవు నెలకొల్పిన బంగారు ప్రతిమను పూజించటం లేదు."

అప్పుడు నెబుచాద్ నెజ్జార్ రాజు తీవ్రమైన ఆగ్రహంతో షాడ్రక్, మెషాక్, అబెడ్నెగోలను తీసుకురమ్మని ఆజ్ఞాపించాడుం. వారిని రాజు ముందు ప్రవేశపెట్టారు.

నెబుచాద్ నెజ్జార్ వారితో ఇలా అన్నాడు.

"ఓ షాడ్రక్, మెషాక్, అబెడ్నెగోలారా! మీరు నా దేవుళ్లను ప్రార్థించటం లేదట, నేను ప్రతిష్ఠించిన బంగారు ప్రతిమ ముందు మోకరిల్లి ప్రార్థించటం లేదట, ఇది నిజమేనా"?

"ఇపుడు మీరు సిద్ధంగా ఉండండి. కార్నెట్, ఫ్లూట్, హార్ప్ తదితర తంత్రీ వాద్యాల సంగీతం వినబడగానే మీరు, నేను తయారు చేయించిన బంగారు ప్రతిమ ముందు మోకరిల్లి ప్రార్థనలు చెయ్యాలి. ఆ విధంగా మీరు చెయ్యకపోతే మిమ్మల్ని మంటలలో పడవేయిస్తాను. అపుడు మిమ్మల్ని ఏ దేవుడు రక్షిస్తాడో చూస్తాను."

ఫాడ్రక్, మెషాక్, అబెడ్నెగోలు సమాధానం ఇచ్చారు. "ఓ నెబుచాద్ నెజ్జార్ రాజా! ఈ విషయంలో నీకు మేము సమాధానం ఇవ్వదలుచుకోలేదు".

"అది అలా జరిగితే, ఓ రాజా! మేము కొలుస్తున్న మా దేవుడు మమ్మల్ని మంటల జ్వాలల నుండి బయటకు తీస్తాడు, నీ చేతులనుండి కాపాడుతాడు".

"అలా కాకపోయినా గాని ఓ రాజా! మేము నీ దేవుళ్లను కొలవము. నీవు నిర్మించిన బంగారు ప్రతిమ ముందు మోకరిల్లి ప్రార్థించము, అని నీవు తెలుసుకోవాలి."

"దానితో, షాడ్రక్, మెషాక్, అవెడ్నెగోలను చూసి నెబుచాద్ నెజ్జార్ రాజు తీవ్రమైన కోపంతో మండి పోయాడు. అతని ముఖం మారిపోయింది. వెంటనే మంటలను మామూలుకంటె ఏడురెట్లు ఎక్కువ మంట పెట్టవలసిందిగా ఆజ్ఞాపించాడు."

తన సైన్యంలో ఉన్నవారిలో అత్యంత బలవంతులను పిలిచి, షాడ్రక్, మెషాక్, అవెడ్నెగోలను బంధించి మంటలలో పడవేయవలసిందిగా ఆజ్ఞాపించాడు.

అప్పుడు వారిని కోటు, మేజోళ్లు, టోపీ వంటి దుస్తులతో సహా కట్టివేసి తీక్షణంగా మండుతున్న మంటలలో పడవేశారు.

రాజు ఆజ్ఞ తక్షణం అమలు జరిపే తొందరలో షాద్రక్, మెషాక్, అబెద్నెగోలను మంటలలో పడవేస్తున్న వ్యక్తులు కూడా భీకరంగా విస్తరించిన అగ్నికీలలకు ఆహుతై పోయారు.

బ్రాహ్మణులు మొదటి త్రిమూర్తులను ఎందుకు వదిలేశారు? ఆ దేవుళ్లను తిరస్కరించ వలసినంత ఒత్తిడి వారి మీద వచ్చిన సూచన ఏదీలేదు. అది లాభాపేక్షవల్లనా? లేక ధనాపేక్షవల్లనా?

రెండో ప్రశ్న ఏమిటంటే ఈ ముగ్గురు దేవుళ్ల బ్రాహ్మణ భక్తులూ "తాము జీవించాలి ఇతరులను జీవించనివ్వాలి" అనే సూత్రాన్ని పాటించటం ఎందుకు మొదలు పెట్టారు? ఒక శాఖ మరొక శాఖను నిర్మూలించాలని ఎందుకు అనుకున్నారు? చెప్పుకోతగ్గ సైద్ధాంతిక విభేదం నిజానికి ఈ శాఖల మధ్య ఏదీలేదు. వారి (మత) ధర్మాలూ, విశ్వనిర్మాణ దృక్పథమూ, తాత్త్విక దృష్టి అన్నీ ఒకటే. ఇదంతా ఆలోచిస్తే ఈ చిక్కుముడి మరీ జటిలమై పోతున్నది. శాఖాపరమైన ఈ కొట్లాట రాజకీయ మైనదా? మతాన్ని బ్రాహ్మణులు రాజకీయ విషయంగా చేయాలనుకున్నారా? లేకపోతే ఈ పోట్లాటకు సంజాయిషీ ఏమిటి?

అనువాదం : బొజ్జా తారకం

అనుబంధం : 4

# ॥ స్మార్త ధర్మం

స్మార్త ధర్మానికి సంబంధించిన పవిత్ర వాఙ్మయం స్మృతులతో (ధర్మ శాస్త్రాలతో) కూడి ఉన్నది. ఈ గ్రంథాలలో పవిత్ర శాసనాలు అని భావించే ధర్మాలు ఉంటాయి. ఇవి బహు విస్తారంగా ఉండి శాసనం, ప్రభుత్వం, సమాజంలోని వివిధ తరగతుల ప్రజల పౌర హక్కులు, ధర్మాలు, పాపాలకు ప్రాయశ్చిత్తాలు, నేరాలకు శిక్షలు మొ॥వాటి గురించి చెప్పాయి. ధర్మానికి సంబంధించిన లౌకిక విభాగంతో ఇపుడు మనకు పని ఏమీ లేదు. ఖచ్చితంగా మతానికి సంబంధించినవని అంగీకరించిన భాగం గురించే ఇప్పుడు మనం చర్చించుకోవాలి.

స్మార్త ధర్మం అంటే స్మృతుల మీద ఆధారపడిన ధర్మం. ఇది ఐదు మత విశ్వాసాల మీద ఆధారపడి ఉన్నది. స్మార్త ధర్మంలోని మొదటి విశ్వాసం ఏమిటంటే, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులతో కూడిన త్రిమూర్తి (మీద) నమ్మకం. ఈ త్రిమూర్తులలో బ్రహ్మ ప్రపంచాన్ని

---

*పై భాగం పై పు పుట సంఖ్య 21లోనిది. ఈ అధ్యాయంలోని తర్వాతి పుటలు కనిపించటం లేదు. ఈ క్రింది భాగం, ఆ తర్వాతది, వదులుగా నీలిరంగు పెన్సిలుతో 55 నుండి 65 వరకు నంబర్లు వేసి ఉన్న పుటల నుండి ఈ విషయాన్ని తీసుకున్నాం. ఇందులో 56వ పుట లేదు. ఈ అన్ని పుటలలోనూ రచయిత స్వహస్తాలతో చేసిన దిద్దుబాట్లు, సూచనలు ఉన్నాయి.* — సంకలనకర్త

---

**'స్మార్త ధర్మ అండ్ తాంత్రిక్ ధర్మ'పై విడి పుటలు ఉన్నాయి. స్మార్త ధర్మ రెండో భాగంగాను, తాంత్రిక్‌ధర్మ మూడో భాగంగాను అంకె వేసి ఉన్నది. మొదటి భాగం శ్రౌత ధర్మం ఉన్నట్లుగా అనిపిస్తున్నది. స్మార్త ధర్మలో ఒకే ఒక పుట 21 అంకెవేసి ఉన్నది. తాంత్రిక ధర్మం 55వ పుటతో మొదలై 65తో ఆఖరవుతున్నది. 56 వ పుట లేదు. గ్రంథకర్త చేతిరాతతో మూడు పుటలు కలిపారు. – సంకలనకర్త**

సృష్టించిన వాడు, విష్ణువు రక్షించేవాడు, శివుడు నాశనం చేసేవాడు. శ్రౌత ధర్మంలో ఉన్న ముప్పైమూడు మంది దేవతలను, స్మార్తధర్మం ముగ్గురికి కుదించి వేసింది.

స్మార్త ధర్మంలోని రెండో విశ్వాసం ఏమంటే శుద్ధి సంస్కారాలపై నమ్మకం కలిగి ఉండటం. స్మార్త ధర్మం ప్రకారం ప్రతి గృహస్థూ కొన్ని సంస్కారాలు ఆచరించాలి. ఆచరించక పోయినట్లయితే అతడు పతితుడవుతాడు. అందుకని...

శిక్షలు, పశ్చాత్తాపాలు పౌరాణిక గ్రంథాలలో ప్రముఖస్థానం వహిస్తాయి. శ్రౌత ధర్మంలో దుర్మార్గులకు, భవిష్యత్తులో శిక్ష విధించే పనితో యమునికి సంబంధం ఏదీ లేదు. బ్రతికి ఉన్న కాలంలో చేసిన పాపాలకు మరణించిన తర్వాత శిక్ష అనుభవించాలనే భావనే అపుడు తెలియదు. కాని ఈ విషయంలో యముని అధికారాలను పురాణాలు విపరీతంగా పెంచి వేశాయి.

"మరణించిన వారిపైన న్యాయ విచారణ చేసేపని, పాపిష్ఠులపై పాలన చేసేపని యమునికి ఇవ్వటం జరిగింది. చనిపోయిన వారంతా అతని ముందు హాజరవుతారు. లెక్కలు రాసే చిత్రగుప్తుడు వారిని ప్రశ్నిస్తాడు. అతడు వారి చర్యలను రాసుకుంటాడు. పుణ్యాత్ములను స్వర్గానికి పంపుతారు. పాపాత్ములనేమో నరకానికి పంపిస్తారు."

"భయంకరుడైన చిత్రగుప్తుడు భూలోకం కరిగి పోతున్నపుడు మేఘాల నుండి వచ్చే శబ్దంలాంటి కంఠధ్వని కలిగి ఉంటాడు. కాటుకకొండలా ప్రకాశిస్తూ, మెరుపుల్లాంటి ఆయుధాలతో భీకరంగా ఉంటాడు. మూడు యోజనాలంత పెద్దగా, ముప్పైరెండు చేతులు, ఎర్రటి కళ్లు, పొడుగు ముక్కు, కొనదేలి ముందుకు పొడుచుకు వచ్చిన పళ్లు, ఇదీ అతని ఆకారం. అతని కళ్లు మరణాన్నీ, రోగాలనూ భరిస్తున్న వాలుగా ఉన్న గుంటల్లాగా ఉంటాయి.

మరణం తరువాత పాపానికి శిక్ష ఉంటుంది. అందువల్ల పాపాత్ముడు తన పాపాలను పోగొట్టుకోవాలనుకొంటే కొన్ని సంస్కారాలు చేయటం ద్వారా పాప పరిహారం చేసుకోవచ్చు.

ఇంతకు పాపం అంటే ఏమిటి? పౌరాణిక ధర్మం ప్రకారం నైతిక దోషం పాపం కిందికి రాదు. పురాణాలు నిర్ణయించిన ఆచారాలను పాటించకపోవటమే పాపం. పౌరాణిక ధర్మం అలాంటిది.

## III. తాంత్రిక ధర్మం

వ్యవహారంలో ఉన్న తాంత్రిక ధర్మం, శక్తి పూజ చుట్టూ కేంద్రీకృతమయి ఉన్నది. శక్తి అంటే అధికారం లేదా బలం. కాని తాంత్రిక విజ్ఞానంలో శక్తి అంటే పురుష దేవునికి స్త్రీ భాగస్వామి. తాంత్రిక ధర్మానికి సంబంధించిన సాహిత్యం చాలా విస్తారమయినది. హిందూ మత వాఙ్మయంలో అదొక ప్రత్యేక విభాగంగా ఉన్నది. హిందూమతంలోని శాక్త భాగంలో దానికి

చెందిన పురాణ వ్యక్తులు అసంఖ్యాకంగా ఉన్నారనేది గమనించాలి. స్త్రీ మూర్తులు కూడ ఎక్కువ. వీరు హిందూదేవగణంలో ప్రత్యేకంగా కనిపిస్తారు.

మొదటి తాంత్రిక ధర్మం పౌరాణిక ధర్మపు విస్తరణగానే ఉండేది. పురాణాలు మొదట అవివాహిత స్త్రీ దేవతలను గుర్తించాయి. వారిని ఆరాధ్య వ్యక్తులుగా భావించాయి. ఆ తర్వాత దేవుళ్ల భార్యలైన వివాహిత స్త్రీలను కూడ గుర్తించటం జరిగింది. దేవుళ్ల భార్యలకు కూడ పూజలు జరగటానికి హక్కు కల్పించారు. ఆ హక్కును గుర్తించటానికి మద్దతుగా పురాణాలు శాక్తేయ సూత్రాలను రూపొందించాయి. పురాణాల ప్రకారం దేవుడు ఒకడే అయినా అతనికి ద్వంద్వ లక్షణాలుంటాయి. ఒకటి శాంత లక్షణం. రెండోది తీక్షణ లక్షణం. ఆ తీక్షణ భాగాన్ని శక్తి అంటారు. దేవుని ఈ శక్తినే పురాణాలు దేవుని భార్యగా మూర్తిమంతం చేశాయి. శాక్తేయం కొందరు దేవుళ్ల భార్యలను ఆరాధించటానికి పునాది ఇదే.

శాక్తేయ సారం ఏమిటంటే, స్త్రీ దేవతను ప్రత్యేకంగా ఒక మహాశక్తిగా, జగన్మాతగా జగదాంబగా కొలవటం. ఒక బ్రహ్మాండమైన నిగూఢ శక్తిగా ఆమెను ప్రత్యేకంగా ఆరాధిస్తారు. ఈమె రెండు భిన్నమైన ప్రత్యేక కార్యాలను ఆదేశిస్తుంది. అదుపులో పెడుతుంది. అందులో మొదటిది, సహజ వ్యాసక్తుల కార్యకలాపాలు. తినటం 'తాగటం' వంటి శరీరానికి ఆధార భూతమైన పనులుగాని, లైంగిక సంపర్కం ద్వారా జీవులను విస్తరింపచేయటం వంటివిగాని ఈ కోవలోనికి వస్తాయి. రెండోది, మనిషి వ్యక్తిగతంగా ఉన్నతుడు కావటానికి గాని తన శత్రువులను నాశనం చేయటానికి గాని మానవాతీతమైన శక్తులను (సిద్ధులను), మాంత్రిక శక్తులను సమకూర్చటం.

హిందూమతంలోని శాక్తవిభాగం పౌరాణిక వ్యక్తులను ఎందరినో తనకుగాను సమకూర్చు కొన్నదని, ఇక్కడ మనం గుర్తుంచుకోవాలి. ఇందులో స్త్రీమూర్తులు అనేకంగా కనిపిస్తారు. హిందూ దేవగణంలో వీరు ప్రత్యేకమైనవారు.

స్త్రీ దేవతాగణం అసంఖ్యాకంగా శాఖోపశాఖలుగా విస్తరించి ఉన్నా శాక్తేయానికి మూలం శివుని భార్యలోనే ఉన్నది. శాక్తేయానికి ఆమే మూలం అనీ లేదా పౌరాణిక స్త్రీ వ్యవస్థ మొత్తం ఆమె నుంచే మలుపు తిరిగిందనీ చాల మంది పండితుల అభిప్రాయం. శాక్తేయానికి ఆమె అగ్రభాగాన నిలబడింది. పురుష దేవుడైన శివుని సహధర్మ చారిణిగానే కాకుండా ఆమె అతని ప్రతి లక్షణానికీ మరింత సాంద్రంగా ప్రాతినిధ్యం వహించి ఉండటం విశేషం. పురుష దేవుడు (శివుడు) ఇతర దేవుళ్ల లక్షణాలనూ, విధులనూ అన్నింటినీ తన వ్యక్తిత్వంలోకి క్రమేపీ ఎలా ఇముడ్చుకుంటూ పోయి హిందూ మతంలో ఒక మహాదేవుడిగా ఎలా రూపొందాడో ఇదివరకే చూపడం జరిగింది. అదే విధంగా (అంతకంటే) ఇంకా ఎక్కువ తీవ్రతతో అతని స్త్రీ భాగస్వామి శాక్తేయంలో అధికార శ్రేణిలో మహాదేవిగా, రూపొందింది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల సహధర్మ చారిణుల (స్త్రీమూర్తుల) అవతారాలనూ విధులను అన్నింటినీ కూడ ఆమె తన

వ్యక్తిత్వంలో మూర్తీభవించుకున్నది. ఇందుకోసం, బ్రహ్మ విష్ణువుల భార్యలను కూడ ఈమెకు కుమార్తెలుగా చెప్పారు. ఈమెకు ఆపాదించిన, భిన్నమైన లక్షణాలు (అనుకూల ప్రతికూల గుణాలు) హిందువుల మనస్సుకు ఏ మాత్రమూ కష్టం కలిగించవు. ఆమె అన్ని విధాలా తన భర్తకు నకలు. మామూలు నకలు కాదు, గాఢమైన ఆకర్షణీయమైన రంగులలో చిత్రితమైన నమూనా. శివుడు రంగులోను స్వభావంలోను ఒకప్పుడు తెల్లగాను (శ్వేత, శుక్ల) మరొకప్పుడు నల్ల(కాల)గాను ఉన్నట్టే అతని స్త్రీ ప్రకృతి కూడ సగం తెల్లగాను (అందుకే ఆమె పేర్లల్లో ఒకటి గౌరి) మిగతా సగం నల్లగానూ (అపుడు ఆమెపేరు కాళి) పరస్పర విరుద్ధంగా ఉన్నది.

భిన్నమైన ఈ లక్షణాలు మళ్ళీ ఒక్కొక్కటినీ వివిధ రీతులలో మార్పులు చేస్తూ అనంతంగా పెంచుకుంటూ వచ్చారు. తెల్లగా నెమ్మది స్వభావం గల శక్తి ఉమ, గౌరి, లక్ష్మి, సరస్వతి మొదలైన శక్తులుగా అయింది. నల్లగా భయంకర స్వభావం గల శక్తి కాళి, దుర్గ, చండీ, చాముండి మొదలైన శక్తులుగా అయింది. శివునికి 1008 పేర్లు విశేషణాలు ఉన్నట్టే అతని భార్యకు కూడ అతని ప్రతిపేరుకూ సంబంధించిన ప్రతినామాలు ఉన్నాయి. కనీసం వెయ్యిపేర్లు ఆమెకు పెట్టారు. కొన్ని ఆమె దయా స్వభావాన్ని తెలిపేవి. మరికొన్ని ఆమె భయంకర స్వభావాన్ని తెలిపేవి. తంత్రాలలో స్పష్టంగా ఏం చెప్పారంటే, 'మ' అనే పదం వచ్చే ఆమె పేర్లలో ఎనిమిది పేర్లను ఎవరైనా జపించినట్లయితే రాజులు కూడా అతని సేవకులయిపోతారు. జనులందరూ అతనిని ప్రేమిస్తారు. అతని కష్టాలన్నీ తీరిపోతాయి.

సూక్ష్మంగా చెప్పాలంటే శాక్తులు మొత్తం శక్తులనన్నింటినీ ఒక శక్తిగా, శివుని స్త్రీ బలంగా ఏకం చేశారు. అది మళ్లీ అనేక రూపాలుగా, మూర్తులుగా రూపం దిద్దుకున్నది.

ఈ శక్తి ఆరాధన మొదట్లో చాల నిరాడంబరంగా మొదలయింది. శివునితో కలిపి దుర్గ పూజగా, విష్ణువుతో కలిపి లక్ష్మి పూజగా, కృష్ణతో కలిపి రాధ ఆరాధనగా, రామునితో కలిపి సీత పూజగా చాల నమ్రతగా మొదలు పెట్టారు. శక్తులు ఎందరో వివరించలేదు.

కొన్నిసార్లు ఎనిమిది శక్తులను పేర్కొన్నారు. మరికొన్నిసార్లు తొమ్మిది అన్నారు. అవి వైష్ణవి, బ్రాహ్మణి, రౌద్రి, మహేశ్వరి, నారసింహి, వారాహి, ఇంద్రాణి, కార్తీకి, ప్రధాన విష్ణుశక్తులు లక్ష్మితోకాక ఏభై ఉంటాయని దుర్గ గౌరి కాక శివ (రుద్ర) శక్తులు ఏభై ఉంటాయని కొందరు అంటారు. సరస్వతిని విష్ణుశక్తిగా, రుద్రశక్తిగా చెప్పి చివరకు బ్రహ్మశక్తిగా పేర్కొన్నారు. వాయుపురాణం ప్రకారం రుద్రుని స్త్రీ ప్రకృతి రెండు రకాలుగా ఉన్నది. సగభాగం 'అసిత' అంటే తెల్లగాను, మిగిలిన అర్ధభాగం 'సిత' అంటే నల్లగాను ఉండేది. అవిమళ్లీ అనేక రూపాలయినాయి. తెల్లగా ఉండి నెమ్మది స్వభావంగల వారిలో ఉమ, గౌరి, లక్ష్మి, సరస్వతి మొదలైన శక్తి రూపాలున్నాయి. ఏది ఎలా అయినా గాని మొత్తానికి ఈ శక్తులు అన్నింటికి ఒకే శక్తిగా రూపారోపణ చేశారు. ఆ శక్తి మళ్ళీ అనేక, ప్రత్యేకమైన రూపాలుగా అవతారాలు

ధరించింది.

కొన్ని విష్ణు అవతారాల విశ్లేషణను బట్టి చూస్తే ఈ వ్యక్తీకరణలు, దైవ శక్తిలో తమ భాగస్వామ్యపు తేడాలను బట్టి రకరకాల గుంపులుగా అవుతాయి. ఉదాహరణకు పూర్తిస్థాయి శక్తిలో పూర్ణశక్తులుగా పాక్షిక శక్తితో అంశ రూపిణులుగా ఇంకా తక్కువ శక్తితో కళారూపిణులుగా, మరింత తక్కువ స్థాయి శక్తితో కళాంశరూపిణులుగా, ఈ శక్తి రూపాలున్నాయి. మర్త్యస్త్రీలు వివిధ స్థాయిలలో బ్రాహ్మణ స్త్రీ మొదలు కింది వర్గం వరకు భూమిమీద అవతరించిన దివ్యమూర్తులుగా పూజార్హులవుతున్నారు. శాక్తపూజా పద్ధతిలో ప్రతిస్త్రీనీ ప్రత్యక్ష దైవంగా కొలుస్తారనే విషయం మరిచి పోకూడదు.

సాధారణమైన వర్గీకరణ 'మహావిద్య'లతో మొదలవుతుంది. ఇవి పది ఉన్నాయంటారు. ఈ సంఖ్య కూడ బహుశా విష్ణువు ముఖ్య అవతారాలలో పదింటికి సరిపోయే విధంగా ఎంచుకున్నారు. ఈ మహా విద్యలు దేవతల ఉత్కృష్టమైన జ్ఞాన శక్తిమూలాలు. మహావిద్య అంటే అస్వాభావికమైన శక్తులను ప్రసాదించే జ్ఞానం అని. వాటి లక్షణాలు ఇవి : (1) కాళి (కొన్నిసార్లు శ్యామ అని పిలుస్తారు). రంగులో నలుపు. స్వభావంలో తీవ్రత, ముక్కోపి, (2) తార దయాళు స్వభావం, ముఖ్యంగా కాశ్మీర్‌లో ఈమెను కొలుస్తారు. (3) షోడశి– పదహారు సంవత్సరాల వయసుగల అందమైన ఆడపిల్ల (త్రిపుర అనికూడ అంటారు, మలబార్‌లో కొలుస్తారు). (4) భువనేశ్వరి (5) భైరవి. (6) భిన్నమస్తక, ఒక చేతిలో రక్తపు మరకలు ఉన్న కత్తిని పట్టుకొని, మరొక చేతిలో తెగిపోయిన తన తల పట్టుకొని వుంటుంది. మొండెంనుండి చిమ్ముతున్న రక్తాన్ని తాగుతున్న దిగంబర దేవత (7) ధూమవతి పొగ రూపంలో ఉంటుంది. (8) వగల (బగళ). కొంగముఖం కలిగి ఉంటుంది. (9) మాతంగి– భంగి కులానికి చెందినస్త్రీ (10) కమలాత్మిక. ఇందులో మొదటి రెండూ ప్రత్యేకంగా మహావిద్యలు, తర్వాతి అయిదూవిద్యలు. చివరి మూడూ సిద్ధవిద్యలు.

దేవతల అపరావతాలలో (వ్యక్తీకరణలలో) తరువాతి వర్గం ఏమంటే మాతలు లేదా మాతృకలు. వీరు మహామాతలు. విశ్వమాతలు – మాతృపూజతోడి సంబంధంలో మహావిద్యలకంటే వీరు చాలా ముఖ్యమైనవారు. ఈ రకమైన పూజాపద్ధతి ఏదో విధంగా భారతదేశ రైతాంగ ప్రాంతాలలో ఇంచుమించు అన్ని తెగలలోనూ వ్యాప్తిలో ఉన్నది. మరో అధ్యాయంలో దీని గురించి ఇంకా ఎక్కువగా చెప్పటం జరిగింది.

మాతృదేవతలు వీరు : (1) వైష్ణవి (2) బ్రాహ్మి (బ్రాహ్మణి) తరచు ఈమెను కూడ బ్రహ్మలాగా నాలుగు ముఖాలులేదా నాలుగు తలలతో చూపిస్తారు. (3) కార్తికేయి (కొన్నిసార్లు మయూరి అంటారు). (4) ఇంద్రాణి, (5) యమి, (6) వరాహి (విష్ణువు వరాహావతారానికి సంబంధించినది). (7) దేవి (ఈశాని). ఒక చేతిలో త్రిశూలంతో శివుని భార్యను సూచిస్తుంది. (8) లక్ష్మి. ప్రతిమాతృదేవత ఒడిలోనూ ఒక బాలుడు ఉన్నట్టు చూపిస్తారు.

మాతృదేవతలతో సన్నిహిత సంబంధం కలిగిన స్త్రీమూర్తులు కొందరున్నారు. వారిని నాయికలు (భోగస్త్రీలు) అంటారు. అయితే వీరు ఖచ్చితంగా మాతలే కానవసరం లేదు. వివాహేతర లైంగిక ప్రేమ ఉన్నదనే విషయంలో తప్ప వీరికి మరే భావనతోనూ సంబంధం లేదు. వారిని బాలిని, కామేశ్వరి, విమల, అరుణ, మేదిని, జయిని, సర్వేశ్వరి, కౌలేశి అంటారు.

యోగినులు మరొక తరగతి అవతారాలు. కొన్నిసార్లు వీరిని ఎనిమిది దేవతలుగా లేదా మంత్రగత్తెలుగా సృష్టి చేసి దుర్గకు సేవికలుగా చేశారు. కొన్నిసార్లు ఆ దేవత రూపాలుగానే ఉంచారు. వీరు అరవై నుండి అరవై అయిదు మంది వరకూ ఉన్నారు. వారిని పది మిలియన్ల వరకూ పెంచే అవకాశం ఉన్నది.

ఢాకిని, శాకిని అనే తరగతుల గురించి అంతగా చెప్పుకో నవసరం లేదు. వారు కేవలం స్నేహితురాండ్రుగానూ, భయంకరంగానూ, చికాకు కలిగించే అలవాట్లకు ప్రేరేపకులుగానూ మాత్రమే ఉన్నారు. సాధారణంగా వారు ఎప్పుడూ దేవత దగ్గర సేవచేసే దెయ్యాలుగా ఉండిపోయారు. అందుకనే దేవత అవతారాలుగా వారిని వర్ణించలేదు. కాని కలకత్తాలో కాళీ రూపంలో పూజించే దేవత మాత్రం అత్యంత భయంకరంగా ఉంటుంది.

తంత్రాలలో కాళి సాక్షాత్కారాన్ని వర్ణించే ఈ దిగువ పాఠభాగం (స్వేచ్ఛానువాదాన్ని) ఇక్కడ ఇస్తున్నాను.

"కాళి భయం కలిగించే విధంగా నోరు తెరచుకొని జుట్టు విరబోసుకుని ఉంటుంది. ఆమెను మద్యంతోనూ, బలులతోనూ పూజించాలి. ఆమెకు నాలుగు చేతులు. తాను చంపిన రాక్షసుల తలలను మాలగా గుచ్చి మెడలో వేసుకుంది. ఆ రాక్షసుల రక్తాన్ని తాగింది. పద్మాలవంటి చేతులలో కత్తులు పట్టుకున్నది, భయంలేనిది. దీవెనలు ఇచ్చేది. మేఘాలరంగులో నల్లగా ఉంటుంది. ఆకాశం మొత్తం ఆమె వస్త్రంగా ఉన్నది. మెడచుట్టూ కపాలాల దండ, రక్తం పులిమిన కంఠం, రెండు శవాలు చెవి పోగులుగా పెట్టుకున్నది. వికృతంగా ఉన్న పళ్లు, నవ్వుముఖం, భయంకరాకారం, శ్మశానాలలో (శవాలు తినటంకోసం) నివసిస్తుంది, ఆమె భర్త అయిన మహాదేవుని వక్షస్థలం మీద నిలబడుతుంది."

(63-64 పేజీలు లభ్యంకాలేదు. 64 పేజీ రాతప్రతిని ఇస్తున్నాం. దీనిలో ముగింపు పేరా గ్రంథకర్త దస్తూరిలోనే ఉన్నది)

తాంత్రిక పూజ శ్రౌత, పౌరాణిక పూజల కంటే ఎప్పుడూ భిన్నంగానే ఉంటుంది. ఇది దాని ముఖ్యతత్వానికి అనుగుణంగానే ఉంటుంది. అంటే పురుషుని లైంగిక వాంఛలు పూర్తిగా తీరటమే ఉత్తమమైన పూజావిధానం. తాంత్రిక పూజను పంచ (అయిదు) మకారాలలో చెప్పటం జరిగింది. ఆ అయిదు మకారాలు ఇవి :

1. మద్యపానం
2. మాంసాహారం
3. మత్స్యాహారం (చేపలు తినటం)
4. ముద్రాహారం (కాల్చిన లేదా వేపిన గింజలు తినటం)
5. మైధునం చేయటం (స్త్రీతో లైంగిక సంపర్కం)

ఈ పనులు చేయటంలోనే తాంత్రిక పూజ ఉన్నది. వేటిని నిషిద్ధంగా భావించారో వాటిని తాంత్రిక పూజలో అనుమతించటం జరిగిందనే విషయాన్ని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం ఏమీలేదు. స్త్రీలతో లైంగిక సంపర్కం కూడ పూజలో ఒక భాగంగా చేశారు. హిందూ మతాభివృద్ధి అటువంటిది. ఈ చరిత్ర చదివిన తరువాత హిందూమతంలో ఎంతో నమ్మకం ఉన్నవారు ఎవరైనాగాని (విద్యార్థులు తదితరులూ) ఒకప్రశ్న తప్పకుండా అడుగుతారు; "హిందూమతంలో నీతికి స్థానం ఎక్కడ (ఉన్నది)?" అని.

అనేక ప్రశ్నలు అడగటం ద్వారానే మతం మొదలయిందనే దానిలో సందేహం ఏదీలేదు. "నేను ఏమిటి"? "ఈ విశ్వాన్ని ఎవరు తయారు చేశారు?", "భగవంతుడు దీనిని తయారు చేస్తే అహానికీ భగవంతునికీ సంబంధం ఏమిటి?" భగవంతుడిని తృప్తి పరచటానికి సరైన మార్గం ఏది? "నాకు, ఇతరానికి (నేను కాని దానికి) అంటే, 'మనిషికి – విశ్వానికి' మధ్య ఉన్న సంబంధం ఏమిటి? మంచి జీవితం, అంటే భగవంతుడిని సంతోషపరిచే జీవితం ఏమి అయి ఉంటుంది?" మొదలైనవి.

ఈ ప్రశ్నలలో చాలవాటిని ధర్మశాస్త్రాలు, ఆధ్యాత్మిక విద్యలు, వేదాంత తత్వశాస్త్రాలు, నీతి శాస్త్రాలు తీసుకొన్నాయి. మతం ఇన్ని భాగాలుగా చీలిపోయింది. కాని, మంచి జీవితం అంటే ఏమిటో బోధించి ప్రచారం చేసే ఒక్క విషయం మాత్రం మతంతో మిగిలిపోయింది. ఆపని చేయని మతం మతమేకాదు.

బ్రాహ్మణులు హిందూమతాన్ని ఎందుకు నీతిబాహ్యంగా అంత నగ్నంగా చేశారు, అనేక దేవుళ్లను, దేవతలను ఆరాధించటం, చెట్లను ఆరాధించటం, పుణ్యక్షేత్రాలకు యాత్రలకు వెళ్లి బ్రాహ్మణులకు దక్షిణలు ఇవ్వటం తప్ప హిందూమతంలో వేరే ఏమీలేదు. బ్రాహ్మణులు తమ జీవనోపాధికి సహాయకారిగా మతాన్ని రూపొందించుకున్నారా? నీతి సమాజానికి పునాది అనీ, నీతిని మతంతో పొందుపరిస్తే తప్ప (దానికి నడిపించే)* శక్తి లేదనీ వారెప్పుడైనా ఆలోచించారా? ఈ ప్రశ్నలకు బ్రాహ్మణులే సమాధానం చెప్పాలి.

అనువాదం : బొజ్జా తారకం

---

* ఈ భాగం చెదలు తినివేయటం వల్ల ఈ మాటను మేము చేర్చాం.

అనుబంధం : 5

# వేదాల అమోఘత్వం

హిందువులు ప్రతిరోజూ వేదాధ్యయనం చేయాలనే నియమం ఉన్నది. దానికి శతపథ బ్రాహ్మణం ఈ క్రింది కారణాలు తెలియజేస్తున్నది.

మహాయజ్ఞాలు అయిదు మాత్రమే ఉన్నాయి. అవే అయిదు మహాసంస్కారాలు. అవి (1) భూత యజ్ఞం అంటే భూతబలి. జీవరాసులకు నైవేద్యం పెట్టడం (2) మనుష్య యజ్ఞం (మనుషులకు నైవేద్యం పెట్టటం), (3) పితృయజ్ఞం (పితరులకు, నైవేద్యం పెట్టం), (4 దేవయజ్ఞం (దేవుళ్లకు నైవేద్యం పెట్టడం) (5) బ్రహ్మయజ్ఞం అంటే వేదపఠనం (వేదాలకు నైవేద్యం పెట్టడం) ప్రతిరోజు జీవరాసులకు నైవేద్యం పెట్టాలి. ఆ విధంగా భూతయజ్ఞం పూర్తవుతుంది. గుక్కెడు నీళ్లు ఇవ్వటం ద్వారా అయినా రోజూ, ఆతిధ్యం ఇస్తూ ఉండాలి. ఆ విధంగా మనుష్యయజ్ఞం పూర్తి అవుతుంది. హోమాగ్నిని[2] ప్రజ్వలింప చేయటం ద్వారా అయినా ప్రతిరోజూ దేవతలకు నైవేద్యం పెట్టాలి. ఆ విధంగా దేవయజ్ఞం పూర్తవుతుంది.

3. తర్వాతది వేదాలకు నైవేద్యం అంటే వేదాలను (పవిత్రపుస్తకాలను) విడిగా చదవటం.

---

**ఇది ఆరు పుటలు టైపుచేసి ఉన్నప్రతి. దీనిపై రచయిత చేర్పులుగాని దిద్దుబాట్లుగాని చేయలేదు. ఈ అధ్యాయం తర్వాతి పుటలు లభ్యం కాలేదు – సంకలనకర్త**

---

1. ఈ బలిగురించి నేను ప్రొ.ఔఫ్రెక్ట్ (Aufrecht) నుంచి తెలుసుకున్నాను. పక్షులు మొదలైన వాటికోసం గింజలు చల్లటం, మొ॥న వాటికోసం Boht lingk and Roth's Lexicon S.V.bali. చూడండి. ఇతర యజ్ఞాల వివరాలకు Colelbrooke's Misc.Essays i.pp.150,153. 182-203 చూడండి.
2. దీనికి వివరణగా ప్రొ.ఔఫ్రెక్ట్ కాత్యాయనుని శ్రౌత సూత్రాన్ని ప్రస్తావించాడు. IV.1.10 మను iii 210, 214, 218.
3. "స్వాధ్యాయ స్వశాఖాధ్యయనం" తన శాఖలో వేదాధ్యయనం.

ఇదే వేద పఠనం (బ్రహ్మయజ్ఞం). దీనిలో వాక్కు జూహుగా ఆత్మ ఉపభృత్‌గా, కన్నుధ్రువగా, వివేకం స్రువాగా, సత్యం ప్రక్షాళనంగా, స్వర్గం ముగింపుగా ఉంటుంది. దీనిని తెలుసుకున్నవారు, ఎవరైనా వేదాన్ని రోజూ చదివితే, అనశ్వరమైన ప్రపంచాన్ని జయించగలుగుతారు. ఈ పారాయణ ఫలితం, సర్వసంపదలతో నిండిన భూమి సమస్తాన్నీ (ఎవరైనా కానుకగా ఇస్తే) గ్రహించిన దానికంటే మూడింతలు ఎక్కువగా ఉంటుంది. అందువల్ల వేదాలను చదవాలి. 4. ఋగ్వేద శ్లోకాలు దేవతలకు పాల ఆరగింపు వంటివి. దీనిని తెలుసుకుని ఈ శ్లోకాలను ప్రతిరోజూ చదివినవారు పాలనైవేద్యంతో దేవతలను తృప్తిపరుస్తారు. దేవతలు సంతృప్తి చెంది, అతనిని సంపదతో, ఊపిరి (ఆయుస్సు)తో, ఉత్పత్తి శక్తితో, పూర్తి దేహారోగ్యంతో, శ్రేష్ఠమైన దీవెనలతో తృప్తి పరుస్తారు. పితృదేవతలకు వెన్న సెలయేళ్లు నేను సెలయేళ్లు స్వధ తర్పణాలుగా ప్రవహిస్తాయి. 5. యజుర్వేద శ్లోకాలు దేవతలకు వెన్ననైవేద్యం వంటివి. దీనిని తెలుసుకుని, ఈ శ్లోకాలను ప్రతిరోజూ చదివిన వారు దేవతలను వెన్న నైవేద్యంతో తృప్తి పరుస్తారు. దేవతలు సంతృప్తి చెంది అతనిని సంతృప్తి పరుస్తారు (పైన చెప్పిన విధంగా...) 6. సామ శ్లోకాలు దేవతలకు సోమ తర్పణం లాంటివి. ఇది తెలుసుకుని ఈ శ్లోకాలను రోజూ చదివిన వారు దేవతలను సోమతర్పణంతో సంతృప్తి పరుస్తారు. దేవతలు సంతృప్తి చెంది. అతన్ని సంతృప్తి పరుస్తారు. (పైన చెప్పిన విధంగానే....) 7. అథర్వ, అంగిరస శ్లోకాలు దేవతలకు బలవర్ధకమైన కొవ్వువంటివి. అది తెలుసుకొని ప్రతిరోజూ ఈ శ్లోకాలను చదివితే దేవతలకు కొవ్వుతో నైవేద్యం పెట్టినట్టు అవుతుంది. వారు తృప్తిచెంది అతనిని కూడా (పైన చెప్పిన విధంగానే...) తృప్తి పరుస్తారు. 8. అనాదిగా వస్తున్న (పరంపరాగతమైన) పవిత్ర గ్రంథాలు శాస్త్ర గ్రంథాలు, సంవాద గ్రంథాలు, సంప్రదాయాలు, గాధలు, శ్లోకాలు, స్తుతి గ్రంథాలు ఇవన్నీ దేవతలకు తెనె తర్పణాలవంటివి. ఇది తెలిసిన వ్యక్తి వీటిని రోజూ చదివితే దేవతలను తేనె తర్పణంతో సంతృప్తిపరచిన వాడవుతాడు. వారుకూడ (పైన చెప్పిన విధంగానే...) అతనిని తృప్తిపరుస్తారు. 9. ఈ వేద పఠనంలో నాలుగు వషట్కారాలు ఉన్నాయి. గాలి వీచినపుడు, ఉరుములు ఉరిమినపుడు, మెరుపులు వచ్చినప్పుడు, పిడుగులు పడుతున్నప్పుడు ఈ వషట్కారాలు (అడ్డుపడని క్రమంలో) చదవాలి. ఆ విధంగా చేసిన వారు రెండోసారి మరణించరు.[5] (పునర్జన్మ లేకుండా) బ్రహ్మైక్యం పొందుతారు. అంత శక్తివంతంగా (తీవ్రంగా) చదవలేక పోయినా, దేవుళ్లకు సంబంధించిన ఒక నిర్దిష్ట భాగాన్ని చదవనీయండి, ఆ విధంగా వారు తమతోడివారి సాంగత్యాన్ని కోల్పోకుండా ఉంటారు.

XI. 5,7,1:1. వేద పఠనం గురించిన ప్రశంస ఇలా ఉంది– అధ్యయనం, అధ్యాపనం ప్రీతికరమైనవి. వాటిని అనుసరించిన వ్యక్తి మనో నిబ్బరాన్ని గడిస్తాడు. ఇతరులతో నిమిత్తం

4. ఈ మాటలు కట్టెలతో చేసిన వివిధరకాల యజ్ఞగరిటెలు. వీటి బొమ్మలను ప్రొ ముల్లర్ బ్రాహ్మణ శవ సంస్కారాలపై రాసిన వ్యాసంలో చూడవచ్చు.Journ. of the Germ. or. Sea. Vol. IX. PP IXXVIII and LXXX.

5. చూ. Bothlingk and Roth's Lexicon, S.V. Chaambat.

లేకుండా రోజూ తన లక్ష్యాలు నెరవేర్చుకొంటాడు. ఆనందంగా నిద్రపోతాడు. తానే తనకు మంచి వైద్యుడవుతాడు. ఇంద్రియ నిగ్రహం, ఏకాగ్రచిత్తం, జ్ఞానాభివృద్ధి, కీర్తి, మానవాళిని విద్యావంతులను చేసే శక్తి (ఇవన్నీ పఠనం వలన వచ్చే ఫలితాలు). జ్ఞానాభివృద్ధి అనేది బ్రాహ్మణులకు, సాధుత్వం, ఉచిత ప్రవర్తన, కీర్తి, మానవాళిని విద్యావంతం చేయగలగటం అనే నాలుగు లక్షణాలను తెచ్చి పెడుతుంది. ఆ విధంగా మానవాళిని విద్యావంతులుగా చేయడం వల్ల బ్రాహ్మణునికి సముచిత గౌరవమూ, కానుకల సమృద్ధి, పీడన నుండి విముక్తి, అనాయాస మరణమూ కలుగుతాయి. 2. భూమ్యాకాశాల మధ్య ఉన్న అన్ని రకాల ప్రయాసలలోనూ వేదాధ్యయం అత్యున్నతమైన స్థానం వహించింది. ఇది తెలిసిన వారు చదువుతారు. అందువలన ఈ అధ్యయనం (వేదపారాయణం) కొనసాగించాలి.

3. మనిషి వేద మంత్రాలు చదివే ప్రతిసారీ అతడొక యజ్ఞం పూర్తి చేసినట్టు లెక్క. అందుకే ఈ విషయం తెలిసిన వారు చదువుతారు. అందుకే ఈ పారాయణాలన్నీ. 4. సుగంధ తైలాలు పూసుకొని, ఆభరణాలు అలంకరించుకొని తృప్తిగా భోజనం చేసి, సుఖశయ్యపై పవళించి ఉండిన స్థితిలోనైనా వేదం చదివిన మనిషి తన గోటి చివరల వరకూ (నఖపర్యంతం) తపస్సు చేసిన వ్యక్తి పొందే గొప్పతనాన్ని పొందుతాడు.[1]

5. అతని పరిస్థితి అది. అందువల్ల అది తెలిసినవారు అలా చేయాలి. 5. ఋగ్వేద శ్లోకాలు తేనె, సామవేదం వెన్న, యజుర్వేదం అమృతం, ఎవరైనా సంవాదాలు (వాకోవాక్యం) చదివి ఇటువంటి రెండు రచనలను పఠిస్తే వారు పాయసంతోనూ, మాంసంతోనూ తర్పణ ఇచ్చినట్టవుతుంది.

6. ఇది తెలిసిన వ్యక్తి రోజూ ఋగ్వేద శ్లోకాలను చదివితే, దేవతలను తేనెతో తృప్తి పరచినట్టే వారు తృప్తిపడి అన్నిరకాల వాంఛలనూ తీరుస్తారు. 7. ఇది తెలిసిన వ్యక్తి రోజూ సామవేదం చదివితే, దేవతలను వెన్నతో తృప్తి పరచినట్టు, ఆ విధంగా వారు తృప్తిపడి ... (పై విధంగానే..) 8. ఇది తెలిసిన వ్యక్తి రోజూ యజుర్వేద శ్లోకాలు చదివితే దేవతలను అమృతంతో తృప్తి పరచినట్టే. వారు తృప్తిపడి...9. ఇది తెలిసిన వ్యక్తి సంవాదాలు, వివిధ రకాల ప్రాచీన గాథలు చదివితే దేవతలను పాలతో తృప్తిపరచినట్టు. వారు తృప్తిపడి...10. నీళ్ల ప్రవహించటం, సూర్యుడు, చంద్రుడు గ్రహమండలాలు చలిస్తూ ఉండటం సహజ కృత్యాలు. అలానే బ్రాహ్మణుని వేదాధ్యయనం కూడ. ఏ రోజయినా బ్రాహ్మణుడు వేదం చదవకపోతే ఈ కదిలే వస్తువులు ఒకరోజు కదలకుండా ఆగిపోతే ఎలా ఉంటాయో అలా అవుతాడు. కాబట్టి

1. ఈ వాక్యాన్ని ప్రొ॥ వెబర్ మరోవిధంగా చెప్పారు. Ind. Stud x P.112 (పవిత్రాగ్నితో) అతడు తన గోళ్ల చివరల వరకూ కాలిపోయే వ్యక్తి. ఇదేవ్యాసం తర్వాతి భాగంలో తైత్తిరీయ ఆరణ్యకంలో చెప్పినట్టుగా నాకమౌద్గలీ అనే గురువు సిద్ధాంతం ప్రకారం, వేదాధ్యయన అధ్యాపనాలే నిజమైన తపస్సు (స్వాధ్యాయ-ప్రవచనేవ తద్ధితపః) ఆరణ్యక గ్రంథంలోనే అధ్యయన, అధ్యాపనలతో బాటుగా ఆధ్యాత్మిక లేదా సంస్కార సంబంధమైన కర్మలు, సత్యం, తపస్సు, శమదమాలు, హోమాలు మొ॥ ఉండాలని చెప్పారు. చూ. 'Indische Studies', II.214 X 113. ii, 214; X 113.

అట్టి అధ్యయనాన్ని అభ్యాసం చెయ్యాలి. అందుకని ఋగ్వేదశ్లోకం గాని, సామ, యజుర్వేద శ్లోకాలుగాని, గాధగాని కావ్యంగాని సమర్పిస్తుండాలి. దాని వలన అతని ఆచారానికి భంగం కలిగకుండా ఉంటుంది."

మనువుకూడ శతపథ బ్రాహ్మణాన్ని బలపరిచాడు.

"వేదం, పితరుల, దేవతల, మానవుల శాశ్వత నేత్రం (కన్ను). అది మానవుల శక్తికి, గ్రాహ్యానికి అందనిది; ఇది ఒక ఖచ్చితమైన ముగింపు. వేదం తప్ప మిగతా సంప్రదాయాలు ఋషుల అభిప్రాయాలు ఏమి ఉన్నా అవి మరో ప్రపంచంలో నిష్ప్రయోజనాలే. ఎందుకంటే అవి అంధకారం (అజ్ఞానం)పై వెలసినవి. వేదాలకు బయట ఉన్నవన్నీ (పుస్తకాలు), వస్తూపోతూ ఉండేవన్నీ, ఏమీ విలువ లేనివి; కొత్తగా వచ్చాయి. కాబట్టి అసత్యాలు. చాతుర్వర్ణ వ్యవస్థ, మూడులోకాలు, నాలుగు ఆశ్రమాలు (జీవనావస్థలు), ఇపుడున్నవి, ఉండబోయేవీ అన్నీ వేదం వ్యక్త పరచింది. విషయ గుణాలతో చేరిన పంచతన్మాత్రలు (స్పర్శ, రుచి, శబ్దం, రూపం, వాసన) వాటి ఫలాలు, లక్షణాలు, స్వభావాలు చర్యలతో సహా అన్నింటినీ వేదం వ్యక్తం చేసింది. శాశ్వతమైన వేదం అందరినీ కాపాడుతుంది. అందుకనే (ఈ మానవ) జీవికి అది ముఖ్యమైన పురుషార్థ సాధనంగా నేను గౌరవిస్తాను. సైన్యాధ్యక్షులు, రాజాధికారులు, నేర సంబంధమైన న్యాయ నిర్వాహకులు, విశ్వ సార్వభౌములు, ఎవరైనా గాని దేనికైనా గాని వేదం చదివిన వారే అర్హులు. అగ్ని మండుతున్నప్పుడు పచ్చని చెట్లను కూడా కాల్చివేసినట్లుగా, వేదాలు తెలిసినవాడు కర్మవలన ఆత్మకు అంటుకున్న దోషాన్ని దహించి వేసుకోగలడు. వేదంలో ముఖ్యమైన అర్థాన్ని గ్రహించిన వాడు, జీవితంలో ఏ దశలో ఉన్నప్పటికీ, ఆఖరికి అధోప్రపంచంలో జీవిస్తున్నప్పటికీ బ్రహ్మైక్యానికి సిద్ధమవుతాడు."

మనువు దీనితో తృప్తి చెందలేదు. ఇంకా చాలా ముందుకు పోయి, కొత్త సిద్ధాంతాన్ని ప్రవచించాడు–

"శ్రుతి అంటే వేదం, స్మృతి అంటే ధర్మశాస్త్రం: వీటిలోని విషయాలను హేతువుద్వారా ప్రశ్నించకూడదు. ఎందుకంటే వాటినుండి (వాటిజ్ఞానం) ధర్మం వెలిసింది. హేతువాద గ్రంథాలమీద[1] ఆధారపడిన బ్రాహ్మణుడు ఈ రెండు ప్రధాన జ్ఞానాధారాలను తిరస్కరిస్తాడు, కాబట్టి, అతనిని వేదాలను సందేహించేవాడుగా, తిరస్కరించేవాడుగా, ధార్మికులు వెలివెయ్యాలి...

13. కర్తవ్యజ్ఞానం తెలుసుకోవాలనుకునే వారికి శ్రుతి ఉత్కృష్టమైన ప్రమాణం".

**అనువాదం : బొజ్జా తారకం**

---

1. అయితే దీనిని XII.106లో ఇచ్చిన సూత్రంతో కలిపి చదవాలి. అదేమంటుందంటే "ఆర్ష ధర్మోపదేశమ్ చ వేద శాస్త్ర విరోధినాయస్త ర్కేణాను సంధతే సధర్మాన్ వేదానపరా" ఋషుల ఆజ్ఞలను, స్మృతుల సూత్రాలను, వేదశాస్త్ర విరుద్ధాలుకాని హేతువు ద్వారా పరిశోధించి తెలుసుకొనేవాడే ధర్మాన్ని ఎరిగిన వాడవుతాడు."

# భాగం – 2

# సామాజికపరమైనవి

గ్రంథకర్త అసలు మొదట్లో ఇచ్చిన విషయ వివరణ పట్టిక ప్రకారం 1, 3 భాగాలను, మత రాజకీయ విషయకాలుగా వర్గీకరించారు. భాగం–2ను ఏ ప్రత్యేక వర్గంగానూ పేర్కొనలేదు. అయితే చిక్కుముడి 21లోని ఒక పుట ఈ భాగాన్ని సామాజికంగా పేర్కొన్నది. ఈ భాగంలో ఆరు చిక్కుముడులున్నాయి. వాటిలో 'భారతీయ స్త్రీలను బ్రాహ్మణులు ఎందుకు దిగజార్చారు' అనే శీర్షికతో ఉన్న స్త్రీల చిక్కుముడి ఒకటి. దానిని 'విప్లవం ప్రతి విప్లవం' అనే పేరుతో 17వ అధ్యాయంగా మూడవ సంపుటంలో చేర్చడం జరిగింది. అంచేత ఈ సంపుటంలో దానిని చేర్చలేదు.

చిక్కుముడి : 16

# చతుర్వర్ణాలు – వాటి మూలం బ్రాహ్మణులు కచ్చితంగా ఎరుగుదురా ?

హిందూ సామాజిక వ్యవస్థ ఒక దైవికమైన వ్యవస్థ అని హిందువుల ప్రధాన విశ్వాసం. ఈ దైవిక వ్యవస్థ నిర్దేశకాలు మూడు. సమాజం, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనే నాలుగు తరగతులుగా శాశ్వతంగా విభజించబడిందనేది మొదటి నిర్దేశకం. ఈ నాలుగు తరగతులూ వాటి పరస్పర స్థాయి దృష్ట్యా శ్రేణీకరించిన అసమానతలతో కలపబడ్డాయి అనేది రెండవది. ఈ శ్రేణిలో బ్రాహ్మణులు శిరోభాగాన అందరికంటే పైన ఉన్నారు. క్షత్రియులు బ్రాహ్మణులకంటె దిగువన, వైశ్యులకంటె ఎగువన ఉన్నారు. బ్రాహ్మణులకూ, క్షత్రియులకూ దిగువన ఉన్న వైశ్యులు, శూద్రులకంటె పై స్థాయిలో ఉన్నారు. శూద్రులు అందరికంటె దిగువన ఉన్నారు. ఇక మూడవది – ఈ నాలుగు తరగతుల వారి వృత్తుల స్థిరీకరణ. బ్రాహ్మణుల వృత్తి, విజ్ఞాన సముపార్జన, బోధన. యుద్ధం చేయడం క్షత్రియుల వృత్తికాగా వర్తకం వైశ్యుల వృత్తి. తనకంటె పైనున్న మూడు తరగతుల వారికి సేవ చేయడమే శూద్రుల వృత్తి. దీనినే హిందువులు వర్ణవ్యవస్థ అన్నారు. హిందూతత్వానికే ఇది ప్రధాన

---

**ఇది 33 పుటల టైపుప్రతి. అవసరమైన దిద్దుబాట్లు, చేర్పులు రచయిత స్వయంగా చేశారు. ముగింపు పుటలు 2 రచయిత స్వయంగా రాశారు. ఈ అధ్యాయంలోని పుటలన్నీ విడి కాగితాలు, ఒక దారానికి కట్టి ఉన్నాయి. శీర్షిక ఉన్న పుట రచయిత దస్తూరీలో ఉంది.**

**– సంకలనకర్త**

భూమిక. వర్ణవ్యవస్థ లేకపోతే హిందూ మతానికీ ఇతర మతాలకూ తేడా ఏమీ లేదు. ఈ కారణం కనుక వర్ణవ్యవస్థ పుట్టు పూర్వోత్తరాలను పరిశోధించాల్సిన అవసరం ఉంది.

I

దీని పుట్టుకను గురించి ప్రాచీన హిందూ వాఙ్మయం ఏం చెబుతున్నదో చూడాలి. ముందుగా వేదాలు వెలిబుచ్చిన అభిప్రాయాలను సమీకరించడం మంచిది.

ఋగ్వేదం 10 వ మండలంలోని 90 వ మంత్రంలో ఈ విషయ ప్రస్తావన ఉన్నది. అది ఇలా ఉంది.

(1) "ఆ పురుషునికి వెయ్యి తలలు, వెయ్యి నేత్రాలు, వెయ్యి పాదాలు ఉన్నాయి. అతడు దశాంగుళ ప్రమాణంతో (పదిరెట్లుగా) అనంతంగా భూమండలమంతా వ్యాపించాడు.

(2) భూత భవిష్యత్తులతో సహా సర్వ ప్రపంచమూ ఆ పురుషుడే. ఆహారం ద్వారా సర్వత్రా (సంసారి మండలమంతా) వ్యాప్తి చెందినవాడు గనుక శాశ్వతత్వానికి అతడు ప్రభువు.

(3) అతడి మాహాత్మ్యం అంతటిది. అతడు మహాశ్రేష్ఠుడు. చరాచరాలన్నీ అతడిలో నాల్గవ (పాతిక) భాగం మాత్రమే. రోదసిలోని శాశ్వతత్వం అతడిలో ముప్పాతిక భాగం. పురుషుడు ఆ ముప్పాతిక భాగంతో పైకి వ్యాపించాడు. అతడిలోని పాతిక భాగం ఇక్కడ తిరిగి సృష్టి అయింది. తరువాత స్థావర జంగమాత్మకంగా అంటే, ఆహార స్వరూపంగాను (సాశన), ఆహారం లేని (అనశన) పర్వతాదులుగాను అతడు వ్యాపించాడు. అతడి నుండి విరాట్పురుషుడు, ఆ విరాట్పురుషునికి పైన పురుషుడు ఉద్భవించారు. పురుషుడు ఉద్భవిస్తూనే భూగోళం మొత్తం వ్యాపించాడు.

(4) దేవతలు పురుషుని నైవేద్యంగా పెట్టి యజ్ఞం చేసినపుడు ఆ యజ్ఞానికి వసంత ఋతువు నెయ్యి అయింధి. గ్రీష్మ ఋతువు సమిధలుగాను, శరదృతువు హవిస్సుగాను అయింది. పురుషుణ్ణి యజ్ఞదర్భలపైన బలిపశువుగా సమర్పించి దేవతలు, సాధ్యులు, ఋషులు యజ్ఞం చేశారు. ఆ విశ్వయజ్ఞానికి (సర్వహుతము) అరణ్య, గ్రామ్య పశువులు, యజ్ఞ ద్రవ్య పదార్థాలు (పృషదాజ్యం)గా అయ్యాయి. ఆ యజ్ఞంలో నుండి ఋగ్వేద, సామవేద, యజుర్వేదాలు, ఛందస్సులు కలిగాయి. ఆ యజ్ఞం నుండి రెండు వరుసల దంతాలుండే పశువులు, గుర్రాలు, ఆవులు, మేకలు, గొర్రెలు పుట్టాయి. దేవతలు పురుషుని బలి ఇచ్చినపుడు లేదా కల్పించినపుడు అతనిని ఎన్ని భాగాలుగా నరికినట్లు? అతని నోరు ఏది? అతని భుజాలు ఎటువంటివి? వేటిని ఆయన తొడలు, పాదాలు అని అన్నారు?

అతని ముఖం బ్రాహ్మణుడు, భుజాలు క్షత్రియులు, ఊరువు వైశ్యుడు, శూద్రుడు అతని పాదం. అతని మనస్సు వలన చంద్రుడు, నేత్రం వలన సూర్యుడు, నోటి నుండి ఇంద్రుడు,

అగ్ని; శ్వాస (ప్రాణం) నుండి వాయువు ఆవిర్భవించారు. అతడి నాభి నుండి అంతరిక్షం, శిరస్సు నుండి ఆకాశం (ద్యులోకం), పాదాల వలన భూమి, చెవుల వలన చతుర్దిశలు ఆవిర్భవించగా, ఆ ప్రకారమే దేవతలు లోకాలు ఏర్పరచారు. దేవతలు, పురుషుడ్ని బలిపీఠానికి సమర్పించినపుడు అక్కడ ఏడేసి సమిధలు (ఏడు గాయత్రీ ఛందస్సులు) పరిధులుగా మూడు వరుసలుగా (త్రిసప్త సమిదః) ఉంచారు. బలితోనే దేవతలు యజ్ఞాన్ని నిర్వహించారు. ఇవి తొలినాటి ఆచారాలు. దేవతలూ, సాధ్యులూ ఉండే విరాట్స్వరూపమైన స్వర్గాన్ని వరించినవి ఇటువంటి మహాశక్తులే.

ఈ శ్లోకమే 'పురుష సూక్తం' అనే నామంతో వ్యవహారంలోకి వచ్చింది. ఇదే వర్ణవ్యవస్థకు అధికారిక సిద్ధాంతంగా భావించబడుతున్నది.

ఇతర వేదాలు ఈ సిద్ధాంతాన్ని ఎంతవరకు సమర్థిస్తున్నాయి? సామవేద శ్లోకాల్లో పురుష సూక్తం ప్రస్తావన లేదు. వర్ణం గురించి మరే ఇతర వివరణ కూడ లేదు.

యజుర్వేదానికి రెండు శాఖలున్నాయి. అవి శుక్ల యజుర్వేదం, కృష్ణ యజుర్వేదం.

మొదటి శాఖలో కథక సంహిత, మైత్రేయణి సంహిత, తైత్తిరీయ సంహిత అనే మూడు సంహితలు (మంత్రాల సమూహం) ఉన్నట్లు చెబుతారు. రెండవ శాఖలో వాజసనేయ సంహిత అనే ఒకే ఒక సంహిత ఉంది.

..... యజుర్వేదంలోని మైత్రేయణి, కథక సంహితలు ఋగ్వేదంలోని పురుషసూక్తం గురించి ఎక్కడా ప్రస్తావించలేదు. వర్ణవ్యవస్థ పుట్టుక గురించి ఏ విధమైన వివరణ ఇచ్చేందుకు కూడా అవి ప్రయత్నించలేదు.

కృష్ణ యజుర్వేదంలోని తైత్తిరీయ సంహిత, శుక్ల యజుర్వేదంలోని వాసజనేయ సంహితలు మాత్రం వర్ణ వ్యవస్థ గురించి కొంచెమైనా పేర్కొన్నాయి.

వాజసనేయ సంహిత వర్ణవ్యవస్థ పుట్టుక గురించి ఒక వివరణ ఇస్తున్నది. కాగా తైత్తిరీయ సంహితలో రెండు వివరణలున్నాయి. ఈ తైత్తిరీయ సంహితలోని రెండు వివరణల గురించి రెండు విషయాలు తెలుసుకోవాలి. ఈ రెండూ పరస్పర విరుద్ధాలు, భిన్నమైనది కావడం ఒకటి కాగా, వీటిలో ఒకటి, వాజసనేయ సంహితలో పేర్కొన్న వివరణతో పూర్తిగా ఏకీభవించటం మరొకటి. స్వతంత్ర వివరణగా భావించదగిన తైత్తిరీయ సంహితలోని అంశాలు యధాతథంగా ఇలా ఉన్నాయి.

"కామోద్రేకుడైన అతడు (వ్రాత్యుడు) రాజన్యునికి జన్మ నిచ్చాడు."

"ఈ విషయం తెలిసిన వ్రాత్యుడు ఏ రాజగృహానికి అతిథిగా వెళతాడో అక్కడ అతనికంటే (రాజుకంటె) ఎక్కువగా గౌరవించబడుగాక! ఆ విధంగా చేయడం ద్వారా రాజు

గౌరవానికి, రాజ్యానికి భంగం కలిగించినట్లు కాదు. బ్రాహ్మణులు, క్షత్రియులు అతడి నుండి (వాత్యుని నుండి) ఉదయించినవారే.” “మేము ఎవరిలో ప్రవేశించాలి” అని వారు అడిగారు... మొ||.

తైత్తిరీయ సంహితలోని రెండవ వివరణతో సరిపోలుతున్న వాజసనేయ సంహితలోని వివరణ ఇలా ఉంది.[1]

“అతడు ఒకసారి ప్రస్తుతించాడు. జీవరాశులు ఏర్పడినాయి. ప్రజాపతి పాలకుడు మూడుసార్లు స్తుతించాడు. బ్రాహ్మణుని సృష్టి జరిగింది. బ్రాహ్మణః పతి పాలకుడు, అయిదుసార్లు స్తుతించాడు. భూతరాశులన్నీ ఏర్పడ్డాయి. బ్రాహ్మణఃపతి పాలకుడు. ఏడుసార్లు స్తుతించాడు; సప్తర్షులు సృష్టించబడ్డారు. పాలకుడు ధాత్రి. తొమ్మిదిసార్లు స్తుతించాడు; పితరులు సృష్టించబడ్డారు. పాలకుడు అదితి. పదకొండుసార్లు స్తుతించాడు, ఋతువులు ఏర్పడ్డాయి. ఆర్తవులు పాలకులు. పదమూడుసార్లు స్తుతించాడు, మాసాలు ఏర్పడ్డాయి. సంవత్సరం వాటి పాలకుడు. పదిహేనుసార్లు స్తుతించాడు. క్షాత్రుడు (క్షత్రియుడు) సృష్టించబడ్డాడు. ఇంద్రుడు పాలకుడు. పదిహేడుసార్లు స్తుతించాడు; జంతువులు సృష్టించబడ్డాయి. బృహస్పతి పాలకుడు. పందొమ్మిదిసార్లు స్తుతించాడు; శూద్రుడు, ఆర్యుడు (వైశ్యుడు) సృష్టించబడ్డారు. దివారాత్రాలు (పగలు, రాత్రి) పాలకులు.

అతడు ఇరవై ఒక్కసార్లు స్తుతించాడు. వేరుపడని గిట్టలు గల జంతువులు జన్మించాయి. వరుణుడు వాటి పాలకుడు. ఇరవై మూడుసార్లు స్తుతించాడు. చిన్న జంతువులు సృష్టించబడ్డాయి. పూష వాటి పాలకుడు. ఇరవై అయిదుసార్లు స్తుతించాడు. క్రూర మృగాలు సృష్టించబడ్డాయి. వాయువు వాటి పాలకుడు. అతడు ఇరవై ఏడుసార్లు స్తుతించాడు. స్వర్గం, భూమి విడిపోయాయి. అదే క్రమంలో వసువులు, రుద్రులు, ఆదిత్యులు కూడ విడిపోయారు. వీరే పాలకులు. ఇరవై తొమ్మిదిసార్లు స్తుతించగా వృక్షాలు ఏర్పడ్డాయి. సోముడు వాటి పాలకుడు. అతడు ముప్పైయొక్కసార్లు స్తుతించాడు. జీవరాశులు సృష్టించబడ్డాయి. నెలలోని రెండు పక్షాలూ పాలకులు. ముప్పయొక్కసార్లు స్తుతించాడు. చరాచర సృష్టి యావత్తూ స్థిరపడింది. ప్రజాపతి పరమేష్ఠి పాలకుడు.

ఋగ్వేద, యజుర్వేదాల మధ్య మాత్రమే కాదు, యజుర్వేదంలోని రెండు సంహితల మధ్యనైనా వర్ణవ్యవస్థ వంటి ముఖ్యమైన అంశం యొక్క మూలం (పుట్టుక) గురించి ఏకాభిప్రాయం లేకపోవడం ఇక్కడ గమనించాల్సి ఉంది.

ఇక అధర్వణ వేదాన్ని చూద్దాం. అధర్వణ వేదం కూడా రెండు వివరణల నిస్తున్నది. ఋగ్వేదంలో చెప్పిన శ్లోకాలకు, ఇక్కడ చెప్పిన శ్లోకాలకు వరస క్రమంలో తేడా ఉన్నప్పటికీ

1. Khanda IV. Prapathaka III Verses X తర్వాతవి.

ఇది కూడ పురుష సూక్తాన్ని కలుపుకున్నది. అయితే, ఇక్కడ గమనించాల్సిన ముఖ్యమైన విషయమేమిటంటే, అధర్వణ వేదం కేవలం పురుషసూక్తంతోనే తృప్తి పడటం లేదు. మరికొన్ని వివరణలు కూడా ఇస్తున్నది. అటువంటి ఒక వివరణ ఇలా ఉంది :[1]

"పది తలలు, పది ముఖాలతోనూ బ్రాహ్మణుడు జన్మించాడు. మొదట సోమం తాగాడు; విషాన్ని నిర్వీర్యం చేశాడు.

"రాజన్యుడు గర్భంలో ఉండగానే దేవతలు భయపడ్డారు. గర్భంలో ఉండగానే బంధనాలతో కట్టివేశారు. ఫలితంగా రాజన్యుడు బంధనాలతోనే జన్మించాడు. బంధనాలు లేకుండా పుట్టి ఉంటే అతడు తన శత్రువులను సంహరించి ఉండేవాడు. ఏ రాజన్యుని విషయంలోనైనా సరే, అతడు బంధనాలు లేకుండానే జన్మించాలనీ, శత్రు సంహారం చేయాలనీ వాంఛిస్తే, ఐంద్ర బార్హస్పత్య నైవేద్యం (దక్షణ) సమర్పించాలి. రాజన్యునికి ఇంద్ర లక్షణం ఉంది. బ్రాహ్మణుడు బృహస్పతి. బ్రాహ్మణుని ద్వారా మాత్రమే రాజన్యుడు బంధ విముక్తుడు కాగలడు. సువర్ణదానం అతనిని బాధిస్తున్న బంధనాల నుండి విముక్తుని చేస్తుంది."

రెండవ వివరణ మనువు సంతతి అయిన మనుషులను గురించి చెబుతున్నది.[2] ఆ విషయం ఈ క్రింది వాక్యాల్లో తెలుస్తుంది.

"తండ్రి మనువు, అధర్వణుడు, దధ్యంచి జరిపే కర్మలలో మొదట్లో ఇంద్రుని పేరు మీద ప్రార్థనలు, మంత్రాలు ఉండేవి. ఓ రుద్రా! ఈ యజ్ఞం ద్వారా (తండ్రి) మనువు ఏ సహాయ సంపత్తులు పొందాడో అవన్నీ నీ మార్గదర్శకత్వంలో మేము పొందుదుముగాక".

"ఓ మరుత్తులారా! మీ స్వచ్ఛమైన ప్రతిక్రియలూ, ఓ శక్తివంతులైన దేవతలారా ? మీ శుభస్కరాలైన, లాభదాయకాలైన ఆశీస్సులూ మా తండ్రియైన మనువు కోరుకున్నట్లే నేను మీ నుండి కోరుతున్నాను.

"ఆ ప్రాచీన స్నేహితునికి శక్తివంతులైన దేవతల శక్తులన్నీ సాధనాలైనాయి. (తండ్రి) మనువు అతనికోసం దేవతల విజయద్వారాలుగా స్తోత్రాలను తయారుచేశాడు."

"మనలను కాపాడుతున్న తండ్రి మనువే మనకు క్రతువు."

"ఓ దేవతలారా ! మాకు ముక్తి ప్రసాదించండి, రక్షించండి, మా కోసం మధ్యవర్తిత్వం నడపండి; పైతృకమైన మనువు మార్గాన్నుంచి మమ్మల్ని దూరంగా పోనీయకండి."

"మనువు సంతానంలోని వాడూ, దేవతలను ఆ మంత్రించేవాడు అయిన అగ్ని, ఈ ఐశ్వర్యాలకు (కూడ) ప్రభువు."

---

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు, సం. 1, పుటలు 21-22.
2. మూయిర్ సంస్కృత గ్రంథాలు. సం. 1, పుటలు 162-165

"అగ్ని దేవతలతోనూ, మను సంతతితోనూ, మంత్రాలతోనూ, స్తోత్రాలతోనూ కూడిన బహుళరూపమైన యజ్ఞాలను చేస్తున్నాడు." "ఓ వాజ, రిభుక్షణ దేవతలారా, దేవమార్గంలోనే మా క్రతువుకు రండి", దేవతలకు సంతృప్తికరంగా పుణ్యదివసాలలో మానవ (మను) సంతతి మధ్య యజ్ఞాలను నిర్వహించండి."

"యజ్ఞాలలో ఆమంత్రించే అగ్నిని మానవులు స్తుతిస్తారు."

"ప్రజల ప్రభువైన అగ్ని ప్రజ్వలితమైనపుడు మానవ ప్రజల మధ్య సంతృప్తుడై ఉంటాడు, రాక్షసుల నందరిని పారద్రోలుతాడు."

ఒక్కక్షణం ఆగి, పరిస్థితిని బేరీజు వేసుకుంటే, నాలుగు వర్ణాల మూలం విషయంలో వేదాల మధ్య ఏకాభిప్రాయం లేదని తెలుతుంది. బ్రాహ్మణుడు ప్రజాపతి ముఖం నుండి, క్షత్రియులు అతని భుజాల నుండి, వైశ్యులు అతని తొడల నుండి, శూద్రులు అతని పాదాల నుండి పుట్టుకొచ్చారని ఋగ్వేదం చెబుతున్నదానితో మిగిలిన ఏ వేదమూ అంగీకరించటంలేదు.

## II

బ్రాహ్మణాలుగా పిలువబడే గ్రంథాలు ఈ విషయంలో ఏం చెబుతాయో పరిశీలిద్దాం.

శతపథ బ్రాహ్మణం ఇచ్చిన వివరణ ఇలా ఉంది[1] : ప్రజాపతి, 'భూః' అనడం ద్వారా భూమిని, 'భువః' ద్వారా గాలిని, 'స్వః' ద్వారా ఆకాశాన్ని సృష్టించినట్లు చెబుతారు. విశ్వం ఈ మూడు ప్రపంచాలతో కూడినదై సమంగా వ్యాపించి ఉన్నది. అగ్ని మొత్తంలో సర్వాంతర్యామిగా ఉన్నాడు. భూః అనడం ద్వారా ప్రజాపతి బ్రాహ్మణులను, 'భువః' ద్వారా క్షత్రియులను, 'స్వః' ద్వారా వైశ్యులను సృష్టించాడు. అగ్ని మొత్తంలో ఉన్నాడు. 'భూః' అనడం ద్వారా ప్రజాపతి తనను, 'భువః' ద్వారా తన సంతానాన్ని, 'స్వః' ద్వారా జంతువులను సృష్టించాడు. ఈ ప్రపంచం అంతా తనూ తన సంతానం, జంతువులతో కూడి ఉన్నది.

శతపథ బ్రాహ్మణం మరో వివరణ కూడ ఇస్తున్నది. అది ఈ విధంగా ఉంది :

తొలుత బ్రహ్మ (వ్యాఖ్యాత ప్రకారం బ్రాహ్మణ కులానికి ప్రాతినిధ్యం వహించే అగ్నిరూపం) ఒక్కటే విశ్వంగా ఉన్నది. ఒక్కటిగా ఉండటంతో అది అభివృద్ధి చెందలేదు. అప్పుడది శక్తివంతమైన ఒక అద్భుత రూపాన్ని అంటే "క్షాత్రాన్ని" సృష్టించింది. శక్తివంతులైన ఇంద్రుడు, వరుణుడు, సోముడు, రుద్రుడు, పర్జన్యుడు, యముడు, మృత్యువు, ఈశానుడు మొదలగు దేవతలు ఈ (క్షత్రాణి) వర్గంలోనివారే. అందువలన క్షాత్రునికంటే గొప్పదేదీ లేదు. కనుకనే 'రాజసూయయాగం'లో బ్రాహ్మణుడు, క్షత్రియుని కంటే దిగువన కూర్చుంటాడు. ఆ ఘనతను (రాజాధికారం) క్షత్రియులకే అనుగ్రహించారు. బ్రహ్మ క్షత్రియులకు మూలాధారం

2. మూయిర్ సంస్కృత గ్రంథాలు సం. 1, పుట 17

కావడంతో రాజు ఔన్నత్యం పొందినా చివరికి బ్రాహ్మణుని తనకు మూలంగా (ఆధారంగా) గుర్తిస్తున్నాడు. బ్రాహ్మణునికి హాని చేసినవారు తమ మూలానికే హాని చేసుకున్నట్లు లెక్క. పెద్దలకు హాని చేసినవారివలె వారు అతి దయనీయ పరిస్థితులలోనికి నెట్టివేయబడతారు. 24. అతడు అభివృద్ధి చెందలేదు. అప్పుడు విశ్వే దేవతలను సృష్టించాడు. గుంపులుగా ఉండే దేవతలు వసువులు, రుద్రులు, ఆదిత్యులు, విశ్వదేవులు, మరుత్తులు సృష్టించబడ్డారు. 25. అతడు అభివృద్ధి చెందలేదు. శూద్ర తరగతిని పూషను సృష్టించాడు. ఈ భూమియే పూష ఎందుకంటే ఉన్న వాటన్నింటినీ అది పోషిస్తున్నది కనుక. 26. అతడు అభివృద్ధి చెందలేదు. శక్తివంతమైన, క్రియాశీలమైన ధర్మాన్ని సృష్టించాడు. ఇది పాలకులను (క్షత్రియులను) పాలిస్తుంది. అందుకే ధర్మంకంటే ఉన్నతమైనది ఏదీ లేదు. అందుకే బలహీనులు, బలవంతుల శక్తిని అడ్డుకునేందుకు, రాజును ఆశ్రయించినట్టుగా, ధర్మాన్ని ఆశ్రయిస్తారు. ఈ ధర్మమే సత్యం. ఈ క్రమంలో సత్యం మాట్లాడే మనిషి ధర్మం మాట్లాడతాడనే వాదన వెలువడింది. ధర్మం గురించి మాట్లాడే వ్యక్తి సత్యం మాట్లాడతాడనేది కూడా మరోవాదన. 27. బ్రహ్మ, క్షాత్ర, వైశ్య, శూద్రులు ఇదే. అగ్ని ద్వారా దేవతలలో ఇది బ్రహ్మగాను, మానవులలో బ్రాహ్మణులుగాను మారింది. దేవతా సంబంధమైన క్షత్రియుని ద్వారా మానవ క్షత్రియులు, దేవతా సంబంధమైన వైశ్యుని ద్వారా మానవ వైశ్యులు, దేవతా సంబంధమైన శూద్రుని ద్వారా మానవ శూద్రులు తయారయ్యారు. అందుకే దేవతలలో అగ్నినీ, మానవుల్లో బ్రాహ్మణునీ ఆశ్రయిస్తారు."

తైత్తిరీయ బ్రాహ్మణం మూడు వివరణలను ఇస్తున్నది. మొదటిది :

"ఈ మొత్తం విశ్వమంతటినీ బ్రహ్మ సృష్టి చేశాడు. వైశ్యుల తరగతి ఋక్ శ్లోకాల నుండి పుట్టిందని మానవులు విశ్వసిస్తారు. యజుర్వేద గర్భం నుండి క్షత్రియులు పుట్టారంటారు. సామవేద మూలం నుండి బ్రాహ్మణులు పుట్టుకొచ్చారు. ఇదే మాట మన పూర్వీకులకు వారి పూర్వీకులు చెప్పారు."

రెండవ వివరణ[1] : "బ్రాహ్మణ కులం దేవతల నుండి, శూద్ర కులం అసురుల నుండి పుట్టాయి."

మూడవ వివరణ ఇలా ఉన్నది[2] : "ఆయనను తన ఇష్టానుసారం చెక్క పాత్రతో పాలు తీసుకోనివ్వండి. కాని శూద్రులను అనుమతించకూడదు. ఎందుకంటే శూద్రులు శూన్యంలో నుంచి వచ్చారు. శూద్రులు తీసిన పాలు నైవేద్యం కాజాలవు. అగ్నిహోత్రంలో శూద్రులు పాలు పొయ్యకూడదు. ఎందుకంటే వారు దానిని పవిత్రం చెయ్యలేరు. దానిని వడగట్టిన తర్వాతనే అది నైవేద్యం అవుతుంది.

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు. సం-1, పుట 21.
2. అదే I పుట 21.

బ్రాహ్మణాలు ఇచ్చిన వాఙ్మలం చూస్తే అవి ఎంతవరకు పురుష సూక్తాన్ని సమర్థిస్తున్నాయి? అందులో ఒక్కటి కూడా (సమర్థించటం) లేదు.

III

తరువాత వర్ణవ్యవస్థ పుట్టుక గురించి, స్మృతులు ఏం చెబుతున్నాయన్నది చూడవలసి ఉంటుంది. వాటిని గమనించడం ఎంతో అవసరం. ఈ విషయంలో మనువు ఇలా చెబుతాడు.[1] "(స్వయం అస్తిత్వం గల) అతడు తన శరీరం నుండి వివిధ జీవరాశులను సృష్టించాలనే కోరిక జనించటం మూలంగా, మొదట జలాలను సృష్టించి, అందులో ఒక విత్తనాన్ని (బీజాన్ని) విసిరాడు. 9. ఆ విత్తనం సూర్యుడితో సమానంగా ప్రకాశించే బంగారు అండంగా మారింది. అందులో 'నుంచి అతడే అన్ని' లోకాలకు తండ్రియైన బ్రహ్మగా ఆవిర్భవించాడు. 10. 'నర' నుండి పుట్టినందువలన ఆ నీటిని నారము అంటారు. అవి అతడి మొదటి చలనమండలం కావటం వలన, అతడిని నారాయణుడని అంటారు. 11. అగోచరమైన అనంతం నుండి, స్థితి, స్థితిరాహిత్యాల నుండి ఏర్పడిన పురుషుడే బ్రహ్మగా ప్రసిద్ధి పొందాడు. 12. అండంలో ఒక సంవత్సరం నివసించిన తరువాత ప్రజ్వలిస్తున్న అతడు తన సంకల్పంతో ఇద్దరుగా విడిపోయాడు."

"లోకాలన్నీ ప్రజలతో నిండాలనే (సంకల్పంతో) నోటి (ముఖం) నుండి బ్రాహ్మణులకు, భుజాల నుండి క్షత్రియులకు, ఊరువుల నుండి వైశ్యులకు, పాదాల నుండి శూద్రులకు జన్మనిచ్చాడు. 32. తన దేహాన్ని రెండుగా విభజించుకున్న బ్రహ్మదేవుడు ఒక సగాన్ని పురుషుడిగా, రెండో సగాన్ని స్త్రీగా మలిచాడు. ఆమెలో విరజను సృష్టించాడు. 33. ఓ అద్భుతమైన ద్విజుడా! తెలుసుకో పురుషుణ్ణీ, విరజనూ, సృష్టించిన నేనే ఈ విశ్వానికి సృష్టికర్తను. 34. జీవరాశులను సృష్టించాలనే సంకల్పంతో కఠోరనిష్ఠతో మహర్షులను, ఋషులను జీవరాసుల దేవతలను సృష్టించాను. 35. వారే మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, ప్రచేతనుడు, వసిష్ఠుడు, భృగువు, నారదుడు. 36. వారు అనంతశక్తి సంపన్నులైన మరో ఏడుగురు మనువులను, దేవతలను, వారి నివాసాలను, మహర్షులను సృష్టించారు. 37. యక్షులు, రాక్షసులు, పిశాచులు, గంధర్వులు, అప్సరసలు, అసురులు, నాగులు, పాములు, పక్షులు తదితర పితృవర్ణాలు. 38. మెరుపులు, పిడుగులు, మేఘాలు, వాతావరణంలో దుశ్శకునపు శబ్దాలు, తోకచుక్కలు, ఇంకా వివిధ ప్రకాశకాలు. 39. కిన్నెరలు, కోతులు, చేపలు, రకరకాల పక్షులు, పశువులు, లేళ్లు, జింకలు, మనుషులు, పైనా కిందా దంతాలు గల మృగాలు. 40. చిన్న, పెద్ద సరీసృపాలు, పేలు, ఈగలు, మిన్నల్లులు, జోరీగలు, దోమలు, ఇంకా చలనంలేని వివిధరకాలు సృష్టింపబడ్డాయి. 41. స్థావర జంగమాత్మకమైన ఈ ప్రపంచంలో సృష్టి అయిన ప్రతి జీవి నా నిర్ణయం ప్రకారమూ భక్తి

1. అదే పుస్తకం. పుట 36-37.

నిష్ఫలమైనా ఏ కార్యంలో నియోగించబడిందో దానినే స్వకర్మ వశంవల్ల పొందుతూ ఉంటుంది.

మానవుల్ని నాలుగు తరగతులుగా విభజించడానికి గల ప్రాథమిక కారణాలపై మనుస్మృతిలో మరో అభిప్రాయం కూడ వ్యక్తమైంది.[1]

ఈ లక్షణాల ఆధారంగా ఆత్మ చేరుకునే దశలను నేను సంగ్రహంగా చెబుతాను. 40. సత్వ గుణంతో ఉన్న ఆత్మలు దైవత్వాన్ని పొందుతాయి. రజోగుణం గలవి మానవులవుతాయి. తమోగుణం గలవి మృగాలుగా మారతాయి. మూడురకాల వారి గమ్యాలు అలా ఉంటాయి. 43. ఏనుగులు, గుర్రాలు, శూద్రులు, నికృష్టమైన మ్లేచ్ఛులు, సింహాలు, పులులు, అడవి పందులు మధ్యస్థమైన తమోగుణం వల్ల కలిగిన మధ్యమ జన్మలు. 46. రాజులు, క్షత్రియులు, రాజ పురోహితులు, వాదమే ప్రధాన వృత్తిగా గలవారు, రాజస గుణం వల్ల కలిగిన మధ్యమ జన్మలు. 48. భక్తులు, సన్యాసులు, బ్రాహ్మణులు, విమానాలలో చరించే దేవతలు, నక్షత్ర మండలాలు, దైత్యులు, ప్రాథమిక స్థాయి మంచితనం (సత్వగుణం) కలిగి ఉంటారు. 49. యాగాలు చేసే పూజారులు, ఋషులు, దేవతలు, వేదాలు, విశ్వాంతర ప్రకాశకాలు, సంవత్సరాలు, పితరులు, సాధ్యులు మధ్యస్థమైన మంచితనం (సత్వగుణం) కలిగి ఉంటారు. 50. బ్రహ్మ, సృష్టికర్తలు ధర్మము, మహత్తు, అవ్యక్తము, ఉన్నత స్థాయి మంచితనం (సత్వగుణం)తో ఉంటాయి.

అయితే మనువు ఋగ్వేదంతో ఏకీభవిస్తాడు. కానీ అతడి అభిప్రాయం మాత్రం సరిపోల్చడానికి పనికిరాదు. అది మౌలికమైనది కాదు. అతడు ఋగ్వేదాన్నే మరోసారి ప్రస్తావించాడు.

## IV

ఈ అభిప్రాయాలను రామాయణ మహాభారతాల్లో ఉన్న వాటితో పోల్చి చూడటం ఆసక్తిదాయకంగా ఉంటుంది.

చాతుర్వర్ణ వ్యవస్థ దక్షుని కూతురూ, కశ్యపుని భార్య అయిన మను సంతానంగా రామాయణం చెబుతున్నది.[2]

"ఆది నుండీ ఉన్న ప్రజాపతుల వృత్తాంతం ప్రారంభం నుండీ చెబుతాను వినండి. కర్దముడు మొదటివాడు; తరువాత వోకృతుడు, శేషుడు, సంశ్రయుడు, శక్తివంతుడైన బాహుపుత్రుడు, స్థాణుడు, మరీచుడు, అత్రి, బలవంతుడైన క్రతువు, పులస్త్యుడు, అంగీరసుడు, ప్రచేతసుడు, పులహుడు, దక్షుడు, తరువాత, వివస్వతుడు, అరిష్టనేమి, మహోన్నతుడైన

1. మూయిర్ సంస్కృత పాఠం. సం. 1 పుట 41.
2. మూయిర్ సంస్కృత గ్రంథాలు. సం. 1, పుట 116-117.

కశ్యపుడు చివరివాడు. దక్ష ప్రజాపతికి అరవై మంది కుమార్తెలున్నట్లు ప్రతీతి. వీరిలో ఎనిమిదిమంది అందమైన యువతులను కశ్యపుడు వివాహమాడాడు. వారు అదితి, దితి, దాను, కలక, తామ్ర, క్రోధావస, మను, అనల అనేవారు. వారితో సంతుష్టుడైన కశ్యపుడు ముల్లోకాలను సంరక్షించే తనవంటి కొడుకులనిమ్మని కోరాడు. అదితి, దితి, దాను, కలకలు అందుకు అంగీకరించారు. మిగిలినవారు అంగీకరించలేదు. అదితికి 33 మంది దేవతలు, ఆదిత్యులు, వసువులు, రుద్రులు, ఇద్దరు అశ్వినులు కలిగారు. కశ్యపుని భార్య 'మను' మానవులైన బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులను కన్నది. బ్రాహ్మణులు నోటి నుండి, క్షత్రియులు వక్షస్థలం నుండి, వైశ్యులు తొడల నుండి శూద్రులు పాదాల నుండి జన్మించారని వేదాలు చెబుతున్నాయి.

స్వచ్ఛమైన పండ్లనిచ్చే వృక్షాలకు జన్మనిచ్చింది అనల. వింతల్లో వింతేమిటంటే వాల్మీకి, చాతుర్వర్ణ సృష్టిని ప్రజాపతికి బదులు కశ్యపునికి ఆపాదించడం. ఆయన జ్ఞానం కేవలం కర్ణాకర్ణిగా తెలుసుకున్న వాటిపైనే ఆధారపడింది. వేదాలేం చెప్పాయో ఆయనకు తెలియదనేది సుస్పష్టం.

మహాభారతం విషయానికొస్తే నాలుగుచోట్ల నాలుగు వేర్వేరు వివరణలున్నాయి. మొదటిది ఇలా ఉంది :

"మహాఋషుల వలె వైభవంతో జన్మించిన పదిమంది ప్రచేతసుని పుత్రులు సన్మార్గులుగా పవిత్రులైనవారుగా పేరొందారు. ప్రసిద్ధమైన జీవులన్నీ వారి నోటి నుండి వెలువడిన మంటలకు ఆహుతయ్యాయి. వారికి జన్మించిన వాడే దక్ష ప్రచేతనుడు. అతడే ఈ సకల జీవరాశులకు తండ్రి. దక్షమునికి వీరిణి వల్ల మతాచార పరాయణులైన వెయ్యిమంది పుత్రులు కలిగారు. వీరు తండ్రిని పోలినవారు. వీరికి నారదుడు మోక్షమార్గం బోధించి, సంఖ్యాశాస్త్రంలో అసమాన పరిజ్ఞానం కల్పించాడు. వారసులను సృష్టించదలచిన దక్ష ప్రజాపతి యాభైమంది పుత్రికలను కని, వారిలో పదిమందిని ధర్మునికి, పదమూడు మందిని కశ్యపునికి, సమయ నియంత్రణ పరులైన ఇరవై ఏడుగురిని సోమునికి (చంద్రునికి)..... మరీచి పుత్రుడైన కశ్యపుడు తన 13మంది భార్యలలో ఉత్తమురాలైన దాక్షాయణి వల్ల శక్తివంతులైన ఇంద్రుడు మొదలైన ఆదిత్యులకు, వివస్వంతునికి జన్మనిచ్చాడు.వివస్వంతునికి పుట్టినవాడే శక్తివంతుడైన యమువైవస్వతుడు. మార్తాండునికి (వివస్వతునికి అంటే సూర్యునికి) శక్తియుక్తులు గల మనువు, ఆ పిదప (ఖ్యాతి గాంచిన) యముడు జన్మించారు.

ధర్మవర్తనుడు, తెలివిగలవాడూ అయిన మనువు పేరు మీద ఈ మానవ కుటుంబం మానవ జాతిగా పేరొందింది. బ్రాహ్మణులు, క్షత్రియులు, తదితర మానవులు ఈ మనువు సంతతివారే. ఓ రాజా! అతడి నుండే బ్రాహ్మణులు, క్షత్రియులతో కలిసి పుట్టాడు.

ఇతర అంశాల్లో రెండూ ఒకే విధంగా ఉన్నప్పటికీ మహాభారతం 'మనువు'ను చాతుర్వర్ణ

వ్యవస్థకు మూల కారకునిగా చెప్పడం, మనువు దేహ భాగాల నుండి వర్ణాలు పుట్టలేదని చెప్పడంతో రామాయణంలో పేర్కొన్నదానితో విభేదిస్తున్నది.

మహాభారతంలోని రెండవ వివరణ ఋగ్వేదంలోని పురుష సూక్తాన్ని అనుసరించి ఉంది. అది ఇలా ఉంది :

"మంచిని కాపాడి, చెడును నిరోధించే వ్యక్తిని రాజు పూజారిగా నియమించాలి. ఇలా పుత్రుడైన పురూరవునికి, మాతరిశ్వునికి (వాయుదేవునికి) మధ్య జరిగిన సంభాషణను సూచించే ఈ పురాతన గాథ ప్రస్తుత విషయానికి సంబంధించినది.

"పురూరవుడు – బ్రాహ్మణుల సృష్టి ఎప్పుడు జరిగిందో, మిగిలిన మూడు కులాల సృష్టి ఎప్పుడు జరిగిందో మీరు నాకు వివరించాలి. అదే విధంగా, బ్రాహ్మణుల ఆధిక్యత ఎప్పుడు మొదలైందో కూడ చెప్పాలి."

వాయుదేవుడు : "బ్రాహ్మణులు బ్రహ్మ నోటి నుండి సృష్టించబడ్డారు. క్షత్రియులు భుజాల నుండి, వైశ్యులు తొడల నుండి రాగా ఈ మూడు కులాలవారికీ సేవ చేసేందుకు నాలుగో తరగతిగా శూద్రులు పాదాల నుండి సృష్టించబడ్డారు. సదాచార సంపదను రక్షించటం కోసం బ్రాహ్మణుడు పుట్టిన వెంటనే భూమిపై ఉన్న జీవులన్నింటికీ అధిపతి అవుతాడు. ప్రజలకు సంతృప్తికరంగా పాలన భారాన్ని వహించేందుకు రెండవ యముడనదగిన క్షత్రియుణ్ణి దండధారిగా భూమిని నియంత్రించేందుకు సృష్టికర్త సృష్టించాడు. మూడు తరగతులవారికి సరిపడా ధనధాన్యాలు సమకూర్చాలని వైశ్యులను, వీరందరికీ సేవ చేయాలని శూద్రులను బ్రహ్మ ఆదేశించాడు."

పురూరవుడు : వాయుదేవా! సంపదతో కూడిన ఈ భూమి వాస్తవంగా ఎవరికి చెందాలో చెప్పు. బ్రాహ్మణులకా? క్షత్రియులకా?

వాయుదేవుడు : ఆది పురుషులుగా ప్రపంచంలో ఉన్న ఆస్తి అంతా బ్రాహ్మణులకే చెందుతుంది. విధి నియమావళి గుర్తెరిగిన వారందరికీ ఈ విషయం తెలుసు. బ్రాహ్మణుడు తినేది, ఉంచుకునేది, ఇచ్చేది అంతా అతని సొంతమే. మొదట పుట్టినవాడూ, అత్యద్భుతమైన వాడూ అయిన బ్రాహ్మణుడే అన్ని కులాలకు అధిపతి. (మొదటి) భర్తను కోల్పోయిన స్త్రీ తన మరిదినే రెండవభర్తగా ఎలా భావిస్తుందో, అదే విధంగా విపత్తులో ఆదుకునే సంపదవంటివాడు బ్రాహ్మణుడు. ఆ తరువాతనే ఇంకెవరైనా."

మహాభారతంలోని శాంతి పర్వంలో వెల్లడైన మూడో అభిప్రాయం :

"భృగుమహర్షి : బ్రహ్మ తొలుత తన స్వయం శక్తితో సూర్యునితోను, అగ్నితోను సమానమైన తేజస్సుగల, ప్రజాపతిని సృష్టించాడు. ఆ తరువాత సత్యం, ధర్మవర్తనం, దృఢమైన నైతిక నియమావళి, పవిత్ర శాస్త్రాలైన వేదాలు, స్వర్గప్రాప్తికై మంచి ఆచారాలు

ఏర్పరచాడు. దేవదానవులను, గంధర్వులను, దైత్యులను, అసురులను, మహోరగాలను, యక్షులను, రాక్షసులను, నాగులను, పిశాచాలను, మానవులను, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను ఇంకా అన్ని తరగతుల జీవరాసులను సృష్టించాడు. బ్రాహ్మణుల వర్ణం (రంగు) తెలుపు; క్షత్రియులది ఎరుపు; వైశ్యులది పసుపు, శూద్రులది నలుపు. భరద్వాజుడు ఇంకా ఇలా అంటాడు : "నాలుగు తరగతుల కులం (వర్గం) వారి రంగును (వర్ణం) బట్టి పోల్చుకోగలిగితే అన్ని కులాల విషయంలోనూ అస్పష్టత కనిపిస్తుంది. కోరిక, కోపం, భయం, మోహం, దుఃఖం, నిర్బంధం, ఆకలి, అలసట అందరికీ కలుగుతాయి. మరి కులం దేనితో వివేచన చేస్తాం? చెమట, మలమూత్రాలు, కఫము, పైత్యరసం, రక్తం, అందరికీ సమానమే. అందరి దేహాలు నశించిపోయేవే. మరి కులం దేనితో గుర్తిస్తాం. చలనం, గాలీ, చలనం లేనివీ అయిన వస్తువులు అసంఖ్యాకంగా ఉన్నాయి. వాటి కులాలెలా నిర్ణయిస్తారు?"

భృగుమహర్షి : "కులాల భేదం లేనే లేదు."

ఇదే శాంతి పర్వంలో నాలుగో వివరణ కూడా ఉంది. అందులో –

భరద్వాజుడు మళ్లీ అడుగుతాడు. "వాక్చాతుర్యం గల ఓ బ్రాహ్మణ ఋషీ! ఏ లక్షణం వలన మనిషి బ్రాహ్మణుడిగాను, క్షత్రియుడిగాను, వైశ్యుడిగాను, శూద్రుడుగాను గుర్తింపబడతాడో చెప్పగలవా?

భృగుమహర్షి : స్వచ్ఛమైనవాడు, పుట్టుకతోనే క్రతువులతో శుద్ధి చేయబడినవాడు, వేదాధ్యయనం పూర్తిగా చేసినవాడు, ఆరు రకాల క్రతువులను ఆచరిస్తూ జీవించేవాడు, సాంప్రదాయకమైన కర్మకాండలు ఆచరించేవాడు, (మిగిలిన) నైవేద్యం భుజించేవాడు, మత గురువుతో సంబంధం ఉన్నవాడు, మతాచారాలను క్రమం తప్పకుండా పాటించేవాడు, సత్యబద్ధుడు అయినవాడు బ్రాహ్మణుడు. ఎవడిలోనైతే సత్యం, దాతృత్వం, సాత్వికత, అపాయ రాహిత్యం, శీలం, కరుణ, మనఃపూర్వకమైన శ్రద్ధ ఉంటాయో అతడు బ్రాహ్మణుడిగా గుర్తించబడతాడు. రాచరిక సంబంధమైన బాధ్యతలను నిర్వర్తించేవాడు, వేదాధ్యయనానికి అలవాటుపడినవాడు, ఇచ్చిపుచ్చుకోవడంలో ఆనందం పొందేవాడు క్షత్రియుడుగా పిలువబడతాడు. పశుపోషణలోను, వ్యవసాయంలోను నిమగ్నమైనవాడు, స్వచ్ఛమైనవాడు, వేదాధ్యయనంలో సంపూర్ణుడు [illegible]యినవాడు వైశ్యుడు. అన్నిరకాల ఆహారానికి అలవాటుపడినవాడూ, అన్ని రకాల పనులూ చేసేవాడూ, అపరిశుభ్రంగా ఉండేవాడు, వేదాలను పరిత్యజించినవాడు, సదాచారాలను పాటించనివాడు, సాంప్రదాయకంగా శూద్రుడిగా పిలువబడుతున్నాడు. ఇదే శూద్రుని లక్షణం. బ్రాహ్మణులలో ఈ లక్షణం ఉండదు. (అటువంటి లక్షణాలున్న) శూద్రుడు శూద్రుడిగానే ఉండిపోతాడు. అయితే బ్రాహ్మణుడు ఈ లక్షణాలతో ప్రవర్తిస్తే అతడు బ్రాహ్మణునిగా గుర్తించబడడు."

ఋగ్వేదం చెప్పిన రీతిలో వర్ణవ్యవస్థ ఏర్పడిందనే వాదానికి మహాభారతం, ఒక్క సందర్భంలో మినహా బలాన్నివ్వడం లేదు.

## V

వర్ణవ్యవస్థ పుట్టుక గురించి పురాణాలు ఏం చెబుతున్నాయో చూద్దాం.

మొదట విష్ణు పురాణాన్ని పరిశీలిస్తే, చతుర్వర్ణాల ఆవిర్భావం గురించి మూడు సిద్ధాంతాలు కనిపిస్తాయి.

ఒక సిద్ధాంతం వర్ణవ్యవస్థకు మనువును ఆధారంగా చూపుతున్నదని[1] విష్ణు పురాణం చెబుతున్నది.

"బ్రహ్మాండం ఆవిర్భవించటానికి ముందు బ్రహ్మదేవుడు విష్ణువు అంశతో కూడి ఉన్నవాడై ఋగ్, యజుర్, సామ, అధర్వణ వేదమూర్తిగా, సకల లోకాలకూ సృష్టికర్తగా హిరణ్యగర్భునిగా ఉన్నాడు. బ్రహ్మ కుడి బొటనవేలి నుండి దక్ష ప్రజాపతి జన్మించాడు. దక్షుని పుత్రిక అదితి. ఆమెకు జన్మించిన వాడు వివస్వతుడు. అతడికి పుట్టినవాడు మనువు. మనువు కుమారులే ఇక్ష్వాకుడు, నృగుడు, దృష్ట, శర్యాతి, నరిష్యన్త, ప్రాంశు, నాభాగ, ధిష్ట, కరూశ, పృషధ్రులు. కరూశుని వారసులైన కారూశులే శక్తివంతులైన క్షతియులు. ధిష్టుని పుత్రుడైన నాభాగుడే వైశ్యుడయ్యాడు."

ఈ వివరణ అసంపూర్తిగా ఉంది. ఇది కేవలం క్షత్రియులు, వైశ్యుల పుట్టుకను మాత్రమే వివరిస్తున్నది. బ్రాహ్మణుల, శూద్రుల ఆవిర్భావం గురించి ఏమీ చెప్పటం లేదు. విష్ణు పురాణం లోనే మరో విభిన్నమైన కథనం ఉంది. దాని ప్రకారం :

పుత్రుని కోసం మనువు మిత్రావరుణులను ఉద్దేశించి యజ్ఞం చేయించాడు. హోత (పురోహితుని) పొరపాటు ఫలితంగా 'ఇళ' అనే పుత్రిక జన్మించింది. మిత్రా వరుణుల అనుగ్రహంతో 'ఇళ', మనువు కొడుకు సుద్యుమ్నునిగా అయింది. అనంతరం ఈశ్వర శాపం వలన స్త్రీగా మారిన సుద్యుమ్నుడు సోముని కుమారుడైన బుధుని ఆశ్రమం వద్ద సంచరిస్తున్న సమయంలో అతడి మోహానికి లోనవడం జరిగింది. వారికి పురూరవుడు కలిగాడు.

సుద్యుమ్నుడు (ఇళ) తిరిగి పురుషత్వం సంతరించుకోవటానికి ఋషులు, చతుర్వేదమయుడూ, విజ్ఞానమయుడూ, అశేషమయుడూ, అమృతమయుడూ యజ్ఞమూర్తీ అయిన భగవంతుని ఆరాధించారు. అతని అనుగ్రహంవల్ల ఇళ తిరిగి సుద్యుమ్నుడిగా మారిపోయింది."

విష్ణు పురాణం ప్రకారం అత్రి బ్రహ్మ కుమారుడు. అత్రి కుమారుడు సోముడు (చంద్రుడు). బ్రహ్మ ఇతడిని గ్రహాలకు, బ్రాహ్మణులకు, నక్షత్రాలకు అధిపతిగా నియమించాడు. రాజసూయయాగం చేసిన తర్వాత సోముడు గర్వంతో మత్తిల్లినవాడై దేవగురువు అయిన

1. మూయర్ సంస్కృత గ్రంథాలు, సం. 1, పుటలు 220-221

బృహస్పతి భార్య తారను ఎత్తుకుపోయాడు. బ్రహ్మాది దేవతలు, ఋషులు, మందలించినా ఆమెను విడిచిపెట్టలేదు. ఉశనసుడు సోముని పక్షం వహిస్తే అంగీరసుని శిష్యుడైన రుద్రుడు బృహస్పతికి అండగా నిలిచాడు. దేవతలు, దైత్యులు, మొదలైనవారు చెరొకవైపూ చేరిన ఈ వివాదం భయంకర రూపాన్ని దాల్చింది. ఎట్టకేలకు బ్రహ్మ జోక్యం చేసుకొని, తారను తిరిగి బృహస్పతికి అప్పగించవలసిందిగా సోమునిపై ఒత్తిడి తెచ్చాడు. ఈలోగా తార గర్భవతియై బుధుని కన్నది. బుధుడికి తండ్రి సోముడేనని తరువాత (ఎంతో ఒత్తిడి తీసుకువచ్చిన మీదట) తార అంగీకరించింది. ఈ బుధునికి, మనువు కుమార్తె ఇళకు, జన్మించిన వాడు పురూరవుడు.

పురూరవునికి ఆరుగురు కుమారులు. వారిలో 'ఆయువు' పెద్దవాడు. ఆయువుకు ఐదుగురు కుమారులు. నహుషుడు, క్షత్రవృద్ధుడు, రంభ, రజీ, అనేనసుడు."

క్షత్రవృద్ధుని కుమారుడు సునహోత్రుడు. సునహోత్రునికి కాశ (కాశ్య), లేస (కాస), గృత్సమద అనే ముగ్గురు కుమారులు ఉన్నారు. చివరివాడి సంతానం శౌనకుడు. ఇతడే నాలుగు కులాల వ్యవస్థను రూందించినవాడు. కాశుని కుమారుడు కాశీరాజు. ఇతని సంతానం దీర్ఘతమ (ప)సుడు. ధన్వంతరి, దీర్ఘతమ (ప)సుని పుత్రుడు.

మూడవ కథనం[1] బ్రహ్మను వర్ణవ్యవస్థకు కారకునిగా పేర్కొంటున్నది. మైత్రేయుడు[2] అంటాడు, "అర్వాక్స్రోతస్సు (మానవసృష్టి) నాకు వివరించావు. ఓ బ్రాహ్మణా! బ్రహ్మ దీనిని ఏ విధంగా చేశాడో నాకు వివరించు. ఏ విధంగా ఏ లక్షణాలతో కులాలు సృష్టించాడో చెప్పు. సంప్రదాయకంగా చెప్పబడుతున్న బ్రాహ్మణుల విధులు, ఇతరుల విధులు ఏమేమిటి?

పరాశరుడి సమాధానం ఇలా ఉంది : "3. తాను ఊహించినట్లుగా ఈ ప్రపంచాన్ని సృష్టించాలని సత్యవస్తు ధ్యానం చేయగా సత్త్వ గుణంగల జీవులు అతని నోటి నుండి వెలువడ్డాయి. 4. రజోగుణం ఎక్కువగా గల జీవులు అతని వక్షం నుండి వచ్చాయి. రజోగుణం, తమోగుణం రెండూ అధికంగా ఉన్న జీవులు అతని తొడల నుండి వెలువడ్డాయి. 5. మిగిలిన వారిని తన పాదాల నుండి సృష్టించాడు. వీరిలో తమోలక్షణం ప్రధానంగా ఉంటుంది. ఈ విధంగా బ్రహ్మ నోటి నుండి, వక్షం నుండి, తొడల నుండి, పాదాల నుండి వచ్చిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులాలతో చాతుర్వర్ణ వ్యవస్థ ఏర్పడింది.

విష్ణుపురాణం ఋగ్వేదం చెప్పిన, సాంఖ్యతత్వం బలపరచిన, సిద్ధాంతాన్ని చెబుతున్నది. హరివంశంలో రెండు సిద్ధాంతాలున్నాయి. విష్ణు పురాణంలో చెప్పినట్లు మనువు వారసుల వలన వర్ణవ్యవస్థ ఏర్పడిందనే వాదాన్నే ఒక సిద్ధాంతం బలపరుస్తున్నది.[3]

---

1. మ్యూయిర్ సంస్కృత గ్రంథాలు. సం. 1, పుట 61-62.
2. శిష్యుడైన మైత్రేయుని ప్రశ్నలకు గురువు పరాశరుడు సమాధానమిస్తుండగా విష్ణు పురాణాన్ని ఒక సంవాదంగా రూపొందించారు.
3. మ్యూయిర్ సంస్కృత గ్రంథాలు. సం 1, పుట 227

"గృత్సమదుని కుమారుడు శునకుడు. అతడి నుండి శౌనకులు - బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు వచ్చారు."

సుహోత్ర, సుహహోత్రి, గయ, గర్గ, కపిలులు ఐదుగురూ వితథుని కుమారులు. సుహోత్రునికి కసక, గృత్సమతి అనే ఇద్దరు కుమారులు కలిగారు. వారిలో గృత్సమతి కుమారులు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు.

బ్రహ్మ సృష్టించిన విష్ణువు దక్షప్రజాపతిగా మారినట్లు చెప్పే మరో వాదం ఇలా ఉంది:[1]

జనమేజయుడు అంటాడు[2] : "ఓ బ్రాహ్మణా! యుగారంభమైన బ్రహ్మయుగం గురించి వివరించావు. స్థూలంగాను, వివరంగాను క్షత్రియుల కాలం గురించి, ఆచార వ్యవహారాల గురించి కథనంలో ప్రవీణులైన (నీలాంటి)వారు చెబుతుంటే వినాలని ఉంది."

వైశంపాయనుడు ఇలా సమాధానం చెప్పాడు : "యాగాదులతో పవిత్రమైన, దాతృత్వానికి ప్రసిద్ధి చెందిన ఆ కాలం గురించీ, ప్రజల గురించీ వర్ణిస్తాను. యజ్ఞయాగాదులు నిరాటంకంగా చేస్తూ ప్రత్యక్షంగాను, పరోక్షంగాను బ్రహ్మమీదే దృష్టిలగ్నం చేసి, బ్రాహ్మణ్యమే ఉన్నతాశయంగా వైభవోపేతమైన పవిత్రమైన ప్రవర్తనతో, ఆత్మ నిగ్రహంతో, బ్రహ్మ జ్ఞానంతో క్రమశిక్షణ గలవారై, సంపూర్ణ విజ్ఞానవంతులై బ్రాహ్మణులు ఉంటారు. వేల యుగాల పరిసమాప్తి అనంతరం మునులు ప్రపంచ విఘటనంలో నిమగ్నమయ్యారు. బ్రహ్మ నుండి వెలువడినవాడైన విష్ణువు ధ్యానముద్రుడై దక్ష ప్రజాపతిగా జీవరాసుల సృష్టి సాగించాడు. సుందరులైన (సోమునికి ఇష్టమైన) బ్రాహ్మణులు నాశనం కాని (అక్షర) అంశం నుండి, క్షత్రియులు నశ్వరమైన(క్షర) అంశం నుండి, వైశ్యులు మార్పిడిద్వారాను, శూద్రులు ధూమపు (పొగ) పరివర్తనం ద్వారాను సృష్టించబడ్డారు. విష్ణువు కులాల (వర్ణం) గురించి ఆలోచిస్తుండగా బ్రాహ్మణులు తెలుపు, ఎరుపు, పసుపు, నీలం రంగులతో ఏర్పడ్డారు. ఈ విధంగా మానవులు నాలుగురకాల కులాలుగా విడిపోయి బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులుగా వర్గీకరించబడ్డారు. వీరు రూపంలో ఒకేలాగున ఉండి విధులలో భిన్నంగాను, అద్భుత శక్తిమంతులై ద్విపాత్తులై వారి వారి వృత్తులలో నేర్పరులుగాను ఉన్నారు. ఇందులో మొదటి మూడు (ఉన్నత) కులాల విధులు వేదాలలో పేర్కొన్నారు. బ్రహ్మ నుండి ఉద్భవించినందున స్వభావరీత్యానే ధ్యానశీలుడై ప్రచేతస (దక్ష) ప్రభువుగా పిలువబడే మహాయోగి అయిన విష్ణువు తన విజ్ఞానం, సామర్థ్యాల ద్వారా ధ్యానం నుండి కార్యరంగ వలయంలోకి అనుగమించాడు. అస్తిత్వమే లేని స్థితి (విలుప్తి) నుండి ఉద్భవించిన శూద్రులకు ఆచార కర్మలు విహితమై లేవు. అందువలన వారు పవిత్రోత్సవాలలో పాల్గొనేందుకు వీలులేదు. పవిత్ర శాస్త్రాలు కూడా వారికి దూరమే! యాగం చేసేటప్పుడు నిప్పు రాజుకొని వచ్చే మంటలలో నుండి పైకెగసే

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు. సం. 1, పుటలు 152-153
2. హరివంశం జనమేజయ వైశంపాయనుల సంభాషణ రూపం.

పొగమబ్బుకు యాగంతో ఏ విధంగా సంబంధం లేదో, అదే విధంగా భూమి మీద తిరుగాడే శూద్రులు కూడ వారి పుట్టుక, శుచిలేని వారి జీవన విధానం, వేదాల్లో పేర్కొన్న నియమాచరణ లేకపోవటం వంటివాని వల్ల యాగాలకు పనికి రాకుండా పోయారు.

భాగవత పురాణం[1] కూడా వర్ణాల పుట్టుక గురించి ఒక వివరణ ఇస్తున్నది.

"అనేక వేల సంవత్సరాల తరువాత కాలం, చర్య (క్రియ)వంటి నైసర్గిక లక్షణాలలో నివసించే జీవాత్మ, నీటిపై తేలియాడే జీవంలేని అండానికి జీవాన్నిచ్చింది. ఆ అండాన్ని బద్దలు చేసుకొని వచ్చిన పురుషుడు వెయ్యి తొడలు, కాళ్లు, చేతులు, కళ్లు, ముఖాలు, తలలతో వెలువడ్డాడు. జ్ఞానులు అతనితో ప్రపంచాలను రూపొందించారు. ఏడు దిగువ ప్రపంచాలను అతని శరీరం కిందిభాగంతోను, ఏడు ఎగువ ప్రపంచాలను పై భాగంతోను మలిచారు. బ్రాహ్మణుడు ఆ పురుషుని ముఖం (నోరు) క్షత్రియుడు అతని చేతులు. ఆ దివ్యమూర్తి తొడల నుండి వైశ్యుడు, పాదాల నుండి శూద్రుడు పుట్టారు. అతడి పాదాల నుండి భూమి, నాభి నుండి వాయువు, హృదయం నుండి స్వర్గం, వక్షం నుండి మహాలోకం ఏర్పడ్డాయి.

చివరిగా వాయుపురాణాన్ని చూద్దాం. అదేం చెబుతున్నది. ఇది వర్ణవ్యవస్థను మనువు ఏర్పరచాడనే సిద్ధాంతాన్నే గ్రహిస్తున్నది.

"గృత్సమదుని కుమారుడు శునకుడు. అతడి సంతానం శౌనకుడు. అతడి కుటుంబంలోనే బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, వివిధప్రకార్య విధులు గల ద్విజులు జన్మించారు."

## VI

ఎంత అస్తవ్యస్త పరిస్థితి? చాతుర్వర్ణ వ్యవస్థ పుట్టుకకు సంబంధించి ఒకే విధమైన, స్థిరమైన వివరణ బ్రాహ్మణులు ఎందుకు ఇవ్వలేకపోతున్నారు?

వాటిని ఎవరు సృష్టించారనే విషయం మీద వారు ఏకాభిప్రాయానికి రాలేకపోతున్నారు. నాలుగు వర్ణాలు ప్రజాపతి సృష్టించినట్లు ఋగ్వేదం చెబుతున్నది. కానీ ఏ ప్రజాపతి అనేది చెప్పటం లేదు. చాలామంది ప్రజాపతులు ఉన్నారు కనుక, ఏ ప్రజాపతి నాలుగు వర్ణాలు సృష్టించాడో తెలుసుకోవాలనే కోరిక అందరికీ కలగడం సహజం. కనీసం ప్రజాపతి సృష్టించాడనే అంశంలోనైనా ఏకాభిప్రాయం లేదు. బ్రహ్మ సృష్టించాడని కొందరు, కశ్యపుడు సృష్టించాడని మరికొందరు అంటుండగా, మూడోవర్గం మనువు సృష్టించాడని అంటున్నారు.

సృష్టికర్త ఎవరైనప్పటికీ వర్ణాలు ఎన్ని అనే విషయంలోనూ ఏకాభిప్రాయం లేదు.

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు. సం. 1, పుట 156.

ఋగ్వేదం ప్రకారం నాలుగు వర్ణాలు సృష్టించబడ్డాయి. కానీ ఇతర ప్రామాణికాలు రెండే వర్ణాలని చెబుతున్నాయి. అవి బ్రాహ్మణులు, క్షత్రియులు అని కొందరు, బ్రాహ్మణులు, శూద్రులు అని మరికొందరు అంటున్నారు.

ఈ నాలుగు వర్ణాలనూ కలిపి ఉంచేందుకు సృష్టికర్త తలపెట్టిన పరస్పర సంబంధాల విషయంలో, శ్రేణీకరించిన అసమానతలు ఆయా వర్ణాలు పుట్టిన దేహభాగాల ప్రాధాన్యత మీద ఆధారపడ్డాయని ఋగ్వేదం చెబుతున్నది. కానీ శుక్ల యజుర్వేదం ఈ సిద్ధాంతంతో విభేదిస్తున్నది. ఉపనిషత్తులు, రామాయణ, మహాభారతాలు, పురాణాలు కూడ అలాగే విభేదిస్తున్నాయి. నిజానికి హరి వంశమైతే శూద్రులు ద్విజులు అనేంతవరకు పోయింది.

వాస్తవ సంప్రదాయాలకు భిన్నంగా బ్రాహ్మణులు ఈ చతుర్వర్ణ సిద్ధాంతాన్ని పొంతన లేని అల్లికతో ఋగ్వేదంలో చొప్పించిన ఫలితంగా ఈ గందరగోళ పరిస్థితి ఏర్పడినట్లు కనిపిస్తున్నది.

ఈ సిద్ధాంతాన్ని కట్టుకథలతో నింపడం వెనుక (ఉన్న) బ్రాహ్మణుల ఉద్దేశ్యమేమిటి. ప్రేరణ ఏమిటి?

అనువాదం : టి. భావనారాయణ

చిక్కుముడి : 17

# చతురాశ్రమాలు – అవి ఎందుకు ? ఎలా వచ్చాయి ?

హిందూ సమాజానికి ప్రత్యేక లక్షణం చతుర్వర్ణ వ్యవస్థ ఒక్కటే కాదు, 'ఆశ్రమ ధర్మం' అనేది మరొకటి ఉంది. అయితే, ఈ రెండింటికీ మధ్య ఒక విషయంలో భేదం ఉంది. వర్ణ ధర్మం సామాజిక నిర్మాణ సిద్ధాంతం కాగా, ఆశ్రమధర్మం వ్యక్తుల జీవితాన్ని క్రమబద్ధం చేసే సిద్ధాంతం.

ఆశ్రమధర్మం వ్యక్తి జీవితాన్ని నాలుగు దశలుగా విభజిస్తుంది. (1) బ్రహ్మచర్యం (2) గృహస్థాశ్రమం (3) వానప్రస్థం (4) సన్యాసం. బ్రహ్మచర్యం అనేది వాస్తవానికి న్యాయబద్ధంగా అవివాహ దశ. ఈ దశలో గురువు వద్ద విద్యాభ్యాసం కొనసాగుతుంది. వైవాహిక జీవితం గడిపేది గృహస్థాశ్రమం. సాధారణ పౌర జీవితాన్ని త్యజించి బాధ్యతలకు దూరంగా ఉండేది సన్యాసదశ. మరోమాటలో చెప్పాలంటే ఇది పౌర మరణం. గృహస్థాశ్రమానికి, సన్యాసానికి మధ్య దశ వానప్రస్థం. సంఘానికి చెందిన వాడైనప్పటికీ సంఘానికి దూరంగా నివసించే దశ ఇది. పేరులోనే ఉన్నట్లు ఈ దశలో అడవుల్లో సంచార జీవనం కొనసాగిస్తారు. సమాజ శ్రేయస్సు కోసం వర్ణధర్మాల ఏర్పాటు ఎంత ముఖ్యమో ఆశ్రమ ధర్మం కూడా అంతే ముఖ్యమని హిందువులు విశ్వసిస్తారు. ఈ రెండూ ఒక్కటే అయినట్లుగా రెంటినీ కలిపి సంయుక్తంగా వర్ణాశ్రమ ధర్మాలని పిలుస్తారు. ఇది హిందూ సమాజపు ఆకారానికి ఇనుపచట్రం వంటిది.

---

ఇది 18 పుటల టైపుప్రతి, మొదటి కాపీ. శీర్షిక రచయిత దస్తూరితో ఉన్నది. –సంకలనకర్త

ఆశ్రమధర్మం పుట్టుపూర్వోత్తరాలు, ధ్యేయాలు, ప్రత్యేక లక్షణాల గురించి పూర్తి అవగాహనకు రావడం సమంజసంగా ఉంటుంది. ఆశ్రమ వ్యవస్థ గురించి కూలంకషంగా తెలుసుకునేందుకు 'మనుస్మృతి' మంచి ఆధారం కనుక. అవసరమైన మేరకు అందులోని కొన్ని భాగాలను యధాతథంగా పేర్కొనడం జరుగుతున్నది.

"బ్రాహ్మణుడైతే ఎనిమిదో ఏట, క్షత్రియుడైతే పదకొండో ఏట, వైశ్యుడైతే పన్నెండో ఏట ఉపనయనం చేయాలి."[1]

"ద్విజుడైన వాడు వేదాలు అధ్యయనం చేయకుండా, ఇతర ప్రాపంచిక విషయాలను అధ్యయనం చేయటానికి దిగితే జీవించి ఉండగానే శూద్రుని స్థాయికి పడిపోతాడు. అతని తర్వాత అతని వారసులుకూడ అదే స్థితి పొందుతారు.[2] గురువు ఆధ్వర్యంలో మూడు వేదాల అధ్యయనాన్ని ముప్పై ఆరు (36) సంవత్సరాలు లేదా అందులో సగం లేదా అందులో పాతిక భాగం లేదా విద్యార్థి వాటిని క్షుణ్ణంగా గ్రహించేవరకు (త్రైవేదిక వ్రతంగా) పాటించాలి.

"మూడుగాని, రెండుగాని లేదా కనీసం ఒక్క వేదమైనాగాని క్రమపద్ధతిలో విద్యార్థి నియమాలు అతిక్రమించకుండా అభ్యసించినవారు గృహస్థాశ్రమంలో ప్రవేశించే స్థాయిని పొందుతారు."[3]

"విద్యార్థి, గృహస్థు, సన్యాసి, సర్వసంగ పరిత్యాగి ఈ నలుగురూ నాలుగు భిన్నమైన స్థాయిల నేర్పరుస్తూ గృహస్థు దశ నుండి వెలువడతారు."

"కానీ, వీటిలో ఏ ఒక్క దశగానీ, అన్ని దశలుగానీ క్రమంగా పొందుతూ పవిత్ర ధర్మశాస్త్ర నియమాలననుసరించే బ్రాహ్మణుడే ఉన్నతస్థాయిని (ఉత్తమగతిని) చేరుకుంటాడు."

"శ్రుతి-స్మృతుల నిర్దేశాల ప్రకారం గృహస్థు మిగిలిన ముగ్గురికీ ఆశ్రయం కనుక అందరి కంటే శ్రేష్ఠునిగా గుర్తింపు పొందుతాడు."[4]

"ద్విజుడైన స్నాతకుడు గృహస్థాశ్రమ ధర్మాలననుసరించి జీవించిన పిదప దృఢ మనస్కుడై ఇంద్రియ నిగ్రహం కలవాడై అడవుల్లో నివసిస్తూ ఈ దిగువ పేర్కొన్న నియమాలు పాటించాలి."

"గృహస్థు తన ముడతలు పడిన చర్మాన్ని, నెరసిన జుట్టును, మనుమలను చూడగానే గృహస్థాశ్రమం వదలి అడవులకు బయలుదేరవచ్చు."[5]

---

1. మనుస్మృతి 2వ అధ్యాయం పుట 36.
2. అదే. పుట 168
3. మనుస్మృతి 3వ అధ్యాయం పుట 1-2
4. అదే పుస్తకం, 4వ అధ్యాయం పుట 87-89
5. అదే పుస్తకం. పుట 1-2

"ఈ విధంగా జీవితంలో మూడవ దశ అడవుల్లో ముగించిన వెంటనే ఐహిక బంధాలను తెగతెంపులు చేసుకొని సన్యాసివలె తన జీవితపు నాలుగవ దశ గడపవచ్చు."

"ఆశ్రమ ధర్మ క్రమంలో యజ్ఞయాగాది క్రతువులు చేసి, ఇంద్రియ చాపల్యాన్ని అధిగమించి దానధర్మాదికాలతో అలసిన తరువాత సన్యాసిగా మారినవాడు మరణానంతరం అలౌకికానందం పొందుతాడు."

"మూడు ఋణాలు తీర్చుకున్నవాడు ఐహిక విముక్తి కోసం తన మనస్సు లగ్నం చేయాలి. ఈ విధంగా (ఋణ) విముక్తుడు కానివాడు అధోగతి పాలవుతాడు."

"నియమవంతుడై వేదాధ్యయనం చేసి, పవిత్ర ధర్మశాస్త్ర బద్ధంగా సంతానవంతుడై శక్తికొలది త్యాగాలు చేసినవాడు తన మనస్సును ఐహిక విముక్తి కొరకు లగ్నం చేయవచ్చు."

"వేదాధ్యయనం చేయకుండా, పుత్రులను పొందకుండా, త్యాగాలు చేయకుండా, తుది విముక్తి కోరుకునే ద్విజుడు అధోగతి పాలవుతాడు."

మనువు చెప్పిన ప్రకారం ఈ నియమాలను బట్టి చూస్తే ఆశ్రమ ధర్మానికి మూడు లక్షణాలున్నట్లు తెలుస్తోంది. శూద్రులకు, మహిళలకు, దీనిలో ప్రవేశం లేకపోవడం మొదటిది. బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం తప్పనిసరి ధర్మాలు కాగా వానప్రస్థం, సన్యాసం తప్పనిసరి కాకపోవడం రెండవది. ఒక ఆశ్రమధర్మం నుండి మరో ఆశ్రమ ధర్మంలోనికి పరివర్తనం చెందడం కేవలం ఒకే క్రమంలో జరగాలి. మొదట బ్రహ్మచర్యం, తరువాత గృహస్థాశ్రమం, ఆపైన వానప్రస్థం, చివరిగా సన్యాసం. అంతే తప్ప ఒక దశను విస్మరించి వేరొక దశకు చేరుకోవటానికి వీల్లేదు. ఇది మూడవ లక్షణం.

ప్రణాళికా బద్ధమైన వ్యక్తి ఆర్థిక జీవనంగా కనబడే ఈ దశల వ్యవస్థను పైపైన పరిశీలించి చూస్తే పలు సందేహాలు రేకెత్తుతాయి. మనువు అటువంటి ప్రణాళికాబద్ధమైన వ్యవస్థ ఏర్పాటు చేయాల్సిన అగత్యం ఎలా ఏర్పడిందనేది మొదటి ప్రశ్న. వేదాలను పరిశీలిస్తే ఈ దశల సిద్ధాంతమేదీ కనిపించదు. బ్రహ్మచారి గురించి మాత్రమే వేదాలు పేర్కొన్నాయి. అంతే తప్ప బ్రహ్మచర్యం అనేది తప్పించుకోలేని మొదటి దశగా చెప్పడానికి ఆధారాలేమీ లేవు. బ్రాహ్మణులు బ్రహ్మచర్యాన్ని వ్యక్తి జీవితంలో ఒక తప్పనిసరి ఆశ్రమధర్మంగా ఎందుకు చేశారు? ఆశ్రమధర్మానికి సంబంధించిన మొదటి చిక్కుముడి ఇది.

ఇక రెండవ విషయానికొస్తే మనువు ఈ వివిధ జీవితదశలు ఒక వ్యక్తి ఒక క్రమంలోనే పాటించాలని ఎందుకు నిర్దేశించినట్లు? బ్రహ్మచారి స్వేచ్ఛగా మూడింటిలో ఏ ఆశ్రమ ధర్మాన్నైనా స్వీకరించడానికి ఒకప్పుడు అవకాశమున్నట్లు ఇప్పటికీ స్పష్టంగా తెలుస్తూనే ఉంది కదా! అతడు గృహస్థు కావచ్చు, లేదా నేరుగా గృహస్థాశ్రమం స్వీకరించకుండానే సన్యాసం పుచ్చుకోవచ్చు. ధర్మసూత్రకారులు ఈ విషయంలో చెప్పిన అంశాలు పోల్చి చూద్దాం.

వశిష్ఠ ధర్మసూత్రం ప్రకారం[1] :

"విద్యార్థి, గృహస్థు, సన్యాసి, ఋషి అనే నాలుగు దశల ధర్మాలున్నాయి."

"విద్యాభ్యాస నియమాలను అతిక్రమించకుండా ఒకటి, రెండు లేదా మూడు వేదాలు అభ్యసించిన వ్యక్తి మూడింటిలో తన కిష్టమైన ఆశ్రమ ధర్మాన్ని స్వీకరించవచ్చు."

గౌతమ ధర్మసూత్రం ప్రకారం[2] :

(వేదాలు చదివినవాడు) తాను స్వీకరించబోయే ఆశ్రమధర్మం విషయంలో తన ఐచ్ఛికతను వినియోగించుకోవచ్చు (అని కొందరు ప్రకటిస్తారు).

"విద్యార్థి, గృహస్థు, యోగి (భిక్షువు), సన్యాసి (వైఖానసుడు) అనేవి నాలుగు ధర్మాలు."

ధర్మశాస్త్రాల ద్వారా వెల్లడవుతున్న అభిప్రాయాలను బట్టి వైవాహిక దశ ఐచ్ఛిక దశగా ఒకప్పుడు ఉండేదని స్పష్టమవుతున్నది. బ్రహ్మచర్యం తరువాత వానప్రస్థం లేదా సన్యాసం నేరుగా స్వీకరించవచ్చు. ఈ ఐచ్ఛికతను మనువు ఎందుకు తొలగించాల్సి వచ్చింది? వైవాహిక దశను ఒక తప్పనిసరి ధర్మంగా ఎందుకు నిర్దేశించినట్లు ? సన్యాసానికి ముందు వానప్రస్థం, వానప్రస్థానికి ముందు గృహస్థాశ్రమం గడపాలని నిబంధనలు ఏర్పరచడంలో ఆంతర్యమేమిటి?

గృహస్థాశ్రమం తరువాత జీవితచక్రం పూర్తయ్యేందుకు వానప్రస్థం, సన్యాసం పూర్తి చేయాలి. ఇక్కడ ప్రశ్న ఏమిటంటే, వ్యక్తి జీవితంలో గృహస్థాశ్రమం తరువాత రెండు దశల జీవితం గడపాల్సిన అవసరమేమిటి? సన్యాసం ఒక్కటే ఎందుకు సరిపోలేదు? వానప్రస్థంలోను, సన్యాసంలోను వ్యక్తి జీవితాన్ని నియంత్రించే సారూప్య నియమాలే ఈ ప్రశ్నలకు సమాధానాలిస్తాయి.

ఈ దిగువ పట్టికలో వానప్రస్థంలోను, సన్యాసంలోను పాటించాల్సిన నియమావళుల సారూప్యతను మనువు నిర్ణయించిన ప్రకారం చూపడం జరిగింది.

| వానప్రస్థ నియమావళి | సన్యాసాశ్రమ నియమావళి |
|---|---|
| వ్యవసాయం ద్వారా లభించే అన్ని రకాల ఆహారాన్నీ, తన సొంత వస్తువులనూ త్యజించడం, భార్యతో సహాగానీ, భార్య పోషణ బాధ్యతలను కొడుకులకు అప్పగించిగాని అడవులకు వెళ్లడం. (అధ్యాయం 6, శ్లో. 3) | ప్రజాపతి యజ్ఞం (ఇష్టి) ముగించి యజ్ఞ దక్షిణగా తన ఆస్తినంతా దానంచేసి ఆ యజ్ఞవిధిలో చెప్పినట్టుగా అగ్నులను తనలో చేర్చుకొని, బ్రాహ్మణ యతిగా ఇల్లు విడిచి బయలు దేరవచ్చు. (అధ్యా.6, శ్లో. 38). |

1. మనుస్మృతి 7 వ అధ్యాయం, శ్లో. 1, 2, 3.
2. అదే పుస్తకం 3 వ అధ్యాయం, శ్లో. 1, 2.

యజ్ఞోపకరణాలు, ఇంటిలోని పవిత్రాగ్ని తదితర సామగ్రితో గ్రామం విడిచి అడవికి వెళ్లి ఇంద్రియ నిగ్రహంతో నివసించాలి. (అధ్యా. 6, శ్లో. 4)

నియమానుసారంగా మునులకు ఉచితమైన రీతిలో పండ్లతోనో కందమూలాదికాలతోనో విహితమైన పంచ మహాయజ్ఞాలు చేయాలి. (అధ్యా. 6, శ్లో. 5)

జీర్ణవస్త్రాలుగాని, చర్మాలుగాని ధరించాలి. ఉదయంగాని సాయంత్రంగాని స్నానం చేయాలి. జుట్టు జడలు కట్టినట్లుండాలి. గడ్డం, గోళ్లు, మీసం కత్తిరించకూడదు. (అధ్యా. 6, శ్లో. 6)

తాను తినే ఆహారంతోనే బలి సమర్పణలు చేయాలి. తన శక్తి కొద్దీ దానధర్మాలు చేయాలి. తన ఆశ్రమానికి వచ్చినవారిని (అర్ఘ్య పాద్యాదులతో) నీరు, పండ్లు, కందమూలాలు మొ॥ వాటితోనే సత్కరించాలి. (అధ్యా. 6, శ్లో. 7).

ఏకాంతంగా ఆసక్తితో వేదాలు వల్లెవేస్తూ ఉండాలి. కష్టాలలో ఓర్పుతో అందరితో స్నేహంగా, దృఢచిత్తంతో, ఔదార్యంతో ఉండాలి. ఇతరుల నుండి బహుమతులు తీసుకోనివాడై సకల జీవరాశుల పట్ల దయాగుణం గలవాడై ఉండాలి. (అధ్యా. 6, శ్లో. 8)

వైతానికాగ్నిని (శ్రౌత స్మార్తదర్శ పూర్ణ మాసాలను) ఆయా కాలాలలో యథాశాస్త్రంగా అనుష్ఠించాలి. (అధ్యా. 6, శ్లో. 9)

ఏ విప్రుడు వేదాలు వల్లెవేస్తూ సృష్టిలోని జీవరాశుల రక్షణకు అభయం ఇస్తూ సన్యసిస్తాడో, బ్రహ్మ ప్రతిపాదకమైన ఉపనిషత్తుల పట్ల శ్రద్ధ కలిగి ఉంటాడో అలాంటివానికి తేజోమయమైన బ్రహ్మలోకాలు కలుగుతాయి. (అధ్యా. 6, శ్లో. 38).

సృష్టిలోని ప్రాణులకు ఏ చిన్న హాని సైతం తలపెట్టని ద్విజుడు తన దేహాన్ని విడిచిన తరువాత ఏ వైపునుండీ ప్రమాదాన్ని పొందడు (అధ్యా. 6, శ్లో. 40).

ఇల్లు వదలి బయలుదేరినవాడు పవిత్రత చేకూర్చే సాధనాలతో అలాగే సంచరించాలి. ఆనందం కలిగించే వాటిని (భోగాలను) ఎవరైనా ఇవ్వజూపినా వాటి పట్ల విముఖుడుగా ఉండాలి. (అధ్యా. 6, శ్లో. 41).

ఒంటరిగా తోడులేకుండా మోక్షప్రాప్తి కోసం సంచరిస్తూ ఉండాలి. దేనినీ ఆశ్రయించక దేనికీ ఆశ్రయం ఇవ్వక ఉన్న ఏకాకి ఒక్కడే లక్ష్యాన్ని సాధిస్తాడనే విషయం గ్రహించాలి. (అధ్యా. 6, శ్లో. 42).

అతనికి ఒక ఇల్లుగాని, లౌకికాగ్ని (పొయ్యి) గాని ఉండకూడదు. ఆహారం కోసం మాత్రమే ఏదైనా గ్రామానికి వెళ్ళవచ్చు. నిర్లిప్తుడై తన ధ్యేయంపట్ల పట్టుదలతో ధ్యానం చేస్తూ మనస్సును పరబ్రహ్మపై లగ్నం చేయాలి. (అధ్యా. 6, శ్లో. 43)

భిక్షాపాత్రకు బదులుగా పగిలిన కుండ పెంకు వాడటం, చెట్ల మొదళ్ళలో నివాసం, చిరిగిన దుస్తులు, ఒంటరి జీవితం, దేనిపైనా

---

ఆసక్తి లేకపోవడం అనేవి విముక్తి పొందినవాని లక్షణాలు. (అధ్యా. 6, శ్లో. 44).

నక్షత్రేష్టిని, అగ్రయణేష్టిని (కొత్తసస్యాల ఇష్టి), చాతుర్మాస్యలను, తురాయణ, దాక్షస్యాయణ వంటి నివేదనలను (శ్రౌత కర్మలు) క్రమం తప్పకుండా జరపాలి. (అధ్యా. 6, శ్లో. 10)

కఠోర నియమాలు పాటించే వారికి తగిన విధంగా వసంతంలోనూ, శరత్కాలం లోను పండే ఆహార ధాన్యాలు సొంతంగా సేకరించాలి. వాటితో నియమానుసారం పురోడాశాలు, చరువులు శాస్త్రప్రకారం తయారు చేయాలి. (అధ్యా. 6, శ్లో. 11).

అటవీ ఉత్పత్తులతో చేసిన పవిత్రమైన పురోడాశచరు హవిస్సులు దేవతలకు సమర్పించిన, మిగిలిన భాగాన్ని తాను ఉపయోగించాలి. స్వయంగా తయారుచేసిన (చౌటి) ఉప్పుతో కలిపి వాటిని వాడుకోవచ్చు. (అధ్యా. 6, శ్లో. 12).

మెట్టభూమిలోగాని, నీళ్ళలోగాని పెరిగే కూరగాయలు, ఫలపుష్పాదులు కందమూలాలు అరణ్యంలోని యజ్ఞ సంబంధమైన చెట్ల నుండి వచ్చే ఫలాలు, ఆ ఫలాల నుండి తీసిన నూనెలు ఉపయోగించవచ్చు. (అధ్యా. 6, శ్లో. 13).

తేనెటీగల తేనె, మాంసం, పుట్ట గొడుగులు, భూస్థ్రిక, శిగ్రుకం, (గోగుకూర, మునగకూర, మునగకాయలు మొ॥) శ్లేష్మాతక ఫలాలు వర్జించాలి. (అధ్యా. 6, శ్లో. 14).

మరణించాలనిగాని, జీవించాలనిగాని కోరకుండా సేవకుడు జీతం కోసం ఎదురు చూసినట్లు ఆ కాలంకోసం వేచి ఉండాలి. (అధ్యా. 6, శ్లో. 45).

ఇంద్రియ వాంఛలకు అతీతంగా, ఆనందం ఆత్మకు సంబంధించినది గానే ఉండేట్లు యోగముద్రలో ఉండి అంతిమ విముక్తి (మోక్షప్రాప్తి) కోసం ఎదురుచూడాలి. (అధ్యా. 6, శ్లో. 49).

అతీంద్రియ శక్తుల ప్రదర్శన, శకునాలు చెప్పడం, జ్యోతిష్యం, హస్త సాముద్రికం, ఇతరమైన సలహాలివ్వడం, వేదాలపై వ్యాఖ్యానించడం వంటి పనుల ద్వారా దానాలు (భిక్ష) స్వీకరించకూడదు. (అధ్యా. 6, శ్లో. 50).

యాచన నిమిత్తం సన్యాసులు, బ్రాహ్మణులు, పక్షులు, జంతువులు, బిచ్చగాళ్లా ఉండే ఇళ్ల పరిసరాలకు వెళ్లకూడదు. (అధ్యా. 6, శ్లో. 51).

వెంట్రుకలు, గోళ్లు, మీసాలు పెంచకుండా, భిక్షాపాత్రతోనూ, చేతికర్రతోనూ కమండలంతోనూ తిరుగుతూ నియమవంతుడై ఉంటూ తనవల్ల ఏ ప్రాణికీ ఇబ్బంది కలగకుండా చూసుకోవాలి. (అధ్యా. 6, శ్లో. 52).

ఎంత ఆకలితో బాధపడుతున్నప్పటికీ, నాగలితో దున్నిన భూమిలో పెరిగినదేదీ ఎవరైనా పారవేసినదైనాగాని, గ్రహించకూడదు. అలాగే గ్రామంలో పండిన ఫలాలు, కందమూలాలు ఏవీ తినకూడదు. (అధ్యా 6, శ్లో.16).

నిప్పు సహాయంతో వండినదిగాని, కాలానుగుణంగా పండినదిగాని జీవధారణకు తినవచ్చు. నూరడానికి రాయిగాని, తన పళ్లు గాని ఉపయోగించవచ్చు. (అధ్యా. 6, శ్లో.17)

ఆరోజు భోజనం పూర్తికాగానే తిరిగి ఆహార సేకరణ కోసం తన పాత్రను శుభ్రం చేసుకోవచ్చు. ఒక దినానికి మాత్రమే సరిపోయే ఆహారాన్ని సేకరించి పెట్టుకోవాలి. లేనట్లయితే ఒక నెలకో, ఆర్నెల్లకో, సంవత్సరానికో సరిపడా ఆహారం నిలువ చేసుకోవచ్చు. (అధ్యా. 6, శ్లో. 18)

తగినంత ఆహారం సేకరించుకున్న తరువాత పగలుగాని, రాత్రిగాని ఒకేపూట తినాలి. రెండురోజుల కొకసారి గాని, నాలుగు రోజుల కొకసారిగాని భుజించే నియమం కూడ పెట్టుకోవచ్చు. (అధ్యా. 6, శ్లో. 19)

చాంద్రాయణ వ్రత దీక్ష ప్రకారం ప్రకాశవంతమైన రాత్రులుండే శుక్లపక్షపు దినాలలో తన ఆహార ప్రమాణాన్ని తగ్గించుకుంటూ, కృష్ణపక్షపు రోజులలో ఆ ప్రమాణం పెంచుకుంటూ తినాలి. ప్రతిపక్షంలోనూ చివరి రోజున ఒకపూట మాత్రం తినాలి, లేదా (గంజి) జావ తాగాలి. (అధ్యా 6, శ్లో. 20).

వైఖానస నియమాన్ని అనుసరిస్తూ పుష్పాలు, కందమూలాలు, కాలానుగుణంగా

స్వయంభువు కుమారుడైన మనువు, సొరకాయ బుర్ర, చెక్కపాత్ర (చెంబు)గాని, మట్టిపాత్ర(చెంబు)గాని, వెదురుతో చేయబడిన పాత్రగాని సన్యాసికి తగినట్టి పాత్రలుగా పేర్కొన్నాడు. (అధ్యా. 6, శ్లో. 54).

రోజుకు ఒకసారే భిక్షాటనకు వెళ్లాలి. ఒకేసారి ఎక్కువ మొత్తంలో భిక్ష సేకరించాలని ఆతృత పడకూడదు. సన్యాసి ఆవిధంగా చేస్తే విషయ సుఖాలకు అలవాటుపడినట్లవుతుంది. (అధ్యా. 6, శ్లో. 55).

వంటగదులపై నుండి వచ్చే పొగలు ఆగిపోయిన తరువాత, రోకలితో దంచడం ఆగిన తరువాత, నిప్పు ఆరిన తరువాత, ఇంటివారు భోజనాలు ముగించిన తరువాత, పాత్రలోని అడుగూ బొడుగూ తీసిన తరువాతనే సన్యాసి యాచనకు బయలుదేరాలి. (అధ్యా. 6, శ్లో. 56).

భిక్షాదులు దొరకనప్పుడు బాధపడకూడదు. ఎక్కువ దొరికినప్పుడు ఉప్పొంగకూడదు. ప్రాణరక్షణకు సరిపడేంత మాత్రమే అంగీకరించాలి. పాత్రల, పదార్థాల, నాణ్యతను పట్టించుకోకూడదు. (అధ్యా. 6, శ్లో. 57).

తనపట్ల విధేయతతో గౌరవంతో ఇచ్చిన ఆహారాన్ని ఏహ్యంగా పరిగణించాలి. అలాంటి దానిని గ్రహించకూడదు. ఎందుకంటే ముక్తుడైన సన్యాసి సైతం అలాంటివారి (భిక్ష ఇచ్చిన వారి) వాత్సల్యం వల్ల జన్మపాశంలో చిక్కుకొంటాడు. (అధ్యా. 6, శ్లో. 58).

తక్కువగా తినడం ద్వారా, ఒంటరిగా ఉండటం ద్వారా తన ఇంద్రియాలను విషయ

పండి రాలిన ఫలాలపై శాశ్వతంగా ఆధారపడి జీవించవచ్చు. (అధ్యా. 6, శ్లో. 21).

కటికనేల మీద దొర్లడంగాని, మునివేళ్లపై నిలబడటంగాని చేయాలి. త్రిసంధ్యలలోనూ (సూర్యోదయ సమయంలోనూ, మధ్యాహ్నమూ, సూర్యాస్తమయ సమయంలోనూ) స్నానానికి వెళ్లాలి. (అధ్యా. 6, శ్లో. 22).

వేసవి కాలంలో పంచాగ్నుల మధ్య ఉండి తపస్సు చేయాలి. వర్షాకాలంలో ఆకాశమే పై కప్పుగా(వర్షంలో) ఉండి తపస్సు చేయాలి. శీతాకాలంలో తడిబట్టలు ధరించి తపస్సు చేయాలి. ఈ విధంగా క్రమంగా అన్నింటికీ తట్టుకోగల శక్తిని పొందాలి. (అధ్యా. 6, శ్లో. 23).

ప్రతిరోజూ త్రిసంధ్యలలోనూ సూర్యోదయ, మధ్యాహ్న, సూర్యాస్తమయ సమయాల్లో స్నానం చేసేటప్పుడు దేవర్షి పితృ తర్పణాలు ఆచరించాలి. కఠోర నియమాలు (పక్షోపవాసాదులు) పాటించడం ద్వారా దేహం శుష్కింపజేయాలి. (అధ్యా. 6, శ్లో. 24)

మూడు పవిత్రాగ్నులు నియమబద్ధంగా తనలో ఉంచుకొని స్వంత ఇల్లుగాని, పొయ్యిగాని లేకుండా ఫలాలు కందమూలాల పైనే ఆధారపడాలి. (అధ్యా. 6, శ్లో. 25).

సుఖ విషయాల పట్ల ఆసక్తి చూపక పోవడం, శీలవంతుడై ఉండటం, కటిక నేలపై పడుకోవడం, ఆశ్రయం కోసం చూడకుండా చెట్ల తొర్రల్లోనే(మొదళ్ళలో) నివసించడం (అధ్యా. 6, శ్లో. 26)

వాంఛల నుండి నిగ్రహించుకోవాలి. (అధ్యా. 6, శ్లో. 59).

ఇంద్రియ నిగ్రహం ద్వారా, రాగద్వేషాలకు అతీతంగా ఉండటం ద్వారా జీవులకు హాని తలపెట్టకుండా ఉండటం ద్వారా సన్యాసి అమరత్వం పొందుతాడు. (అధ్యా. 6, శ్లో. 60).

తన ప్రవృత్తి ద్వారా అన్ని విషయాల పట్ల నిర్లిప్త వైఖరితో ఉన్నట్లయితే ఇహ పరలోకాల్లో నిత్యానందం పొందుతాడు. (అధ్యా. 6, శ్లో. 80).

క్రమేపీ అన్నిరకాల బంధనాలను తెంచుకొని అన్ని వైరుధ్యాల (ద్వంద్వాల) నుండి విముక్తుడైనవాడు బ్రహ్మప్రాప్తిని పొందుతాడు. (అధ్యా. 6, శ్లో. 81).

పైన చెప్పిందంతా ధ్యానంపై ఆధారపడి ఉంటుంది. ఎందుకంటే ఆత్మకు సంబంధించిన ఈ విషయంలో సంపూర్ణ పరిజ్ఞానం లేనివాడు యజ్ఞయాగాది కర్మల సంపూర్ణ ఫలాన్ని పొందలేడు. (అధ్యా. 6, శ్లో. 82).

యజ్ఞ క్రతువుల గురించీ, దేవతల గురించీ తెలిపే వేదాలను, ఆత్మను గురించి చర్చించే చివరి భాగాలను (వేదాంతాలను) క్రమం తప్పకుండా వల్లెవేస్తూ ఉండాలి. (అధ్యా. 6, శ్లో. 83).

జీవనం కోసం సన్యాసులైన బ్రాహ్మణు నుండి, అడవుల్లో నివసించే ద్విజ గృహస్థుల నుండి భిక్ష స్వీకరించవచ్చు. (అధ్యా.6, శ్లో. 27).

వానప్రస్థంలో ఉన్న సన్యాసి ఏదైనా గ్రామం నుండి ఆహారం తెచ్చుకోవచ్చు. అయితే అది ఆకులతో చేసిన దొన్నెలో గాని లేదా తన చేతులలో పెట్టుకొని తెచ్చుకొనిగాని, పగిలిన మట్టిపాత్రతో తెచ్చుకొనిగాని ఎనిమిది ముద్దలు తినాలి. (అధ్యా. 6, శ్లో. 28).

అడవిలో నివసించే బ్రాహ్మణుడు (వానప్రస్థుడు) ఈ నియమాలనూ ఇతర శాస్త్రాలలో చెప్పిన వాటినీ కడు జాగరూకతతో ఆచరిస్తూ ఉపనిషత్తులలో పేర్కొన్న పవిత్ర విషయాలను మననం చేసుకొంటూ అధ్యయనం చేస్తూ ఉండాలి. (అధ్యా 6, శ్లో. 29).

అజ్ఞానులకూ, జ్ఞానవంతులైనవారికీ (వేదార్థ జ్ఞానం గలవారికి) స్వర్గం కోరుకునే వారికీ ముముక్షువులకూ ఈ వేదరూపమైన బ్రహ్మమే శరణు. (అధ్యా. 6, శ్లో. 84).

సన్యాసిగా మారిన ద్విజుడు పైన చెప్పిన పనులన్నీ క్రమంగా చేసిన తర్వాత పాపాలన్నీ ఇక్కడనే వదిలించుకొని అత్యున్నతమైన బ్రహ్మను పొందుతాడు. (అధ్యా. 6, శ్లో. 85).

వానప్రస్థాన్ని సన్యాసంతోను, గృహస్థాశ్రమాన్ని వానప్రస్థంతోనూ పోల్చి చూస్తే వాటిమధ్య చాలా స్పష్టమైన పోలిక కనిపిస్తుంది. వానప్రస్థానికీ సన్యాసానికీ నిర్దేశించిన జీవన విధానంలో కొద్దిపాటి తేడాలు మాత్రమే కనిపిస్తాయి. మొదటిది – వానప్రస్థుడు భార్యను, ఆస్తిపై హక్కునూ వదలుకోవాల్సిన అవసరం లేదు. కానీ సన్యాసి ఈ రెంటినీ వదులుకోవాలి. రెండవది – వానప్రస్థుడు అడవిలోనే ఉండాలనే నియమం ఉన్నప్పటికీ అక్కడే స్థిరమైన గృహంలో ఉండవచ్చు. కానీ సన్యాసికి అడవిలో స్థిరమైన ఇల్లు ఉండకూడదు. అతడు ఒకచోటు నుండి మరొకచోటికి తిరుగుతూ ఉండాలి. మూడవది – సన్యాసి శాస్త్రాలను వివరించకూడదనే నిషేధం ఉంది. వానప్రస్థునికి అల్లాంటి నియమం ఏమీ లేదు. మిగిలిన విషయాల్లో వారి జీవన సరళి ఒకటే!

గృహస్థాశ్రమానికి, వానప్రస్థానికి కూడ చాలా దగ్గరి పోలికలున్నాయి. వానప్రస్థుడు దాదాపు అన్ని పరిస్థితుల్లోనూ గృహస్థాశ్రమ ధర్మాలనే పాటిస్తాడు. గృహస్థువలె వివాహితుడిగానే ఉంటాడు. తన ఆస్తికి యజమానిగానే కొనసాగుతాడు. లోకాన్ని త్యజించాల్సిన అవసరం కూడా లేదు. గృహస్థు వేద మతాన్నే అనుసరించాలి. వీరిద్దరి మధ్యనున్న భేదాలు మూడు మాత్రమే అవి. (1) ఆహారం, దుస్తులు విషయంలో గృహస్థుకు, వానప్రస్థునికి నిర్దేశించిన ప్రత్యేక నిబంధనలు లేవు. (2) గృహస్థు సమాజంతో కలిసి జీవించాల్సి ఉండగా వానప్రస్థుడు

అడవిలో నివసించాలి. (3) వానప్రస్థునికి వేదాంతం చదివే స్వాతంత్ర్యం ఉంది. గృహస్థు చదువు వేదాలకు మాత్రమే పరిమితమవుతుంది. మిగిలిన అన్ని విషయాల్లో వీరి జీవన విధానం ఒకేలా ఉంటుంది.

గృహస్థాశ్రమ వానప్రస్థాల మధ్య ఉన్న ఇంత దగ్గరి పోలికలు గమనించిన తరువాత గృహస్థాశ్రమానికీ, సన్యాసానికీ మధ్య ప్రత్యేకంగా ఈ మూడవ ఆశ్రమధర్మాన్ని మనువు ఎందుకు గుర్తించాడనేది అర్థం కాని విషయం. వాస్తవానికి (1) బ్రహ్మచర్యం (2) గృహస్థాశ్రమం (3) సన్యాసం అనే మూడు ఆశ్రమాలే సరిపోతాయి. శంకరాచార్యుల ఉద్దేశ్యం కూడ ఇలాగే ఉన్నట్టు కనిపిస్తున్నది. ఆయన తన "బ్రహ్మసూత్రాల'లో 'పూర్వ మీమాంస' సిద్ధాంతానికి వ్యతిరేకంగా 'సన్యాసం' యొక్క క్రమతను సమర్థిస్తూ కేవలం మూడు ఆశ్రమాల గురించి మాత్రమే చెప్పాడు.

వానప్రస్థాశ్రమం ఊహ మనువుకు ఎక్కడి నుండి వచ్చింది? దానికి ఆధారమేమిటి? పైన పేర్కొన్నట్లు గృహస్థాశ్రమం అనేది బ్రహ్మచర్యం తరువాత తప్పనిసరిగా పాటించాల్సిన దశ కాదు. బ్రహ్మచారి, గృహస్థాశ్రమంలోనికి ప్రవేశించకుండా నేరుగా సన్యాసి కావచ్చుగదా! వెంటనే వివాహం చేసుకోవడం ఇష్టంలేని బ్రహ్మచారి అరణం లేదా అరణమానం పాటించవచ్చు.[1] వివాహం చేసుకోకుండా, అధ్యయన జీవితం కొనసాగించే బ్రహ్మచారులు అరణులు. వీరు అడవుల్లోనూ, ఆశ్రమాల్లోనూ, గ్రామాలకూ జనావాసాలకూ వెలుపల కుటీరాలలో నివసిస్తూ ఉంటారు. ఈ అరణులు నివసించే అడవులకు 'అరణ్యాలు' అని పేరొచ్చింది. వీరి తాత్విక గ్రంథాలనే ఆరణ్యకాలు అని అంటారు. మనువు చెప్పిన వానప్రస్థానికి ఈ అరణదశ మూలం అని స్పష్టమవుతున్నది. అయితే ఇక్కడ రెండు తేడాలున్నాయి. (1) అరణుడు వైవాహిక దశలోనికి (గార్హస్థ్యం) ప్రవేశించేటట్లు ఒత్తిడి తేవటం (2) అరణదశను రెండవ దశగా నిర్దేశించేందుకు బదులు మూడవదశగా నిర్దేశించడం. ఈ రెండూ మినహాయిస్తే వానప్రస్థం, అరణమేనని స్పష్టమవుతున్నది. వివాహం తప్పనిసరి అనే సూత్రం మీదే మనువు పథకం మొత్తం ఆధారపడి ఉంది. బ్రహ్మచారి తాను సన్యాసి కావాలనుకుంటే వానప్రస్థుడు అయి తీరాలి. వానప్రస్థుడు కావాలంటే గృహస్థాశ్రమం స్వీకరించి ఉండాలి. అంటే వివాహం చేసుకొని ఉండాలి. ఈ విధంగా వివాహం నుండి తప్పించుకోవడం అసాధ్యంగా చేయడంలో మనువు ఆంతర్యమేమిటి ?

అనువాదం : టి. భావనారాయణ

---

1. Radha Kumud Mookerjee - Ancient India Education, P. No. 6.

చిక్కుముడి : 18

# మనువు ఉన్మాదం లేదా మిశ్రమ కులాల మూలంపై బ్రాహ్మణుల సంజాయిషీ

మనువు తన చర్చకు అనుకూలంగా వివిధ కులాలను ఐదు ప్రధాన వర్గాలుగా విభజించాడన్న విషయం మనుస్మృతి చదివిన వాళ్ళందరికీ తెలిసిందే. మనువు విభజించిన ఐదు వర్గాలు (1) ఆర్యకులాలు (2) ఆర్యేతర కులాలు (3) వ్రాత్యకులాలు 4) పతిత కులాలు (5) సంకర కులాలు.

ఆర్యకులాలంటే, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనే మనువు అభిప్రాయం. మరో విధంగా చెప్పాలంటే మనువు చాతుర్వర్ణ్య విధానాన్నే ఆర్యమత సారంగా గుర్తించాడు.

చాతుర్వర్ణ్య సిద్ధాంతాన్ని ఆమోదించని వారిని మనువు ఆర్యేతర కులాల వాళ్ళు అని పేర్కొన్నాడు. ఉదాహరణకి దస్యు కులాన్ని ఆర్యేతర కులంగా మనువు చూపించాడు.[1]

ఒకప్పుడు చాతుర్వర్ణ్య సిద్ధాంతాన్ని విశ్వసించి ఆ తర్వాత తిరుగుబాటు చేసిన వాళ్లని

---

మనుస్మృతి 20వ పుటలో మిశ్రమ కులాల ఆవిర్భావంపై వివరణ ఉంది. మిశ్రమ కులాల మూలం గురించి చెప్పే 20 పుటల ప్రతి ఇది. టైపు చేసే ఉన్నప్పటికీ రచయిత దస్తూరీతో ఉన్న పుటలు చాలా చేరాయి. మార్పులు చాలావరకు పుటలపై అతికించారు. –సంకలనకర్త

---

1. మనుస్మృతి 10వ అధ్యాయం 45వ శ్లోకం. ఈ శ్లోకం రెండు కారణాల చేత గుర్తింపు పొందింది. శూద్రుడ్ని దస్యునికి భిన్నంగా ఇది చూపుతుంది. ఇది శూద్రుడ్ని ఆర్యునిగానూ చూపుతుంది.

మనువు వ్రాత్యులని పేర్కొన్నాడు. మనువు ఈ క్రింది కులాలను వ్రాత్యుల జాబితాగా చూపించాడు.

| వ్రాత్య బ్రాహ్మణులు | వ్రాత్య క్షత్రియులు | వ్రాత్య వైశ్యులు |
|---|---|---|
| 1. భృగ్గ కంటక | 1. జాల (ఝుల్ల) | 1. సుధన్వన |
| 2. అవంత్య | 2. మల్ల | 2. ఆచార్య |
| 3. వతధాన | 3. లచ్ఛవి | 3. కరూశ |
| 4. పుష్పద | 4. నాట (నట) | 4. విజన్మ |
| 5. శైఖ | 5. కరణ | 5. మైత్ర |
| | 6. ఖశ | 6. సాత్వత |
| | 7. ద్రవిడ | |

ఆర్య సంప్రదాయాన్ని ఆచారాలను పాటించకపోవటం వల్ల బ్రాహ్మణ మతగురువుల సేవలు కోల్పోయి శూద్రులుగా మారిన క్షత్రియులను మనువు పతిత కులాల జాబితాలో చేర్చాడు. వారిని మనువు ఈ క్రింది విధంగా పరిగణించాడు.

(1) పౌంఢ్రకులు, (2) చోళులు (చోడులు), (3) ద్రావిడులు, (4) కాంభోజులు, (5) యవనులు, (6) శాక్యులు, (7) పారదులు, (8) పహ్లావులు, (9) చీనులు, (10) కిరాతులు, (11) దరదులు.

తల్లిదండ్రులిద్దరూ ఒకే కులానికి చెందని పక్షంలో వారికి పుట్టిన సంతానాన్ని సంకర కులాలుగా మనువు చెప్పాడు.

ఈ మిశ్రమ కులాలను ఆయన వివిధ రకాలుగా విభజించాడు. (1) వివిధ ఆర్యకులాల సంతతి. దాన్ని (అ) అనులోమ (ఆ) ప్రతిలోమ అంటూ మనువు మరో రెండు శాఖలుగా విభజించాడు.

(2) అనులోమ, ప్రతిలోమ కులాల సంతతి.

(3) ఆర్య అనులోమ, ప్రతిలోమ కులాల, ఆర్యేతర కులాల సంతతి. ఆ కులాలను మిశ్రమ కులాల శీర్షిక క్రింద మనువు ఈ క్రింది వివిధ రకాలుగా చూపాడు.

### 1. మిశ్రమ ఆర్యకులాల సంతతి

| తండ్రి | తల్లి | సంతతి | అనులోమ లేదా ప్రతిలోమ |
|---|---|---|---|
| బ్రాహ్మణ | క్షత్రియ | ? | |
| బ్రాహ్మణ | వైశ్య | అంబష్ఠ | అనులోమ |
| బ్రాహ్మణ | శూద్ర | నిషాద (పారశవ) | అనులోమ |
| క్షత్రియ | బ్రాహ్మణ | సూత | ప్రతిలోమ |
| క్షత్రియ | వైశ్య | ? | |
| క్షత్రియ | శూద్ర | ఉగ్ర | అనులోమ |
| వైశ్య | బ్రాహ్మణ | వైదేహక | ప్రతిలోమ |
| వైశ్య | క్షత్రియ | మాగధ | ప్రతిలోమ |
| వైశ్య | శూద్ర | కరణ | అనులోమ |
| శూద్ర | బ్రాహ్మణ | చండాల | ప్రతిలోమ |
| శూద్ర | క్షత్రియ | క్షత్రి | ప్రతిలోమ |
| శూద్ర | వైశ్య | ఆయోగవ | ప్రతిలోమ |

### 2. అనులోమ – ప్రతిలోమ కులాలతో ఆర్య కులాల సంతతి

| | తండ్రి | తల్లి | సంతతి |
|---|---|---|---|
| 1. | బ్రాహ్మణ | ఉగ్ర | ఆవృత |
| 2. | బ్రాహ్మణ | అంబష్ఠ | ఆభీర |
| 3. | బ్రాహ్మణ | ఆభీర | ధిగ్వణ |
| 4. | శూద్ర | నిషాద | కుకూటక |

### 3. అనులోమ, ప్రతిలోమ కులాల మధ్య మిశ్రమ వివాహాల సంతతి

| | తండ్రి | తల్లి | సంతతి |
|---|---|---|---|
| 1. | వైదేహ | ఆయోగవ | మైత్రేయక |
| 2. | నిషాద | ఆయోగవ | మార్గవ(దాస), కైవర్త |
| 3. | నిషాద | వైదేహ | కారావర |
| 4. | వైదేహక | అంబష్ఠ | వేణ |
| 5. | వైదేహక | కారావర | ఆంధ్ర |
| 6. | వైదేహక | నిషాద | మేద |

| | | | |
|---|---|---|---|
| 7. | చండాల | వైదేహ | పాండుసోపక |
| 8. | నిషాద | వైదేహ | అహిందక |
| 9. | చండాల | పుక్కస్స | సోపక |
| 10. | చండాల | నిషాద | అంత్యవాసి |
| 11. | క్షత్త | ఉగ్ర | శ్వపాక |

సంకర కులాల గురించి మనువు ఇచ్చిన జాబితాకు మనువు తర్వాతి స్మృతికారులు కొందరు కొన్ని చేర్పులు చేశారు. వారిలో ఉశనుడు (శుక్రుడు), బోధాయనుడు, వసిష్ఠుడు, యాజ్ఞవల్క్యుడు , సూతుడు ఉన్నారు.

ఉశనస్మృతిలో ఈ క్రింది నాలుగు చేర్పులు ఉన్నాయి.

| | మిశ్రమ కులం పేరు | తండ్రి కులం | తల్లి కులం |
|---|---|---|---|
| 1. | పులక్స | శూద్ర | క్షత్రియ |
| 2. | ఏకజ | పులక్స | వైశ్య |
| 3. | చర్మకారక | ఆయోగవ | బ్రాహ్మణ |
| 4. | వేణుక | సూత | బ్రాహ్మణ |

బోధాయన స్మృతిలో ఈ క్రింది నాలుగు చేర్పులు ఉన్నాయి.

| | మిశ్రమ కులం పేరు | తండ్రి కులం | తల్లి కులం |
|---|---|---|---|
| 1. | క్షత్రియ | క్షత్రియ | వైశ్య |
| 2. | బ్రాహ్మణ | బ్రాహ్మణ | క్షత్రియ |
| 3. | వైన(ణ) | వైదేహక | అంబష్ఠ |
| 4. | శ్వపాక | ఉగ్ర | క్షత్రియ |

మనువు జాబితాకు వసిష్ఠస్మృతి ఈ క్రింది కులాన్ని కూడా చేర్చింది.

| మిశ్రమ కులం పేరు | తండ్రి కులం | తల్లి కులం |
|---|---|---|
| వైన(ణ) | శూద్ర | క్షత్రియ |

మిశ్రమ కులాల గురించి మనువు ఇచ్చిన జాబితాకు యాజ్ఞవల్క్య స్మృతి మరో రెండు నూతన కులాలను జోడించింది.

| | మిశ్రమ కులం పేరు | తండ్రి కులం | తల్లి కులం |
|---|---|---|---|
| 1. | మూర్ధవాసిక | బ్రాహ్మణ | క్షత్రియ |
| 2. | మహిష్య | క్షత్రియ | వైశ్య |

సూత సంహిత కర్త విస్తృత ప్రమాణంలో ఈ చేర్పులు చేశాడు. ఆయన చేర్చిన కులాల సంఖ్య అరవై మూడు.

| | మిశ్రమ కులం పేరు | తండ్రి కులం | తల్లి కులం |
|---|---|---|---|
| 1. | అంబష్ఠేయ | క్షత్రియ | వైశ్య |
| 2. | ఊర్ధ్వనాపిత | బ్రాహ్మణ | వైశ్య |
| 3. | కటకార | వైశ్య | శూద్ర |
| 4. | కుంభకార | బ్రాహ్మణ | వైశ్య |
| 5. | కుంద (డ) | బ్రాహ్మణ | వివాహిత బ్రాహ్మణి |
| 6. | గోళక | బ్రాహ్మణ | వితంతు బ్రాహ్మణి |
| 7. | చక్రి | శూద్ర | వైశ్య |
| 8. | దౌషంత్య | క్షత్రియ | శూద్ర |
| 9. | దౌషంతీ | క్షత్రియ | శూద్ర |
| 10. | పత్తనశాలి | శూద్ర | వైశ్య |
| 11. | పుళింద | వైశ్య | క్షత్రియ |
| 12. | బాహ్యద | శూద్ర | బ్రాహ్మణ |
| 13. | భోజ | వైశ్య | క్షత్రియ |
| 14. | మహీకార | వైశ్య | వైశ్య |
| 15. | మాణవిక | శూద్ర | శూద్ర |
| 16. | మ్లేచ్ఛ | వైశ్య | క్షత్రియ |
| 17. | శాలిక | వైశ్య | క్షత్రియ |
| 18. | శుండిక | బ్రాహ్మణ | శూద్ర |
| 19. | శూలిక | క్షత్రియ | శూద్ర |
| 20. | సపర్ణ | బ్రాహ్మణ | క్షత్రియ |
| 21. | ఆగ్నేయ నర్తక | అంబష్ఠ | అంబష్ఠ |
| 22. | అపితర | బ్రాహ్మణ | దౌషంతి |
| 23. | ఆశ్రమక | దంతకేవల | శూద్ర |
| 24. | ఉదబంధ | సనక | క్షత్రియ |
| 25. | కరణ | నాట | క్షత్రియ |
| 26. | కర్మ | కరణ | క్షత్రియ |
| 27. | కర్మకార | రేణుక | క్షత్రియ |
| 28. | కర్మార | మాహిష్య | కరణ |
| 29. | కుకుంద | మాగధ | శూద్ర |
| 30. | గుహక | శ్వపచ | బ్రాహ్మణ |

| | | | |
|---|---|---|---|
| 31. | చర్మోపజీవన | వైదేహిక | బ్రాహ్మణ |
| 32. | చర్మకార | ఆయోగవ | బ్రాహ్మణి |
| 33. | చర్మజీవి | నిషాద | కారుషి |
| 34. | తక్ష | మాహిష్య | కరణ |
| 35. | తక్షావృత్తి | ఉగ్ర | బ్రాహ్మణ |
| 36. | దంతకవేలక | చండాల | వైశ్య |
| 37. | దస్యు | నిషాద | అయోగవ |
| 38. | ద్రుమిళ | నిషాద | క్షత్రియ |
| 39. | నాట | పిచ్ఛల | క్షత్రియ |
| 40. | నాపిత | నిషాద | బ్రాహ్మణ |
| 41. | నీలాది వర్ణవిక్రేత | ఆయోగవ | చీర్కారి |
| 42. | పిచ్ఛల | మల్ల | క్షత్రియ |
| 43. | పింగళ | బ్రాహ్మణ | ఆయోగవ |
| 44. | భాగలబ్ధ | దౌషంత | బ్రాహ్మణి |
| 45. | భరూష | సుధన్వ | వైశ్య |
| 46. | భైరవ | నిషాద | శూద్ర |
| 47. | మాతంగ | వి(వై)జన్మ | వైశ్య |
| 48. | మధూక | వైదేహిక | ఆయోగవ |
| 49. | మతకార | దస్యు | వైశ్య |
| 50. | మైత్ర | వి(వై)జన్మ | వైశ్య |
| 51. | రజక | వైదేహ | బ్రాహ్మణ |
| 52. | రథకార | మాహిష్య | కరణ |
| 53. | రేణుక | నాపిత | బ్రాహ్మణ |
| 54. | లోహకార | మాహిష్య | బ్రాహ్మణ |
| 55. | వార్ధకి | మాహిష్య | బ్రాహ్మణ |
| 56. | వర్య | సుధన్వ | వైశ్య |
| 57. | విజన్మ | భరూష | వైశ్య |
| 58. | శిల్ప | మాహిష్య | కరణ |
| 59. | శ్వపచ | చండాల | బ్రాహ్మణ |
| 60. | శణక | మగధ | క్షత్రియ |
| 61. | సముద్ర | తక్షావృ(తి)త్తి | వైశ్య |
| 62. | సాత్వత | విజన్మ | వైశ్య |
| 63. | సునిషాద | నిషాద | వైశ్య |

ఐదురకాల కులాలలోనూ మొదటి నాలుగు కులాలకు మనువు ఇచ్చిన వివరణ సులభంగా అర్థం చేసుకోవచ్చు. కానీ ఆయన చెప్పిన ఐదవ కులం (సంకర కులం) గురించి మాత్రం అలా అర్థం చేసుకోవటానికి వీలులేదు. ఆ కులం గురించి వివిధ ప్రశ్నలు బుర్రల్ని వేధిస్తుంటాయి. ముందుగా చెప్పుకోవలసింది ఏమిటంటే, సంకర కులాల గురించి మనువు ఇచ్చిన జాబితా చాలా అశ్రద్ధతో ఇచ్చినట్టిది. అది సమగ్రమైనది కాదు. సంకరానికి గల అవకాశాలన్నింటినీ ఆ జాబితా వివరించటం లేదు.

అనులోమ, ప్రతిలోమ కులాలతో, ఆర్య కులాలు సమ్మేళన నువటం వల్ల ఏర్పడిన మిశ్రమ కులాల గురించి చర్చించేటప్పుడు నాలుగు ఆర్యకులాలలో ఒక్కొక్కదానికీ విడివిడిగా పన్నెండు అనులోమ, ప్రతిలోమ కులాల సంబంధంతో కలిగే సంతతి గురించీ వారి కులాల పేర్ల గురించీ మనువు మరింత విశదీకరించి ఉండాల్సింది. ఆయన ఆ విధంగా చేసి ఉన్నట్లయితే నలభై ఎనిమిది సంకర కులాల జాబితా మనకు లభించేది. ఈ వర్గం క్రింద ఆయన మిశ్రమ వివాహాలకు సంబంధించిన నాలుగు కులాల పేర్లు మాత్రమే చెప్పాడు.

అనులోమ ప్రతిలోమ కులాలు నిజానికి పన్నెండు ఉన్నాయి. ఆ కులాల మధ్య వివాహాల వల్ల ఏర్పడిన సంతానం గురించి చర్చించేటప్పుడు మనువు 144 (నూట నలభై నాలుగు) కులాల పేర్లను ఇవ్వవలసి ఉంది. కాని మనువు పదకొండు కులాల జాబితా మాత్రమే అందించాడు. ఈ పదకొండు కులాల ఏర్పాటులో ఆయన ఐదు కులాలకు సంబంధించి ఏర్పడగల ఐదు మిశ్రమాలనే పేర్కొన్నాడు. వీటిల్లో ఒకటి (వైదేహ) అనులోమ, ప్రతిలోమ కులాల జాబితాలో లేదు. ఎనిమిది కులాలను ఆయన అసలు లెక్కలోకి తీసుకోనేలేదు.

ఆర్యేతర కులాలకు ఆర్యకులాల సంబంధంతో పుట్టిన సంకర కులాల గురించి అతడు ఇచ్చిన వివరణ కూడ లోపభూయిష్టంగా ఉన్నది. ఆర్యేతర కులాలు నాలుగు ఆర్యకులాలలోనూ ఒక్కొక్క కులంతోనూ కలిసినపుడు వచ్చే సంకర కులాల జాబితా మొదట ఉండవలసింది. మనకు అటువంటి జాబితా ఏమీ లేదు. ఒకవేళ ఆర్యేతర కులం దస్యు అనేది ఒక్కటే ఉందని అనుకున్నాగాని, అనులోమ ప్రతిలోమ కులాలు ఒక్కొక్కదానితోను, దస్యులు కలిసినపుడు వచ్చే 12 కులాల జాబితా ఉండి ఉండాలి. నిజానికి మనువు చెప్పిన దాంట్లో ఒక మిశ్రమమే మనకు కనిపిస్తున్నది.

సంకర కులాల విషయమై చర్చిస్తున్నపుడు, వ్రాత్య ఆర్యకులాల మధ్య, వ్రాత్య అనులోమ ప్రతిలోమ కులాల మధ్య, వ్రాత్య ఆర్యేతర కులాల మధ్య మిశ్రమం గురించి మనువు ఆలోచించనే లేదు.

మనువు విడిచిపెట్టిన వాటిలో కొన్ని ప్రస్ఫుటంగానూ, ప్రముఖంగానూ ఉన్నాయి. బ్రాహ్మణ, క్షత్రియుల మధ్య సంకర కులం గురించి తీసుకుందాం. ఈ ఇద్దరి మధ్య పుట్టిన సంకరకులం గురించి ఆయనేమీ చెప్పడం లేదు. ఆ సంకర కులం ప్రతిలోమమో, అనులోమమో

అనే విషయం కూడ చెప్పలేదు. ఈ విషయాన్ని మనువు ఎందుకు పరిశీలించలేదు? అతని కాలంలో అటువంటి సంకర కులం ఉద్భవించలేదని అనుకోవాలా? లేక దానిని చెప్పటానికి ఆయన భయపడ్డాడా? భయపడితే ఎవరికి భయపడ్డాడు?

మనువూ, ఇతర స్మృతికారులూ చెప్పిన కొన్ని సంకర కులాల పేర్లు అవాస్తవికమైనవిగానూ, కల్పితమైనవిగానూ కనిపిస్తున్నాయి.

జారత్వం వలన కలిగిన కులాలు అని చెప్పుకున్నవి కొన్ని మనువుకు ముందు ఎక్కడా వినపడలేదు. ఆ తర్వాతనైనా వాటికేమయిందో కూడ ఎవ్వరికీ తెలియదు. అవి ఏ జాడ లేకుండా పోయాయి. కులం అనేది కరగని పదార్థం. ఒకసారి ఒక కులం ఏర్పడితే, దాని ప్రత్యేక అస్తిత్వాన్ని అది నిలుపుకుంటుంది. ఏ ప్రత్యేక కారణాల వల్లనయినా అది సమసిపోతే తప్ప. అయితే , ఇది చాల కొద్దివాటికి మాత్రమే జరుగుతుంది.

ఆయోగవ, ధిగ్వణ, ఉగ్ర, పుక్కస, శ్వపాక, శ్వపచ, పాండుసోపక, అహిందక, బండిక, మట్టు, మహికార, శాలిక, ఘండిక, శూలిక, యేకజ, కుకుంద వంటి (ఏవో కొన్ని మాత్రమే చెప్పుకుంటే), ఆ కులాలన్నీ ఏవి ? ఎవరు వీరు ? ఏమైనారు ?

ఇప్పుడు ఇతర స్మృతికారులతో మనువును పోల్చి చూద్దాం. వివిధ మిశ్రమ కులాల మూలంపై వారిలో వారికి ఏకాభిప్రాయం ఉన్నదా? అని పోల్చిచూస్తే వారిలో చాలా తేడా ఉన్నది. ఈ క్రింది పట్టిక చూడండి.

| | స్మృతికారుని పేరు | తండ్రి కులం | తల్లి కులం |
|---|---|---|---|
| | | **1. ఆయోగవ** | |
| 1. | మనువు | శూద్ర | వైశ్య |
| 2. | ఔషణ (ఉశనసుడు) | వైశ్య | క్షత్రియ |
| 3. | యాజ్ఞవల్క్య | శూద్ర | వైశ్య |
| 4. | బోధాయనుడు | వైశ్య | క్షత్రియ |
| 5. | అగ్ని పురాణం | శూద్ర | క్షత్రియ |
| | | **2. ఉగ్ర** | |
| 1. | మనువు | క్షత్రియ | శూద్ర |
| 2. | ఔషణ | బ్రాహ్మణ | శూద్ర |
| 3. | యాజ్ఞవల్క్య | క్షత్రియ | వైశ్య |
| 4. | వశిష్ఠ | క్షత్రియ | వైశ్య |
| 5. | సూత | వైశ్య | శూద్ర |

### 3. నిషాద

| | | | |
|---|---|---|---|
| 1. | మనువు | బ్రాహ్మణ | శూద్ర |
| 2. | ఔషణ | బ్రామ్మణ | శూద్ర |
| 3. | బౌధాయన | బ్రాహ్మణ | శూద్ర |
| 4. | యాజ్ఞవల్క్య | బ్రాహ్మణ | శూద్ర |
| 5. | సూత సంహిత | బ్రాహ్మణ | వైశ్య |
| 6. | సూత సంహిత | బ్రాహ్మణ | శూద్ర |
| 7. | వశిష్ఠ | వైశ్య | శూద్ర |

### 4. పుక్కస

| | | | |
|---|---|---|---|
| 1. | మనువు | నిషాద | శూద్ర |
| 2. | బృహద్-విష్ణు | శూద్ర | క్షత్రియ |
| 3. | బృహద్-విష్ణు | వైశ్య | క్షత్రియ |

### 5. మాగధ

| | | | |
|---|---|---|---|
| 1. | మనువు | వైశ్య | క్షత్రియ |
| 2. | సూత సంహిత | వైశ్య | క్షత్రియ |
| 3. | బోధాయన | శూద్ర | వైశ్య |
| 4. | యాజ్ఞవల్క్య | వైశ్య | క్షత్రియ |
| 5. | బృహద్-విష్ణు | వైశ్య | క్షత్రియ |
| 6. | బృహద్-విష్ణు | శూద్ర | క్షత్రియ |
| 7. | బృహద్-విష్ణు | వైశ్య | బ్రాహ్మణ |

### 6. రథకార

| | | | |
|---|---|---|---|
| 1. | ఔషణ | క్షత్రియ | బ్రాహ్మణ |
| 2. | బోధాయన | వైశ్య | శూద్ర |
| 3. | సూత సంహిత | క్షత్రియ | బ్రాహ్మణ |

### 7. వైదేహక

| | | | |
|---|---|---|---|
| 1. | మనువు | శూద్ర | వైశ్య |
| 2. | మనువు | వైశ్య | బ్రాహ్మణ |
| 3. | యాజ్ఞవల్క్య | వైశ్య | బ్రాహ్మణ |

పైన పేర్కొన్న మిశ్రమ కులాల మూలాన్నీ, వ్యాప్తినీ గురించిన పై వాస్తవాలను గమనిస్తే ఈ స్మృతికారుల మధ్య ఇంత విస్తారమైన అభిప్రాయ భేదం ఎందుకు కలిగిందా అన్న సందేహం రాకమానదు. రెండు కులాల మిశ్రమం తార్కికంగా మూడో మిశ్రమ కులానికి దారి తీస్తుంది. కాని అవే రెండు కులాల మిశ్రమం వివిధ కులాలను ఎలా పుట్టించగలదు? పుట్టించగలదనే మనువు, అతని అనుయాయి సూత్రకారులు వక్కాణిస్తున్నారు. ఈ క్రింది సందర్భాలు పరిశీలించండి.

1. తండ్రి క్షత్రియుడు, తల్లి వైశ్య వనిత అయినట్లయితే వారి సంతతి కులం
   (ఎ) 'క్షత్రియ అని బోధాయనుడు చెప్పాడు.
   (బి) 'మాహిష్య' అని యాజ్ఞవల్క్యుడు అన్నాడు.
   (సి) 'అంబష్ఠ' అని సూతుడు చెప్పాడు.
2. తండ్రి శూద్రుడు, తల్లి క్షత్రియ వనిత అయితే సంతతి కులం
   (ఎ) క్షత్రియ అని మనువు చెప్పాడు.
   (బి) 'పులక్స' అని ఔషణుడు అన్నాడు.
   (సి) 'వైన(ణ)' అని వశిష్ఠుడు అన్నాడు.
3. తండ్రి బ్రాహ్మణుడు, తల్లి వైశ్య స్త్రీ అయితే
   ఎ) వీరి సంతతి 'అంబష్ఠ' అని మనువు అన్నాడు.
   బి) సూతుడు వీరిని 'ఊర్ధ్వనాపిత' అన్నాడు.
   సి) మళ్లీ మరోచోట 'కుంభకార' అన్నాడు.
4. తండ్రి వైశ్యుడు తల్లి క్షత్రియ వనిత అయితే
   (ఎ) వీరి సంతతిని 'మాగధ' అన్నాడు మనువు.
   (బి) సూతుడు భోజ-మ్లేచ్ఛ-శాలిక-పులింద కులాలన్నీ ఈ ఒక్క మిశ్రమ సంతతే అన్నాడు.
5. తండ్రి క్షత్రియుడు, తల్లి శూద్ర వనిత అయితే
   (ఎ) వీరి సంతతిని 'ఉగ్ర' అని మనువు అన్నాడు.
   (బి) ఈ ఒక్క మిశ్రమ సంతతే దౌష్యంత-దౌషంతీ-శూలిక కులాలు అన్నాడు సూతుడు.

6. తండ్రి శూద్రుడు తల్లి వైశ్య వనిత అయితే,

(ఎ) వీరి సంతతిని 'ఆయోగవ' అన్నాడు మనువు.

(బి) వీరిని పత్తన శాలి, చక్రి అని అన్నాడు సూతుడు.

దీన్ని వదిలి మరో విషయం తీసుకుందాం. మిశ్రమ కులాల పుట్టుకను గురించిన మనువు వివరణ, చారిత్రకంగా వాస్తవమైనదేనా? పరిశీలన 'ఆభీరుల'తో మొదలుపెడదాం. మనువు ప్రకారం బ్రాహ్మణ పురుషులకు 'అంబష్ఠ' స్త్రీలతో జారత్వం వలన పుట్టినవారు ఆభీరులు. చరిత్ర వారి గురించి ఏమీ చెబుతున్నది? చరిత్ర ఏమి చెబుతున్నదంటే, ఆభీరులు (దీనికి భ్రంశరూపం ఆహీరులు) గ్రామీణ జీవన సంబంధమైన జాతి (పశుపాలన కావచ్చు), అనీ, వీరు వాయవ్య ప్రాంతంలోని దిగువ జిల్లాలలో సింద్ పర్యంతం నివసించినవారనీ చెబుతున్నది. వారు స్వతంత్రులైన పాలక తెగవారు. ఆభీరులు మగధను జయించి ఎన్నో ఏళ్లు పరిపాలించారని విష్ణు పురాణం[1] చెబుతున్నది.

బ్రాహ్మణ పురుషునికి వైశ్య స్త్రీతో జారత్వం వలన కలిగిన సంతతి అంబష్ఠులనీ మనువు అన్నాడు. "అంబష్ఠ" అనే దేశంలో పుట్టినవారు అంబష్ఠులని పతంజలి చెప్పాడు. అంబష్ఠులు స్వతంత్ర జాతి అనేది నిర్వివాదాంశం. చంద్రగుప్త మౌర్యుని దర్బారులో గ్రీకు రాయబారి మెగస్తనీసు, అంబష్ఠులు పంజాబ్‌లో నివసించిన ఒక తెగ అనీ, అలెగ్జాండర్ భారతదేశంపై దండయాత్ర చేసినపుడు వారు అతనికి వ్యతిరేకంగా పోరాడారనీ చెప్పాడు. మహాభారతంలో కూడ అంబష్ఠుల ప్రస్తావన ఉంది. విశిష్టమైన రాజకీయ వ్యవస్థకూ సాహసానికీ వారు ప్రసిద్ధులు.

జారత్వ కులాలైన వైదేహక పురుషునికీ, కారావార స్త్రీకి జారత్వ సంబంధం వలన కలిగిన రెండో శ్రేణి జారకులం 'ఆంధ్రులు' అని మనువు అన్నాడు. చారిత్రక ఆధారాలు ఇందుకు భిన్నంగా ఉన్నాయి. ఆంధ్రులు దక్కను పీఠభూమికి తూర్పుభాగాన ఉన్న ప్రాంతానికి చెందిన ప్రజలు. మెగస్థనీస్ ఆంధ్రుల గురించి ప్రస్తావించాడు. ప్లినీ (Pliny The Elder; క్రీ.పూ.77) ఆంధ్రుల గురించి చెబుతూ వారు దక్కన్‌లో స్వతంత్రంగా రాజరిక ప్రతిపత్తిని అనుభవిస్తున్న పరాక్రమవంతమైన తెగ అని చెప్పాడు. వారికి అసంఖ్యాకమైన గ్రామాలు, 30 పట్టణాలు ఉండేవనీ, వారు లక్ష కాల్బలమూ, 2000 అశ్వాలు, 1000 ఏనుగులు గల సైన్యాన్ని రాజుకు అందిస్తూ ఉండేవారనీ కూడ అన్నాడు.

మనువు ప్రకారం, వైశ్య పురుషునికి క్షత్రియ స్త్రీతో జారత్వం వల్ల పుట్టిన సంతతి

1. విష్ణుపురాణం – 4; 24-68
2. అంబష్ఠుల గురించి కావాలంటే జైస్వాల్(Jaiswal)రాసిన Indu Polity భాగం 1 పు 73–74 చూడండి.
3. ఆంధ్రులకోసం – భావరాజు వెంకట కృష్ణారావు రాసిన 'ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ' చూడండి. వీరినే శాతవాహనులు అంటారు.

మాగధులు. వ్యాకరణ శాస్త్రజ్ఞుడు పాణిని 'మాగధ'కు వేరే వ్యుత్పత్తి అర్థం ఇచ్చాడు. అతని ప్రకారం మగధ దేశం[1] నుండి వచ్చినవారు 'మాగధులు' అవుతారు. మగధ దేశం అంటే బీహార్‌లో ఇప్పటి పాట్నా, గయ జిల్లాలు. ప్రాచీన కాలం నుండి మాగధులు తమను సర్వతంత్ర స్వతంత్ర ప్రజలుగా చెప్పుకొనేవారు. వారిని గురించిన ప్రస్తావన అధర్వవేదంలో ఉంది. ప్రఖ్యాతిగాంచిన జరాసంధుడు మగధరాజు. అతడు పాండవుల కాలంవాడు.

మనువు ప్రకారం, నిషాదులు బ్రాహ్మణ పురుషునికి, శూద్ర స్త్రీకి జారత్వం వల్ల పుట్టిన సంతతివారు. చరిత్ర వీరి గురించి వేరే విధంగా చెబుతున్నది. నిషాదులు ఒక దేశీయ జాతి. ఆ జాతికి ఒక స్వతంత్ర దేశ భాగమూ వారికి రాజులూ ఉండేవారు. వారికి చాలా ప్రాచీన చరిత్ర ఉంది. గుహుడు నిషాదుల రాజు అని, శృంగిబేరపురం అతని రాజధాని అనీ, శ్రీరాముని అరణ్యవాస సమయంలో గుహుడు అతనికి ఆతిథ్యం ఇచ్చాడనీ రామాయణం చెబుతున్నది.

వైదేహికుల గురించి మనువు ఏమి చెబుతున్నాడంటే, వారు వైశ్య పురుషునికి, బ్రాహ్మణ స్త్రీకి జారత్వం వల్ల పుట్టిన సంతతి అని. భాషా శాస్త్ర ప్రకారం చూస్తే వైదేహికులు అంటే 'విదేహ'[2] దేశంలో పుట్టినవారని అర్థం వస్తుంది. ప్రాచీన 'విదేహ' అంటే ప్రస్తుత బీహార్‌లోని చంపారన్, దర్భాంగా జిల్లాల ప్రాంతం. చాలా ప్రాచీన కాలం నుండి ఈ దేశమూ, ఈ ప్రజలూ చరిత్రకు తెలుసు. యజుర్వేదంలో వారి ప్రస్తావన ఉంది. రామాయణం వారి గురించి చెబుతున్నది. రాముని భార్య సీత జనకుని కూతురు. జనకుడు విదేహరాజు. మిథిల అతని రాజధాని.

ఈ విధంగా చాల విషయాలను పరిశీలించవచ్చు. మనువు చరిత్రను ఎంత వక్రీకరించాడో, అత్యంత మాననీయులూ, సాహసవంతులూ అయిన జాతులను జార సంతతిగా ఎలా నిందలపాలు చేశాడో చెప్పటానికి ఇంతవరకు ప్రస్తావించిన సందర్భాలు సరిపోతాయి. అధిక సంఖ్యాకులైన జాతులను మొత్తానికి మొత్తం జార సంతతిగా మనువు కల్పించాడు. కాని వ్రాత్యుల విషయంలో అలా చెయ్యలేదు, అయితే అతని అనుయాయులు ఆ పనిని కొనసాగించి వ్రాత్యులను కూడ జారసంతతిగా చేశారు. మనువు ప్రకారం కర్ణుడు వ్రాత్యుడు. బ్రహ్మ వైవర్త పురాణం వ్రాత్యులను జార సంతతిగా చేసి వారు వైశ్య తండ్రికి, శూద్ర తల్లికి పుట్టినవారని చెప్పింది. మనువు ప్రకారం పౌండ్రకుడు వ్రాత్యుడు. బ్రహ్మ వైవర్త పురాణం అతన్ని వైశ్య తండ్రికీ, 'చుండి' తల్లికీ పుట్టిన జార సంతానంగా చెప్పింది.

మనువు దృష్టిలో మల్లుడు వ్రాత్యుడు. కాని బ్రహ్మవైవర్త పురాణంలో అతను 'లెట్ట' తండ్రికి 'తిబర' తల్లికీ పుట్టిన జారసంతతి అని చెప్పారు. 'ఝజ్ఞ కౌటకులు' మనువు ప్రకారం వ్రాత్య బ్రాహ్మణులు. కాని గౌతమ సంహితలో వారు బ్రాహ్మణ తండ్రికి వైశ్య తల్లికి పుట్టిన జార

1. B.C. Law రాసిన 'Ancient Indian Tribes', అధ్యాయం 4.
2. B.C. Law 'Kshatriya Clans in Buddhist India' రెండో భాగం – అధ్యాయం – 1.

సంతానం అని చెప్పారు. యవనులు వ్రాత్యక్షత్రియులని మనువు ప్రకటించాడు. కాని గౌతమ సంహితలో వారు క్షత్రియ తండ్రికి, శూద్ర తల్లికీ పుట్టిన జార సంతతి అన్నారు. కిరాటు(తు)లు మనువు ప్రకారం వ్రాత్య క్షత్రియులు. కాని 'బల్లాళ చరిత్ర' వారిని వైశ్య తండ్రికి బ్రాహ్మణ తల్లికి పుట్టిన జార సంతతిగా చేసింది.

మనువు జన్మరీత్యా జార సంతతిగా పేర్కొన్న కొన్ని జాతులు, వాస్తవంగా జార సంతతి కాకపోగా జన్మరీత్యా స్వతంత్రులు అని స్పష్టమవుతుండగా మనువు, ఇతర స్మృతికారులూ వారిని జార సంతతి అని పిలుస్తున్నారు. వారు ఎందుకు అంత ఉన్మాదంగా ప్రవర్తించారు? ఆ ఉన్మాదానికి ఏదైనా పద్ధతి ఉన్నదా?

ఈ అంశాలనన్నింటిని ఇంత వివరంగా పరిశీలించిన తర్వాత, మనువు అసలు ఈ మిశ్రమ కులాల సమస్య ఎందుకు తీసుకు వచ్చాడు? ఆయన వారి గురించి ఏమి చెప్పాలను కున్నాడు అనేది ఒక చిక్కుముడిగా మిగిలిపోతున్నది.

ఇప్పుడు స్థూలంగా మనం అర్థం చేసుకోగల అంశాలు ఇవి – చాతుర్వర్ణ పద్ధతి విఫలమైంది. ఆ సంగతి మనువు గ్రహించాడు. చతుర్వర్ణాలలో (బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర కులాలలో) దేనిలోనూ చేరని, చేరతారని చెప్పటానికి వీలులేని, అనేక కులాలు (పుట్టుకు వచ్చి) అప్పటి సమాజంలో ఉండటమే చాతుర్వర్ణ సిద్ధాంతం విఫలమైనదనటానికి తార్కాణం. చాతుర్వర్ణ నియమం అమలులో ఉన్నప్పటికీ దానిని కాదని ఆ చతుర్వర్ణాలకు వెలుపల ఉన్న ఈ కులాలు ఎలా పుట్టుకు వచ్చాయో సంజాయిషీ ఇవ్వవలసిన బాధ్యత మనువుకు వచ్చి ఉంటుంది.

అయితే తాను ఇచ్చిన సంజాయిషీ ఎంత ప్రమాదకరమైనదో మనువు గ్రహించాడా? అతడు ఇచ్చుకొన్న సంజాయిషీ అర్థమేమిటో, పరిమాణాలేమిటో గుర్తించాడా? ముఖ్యంగా స్త్రీల శీలాన్ని ఇది ఎంత దెబ్బ తీస్తున్నదో గమనించాడా?

చాతుర్వర్ణనియమం(నిషేధించటం) మూలంగా స్త్రీపురుషుల కలయికలు ప్రచ్ఛన్నమూ రహస్యమూ కావలసి వచ్చింది. అలాంటి రహస్య కలయికలు అక్కడక్కడ (చాల తక్కువగానే) మాత్రమే జరుగుతాయి. అంత పెద్ద ఎత్తున జరగవు. కాని అంత పెద్ద ఎత్తున సంకరం జరిగింది అని అనుకొంటే తప్ప మనువు చెప్పినట్లుగా జాతులకు జాతులు (సంకరజాతులు) పుట్టుకురావు. మరి, అంటరాని కులం గాని చండాల కులంగాని మరొకటి గాని సంకర కులాల పుట్టుకకు మనువు చెప్పిన మూలాన్ని సమర్థించటం ఎలా?

శూద్ర పురుషుడు, బ్రాహ్మణ స్త్రీల అక్రమ లైంగిక సంబంధం వల్ల పుట్టినది చండాల కులం అని మనువు అన్నాడు. ఇది వాస్తవమా? ఏతావాతా ఇది ఏం అర్థం ఇస్తుందంటే, బ్రాహ్మణ స్త్రీలు నైతికంగా చాలా విచ్చలవిడిగా ఉండేవారనీ, శూద్ర పురుషుల పట్ల వారికి

ప్రత్యేకమైన లైంగిక ఆకర్షణ ఉండేదనీ. ఇది నమ్మశక్యం కాదు.

చండాలుర జనాభా ఎంత విస్తారంగా ఉన్నదంటే ప్రతి బ్రాహ్మణ స్త్రీ ఒక్కో శూద్రునికి ఉంపుడుగత్తెగా ఉన్నదనుకున్నాగాని ఈ దేశంలో ఉన్న చండాలుర జనాభాకు అది సరియైన లెక్క చూపలేదు.

మిశ్రమ కులాల మూలానికి సంబంధించి మనువు తన ఈ సిద్ధాంతాలు ప్రవచిస్తున్నపుడు, ఈ దేశంలోని అశేష ప్రజానీకానికి వారి సాంఘిక నైతిక పతనాన్ని సూచించేటట్టుగా ఎంతో నీచమైన ఆధారాన్ని అంటగడుతున్నానని ఆయన గ్రహించాడా! కులాలకు స్వతంత్రమైన ఉనికీ అస్తిత్వమూ వాస్తవమై ఉండగా వాటి మూలం సంకరం అని అతడు ఎందుకు అన్నాడు?

అనువాదకులు :<br>మొక్కపాటి సుమతి<br>బొజ్జా తారకం

చిక్కుముడి : 19

# పితృస్వామికం నుంచి మాతృస్వామికానికి మార్పు – దీని నుంచి బ్రాహ్మణులు ఏమి సాధించాలనుకున్నారు ?

హిందూ చట్టంపై శ్రీ మేయిన్ (Mayne) రాసిన గ్రంథంలో బంధుత్వ నియమాలకు సంబంధించిన కొన్ని విపరీతమైన అంశాలను సూచించారు. ఆయన ఇలా అన్నాడు :

"హిందూ చట్టంలో కుటుంబ సంబంధాలను నియంత్రించే భాగంలో ఉన్నన్ని విపరీతమైన అంశాలు, మరే భాగంలోనూ లేవు. ప్రాచీన పద్ధతులకు ప్రస్తుత పద్ధతులకూ మధ్య కొనసాగింపు పూర్తిగా ఆగిపోవటమే కాకుండా దీనికి సంబంధించిన ప్రాచీన పద్ధతులలోని వివిధ భాగాలు పరస్పర విరుద్ధంగా కూడ ఉన్నాయి. వారసత్వానికి సంబంధించిన ఒక హిందూ చట్టం ప్రకారం ఇది పధ్నాలుగు తరాల వరకూ (అవిచ్ఛిన్నంగా) పురుష పూర్వీకులను వెతుక్కుంటూ వెళ్లే అవకాశం ఉంది. దీనిలోనే ఒక కుటుంబ శాసనంలో అంగీకరించిన కొన్ని వివాహ పద్ధతులున్నాయి. ఇవి చెరచటానికి, మానభంగానికి మరో అందమైన పేర్లు మాత్రమే. ఇందులో పన్నెండు రకాల కుమారులను గుర్తించారు. వారిలో చాలారకాల కుమారులకు తండ్రితో రక్తసంబంధమే ఉండదు."

---

ఇది 11 "పుటల టైపు ప్రతి. శీర్షిక ఒక్కటి మినహా మరెక్కడా రచయిత దిద్దుబాట్లు కనిపించటం లేదు. –సంకలనకర్త

ఈ వైపరీత్యాలు పరమ వాస్తవాలు. హిందూ వివాహానికీ, హిందూ పితృత్వానికీ సంబంధించిన శాసనాలు పరిశీలించిన వారికి ఇది స్పష్టంగా కనిపిస్తుంది.

హిందూ శాసనం ఎనిమిది రకాల వివాహాలను గుర్తించింది. అవి (1) బ్రాహ్మ, (2) దైవ, (3) ఆర్ష, (4) ప్రాజాపత్య, (5) ఆసుర, (6) గాంధర్వ, (7) రాక్షస, (8) పైశాచ.

బ్రాహ్మ వివాహం అంటే వేదాలలో విజ్ఞుడైన (సదాచారపరుడైన) వరుని ఆహ్వానించి సాదరంగా అలంకరించి పూజించి కుమార్తెను వస్త్రాభరణాదులతో కానుకగా (దానం) ఇవ్వటం.

దైవ వివాహం అంటే తండ్రి తన కుమార్తెను (జ్యోతిష్టోమాది) యజ్ఞాలు నిర్వహించే ఋత్విజునికి (కుటుంబ పూజారికి) యజ్ఞం రుసుము చెల్లించే సమయంలో దానికి బదులుగా ఇవ్వటం.

ఆర్ష వివాహం అంటే వరుడు, వధువు కోసం రుసుమును పెండ్లికుమార్తె తండ్రికి చెల్లించి, శాస్త్రోక్తంగా వివాహం చేసుకోవటం.

ప్రాజాపత్య వివాహం అంటే, ఒక పురుషుడు ఒక అమ్మాయిని తన భార్యగా కోరుతూ (అమ్మాయి తండ్రికి) దరఖాస్తు పెట్టుకోవటం. ఆ దరఖాస్తును అమ్మాయి తండ్రి అంగీకరించటం. ప్రాజాపత్య, బ్రాహ్మ వివాహాల మధ్య ఉన్న తేడా ఏమంటే, కుమార్తెను తండ్రి కానుకగా సమర్పించటం ఇష్టపూర్వకంగా జరుగుతుంది. అయితే ప్రాజాపత్యంలో అందుకు దరఖాస్తు పెట్టుకోవాలి.

ఆసుర వివాహ పద్ధతిలో వరుడు, వధువు తండ్రికీ, తండ్రి తరఫు బంధువులకూ వధువుకూ తాను ఇవ్వగలిగినంత డబ్బు ఇచ్చి ఆమెను భార్యగా స్వీకరించవలసి ఉంటుంది. ఆర్ష ఆసుర వివాహ పద్ధతుల్లో పెద్ద తేడా ఏమీ లేదు. రెండిట్లోను వధువు అమ్మకం ఉంటుంది. ఉన్న తేడా ఏమంటే ఆర్ష వివాహ పద్ధతిలో ధర నిర్ణయమై ఉంటుంది. ఆసుర పద్ధతిలో అలా కాదు.

గాంధర్వ వివాహం, మతపరమైనది కాక ఇంద్రియ సుఖ సంబంధమైన ఉద్దేశాలతో చేసుకునే వివాహం. కన్యను బలవంతంగా పట్టుకొని ఆమె ఏడుస్తూ ఉంటే, సహాయం కోసం అర్థిస్తూ ఉంటే ఆమె బంధువులను స్నేహితులను పోట్లాటలో చంపిగాని, గాయపరచిగాని, వారి ఆస్తులు ధ్వంసం చేసిగాని, ఆమెను ఎత్తుకుపోయి వివాహం చేసుకోవటాన్ని రాక్షస వివాహం అంటారు.

పైశాచ వివాహం అంటే అమ్మాయిని, ఆమె నిద్రిస్తుండగా గాని, మద్యం మత్తులో ఉన్నప్పుడుగాని, పరాకుగా ఉన్నప్పుడుగాని మానభంగం చేసి పెళ్ళి చేసుకోవటం.

హిందూ శాసనం పదమూడు రకాల పుత్రులను గుర్తిస్తుంది. (1) ఔరస, (2) క్షేత్రజ (3) పుత్రికాపుత్ర (4) కానీన (5) గూఢజ (6) పునర్భవ (7) సహోఢజ (8) దత్తక (9) కృత్రిమ (10) క్రీత (11) అపవిద్ధ (12) స్వయందత్త (13) నిషాద.

ఔరస పుత్రుడంటే, చట్ట ప్రకారం (శాస్త్రోక్తంగా) వివాహమాడిన భార్య ద్వారా తనకు పుట్టినవాడు.

పుత్రికాపుత్ర అంటే కూతురుకు పుట్టిన కొడుకు. ఈ పద్ధతిలోని ప్రాముఖ్యం ఏమిటంటే ఒకరికి కొడుకుల్లేకుండా కూతురు మాత్రమే ఉంటే ఆమె తండ్రి ఎంపిక చేసిన, లేదా నియమించిన వ్యక్తితో లైంగిక సంబంధం పెట్టుకుని, అట్టి సంభోగం ద్వారా కొడుకును కంటే ఆ కొడుకు ఆమె తండ్రికి కొడుకు అవుతాడు. దీనిమూలంగానే ఆ కొడుకును పుత్రికా పుత్రుడు అని అంటారు. తనకు కొడుకుని కని ఇవ్వటం కోసం తనకు ఇష్టమైన వ్యక్తితో లైంగిక సంపర్కం పెట్టుకోవలసిందిగా బలవంతం చేసే హక్కు తండ్రికి, కూతురు వివాహం అయిన తర్వాత కూడ ఉంటుంది. అందుకనే అన్నదమ్ములు లేని అమ్మాయిని పెళ్ళి చేసుకోవద్దని హెచ్చరిస్తుంటారు.

క్షేత్రజాడు అంటే, ఆ పదం అర్థం ప్రకారం భూమి (అంటే భార్య) కొడుకు అని. హిందూ సిద్ధాంతాలలో భార్యను పొలం (క్షేత్రం)తోను భర్తను పొలం యజమానితోను పోలుస్తారు. భర్త చనిపోయినా లేదా బ్రతికి ఉండి నపుంసకుడైనా లేదా బాగు చేయలేని రోగగ్రస్తుడైనా, అలాంటి సందర్భాలలో (సంతానం కోసం) భర్త సోదరుడిని గాని అతని సంబంధీకులను ఎవరినైనాగాని ఆ భార్యకు కొడుకును పుట్టించటానికి నియమిస్తారు. ఈ పద్ధతిని నియోగం అంటారు. ఆ విధంగా పుట్టిన కొడుకును క్షేత్రజాడు అంటారు.

(తన) తండ్రి ఇంట్లో నివసిస్తున్న పెళ్లికాని అమ్మాయి అక్రమ సంబంధం ద్వారా కొడుకును కని, ఆ తర్వాత ఎవరినైనా పెళ్లి చేసుకుంటే, ఆ భర్త తన పెళ్లికి ముందు భార్యకు పుట్టిన కొడుకును తన కొడుకుగా స్వీకరిస్తాడు, అట్టి కొడుకును కానీనుడు అంటారు.

గూఢజాడు అంటే భార్యాభర్తలు కలిసి ఉండటానికి అవకాశం ఉన్న కాలంలో అక్రమ సంబంధం ద్వారా పుట్టినట్టు అనుమానం ఉన్న కొడుకు. తిరుగులేని రుజువుతో చెప్పే అవకాశం ఏదీ లేదు కాబట్టి ఆ భర్త ఆ విధంగా పుట్టినవానిని తన కొడుకుగానే స్వీకరిస్తాడు. అతని పుట్టుక స్పష్టంగా కాకుండా గూఢంగా ఉన్నది కనుక అతనిని గూఢజాడు అంటారు.

సహోఢజాడు అంటే పెళ్లినాటికే గర్భవతిగా ఉన్న భార్యకు పుట్టిన కొడుకు. పెళ్లికి ముందే ఆమెతో సంబంధం పెట్టుకున్న భర్తకు పుట్టినవాడా లేక భర్తకు కాకుండా వేరేవానికి పుట్టినవాడా అని ఖచ్చితంగా చెప్పటానికి వీలులేదు. కాని సహోఢజ అంటే గర్భవతి అయిన కన్యకు పుట్టిన కొడుకును తర్వాత ఆమెను పెళ్లి చేసుకున్న వ్యక్తి తన కొడుకుగానే

స్వీకరించటం అని మాత్రం రూఢీ అర్థం.

పునర్భవుడు అంటే భర్తను విడిచిపెట్టేసిన స్త్రీ ఇతరులతో కొంతకాలం కాపురం చేసి తిరిగి భర్త కుటుంబంలో చేరి కన్న కొడుకు. భర్త నపుంసకుడైనా, కుల బహిష్కృతుడైనా, పిచ్చివాడైనా లేదా రోగగ్రస్థుడైనా భార్య అతనిని విడిచిపెట్టి వేరొక వ్యక్తిని భర్తగా గ్రహించి కుమారుని పొందితే అలా పుట్టిన కొడుకు అని అర్థం.

'పారాశవుడు'[1] అంటే బ్రాహ్మణునికి శూద్ర భార్య వలన పుట్టిన పుత్రుడు అని అర్థం.

జాబితాలోని మిగిలిన రకాల పుత్రులు కొడుకులని చెప్పుకోవటానికి వీలుగా దత్తత చేసుకున్నవారు. 'దత్తకుడు' అంటే బాలుని తలిదండ్రుల అనుమతితో దత్తత తీసుకుని పుత్రునిగా గ్రహించినవాడు.

'కృత్రిముడు' అంటే అభిమానించి సమ్మతితో దత్తత చేసుకున్న పుత్రుడు.

క్రీతుడు అంటే వేరే తల్లిదండ్రుల నుండి కొనుక్కున్న పుత్రుడు.

'అపవిద్ధుడు' అంటే తలిదండ్రులు విడిచి పెట్టి వేస్తే తెచ్చుకొని దత్తత చేసుకున్న పుత్రుడని అర్థం. 'స్వయం దత్తుడు' అంటే తల్లిదండ్రులు లేని లేదా తల్లిదండ్రులు విడిచి పెట్టివేసిన వ్యక్తి వచ్చి 'నన్ను మీ కొడుకుగా స్వీకరించండి' అని అడిగినప్పుడు ఆ విధంగా స్వీకరించినట్టి పుత్రుడు.

చాలరకాల వివాహపద్ధతులు కన్యలను చెడగొట్టటానికి, మానభంగం చేయటానికి అందమైన పేర్లు అని చెప్పటంలోని నిజాన్నీ, చాలరకాల పుత్రులకు వారి తండ్రులతో రక్త సంబంధం ఉండదనే విషయాన్నీ గమనించాం. ఈ వివిధ రకాల వివాహ పద్ధతులూ, వివిధ రకాల పుత్రులూ మనువు కాలంనాటికే చట్ట సమ్మతంగా గుర్తించటం జరిగింది.

మనువు చేసిన మార్పులు కూడ స్వల్పమైనవే. వివాహ పద్ధతులకు సంబంధించిన వీటిని కూడ మనువు[2] చట్టవ్యతిరేకంగా గుర్తించలేదు. అతను చెప్పేది అంతా ఏమంటే, పై ఎనిమిది రకాల వివాహ పద్ధతులలో ఆరు, అంటే బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, అసుర, గాంధర్వ అనేవి క్షత్రియులకు చట్ట సమ్మతమనీ – అసుర, గాంధర్వ, పైశాచ అనేవి వైశ్య, శూద్రులకు చట్ట సమ్మతమనీను.

అదే విధంగా పన్నెండురకాల పుత్రులలో ఎవరినీ అతడు తిరస్కరించలేదు. పైగా వారి బంధుత్వాన్ని గుర్తించాడు. అతడు చేసిన మార్పు ఏమంటే వారసత్వానికి సంబంధించిన

1. అతనిని నిషాదుడు అని కూడ అంటారు. జీమూత వాహనుడు, పారశవునికి నిషాదునికి మధ్య తేడా గమనించాడు. 'పారశవ' అంటే బ్రాహ్మణునికి అవివాహిత శూద్ర స్త్రీకి పుట్టినవాడనీ, 'నిషాద' అంటే బ్రాహ్మణునికి (అతని) శూద్ర భార్య వల్ల పుట్టినవాడనీ ఆయన చెప్పాడు.
2. మను. III 23.

నియమావళిని మార్చటం. వాటిని రెండు తరగతులుగా విభజించాడు; (1) వారసులు, బంధువులు; (2) వారసులు కాని బంధువులు. అతనిలా అన్నాడు –

తనకు పుట్టిన కొడుకు (ఔరసుడు), తన భార్యకు పుట్టిన కొడుకు (క్షేత్రజుడు), దత్తపుత్రుడు, కృత్రిముడు, గూఢోత్పన్నుడు, అపవిద్ధుడు ఈ ఆరుగురూ వారసులూ, బంధువులూ అవుతారు.[1]

కానీనుడు, సహోఢజుడు, క్రీతుడు, పునర్భవుడు, స్వయందత్తుడు, శౌద్రుడు (శూద్ర స్త్రీ కొడుకు) ఈ ఆరుగురూ వారసులు కాదు కాని బంధువులే.[2]

ఒక మనిషి ఆస్తికి అతని ఇద్దరు పుత్రులు, ఔరసుడూ, (తనకు పుట్టినవాడు), క్షేత్రజుడు (తన భార్యకు పుట్టినవాడు) వారసులే, అయినా వారు రెండోవారిని మినహాయించి స్వంత తండ్రి ఆస్తికి (ఏది ఎవని తండ్రిదో దానికి) హక్కుదారులవుతారు.[3]

తండ్రికి సంబంధించిన ఆస్తికి అతని ఔరస పుత్రుడే చట్ట సమ్మతమైన యజమాని అవుతాడు. అయితే విషమ పరిస్థితిని తొలగించటం కోసం ఇతర (స్థాయి) పుత్రులకు పోషణార్థం కొంత భృతిని ఇవ్వవచ్చు.[4]

సగోత్రతకు (జ్ఞాతిత్వానికి) సంబంధించిన చట్టంలో వేరొక భాగం చాలా పెద్ద మార్పులు చెందింది. అయితే దానిని చాలామంది గుర్తించలేదు. శిశువు వర్ణాన్ని నిర్ణయించటానికి సంబంధించినది అది. పిల్లలది ఏ వర్ణం అవుతుంది? అతనిది తండ్రి వర్ణం అవుతుందా? తల్లి వర్ణం అవుతుందా? మనువు కంటె ముందున్న శాసనం ప్రకారం పిల్లల వర్ణం తండ్రి వర్ణం అయ్యేది. తల్లివర్ణం అసలు పరిగణనలోకి తీసుకొనేవారు కాదు. ఈ సిద్ధాంతాన్ని బుజువు చేయటానికి కొన్ని ఉదాహరణలు చాలు.

| | తండ్రి | | తల్లి | | శిశువు | |
|---|---|---|---|---|---|---|
| | పేరు | వర్ణం | పేరు | వర్ణం | పేరు | వర్ణం |
| 1. | శంతనుడు | క్షత్రియ | గంగ | తెలియదు | భీష్ముడు | క్షత్రియ |
| 2. | పరాశరుడు | బ్రాహ్మణ | మత్స్యగంధి | బెస్త | కృష్ణ ద్వైపాయనుడు | బ్రాహ్మణ |
| 3. | వశిష్ఠుడు | బ్రాహ్మణ | అక్షమాల | – | పాయనుడు | – |
| 4. | శంతనుడు | క్షత్రియ | మత్స్యగంధి | బెస్త | విచిత్రవీర్యుడు | క్షత్రియ |
| 5. | విశ్వామిత్రుడు | క్షత్రియ | మేనక | అప్సర | శకుంతల | క్షత్రియ |
| 6. | యయాతి | క్షత్రియ | దేవయాని | బ్రాహ్మణ | యదువు | క్షత్రియ |
| 7. | యయాతి | క్షత్రియ | శర్మిష్ఠ | అసుర | ద్రుహ్యుడు | క్షత్రియ |
| 8. | జరత్కారువు | బ్రాహ్మణ | జరత్కారి | నాగ | ఆస్తికుడు | బ్రాహ్మణ |

1. మను IX-159 2. అదే IX-160 3. మను IX-162 4. మను IX-163

మనువు ఏం చేశాడు? పిల్లల వర్ణం నిర్ణయించే విషయానికి సంబంధించిన సూత్రాలలో మనువు చేసిన మార్పులు చాలా విప్లవాత్మకమైనవి. మనువు ఈ క్రింది నియమాలు పెట్టాడు.

"అన్ని కులాల (వర్ణాలు)లోనూ, ఏ కులానికి చెందినవారైనా సరే తమ తమ సామాజిక క్రమంలో సమాన కులానికి చెందిన కన్యలను చట్ట సమ్మతంగా వివాహం చేసుకోవటం ద్వారా సంతానం పొందితే ఆ పిల్లలకు తమ తండ్రి కులం వస్తుంది." (మను 10-5).

"ద్విజునికి అతనికంటె కింది కులం స్త్రీ వల్ల పుట్టిన పుత్రులకు తండ్రి కులం వంటి కులమే వస్తుంది కానీ వారి తల్లుల తప్పిదంవల్ల వారు నిందాస్పదులవుతారు. (మను.10-6).

ద్విజునికి అతనికంటె కొంచెం కిందిస్థాయి కులానికి చెందిన భార్యవల్ల కలిగిన పుత్రులు కులక్రమంలో (తల్లుల నుంచి సంక్రమించిన దోషంవల్ల) 'అనంతరులు'గా పరిగణించబడతారు. (మను 10-14)

ఆర్యులకు తమతో సమాన కులానికి, లేదా కొంచెం దిగువస్థాయి కులానికి (అనంతర) చెందిన స్త్రీల వల్ల పుట్టిన ఆరుగురు పుత్రులు, ద్విజుల ధర్మాలే కలిగి ఉంటారు. అయినాగాని నియమోల్లంఘనం ద్వారా జన్మించారు కాబట్టి విధులకు సంబంధించిన విషయాలలో వారంతా శూద్రులతో సమానంగా ఉంటారు. (మను 10-41).

మనువు ఈ క్రింది విషయంలో భేదం చూపాడు. (1) తండ్రీ తల్లీ ఒకే వర్ణానికి చెంది ఉంటే

(2) తల్లి, తండ్రి కులంకంటే ఒక మెట్టు కింది కులానికి చెందినది అయి ఉంటే - ఉదా : బ్రాహ్మణ తండ్రి, క్షత్రియ తల్లి; క్షత్రియ తండ్రి, వైశ్య తల్లి; వైశ్య తండ్రి, శూద్ర తల్లి ఇలా-

(3) తల్లికులం, తండ్రి కులానికి ఒక మెట్టు కంటె ఇంకా క్రిందిది అయి ఉంటే - ఉదా: బ్రాహ్మణ తండ్రి వైశ్య తల్లి లేదా శూద్రతల్లి; క్షత్రియ తండ్రి శూద్రతల్లి.

మొదటి సందర్భంలో పిల్లలకు తండ్రి కులం వస్తుంది. రెండో సందర్భంలో కూడ పిల్లల కులం తండ్రి కులమే అవుతుంది. మూడో విషయంలో పిల్లల కులం తండ్రి కులం కాదు. పిల్లలకు తండ్రి కులం రాకపోతే మరే కులం వస్తుందో మనువు స్పష్టంగా చెప్పలేదు. కాని మనువును వ్యాఖ్యానించిన మేధాతిధి, కుల్లూకభట్టు, నారదుడు, నంద పండితుడు మొదలైనవారంతా ఒకే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అటువంటి సందర్భాలలో పిల్లలకు తల్లి కులం వస్తుందని వారు చెప్పారు. సూక్ష్మంగా చెప్పాలంటే పిల్లల వర్ణాన్ని మనువు, పితృ సవర్ణత - (తండ్రి వర్ణం బట్టి) నుండి మాతృ సవర్ణత (తల్లి వర్ణంబట్టి)కు మార్చాడు.

ఇది చాలా విప్లవాత్మకమైన మార్పు. వివాహ రూపాలు నిర్దేశించి పెట్టి, పుత్రులలో

రకాలు నిర్ణయించి, అనులోమ వివాహాలకు అనుమతి ఇచ్చి, పితృ సవర్ణ్య సిద్ధాంతం ప్రవేశపెట్టి (ఇన్నిరకాలుగా) బ్రాహ్మణులు వర్ణవ్యవస్థను ఎంత కట్టుదిట్టంగా బిగించి ఉంచాలనుకున్నా అది అనియత వ్యవస్థే అయిందనే సత్యాన్ని చాలా కొద్దిమంది మాత్రమే గ్రహించారనేది చాలా శోచనీయమైన విషయం. వర్ణ వ్యవస్థలో చాల లొసుగులు ఉన్నాయి. కొన్ని వివాహ పద్ధతులకు వర్ణ వ్యవస్థతో సంబంధం లేదు. ఉండటానికి వీలులేదు కూడ. రాక్షస, పైశాచ వివాహ పద్ధతుల్లో – బహుశా అన్ని సందర్భాలలోనూ పురుషులు క్రింది వర్ణాలకు, స్త్రీలు పై వర్ణాలకూ చెంది ఉంటారు. సంతానానికి సంబంధించిన నియమం కూడ శూద్రుల పిల్లలు బ్రాహ్మణ పిల్లలుగా చెలామణి కావటంకోసం చాలా లొసుగులు విడిచిపెట్టింది. ఉదా : గూఢజ, సహోఢజ, కానీనులను తీసుకోండి. వారు శూద్రులకు లేదా బ్రాహ్మణులకు, క్షత్రియులకు లేదా వైశ్యులకు పుట్టలేదని ఎవరు చెప్పగలరు? వీటి విషయంలో ఎలాంటి అనుమానాలు ఉన్నప్పటికీ, శాసనాంగీకారం పొందిన పితృ సవర్ణతతో కూడిన అనులోమ పద్ధతి, కింది కులాలవారు పై వర్ణాలలోకి చేరిపోవటానికి వీలు కల్పించింది. శూద్రుడు బ్రాహ్మణుడు కాని క్షత్రియుడు కాని వైశ్యుడు కాని కాలేడు. కాని శూద్ర స్త్రీ శిశువు, ఆమె వైశ్యుణ్ణి వివాహమాడితే వైశ్య వర్ణానికి చెందుతుంది, క్షత్రియుణ్ణి వివాహమాడితే క్షత్రియ వర్ణానికి చెందుతుంది, బ్రాహ్మణుడిని పెళ్లాడితే బ్రాహ్మణ వర్ణానికి చెందుతుంది. క్రింది వర్గాలను పై వర్గాలలోకి లేవనెత్తడం (కలుపుకోవటం) వాస్తవమూ, రూఢి అయినదీను. అయితే ఇందుకు అనుసరించిన పద్ధతి మాత్రం పరోక్షం. పాతపద్ధతి వలన కలిగిన ఫలితాలలో ఇదొకటి. మరో ఫలితం ఏమంటే ఒక వర్ణానికి చెందిన సముదాయం ఎప్పుడూ కూడా మిశ్రమ (కలిసిపోయిన) సముదాయమే. బ్రాహ్మణ సమాజంలో బ్రాహ్మణ స్త్రీలకు, క్షత్రియ స్త్రీలకు, వైశ్య స్త్రీలకు, శూద్ర స్త్రీలకు పుట్టిన పిల్లలు ఉండి ఉంటారు. వారందరికీ బ్రాహ్మణ సమాజపు హక్కులు, యోగ్యతలు పొందే అర్హత ఉంటుంది. క్షత్రియ సమాజంలో క్షత్రియ స్త్రీలకు, వైశ్య స్త్రీలకు శూద్ర స్త్రీలకు పుట్టిన పిల్లలు ఉండి ఉంటారు. వారందరినీ క్షత్రియులుగానే గుర్తిస్తారు. క్షత్రియులకు ఉండే హక్కులు, ప్రయోజనాలు పొందే అర్హత వారికి ఉంటుంది. అదే విధంగా వైశ్య సమాజంలో వైశ్య స్త్రీలకు శూద్ర స్త్రీలకు పుట్టిన పిల్లలు ఉండి ఉంటారు. వారిని వైశ్యులుగానే భావిస్తారు. వైశ్యులకుండే హక్కులు, అర్హతలు వారంతా పొందే అవకాశం ఉంటుంది.

మనువు చేసిన మార్పు హిందూ శాసనంలోని అత్యంత మౌలికమైన సిద్ధాంతాలలో కొన్నింటికి విరుద్ధమైనది. మొదటగా అది హిందూ శాసనంలోని క్షేత్ర – క్షేత్రజ నియమానికి విరుద్ధం. శిశుసంపద (శిశువు ఎవరికి చెందుతాడు) అనే విషయాన్ని గురించి వ్యవహరించేటప్పుడు శిశువుకు యజమాని, ఆ శిశువు తల్లి యొక్క (చట్ట ప్రకారంగా ఉన్న) భర్త అవుతాడు; కాని వాస్తవంగా జన్మకారకుడైన తండ్రి కాడు. ఈ సిద్ధాంతాన్ని మనువు ఎరుగును. ఈ క్రింది మాటల్లో అతడు ఇలా చెబుతున్నాడు.[1]

1. మేయిన్ (Mayne) హిందూ లా, పుట 83.

"చట్టబద్ధమైన స్త్రీ సంపద (వైవాహిక బంధంతో తెచ్చుకున్న భార్య) లేని పురుషులు, ఇతరులకు చెందిన క్షేత్రంలో విత్తనాలు చల్లవచ్చు. అయితే ఫలం క్షేత్రస్వామికే చెందుతుంది. ఫలకారకుడైనవాడు దాని ఫలితాలను పొందలేడు. భూస్వామికి విత్తనానికి మధ్య ఏదైనా ప్రత్యేకమైన ఒడంబడిక ఉంటే తప్ప సాధారణంగా ఫలం స్పష్టంగా భూస్వామికే చెందుతుంది. ఎందుకంటే విత్తనం కంటే అది ఆశ్రయం పొందే స్థలం ఎక్కువ ముఖ్యం."

దీనిపైననే 12 రకాల పుత్రుల హక్కులను నిర్ణయించారు. ఈ మార్పు పట్నా పొటెస్టాస్ (Patna Potestas) నియమానికి కూడ విరుద్ధం. హిందూ కుటుంబం రోమన్ కుటుంబంలాగా పితృస్వామికమైనది.

ఈ రెండింటిలోనూ కుటుంబ సభ్యులపైన తండ్రికి నిర్దిష్టమైన అధికారం ఉంటుంది. మనువుకు ఈ సంగతి తెలుసు. చాలా స్పష్టమైన మాటల్లో దీనిని గుర్తించాడు. హిందూ తండ్రి అధికారాన్ని నిర్వచిస్తూ, మనువు ఇలా అంటాడు.

"భార్య, కొడుకు, బానిస ఈ ముగ్గురికీ ప్రత్యేకంగా (తమకంటూ) స్వంత ఆస్తి ఏదీ ఉండకూడదని శాసనం ప్రకటించింది. వారు సంపాదించే ఐశ్వర్యం వారి యజమానికి (వారు ఎవరికి చెంది ఉంటారో వారికి) చెందుతుంది."

వారు కుటుంబ యజమానికి అంటే తండ్రికి చెందినవారు. పట్నా పొటెస్టాస్ నియమం ప్రకారం పుత్రుల సంపాదన తండ్రి ఆస్తి అవుతుంది. పితృత్వానికి సంబంధించిన శాసనంలో మార్పు తేవటం అంటే ఖచ్చితంగా అది తండ్రికి నష్టం."

ఈ శాసనాన్ని పితృ-సవర్ణత నుండి మాతృ సవర్ణతకు మనువు ఎందుకు మార్చాడు?

అనువాదం : బొజ్జా తారకం

చిక్కుముడి : 20

# కలివర్జ్యం : పాపాన్ని పాపం అని అనకుండా నిలుపుదల చేసే బ్రాహ్మణ కళ

కలివర్జ్యం అనే బ్రాహ్మణుల అంధ విశ్వాసం గురించి చాలా కొద్దిమందే విని ఉంటారు. కలియుగం అనే మరో బ్రాహ్మణ విశ్వాసంతో దీనిని పొరబడకూడదు. కలివర్జ్యం అంటే కలియుగంలో వర్జించతగినది అని అర్థం. ఇతర యుగాలలో మంచివిగా పరిగణించబడి అమలులో ఉండిన కొన్ని ఆచారాలనూ వాడుకలనూ కలియుగంలో అమలు చేయవలసిన అవసరం లేదని నిర్ధారించారు. అలా వర్జించిన (వదలిపెట్టిన) వానిని నిర్ణయించే సిద్ధాంతం కలివర్జ్య సిద్ధాంతం. ఈ ఆదేశాలు సూచనలు వివిధ పురాణాలలో అక్కడక్కడా కనిపిస్తాయి. కాని ఆదిత్య పురాణం వాటినన్నింటినీ క్రోడీకరించి ఒకచోటికి తెచ్చింది.[1] కలివర్జ్య ఆచారాలు క్రింద ఇస్తున్నాను.

(1) విధవ సంతానం పొందటానికి భర్త సోదరుడిని నియమించటం.

(2) వివాహ విధి సంపూర్ణం కాని సందర్భాలలో కన్యకు పునర్వివాహం చేయటం, వివాహవిధి సంపూర్ణం అయి ఉండి భర్త చనిపోతే ఆమెకు తిరిగి వివాహం చేయటం.

---

ఇది తొమ్మిది పుటల టైపు ప్రతి. దీనిలో చాలా దిద్దుబాట్లు గ్రంథకర్తే స్వయంగా చేశారు. 43 కలివర్జ్యాల వివరణ కొరకు ఈ విభాగపు అనుబంధం చూడండి. – సంకలనకర్త

---

1. ఈ విషయాలను మహామహోపాధ్యాయ కాణే వ్యాసం నుండి తీసుకున్నాను.

(3) ద్విజ వర్ణాలకు చెందిన మూడు తరగతులవారూ వివిధ వర్ణాలకు చెందిన బాలికలను పెళ్లి చేసుకోవటం.

(4) అన్నిటికి తెగించి, దుర్మార్గులైన బ్రాహ్మణులను సరాసరి పోరాటంలో అయినా సరే చంపటం.

(5) విదేశ యాత్రలు చేసే అలవాటు ఉన్న ద్విజునితో ప్రాయశ్చిత్తం చేసుకున్న తర్వాత (కూడా) కలిసి భోజనం చేయటంలాంటి సామాజిక సంబంధాలు పెట్టుకోవటం.

(6) సత్రం ప్రారంభించటం.

(7) కమండలం గ్రహించటం.

(8) మహా (ప్రస్థానానికి) యాత్రకు బయలుదేరటం.

(9) గోమేధ యజ్ఞంలో ఆవును చంపటం.

(10) శ్రౌతమని యాగంలో కూడా మద్యం తీసుకోవటం.

(11,12) అగ్ని హోత్ర హోమం తరువాత సమర్పిత వస్తువులలో మిగులు ఏమీ లేకుండా చేయటం కోసం గరిటెను (స్రుక్) నాకి అలా నాకిన దానినే తిరిగి అగ్నిహోత్రంలో వాడటం.

(13) శాస్త్రాలలో నిర్ణయించినట్టుగా అరణ్యంలో కుటీరానికి వెళ్లే ఆశ్రమ దశ.

(14) మనిషి ప్రవర్తననూ, వైదిక జ్ఞానాన్నీ బట్టి (మరణానికీ పుట్టుకకూ సంబంధించిన) శౌచ కాలవ్యవధిని తగ్గించటం.

(15) బ్రాహ్మణులకు మరణశిక్ష (ప్రాయశ్చిత్తంగా) విధించటం.

(16) బంగారం దొంగతనం లాంటివి కాక ఇతరమైన ప్రాణఘాతుక నేరాలకూ, మహాపాతకాలకూ రహస్యంగా ప్రాయశ్చిత్త కాండ నెరపటం (చేయటం).

(17) వరునికీ, అతిథులకూ, పితరులకూ మంత్రయుక్తంగా జంతు మాంసాన్ని సమర్పించే ఆచారం.

(18) ఔరస పుత్రులు, దత్తపుత్రులతోపాటు మిగిలిన విధాల పుత్రులను కూడ పుత్రులుగా అంగీకరించటం.

(19) అగ్రకులాల స్త్రీలతో సంభోగం చేసినవారితో (అట్టి పాపానికి వారు ప్రాయశ్చిత్తం చేసుకున్న తర్వాత అయినా) మామూలు సంబంధం పెట్టుకోవటం.

(20) ఒక గౌరవనీయుని భార్య గర్హించదగిన వ్యక్తితో లైంగిక సంబంధం పెట్టుకున్నట్లయితే

ఆమెను త్యజించటం.

(21) మరొకరి కోసం తనను చంపుకోవటం.

(22) కొంత తిని విడిచిపెట్టిన ఆహారాన్ని వదలివేయటం.

(23) చెల్లింపుకు బదులుగా జీవితాంతం ఒక నిర్దిష్టమైన విగ్రహాన్ని (దేవతను) ఆరాధించటానికి నిశ్చయించుకోవటం.

(24) చితాస్థులను (కాలిన ఎముకలను) ప్రోగుచేసిన, మరణ అశౌచంలో ఉన్న, వ్యక్తులను తాకటం.

(25) (యజ్ఞాలలో) బ్రాహ్మణులే స్వయంగా బలి పశువులను వధించటం.

(26) బ్రాహ్మణులు, 'సోమ' మొక్కలు అమ్మటం.

(27) ఆరు పూటలు (అంటే మూడురోజులు) బ్రాహ్మణునికి భోజనం లేకపోయినప్పుడు, శూద్రుని నుండి అయినా భోజనం గ్రహించటం (సంపాదించటం).

(28) బ్రాహ్మణ గృహస్థుకు, శూద్రుల నుండి (వారు తన దాసులు, పశుల కాపర్లు, వంశ పారంపర్యమైన మిత్రులు, పంటలో కొంతభాగం చెల్లించే ఒప్పందం మీద తన పొలం సాగు చేస్తున్న వారూ అయినట్లయితే వండిన అన్నం తీసుకోవటానికి అనుమతి.

(29) చాలా దూరపు తీర్థ క్షేత్రాలకు యాత్ర వెళ్లటం.

(30) స్మృతులు చెప్పినట్లుగా విద్యార్థి ప్రవర్తన గురువు పట్ల ఉన్నట్లే గురుపత్నిపట్ల కూడా ఉండాలనటం.

(31) బ్రాహ్మణులు (కష్టకాలంలో) అయుక్తమైన పనులు చేయటం మూలంగానైనా పొట్టపోసుకోవటం. బ్రాహ్మణుల జీవన విధానం రేపటికోసం దాచుకోవాలనే ఆలోచనకు తావు ఇవ్వని విధంగా ఉండాలనటం.

(32) శిశువుకు జాతకర్మ నుండి వివాహం వరకూ అన్ని సంస్కారాలు చేయటం కోసం జాతకర్మ సమయంలో హోమంలో నుండి బ్రాహ్మణులు అరణి (నిప్పు పుట్టించటానికి రెండు చెక్కముక్కలు)ని తీసుకోవటం.

(33) బ్రాహ్మణుల నిరంతర సంచారం.

(34) నోటితో నిప్పు ఊదడం (వెదురు గొట్టం ఉపయోగించకుండా).

(35) మానభంగం వంటి వానిద్వారా కళంకితులైన స్త్రీలను ప్రాయశ్చిత్తం చేసుకున్న

తర్వాత శాస్త్రాలు ఆదేశించిన రీతిగా మామూలుగా కులంలో చేర్చుకోవటం.

(36) సన్యాసి అన్ని వర్ణాల వారి నుంచి (శూద్రులతో సహా) ఆహారం స్వీకరించటం.

(37) అప్పుడే తవ్విన బావి (జలాశయం) నుండి పదిరోజులవరకూ నీళ్లు వాడకుండా ఆగటం.

(38) శాస్త్రాలు నిర్దేశించిన నియమాల ప్రకారం విద్య ముగిసిన తర్వాత గురువు కోరిన విధంగా గురుదక్షిణ ఇవ్వటం.

(39) బ్రాహ్మణులు, తదితర వర్ణాలవారు శూద్రులను వంట మనుషులుగా పెట్టుకోవటం.

(40) వృద్ధులు ఏటవాలుగా ఉన్న కొండ(కొండకొమ్ము) నుండి అగ్నిలో దూకి ఆత్మహత్య చేసుకోవటం.

(41) ఒక ఆవు తనివి తీరా నీళ్లు తాగిన తర్వాత మిగిలిన నీళ్లలో అయినా మర్యాదస్తులు ఆచమనం చేయటం.

(42) తండ్రి కొడుకుల వివాదంలో సాక్ష్యం చెప్పే సాక్షులకు జరిమానా విధించటం.

(43) ఎక్కడ సాయంత్రం అయితే అక్కడే సన్యాసి ఆరోజుకు ఉండిపోవటం.

కలివర్జ్య స్మృతి గురించిన విచిత్రమైన విషయం ఏమిటంటే దాని ప్రాధాన్యతను ఎవరూ పూర్తిగా గుర్తించకపోవటం. కలియుగానికి నిషేధమైన విషయాల జాబితాగానే దీనిని సాధారణంగా ప్రస్తావిస్తారు. అయితే అసలు విషయం దీని కంటె వేరే చాలా ఉన్నది. కలివర్జ్య స్మృతి జాబితాలో ఉన్న ఆచారాలను పాటించటం నిషేధించారన్న దానిలో సందేహం లేదు. ప్రశ్న ఏమంటే – ఈ ఆచారాలు అవినీతికరమైనవి, కాబట్టి లేదా ఇతర విధంగా సమాజానికి హానికరమైనవి కాబట్టీ వీటిని ఖండించి నిషేధించారా? దీనికి సమాధానం చెప్పాలంటే, 'లేదు' అని చెప్పాలి. ఈ ఆచారాలు నిషేధించవలసినవైతే వీటిని ఎందుకు ఖండించలేదు? ఇందులోనే 'కలివర్జ్య'కు సంబంధించిన చిక్కుమెలిక ఉన్నది. ఒక ఆచారాన్ని ఖండించకుండా, నిషేధించటం అనే పద్ధతి పూర్వయుగాలలో అనుసరించిన విధానానికి పూర్తి వ్యతిరేకంగా ఉన్నది. ఒక ఉదాహరణ తీసుకుందాం – పెద్ద కొడుకుకు మొత్తం ఆస్తినంతా ఇచ్చివేయటాన్ని ఆపస్తంబ ధర్మసూత్రం నిషేధిస్తున్నది. అయితే (ఆ నిషేధాన్ని సమర్థించుకుంటూ) దానినతడు ఖండించాడు. ఒక ఆచారాన్ని ఖండించకుండా నిషేధించటం అనే కొత్త పద్ధతిని బ్రాహ్మణులు ఎందుకు కనిపెట్టారు? ఈ పెడదోవకు ఏదో ప్రత్యేకమైన కారణం ఉండాలి. ఏమిటి ఆ కారణం ?

అనువాదం : బొజ్జా తారకం

అనుబంధం : 1

# వర్ణాశ్రమ ధర్మ చిక్కుముడి

వర్ణ ధర్మం, ఆశ్రమ ధర్మాల గురించిన ప్రస్తావన ఇదివరకే జరిగింది. ఈ రెండింటిని వర్ణాశ్రమధర్మం అని ఒకే పేరుతో వ్యవహరిస్తుంటారు. ఇది హిందూ ధర్మంలో చాలా ప్రధానమైన భాగం. ఈ విచిత్రమైన ధర్మాల గురించి ప్రాచీన రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలను తెలుసుకోవటం చాలా విజ్ఞానదాయకమవుతుంది.

## I

వర్ణధర్మం గురించి మొదలుపెడదాం. వేదాలలో వెలిబుచ్చిన అభిప్రాయాలను ఒకచోట కలిపి ఉంచితే బాగుంటుంది.

ఋగ్వేదం 10వ మండలం 90వ శ్లోకంలో ఈ విషయం ప్రస్తావనకు వచ్చింది.

(1) పురుషుడు వెయ్యి శిరస్సులు, వెయ్యి కళ్లు, వెయ్యి పాదాలు కలిగి దశాంగుళ ప్రమాణంతో (పదిరెట్లుగా) అనంతంగా వ్యాపించాడు. (2) భూత భవిష్యత్తులతో సహా సర్వ ప్రపంచమూ ఆ పురుషుడే. ఆహారం ద్వారా సర్వత్రా వ్యాప్తి చెందాడు గనుక శాశ్వతత్వానికి అతడు ప్రభువు. (3)అతడి మాహాత్మ్యం అటువంటిది. అతడు మహాశ్రేష్ఠుడు. చరాచరములన్నీ

---

'వర్ణాశ్రమధర్మం' అనే పేరు మీద ఉన్న చిక్కుముడులు 16, 17 రెండూ కలిసి ఉన్న భాగం ఇది. మొదటి విషయ సూచికలో ఈ శీర్షిక కనబడలేదు. అందుకని దీనిని అనుబంధంగా చేర్చాం. ఈ రెండింటిలో దేనిని ముందు రాశారో చెప్పటం కష్టం. రెండింటిలోను ఇచ్చిన ఉదాహరణలు అలానే ఉంచి వ్యాఖ్యానం మాత్రం చాలాచోట్ల మారినట్లు కనిపిస్తున్నది. ఇది 55 పుటల ప్రతి. రచయిత దీనిలో ఎక్కడా సవరణలు చెయ్యలేదు. – సంకలనకర్త

అతడిలో పాతిక భాగమే, రోదసిలోని శాశ్వతత్వం అతడిలో ముప్పాతిక. పురుషుడు ముప్పాతిక భాగంతో పైకి ఆరోహించాడు. (4) అతడిలోని పాతిక (భాగం) ఇక్కడ తిరిగి సృష్టి అయింది. ఆ తర్వాత భుజించే వస్తువులపైన, భుజించని వస్తువులపైన అతడు వ్యాపించాడు. (5) అతడి నుంచి విరాట్, విరాట్ నుంచి పురుషుడు ఉద్భవించారు. పురుషుడు ఉద్భవిస్తూనే భూగోళం మొత్తం వ్యాపించాడు. (6) దేవతలు పురుషుని నైవేద్యంగా పెట్టి యజ్ఞం చేసినపుడు హోమంలో వసంత రుతువు నెయ్యిగా అయింది. గ్రీష్మ రుతువు సమిధలుగా అయింది. శరదృతువు హవిస్సు అయింది. (7) మొదట జన్మించిన ఈ పురుషుణ్ణి యజ్ఞదర్భల పైన బలి పశువుగా దేవతలు, ఋషులు ఆహుతి ఇచ్చారు. (8) ఆ సార్వత్రిక యజ్ఞానికి సాధు క్రూర మృగాలు, సరీసృపాలు పృషదాజ్యంగా అయ్యాయి. (9) అందులో నుంచి ఋగ్వేదం, సామవేదం, సంగీతం ఛందస్సులు యజుర్వేదం వచ్చాయి. (10) రెండు వరసల దంతాలు ఉండే తదితర జంతువులు, ఆవులు, మేకలు, గొర్రెలు వ్యాపించాయి. (11) దేవతలు పురుషుని బలి ఇచ్చినపుడు అతనిని ఎన్ని భాగాలుగా నరికినట్లు? అతని నోరు ఏది? ఎటువంటి భుజాలు అతనికి ఉన్నాయి? వేటిని ఆయన తొడలు పాదాలు అన్నారు! (12) అతని ముఖం బ్రాహ్మణుడు, భుజాలు క్షత్రియుడు, ఊరువు వైశ్యుడు, శూద్రుడు అతని పాదం. (13) అతని మనస్సంకల్పం నుండి చంద్రుడు, నేత్రం నుండి సూర్యుడు, నోటి నుండి ఇంద్రుడు, అగ్ని; శ్వాస నుండి వాయువు ఆవిర్భవించారు. (14) అతని నాభి నుండి గాలి, శిరస్సు నుండి ఆకాశం, పాదాల నుండి భూమి, చెవుల నుండి చతుర్దిశలు ఆవిర్భవించగా, దేవతలు లోకాలు ఏర్పరచారు. (15) దేవతలు పురుషుణ్ణి బలి పీఠానికి సమర్పించినపుడు అక్కడ ఏడుకర్రలు ఏడేసి భాగాల అగ్నికణాలను మూడుసార్లు ఉంచారు. (16) బలితోనే దేవతలు యజ్ఞాన్ని నిర్వహించారు. అవి ఆనాటి ఆచారాలు. ఇటువంటి మహాశక్తులే ఆకాశాన్ని, దేవతలను సాధ్యులను ఎన్నుకున్నాయి.

ఈ శ్లోకమే సాధారణ నామంతో పురుష సూక్తంగా వ్యవహారంలోకి వచ్చింది. ఇదే వర్ణవ్యవస్థకు ఆధికారిక సిద్ధాంతం అయింది.

రుగ్వేదంలో ప్రవచించినట్లుగా వర్ణధర్మ సిద్ధాంతాన్ని ఇతర వేదాలు ఎంతమేరకు అంగీకరిస్తాయనే విషయాన్ని మొదట పరిశీలించవలసి ఉన్నది. ఈ దృష్టితో వివిధ వేదాలను పరిశీలిస్తే ఆశ్చర్యకరమైన విషయాలు తెలుస్తాయి.

సామవేదం తన శ్లోకాలలో పురుష సూక్తాన్ని పొందుపరచుకోలేదు, అంతేకాక వర్ణధర్మానికి సంబంధించి అది ఎటువంటి వివరణా ఇవ్వలేదు.

ఈ విషయంలో యజుర్వేదం చాలామేరకు విభేదించిన అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. కృష్ణ యజుర్వేదం నుంచి వేరుగాను, శుక్ల యజుర్వేదం నుంచి వేరుగాను తీసుకుంటే, లభ్యమైన మూడు సంహితలను పోల్చి చూస్తే పరిస్థితి ఇలా ఉంటుంది. మూడు సంహితలలో

కథక సంహిత, మైత్రేయని సంహితలు రెండూ ఋగ్వేదంలోని పురుష సూక్తం గురించి ప్రస్తావన ఏదీ చెయ్యలేదు. అంతేగాక వర్ణ వ్యవస్థ గురించి ఎటువంటి వివరణ ఇవ్వటానికి గాని ప్రయత్నించలేదు. యజుర్వేదంలోని వాజసనేయ సంహిత ఒక్కటే పురుష సూక్తాన్ని అవే శ్లోకాలను తీసుకోకుండా భాగంగా చేర్చుకుంది. అయితే వాజసనేయ సంహిత పురుషసూక్తంలో వర్ణవ్యవస్థ విషయంలో ఇచ్చిన దానికి పూర్తిగా భిన్నమైన కొత్త వివరణను ఇచ్చింది.[1]

'అతడు ఒకసారి స్తుతించాడు. జీవరాశులు ఏర్పడినాయి. ప్రజాపతి పాలకుడు మూడుసార్లు స్తుతించాడు. బ్రాహ్మణుని సృష్టి జరిగింది. బ్రాహ్మణస్పతి పాలకుడు ఐదుసార్లు స్తుతించాడు. భూతరాసులన్నీ ఏర్పడ్డాయి. బ్రాహ్మణస్పతి పాలకుడు ఏడుసార్లు స్తుతించాడు. సప్తర్షులు సృష్టించబడ్డారు. పాలకుడు ధాత్రి. తొమ్మిదిసార్లు స్తుతించాడు. పితరులు సృష్టించబడ్డారు. వీరి పాలకుడు అదితి. పదకొండుసార్లు స్తుతించాడు. ఋతువులు ఏర్పడ్డాయి. ఆర్తవులు పాలకులు. పదమూడుసార్లు స్తుతించాడు. మాసాలు ఏర్పడ్డాయి. సంవత్సరం వాటి పాలకుడు. పదిహేను సార్లు స్తుతించాడు. క్షాత్రుడు (క్షత్రియుడు) సృష్టించబడ్డాడు. ఇంద్రుడు పాలకుడు. పదిహేడుసార్లు స్తుతించాడు. జంతువులు సృష్టించబడ్డాయి. బృహస్పతి పాలకుడు. పంతొమ్మిదిసార్లు స్తుతించాడు. శూద్రుడు, (ఆర్యుడు) వైశ్యుడు సృష్టించబడ్డారు. పగలు రాత్రి పాలకులు. ఇర్వై ఒక్కసార్లు స్తుతించాడు. వేరుపడని గిట్టలు గల జంతువులు జన్మించాయి. వరుణుడు వాటి పాలకుడు. అతడు ఇర్వై మూడుసార్లు స్తుతించాడు. చిన్న జంతువులు సృష్టించబడ్డాయి. పూష వాటి పాలకుడు. అతడు ఇర్వై అయిదుసార్లు స్తుతించాడు. క్రూర మృగాలు సృష్టించబడ్డాయి. వాయువు వాటి పాలకుడు. (ఋగ్వేదం, 10వ మండలం, 90వ సూక్తం, 8వ శ్లోకం చూడండి). అతడు ఇర్వై ఏడుసార్లు స్తుతించాడు. స్వర్గం భూమి విడిపోయాయి. అదే క్రమంలో వసువులు, రుద్రులు, ఆదిత్యులు కూడా విడిపోయారు. వీరే పాలకులు. ఇర్వై తొమ్మిదిసార్లు స్తుతించగా వృక్షాలు ఏర్పడ్డాయి. సోముడు వాటి పాలకుడు. అతడు ముప్పై యొక్కసార్లు స్తుతించాడు. జీవరాశులు సృష్టించబడ్డాయి. నెలలో రెండు పక్షాలూ పాలకులు. ముప్పైయొక్క సార్లు స్తుతించాడు. ప్రజాపతి పరమేష్ఠి పాలకుడు.

శుక్ల యజుర్వేదం చూస్తే ఒక సంహిత మాత్రమే లభ్యంగా ఉన్నది, అది తైత్తిరీయ సంహిత. ఇది రెండు వివరణలు ఇస్తున్నది. మొదటి వివరణ[2] వాజసనేయ సంహిత తన స్వంత వివరణగా ఇచ్చిన దానిలానే ఉంటుంది. రెండో వివరణ దాని స్వంత, స్పష్టమైన వివరణ. వాజసనేయ సంహితలో ఇది లేదు. అది ఇలా ఉన్నది.[3]

'అతడు (వ్రాత్యుడు) మోహపూరితుడైనాడు. అపుడు రాజన్యుడు ఉద్భవించాడు".

---

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు, సం. 1, పుట 18.
2. చూ. Khanda IV Prapathaka III Verses X following.
3. అదే పుస్తకం. పుట 22.

వ్రాత్యుడు, తనకు తెలిసి ఏ రాజు గృహానికైనా అతిథిగా వెళ్తే అతనిని రాజు అధికునిగా స్వీకరించి గౌరవించాలి. ఆ విధంగా చేసినందువల్ల అతడు తన రాజహెూదాకు గాని తన రాజ్యానికిగాని ఎటువంటి హానీ చేయటం లేదు. అతని నుంచే బ్రాహ్మణ క్షత్రియులు ఉద్భవించారు. వారు అన్నారు "ఎవరి లోనికి మేము ప్రవేశించాలి" మొ॥.

ముఖ్యమైన విషయం ఏమంటే వాజసనేయ సంహిత ఋగ్వేదం నుంచి పురుష సూక్తాన్ని గ్రహిస్తే, తైత్తిరీయ సంహిత మొత్తానికి దానిపైకి ఏ విధంగా కూఢా దృష్టి పోనీయలేదు.

అధర్వ వేదం పురుష సూక్తాన్ని తీసుకున్నది. కాని శ్లోకాల క్రమంలో మాత్రం ఋగ్వేదంలో ఉన్న క్రమానికి దీనికి తేడా ఉన్నది. కాని యజుర్వేదంలోని వాజసనియ సంహిత, తైత్తిరీయ సంహితలలాగా పురుష సూక్తం తోటే తృప్తి పడలేదు. ఇతర వివరణలు ఇచ్చింది. అవి పురుష సూక్తం లాగ సంపూర్ణంగాను, సార్వజనీనంగాను లేవు. కాని దానికి ప్రత్యేకంగా ఉన్నాయి.[1]

"బ్రాహ్మణుడు మొదట పదితలలు పది ముఖాలతో జన్మించాడు. మొదట సోమం తాగాడు. విషాన్ని నిర్వీర్యం చేశాడు."

"రాజన్యుడు గర్భంలో ఉండగానే దేవతలు భయపడ్డారు. గర్భంలో ఉండగానే బంధనాలతో బంధించారు. ఫలితంగా రాజన్యుడు బంధనాలతోనే జన్మించాడు. బంధనాలు లేకుండా పుట్టి ఉంటే అతడు తన శత్రువులను సంహరించి ఉండేవాడు. ఏ రాజన్యుని విషయంలో అయినా సరే అతడు బంధనాలు లేకుండానే జన్మించి ఉండాలని శత్రు సంహారం చేయాలని కోరుకుంటే వారు ఐంద్ర బార్హస్పత్య నైవేద్యం సమర్పించాలి. రాజన్యునికి ఇంద్ర లక్షణం ఉన్నది. బ్రాహ్మణుడు బృహస్పతి. బ్రాహ్మణుని ద్వారా మాత్రమే రాజన్యుడు బంధ విముక్తుడు కాగలడు. ఈ దానం సువర్ణ బంధం లాంటి నిజంగా అతనిని బాధిస్తున్న బంధాల నుంచి విముక్తుణ్ణి చేస్తుంది."

వర్ణ వ్యవస్థ మూలానికి సంబంధించి వేదాలలో కనిపించే వివరణ నాలుగు వర్ణాల మూలం పురుషుడు అనేది ఒక్కటే కాదు. మరొక వివరణ ఉన్నది. అది మనువు నుంచి అవతరించిన ప్రజల గురించి ప్రస్తావిస్తున్నది. ఈ క్రింది భాగాలలో దాని వివరణ గమనించండి.[2]

"మనువు (తండ్రి) అధర్వణుడు, దథ్యాంచి జరిపే కర్మలలో ఇంద్రునిపేరు మీద ప్రార్థనలు, స్తుతులు జరిగేవి. ఓ రుద్రా! యజ్ఞం ద్వారా మనువు ఏ సంపద, సహాయం వాంఛించాడో అవి నేను వాంఛిస్తున్నాను."

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు. సం. 1, పుటలు 21-22.
2. అదే పుస్తకం పుటలు 162-165

"ఆ ప్రాచీన స్నేహితునికి శక్తివంతులైన దేవతలు శక్తులన్నీ అందించారు. మనువు (తండ్రి) అతని కోసం దేవతలకు విజయద్వారాలుగా స్తోత్రాలను తయారుచేశాడు."

"మనలను కాపాడుతున్న తండ్రి మనువు మనకు యజ్ఞం"

"ఓ దేవతలారా, మాకు ముక్తి ప్రసాదించండి, రక్షించండి, మాకోసం మధ్యవర్తిత్వం నడపండి, మనువు పితృ సంబంధమైన మార్గాన్నుంచి మమ్ములి దూరంగా నడిపించకండి".

"మనువు సంతానంలో అతను (అగ్ని) దేవతలకు ఆరాధన చేసేవాడిలా వ్యవహరించేవాడు, ఈ ఐశ్వర్యాలకే ప్రభువు".

"దేవతలతోను, మనుష సంతతితోను అగ్ని స్తోత్రాలతోనూ కూడిన బహురూపమైన యజ్ఞాలను చేస్తున్నారు" ఓ వాజరి భుక్షణ దేవతలారా, దేవతలు నడిచిన మార్గం ద్వారానే మా రక్షణకు రండి. మీరు దేవతలను సంతృప్తి పరుస్తూ పుణ్యదివసాలలో మానుష ప్రజల మధ్య యజ్ఞాలను ఏర్పాటు చేయండి."

"మానుష ప్రజలు ఆరాధకుడైన అగ్నిని యజ్ఞాలలో స్తుతిస్తారు."

"ప్రజల ప్రభువైన అగ్ని ఎపుడు జ్వలితమవుతాడో మానుష ప్రజల మధ్య సంతృప్తుడై ఉంటాడు, రాక్షసులనందరిని పారద్రోలతాడు."

బ్రాహ్మణాలు అనే పేరు మీద ఉన్న రచనలు ఒకసారి తిరగవేద్దాం. ఈ విషయంపై అవి ఏం చెబుతాయో పరిశీలిద్దాం.

శతపథ బ్రాహ్మణం ఇచ్చిన వివరణ ఇలా ఉన్నది.[1]

'భూః' అనటం ద్వారా ప్రజాపతి భూమిని సృష్టించాడు. భువః ద్వారా గాలిని, 'స్వః' ద్వారా ఆకాశాన్ని సృష్టించాడు. విశ్వం ఈ మూడు ప్రపంచాలతో సమంగా వ్యాపించి ఉన్నది. అగ్ని మొత్తంగా ఉన్నది. భూః అనటం ద్వారా ప్రజాపతి బ్రాహ్మణులను, భువః ద్వారా క్షత్రియులను, స్వః ద్వారా వైశ్యులను సృష్టించాడు. అగ్నిని మొత్తంగా ఉంచి భూః అనటం ద్వారా ప్రజాపతి తనను, భువః ద్వారా తన సంతానాన్ని, స్వః ద్వారా జంతువులను సృష్టించాడు. స్వ, సంతానం, జంతువులు అంతా ఈ ప్రపంచం. ఈ మొత్తం నిండా అగ్ని ఉన్నది.

శతపథ బ్రాహ్మణం మరో వివరణ కూడా ఇస్తున్నది. అది ఈ విధంగా ఉన్నది.[2]

బ్రహ్మ (వ్యాఖ్యాత ప్రకారం) అగ్ని రూపంలో ఉండి బ్రాహ్మణ కులానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. తొలుత విశ్వమైనవాడు అతడు ఒక్కడే ఒక్కటిగా ఉండటంతో విశ్వం అభివృద్ధి

1. మూయిర్ సంస్కృత గ్రంథాలలో ఉదహరించినది. సం. 1, పుట 17.
2. మూయిర్ సంస్కృత గ్రంథాలు. సం. 1, పుట 20.

చెందలేదు. అప్పుడు శక్తివంతంగా ఒక అద్భుతమైన (రూపం) క్షాత్రం సృష్టి అయింది. శక్తివంతులైన దేవతలు ఇంద్రుడు, వరుణుడు, సోముడు, రుద్రుడు, పర్జన్యుడు, యముడు, మృత్యువు, ఈశానుడు ఇందులోనివారే. అందువలన క్షాత్రం కంటే గొప్పది ఏదీ లేదు. కనుకనే రాజసూయ యాగం వద్ద బ్రాహ్మణుడు క్షత్రియునికంటే దిగువన కూర్చుంటాడు. ఆ మహిమను క్షత్రియులకే (రాజాధికారం) అనుగ్రహించారు. బ్రహ్మ, క్షత్రియులకు మూలాధారం కావటంతో రాజు ఔన్నత్యం పొందినా చివరకు బ్రహ్మను తన మూలపురుషునిగా గుర్తిస్తున్నారు. బ్రాహ్మణునికి హాని చేసినవారు తన మూలానికే హాని చేస్తున్నట్లు లెక్క. మాన్యులను గాయపరిచిన వారిలాగా వారు అతి దయనీయ పరిస్థితులలోనికి దిగజారిపోతారు. అతడు అభివృద్ధి చెందలేదు. వైశ్యులను సృష్టించాడు. సమూహాలుగా దేవతలు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, విశ్వదేవులు, మరుత్తులు సృష్టించబడ్డారు. అతడు అభివృద్ధి చెందలేదు. శూద్ర తరగతి పూషను సృష్టించాడు. ఈ భూమియే పూష; ఎందుకంటే ఉన్నవాటినన్నింటినీ పోషిస్తుంది గనుక. అతడు అభివృద్ధి చెందలేదు. శక్తివంతంగా అద్భుత రూప న్యాయాన్ని (ధర్మాన్ని) సృష్టించాడు. ఇది క్షత్రియులకే క్షత్రియుడు, అదే ధర్మం. అందుకే న్యాయానికంటే ఏదీ ఉన్నతమైనది కాదు. అందుకే బలహీనులు బలవంతుల శక్తిని అడ్డుకొనేందుకు రాజును ఆశ్రయించినట్టుగా ధర్మాన్ని ఆశ్రయిస్తారు. ఈ ధర్మమే సత్యం. ఈ క్రమంలో సత్యం మాట్లాడే మనిషి ధర్మం మాట్లాడతాడనే వాదన వెలువడింది. ధర్మం గురించి మాట్లాడే వ్యక్తి నిజం మాట్లాడతాడనేది కూడా మరో వాదన. బ్రహ్మ క్షత్ర, వైశ్య శూద్రులు ఇదే. అగ్ని ద్వారా దేవతలలో ఇది బ్రహ్మగాను మానవులలో బ్రాహ్మణులుగాను మారింది. దేవతా సంబంధమైన క్షత్రియుని ద్వారా మానవ క్షత్రియులు, దేవతా సంబంధమైన వైశ్యుల ద్వారా మానవ వైశ్యులు, దేవతా సంబంధమైన శూద్రుని ద్వారా మానవ శూద్రుడు తయారయ్యారు. అందుకే దేవతలలో అగ్నిలోనూ, మానవుల్లో బ్రాహ్మణునిలోనూ ఆశ్రయం వెతుక్కుంటారు.

తైత్తిరీయ బ్రాహ్మణం ఈ దిగువ వివరణ అందిస్తున్నది. అది ఇలా ఉంటుంది[1]

"బ్రహ్మ ఈ విశ్వమంతటినీ సృష్టి చేశాడు. వైశ్యుల తరగతి ఋక్ శ్లోకాల నుండి పుట్టిందని మానవులు విశ్వసిస్తారు. యజుర్వేద గర్భంలో నుంచి క్షత్రియులు పుట్టారంటారు. సామవేద మూలం నుంచి బ్రాహ్మణులు పుట్టుకొచ్చారు. (మన) పూర్వీకులకు ఇదే మాట (వారి) పూర్వీకులు చెప్పారు"

రెండో వివరణ బ్రాహ్మణులు శూద్రులు అనే రెండు వర్ణాల గురించి మాత్రమే ప్రస్తావిస్తుంది. అది ఇలా చెబుతున్నది.[2]

"బ్రాహ్మణ కులం దేవతల నుంచి, శూద్ర కులం అసురుల నుంచి పుట్టాయి."

మూడోది శూద్రుల మూలం గురించిన వివరణ ఇలా చెబుతున్నది.[3]

1. మూయిర్. 1.17
2,3. మూయిర్ సంస్కృత గ్రంథాలు, సం. 1, పుట 21.

'ఆయనను తన ఇష్టానుసారం చెక్క పాత్రతో పాలు పిండుకోనివ్వండి. కాని శూద్రులను పాలు పిండనివ్వకూడదు. ఎందుకంటే శూద్రుడు శూన్యంలో నుంచి వచ్చాడు. శూద్రుడు పిండిన పాలు నైవేద్యం కాజాలవు. అగ్నిహోత్రంలో శూద్రులు పాలు పొయ్యకూడదు; ఎందుకంటే వారు దానిని పవిత్రం చెయ్యలేరు. దానిని వడగట్టిన తర్వాత నైవేద్యం అవుతుంది.

తరువాతి అంశం ఏమిటంటే వర్ణవ్యవస్థ మూలం గురించి స్మృతులు ఏమి వివరణ ఇస్తున్నాయో చూడటం. మనువు తన స్మృతిలో ఇలా చెబుతున్నాడు.[1]

(స్వయం అస్తిత్వంగల) అతనిలో తన శరీరం నుండి వివిధ జీవరాశులను సృష్టించాలనే కోరిక జనించటం మూలంగా మొదట జలాలను సృష్టించి అందులో ఒక విత్తనాన్ని విసిరాడు. ఆ విత్తనం సూర్యుడితో సమానంగా ప్రకాశించే బంగారు అండంగా మారింది. అందులో నుంచి అన్ని లోకాలకు తండ్రియైన బ్రహ్మగా అతనే ఆవిర్భవించాడు. "నర" నుండి పుట్టినందువలన ఆ నీటిని నారః అంటారు. అవి అతని మొదటి చలన మండలం కావటం వలన అతడిని నారాయణుడు అని అంటారు. అగోచరమైన అనంతం నుంచి, స్థితి అస్తిత్వాల నుంచి పురుషుడిని తయారుచేశాడు. అతనే బ్రహ్మగా కీర్తి పొందాడు. అండంలో ఒక సంవత్సరం నివసించిన తర్వాత ప్రజ్వలిస్తున్న అతను స్వయంగా తన స్వంత భావనతోనే ఇద్దరుగా విడిపోయాడు. లోకాలన్నీ ప్రజలతో నిండాలని నోటి నుండి బ్రాహ్మణులకు, భుజాల నుండి క్షత్రియులకు, ఊరువుల నుండి వైశ్యులకు, పాదాల నుండి శూద్రులకు జన్మ ఇచ్చాడు. తన దేహాన్ని రెండుగా విభజించుకున్న బ్రహ్మదేవుడు ఒక సగాన్ని పురుషుడిగా రెండో సగాన్ని స్త్రీగా మలిచాడు. స్త్రీలో రజను సృష్టించాడు. ఓ అద్భుతమైన ద్విజుడా! తెలుసుకో! పురుషుణ్ణి, విరజను సృష్టించిన నేనే ఈ విశ్వానికి సృష్టికర్తను. జీవరాశులను సృష్టించాలనే సంకల్పంతో కఠోరనిష్ఠతో, మహర్షులను ఋషులను జీవరాసుల దేవతలను సృష్టించాను. వారే మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, ప్రచేతసుడు, వసిష్ఠుడు, భృగువు, నారదుడు. వారు అంతులేని శక్తిసంపన్నులై మరో ఏడుగురు మనువులను, దేవతలను, వారి నివాసాలను, మహర్షులను సృష్టించారు. యక్షులు, రాక్షసులు, పిశాచులు, గంధర్వులు, అప్సరసలు, అసురులు, నాగులు, పాములు, పక్షులు, తదితర పితృవర్గాలు, మెరుపులు, పిడుగులు, మేఘాలు, వాతావరణంలో దుశ్శకునపు శబ్దాలు, తోకచుక్కలు, ఇంకా వివిధ ప్రకాశకాలు; కిన్నెరలు, కోతులు, చేపలు, రకరకాల పక్షులు, పశువులు, లేళ్లు, జింకలు, మనుషులు, రెండు వరసల దంతాలుగల మృగాలు, చిన్న పెద్ద సరీసృపాలు, పేలు, ఈగలు, మిన్నల్లులు, జోరీగలు, దోమలు, ఇంకా చలనం లేని వివిధ రకాలు. అన్నీ నా నిర్ణయం ప్రకారం ధ్యానశక్తితో ప్రతిజీవి యొక్క పూర్వజన్మ చర్యల ద్వారా (నుబట్టి) ఆ మహర్షులు ఈ చరాచర ప్రపంచాన్ని సృష్టించారు."

4. మూయిర్ సంస్కృత గ్రంథాలు. సం. 1, పుటలు 36, 37.

మనుష్యులను నాలుగు వర్గాలుగా విభజించటానికి గల ప్రాథమిక కారణాల గురించి మనువు తన స్మృతిలో వేరొక అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు.[1]

"ఈ లక్షణాల ఆధారంగా ఆత్మ చేరుకొనే దశలను నేను సంగ్రహంగా చెబుతాను. 40. సత్వగుణంతో ఉన్న ఆత్మలు దైవత్వాన్ని పొందుతాయి, రజోగుణం గలవి మానవులవుతాయి. తమోగుణం గలవి మృగాలుగా మారతాయి. మూడురకాల గమ్యాలు ఇలా ఉంటాయి. 43. ఏనుగులు, గుర్రాలు, శూద్రులు నికృష్టమైన మ్లేచ్ఛులు, సింహాలు, పులులు, అడవి పందులు మధ్యస్థమైన చీకటి (తమోగుణ) పరిస్థితిగా రూపొందుతాయి. 46. రాజులు, క్షత్రియులు, రాజపురోహితులు, వాగ్యుద్ధమే ప్రధాన వృత్తిగా గలవారు ఈ మధ్యస్థ మోహ పరిస్థితిగా రూపొందుతారు. 48. భక్తులు, సన్యాసులు, బ్రాహ్మణులు, ఆకాశంలో జన్మించిన దేవతలు నక్షత్ర మండలాలు, దైత్యులు చిట్టచివరిస్థాయి మంచితనం (సత్వగుణం) కలిగి ఉంటారు. 49. బలి ఇచ్చే పూజారులు, ఋషులు, దేవతలు, వేదాలు, విశ్వాంతర ప్రకాశకాలు, సంవత్స రాలు, పితరులు, సాధ్యులు, మధ్యస్థమైన మంచితనంగా రూపొందుతారు. 50. బ్రహ్మ, సృష్టికర్తలు, ధర్మము, మహత్తు, అవ్యక్తమైన శక్తి ఉన్నతమైన మంచితనంగా ఏర్పడతాయి."

ఈ అభిప్రాయాల విషయంలో రామాయణ మహా భారతాలలో ఉన్న అభిప్రాయాలతో వీటిని పోల్చి చూడటం ఆసక్తిదాయకంగా ఉంటుంది.

నాలుగు వర్ణాలు కశ్యపుని భార్య, దక్షుని కూతురు అయిన, మను సంతతి అని రామాయణం చెబుతున్నది.[2]

"పూర్వ కాలంలోని ప్రజాపతుల గురించి ప్రారంభం నుండి చెబుతాను వినండి. కర్దముడు మొదటివాడు, తరువాత వోకృతుడు, శేషుడు, సంశ్రయుడు, శక్తివంతుడైన బాహుపుత్రుడు, స్థాణుడు, మారీచుడు, అత్రి, బలవంతుడైన క్రతువు, పులస్త్యుడు, అంగీరసుడు, ప్రచేతసుడు, పులహుడు, దక్షుడు, తరువాత వివస్వతుడు, అరిష్టనేమి, మహోన్నతుడైన కశ్యపుడు చివరివాడు. దక్ష ప్రజాపతికి అరవై మంది కుమార్తెలున్నట్లు ప్రతీతి. వీరిలో ఎనిమిది మంది అందమైన యువతులను కశ్యపుడు వివాహమాడాడు. వీరే అదితి, దితి, దాను, కలక, తామ్ర, క్రోధవశ, మను, అనల. వారితో సంతుష్టుడైన కశ్యపుడు ముల్లోకాలను సంరక్షించే తనవంటి కొడుకులను ఇమ్మని కోరాడు. అదితి, దితి, దాను, కలకలు అంగీకరించారు. మిగిలినవారు అంగీకరించలేదు. అదితికి 33 మంది దేవతలు - ఆదిత్యులు, వసువులు, రుద్రులు, ఇద్దరు అశ్వినులు కలిగారు. కశ్యపుని భార్య మను, మానవులైన బ్రాహ్మణులు క్షత్రియులు, వైశ్యులు, శూద్రులను కన్నది. బ్రాహ్మణులు ముఖం నుండి, క్షత్రియులు వక్షస్థలం నుండి, వైశ్యులు తొడల నుండి, శూద్రులు పాదాల నుండి జన్మించారు. ఇలా అని

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు. సం. 1, పుట 41.
2. అదే గ్రంథం. సం. 1, పుట 116-117

వేదాలు చెబుతున్నాయి. స్వచ్ఛమైన ఫలాలు కలిగిన వృక్షాలకు అనల జన్మ ఇచ్చింది.

నాలుగు వర్ణాల సృష్టిని ప్రజాపతికి బదులుగా కశ్యపుడు చేశాడని వాల్మీకి చెప్పటం చాలా అంటే చాలా విచిత్రంగా ఉన్నది. అతనిది వినికిడి జ్ఞానం అని స్పష్టంగా తెలుస్తున్నది. వేదాలు ఏం చెప్పాయో అతనికి తెలియదు.

మహాభారతం ఈ క్రింది వివరణ ఇస్తున్నది.

"మహా ఋషుల వలె వైభవంతో జన్మించిన పదిమంది ప్రచేతసుని పుత్రులు సన్మార్గులుగా, పవిత్రులైన వారుగా పేరొందారు. ప్రసిద్ధమైన జీవులన్నీ వారి నోటి నుంచి వెలువడిన మంటలకు ఆహుతయ్యాయి. వారికి జన్మించినవాడే దక్షప్రచేతసుడు. అతడే ఈ సకల జీవరాశులకు తండ్రి. వీరిణి సాహచర్యంతో దక్షముని మతాచార పరాయణులైన తనవంటి వెయ్యిమంది పుత్రులను కన్నాడు. వీరికి నారదుడు అంతిమ విముక్తి సిద్ధాంతం, సంఖ్యా శాస్త్రంలో అనమాన పరిజ్ఞానం కల్పించాడు. వారసులను సృష్టించదలిచిన దక్ష ప్రజాపతి యాభై మంది పుత్రికలను కని, వారిలో పదిమందిని 'ధర్ముని'కి, పదమూడు మందిని కశ్యపునికి ఇరవై ఏడుగురిని సమయ నియంత్రణకై సోమునికి (చంద్రునికి)..... మారీచుని పుత్రుడైన కశ్యపుడు తన 13 మంది భార్యలతో ఉత్తమురాలైన దాక్షాయణితో శక్తివంతులైన ఇంద్రుడు తదితర ఆదిత్యులకు, వివస్వతునికి జన్మనిచ్చాడు. వివస్వంతునికి పుట్టినవాడే యమ వైవస్వతుడు. మార్తాండునికి వివస్వతుడు, (సూర్యుడు), (శక్తియుక్తులు గల) మనువు, ఆ పిదప (ఖ్యాతి గాంచిన) యముడు జన్మించారు. ధర్మవర్తనుడు, జ్ఞాని అయిన ఈ మనువు ద్వారా ఒక జాతి ఏర్పడింది. అందువల్ల ఈ మానవ కుటుంబాన్ని మను (మానవ) జాతిగా పిలుస్తారు. బ్రాహ్మణులు, క్షత్రియులు మిగిలిన మానవులు మనువు సంతతి. ఓ రాజా! అతని నుండే బ్రాహ్మణులు క్షత్రియులు కలిసి పుట్టారు.

మహాభారతం మరోచోట ఈ మూలం పురుషసూక్తంలో ఇచ్చినట్టుగానే చెబుతున్నది.

"మంచిని కాపాడి, చెడును నిరోధించే వ్యక్తిని రాజు పూజారిగా నియమించాలి. ఇతని పుత్రుడైన పురూరవునికి, వాయుదేవునికి మధ్య జరిగిన సంభాషణను సూచించే ఈ పురాతన గాధ ప్రస్తుత విషయానికి సంబంధించినది.

**పురూరవుడు :** బ్రాహ్మణుల సృష్టి ఎపుడు జరిగిందో, మిగిలిన మూడు కులాల సృష్టి ఎప్పుడు జరిగిందో మీరు నాకు వివరించాలి. అదేవిధంగా బ్రాహ్మణుల ఆధిక్యత ఎప్పుడు ఎలా మొదలైందో కూడా చెప్పాలి."

**వాయుదేవుడు :** "బ్రాహ్మణులు బ్రహ్మ ముఖం నుంచి సృష్టి ఆయ్యారు. క్షత్రియులు భుజాల నుండి, వైశ్యులు తొడల నుండి. కాగా, ఈ మూడు కులాలవారికి సేవ చేసేందుకు నాలుగో తరగతిగా శూద్రులు పాదాలనుండి సృష్టించబడ్డారు. ధార్మిక సంపదను రక్షించే

ఉద్దేశంతో బ్రాహ్మణుడు పుట్టిన వెంటనే భూమిపై ఉన్న జీవులన్నింటికీ అధిపతి అవుతాడు. ప్రజలను సంతోషపెట్టేందుకు భారాన్ని మోసే రెండవ యముడైన క్షత్రియుణ్ణి భూమిని నియంత్రించేందుకు సృష్టికర్త సృష్టించాడు. మూడు తరగతుల వారికి సరిపడా ధాన్యాలు సమకూర్చాలని వైశ్యులనూ, వీరందరికీ సేవ చేయాలని శూద్రులనూ బ్రహ్మ ఆదేశించాడు."

**పురూరవుడు :** "వాయుదేవా! సంపదతో కూడిన ఈ భూమి వాస్తవంగా ఎవరికి చెందాలో చెప్పు. బ్రాహ్మణులకా? క్షత్రియులకా?"

**వాయుదేవుడు :** "ఆది పురుషులుగా, ప్రపంచంలో ఉన్న ఆస్తి అంతా బ్రాహ్మణులకే చెందుతుంది. విధి నియమావళి గుర్తెరిగిన వారందరికీ ఈ విషయం తెలుసు. బ్రాహ్మణుడు తినేది, ఉంచుకునేది, ఇచ్చేది అంతా అతని సొంతమే. మొదట పుట్టినవాడు, అద్భుతమైనవాడూ అయిన బ్రాహ్మణుడే అన్ని కులాలకు అధిపతి. మొదటి భర్తను కోల్పోయిన స్త్రీ తన మరిదినే రెండవభర్తగా ఎలా భావిస్తుందో అదే విధంగా బ్రాహ్మణుడే విపత్తులో సంపద వంటివాడు, ఆ తరువాతనే ఇంకెవరైనా."

మహాభారతం శాంతిపర్వంలో మూడో అభిప్రాయం వెల్లడయింది.

**భృగుమహర్షి :** "బ్రహ్మ తొలుత తన స్వయంశక్తితో తేజస్సుతో సూర్యునితోను, అగ్నితోను సమానంగా ప్రజాపతిని సృష్టించాడు. ఆ తరువాత సత్యం, ధర్మవర్తనం, దృఢమైన నైతిక నియమావళి, పవిత్ర శాస్త్రాలైన వేదాలు, స్వర్గప్రాప్తికై మంచి ఆచరణలు ఏర్పరిచాడు. దేవదానవులను, గంధర్వులను, దైత్యులను, అసురులను, మహోరగులను, యక్షులను, రాక్షసులను, నాగులను, పిశాచాలను, మానవులను, బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు – ఇంకా ఎన్నోరకాల జీవరాసులను సృష్టించాడు. బ్రాహ్మణుల వర్ణం (రంగు) తెలుపు; క్షత్రియులది ఎరుపు; వైశ్యులది పసుపు; శూద్రులది నలుపు."

**భరద్వాజుడు ఇలా అంటాడు :** "నాలుగు తరగతుల కులం (వర్గం) వారి రంగును (వర్ణం) బట్టి పోల్చుకోగలిగితే అన్ని కులాల విషయంలోను అస్పష్టత కనిపిస్తుంది. కోరిక, కోపం, భయం, మోహం, దుఃఖం, ఊహ, ఆకలి, అలసట అందరికీ కలుగుతాయి. మరి కులం దేనితో వివేచన చేస్తాం? చెమట, మలమూత్రాలు, కఫం, పైత్యరసం, రక్తం అందరికీ సమానమే. అందరి దేహాలూ నశించిపోయేవే. మరి కులం దేనితో గుర్తిస్తాం? చలనం గలవి చలన రహితమైనవి ఎన్నో వస్తువులు అసంఖ్యాకంగా ఉన్నాయి. వాటి కులాలెలా నిర్ణయిస్తాం?"

**భృగుమహర్షి :** "కులాల భేదం లేనేలేదు."

ఇదే శాంతిపర్వంలో నాలుగవ వివరణ ఉంది. భరద్వాజుడు మళ్లీ అడిగాడు : "వాక్చాతుర్యంగల ఓ బ్రాహ్మణ ఋషీ! ఏ లక్షణం వలన మనిషి బ్రాహ్మణుడుగాను, క్షత్రియుడుగాను, వైశ్యుడుగాను, శూద్రుడుగాను గుర్తింపబడతాడో చెప్పగలవా?

భృగుమహర్షి: "స్వచ్ఛమైనవాడు, పుట్టుకతోనే శుద్ధి చేయబడినవాడు, వేదాధ్యయనం పూర్తిగా చేసినవాడు, ఆరు రకాల క్రతువులను ఆచరిస్తూ జీవించేవాడు, సాంప్రదాయకమైన కర్మకాండలు ఆచరించేవాడు, మిగిలిన నైవేద్యం తినేవాడు, మత గురువును అనుసరించి ఉన్నవాడు, మతాచారాలను క్రమం తప్పకుండా ఆచరించేవాడు, సత్యబద్ధుడు అయినవాడు బ్రాహ్మణుడు. ఎవరిలోనైతే సత్యం, దాన గుణం, సాత్వికత, నిరపాయత, శీలం, కరుణ మనఃపూర్వకమైన శ్రద్ధ ఉంటాయో అతడిని బ్రాహ్మణుడని అంటారు. రాచరిక సంబంధమైన బాధ్యతలను నిర్వర్తించేవాడు, వేదాధ్యయనానికి అలవాటు పడినవాడు, ఇచ్చిపుచ్చుకోవడంలో ఆనందం పొందేవాడు క్షత్రియుడు. పశుపోషణలోను, వ్యవసాయంలోను నిమగ్నమైనవాడు స్వచ్ఛమైన వాడు, వేదాధ్యయనంలో సంపూర్ణుడైన వాడు వైశ్యుడు. అన్నిరకాల ఆహారానికి అలవాటు పడినవాడు, అన్నిరకాల పనులు చేసేవాడు, అపరిశుభ్రంగా ఉండేవాడు, వేదాలను పరిత్యజించినవాడు సాంప్రదాయికంగా శూద్రుడిగా పిలవబడుతున్నాడు. నేను చెప్పినది ఇదే శూద్రుని లక్షణం. బ్రాహ్మణులలో ఇది కనిపించదు. అటువంటి శూద్రుడు శూద్రుడిగానే ఉండిపోతాడు. బ్రాహ్మణుడు (ఆవిధంగా) ప్రవర్తిస్తే అతడు బ్రాహ్మణుడిగా గుర్తింపబడడు."

వర్ణవ్యవస్థ మూలం గురించి పురాణాలు ఏం చెబుతున్నాయో చూద్దాం.

విష్ణుపురాణంతో మొదలు పెడదాం. చతుర్వర్ణ వ్యవస్థ మూలంపై విష్ణు పురాణం రెండు సిద్ధాంతాలు చెబుతున్నది.

ఒకదాని ప్రకారం ఇది మూలం మనువుకు ఆపాదిస్తున్నది.[1]

"బ్రహ్మాండం లేకముందు అన్నిలోకాల సృష్టికర్త, హిరణ్యాగర్భుడైన బ్రహ్మదేవుడు విష్ణువు అంశతో కూడి ఉండి, ఋక్, యజుర్, సామ, అధర్వ వేదాలతో పోలి ఉన్నాడు. బ్రహ్మ కుడి బొటనవేలు నుండి దక్షప్రజాపతి జన్మించాడు. దక్షునికి అదితి అనే కుమార్తె ఉండేది. ఆమెకు జన్మించిన వాడు వివస్వతుడు. అతనికి పుట్టినవాడు మనువు. మనువు కుమారులే ఇక్ష్వాకుడు, నృగుడు, ధృష్ట, శర్యాతి, నరిష్యంత, ప్రాంశు, నాభాగాం, దిష్ఠ, కరూశ, పృషాధ్రులు.

కరూశుని నుండి వచ్చిన శక్తివంతులైన క్షత్రియులే కారూశులు. నేధిష్ఠుని పుత్రుడైన నాభాగుడు వైశ్యుడయ్యాడు.

మూలాన్ని మనువుకు ఆపాదిస్తూ ఉన్న ఈ వివరణ కాకుండా విష్ణు పురాణంలో దీనికి భిన్నమైన కథ ఇంకొకటి ఉంది.

"పుత్రుని కోసం మనువు మిత్రావరుణులకు యజ్ఞం చేయించాడు. ప్రార్థనలో జరిగిన పురోహితుని పొరపాటు ఫలితంగా వీరికి 'ఇళ' అనే పుత్రిక జన్మించింది. మిత్రావరుణుల దయపై ఇళ మనువుకు కొడుకుగా సుద్యుమ్నునిగా అయింది. కానీ ఈశ్వరుని కోపాగ్ని వలన

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు. నం. 1. పుట 220-221.

స్త్రీగా మారి సోముని కుమారుడైన బుధుని ఆశ్రమం వద్ద సంచరిస్తున్న సమయంలో అతని మోహానికి లోనై పురూరవుడికి జన్మ ఇచ్చింది. అతని పుట్టుక తర్వాత ఋషులు, ఋక్, యజుర్, సామ, అధర్వణ వేదాలు సమస్తమూ, మనస్సూ, శూన్యమూ కలిసిన యజ్ఞమూర్తిని ఆరాధించారు. దేవుడు ఆవిర్భవించి యాగపురుషుని రూపంలో అనంత వైభవోపేతంగా ఋషుల చేత పూజలందుకున్నాడు. సుద్యుమ్నుడు తిరిగి పురుషత్వం సంతరించుకోవాలనే ఋషుల కోరికను ఆమోదించటంతో ఇళ తిరిగి సుద్యుమ్నుడిగా మారిపోయింది.

విష్ణు పురాణాన్నిబట్టి అత్రి, బ్రహ్మ కుమారుడు, సోముని (చంద్రుని) తండ్రి. బ్రహ్మ ఇతడిని గ్రహాలకు, బ్రాహ్మణులకు, నక్షత్రాలకు అధిపతిగా నియమించాడు. రాజసూయ యాగం చేసిన తర్వాత సోముడు గర్వంతో మత్తిల్లినవాడై దేవగురువైన బృహస్పతి భార్య తారను ఎత్తుకుపోయాడు. బ్రహ్మాది దేవతలు, ఋషులు మందలించినా ఆమెను విడిచిపెట్టలేదు. ఉశనసుడు సోముని పక్షం వహిస్తే అంగీరసుని శిష్యుడైన రుద్రుడు బృహస్పతికి అండగా నిలిచాడు. దేవతలు దైత్యులు మొదలైనవారు చెరొకవైపు చేరిన ఈ వివాదం భయంకర రూపాన్ని దాల్చింది. ఎట్టకేలకు బ్రహ్మ జోక్యం చేసుకొని తారను తిరిగి, బృహస్పతికి అప్పగించాలని సోమునిపై ఒత్తిడి తెచ్చాడు. ఈలోగా తార గర్భవతియై బుధుడిని ప్రసవించింది. బుధునికి తండ్రి సోముడేనని తరువాత ఎంతో ఒత్తిడి తీసుకొనివస్తే తార అంగీకరించింది. ముందే చెప్పినట్లు పురూరవుడు మనువు కుమార్తె ఇళకు బుధునికి జన్మించినవాడు. పురూరవునికి ఆరుగురు కుమారులు. వారిలో 'ఆయువు' పెద్దవాడు. ఆయువుకు అయిదుగురు కుమారులు. నహుషుడు, క్షత్రవృద్ధుడు, రంభ, రాజి, అనేనసుడు.

"క్షత్రవృద్ధుని కుమారుడు సునహోత్రుడు. కాస, లేశ, గృత్సమద అనే ముగ్గురు కుమారులు ఉన్నారు. చివరివాడి సంతానం శౌనకుడు. ఇతడే నాలుగు కులాల వ్యవస్థను రూపొందించినవాడు. 'కాస' కుమారుడు కాశీరాజు, ఇతని కుమారుడు దీర్ఘతమసుడు".

మూడో కథనం బ్రహ్మను వర్ణ వ్యవస్థకు కారకునిగా పేర్కొంటున్నది. మైత్రేయుడు అంటాడు.[1] "అర్వక్స్రోతస్సును అంటే మానవసృష్టిని, నాకు వివరించావు. ఓ బ్రాహ్మణా! బ్రహ్మ దీనిని ఏ విధంగా చేశాడో నాకు వివరించు. ఏ విధంగా ఏ లక్షణాలతో కులాలు సృష్టించాడో చెప్పు. సాంప్రదాయికంగా పొగడబడుతున్న బ్రాహ్మణుల విధులు, ఇతరుల విధులు ఏమిటి?

పరాశరుడి సమాధానం ఇలా ఉన్నది : "3. తాను ఊహించినట్టుగా ఈ ప్రపంచాన్ని సృష్టించాలనుకున్నపుడు సత్వగుణం గల జీవులు అని ముఖం నుండి వెలువడ్డాయి. 4. రజో గుణం ఎక్కువగా గల జీవులు అతని వక్షం నుంచి వచ్చాయి. రజోగుణం,తమోగుణం రెండూ

1. శిష్యుడైన మైత్రేయుని ప్రశ్నలకు గురువు పరాశరుడు సమాధానం ఇస్తుండగా విష్ణు పురాణాన్ని ఒక సంవాదంగా రూపొందించారు.

అధికంగా ఉన్నవి, అతని తొడల నుండి వెలువడ్డాయి. 5. ప్రధానంగా తమో లక్షణం గల వాటిని తన పాదాలనుంచి సృష్టించాడు. వీరితో వరుసగా ముఖం నుండి, వక్షం నుండి, తొడల నుండి, పాదాల నుండి వచ్చిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగు కులాల వ్యవస్థ ఏర్పడింది. 6. యజ్ఞాలు చేయటం కోసం ఈ మొత్తం నాలుగు వర్గాల వ్యవస్థను బ్రహ్మ ఏర్పరచాడు. వర్షం ప్రసాదించటం ద్వారా దేవతలు మానవాళిని పోషిస్తున్నారు. 8. ధర్మపరులైన వారు, విద్యుక్త ధర్మాన్ని పాటించేవారు, చెడు అలవాట్లకు దూరంగా ఉండేవారు, సత్ప్రవర్తకులు, సౌభాగ్య హేతువులైన యజ్ఞాలను ఎప్పుడూ చేస్తుంటారు. 9. మనుషులు, తమ మానవత్వ ఫలితంగా స్వర్గాన్ని, అంతిమ మోక్షాన్ని అందుకుంటారు. వారు ఆశించిన లోకానికి సాగిపోతారు."

హరివంశం లో రెండు సిద్ధాంతాలున్నాయి. విష్ణుపురాణంలో[1] చెప్పినట్టుగా కాకుండా వంశానుగతంగా వస్తున్నదై మను సంతతి నుంచి వర్ణవ్యవస్థ పుట్టుకొచ్చిందనే సిద్ధాంతాన్ని ఇది బలపరుస్తుంది.

"గృత్సమదుని కుమారుడు శునకుడు. అతడి వారసులు శౌనకులు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు."

సుహోత్ర, సుహోత్రి, గయ, గర్గ, కపిలలు వితథుని కుమారులు. సుహోత్రునికి కసక, గృత్సమతి అనే ఇద్దరు కుమారులు. గృత్సమది కుమారులు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు.

బ్రహ్మ సృష్టించిన విష్ణువు, దక్ష ప్రజాపతిగా మారినట్లు చెప్పే మరో వాదన ఇలా ఉన్నది.

జనమేజయుడు అంటాడు : "ఓ బ్రాహ్మణా! యుగారంభమైన బ్రహ్మ యుగం గురించి వివరించావు. స్థూలంగాను, వివరంగాను క్షత్రియుల కాలం గురించి ఆచార వ్యవహారాల గురించి కథనంలో ప్రవీణులైనవారు చెబుతుంటే వినాలని ఉంది."

వైశంపాయనుడు ఇలా సమాధానం ఇచ్చాడు : "యాగాదులతో పవిత్రమైన, దాతృత్వానికి ప్రసిద్ధి చెందిన ఆ కాలం గురించి, ప్రజల గురించి వర్ణిస్తాను. యజ్ఞయాగాదులు నిరాటంకంగా చేస్తూ ప్రత్యక్షంగాను, పరోక్షంగాను బ్రహ్మ మీదే దృష్టి లగ్నం చేసి, బ్రాహ్మణమే ఉన్నతాశయంగా వైభవోపేతమైన పవిత్రమైన ప్రవర్తనతో ఆత్మనిగ్రహంతో బ్రహ్మజ్ఞానంతో క్రమశిక్షణ గలవారై సంపూర్ణ విజ్ఞానవంతులై బ్రాహ్మణులు ఉంటారు. వేలయుగాల అనంతరం ఈ మునులు ప్రపంచాన్ని అంతం చేసేందుకు సిద్ధమయ్యారు. బ్రహ్మ నుంచి వెలువడినవాడైన విష్ణువు ధ్యానముద్రుడై దక్ష ప్రజాపతిగా మారి అనేక జీవరాసులను సృష్టించాడు. సోమునికి ఇష్టమైన బ్రాహ్మణులు నాశనం కాని (అక్షయ) అంశం నుండి, క్షత్రియులు నాశనమయ్యే

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు, సం. 1. పుట 227.

(క్షయ) అంశం నుండి, వైశ్యులు మార్పిడి ద్వారాను, శూద్రులు పొగ (ధూమపు) మార్పు ద్వారాను సృష్టించబడ్డారు. విష్ణువు కులాల (వర్ణం) గురించి ఆలోచిస్తూ ఉండగా బ్రాహ్మణులు తెలుపు, ఎరుపు, పసుపు, నీలం రంగులతో ఏర్పడ్డారు. ఈ విధంగా మానవులు కులాలుగా విడిపోయి బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులుగా వర్ణించబడ్డారు. వీరు రూపంలో ఒకేలాగున, విధులలో భిన్నంగా, అద్భుత శక్తివంతులై వారి వారి వృత్తులలో నేర్పరులుగా ఉన్నారు. మూడు (ఉన్నత) కులాల విధులు వేదాలలో పేర్కొన్నారు. బ్రహ్మ నుండి ఉద్భవించినందున ఆచరిస్తున్న ధ్యానంతో, స్వభావ రీత్యానే ధ్యానశీలుడై ప్రచేతస ప్రభువుగా పిలువబడే విష్ణువు తన విజ్ఞాన సామర్థ్యాల ద్వారా ధ్యానం నుంచి కార్యరంగ వలయంలోకి అనుగమించాడు. అస్తిత్వమే లేనితనం నుండి ఉద్భవించిన శూద్రులు ఆచార శూన్యులు. అందువలన వారు పవిత్రోత్సవాలలో పాల్గొనేందుకు వీలులేదు. పవిత్ర శాస్త్రాలు కూడా వారికి దూరమే! యాగం చేసేటపుడు, నిప్పు రాజుకొని వచ్చేమంటలలో నుంచి పైకి ఎగసే పొగ మబ్బులకు యాగంతో ఏవిధంగా సంబంధం ఉండదో అదేవిధంగా భూమి మీద తిరుగాడే శూద్రులు కూడా వారి పుట్టుక, శుచిలేని జీవన విధానం, వేదాల్లో పేర్కొన్న నియమాలు పాటించకపోవడం అనే కారణాల వల్ల యాగాలకు పనికి రాకుండాపోయారు.

చివరిగా భాగవత పురాణం[1] :

"ఎన్నోవేల సంవత్సరాల తరువాత కాల పరిణామచర్యలోని, సహజ లక్షణాలతో నివసించే జీవాత్మ, నీటిపై తేలియాడే జీవంలేని అండానికి జీవాన్నిచ్చింది. పురుషుడు అండాన్ని బ్రద్దలు చేశాడు. దాని నుండి వెయ్యితొడలు, కాళ్లు, చేతులు, ముఖాలు, తలలు వెలువడ్డాయి. జ్ఞానవర్గాలు ఏడు దిగువ ప్రపంచాలను అతని నడుముతోను (పై భాగం ఆధారంగాను) ఏడు ఎగువ ప్రపంచాలను అతని గజ్జలతోను (అధోభాగం ఆధారంగాను) మలిచారు. బ్రాహ్మణుడు దైవాత్ముని ముఖం నుంచి, క్షత్రియుడు చేతుల నుంచి, వైశ్యుడు తొడల నుంచి, శూద్రుడు పాదాల నుంచి పుట్టారు. భూమి అతడి పాదాల నుండి, గాలి నాభి నుండి, స్వర్గం హృదయం నుండి, మహాలోకం వక్షం నుండి ఏర్పడ్డాయి.

వాయు పురాణం మనువు సిద్ధాంతాన్నే తీసుకుంది, కాని ఇలా చెబుతున్నది :

"గృత్సమదుని కుమారుడు శునకుడు, అతని నుండి శౌనకుడు ఉద్భవించాడు. అతని కుటుంబంలో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, వివిధ విధులతో ద్విజులు జన్మించారు."

ఈ పరిశీలన ఏం చెబుతుంది? ఏదైనా చెబుతుందీ అంటే అది, వర్ణవ్యవస్థ మూలం వివరించే ప్రయత్నంలో బ్రాహ్మణులు ఎంత కల్లోలమైన పరిస్థితిని కల్పించారనేది మాత్రమే.

1. మూయిర్ సంస్కృత గ్రంథాలు, సం. 1, పుట 156.

వారు అందించిన వివరణలలో ఎంతమాత్రమూ సారూప్యంగాని, సందర్భ శుద్ధి గాని లేవు. ఒకే గ్రంథం అనేక రకాల వివరణలు ఇస్తుంది. ఒక గ్రంథమే ఒకసారి పౌరాణికమైన, మరొకసారి మర్మమైన, ఇంకొకసారి హేతుబద్ధమైన వివరణలు - అన్నీ కూడా వర్ణవ్యవస్థ మూలాన్ని వివరించే ఒక ప్రయోజనం కోసమే ఇస్తుంది.

వర్ణాలు పురుషుని నుంచి, మనువు నుంచి, ప్రజాపతి నుంచి, వ్రాత్యుని నుంచి, సోముని నుంచి ఉద్భవించాయని చెప్పటానికి వేదాలు ప్రయత్నించాయి.

బ్రాహ్మణాలు వేదాలకంటే కొంచెం భిన్నంగా వెళ్లాయి. నాలుగు వర్ణాలకు మూలం పురుషుడు, ప్రజాపతి, మనువు, వ్రాత్యుడు, సోముడు అని అవి అంగీకరించవు. అవి ప్రజాపతి, బ్రహ్మల మధ్య ఊగిసలాడతాయి. ఇది కొత్త సిద్ధాంతం. తైత్తిరీయ బ్రాహ్మణం మొత్తానికే ఒక కొత్త సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టింది. బ్రాహ్మణులు దేవతల నుంచి, శూద్రులు అసురుల నుంచి పుట్టారని అది చెబుతున్నది.

పౌరాణికమైన, హేతుబద్ధమైన రెండు వివరణలను మనుస్మృతి ఇస్తున్నది. పౌరాణిక వివరణ అయితే మూలం బ్రహ్మకు ఆపాదిస్తుంది. హేతుబద్ధమైన వివరణ ఏమో, వ్యక్తి నిర్మాణ బద్ధమైన ఏర్పాటుపై ఆధారపడి ఉంటుందని చెబుతున్నది. రామాయణ మహాభారత, పురాణాలు నాలుగు వర్ణాలను మనువు సృష్టించాడనే సిద్ధాంతాన్ని బలపరుస్తున్నాయి. మనువు సిద్ధాంతాన్ని గ్రహించిన క్రమంలో (వారు) మొత్తానికి మనువునే గందరగోళంలో పడవేశారు. రామాయణంలో ఈ 'మను' ఒక స్త్రీ. ఈమె దక్షుని కూతురు, కశ్యపుని భార్య. మహాభారతంలో అయితే ఈ 'మనువు' పురుషుడు, స్త్రీ కాదు. కశ్యపుని కుమారుడైన వివస్వతుని కుమారుడితడు మహాభారతంలో కశ్యపుని భార్య 'మను' కాదు, దాక్షాయణి, ఈమె మళ్లీ దక్షుని కూతురు అని చెబుతారు. నాలుగు వర్ణాలకు మూలం 'మనువు' అని చెబుతూ, పురాణాలు భిన్నమైన అంశాలను ప్రవేశపెట్టాయి. విష్ణు పురాణం మూలాన్ని మనువుకు ఆపాదించటానికి బదులుగా అతని కుమారులకు ఆపాదించింది. కాని తొందరలో రెండు వర్ణాలు అంటే బ్రాహ్మణ శూద్రుల మూలాన్ని మాత్రమే, మనువు ఎనమండుగురు కొడుకులలో ఇద్దరికి మాత్రమే ఆపాదించి, మిగిలిన రెండు వర్ణాల మూలం గురించి చెప్పటం మరిచిపోయింది. ఇదే విష్ణు పురాణం మరోచోట, మనువు ద్వారా, అతని కుమార్తె ఇళ స్త్రీ సంతతిలో, ఈ మూలం ఉందనే కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించింది. రెండో సిద్ధాంతం ప్రకారం, ఇళ పురూరవుని పెళ్లాడింది, వారికి ఆరుగురు కొడుకులు. అందరిలో పెద్ద ఆయువు. ఆయువు నుంచి క్షత్రవృద్ధుడు అతని నుంచి సునహోత్రుడు, అతని నుంచి గృత్సమదుడు. నాలుగు వర్ణాలు గృత్సమది నుంచి ఉద్భవించాయి. దీనిని వాయుపురాణం అంగీకరించదు. అది ఏం చెబుతుందంటే ఈ నాలుగు వర్ణాలు గృత్సమదుని మనుమడైన శౌనకుని నుంచి ఉద్భవించాయని. దీనికి మూలపురుషుడు గృత్సమదుడని విష్ణు పురాణం చెప్పేదానితో హరి వంశం అంగీకరిస్తుంది, కాని

ఒక తేడా ఉన్నది. అదేమంటే శూద్రులు ఉద్భవించలేదని అంటుంది. అయితే వాటికి వివరణ ఏదీ ఇవ్వలేదు. మరొకచోట నాలుగు వర్ణాలు గృత్సమదుని కుమారుడైన శునకుని నుంచి ఉద్భవించాయని చెబుతూ, తనకు తానే విభేదించుకుంటుంది. విష్ణు పురాణం వాయు పురాణంతో విభేదిస్తుంది.

ఈ వివరణలు మందబుద్ధుల నుంచి వచ్చినవిగా, పొంతన లేకుండా ఉన్నాయి. వర్ణ వ్యవస్థను సమర్థించుకోవటం బ్రాహ్మణులకు ఎంత కష్టం అయిందో దీనినిబట్టి తెలుస్తున్నది. వర్ణవ్యవస్థను అంత బలంగా సమర్థించుకొనే బ్రాహ్మణులు వర్ణవ్యవస్థకు ఒక నిలకడ అయిన, ఏకరూపంలో ఉన్న, తిరుగులేని, ఒప్పించే, హేతుబద్ధమైన వివరణను ఎందుకు ఇవ్వలేక పోయారు?

ఈ అనేక వివరణలలో నేటి బ్రాహ్మణులు (వర్ణ వ్యవస్థను) సమర్థించేవి రెండు ఉన్నాయి.

మొదటిది నాలుగు వర్ణాలకు మూలం, పురుషుడు అనే సిద్ధాంతం. ఇది ఋగ్వేదం లోని పురుషసూక్తం ప్రవచించినది. ఇది చారిత్రకమైన వివరణ కాదు. పౌరాణిక సంబంధి అయినా మరోలా ఉండేది. ఎందుకంటే అతిశయోక్తులతో ఉన్న చరిత్ర అయినా కూడా పురాణం చరిత్రయే కాబట్టి. కాని ఇది అలా లేదు. వివరణ పూర్తిగా మర్మమైనది. ఇది ఒక విచలిత మనస్కుని విపరీత స్వప్నం. అందుకనే దీనిని ఒక వివరణగా గ్రహించటం ఎప్పుడూ జరగలేదు. భిన్నమైన వివరణలు కూడా ఎన్నో వచ్చాయి. వైదిక రచయితలు కూడా దీనికి అంత ఎక్కువ మర్యాద ఇవ్వలేదనే సంగతి రెండు పరిస్థితుల వలన తెలుస్తుంది. మొదట విషయం ఏమంటే ఇది ఋగ్వేదంలో వివిధాంశాలుండే భాగంలో ఉన్నది. రెండో విషయం ఏమంటే శుక్ల యజుర్వేదంలోని కఠ మైత్రేయ సంహితలో లేదు. కృష్ణ యజుర్వేదంలోని తైత్తిరీయ సంహిత దీనిని గ్రహించలేదు. సామవేదం ఋగ్వేదంలో నుంచి పురుషసూక్తంలోని అయిదు మంత్రాలను మాత్రమే స్వీకరించింది. ఇందులో ముఖ్యమైన విషయం ఏమంటే ఆ అయిదు మంత్రాలను గ్రహించినపుడు కూడ పురుషుని శరీర భాగాలు నాలుగింటిలో నుంచి నాలుగు వర్ణాలు ఉద్భవించాయని చెప్పే మంత్రాలను వదిలేసింది. అయితే ఇది చాలా అధునాతనమైనది; నాలుగు వేదాలు ప్రస్తుత రూపం తీసుకున్న తర్వాత (దీనిలో) చేర్చినట్టిది. ఇది కాక, ఈ గ్రంథకర్తలకు తాము నమ్మకాన్ని కలిగించే వివరణ ఇవ్వగలమనే విశ్వాసమే లేకుండా పోయింది. ఇది బహుశా ఒక దృష్టాంతంతో, ఉపమానాలతో కూడిన ఒక కథనం (కావచ్చు). ఒక గట్టి వాస్తవాన్ని బ్రాహ్మణులు మాటకు మాట సరిపోయే వివరణగా చేశారు. ఇది చిక్కుముడిని విడదీయకపోగా మరో చిక్కుముడిని వేస్తున్నది. అలా చాతుర్వర్ణ సిద్ధాంతాన్ని సమర్థించటానికి బ్రాహ్మణులు ఎందుకు ఆసక్తి కనపరిచారు?

హేతువాద వివరణ దాని వెనక భగవద్గీతను ప్రమాణంగా పెట్టుకున్నది. హిందువుల

దేవుడైన కృష్ణుడు తానే ఈ చతుర్వర్ణాలను సృష్టించానని చెప్పుకున్నాడు. గుణాన్ని బట్టి ఈ విభజన జరిగిందనే సిద్ధాంతాన్ని ప్రవచించాడు. ఈ గుణ విభేద సిద్ధాంతం కపిలుని సాంఖ్య సిద్ధాంతం నుంచి వచ్చింది. కృష్ణుడు ఈ చతుర్వర్ణ సిద్ధాంతాన్ని ఒక తిరుగులేని ఆజ్ఞగా ఆదేశించాడు. సాంఖ్య సిద్ధాంతం, వస్తువుకు రజస్, తమస్, సత్వ అనే మూడు గుణాలు ఉంటాయనే ప్రాథమిక సిద్ధాంతాన్ని వక్కాణించిన మాట నిజమే. వస్తువు జడం కాదు. మూడు గుణాలు సమాన శక్తిలో ఉన్నపుడు అది అస్థిర సమతూకంలో ఉంటుంది. ఒక గుణం మరొక గుణంపై ఆధిపత్యం చెలాయించినపుడు సమతూకం చెందటం వల్ల పదార్థం చైతన్యవంత మవుతుంది. కృష్ణుడు తెలివైనవాడేమో సాంఖ్య సిద్ధాంతమైన గుణధర్మాన్ని వర్తింప చేయటం ద్వారా వర్ణవ్యవస్థకు శాస్త్రీయమైన వివరణ ఇవ్వటానికి ప్రయత్నించాడు. అయితే అలా చేయటంలో కృష్ణుడు తన తెలివితక్కువతనాన్ని బయటపెట్టుకున్నాడు. వర్ణాలు నాలుగు ఉండగా గుణాలు మూడు ఉండటాన్ని కృష్ణుడు గ్రహించలేదు, తనకు ఎంత తెలివి ఉన్నదని భావించినా, మూడు గుణాల కంటె ఎక్కువ (అవసరం) లేని సిద్ధాంతంతో నాలుగు వర్ణాలను జోడించి సమాధానం చెప్పలేదు. హేతుబద్ధమైన వివరణగా అనిపించినప్పటికీ అది మాత్రం ఉత్త అసంగతమైన వివరణ. ఇది చిక్కుముడిని విడదీయదు. మరొక చిక్కుముడి వేస్తుంది. చతుర్వర్ణ సిద్ధాంతాన్ని సమర్థించుకోవటానికి బ్రాహ్మణులు ఎందుకింత తిప్పలు పడుతున్నారు?

## II

ఆశ్రమధర్మం ఒక వ్యక్తి జీవితాన్ని నాలుగు దశలుగా విభజిస్తుంది. (1) బ్రహ్మచర్యం (2) గృహస్థాశ్రమం (3) వానప్రస్థం (4) సన్యాసం.. బ్రహ్మచర్య దశ ధర్మ ప్రకారమైన వాస్తవ ప్రకార భావనే. వాస్తవ రూపంలో దాని అర్థం ఏమంటే వివాహం చేసుకోని జీవితం. ధర్మబద్ధమైన అర్థం ఏమంటే గురువు దగ్గర చదువుకొనే దశ. గృహస్థాశ్రమం అనేది ఒక ఇంటివాడైన దశ, అంటే పెళ్లి చేసుకొని కుటుంబ జీవితం గడిపే దశ. సన్యాసదశ అంటే పౌరహక్కులు బాధ్యతలను త్యజించిన దశ. ఇది పౌర మరణం అనదగిన దశ. వానప్రస్థ దశ గృహస్థాశ్రమానికి సన్యాసానికి మధ్య ఉండేది. ఇది ఒక వ్యక్తి సమాజానికి చెందినవాడై ఉండి కూడా సమాజానికి దూరంగా బ్రతకవలసిన దశ. పేరులోనే ఉన్నట్టుగా వనవాసంలో జీవించాలని ఇది నిర్దేశిస్తుంది.

ఈ ఆశ్రమధర్మ వ్యవస్థ వర్ణ ధర్మం అంత ప్రాచీనమైనదీ అని హిందువులు భావిస్తారు. ఈ రెండూ ఒకటే అయినట్టూ హిందూ సమాజానికి ఇవి ఒక ఉక్కుచట్రంలా ఏర్పడినట్టుగా ఈ రెండింటినీ కలిపి వర్ణాశ్రమ ధర్మం అనే ఉమ్మడి పేరుతో పిలుస్తారు.

ఆశ్రమధర్మం మూలం ఏమిటో, దాని ప్రయోజనం, ప్రత్యేకతలు ఏమిటో తెలుసుకొనే ముందు దానిని పూర్తిగా అర్థం చేసుకోవటం మంచిది. ఆశ్రమ వ్యవస్థను వ్యక్తం చేయటానికి మంచి ఆధారం మనుస్మృతి. అందులో నుంచి దీనికి సంబంధించిన ఉదాహరణలను దిగువ

ఇవ్వటం జరిగింది.

**అధ్యాయం II-36 :** పుట్టిన తర్వాత ఎనిమిదో సంవత్సరంలో బ్రాహ్మణునికి ఉపనయనం చెయ్యాలి, పుట్టిన పదకొండో ఏట క్షత్రియునికి, పన్నెండో ఏట వైశ్యునికి ఉపనయనం చెయ్యాలి.

**అధ్యాయం II-168 :** వేదాధ్యయనం చెయ్యకుండా వేరే చదువులు (ప్రాపంచిక చదువుతో సహా) చదివిన ద్విజుడు జీవించి ఉన్న కాలంలోనే శూద్ర స్థాయికి పడిపోతాడు. అతని తర్వాత అతని వారసులూను.

**అధ్యాయం III-1:** గురువు పర్యవేక్షణలో మూడు వేదాలను సాంగంగా గ్రహించటానికి ముప్పై ఆరు సంవత్సరాల వరకూ ఉండాలి. లేదా దానిలో సగం కాలం వరకు, లేదా పాతిక వంతు కాలం వరకు, లేదా విద్యార్థి కనీసం బాగా నేర్చుకొనేంతవరకూ ఉండాలి.

**అధ్యాయం III-2 :** తగిన క్రమంలో మూడు వేదాలను లేదా రెండు లేదా ఒక వేదాన్నయినా విద్యార్థి నియమాన్ని ఉల్లంఘించకుండా అధ్యయనం చేసినవారు గృహస్థాశ్రమంలో ప్రవేశిస్తారు.

**అధ్యాయం IV-8 :** విద్యార్థి, గృహస్థు, సన్యాసి, సర్వసంగ పరిత్యాగి ఈ నలుగురూ నాలుగు భిన్నమైన స్థాయిల నేర్పరుస్తూ గృహస్థు దశ నుండి వెలువడతారు.

**అధ్యాయం VI-88 :** కానీ వీటిలో ఏ ఒక్క దశగానీ, అన్ని దశలుగానీ క్రమం పొందుతూ పవిత్ర ధర్మశాస్త్ర నియమాలననుసరించే బ్రాహ్మణుడే ఉన్నతస్థాయిని చేరుకుంటాడు.

**అధ్యాయం VI-89 :** వేదాలు, స్మృతుల, నిర్దేశాల ప్రకారం మిగిలిన ముగ్గురినీ పోషించే గృహస్థుడు అందరికంటే ఉన్నతమైన వాడుగా గుర్తింపు పొందుతాడు.

**అధ్యాయం VI-1 :** ద్విజుడైన స్నాతకుడు గృహస్థాశ్రమ ధర్మాల ననుసరించి జీవించిన పిదప దృఢ మనస్కుడై ఇంద్రియ నిగ్రహం కలవాడై అడవుల్లో నివసిస్తూ ఈ దిగువ పేర్కొన్న నియమాలు పాటించాలి.

**అధ్యాయం VI-2 :** గృహస్థు తన ముడుతలు పడిన చర్మాన్ని నెరసిన జుట్టును, మనుమలను చూడగానే అడవులకు బయలుదేరవచ్చు.

**అధ్యాయం VI-33 :** ఈ విధంగా జీవితంలో మూడో దశ అడవుల్లో ముగించిన వెంటనే ఐహిక బంధాలను తెగతెంపులు చేసుకొని సన్యాసి వలె తన జీవితపు నాలుగవ దశ గడపవచ్చు.

**అధ్యాయం VI-34 :** ఆశ్రమ ధర్మ క్రమంలో యజ్ఞయాగాది క్రతువులు చేసి, ఇంద్రియ చాపల్యాన్ని అధిగమించి దానధర్మాదికాలతో అలసిన తరువాత సన్యాసిగా మారినవాడు మరణానంతరం అలౌకికానందం పొందుతాడు.

**అధ్యాయం VI-35 :** మూడు రుణాలు తీర్చుకున్నవాడు ఐహిక విముక్తి కోసం తన మనస్సు లగ్నం చేయాలి. ఈ విధంగా (రుణ) విముక్తి కానివాడు అధోగతి పాలవుతాడు.

**అధ్యాయం VI-36 :** నియమబద్ధంగా వేదాధ్యయనం చేసి, పవిత్ర ధర్మ శాస్త్రబద్ధంగా సంతానవంతుడై, శక్తికొలది యాగాలు చేసినవాడు తన మనస్సును ఐహిక విముక్తి కొరకు లగ్నం చేయవచ్చు.

**అధ్యాయం VI-37 :** వేదాధ్యయనం చెయ్యకుండా పుత్రులను పొందకుండా, తుది విముక్తిని కోరుకునే ద్విజుడు అధోగతి పాలవుతాడు.

మనువు చెప్పిన ప్రకారం ఈ నియమాలను బట్టి చూస్తే ఆశ్రమధర్మానికి మూడులక్షణాలు ఉన్నట్టు తెలుస్తున్నది. శూద్రులకు, మహిళలకు దీనిలో ప్రవేశం లేకపోవటం మొదటిది. బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం తప్పనిసరి ధర్మాలు కాగా వానప్రస్థం సన్యాసం తప్పనిసరి కాకపోవటం రెండవది. ఒక ఆశ్రమ ధర్మం నుండి మరో ఆశ్రమ ధర్మంలోకి పరివర్తన చెందటం కేవలం ఒకే క్రమంలో జరగాలి. మొదట బ్రహ్మచర్యం, తరువాత గృహస్థాశ్రమం, ఆపైన వానప్రస్థం, చివరిగా సన్యాసం. అంతేతప్ప ఒక దశను విస్మరించి వేరొక దశకు చేరుకోవటానికి వీలులేదు. ఇది మూడో లక్షణం.

చరిత్ర వెలుగులో మనువు చెప్పిన దానిని పరిశీలిస్తే అనేక ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి. వేదాల ప్రకారం చూస్తే జీవితంలో దశల సిద్ధాంతం అసలు లేనే లేదు. వేదాలు బ్రహ్మచారి గురించి ప్రస్తావిస్తాయి. కాని బ్రహ్మచర్యం అనేది జీవితంలో తప్పించుకోరాని ఒక దశగా ఉందని చెప్పటానికి ఏమీ లేదు. ఋగ్వేదంలో 'యతుల' ప్రస్తావన ఉన్నది. అది కూడా జీవితంలో ఒక దశగా అనుకోలేదు. నిజానికి సన్యాసంలా కాకుండా ఋగ్వేదకాలంలో 'యతి' వ్యవస్థను ద్వేషించేవారు. వాస్తవానికి ఇంద్రుడు యతులను తోడేళ్లకు విసిరేవాడని ఋగ్వేదంలో చాలా శ్లోకాలున్నాయి. ఈ నాలుగు ఆశ్రమాల సిద్ధాంతాన్ని బ్రాహ్మణులు ఎందుకు రూపొందించారు? ఆశ్రమ ధర్మం గురించిన మొదటి చిక్కుముడి ఇది.

నాలుగు ఆశ్రమాలలో వరుసక్రమానికి సంబంధించినది రెండో చిక్కుముడి. బ్రహ్మచారి మూడు ఆశ్రమాలలో దేనిలోనికైనా ప్రవేశించగలిగే సమయం ఒకటి ఉండేదనే విషయంలో సందేహం ఏదీ లేదు. గృహస్థాశ్రమి కావచ్చు లేదా గృహస్థాశ్రమి కాకుండానే సన్యాసి కావచ్చు. ఈ విషయంలో ధర్మసూత్రకర్తలు ఏమీ చెబుతున్నారో పరికిద్దాం.

వశిష్ఠ ధర్మసూత్రం ఇలా చెబుతున్నది.[1]

"విద్యార్థి, గృహస్థు, సన్యాసి, రుషి అనే నాలుగు ధర్మాలున్నాయి."

---

1. S.B.E. సం. XIV పుట 40. అధ్యాయం VII శ్లోకాలు. 1,2,3

"విద్యాభ్యాస నియమాలు అతిక్రమించకుండా ఒకటి, రెండు లేదా మూడు వేదాలు అభ్యసించిన వ్యక్తి మూడింటిలో తనకిష్టమైన ఆశ్రమధర్మాన్ని స్వీకరించవచ్చు."

"(వేదాలు చదివినవాడు) తాను స్వీకరించబోయే ఆశ్రమ ధర్మం విషయంలో తన ఇచ్ఛికతను వినియోగించుకోవచ్చును. (అని కొందరు ప్రకటిస్తారు).

"విద్యార్థి, గృహస్థు, యోగి (భిక్షువు) సన్యాసి, (వైఖానసుడు) అనేవి నాలుగు ధర్మాలు.

వ్యక్తి ఇష్టాన్ని తీసివేసి వైవాహికదశను విధిగా స్వీకరించవలసిన దశగా మనువు ఎందుకు చేశాడు, వానప్రస్థానికి ముందు వైవాహిక దశ తప్పనిసరి అయిన దశగాను, సన్యాసానికి ముందు వానప్రస్థం తప్పనిసరి అయినదిగాను ఎందుకు చేశాడు ?

జీవితంలోని ఈ నాలుగుదశలూ ఒక ముఖ్యమైన ప్రయోజనాన్ని సాధించటానికి ఉద్దేశించినట్టివి అయితే మరి వాటిని శూద్రులకు స్త్రీలకు ఎందుకు మినహాయించారు? మనువు పద్ధతి ప్రకారం శూద్రులు, స్త్రీలు గృహస్థులుగా మాత్రమే జీవించాలి. వారు బ్రహ్మచారులుగా, వానప్రస్థులుగా, సన్యాసులుగా ఎందుకు కారు? ఆశ్రమధర్మం వారికి కూడా పొందగలిగేటట్టు ఉంటే వారికిగాని సమాజానికి గాని జరిగే నష్టం ఏముంటుంది?

ఆశ్రమ ధర్మం గురించి వేరే చిక్కుముడులు ఇంకా ఉన్నాయి.

మొదటిది, బ్రహ్మచారులలో మనువు చేసిన వ్యత్యాసాలు.[1]

**అధ్యాయం II-41 :** విద్యార్థులు (వారి కులాల) క్రమానుసారంగా నల్లజింక చర్మాలను (రురుమృగ) మచ్చల లేడి చర్మాలను, మేకపోతు చర్మాలను (పై భాగం దుస్తులుగా) ఉత్తరీయంగా ధరించాలి, నార, అగిసెనార (వెలిపట్టు) ఉన్నితో చేసిన వాటిని క్రింది భాగపు దుస్తులుగా ధరించాలి.

**అధ్యాయం II-42 :** బ్రాహ్మణుని మొలతాడు నున్నని మెత్తనిదైన ముంజగడ్డితో మూడుపేటలది ఉండాలి. క్షత్రియుడు 'మూర్వ' నారతో చేసిన అల్లెత్రాటివంటి మొలతాటినీ, వైశ్యుడు జనపనారతో చేసిన దానినీ ధరించాలి.

**అధ్యాయం III-43 :** ముంజగడ్డి (ఆ తరువాత చెప్పినవి) లభ్యం కాకపోతే, కుశ (దర్భ) అశ్వాంతక (రెల్లు) బల్బజ (తుంగ) నారతో చేసిన మొలతాడు కట్టుకోవాలి. మూడుపేటల ముడి (లేదా మూడు లేదా నాలుగు ముడులు) వేసినదై ఉండాలి. (కుల ఆచారాన్ని బట్టి ముడులు ఉంటాయి)

**అధ్యాయం II-44 :** బ్రాహ్మణుని యజ్ఞోపవీతం దూదితో పేనినదై ఉండాలి. కుడివైపుగా

1. S.B.E. సం. XXV. మనువు పుట 37-39.

చుట్టిపేసిన మూడు పేటల దారం ఉండాలి. క్షత్రియునికి జనపనారది, వైశ్యునికి ఊలుదారంతో చేసినదీ ఉండాలి.

అధ్యాయం II-45 : పవిత్ర శాసనం ప్రకారం బ్రాహ్మణుడు బిల్వకర్రను, పాలాశకర్రను దండంగా ధరించాలి, క్షత్రియుడు వట లేదా ఖదిర (చంద్ర) కర్రను వైశ్యుడు పీలు లేదా ఉదుంబర (జువ్వి, మేడి) చెట్టు కర్రను దండంగా ధరించాలి.

అధ్యాయం II-46 : బ్రాహ్మణుని దండం అతని శిరోజాలను తాకేటంత పొడువుగా ఉండాలి. క్షత్రియునికి అతని నొసలు తాకేవరకు, వైశ్యునికి ముక్కుకొస తగిలే అంత పొడవుగానూ (దండాలు) తయారుచేయాలి.

అధ్యాయం II-47 : దండాలు అన్నీ నిటారుగా ఉండాలి. ఏ వంకా లేకుండా మనుషులకు భయం కలగకుండా, చూడటానికి అందంగా అగ్ని దూషితం కానివి (అగ్నిలో కాలనివి)గా తయారుచేయాలి.

అధ్యాయం II-48 : తన ఇచ్ఛానుసారంగా దండం తీసుకున్న తర్వాత, సూర్యుని ధ్యానించి కుడిచేయి అగ్నికేసి సాచి అగ్ని చుట్టూ ప్రదక్షిణం చేసిన తర్వాత (విద్యార్థి) యధావిధిగా భిక్ష అడుగుకోవాలి.

అధ్యాయం II-49 : ఉపనయనం పొందిన బ్రాహ్మణుడు 'భవతి'అనే మాట మొదట వచ్చేలా భిక్షమడగాలి. క్షత్రియుడు ఆ మాట మధ్యలో వచ్చేలాగనూ వైశ్యుడు చివర వచ్చేలాగనూ పలకాలి.

బ్రహ్మచారులందరూ ఒకే వర్గానికి అంటే ద్విజుల తరగతికి చెందినవారే. వారి ఉత్తరీయాలకు సంబంధించిన సరుకు విషయంలో వ్యత్యాసం ఎందుకు చూపాలి? వారి యజ్ఞోపవీతం దేనితో తయారు చేయాలనే దాంట్లో కూడా తేడా చూపవలసిన అవసరం దేనికి? వారి దండాలలో తేడా చూపవలసిన అవసరం ఏమిటి? భిక్షాటన చేసేటపుడు ఉచ్ఛరించే మాటలలో కూడా తేడా చూపవలసిన అవసరం ఏమిటి? బ్రాహ్మణ బ్రహ్మచారి "భవతీ భిక్షాందేహి" అని ఎందుకు అనాలి? క్షత్రియ బ్రహ్మచారి "భిక్ష్యాం భవతీదేహి" అని ఎందుకు అనాలి? వైశ్య బ్రహ్మచారి "భిక్షాం దేహిభవతీ" అని ఎందుకు అనాలి?

హిందువులకు ఆశ్రమధర్మం ఒక విచిత్రమైన వ్యవస్థ, దాని విషయంలో వారు చాలా గర్వపడతారు. ఎక్కడా కూడా దీనికి సమాంతరమైనది లేదనేది వాస్తవమే. అయితే దీనిలో శ్రేష్ఠత ఏదీ లేదనే విషయం కూడా అంతే వాస్తవం. నిర్బంధ బ్రహ్మచర్యం అనేది చూడటానికి ఆకర్షణీయంగానే ఉంటుంది. పిల్లలకు నిర్బంధ విద్యలాగా. ఇది ఖచ్చితంగా అందరికీ చెందినది మాత్రం కాదు. దీని నుంచి శూద్రులను, స్త్రీలను మినహాయించారు. హిందూ సమాజంలో శూద్రులు స్త్రీలు సుమారుగా 9/10 వంతు ఉన్న వాస్తవం దృష్ట్యా, ఈ వ్యవస్థ వివేకంతో

చేసినదనే కంటే మోసపూరితమైనదనేది తెలుస్తూనే ఉన్నది. ప్రజా బాహుళ్యం పట్ల వ్యత్యాసం చూపటం వల్ల ఖచ్చితంగా ఇది మలినమయింది. పాలకవర్గాలు విద్యాబోధన కోసం ఏర్పాటు చేసుకున్న పద్ధతి ఇది. నిర్బంధ వివాహం అనేది (చెప్పుకోవాలంటే) ఊహించటానికి వీలు లేనంత మూర్ఖమైన పద్ధతి. ధనంతోనూ ఆరోగ్యంతోనూ సంబంధం లేకుండా వివాహం చేసుకోవాలని ప్రతివ్యక్తినీ బలవంతం చేయటం అనేది, ప్రతి వ్యక్తికీ కచ్చితంగా సహాయం అందజేయటానికి ముందుకు వచ్చే పథకం ఏదో రాజ్యం చేపట్టితే తప్ప అది వ్యక్తిని, జాతిని కూడా వినాశనం చేయటానికి దారి తీసేదే అవుతుంది. వానప్రస్థం, సన్యాసం అనేవి మరీ అర్థంలేని దశలు. వాటికి సంబంధించిన నియమాలను ఉదహరిస్తాను.

**అధ్యాయం VI-3 :** వ్యవసాయం ద్వారా పండించిన ఆహారాన్ని త్యజించి, తన వస్తువులన్నింటినీ విడిచిపెట్టి, భార్యను కొడుకులకు అప్పగించిగాని తనతోపాటు తీసుకొనిగాని అతను అడవులలోకి వెళ్లిపోవాలి.

**అధ్యాయం VI-4 :** పవిత్రాగ్నిని, గృహ (యాగాలు) సంబంధమైన వాటికోసం అవసరమైన పరికరాలను తనతో తీసుకొని గ్రామం నుండి వెంటనే అడవిలోకి వెళ్లిపోయి, ఇంద్రియాలను తగినరీతిలో నిగ్రహించుకుంటూ అక్కడే నివసించాలి.

**అధ్యాయం VI-5 :** పంచ మహాయజ్ఞాలను మునులకు తగినదిగా శుభ్రంగా ఉండే రకరకాల ఆహార పదార్థాలతో, లేదా కందమూలాలతో పండ్లతో నియమానుసారం చేయాలి.

**అధ్యాయం VI-6 :** అతను, చర్మంగాని చినిగిన వస్త్రంగాని ధరించి ఉండాలి. ఉదయంగాని సాయంకాలంగాని స్నానం చేయాలి. వెంట్రుకలు ఎప్పుడూ జడలు కట్టి ఉండాలి. శరీరంపై ఉన్న వెంట్రుకలు, గెడ్డం, గోళ్లు కత్తిరించకుండా ఉంచుకోవాలి.

**అధ్యాయం VI-7 :** తాను భుజించేటటువంటి ఆహారంతో బలి యాగం నిర్వహించాలి; తన శక్తిమేరకు దానధర్మాలు చెయ్యాలి; తన కుటీరం వద్దకు వచ్చిన వారికి కందమూల ఫలాలతో ఆతిధ్యం ఇవ్వాలి.

**అధ్యాయం VI-8 :** విడిగా వేదాధ్యయనం చేస్తూ ఎప్పుడూ పరిశ్రమిస్తూ ఉండాలి. కష్టాలలో ఓర్మితో ఉండాలి. (అందరిపట్ల) స్నేహభావంతో, శాంతమనస్కుడై, ఉదారవంతుడై, కానుకలు స్వీకరించకుండా, ఎల్ల జీవరాసుల పట్ల దయార్ద్ర హృదయుడై ఉండాలి.

**అధ్యాయం VI-9 :** మూడు పవిత్ర అగ్నులతో అగ్నిహోత్రం చెయ్యాలి, పౌర్ణమి, అమావాస్యలలో అగ్నిహోత్రాన్ని యధాశాస్త్రంగా అనుష్ఠించాలి.

**అధ్యాయం V-10 :** నక్షత్రేష్టి, ఆగ్రయణేష్టి, చాతుర్మాస్యలను (యాగాలను) కూడా అతను చెయ్యాలి. అదే విధంగా తురాయణ, దక్షిణాయన (యాగాలను)లు కూడా చెయ్యాలి.

అధ్యాయం VI-11 : వసంత హేమంత రుతువులలో పండే శుద్ధమైన ధాన్యాలను స్వయంగా సేకరించి, యజ్ఞచరువులు (కుడుము) పురోడాశాలు శాస్త్ర ప్రకారం విడివిడిగా తయారుచెయ్యాలి.

అధ్యాయం VI-12 : అడవిలో లభ్యమయ్యేవాటితో కూడిన శుద్ధమైన యజ్ఞ భోజ్య పదార్థాలకు సమర్పించిన మీదట, మిగిలిన పదార్థాలను ఉప్పులో కలుపుకొని తనకు ఉంచుకోవాలి. ఈ పదార్థాలను అతనే తయారు చెయ్యాలి.

అధ్యాయం VI-13 : మెట్టభూమి లేదా నీటిలో పెరిగిన శుద్ధమైన చెట్ల కూరగాయలను, కందమూల ఫలాలను, అడవిచెట్ల నుంచి తీసిన నూనెను ఉపయోగించాలి.

అధ్యాయం VI-14 : తేనె, మాంసం, నేలమీద పండే శాకాలు (వేరేచోట కూరగాయలనే వాటిని) తినకూడదు. భూస్త్రిన, గోగుకూర, మునగకూర, చిప్పకూర, విరిగి కాయలు మొ। వాటిని శిగ్రుకం, శ్లేష్మాతక ఫలాలను అతను తినకూడదు.

అధ్యాయం VI-15 : అతను అంతకు మునుపు సేకరించిపెట్టుకున్న మునుల ఆహారాన్ని అశ్విన మాసంలో విసిరి వేయాలి. అదే విధంగా చినిగిపోయిన దుస్తులు, కూరగాయలు, కందమూలాలు, పండ్లను కూడా విసిరివేయాలి.

అధ్యాయం VI-16 : దున్నిన నేలపై పండినది ఏదీ, అవి ఇతరులు విసిరివేసినప్పటికీ తినకూడదు. అదే విధంగా గ్రామంలో పండిన కందమూల ఫలాలు, అతను ఆకలితో బాధపడుతున్నప్పటికీ తినకూడదు.

అధ్యాయం VI-17 : అగ్నితో వండినది ఏదైనా లేదా సహజంగా పండినది ఏదైనా అతను తినవచ్చు. రాయిపెట్టి దంచుకోవచ్చు లేదా నూరే యంత్రంలా తన పళ్లనే ఉపయోగించుకోవాలి.

అధ్యాయం VI-18 : రోజువారీ భోజనం కాగానే పాత్రను (ఆహారాన్ని తిరిగి సేకరించటం కోసం) ఖాళీచేసుకోవాలి, లేదా నెలకు సరిపడేంత నిలవ ఉంచుకోవాలి, లేదా ఆరునెలలకు సరిపోయేది గాని సంవత్సరానికి సరిపోయేదిగాని సేకరించుకోవాలి.

అధ్యాయం VI-19 : తన శక్తిమేరకు ఆహారాన్ని సమకూర్చుకున్న తర్వాత రాత్రి గాని, పగలుగాని ఒకపూట మాత్రమే తినాలి. నాలుగుపూటలకు ఒకసారి లేదా ఎనిమిదిపూటలకు ఒకసారి భోజనం చేసే నియమం పెట్టుకోవాలి.

అధ్యాయం VI-20 : చాంద్రాయణ నియమం ప్రకారం శుక్ల పక్షంలో ప్రతిరోజూ తగ్గించుకుంటూ, కృష్ణపక్షంలో ప్రతిరోజూ పెంచుకుంటూ భుజించవచ్చు. ప్రతి పక్షంలోనూ చివరిరోజున ఒకేపూట తినాలి. లేదా, బార్లీ గంజి తాగాలి.

**అధ్యాయం VI-21 :** వైఖానస నియమాన్ని అనుసరిస్తూ పుష్పాలు, ఫలాలు, సహజంగా పండి రాలిన పండ్లు, ఏరుకొని తింటూ జీవించాలి.

**అధ్యాయం VI-22 :** అవసరమైన సమయాలలో తప్పించి దినమంతా కటికనేల మీద దొర్లుతూ ఉండాలి. లేదా బొటనవ్రేలిమీద నిలబడాలి, లేదా కొంతసేపు ముంగాళ్ళమీద నిలబడాలి. పదే పదే నిలబడుతూ కూర్చుంటూ ఉండాలి. (అడవిలో) స్నానం చేయటానికి సంధ్యా సమయాలలో సూర్యోదయ సమయంలోనూ, మధ్యాహ్నమూ, సాయంత్రమూ నదికి వెళ్లాలి.

**అధ్యాయం VI-23 :** వేసవికాలంలో పంచాగ్నుల వేడిని తట్టుకోవాలి, వర్షాకాలంలో ఆరుబయట నివసించాలి, చలికాలంలో తడిదుస్తులు ధరించాలి. ఈ విధంగా తన కఠోరతను క్రమేపీ పెంచుకోవాలి.

**అధ్యాయం VI-24 :** మూడుపూటలలో స్నానం చేసినపుడు పితరులకు, దేవతలకు తర్పణాలు చెయ్యాలి. కఠినమైన కఠోరమైన తపస్సుతో శరీరాన్ని ఆరగట్టుకోవాలి.

**అధ్యాయం VI-25 :** మూడు అగ్నులను తనలో నిలుపుకున్నవాడై, నిర్ణీత నియమానుసారం పొయ్యి లేకుండా, స్వంత ఇల్లు లేకుండా, నిశ్శబ్దంగా, కందమూల ఫలాలు తింటూ బ్రతకాలి.

**అధ్యాయం VI-26 :** ఆనందాన్ని కలిగించే వస్తువులను సేకరించటానికి ప్రయత్నం ఏమీ చెయ్యకుండా, స్వచ్ఛంగా, కటిక నేలమీద పడుకొని, నీడ ఉండాలనే ధ్యాస లేకుండా, చెట్ల మొదళ్ళ వద్ద నివసించాలి.

**అధ్యాయం VI-27 :** మునులలా జీవిస్తున్న బ్రాహ్మణుల నుంచి లేదా అడవిలో నివసించే ద్విజ కులానికి చెందిన గృహస్థుల నుంచి తాను జీవించటానికి అవసరమైన భిక్ష గ్రహించవచ్చు.

**అధ్యాయం VI-28 :** అడవిలో నివసిస్తున్న సన్యాసి గ్రామం నుండి, దోసిటిలో గాని ఆకులలోగాని పగిలిన కుండపెంకులో గాని ఆహారాన్ని తెచ్చుకొని ఎనిమిది ముద్దలు తినవచ్చు.

**అధ్యాయం VI-29 :** అడవిలో నివసించే బ్రాహ్మణుడు ఈ నియమాలను చాల శ్రద్ధతో పాటించాలి. పరమాత్మతో పూర్తి సంలీనం కావటానికి ఉపనిషత్తుల్లోని పవిత్ర గ్రంథ భాగాలను చదవాలి.

మనుస్మృతిలో సన్యాసుల కోసం నిర్ణయించిన నియమాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

**అధ్యాయం VI-38 :** ప్రజాపతికి ఇష్టమైన ఇష్టిని నిర్వహించిన తర్వాత యాగ

రుసుముగా తన యావదాస్తినీ అర్పించుకున్న తర్వాత, పవిత్రాగ్నులను తనలోనే ఇముడ్చుకొని బ్రాహ్మణుడు తన ఇంటి నుంచి సన్యాసిగా అడవులలోకి వెళ్ళిపోవాలి.

**అధ్యాయం VI-39 :** బ్రాహ్మణునికి సంబంధించిన గ్రంథాలను వల్లిస్తూ, జీవరాసులన్నింటికీ రక్షణ వాగ్దానం చేస్తూ ఇల్లు విడిచి పెట్టి సన్యసించిన వానికి ప్రకాశవంతమైన లోకాలు అంతర్భాగమవుతాయి.

**అధ్యాయం VI-40 :** ఏ ద్విజుని మూలంగా జీవరాసులకు ఈషణ్మాత్రం ప్రమాదం సంభవించదో అలాంటివానికి శరీరం త్యజించిన తర్వాత ఎటువంటి భయమూ ఉండదు.

**అధ్యాయం VI-41 :** పవిత్ర పరికరాలను సేకరించుకున్నవాడై ఇల్లు విడిచి, ఆనందం కలిగించే కానుకలను లెక్క పెట్టకుండా నిశ్శబ్దంగా అడవిలో సంచరించాలి.

**అధ్యాయం VI-42 :** దేనినీ ఆశ్రయించక దేనిచేతనూ ఆశ్రయించబడక ఒంటరిగా సంచరించే వ్యక్తి మాత్రమే పూర్తి మోక్షానికి అర్హుడనే విషయం గ్రహించి సహచరులు ఎవరూ లేకుండా ఒంటరిగా అడవిలో సంచరించాలి.

**అధ్యాయం VI-43 :** స్వంత పొయ్యిగాని, స్వంత ఇల్లుగాని ఉంచుకోకుండా తన ఆహారం కోసం మాత్రం గ్రామంలోకి వెళ్లాలి. నిర్లిప్తుడై ధ్యేయం పట్ల దృఢంగా ఉంటూ, పరబ్రహ్మపై మనస్సు లగ్నం చేసి ధ్యానం చేస్తూ ఉండాలి.

**అధ్యాయం VI-44 :** భిక్షపాత్రకు బదులుగా కుండపెంకు వాడటం, చెట్ల మొదళ్ళలో నివాసం, చినిగిన దుస్తులు, ఒంటరి జీవితం, ప్రతిదాని పట్ల ఉపేక్ష అనేవి పూర్ణ విముక్తిని పొందినవాని లక్షణాలు.

**అధ్యాయం VI-45 :** మరణించాలనే ఇచ్ఛ గాని, జీవించాలనే ఇచ్ఛగాని అతనికి ఉండకూడదు; భత్యం కోసం ఎదురు చేసే నౌకరులాగా అతను తన నియమిత కాలం కోసం ఎదురు చూస్తూ ఉండాలి.

**అధ్యాయం VI-49** ఆత్మకు సంబంధించిన దానిలో ఆనందంపొందుతూ, యోగంలో నిర్దేశించిన పద్ధతిలో కూర్చుని, బయటి సహాయంపై ఆధారపడకుండా, ఇంద్రియ సుఖాల నుంచి దూరంగా ఉంటూ, తనకు తానే సహచరుడిగా ఉంటూ, పూర్ణ మోక్షానందాన్ని వాంచిస్తూ జీవించాలి.

**అధ్యాయం VI-50 :** అద్భుతశక్తుల ప్రదర్శన, శకునాలు చెప్పడం, జ్యోతిషం, హస్తసాముద్రికం, ఇతరులకు సలహాలివ్వటం, వేదాలు బోధించటం వంటి పనుల ద్వారా దానాలు (భిక్ష) స్వీకరించకూడదు.

**అధ్యాయం VI-51 :** భిక్షాటన కోసం సన్యాసులు, బ్రాహ్మణులు, పక్షులు, జంతువులు,

లేదా ఇతర పరివ్రాజకులు ఉండే ఇళ్ళను సమీపించకూడదు.

**అధ్యాయం VI-52 :** వెంట్రుకలు, గోళ్లు, మీసాలు తొలగించి భిక్షాపాత్ర, దండం, కమండలం ధరించి ఏ జీవికీ హాని కలుగజేయకుండా తనను తాను నిగ్రహించుకుంటూ ఎల్లప్పుడూ నియమంతో తిరుగాడుతూ ఉండాలి.

**అధ్యాయం VI-53 :** అతని పాత్రలు లోహంతో చేసినట్టివి కాకూడదు, పగుళ్లు ఉండకూడదు, యజ్ఞంలో వాడే 'చమస' పాత్రల లాగా నీటితో శుభ్రపరచే విధంగా ఉండాలి.

**అధ్యాయం VI-54 :** సొరకాయ బుర్ర, చెక్కచెంబు, మట్టి చెంబు, వెదురు చెంబు, సన్యాసులకు తగిన పాత్రలు అని స్వాయంభువ మనువు ఆదేశించాడు.

**అధ్యాయం VI-55 :** రోజుకు ఒకసారి మాత్రమే భిక్షాటన చెయ్యాలి. ఎక్కువ మోతాదులో భిక్ష సంపాదించాలని ఆత్రుత పడకూడదు; ఎందుకంటే భిక్ష ఎక్కువ దొరకాలని ఆశించే సన్యాసి ఇంద్రియ లాలసకు లోనవుతాడు.

**అధ్యాయం VI-56 :** వంటగదుల పై నుంచి పొగలు రావటం ఆగిపోయిన తర్వాత రోకటిదంపులు ఆగిన తర్వాత నిప్పు ఆరిపోయిన తర్వాత ఇంటివారు భోజనం పూర్తి చేసి, పాత్రలలో మిగిలి ఉన్న పదార్థాలను తీసివేసిన తర్వాతనే సన్యాసి ఎప్పుడూ భిక్షాటనకు వెళ్లాలి.

**అధ్యాయం VI-57 :** ఏదైనా లభించనప్పుడు బాధ పడకూడదు, దొరికినపుడు సంతోషమూ పడకూడదు, జీవించటానికి సరిపోయేటంత మాత్రమే తీసుకోవాలి, తన పాత్రల నాణ్యత గురించి అతను పట్టించుకోకూడదు.

**అధ్యాయం VI-58 :** వినయ విధేయతల ఫలితంగా వచ్చే ఆహారాన్ని అతను స్వీకరించకూడదు, ఎందుకంటే పూర్తి మోక్షాన్ని పొందిన సన్యాసి కూడా, వినయ విధేయతల ఫలితంగా వచ్చిన ఆహారం స్వీకరించిననాడు సంసార బంధాలలో పడిపోతాడు.

**అధ్యాయం VI-59 :** ఇంద్రియ విషయాలపట్ల ఆసక్తుడవుతున్నపుడు, తక్కువగా భుజిస్తూ ఏకాంతంగా ఉంటూ, ముంగాళ్ళ మీద కూర్చుంటూ తన ఇంద్రియాలను నిగ్రహించుకోవాలి.

**అధ్యాయం VI-60 :** ఇంద్రియాలను నిగ్రహించుకుని, రాగద్వేషాలను చంపుకుని, జీవులకు ప్రాణహాని చేయకుండా ఉంటే అమరత్వానికి అర్హుడవుతాడు.

**అధ్యాయం VI-80 :** అన్ని వస్తువుల పట్ల ఉపేక్ష చూపగల స్థితికి చేరుకున్నపుడు, ఇహపర లోకాలలో శాశ్వతానందాన్ని పొందుతాడు.

**అధ్యాయం VI-81 :** ఈ విధంగా అన్ని బంధాలనూ తెంచుకోగలిగినవాడు, అతను, ద్వంద్వాలను వదిలించుకొని బ్రహ్మలో ఐక్యమవుతాడు.

**అధ్యాయం VI-82 :** పైన ఉపదేశించినవన్నీ ధ్యానంతో సాధ్యమవుతాయి. ఆత్మజ్ఞానంలో ప్రావీణ్యం లేనివాడు క్రియాఫలం పూర్తిగా పొందలేడు.

**అధ్యాయం VI-83 :** యజ్ఞాల గురించీ దేవతల గురించీ జీవాత్మ గురించీ చెప్పేదీ వేదాంతాలలో ప్రసక్తమైనదీ అయిన వేద భాగాలను వల్లె వేస్తుండాలి.

**అధ్యాయం VI-84 :** అజ్ఞానుల శరణూ అదే, వేదాల అర్థాన్ని గ్రహించిన జ్ఞానుల శరణూ అదే. స్వర్గానందాన్ని కోరే వారికీ, ముముక్షువులకూ రక్షణ అదే.

**అధ్యాయం VI-85 :** సన్యాసి అయిన ద్విజుడు, పైన తెలిపిన చర్యలను సఫలీకృతంగా నెరవేర్చినపుడు, ఈ లోకంలో పాపాలు పోగొట్టుకొని అత్యున్నతమైన బ్రహ్మను చేరుకుంటాడు.

వానప్రస్థాన్ని, సన్యాసాశ్రమాన్ని పోల్చి చూసినపుడు, వాటి మధ్య పోలిక ఎంత దగ్గరగా ఉంటుందంటే, ఈ రెండింటినీ రెండు ప్రత్యేక దశలుగా ఎందుకు సృష్టించారో అని అడగవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఏవో కొద్ది తేడాలు మాత్రం ఉన్నట్టు కనిపిస్తాయి. మొదటిది వానప్రస్థుడు తన వెంట భార్యను తీసుకు వెళ్లవచ్చు, సన్యాసి ఆ పని చెయ్యలేడు. రెండోది వానప్రస్థుడు తన ఆస్తిని వెనుక విడిచిపెట్టి రావాలి, సన్యాసి అయితే ఆస్తిని త్యజించి రావాలి. మూడోది వానప్రస్థుడు అడవిలో తన నివాసం ఏర్పరచుకోవాలి, సన్యాసికి స్థిరమైన నివాసం అంటూ ఉండదు. ఒకచోట నుంచి మరొక చోటకు సంచరిస్తూ ఉండాలి. మిగిలిన విషయాలలో వారి జీవితం ఒకేలా ఉంటుంది. రెండింటికీ సరిపోయేది సన్యాసాశ్రమం ఒకటి ఉండగా వానప్రస్థం అనే మరో అదనపు ఆశ్రమాన్ని బ్రాహ్మణులు ఎందుకు గుర్తించారు? ఈ రెండు దశల వల్ల ప్రయోజనం ఏమిటనే అసలు ప్రశ్న మిగిలిపోతుంది. ఆత్మ త్యాగానికి ఉదాహరణగా వీటిని చెప్పుకోలేము. వానప్రస్థుడు, సన్యాసి, ముసలివాడు తప్ప మరొకడు కాడు. ఏ కాలంలో మనిషి వానప్రస్థుడు కావాలో మనువు నిర్ణయించే ఉంచాడు. ముడుతలు పడిన తర్వాత దీనికి సమయం ఆసన్నమయిందని అంటాడు. అంటే బాగా ముసలితనం వచ్చినపుడు అన్నమాటే. జీవితంలోని అన్ని ఆనందాలనూ అనుభవించి, ఇక జీవితంలో ఆనందాలను అనుభవించలేని దశకు చేరిన తర్వాత ఆనందాలను విడిచిపెట్టటానికి నిర్ణయించుకున్న వారిని ఆత్మ త్యాగానికి సిద్ధపడిన వారుగా చూపటం అనేది అవివేకం తప్ప వేరేమీ కాదు. ఇంటినీ సంసారాన్నీ విడిచిపెట్టేయటం అనేది బాధ పడుతున్న మానవాళికి సాంఘిక సేవ చేసే ఉద్దేశంతో చేసినట్టిది కాదు. కఠోర నియమాలు ఆచరించటానికి వీలు కల్పించి శాంతిపూర్వకమైన మరణం కోసం ఎదురు చూసేలా చేయటమే దీని ఉద్దేశం. వృద్ధులను, వయసు మీరినవారిని, కుటుంబాల నుంచి దూరం చేసి, (ఒక అల్పమైన

ప్రయోజనం కోసం) చూసేవారు లేక, ఏడ్చేవారు లేక, అడవిలో వారు ఒంటరిగా చనిపోయేలా చేయటం అనేది అవివేకానికి పరాకాష్ఠ.

ఆశ్రమ వ్యవస్థ అనేది క్రమబద్ధమైన ఆర్థిక వ్యవస్థను ఏర్పరచటానికి (బ్రాహ్మణులు) చేసిన ప్రాచీన ప్రయత్నం. దీనిని రూపొందించిన కారణాలనూ, ఉద్దేశాలనూ అర్థం చేసుకోకుండా దానిని బ్రాహ్మణులు చిక్కు సమస్యగా చేయటం మరీ మూర్ఖమైనది.

అనువాదం : బొజ్జా తారకం

అనుబంధం : 2

# నిర్బంధ వివాహం

ఈ భూమిపైన ఒక వ్యక్తి జీవితాన్ని నాలుగు దశలుగా విభజించాలని మనువు నిర్ణయించాడు. ఆ నాలుగు దశలు : (1) బ్రహ్మచర్యం, (2) గృహస్థాశ్రమం, (3) వానప్రస్థం, (4) సన్యాసం. బ్రహ్మచర్య దశ విద్యార్థి దశ శ్రద్ధాసక్తులతో వేదాధ్యయనం జరిపేదశ. గృహస్థాశ్రమ దశ అనేది వైవాహిక స్థితికి చెందిన దశ లేదా వివాహం చేసుకొని కుటుంబాన్ని పోషించే గృహస్థదశ అని మనువు అంటాడు. వానప్రస్థ దశలో వానప్రస్థుడు ఇంటిని విడిచిపెట్టిన వాడవటం వల్ల అతనిని గృహస్థుడు అనలేము. అయితే అతను భార్యను త్యజించడు. అడవిలో నివసిస్తాడు కాని, ఆస్తిపై అతనికి ఉండే హక్కును విడిచిపెట్టడు. గృహస్థునిగా మతపరమైన విధులకు సంబంధించి నంతవరకూ అతను మరణించినట్టే లెక్కగాని పురజనులకు సంబంధించి మరణించిన వ్యక్తి మాత్రం కాడు. సన్యాసదశ అనేది వివాహ బంధాన్ని త్రెంచుకొని, భార్యను విడిచిపెట్టి, ప్రాపంచిక విషయాలను పరిత్యజించి, సంసారాన్ని విడిచిపెట్టి గృహస్థుపైన ఉన్న మతపరమైన ఆంక్షలను పాటించకుండా అడవిలోకి వెళ్లి బ్రహ్మధ్యానం చేసుకొనేదశ. పురజనులకు సంబంధించి అతను మరణించినట్టే లెక్క.

మనిషి జీవితాన్ని దశలుగా విభజించటం అనేది మనువు కంటే ముందు నుంచీ ఉన్నది. ముఖ్యమైన విషయం ఏమంటే ఈ పద్ధతిలో మనువు తీసుకువచ్చిన మార్పులు.

మనువు చేసిన మొదటి మార్పు ఏమంటే వివాహాన్ని నిర్బంధంగా చేయటం. చదువు

---

ఈ అధ్యాయాన్ని చతురాశ్రమాల చిక్కుముడితో (నం.17) కలిపి చదవాలి — సంకలనకర్త

పూర్తయిన తర్వాత బ్రహ్మచారి తప్పనిసరిగా వివాహం చేసుకోవాలి. మనువు ఈ నియమం చేశాడు. అది ఈ దిగువ విషయాన్ని బట్టి తెలుస్తుంది.

III. 2. మూడు వేదాలను, లేదా రెండు వేదాలను లేదా కనీసం ఒక వేదాన్నయినా విద్యార్థి నియమాలను ఉల్లంఘించకుండా క్రమానుసారం అధ్యయనం చేసిన (విద్యార్థి) గృహస్థాశ్రమం స్వీకరించాలి.

III. 4. గురువు అనుమతి పొందిన తర్వాత స్నానం చేసిన వాడై సమవర్తన (ఇంటికి తిరిగివచ్చినపుడు చేసే క్రతువు) నియమానుసారం ఆచరించిన తర్వాత, ద్విజాడు పుణ్య లక్షణాలు కలిగిన స్వజాతికి చెందిన స్త్రీని వివాహం చేసుకోవాలి.

మనువు తీసుకు వచ్చిన రెండో మార్పు ఏమంటే బ్రహ్మచారి పెళ్లి చేసుకోకుండా సన్యాసాశ్రమం స్వీకరించటాన్ని నిషేధించటం. సన్యాసాశ్రమం తీసుకోవటానికి షరతుగా వివాహాన్ని మనువు నిర్ణయించాడు. వివాహం చేసుకోకుండా సన్యాసాశ్రమం స్వీకరించటం పాపం అని మనువు ప్రకటించాడు.

VI 35. "మూడు ఋణాలను చెల్లించిన మీదట, శాశ్వత విమోచన సాధించటం గురించి ఆలోచన చెయ్యాలి. రుణాలను చెల్లించకుండా మోక్షం గురించి ఆలోచించే వ్యక్తి పాతాళంలోకి జారిపోతాడు.

VI. 36. నియమానుసారం వేదాధ్యయనం చేసిన మీదట, పవిత్ర శాసనం ప్రకారం కుమారులను కనిన తర్వాత, తన శక్తిమేరకు యాగాలు చేసిన మీదట, అంతిమ మోక్షం పై అతను తన మనస్సును లగ్నం చేయవచ్చు.

VI. 37. వేదాధ్యయనం చేయకుండా, కుమారులను కనకుండా, యాగాలు చేయకుండా అంతిమ మోక్షం ఆశించే ద్విజాడు పాతాళంలోకి జారిపోతాడు.

VI. 38. ప్రజాపతికి ప్రీతి దాయకమైన ఇష్టి జరిపించి బలిదానంగా తన యావదాస్తిని సమర్పించుకొన్న తర్వాత, పవిత్రాగ్నులను తనలో ఇముడ్చుకొని బ్రాహ్మణుడు సన్యాసిలా (తన) ఇల్లువిడిచి వెళ్లిపోవాలి.

మనువు తీసుకువచ్చిన మూడో మార్పు ఏమంటే, వాన ప్రస్థాశ్రమం తీసుకోకుండా గృహస్థుడు సరాసరి సన్యాసాశ్రమం గ్రహించటాన్ని నిషేధించటం.

VI. 1. గృహస్థధర్మం ప్రకారం గార్హస్థ్యంలో జీవించిన ద్విజస్నాతకుడు ఇంద్రియ నిగ్రహంతో ఈ క్రింది నియమాలను విధేయంగా ప్రకటిస్తూ అరణ్యంలో జీవించాలి.

VI. 2. గృహస్థుడు తన చర్మం ముడుతలు పడిన తర్వాత తలనెరిసిన తర్వాత, మనుమలు కలిగిన తర్వాత అడవులలోకి వెళ్లవచ్చు.

VI. 3. సాగుద్వారా పండించిన పంటను విడిచిపెట్టి, భార్యను కొడుకుకు అప్పగించి గాని, ఆమెను వెంటపెట్టుకొని గాని అతను అడవులలోనికి వెళ్ళవచ్చు.

మనువుకు పూర్వం ఉన్న నియమాలతో పోల్చి చూసినపుడు మనువు తీసుకు వచ్చిన మార్పులు విప్లవాత్మకంగా కనిపిస్తాయి. ఈ విషయంలో వశిష్ఠ ధర్మ సూత్రం, గౌతమ ధర్మ సూత్రాలలో ఉన్న సంబంధిత నియమాలను మాత్రం ఉదహరిస్తాను. వశిష్ఠధర్మసూత్రం[1] ఏమంటుందంటే'

"బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థం, సన్యాసాశ్రమం అని నాలుగు ఆశ్రమాలున్నాయి".

"బ్రహ్మచర్య నియమాలను ఉల్లంఘించకుండా ఒకటి లేదా రెండు లేదా మూడు వేదాలను అధ్యయనం చేసిన వ్యక్తి వీటిలో తనకు ఇష్టమైన ఏ ఆశ్రమంలో అయినా ప్రవేశించవచ్చు. గౌతమ ధర్మసూత్రం[2] ఏమంటుందంటే.

"వేదాధ్యయనం చేసిన వ్యక్తి తాను ఏ ఆశ్రమంలోకి ప్రవేశించాలను కుంటాడో ఆ నిర్ణయం చేసుకోవచ్చని విజ్ఞులు అంటారు.'

'నాలుగు ఆశ్రమాలు ఏవంటే, బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థం, సన్యాసాశ్రమం.'

ఈ రెండు ధర్మశాస్త్రాల ప్రకారం, బ్రహ్మచర్యం తర్వాత ఏ ఆశ్రమం స్వీకరించాలనేది ఆ వ్యక్తి ఇష్టాన్ని బట్టి ఉంటుందనేది స్పష్టమయింది. తనకు ఇష్టమయితే వివాహం చేసుకొని గృహస్థుడు కావచ్చు. లేదా వైవాహిక వ్యవస్థకు పోకుండా నేరుగా సన్యాసాశ్రమం స్వీకరించవచ్చు. వానప్రస్థం, సన్యాసాశ్రమం స్వీకరించటానికి వివాహం చేసుకోవటాన్ని నిర్బంధం చేయటం అనేది మనువు తీసుకువచ్చిన విప్లవాత్మకమైన మార్పు అనేది విశదమయింది.

మనువు మరొకమార్పును తీసుకువచ్చినట్టు కనిపిస్తున్నది. వైవాహిక దశ తర్వాత సన్యాసాశ్రమం స్వీకరించేముందు వానప్రస్థాశ్రమం ఎందుకు స్వీకరించాలో ఎవరికీ అర్థం కావటం లేదు. నేరుగా సన్యాసి ఎందుకు కాకూడదు? వానప్రస్థానికి సన్యాసాశ్రమానికి మధ్య చెప్పుకోదగ్గ ప్రాథమికమైన వ్యత్యాసం ఏదీలేదు. వానప్రస్థ సన్యాసాశ్రమాల నడవడికను నియంత్రించటానికి మనువు చేసిన నియమాలను ఈ అధ్యాయానికి విపులీకరణగా ఇచ్చాను. ఈ నియమావళిని పరిశీలిస్తే ఈ రెండింటి మధ్యా వ్యత్యాసం ఏదీ ఉన్నట్టు కనిపించదు. గృహస్థుకు విధించిన మతపరమైన విధులు ఆచారాలలో, కొన్నింటిని, వానప్రస్థుడు కూడా ఆచరించవలసి వస్తుందనేది తప్ప ఈరెండు ఆశ్రమాలను స్వీకరించిన మనుషులలో వ్యత్యాసం ఏదీ లేదు. వానప్రస్థ, సన్యాసాశ్రమాలు సాధించే గమ్యంలో కూడా తేడా ఏదీలేదు.

1. అధ్యాయం VII శ్లో. 1,2, 3
2. అధ్యాయం III శ్లో. 1, 2

వారు చేరుకొనే గమ్యంలో ఎంత సామ్యం ఉన్నదో మనువు పాఠంలో ఈ క్రింది ఉదాహరణల ద్వారా తెలుస్తుంది.

| వానప్రస్థం | సన్యాసాశ్రమం |
|---|---|
| VI 29. అడవిలో నివసించే బ్రాహ్మణుడు వీటినీ ఇంకా ఇతర ఆచారాలనూ పరమాత్మతో ఐక్యం కావటం కోసం దీక్షతో పాటించాలి. ఉపనిషత్తులలో ఉన్న పవిత్ర శ్లోకాలను అధ్యయనం చేయాలి. | VI 85. "పైన తెలిపిన చర్యలనుఫలవంతంగా నెరవేర్చిన తర్వాత సన్యాసి అయిన ద్విజుడు, పాపాన్ని ఇక్కడ వదిలివేసి పరబ్రహ్మను చేరుకుంటాడు. |

అయితే గృహస్థాశ్రమం నుంచి సన్యాసాశ్రమం నుంచి వానప్రస్థాన్ని ఒక ప్రత్యేక ఆశ్రమంగా మనువు ఎందుకు రూపొందించాడు? వాన ప్రస్థం అనేది మనువుకు పూర్వం నుంచే ఉందని చెప్పవచ్చు. వారిని అరణులు అనేవారు. ప్రొ॥ రాధాకుముద్ ముఖర్జీ ప్రకారం[1]

"జ్ఞానాన్వేషణలో వివాహం చేసుకోకుండా బ్రహ్మచారులుగానే ఉండిపోవాలనుకునే వారిని అరణులు లేదా అరణమంతులు అనేవారు. ఈ అరణులు గ్రామాలకు లేదా జనసంచారానికి దూరంగా అడవులలో పర్ణశాలల్లో నివసించేవారు. ఈ అరణసన్యాసులు నివసించే అడవులను అరణ్యాలు అని పిలిచేవారు. బ్రహ్మ, సృష్టి, ఆత్మ, అమరత్వం వంటి అంతిమ సమస్యలకు సంబంధించి విజ్ఞులైన ఈ సన్యాసుల వేదాంత ఆలోచనలను ఆరణ్యకాలు అనేవారు."

ఈ పాత ఆరణ్యులకు మనువు వానప్రస్థం అని పేరుపెట్టాడు. రెండింటికీ ఒకే అర్థం. మనువు పేరులో మార్పు తీసుకురావటమే కాకుండా ఎంతో ప్రాముఖ్యత గలిగిన మరో మార్పును కూడా తీసుకువచ్చాడు. బ్రహ్మచర్యానికి వానప్రస్థానికి మధ్య వైవాహిక దశను ఒకటి అతను ప్రవేశ పెట్టాడు. మొదటి వానప్రస్థుడు (లేదా అరణుడు) పెళ్లికానివాడు కాగా, మనువు ప్రవేశపెట్టిన వానప్రస్థుడు మాత్రం ఖచ్చితంగా వివాహం అయిన వ్యక్తి అయ్యాడు. పూర్వ పద్ధతిలో బ్రహ్మచర్యం తర్వాత, ఆ వ్యక్తి ఇష్టాన్ని బట్టి వానప్రస్థమో గృహస్థాశ్రమమో వచ్చేది. పెళ్లి చేసుకోకుండా ఎవరూ వానప్రస్థాశ్రమంలోకి వెళ్లడానికి వీలులేకుండా మనువు ఈ క్రమాన్ని మార్చాడు.

వానప్రస్థం, సన్యాసం రెండూ ఉన్న పూర్వ పద్ధతి మూలంగా భార్యా పిల్లలకు కష్టంగాని, క్రూరంగాని ఉండేదికాదు. మనువు ప్రవేశపెట్టిన కొత్త పద్ధతివల్ల వారికి కష్టం కలిగింది. ఒక వ్యక్తిని వివాహం చేసుకోమని బలవంతంచేసి, ఆ తర్వాత భార్యను విడిచిపెట్టటానికి అనుమతి ఇవ్వటం అంటే నేరం కాకపోవచ్చు కాని క్రూరత్వం మాత్రం అవుతుంది. కాని

1. ఎడ్యుకేషన్ ఇన్ ఏన్షెంట్ ఇండియా. పుట 6

మనువుకు ఈ ఆలోచన లేమీ పట్టవు. అందరికీ వైవాహిక దశ నిర్బంధం చేయాలనుకున్నాడు అంతే.

ఎందుకు మనువు అలా చేశాడు? వానప్రస్థునికి, సన్యాసికి గృహస్థాశ్రమం ఎందుకు తప్పనిసరి చేశాడు? వైవాహికదశ శ్రేష్ఠమైనదని, అన్ని దశలకు పునాది అని మనువు గుర్తించాడు. అతను ఇలా అంటాడు:

VI.87. బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థం, సన్యాసం, ఇవన్నీ నాలుగు వేరు వేరు ఆశ్రమాలు ఇవన్నీ గృహస్థుల నుంచి ఉద్భవించాయి."

VI.88. ఈ ఆశ్రమాలలో ఏ ఒక్కటి గాని లేదా అన్నీ గాని పవిత్ర గ్రంథాల ప్రకారం అనుసరించడం గనుక జరిగినట్లయితే, ఈ నియమాల ప్రకారం నడుచుకున్న బ్రాహ్మణుణ్ణి ఉన్నత దశకు తీసుకు వెళ్తాయి."

VI.89. వేద స్మృతినియమాల ప్రకారం, గృహస్థుడు అందరికంటే శ్రేష్ఠుడిగా ప్రకటిత మయ్యాడు. ఎందుకంటే అందరినీ అతడే పోషిస్తాడు గనుక."

VI.90. "పెద్ద నదులు అయినా చిన్న నదులయినా సముద్రంలో సేద తీర్చుకున్నట్టుగానే, అన్నిరకాల మనుషులు కూడా గృహస్థుల దగ్గర రక్షణ పొందుతారు."

ఈ వ్యాఖ్యలో వాస్తవం ఉన్నదని అంగీకరించినా, వానప్రస్థానికి సన్యాసానికి ముందు వివాహం తప్పనిసరి అయిన దశ అని మనువు ఎందుకు పట్టుపట్టాడు?. దీనికి ఒకే ఒక సమాధానం ఏమంటే మనుషులు సన్యాసులు కాకుండా నిరోధించటానికే. వానప్రస్థ, సన్యాసాశ్రమాలను మనువుఎందుకు ఇష్టపడలేదు? దీనికి సమాధానం ఏమంటే బౌద్ధ మతాన్ని ఎక్కువగా 'భిక్షువులు' అనే సన్యాసులు ప్రచారం చేస్తుండేవారు, బలపరుస్తుండేవారు. భిక్షువులు కావటానికి అవివాహితులకు సులువుగా ఉండేది. దీనిని ఆపాలని మనువు చాల ఆత్రపడ్డాడు. అందుకనే వివాహదశ షరతు పెట్టాడు.

## వివరాలు

### వానప్రస్థునికి సన్యాసి ప్రవర్తనలో ఉన్న పోలిక

1. ఆశ్రమంలోకి ప్రవేశించిన అనంతరం ఇంటితో సంబంధం

| వానప్రస్థం | సన్యాసం |
|---|---|
| VI.3 "సాగుద్వారా పండించిన పంటను విడిచిపెట్టి భార్యను కొడుకుకు అప్పగించిగాని ఆమెను వెంటపెట్టు కొనిగాని అతను అడవిలోనికి వెళ్లవచ్చు." | VI.38 ప్రజాపతికి ప్రీతిదాయకమైన ఇష్టి జరిపించి, ఆ విధానంలో తన యావదాస్తినీ సమర్పించుకున్న తర్వాత పవిత్రాగ్నులను తనలో ఇముడ్చుకొని |

బ్రాహ్మణుడు సన్యాసిలాతన ఇల్లువిడిచి వెళ్లిపోవాలి."

## II. నివాసానికి సంబంధించిన నియమాలు

| వానప్రస్థం | | సన్యాసం | |
|---|---|---|---|
| VI.4. | "పవిత్రాగ్నిని గృహసంబంధమైన పూజలకు అవసరమైన పరికరాలను తన వెంటపెట్టుకొని అతను ఇంద్రియాలను నిగ్రహించుకొని గ్రామం నుండి అడవిలోకి వెళ్లిపోవాలి. | VI.41 | "పవిత్రుడు కావటానికి దోహదం చేసే వాటిని సంతరించుకొని ఇల్లు విడిచి, ఆనందాన్ని ఇచ్చే కానుకలను ఆశించకుండా ఒంటరిగా నిశ్శబ్దంలో సంచరిస్తూ ఉండనివ్వండి. |
| | | VI.42 | ఒంటరిగా తోడు లేకుండా మోక్ష ప్రాప్తికోసం సంచరిస్తూ ఉండాలి. దేనినీ ఆశ్రయించక దేనికీ ఆశ్రయం ఇవ్వకుండా ఉన్న ఏకాకి ఒక్కడే లక్ష్యాన్ని సాధిస్తాడనే విషయాన్ని గ్రహించాలి." |
| | | VI.43 | "అతనికి ఒక ఇల్లుగాని పొయ్యిగాని ఉండకూడదు. ఆహారం కోసం మాత్రమే ఏదైనా గ్రామానికి వెళ్లవచ్చు. నిర్లిప్తుడై తన ధ్యేయం పట్ల పట్టుదలతో ధ్యానం చేస్తూ మనస్సును పరబ్రహ్మ పై లగ్నం చెయ్యాలి." |

## III. జీవన విధానానికి సంబంధించిన నియమాలు

| వానప్రస్థం | | సన్యాసం | |
|---|---|---|---|
| VI.6 | చర్మంగాని, చినిగిన దుస్తులు గాని ధరించవచ్చు. ఉదయంగాని సాయంత్రంగాని స్నానం చేయవచ్చు. ఎప్పుడూ వెంట్రుకలు జడలు కట్టి ఉండాలి. వెంట్రుకలుగాని గోళ్లుగాని, కత్తిరించకుండా ఉంచాలి." | VI.44 | "భిక్షాపాత్రకు బదులుగా కుండ పెంకు వాడటం, చెట్ల మొదళ్లలో నివాసం, చినిగిన దుస్తులు, ఒంటరి జీవితం, దేనిపైనా ఆసక్తి లేకపోవటం అనేది విముక్తి పొందిన వాని లక్షణాలు |

VI.52 "వెంట్రుకలు, గోళ్లు, మీసాలు పెంచకుండా చక్కచేసి భిక్షాపాత్రతోను చేతి కర్రతోను కమండలంతోను తిరుగుతూ నియమవంతుడై ఉంటూ తనవల్ల ఏ ప్రాణికీ ఇబ్బంది కలుగకుండా చూసుకోవాలి."

VI.53 లోహంతో చేసిన పాత్రలు ఉండకూడదు. పాత్రలకు పగుళ్లు ఉండకూడదు. యజ్ఞంలో 'చమాస' కప్పుల మాదిరి వాటిని నీటితో శుభ్రం చేయాలని ఆజ్ఞ."

VI.54 "స్వయంభువు కుమారుడైన మనువు సొరకాయ బుర్ర, చెక్క చెంబుగాని, మట్టి చెంబుగాని, వెదురు బొంగుతో చేయబడినదిగాని సన్యాసికి తగినట్టి పాత్రగా పేర్కొన్నాడు."

## IV. జీవనాధారానికి సంబంధించిన నియమాలు

| వానప్రస్థం | | సన్యాసం | |
|---|---|---|---|
| VI.11 | కఠోర నియమాలు పాటించే వారికి తగిన విధంగా వసంతంలోను శరత్కాలంలోను పండే ఆహారధాన్యాలు సొంతంగా సేకరించాలి. వాటితో నియమానుసారం పురోడాశాలు, చరువులు శాస్త్ర ప్రకారం తయారు చేయాలి. | VI.49 | "ఇంద్రియ వాంఛలకు అతీతంగా ఆనందం ఆత్మకు సంబంధించినదిగానే ఉండేట్లు యోగముద్రలో ఉండి అంతిమ విముక్తికోసం ఎదురు చూడాలి. |
| VI.12 | "అటవీ ఉత్పత్తులతో చేసిన పవిత్రమైన పురోడాశ,చరు, హవిస్సులు దేవతలకు సమర్పించి మిగిలిన భాగాన్ని తాను ఉపయోగించాలి.స్వయంగా తయారు చేసిన ఉప్పుతో కలిపి వాటిని వాడుకోవచ్చు. | VI.50 | అతీంద్రియ శక్తుల ప్రదర్శన శకునాలు చెప్పటం, జ్యోతిష్యం, హస్త సాముద్రికం, ఇతరమైన సలహాలివ్వటం, వేదాలపై వ్యాఖ్యానించటం వంటి పనులద్వారా దానాలు (భిక్ష) స్వీకరించకూడదు. |

VI.26 సుఖ విషయాలపట్ల ఆసక్తి చూపకపోవడం, శీలవంతుడై ఉండటం, కటికనేలపై పడుకోవటం ఆశ్రయం కోసం చూడకుండా చెట్ల మొదళ్ళల్లో నివసించటం.

VI.27 జీవనం కోసం సన్యాసులైన బ్రాహ్మణుల నుండి అడవుల్లో నివసించే ద్విజగృహస్థుల నుండి భిక్ష స్వీకరించవచ్చు.

VI.28 వానప్రస్థంలో ఉన్న సన్యాసి ఏదనా గ్రామంనుండి ఆహారం తెచ్చుకోవచ్చు. అయితే అది ఆకుల దొన్నెలోగాని లేదా తన చేతులలో పెట్టుకొని గాని పగిలిన మట్టి పాత్రతో తెచ్చుకుని గాని ఎనిమిది ముద్దలు తినాలి.

VI.51 యాచన నిమిత్తం సన్యాసులు, బ్రాహ్మణులు, పక్షులు జంతువులు, బిచ్చగాళ్ళు, ఉండే ఇళ్ళ పరిసరాలకు వెళ్ళకూడదు.

## V. ఆహార నియమాలు

### వానప్రస్థం

VI.13 మెట్ట భూమిలోగాని నీటిలోగాని పెరిగే స్వచ్ఛమైన చెట్ల కాయ గూరలు ఫలపుష్పాదులు, కంద మూలాలు తినవచ్చు. అడవి పండ్ల నుండి తీసిన నూనెలు ఉపయోగించ వచ్చు.

VI.14 తేనె, మాంసం, పుట్టగొడుగులు భూస్తృణ, శిగ్రుకం మొ॥ శ్లేష్మాతక ఫలాలు వర్జించాలి.

### సన్యాసం

VI.55 రోజుకు ఒకసారే భిక్షాటనకు వెళ్ళాలి. ఒకేసారి ఎక్కువ మొత్తంలో భిక్ష సేకరించటానికి ఆత్రుత పడకూడదు. అలా గ్రహించిన సన్యాసి విషయ సుఖాలకు అలవాటు పడినట్లవుతుంది.

VI.56 వంటగదులపై నుండి వచ్చే పొగలు ఆగి పోయిన తర్వాత, రోకటి దంపులు ఆగిన తర్వాత, నిప్పు ఆరిన తర్వాత ఇంటివారు భోజనాలు ముగించాక పాత్రలోని అడుగూబొడుగూ తీసిన తరువాతనే సన్యాసి యాచనకు బయలుదేరాలి.

VI.15 ప్రతి సంవత్సరం ఆశ్వయుజ మాసంలో అంతకు ముందు చేర్చి పెట్టుకొన్న (మునులు భుజించే) ఆహారాన్ని చినిగిన బట్టలనూ ముందటిరోజు శాక మూల ఫలాలనూ వదలిపెట్టాలి.

VI.16 నాగలితో దున్నిన ప్రదేశంలో పెరిగిన దేన్నయినా ఎంత ఆకలితో బాధ పడుతున్నా గాని, ఎవరైనా పారేసిన దయినా గాని, గ్రహించకూడదు. గ్రామంలో పండిన ఫలాలు కందమూలాలు ఏమీ తినకూడదు.

VI.17 నిప్పుమీద పక్వంచేసినదిగాని కాలానుగుణంగా పక్వమైనదిగాని జీవధారణకు తినవచ్చు. (పదార్థం) నూరడానికి తనపళ్ళుగాని, రాయి గాని ఉపయోగించవచ్చు.

VI.18 ఆరోజు ఆహారం పూర్తి కాగానే పాత్ర కడిగి భిక్షకు సిద్ధం చేసుకోవాలి. ఒక నెలకు గాని, ఆరు నెలలకు గాని ఒక సంవత్సరానికి గాని సరిపడే ఆహారాన్ని నిలువ చేసుకోవచ్చు.

VI.19 శక్తికొద్దీ ఆహారం సేకరించుకొన్న తర్వాత ఒక పూట మాత్రమే (రాత్రిగాని, పగలుగాని) తినాలి. నాలుగు పూటలలో ఒకసారిగాని, ఎనిమిది పూటలలో ఒకసారి గాని తినే నియమం పెట్టుకోవచ్చు.

VI.57 భిక్ష దొరకనపుడు విచార పడకూడదు. ఎక్కువ దొరికినప్పుడు ఉప్పొంగ కూడదు. ప్రాణ రక్షణకు కావలసినంత మాత్రమే భిక్ష అంగీకరించాలి. పాత్రల, పదార్థాల నాణ్యతను తలచకూడదు.

VI.58 తన మీద గౌరవంతో, విధేయతతో ఇచ్చిన ఆహారాన్ని ఏహ్యంగా పరిగణించాలి. ముక్తుడైన సన్యాసి సైతం అలాంటి (వాత్సల్యం గలవారి) భిక్ష వల్ల జన్మ పాశంలో చిక్కు కుంటాడు.

VI.20 చాంద్రాయణ వ్రత దీక్ష ప్రకారం
శుక్లపక్ష దినాలలో ఆహార ప్రమాణాన్ని
తగ్గించుకుంటూ కృష్ణపక్షపు
రోజులలో ప్రమాణాన్ని పెచ్చిస్తూ
తినాలి. ప్రతి పక్షంలోనూ చివరి
రోజున ఒకేపూట తినాలి. లేదా
(బార్లీ) జావ తాగాలి.

VI.21 వైఖానస నియమాన్ని అనుసరిస్తూ
పుష్పాలు, కందమూలాలు,
కాలానుగుణంగా పండిరాలిన
ఫలాలపై (శాశ్వతంగా)
ఆధారపడాలి.

VI.22 కటికనేలమీద దొర్లటంగాని, ముని
గాళ్ళపై నిలబడటం గాని చేయాలి
త్రిసంధ్యలలోనూ (సూర్యోదయ
ఆపరాహ్ణ, సూర్యాస్తమయ వేళల్లో)
స్నానానికి నదికి వెళ్ళాలి.

## VI. ఆచరించవలసిన విధులు

| వానప్రస్థం | | సన్యాసం | |
|---|---|---|---|
| VI.5 | నియమానుసారంగా ముని జనోచితమైన ఆహారంతో పండ్లు, కందమూలాలు మొIవాటితో పంచమహాయజ్ఞాలు చేయాలి. | VI.65 | నిరంతర చింతనతో పరమాత్మ మోక్ష రూప స్వభావాన్ని గుర్తించటం అధమ మైన,ఉత్తమమైన జీవులన్నింటిలోనూ ఉనికిని భావించటం. |
| VI.7 | తాను తినే ఆహారంతోనే బలి సమర్పణలు చేయటం.శక్తి కొద్దీ దానధర్మాలు చేయటం. ఆశ్రమానికి వచ్చిన వారిని అర్ఘ్యపాద్యాదులతో సత్కరించటం. | VI.83 | యజ్ఞక్రతువుల గురించీ దేవతల గురించీ ఆత్మను గురించి తెలిపేదీ, వేదాంతాలలో ప్రతిపాదింపబడినదీ అయిన వేదాన్ని వేద భాగాలను సర్వదా జపించటం. |
| VI.8 | ఆసక్తితో ఏకాంతంగా వేదాలు వల్లె వేస్తుండాలి. కష్టాలలో ఓర్పుతో | | |

దృఢచిత్తంతో అందరితో స్నేహంగా
ఉండాలి. ఇతరుల నుండి బహుమతులు
గ్రహించకుండా జీవరాసులపట్ల
దయతో ఉండాలి.

VI.9 త్రైతానికాగ్నిని (శ్రౌత స్మార్త
దర్శ పూర్ణ మాసాలను) యథా
శాస్త్రంగా అనుష్ఠించాలి.

VI.10 నక్షత్రేష్టిని ఆగాయణేష్టిని
(కొత్త సస్యాల ఇష్టి)
చాతుర్మాస్యలను తురాయణ
దాక్ష స్వ్యాయణ వంటి నివేదనలను
క్రమం తప్పకుండా చేయాలి.

VI.23 వేసవి కాలంలో పంచాగ్నుల
మధ్య, వర్షాకాలంలో ఆకాశమే
పై కప్పుగానూ, శీతాకాలంలో
తడిబట్టలు ధరించి తపస్సు
చేయాలి. అన్నింటినీ తట్టుకునే
శక్తిని క్రమంగా పొందాలి.

VI.24 త్రిసంధ్యలలోనూ నియమం తప్పక
స్నానం చేసేటప్పుడు సంధ్యావందన,
జలతర్పణలు ఆచరించాలి.
కఠోరనియమాలతో దేహాన్ని శుష్కింప
చేయాలి.

VI.25 త్రేతాగ్నులు (మూడు పవిత్రాగ్నులు)
నియమబద్ధంగా తనలో ఉంచుకొని
స్వంత ఇల్లుగాని పొయ్యిగాని లేకుండా
ఫలాలు కందమూలాలపై ననే
ఆధారపడి నిశ్శబ్దంగా జీవించాలి.

అనువాదం : బొజ్జా తారకం

## చిక్కుముడి : 21

# మన్వంతర సిద్ధాంతం

తమదేశ పరిపాలన స్వర్గలోకం నుంచి జరుగుతున్నదన్నది బ్రాహ్మణుల సిద్ధాంతం. మన్వంతర అనే దానిలో ఉన్న ప్రధాన ఉద్దేశం ఇదే అనిపిస్తుంది.

మన్వంతరంలోని ప్రధానాంశం దేశ రాజకీయ ప్రభుత్వంతో ముడిపడి ఉంటుంది. ప్రపంచ (విశ్వ) ప్రభుత్వం ఒక నిర్ణీత కాలానికి, ఒక సంఘానికి అప్పగిస్తుంటారనే నమ్మకంపై, ఈ పద్ధతి ఆధారపడింది. ఈ సంఘంలో 'మనువు' అనే పేరుగల ఒక అధికారి, సప్తర్షులు (ఏడుగురు ఋషులు) ఒక ఇంద్రుడు ఉంటారు. స్వర్గంలో వీరు తమ స్థానాల్లో ఉండి ప్రజలతో సంప్రదించకుండానే, ప్రజల యిష్టా యిష్టాలను పరిగణనలోకి తీసుకోకుండానే ప్రపంచ వ్యవహారాలను నడిపిస్తారు. అధికార చట్రంలో ప్రధానాధికారియైన ఆ (ప్రత్యేక) మనువు పేరిట ఆ సంఘం పాలించే కాలానికి ఆ మన్వంతరం పేరు వస్తుంది. ఒక మనువు పాలన పూర్తయ్యాక మరో మనువు అధికారం చేపడతాడు. ఆ విధంగానే ఆ పద్ధతి కొనసాగుతూ ఉంటుంది. యుగాలకు వలెనే మన్వంతరాలకు కూడ చక్ర పరిభ్రమణం ఉంటుంది. 14 మన్వంతరాలతో ఒక చక్రం పూర్తవుతుంది.

మన్వంతరాలు ఎలా ఉంటాయనేది విష్ణు పురాణంలో ఇలా చెప్పారు.

---

**ఇది 11 పుటల టైపు ప్రతి. ఆఖరి నాలుగు పుటలూ రచయిత దస్తూరిలో ఉన్నాయి.**
**— సంకలనకర్త**

"తాను సృష్టించిన జీవరాసుల సంరక్షణార్థం బ్రహ్మ తన అంశతో తనను పోలిన స్వాయంభువ మనువును సృష్టించాడు. తర్వాత తనలోని నారీరూపంలో 'శతరూప' అనే స్త్రీని సృష్టించాడు. తపస్సుచేత కల్మషాన్ని పోగొట్టుకొన్న ఈమెను దైవాంశ సంభూతుడైన స్వాయంభువ మనువు భార్యగా చేసుకున్నాడు". (నిషిద్ధ వివాహ సంబంధిత కల్మషం నుండి ఆమె పునీతురాలైనదని భావంకావచ్చు).

ఇక్కడో నిమిషం ఆగి ఆలోచిద్దాం. ఏమిటి దీని అర్థం? బ్రహ్మ ఏమైనా శిఖండా? స్వాయంభువ మనువు స్వయానా తన సోదరినే పెళ్ళి చేసుకున్నాడా? అనే సందేహం ఎవరికైనా కల్గుతుంది. విష్ణుపురాణం చెపుతున్నదే నిజమైతే ఇది ఎంత వింతగా ఉన్నది?

విష్ణు పురాణం ఇంకా ఇలా చెప్పున్నది:

"ఈ ఇరువురికి (స్వాయంభువ మనువు, శతరూపలకు) ప్రియవ్రతుడు, ఉత్తాన పాదుడు అనే ఇద్దరు పుత్రులూ, అపురూప సౌందర్యవతులూ, గుణశీలురూ అయిన ప్రసూతి, ఆకూతి అనే ఇరువురు కుమార్తెలూ జన్మించారు. ప్రసూతిని దక్షుని కిచ్చి వివాహం చేశారు. ప్రజాపతి అయిన రుచికి ఆకూతిని ఇచ్చి వివాహం చేశారు. స్వాయంభువ మన్వంతరంలో, ఆకూతికి రుచికి, యజ్ఞుడు, దక్షిణ అనే ఇద్దరు కవలలు పుట్టారు. వీరిద్దరూ ఆ తర్వాత భార్యా భర్తలయ్యారు. (అన్నా చెల్లెళ్లు పెళ్ళి చేసికొన్న మరో ఘటన ఇది). వీరికి స్వాయంభువ మన్వంతరంలో యములుగా కొలువబడిన పన్నెండు మంది కుమారులు కలిగారు."

"మొదటి మనువు స్వాయంభువ మనువు, తర్వాత వరుసగా స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుషులు మనువులయ్యారు. ఈ ఆరుగురు మనువులూ గతించిన తర్వాత ప్రస్తుత కాలమైన ఏడో మన్వంతరాన్ని సూర్యుని కుమారుడైన వైవస్వత మనువు నిర్వహిస్తున్నాడు.

విష్ణు పురాణ కర్త ఇలా చెప్పున్నాడు. "ఇప్పుడు నేను స్వారోచిషమనువు కుమారులు, ఋషులు, అధిష్ఠాన దేవతల వివరాలు చెప్తాను. ఈ కాలంలో (రెండవ మన్వంతరం) తుషితునితో కూడి పారావారులు దేవతలు. విపశ్చితుడనే బలాఢ్యుడు దేవేంద్రుడు, ఊర్జ, స్తంభ, ప్రాణ, దత్తోలి (వాత), రిషభ, నిశ్చర, అర్వరివ (పరీవాస్)లు, సప్తర్షులు. చైత్రులు, కింపురుషులు మొదలైనవారు స్వారోచిష మనువు కుమారులు."

"మూడవ కాలంలో అనగా ఉత్తముని మన్వంతరంలో సుధాములు, సత్యులు, శివులు, ప్రతర్దనులు, వశవర్తులు అనే గణాలు దేవతలు. దేవేంద్రుడు, సుశాంతి ఈ అయిదు గణాలలోనూ ఒక్కొక్క గణంలో పన్నెండేసి దేవుళ్ళున్నారు. వశిష్ఠుని ఏడుగురు కొడుకులూ సప్తర్షులు. అజ, పరశు, దీప్త (దివ్య) మొదలైనవారు ఉత్తమ మనువు కొడుకులు".

"నాల్గవ మనువు అయిన తామసుని కాలంలో సురూపులు, హరులు, సత్యులు,

సుధియులు దేవగణాలు. వీరిలో ఒక్కొక్క గణంలో ఇరవై ఏడు మంది ఉంటారు. శివి(బి) ఇంద్రుడు. వంద యజ్ఞాలు చేసిన వాడుగా (శతక్రతు) హోదా పొందాడు. 'ఇది అన్ని మన్వంతరాలలోని ఇంద్రులలోనూ సమానమే.' జ్యోతిర్ధామ, పృధు, కావ్య, చైత్ర, అగ్ని, ధనకనాక, పీవరులు సప్తర్షులు. నర, ఖ్యాతి, శాంతహయ, (కేతురూప), జానుజంఘ మొదలైన బలాఢ్యులైన రాజులు తామస మనువు కుమారులు."

"అయిదవ మన్వంతరంలో మనువు రైవతుడు. విభువు దేవేంద్రుడు. అమితాభులు, అభూతనయులు (అభూతరాజసులు) వైకుంఠులు, సుమేధసులు అయిన పదు నలుగురితో కూడిన పధ్నాలుగు గణాలు దైవాలు. హిరణ్య రోముడు, వేదశ్రీ, ఊర్ధ్వ బాహువు, వేద బాహువు, సుధాముడు, పర్జన్యుడు, మహాముని(అవరుడు) సప్తర్షులు. బలబంధువు, సుసంభావ్యుడు, సత్యకుడు మొదలైన ధీశాలురైన రాజులు రైవత మనువు కుమారులు".

"రాజర్షి ప్రియవ్రతుడు పూజలతో తపస్సుతో విష్ణువును సంతుష్టి పరచి, తన సంతతికి మన్వంతరాధిపత్యం కలిగేలా అనుగ్రహం పొందటం వల్ల ఆయన తర్వాత ఆతని వంశంలోని స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు (వారసత్వంగా) మనువులు అయ్యారు.

"ఆరవ మన్వంతరంలో మనువు చాక్షుషుడు. ఇంద్రుడు మనోజవుడు. ఆద్య(ప్య)లు, ప్రసూతులు, భవ్యులు, పృధుకులు, లేఖులు అనే అయిదు గణాల దేవతలున్నారు. ఒక్కొక్క గణంలో ఎనిమిదేసి మంది ఉంటారు. సుమేధుడు, విరజుడు, హవిష్మంతుడు, ఉత్తముడు, మధువు, అతినాముడు, సహిష్ణువు సప్తర్షులు, శక్తివంతులైన ఊరువు, పూరువు, శతద్యుమ్నుడు మొదలైన రాజులు చాక్షుష మనువు కుమారులు."

"సూర్యుని సంతతీ, మహాద్యుతీ, శ్రాద్ధ దేవుడూ (అపర కర్మల ప్రభువు) అయిన వైవస్వతుడు, ప్రస్తుతం ఏడవ మన్వంతరానికి మనువు'. ఈ మన్వంతరంలో ఆదిత్య, వసు, రుద్రాదులు దేవతలు. వీరికి రాజు పురందరుడు (దేవేంద్రుడు). వసిష్ఠుడు, కాశ్యపుడు, అత్రి, జమదగ్ని, గౌతముడు, విశ్వామిత్రుడు, భరద్వాజుడు అనే వారు సప్తర్షులు. ఇక్ష్వాకువు, నృగుడు, ధష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, రిష్టుడు, కరూశుడు, పృషధ్రుడు అనే తొమ్మిది మంది రాజులూ వైవస్వత మనువు పుత్రులు".

మన్వంతరాల గురించి విష్ణు పురాణంలో ఇప్పటి వరకూ ప్రస్తావించిన ఏడు మన్వంతరాల విశేషాలు విష్ణుపురాణం రచించే సమయానికి జరిగిపోయాయి. మన్వంతర పాలన బాహ్యమైనదా అనే విషయంలో బ్రాహ్మణులు మౌనం వహించారు. మరో ఏడు మన్వంతరాలు రావలసి ఉన్నదని విష్ణుపురాణకర్తకు తెలుసు. ఆ ఏడింటి విశేషాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

"విశ్వకర్మ కుమార్తె సంజ్ఞ, సూర్యుని భార్య. వారికి మనువు (వైవస్వతుడు), యముడు, యమి (యమునానది) అనే ముగ్గురు సంతానం కలిగారు. సంజ్ఞాదేవి తన భర్త వేడిమిని (తేజస్సును) భరించలేక తన ఛాయను తనవంటి దానిగానే చేసి ఆమెను సూర్యుని దగ్గర ఉంచి, తాను తపోధ్యానానికి అడవులకు వెళ్ళిపోయింది. ఛాయను తన భార్య సంజ్ఞగానే భావించాడు సూర్యుడు. ఛాయకు, శనైశ్వరుడు (శనిగ్రహం) మరో మనువు (సావర్ణి), (తపతినది) కలిగారు. సంజ్ఞ కుమారుడైన యముడు ఛాయను అవమానించగా ఛాయ అతన్ని శపించింది. దానితో తండ్రికి (సూర్యునికి) అనుమానం వచ్చి నిలదీయగా తాను అసలు సంజ్ఞను కాననీ ఛాయననీ తెలుపుతుంది. భార్య అడవులకు వెళ్ళినట్లు ఛాయద్వారా గ్రహించిన సూర్యుడు సమాధిదృష్టితో (దివ్యదృష్టితో) చూసి, సంజ్ఞ ఆడగుర్రం రూపాన్ని ధరించి ఉత్తర కురు భూములలో ఉన్నట్లు తెలుసుకుంటాడు. తాను మగగుర్రం రూపం ధరించి భార్యను చేరతాడు. వారికి ఇద్దరు అశ్వినులు, రేవతుడు అనే (ముగ్గురు) సంతానం కలిగారు. సూర్యుడు భార్య సంజ్ఞను తిరిగి తన నివాసానికి తీసుకువచ్చాడు. విశ్వకర్మ, సూర్యుని తీక్షణతలో తగ్గించటానికి అతని ప్రకాశాన్ని సానపట్టాడు. ఆ విధంగా తీక్షణతను ఏనిమిదో వంతు భాగాన్ని తగ్గించాడు. అంతకంటే ఇంకా తగ్గించటానికి వీలు లేకపోయింది. విశ్వకర్మ చిత్రిక పట్టినప్పుడు సూర్యునిలోని దివ్యమైన వైష్ణవదీప్తి కాంతి పుంజంగా (చూర్ణంగా) భూమి మీద పడింది. దానితో ఆ కళాకారుడు విష్ణుచక్రాన్నీ, శివుని త్రిశూలాన్ని, కుబేరుని శిబికను (పుష్పక విమానాన్ని), కార్తికేయుని శక్తి అనే ఆయుధాన్ని, ఇతర దేవుళ్ల ఆయుధాలను తయారు చేశాడు. సూర్యుని నుంచి బహిర్గతమైన కాంతిలో నుంచి విశ్వకర్మ వీటినన్నిటిని రూపొందించాడు."

తన అన్న వైవస్వతునిలాగే, అదే కులం నుండి వచ్చిన ఛాయ కొడుకు సావర్ణి మనువు అవుతాడు. అతడు రాబోయే ఎనిమిదవ మన్వంతరాన్ని నిర్వహిస్తాడు. దీనికి సంబంధించిన వివరాలు నేనిపుడు అన్వయించి చెప్తాను. మనువు సావర్ణి. అతని కాలంలో సుతపులు, అమితాభులు, ముఖ్యులు అనే దేవతా వర్గాలుంటాయి. ఒక్కొక్క గణానికి ఇరవై ఒక్కమంది చొప్పున దేవతలుంటారు. దీప్తిమంతుడు, గాలవుడు, రాముడు, కృపుడు, ద్రోణుడు, నా కుమారుడైన వ్యాసుడు, ఋష్యశృంగుడు, సప్తర్షులు. బలి ఇంద్రుడుగా ఉంటాడు. విష్ణు ప్రసాదం వల్ల పాతాళ లోకంలో కొంత భాగానికి ప్రభువూ విరోచనుని పుత్రుడూ అయిన పుణ్యశీలుడు బలి. విరజుడు, అర్వరీవుడు, నిర్మోకుడు మొదలైనవారు సావర్ణి మనువు సంతానం.

"దక్ష సావర్ణి తొమ్మిదవ మనువు. పారులు, మరీచి గర్భులు, సుధర్ములు అనే మూడు దేవగణాలలో ఒక్కొక్క గణంలో పన్నెండు మంది దేవతలుంటారు: వీరికి 'అద్భుతుడు' ఇంద్రుడు. సవనుడు, ద్యుతిమంతుడు, భవ్యుడు, వసువు, మేధాతిథి, జ్యోతిష్మంతుడు,

సత్యుడు, సప్తర్షులు. ధృతకేతువు, దీప్త కేతువు (దృష్టికేతువు), పంచహస్తుడు, నిరామయుడు, పృధుశ్రవుడు మొదలైనవారు దక్షసావర్ణి కుమారులు"?

"పదవ మన్వంతరానికి బ్రహ్మ-సావర్ణి మనువు. సుధాములు, విశుద్ధులు అయిన నూరుగురు దేవతలు, 'శాంతి' వీరి ఇంద్రుడు. హవిష్మంతుడు, సుకృతుడు, సత్యుడు, తపోమూర్తి, నాభాగుడు, అప్రతి మౌజాడు, భూరిషేణుడు మొదలైన పదిమంది కుమారులు ఈ మనువు సంతానం."

"పదకొండో మన్వంతరంలో ధర్మసావర్ణి మనువు, విహంగములు, కామగములు నిర్మాణరతులు ప్రధానమైన దేవతా వర్గాలు. ఒక్కొక్క గణంలో ముప్పైమంది ఉంటారు. 'వృషుడు', వీరి ఇంద్రుడు. నిశ్చరుడు, అగ్ని తేజుడు, వపుష్మంతుడు, ఘృణి, అరుణి, హవిష్మంతుడు, అనఘుడు, సప్తర్షులు. మనువు కుమారులైన సుధర్ముడు, సర్వత్రగుడు, దేవానీకుడు మొదలైనవారు భూమండల రాజులు."

"పన్నెండో మన్వంతరంలో రుద్రుని కొడుకు సావర్ణి మనువు అవుతాడు. హరితులు, లోహితులు, సుమనసులు, సుకర్ములు, సురూపులు అనే అయిదు గణాలు దేవతలు. వీరికి ఇంద్రుడు ఋ(రి)తుధాముడు. పై దేవగణాలలో ఒక్కొక్క గణంలో పదిహేనుమంది ఉంటారు. తపస్వి, సుతపుడు, తపోమూర్తి, తపోరతి, తపోధృతి, తపోద్యుతి, తపోధనుడు సప్తర్షులు. దేవవంతుడు, ఉపదేవుడు, దేవశ్రేష్ఠుడు మొదలైన మనువు కుమారులు భూమండల ప్రభువులు".

"రౌచ్యుడు పదమూడో మన్వంతరానికి మనువు. ముప్పై మూడు భేదాలుగల సుత్రాములు, సుధర్ములు, సుకర్మణులు దేవతావర్గాలు. 'దివస్పతి' వీరికి ఇంద్రుడు. నిర్మోహుడు, తత్త్వదర్శి, నిష్ప్రకంపుడు, నిరుత్సుకుడు, ధృతిమంతుడు, అవ్యయుడు, సుతపుడు సప్తర్షులు రౌచ్యుని పుత్రులు చిత్రసేనుడు, విచిత్రుడు మొదలైన వారు మహీపతులు."

"పద్నాలుగో మన్వంతరంలో భౌము(త్యు)డు మనువు. 'శుచి' ఇంద్రుడు. చాక్షువులు, పవిత్రులు, కనిష్ఠులు, భ్రాజితులు, వాచావృద్ధులు అనే అయిదు వర్గాలవారు దేవతలు. అగ్నిబాహుడు, శుచి, శుక్రుడు, మాగధుడు, అగ్నీధ్రుడు, యుక్తుడు, జితుడు, ఋషులు. ఊరువు, గంభీరుడు (గంభీరబుద్ధి) మొదలైనవారు ఆ మనువు కుమారులు. భూమి మీద రాజ్యాన్ని పాలించేది ఈ రాజులే".

ఇదీ మన్వంతరాల సిద్ధాంతం. ఈ రోజుల్లో మనం శ్రామిక వర్గ నియంతృత్వం గురించి వింటూ ఉంటాం. బ్రాహ్మణ సిద్ధాంతం దీనికి సరిగ్గా వ్యతిరేకమైనది అని చెప్పవచ్చు. శ్రామిక వర్గంపై స్వర్గంలోని పితరుల నియంతృత్వమే బ్రాహ్మణ సిద్ధాంతం.

ఏది ఎలా ఉన్నప్పటికీ ఒకరి తర్వాత ఒకరుగా అధికారంలోకి వచ్చే ఈ పధ్నాలుగుమంది మనువులు ప్రజల్ని ఎలా పరిపాలించారు? అనేది ఎవరికైనా కలిగే ప్రాథమిక ప్రశ్న.

ప్రజాపాలనకై ఈ మనువులు ఎలాంటి చట్టాలు చేశారు? వీటికి సమాధానం మనుస్మృతిలోనే దొరుకుతుంది.

మనుస్మృతి మొదటి అధ్యాయం పరిశీలిస్తే ఈ క్రింది సమాధానం తెలుసుకోవచ్చు.

అధ్యాయం I 1. మహర్షులంతా ఒకప్పుడు స్థిరచిత్తంతో (ఆసీనుడైన) మనువును సమీపించి ఇలా వేడుకున్నారు.

2. ఓ మహాత్ముడా! అన్నివర్ణాలకూ (నాలుగుముఖ్య కులాలు) వాటిమధ్య (అనులోమ విలోమ సంబంధం వల్ల) ఏర్పడిన వర్ణాలకూ సంబంధించిన పవిత్ర ధర్మాలు ఏమిటో, కచ్చితంగా అవి ఏ వరుసక్రమంలో ఉంటాయో మాకు తెలియజెయ్యి.

3. ఎందుకంటే , ఓ ప్రభూ, అప్రమేయమైన, అగాధమైన, అపౌరుషేయమైన వేదాలలో ప్రతిపాదించబడిన సమస్త జ్ఞానమూ నీకు ఒక్కడికే తెలుసు గనుక.

5. ఈ ప్రపంచం ప్రళయకాలంలో చీకటిగా ఉంది. స్పష్టమైన లక్షణాలు లేనిదై, హేతువుకు అందక, ఊహించటానికి అలవికాక, శబ్దగమ్యంకాక గాఢనిద్రలో మునిగి పోయిన దానివలె అంధకారంలో ఉన్నది.

8. ఆ ప్రళయానంతరం పరమాత్మ తన శరీరంనుంచే అనేకమైన వస్తువులను సృష్టించాలనే ఇచ్ఛగలవాడై, స్వయంభువుగా తనంతటతాను ప్రకృతి ప్రేరకుడై ఆవిర్భవించాడు. అతడు మొదట ఒక ఆలోచనతో జలాలను సృష్టించాడు. అందులో తన బీజాన్ని వదిలాడు.

9. ఆ బీజం సూర్య కాంతితో సమానమైన కాంతితో బంగారు అండం అయింది. అందులో నుంచి తానే స్వయంగా ఈ విశ్వానికంతకూ ఆది పురుషుడైన బ్రహ్మగా జన్మ ఎత్తాడు.

34. ఆ తరువాత, నేను సృష్టిచేయాలనే ఇచ్ఛతో జీవులను సృష్టించాను. కఠోరమైన నియమాలు ఆచరించి జీవరాశులకు ప్రభువులైన పదిమంది మహర్షులను సృష్టించాను.

35. వారు మరీచి, అత్రి, అంగీరస, పులస్త్య, పులహ, క్రతు, ప్రచేతస, వశిష్ఠ భృగు, నారదులు.

58. ఈ పవిత్ర శాసనాల వ్యవస్థలను రూపొందించిన మీదట, మొదట్లో, ఆయనే, స్వయంగా నాకు వాటిని నియమసారంగా బోధించాడు. ఆ తర్వాత నేను వాటిని మరీచికి, ఇతర ఋషులకు బోధించాను.

59. "ఈ వ్యవస్థలను భృగువు మీకు పూర్తిగా వినిపిస్తాడు. ఎందుకంటే ఆ ఋషి సంపూర్ణంగా నా నుండి నేర్చుకున్నాడు."

దీని నుండి బోధ పడుతున్నదేమిటంటే స్వయంభువు మనువు ఒక్కడే శాసనాలు చేసిన మనువు అని. విష్ణు పురాణం ప్రకారం ఒక్కొక్క మన్వంతరానికి ఒక్కొక్క మనువు ఉంటాడు; తమ మన్వంతరాల కోసం వారు శాసనాలు ఎందుకు రూపొందించుకోలేదు? స్వయంభువు మనువు చేసిన శాసనాలే శాశ్వతమైనట్టివా? అలా అయినప్పుడు బ్రాహ్మణులకు వేర్వేరు మన్వంతరాలు ఎందుకు కావలసి వచ్చాయి?

అనువాదం : ఎం. సుమిత్ర

## చిక్కుముడి : 22

# బ్రహ్మ 'ధర్మం' కాదు మరి బ్రహ్మ ఇక దేనికోసం?

రాజరికం, కులీన వర్గపాలన, ప్రజాస్వామ్యం, నియంతృత్వం అనే వివిధ రకాల ప్రభుత్వాలు చరిత్రలో ఉన్నాయి.

ప్రస్తుతం బాగా వాడుకలో ఉన్నది ప్రజాస్వామ్యం. ఏయే అంశాలు ప్రజాస్వామ్యాన్ని ఏర్పరుస్తాయి అన్న విషయంలో ఏకాభిప్రాయం లేదు. ఈ విషయాన్నే పరిశోధిస్తే రెండు అభిప్రాయాలు వెల్లడౌతాయి. ప్రభుత్వ విధానమే ప్రజాస్వామ్యం అనేది ఒక అభిప్రాయం. ఈ అభిప్రాయం ప్రకారం ప్రజలు ఎన్నుకొన్న ప్రాతినిధ్య ప్రభుత్వం ఉన్నచోటనే ప్రజాస్వామ్యం ఉంటుంది. దీన్నిబట్టి ప్రజాస్వామ్యం అనేది ప్రాతినిధ్య ప్రభుత్వానికి పర్యాయపదం, అంటే, వయోజన ఓటుహక్కు, నియమిత కాలంలో ఎన్నికలు ఉంటాయి.

రెండో అభిప్రాయం ప్రకారం, ప్రజాస్వామ్యం అంటే ప్రభుత్వ విధానంకంటె ఉన్నతమైనది. అది సామాజిక నిర్మాణ స్వరూపం. ప్రజాస్వామ్య బద్ధంగా ఏర్పడిన సమాజానికి రెండు ముఖ్య లక్షణాలున్నాయి. మొదటిది ఏమంటే సమాజాన్ని వర్గాలుగా విభజించే లక్షణం ఉండకపోవటం. రెండవది–వ్యక్తుల, సమూహాల, సాంఘిక ఆచారాలకు సంబంధించినది.

---

**ఇది 20 పుటల రాతప్రతి. అందులో మొదటి రెండు పుటలూ చివరి ముగింపు ఆరు పుటలూ గ్రంథకర్త చేతిరాతతో ఉన్నాయి. మిగిలినవి టైపులో ఉన్న పుటలు. వాటిలోనూ గ్రంథకర్త దిద్దుబాట్లున్నాయి. –సంకలనకర్త**

పరస్పర ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని నిరంతరం మార్పులను ఆహ్వానించే అలవాటు చేసుకోవటమే కాక అందుకోసం ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండగలగటం.

మొదటి లక్షణం ప్రజాస్వామ్యానికి అత్యంత కీలకమైనదని నిస్సందేహంగా చెప్పవచ్చు. ప్రొ॥డ్యూవే (Dewey) ప్రకారం(ఆయన రాసిన 'డెమోక్రసీ అండ్ ఎడ్యుకేషన్' 98వ పేజీలోని కొటేషన్ను గ్రంథకర్త వ్రాతప్రతిలో ఉటంకించలేదు.) ప్రజాస్వామ్యయుత సమాజానికి పైన చెప్పిన రెండవ లక్షణం కూడా అంతే అవసరం. ప్రొ॥డ్యూవే వివరించినట్లు, వ్యక్తులు, సమూహాల మధ్య అభిప్రాయాలు ఇచ్చిపుచ్చుకోవటం లేకపోతే ప్రజాస్వామ్య వ్యతిరేక ఫలితాలు వెలువడతాయి. డ్యూవే ఏమంటారంటే (డ్యూవే గ్రంథం. డెమోక్రసీ అండ్ ఎడ్యుకేషన్లో 99 పేజిలోని ఉటంకింపును గ్రంథకర్త వ్రాతప్రతిలో ఉటంకించలేదు).

ప్రజాస్వామ్యంపై వెలువడిన ఆ రెండురకాల అభిప్రాయాల్లో మొదటిది వాస్తవమే అయినా అంత లోతుగా లేదు. ఏదైనా సమాజపు నిర్మాణరూపం ప్రజాస్వామికం కానట్లైతే అక్కడ ప్రజాస్వామిక ప్రభుత్వం మనలేదు. ఎవరైనా ప్రజాస్వామ్యం అంటే కేవలం ఎన్నికల తతంగమే అనుకుంటే వారు మూడు పొరపాట్లు చేస్తున్నట్టు.

మొదటి పొరపాటు- ప్రభుత్వం అనేది విభిన్నమైనదిగా సమాజంతో విడిపడి ఉన్నదిగా విశ్వసించటం. వాస్తవానికి ప్రభుత్వం విభిన్నంగాను సమాజానికి దూరంగానూ లేదు. సమాజం పోషించే అనేక సంస్థల్లో ప్రభుత్వం కూడ ఒకటి. సాముదాయిక సంఘ జీవితానికి సంబంధించిన బాధ్యతలను నెరవేర్చటానికి సమాజం ప్రభుత్వానికి బాధ్యత అప్పగిస్తుంది.

రెండవ పొరపాటు ఏమిటంటే, సమాజ ప్రయోజనాలు, లక్ష్యాలు, ఆశయాలను ప్రతిబింబించేదే ప్రభుత్వమనీ, ప్రభుత్వానికి మూలం అయిన సమాజం ప్రజాస్వామికంగా ఉంటేనే అది సాధ్యమనీ గుర్తించలేకపోవటం. సమాజం ప్రజాస్వామికం కానట్లయితే ప్రభుత్వం ఎప్పటికీ ప్రజాస్వామికం కాలేదు. ఎక్కడైతే సమాజం పాలకులు, పాలితులు అని రెండు వర్గాలుగా విడిపోతుందో, అక్కడ ప్రభుత్వం పాలకవర్గాలదే కావటం తథ్యం.

ఇక మూడవ పొరపాటు కొస్తే ప్రభుత్వం మంచిదా, చెడ్డదా, ప్రజాస్వామికమైనదా, అప్రజాస్వామికమైనదా అనే విషయం. ప్రభుత్వం తన చట్టాలను అమలు పరచటానికి ప్రతిచోటా సివిల్ సర్వీస్ల మీదనే ఆధారపడవలసి వస్తున్నదనే విషయాన్ని మరిచిపోవటం, సామాజిక జీవితం అప్రజాస్వామిక మైనపుడు ప్రభుత్వం కూడ అప్రజాస్వామికమై తీరుతుంది.

ప్రజాస్వామ్యం మనగలగటానికి ప్రభుత్వ రూపం ప్రజాస్వామ్యంగా ఉంటే చాలు అనుకునే అభిప్రాయం కూడా మరో పొరపాటు. ఈ పొరపాటును సరిదిద్దుకోవాలంటే, అసలు మంచి ప్రభుత్వం అంటే ఏమిటో తెలుసుకోవాల్సి ఉంది.

మంచి ప్రభుత్వం అంటే మంచి చట్టాలు, మంచి పరిపాలన, మంచి ప్రభుత్వం అంటే

సారాంశం ఇదే. ఇది తప్ప ఇంకేమీ లేదు. పాలనాధికారాలను చేపట్టినవారు, విశాల ప్రజానీకం అట్టడుగు వర్గాల ప్రయోజనాలకు బదులు, తమ వర్గ ప్రయోజనాలను మాత్రమే పక్షపాత దృష్టితో చూసుకుంటే, అది మంచి ప్రభుత్వం అనిపించుకోదు. ప్రజాస్వామిక ప్రభుత్వం వలన మంచి జరుగుతుందా అనే విషయం సమాజంలో ఉన్న వ్యక్తుల మనోభావాల మీద ఆధారపడి ఉంటుంది.

వ్యక్తుల మనోభీష్టాలు ప్రజాస్వామికంగా ఉంటే, ప్రజాస్వామ్య ప్రభుత్వం మంచి ప్రభుత్వంగా మారుతుందని ఆశించవచ్చు. అలా కానట్లయితే ప్రజాస్వామ్య ప్రభుత్వం ప్రమాదకరమైన ప్రభుత్వంగా మారవచ్చు. సమాజంలోని వ్యక్తులు వర్గాలుగా విడిపోయి ఆ వర్గాలు ఒక దానితో మరొకటి వేరు వేరుగా ఉండి ప్రతి వ్యక్తీ అన్నిటికంటే ముందు తన వర్గానికే విశ్వాస పాత్రుడిగా ఉండి వర్గపు గూడులో నివసిస్తున్నపుడు పెంచుకునే వర్గ చైతన్యం వల్ల, ఇతరుల ప్రయోజనాలను కాలరాచి తన వర్గ ప్రయోజనాలనే కాపాడుకోవలసి వస్తుంది. అంతేకాక తన వర్గ ప్రయోజనాలకోసం చట్టాన్నీ, న్యాయాన్నీ తప్పుదోవ పట్టిస్తాడు. అందుకోసం తన కులానికి చెందని వ్యక్తులపై అన్ని జీవన రంగాలలోనూ ఒక పద్ధతి ప్రకారం వివక్షను అవలంబిస్తాడు. ఇలాంటి సమాజంలో వర్గాలు పరస్పరం సంఘర్షణకు తలపడినపుడు సంఘ వ్యతిరేక భావాలు, ఉద్రిక్తమైనపుడు, ప్రభుత్వం న్యాయపరంగా నిష్పాక్షికంగా పరిపాలించలేదు. ఆ రకమైన సమాజంలో ఉండే ప్రభుత్వం, రూపంలో ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రజా ప్రభుత్వమే అయినప్పటికీ ఆచరణలో ప్రజలకొరకు ఏర్పడిన ప్రభుత్వం మాత్రం కాజాలదు. అది ఒక వర్గం కొరకు ఆవర్గం ఏర్పరచుకొన్న ప్రభుత్వం అవుతుంది. ప్రతి వ్యక్తిలోనూ తన పక్కవాణ్ణి తనతో సమానంగా పరిగణించే దృష్టి ఏర్పడినప్పుడు తాను కోరుకునే స్వేచ్ఛ తన పక్కవాడికి కూడా ఉండాలనుకునే ప్రజాస్వామిక వైఖరి ప్రబలినప్పుడూ మాత్రమే ఆ ప్రభుత్వం 'ప్రజలకొరకు' ఏర్పడినది అవుతుంది. ప్రజాస్వామిక సమాజంలో వ్యక్తిని సామాజీకరణ చేయగా వచ్చిన ఫలితమే ప్రజాస్వామిక వైఖరి ఆవిర్భావం. కాబట్టి ప్రజాస్వామిక ప్రభుత్వానికి మొదట కావల్సింది, ప్రజాస్వామిక సమాజం. ప్రజాస్వామిక ప్రభుత్వాలు ఎక్కువగా పడిపోవటానికి కారణం, ఆ ప్రభుత్వాలు ఏ సమాజంకోసం ఏర్పాటయినాయో ఆ సమాజం ప్రజాస్వామ్య సమాజం కాకపోవటమే.

ఒక మంచి ప్రభుత్వ లక్ష్య సాధన, ప్రజలనైతిక- మనోవైఖరులపై ఎంతగా ఆధారపడి ఉంటుందన్న విషయాన్ని దురదృష్టవశాత్తు ఎవరూ అంతగా తెలుసుకోలేకపోతున్నారు. ప్రజాస్వామ్యం రాజకీయ యంత్రాంగం కంటే ఉన్నతమైనది. అది సాంఘిక వ్యవస్థకన్న మిన్న అయినది. ప్రజాస్వామ్యం ఒక మనోవైఖరి. జీవన తత్త్వం.

ప్రజాస్వామ్యాన్ని కొంతమంది స్వేచ్ఛా సమానత్వాలతో పోలుస్తారు. స్వేచ్ఛా సమానత్వాలను ప్రజాస్వామ్యం ఎంతో పట్టించుకుంటుందనే విషయంలో సందేహం లేదు.

అయితే ఈ స్వేచ్ఛా సమానత్వాలు దేని మీద మనగల్గుతాయనేది చాల ముఖ్యమైన ప్రశ్న. రాజ్య శాసనం పైననే ఇవి మనగలతుగుతాయని కొందరంటారు. అయితే ఇది సరైన సమాధానం కాదు. స్వేచ్ఛా సమానత్వాలను నిలిపేది సహజీవనం. దీనినే ఫ్రెంచి విప్లవకారులు సౌభ్రాత్రత అన్నారు. సౌభ్రాత్రత అనేపదం వాస్తవానికి చాలినంత అర్థాన్ని ఇవ్వడం లేదు. దీనికి సరైన పదం బుద్ధుడు చెప్పినట్లు "మైత్రి"... సౌభ్రాత్రత లేకపోతే స్వేచ్ఛ సమానత్వాన్ని నాశనం చేస్తుంది. సమానత్వం స్వేచ్ఛను నాశనం చేస్తుంది. ప్రజాస్వామ్యంలో స్వేచ్ఛ సమానత్వాన్ని నాశనం చేయకుండా, సమానత్వం స్వేచ్ఛను నాశనం చేయకుండా ఉన్నదంటే ఆ రెండింటి పునాదులలోనూ సౌభ్రాత్రత ఉన్నట్లే. ఆ విధంగా సౌభ్రాత్రత ప్రజాస్వామ్యానికి మూలం అయింది.

జరిగిన చర్చ అంతా ప్రధాన ప్రశ్నకు కేవలం ప్రారంభం మాత్రమే. సౌభ్రాత్రత లేకపోతే ప్రజాస్వామ్యానికి మనుగడలేదు. అటువంటి సౌభ్రాత్రతకు వేళ్లు ఎక్కడ ఉన్నాయనేది ప్రశ్న. దీని మూలం 'మతం'లో ఉన్నదన్నది నిర్వివాదాంశం.

ప్రజాస్వామ్య ఆవిర్భావం, దాని ఆచరణ విజయాలు, అది విజయవంతంగా ఎలా పనిచేస్తున్నదనే విషయాలు పరిశీలించే ముందు, ప్రజల మతం దగ్గరకు పోవలసి ఉంటుంది. అది ప్రజలకు సౌభ్రాతతను బోధిస్తున్నదో లేదో చూడాలి. మతం సౌభ్రాత్రతను బోధించేదైతే ప్రభుత్వం ప్రజాస్వామికంగా నెలకొనడానికి అవకాశాలు మెండుగా ఉంటాయి. అలా లేనట్లైతే అటువంటి అవకాశాలు తక్కువగా ఉంటాయి. అంతేకాక, ప్రజాస్వామ్యస్థాపనకు మరికొన్ని ఇతర అంశాలు కూడా దోహద పడవచ్చు. కానీ సౌభ్రాత్రత లేకపోయినట్లయితే, ప్రజాస్వామ్యం నిర్మించుకోడానికి ఇంకేమీ లేనట్లే. భారత దేశంలో ప్రజాస్వామ్యం ఎందుకు వృద్ధి చెందటం లేదు? ఇదీ ప్రధానప్రశ్న. దీనికి సమాధానం చాల తేలిక. హిందూ మతం సౌభ్రాత్రతను బోధించటం లేదు. పైపెచ్చు అది సమాజాన్ని వర్గాలుగా లేదా వర్ణాలుగా విభజించటాన్నీ ప్రత్యేక వర్గచైతన్యం కాపాడుకోవటాన్నీ బోధిస్తున్నది. ఇట్లాంటి వ్యవస్థలో ప్రజాస్వామ్యానికి స్థానం ఎక్కడుంటుంది?

హిందూ సామాజికి వ్యవస్థ అప్రజాస్వామికం కావటం కాకతాళీయంగా జరగలేదు. దానిని అప్రజాస్వామికంగానే రూపొందించారు. సమాజాన్ని వర్ణాలుగా, కులాలుగా, హీనకులాలుగా విభజించటం కేవలం సిద్ధాంతాలవరకే కాదు, కఠినమైన ఆజ్ఞలుగా చేశారు. ఇవన్నీ ప్రజాస్వామ్యానికి అవరోధాలుగా నిలిచాయి.

సౌభ్రాత్రతా సిద్ధాంతం హిందూ మతానికీ, హిందూతత్వానికీ అగోచరమనే విషయం స్పష్టమవుతున్నది. అయితే చారిత్రక సత్యాలను బట్టి చూస్తే ఈ విధమైన ముగింపుకు రావటానికి వీల్లేదనిపిస్తున్నది. హిందూమతమూ, హిందూతత్వ చింతనా సౌభ్రాత్రతా సిద్ధాంతానికీ కాక సాంఘిక ప్రజాస్వామ్యం ఏర్పాటుకు కావల్సిన శక్తి సామర్థ్యాలనే ప్రతిపాదించాయని

అనిపిస్తుంది. అదే బ్రహ్మవాదం.[1]

బ్రహ్మవాదం అంటే ఏమిటని ఎవరైనా ప్రశ్నిస్తే ఆశ్చర్యపోనవసరం లేదు. ఎందుకంటే ఇది హిందువుకు కూడ కొత్తే. హిందువులు వేదాంతాలు బ్రాహ్మణ వాదం ఎరుగుదురు కానీ వాళ్లకు బ్రహ్మవాదం గురించి ఏ మాత్రమూ తెలియదు. ఈ విషయంలో ముందుకు వెళ్లేముందు దీనికి కొద్దిపాటి వివరణ అవసరం.

హిందూ మతతత్వంలో మూడు వాదాలున్నాయి. అవి 1. బ్రహ్మవాదం 2.వేదాంతం 3. బ్రాహ్మణవాదం. ఈ మూడు ఒక దానితో ఒకటి సహ సంబంధాన్నే కలిగి ఉన్నప్పటికీ, మూడు మూడు విభిన్నమైన స్పష్టమైన సిద్ధాంతాలను ప్రతిఫలిస్తాయి.

బ్రహ్మ వాద సారాంశాన్ని ఒక సిద్ధాంతంలో క్లుప్తీకరించవచ్చు. ఇది మూడు రూపాల్లో ఉంది. అవి : 1. సర్వం ఖల్విదమ్ బ్రహ్మ– (సర్వమూ బ్రహ్మ మయమే). 2. అహం బ్రహ్మాస్మి–(ఆత్మ బ్రహ్మలాంటిదే కాబట్టి నేనే బ్రహ్మను). 3. తత్త్వమసి –(ఆత్మ బ్రహ్మ లాంటిదే కాబట్టి నీవు కూడ బ్రహ్మవే) వీటినే 'మహావాక్యాలు' అంటారు. అవి బ్రహ్మవాద సారాంశాన్ని తెలియచేస్తాయి.

వేదాంతాల్లోని బోధనల సారాంశం ఈ క్రింది సిద్ధాంతాలుగా చెప్పుకోవచ్చు.

1. బ్రహ్మ మాత్రమే యదార్థం.
2. ఈ ప్రపంచం అంతా మాయ లేదా మిధ్య.
3. జీవుడు – బ్రహ్మ అనేవి.
   (ఎ) ఒక సిద్ధాంతం ప్రకారం (రెండూ) సమానమే.
   (బి) మరో సిద్ధాంతం ప్రకారం సమానం కాదు. కానీ (అతనితో) విడదీయరాని (అతనిలోని) అంశాలు.
   (సి) మూడవ సిద్ధాంతం ప్రకారం (ఇవి రెండు) విభిన్నమైనవి, వేరైనవి.

ఇక బ్రాహ్మణత్వం గురించి స్థూలంగా ఈ క్రింది సిద్ధాంతాలలో చెప్పవచ్చు.

(ఎ) చాతుర్వర్ణ వ్యవస్థలో నమ్మకం

(బి) వేదాలు పవిత్రమైనవి,అమోఘమైనవి అనే నమ్మకం

(సి) దేవతకు బలిఇవ్వటం ఒక్కటే మోక్షానికి ఏకైకమార్గం అని అనుకోవటం.

వేదాంతానికి బ్రాహ్మణ వాదానికి గల తేడాల గురించీ వాటిలోని వివాదాస్పదమైన

1. ప్రొ॥ హాప్‌కిన్ (Hopkin) రచించిన 'ది ఎపిక్స్ ఆఫ్ ఇండియా' (The Epics of India) నుంచి ఈ పదాన్ని తీసుకున్నారు.

అంశాల గురించీ చాలమందికి తెలుసు. కానీ బ్రహ్మవాదానికీ వేదాంతానికీ మధ్య ఉన్న తేడా చాల కొద్దిమందికే తెలుసు. హిందువులలో కూడ బ్రహ్మతత్వ సిద్ధాంతం గురించి గానీ దానికీ వేదాంతానికి మధ్య గల తేడా గురించి గానీ అంతగా అందరికీ తెలియదు. వీటి మధ్య తేడా మాత్రం చాల స్పష్టంగా ఉన్నది. ఆత్మ బ్రహ్మవలెనే ఒక్కటే అని బ్రహ్మవాదమూ వేదాంతమూ ఒప్పుకున్నప్పటికీ ఒక విషయంలో అవి విభేదిస్తాయి. వేదాంతం 'ప్రపంచం మిథ్య' అంటుంది. బ్రహ్మవాదం మాత్రం దానితో విభేదిస్తుంది. ఈ రెంటిమధ్య ఇదే మౌలికమైన వ్యత్యాసం.

ఈ ప్రపంచం వాస్తవం. దీని వెనుక నున్న వాస్తవికత బ్రహ్మయే. కాబట్టి సమస్తమూ బ్రహ్మ సారమే. అనేది బ్రహ్మ వాద సారాంశం.

బ్రహ్మవాదంపై ఎక్కుపెట్టిన విమర్శలు రెండు. బ్రహ్మ వాదానికి మూలం మొండితనం అనేది ఒకటి. ఎవరైనా "నేను బ్రహ్మ" అని చెప్పుకోవడం ఒక విధమైన అహంకారం అనిపిస్తుంది. బ్రహ్మను గురించి మానవుడు సంపూర్ణంగా తెలుసుకోలేడనేది రెండవ విమర్శ. 'నేను బ్రహ్మను', అనడం మొండితనంగా కనిపించవచ్చు. కాని అది తన విలువ ఏమిటో స్థిరీకరించుకోవటం కూడా అవుతుంది. ఈ ప్రపంచంలో, మానవత (మానవ సమాజం) ఇంతటి ఆత్మ న్యూనతా భావానికి లోనౌతున్న సమయంలో, వ్యక్తి తన యోగ్యతను స్పష్టీకరించుకోవటం ఆహ్వానించదగ్గ పరిణామమే. ప్రతివ్యక్తి తన యోగ్యతను తాను తెలుసుకోడానికి అవసరమయ్యే అన్ని అంశాలూ పొందాలని ప్రజాస్వామ్యం వాంఛిస్తుంది. ఇతరులందరివలె తానుకూడ మంచివాడనే అనే సంగతి ప్రతివ్యక్తి గ్రహించాలి – అని కూడా ప్రజాస్వామ్యం కోరుకుంటుంది. 'అహం బ్రహ్మస్మి' అనే మాటను ఎవరో మొండివాడు అనే మాటగా అపహాస్యం చేసేవాళ్లు ఆ మహావాక్యాల్లో రెండవదైన 'తత్వమసి' (నీవూ బ్రహ్మవే) అనేదాన్ని మర్చిపోతుంటారు. 'తత్వమసి' అనే సంయుక్త పదం లేకుండా 'అహం బ్రహ్మస్మి' అనేది ఒక్కటే ఉంటే అది అపహాస్యానికి గురికావచ్చు. కాని 'తత్వమసి' 'అహంబ్రహ్మస్మి'తో కలిసి ఉన్నందువల్ల బ్రహ్మవాదం మొండివాదన, అనేది నిలబడదు.

బ్రహ్మ అజ్ఞేయమే కావచ్చు. ప్రజాస్వామ్యానికి పునాదిగా బ్రహ్మాండమైన విలువలు ఉన్న నిర్దిష్టమైన సాంఘిక భావాలు, బ్రహ్మ వాదానికి ఉన్నాయి. అందరూ బ్రహ్మ అంశలే అయితే అందరూ సమానులే కదా. కాబట్టి అందరూ ఒకే రకమైన స్వేచ్ఛను అనుభవించాలి. ప్రజాస్వామ్యం చెప్పేదీ ఇదే! ఈ నేపథ్యంలో చూసినపుడు బ్రహ్మ అజ్ఞేయమే (తెలియనిదే) అయినా గాని ప్రజాస్వామ్యానికి బ్రహ్మవాదంలో ఉన్నంత బలమైన పునాది ఇంకే సిద్ధాంతంలోనూ లేదనే విషయంలో సందేహమేలేదు.

'మన మందరం భగవంతుని పిల్లలం అయినందువల్ల ప్రజాస్వామ్యాన్ని సమర్థించాలి.' అని అనడం ప్రజాస్వామ్యానికి బలమైన పునాది లేకుండా చేయడమే. అందుకనే అటువంటి పునాదులపై ఏర్పాటైన ప్రజాస్వామ్యం ప్రతిచోటా ఊగిస లాడుతూ ఉంది. నీవూ నేనూ ఒకే

జగత్సంబంధమైన సిద్ధాంతంలో భాగాలం అని తెలుసుకొన్నపుడు, ఒక్క ప్రజాస్వామ్యం మినహా మన సహజీవన సిద్ధాంతానికి ఏ ఇతర సిద్ధాంతమూ హామీ ఇవ్వలేదని తేలిపోతుంది. ఇది కేవలం ప్రజాస్వామ్యాన్ని బోధించటం మాత్రమే చెయ్యటం లేదు. ఇది ప్రతి ఒక్కరి విధ్యుక్త ధర్మంగా భాసిస్తుంది.

క్రైస్తవం నుంచి గాని, గ్రీకు తత్వవేత్త ప్లేటో నుంచిగాని, ప్రజాస్వామ్యం పుట్టుకు వచ్చిందనీ, ప్రజాస్వామ్యం పరిఢవిల్లటానికి వేరే ఆధారం ఏదీలేదనీ ప్రజాస్వామ్యాన్ని అధ్యయనం చేసే పాశ్చాత్యులు ప్రచారం చేశారు. ప్రజాస్వామ్యానికి కావలసిన గట్టి పునాదిని అందించిన బ్రహ్మ వాద సిద్ధాంతాన్ని భారత దేశం కూడ పెంపొందించిందని వారు తెలుసుకొని ఉంటే అంతగా పిడివాదం చేసేవారుకారేమో! ప్రజాస్వామ్య సిద్ధాంతానికి పునాది ఏర్పరచటంలో భారతదేశం తనవంతు సహాయం చేసినట్లు ఒప్పుకోవలసిందే.

ఇక్కడ ప్రశ్నల్లా, ఈ బ్రహ్మవాదం ఏమైపోయిందనేది. దాని సాంఘిక ప్రభావాలేమీ లేవన్నది స్పష్టమవుతూనే ఉంది. ధర్మానికి దీనిని ఆధారంగా తీసుకోలేదు. ఇది ఇలా ఎందుకు జరిగింది? అని ప్రశ్నిస్తే బ్రహ్మవాదం ఒక తత్వం మాత్రమే అని జవాబు చెప్తారు. తత్వం అనేది సంఘ జీవనం నుంచి కాక, శూన్యం నుంచి శూన్యం కోసం పుట్టినట్టు. తత్వం అనేది కేవలం సిద్ధాంతానికి సంబంధించిన విషయం మాత్రమే కాదు. దానికి ఆచరణ శీల శక్తులున్నాయి. జీవిత సమస్యలలో తత్వం వేళ్లూనుకొని ఉన్నది. తత్వం ఏ సిద్ధాంతాలను ప్రవచించినా అవి సమాజాన్ని పునర్నిర్మించటానికి పరికరంగా తిరిగి సమాజంలోకి వెళ్లాలి. ఏదైనా తెలుసుకోవటం ఒక్కటే సరిపోదు. తెలుసుకున్నవాళ్ళు దాన్ని నెర వేర్చటానికి కృషి చేయాలి.

నూతన సమాజాన్ని సృష్టించడంలో బ్రహ్మవాదం ఎందుకు విఫలమైంది? ఇదో పెద్దచిక్కుముడి. బ్రాహ్మణులు బ్రహ్మవాదాన్ని గుర్తించలేదని కాదు, వారు దానిని గుర్తించారు. అయితే బ్రహ్మణులకూ, శూద్రులకూ మధ్య, స్త్రీలకూ పురుషులకూ మధ్య, కులంలోని వారికీ కులం బయటివారికీ మధ్య అసమానతలను ఎలా సమర్థిస్తారనే విషయాన్ని వారు అడగలేదు. ఫలితంగా ఒకవైపున అత్యంత ప్రజాస్వామికమైన బ్రహ్మవాదమూ, మరోవైపున కులాలు, ఉపకులాలు, హీనకులాలు, ఆదిమ జాతులు, నేరప్రవృత్తిగల జాతులతో పీడబట్టిన సమాజమూ మనకు మిగిలాయి. ఇంతకుమించిన ఊగిసలాట ఇంకేమైనా ఉంటుందా? ఇంతకంటె హాస్యాస్పదంగా ఉన్నాయి. శంకరాచార్యుని బోధనలు. ఎందుకంటే, బ్రహ్మ ఉన్నాడని, బ్రహ్మ వాస్తవమనీ, అతడు సర్వత్రా వ్యాపించి ఉన్నాడనీ బోధించిన ఈ శంకరాచార్యుడే తిరిగి బ్రాహ్మణ సమాజంలోని అన్ని అసమానతలనూ సమర్థించాడు. ఒక పిచ్చివాడు మాత్రమే పరస్పర విరుద్ధమైన ఇలాంటి రెండు సిద్ధాంతాలను ప్రతిపాదించి ఆనందించగలుగుతాడు. నిజంగా బ్రాహ్మణుడు ఆవువంటివాడు గనుక ఆవులాగ ప్రతీదీ, ఏది కనబడితే అది తిని (కూడ) బ్రాహ్మణుడుగానే మిగలగలడు.

అనువాదం : ఎం. సుమిత్ర

చిక్కుముడి : 23

# కలియుగం – బ్రాహ్మణులు దీనిని ఎందుకు అనంతంగా చేశారు ?

హిందువులలో – వయోజనులలోగాని, వృద్ధులలోగాని పరిణితి చెందిన వారిలోగాని, చెందనివారిలోగాని స్త్రీ, పురుషులలో ఏదైనా భావం బాగా ప్రబలంగా ఉందంటే అది కలియుగం అనేది ఒకటి ఉందనేదే. కలియుగంలో తాము జీవిస్తున్నామని వారికి తెలుసు. ప్రజల మనస్తత్వం పైన కూడ కలియుగ సిద్ధాంతం ప్రభావం ఉన్నది. ఇది అననుకూలమైన యుగమని, ఇది అపవిత్రమైన యుగమని దీని భావం. మానవ ప్రయత్నాలకు ఎలాంటి ఫలితాలు దక్కని యుగంగా ఇది పేరు పడినందువల్ల అసలు అటువంటి భావం ఎలా ఉత్పన్నమైనదో అనే విషయాన్ని పరిశీలించవలసి ఉన్నది. ముఖ్యంగా నాలుగు అంశాలను గురించి ఇక్కడ తప్పక వివరించాలి. అవి (1) కలియుగం అంటే ఏమిటి? (2) కలియుగం ఎప్పుడు ప్రారంభమైంది? (3) కలియుగం ఎప్పుడు అంతం కానుంది ? (4) ప్రజలలో అలాంటి భావం ఎందుకు వ్యాప్తి చెందింది?

## I

మొదటి అంశాన్ని తీసుకుందాం. ఈ పరిశీలన నిమిత్తం 'కలి', 'యుగం' అనే పదాలను విడదీసి రెండింటిని వేరువేరుగా పరిశీలించటం మంచిది. యుగం అంటే అర్థం ఏమిటి?

---

**ఇది 45 పుటల టైపు ప్రతి. మొదటి 9 పుటలకే నంబర్లు వేసి ఉన్నాయి. మిగతా వాటికి నంబర్లు లేవు. ఏది ఏమైనా ఈ అధ్యాయం సమగ్రంగానే ఉన్నది. విషయం ఏమీ లోపించలేదు.**

**– సంకలనకర్త**

ఋగ్వేదంలో యుగం అనే పదానికి కాలం, తరం, తెగ, వంశం అనే భావనలు కనిపిస్తాయి. ఇది 'యుగే యుగే" (ప్రతి కాలంలోను), "ఉత్తర యుగే" (భవిష్యత్ కాలాలు, "ఉత్తర యుగే" (తరువాతి కాలాలు), "పూర్వాణి యుగాణి" (పూర్వకాలం) అనే వ్యాఖ్యలలో కనిపిస్తుంది.

పురుషులకు సంబంధించిన తరాలను గుర్తించడంలో 'మానుషి', 'మానుష', 'మానుషః' అనే సందర్భాలలో ఇది కనిపిస్తుంది. ఇది పురుషుల తరాలను తెలుపుతుంది. దీని అర్థం కేవలం కాలాలు అనే. "యుగం" అనే పదం వైదికుల అర్థంలో ఎంతకాలాన్ని తెలుపుతుందో తెలుసుకోవటానికి అనేక ప్రయత్నాలు జరిగాయి. సంస్కృత శబ్దం "యుక్" నుంచి "యుగం" అనే పదం వచ్చింది. దీని అర్థం కలవటం అని, జ్యోతిష శాస్త్రానికి సంబంధించిన 'కలయిక' అర్థమే దీనికి వర్తిస్తుంది. యుగం అనే దాని కిందికి వచ్చే కాలపరిమితి నాలుగు చంద్రకళలకు సంబంధించినదని ప్రొఫెసర్ వెబర్ సూచించాడు.

ఈ సూచన గ్రహించి రంగాచార్య ఈ సిద్ధాంతాన్ని ఇంకా కొంచెం ముందుకు తీసుకు వెళ్ళాడు. ఆయన ప్రకారం "యుగం అంటే సూర్యుడు చంద్రుడు ఒకరినొకరు చూసుకొనే అంటే, కలుసుకొనే సమయం. అమావాస్య నుండి ఒకనెల కాలం పాటు అని ప్రాచీన భావన ఉండేదని" ఆయన చెప్పాడు. ఇతరులు ఈ అభిప్రాయాన్ని అంగీకరించలేదు. స్కాంద పురాణంలోని భాగమైన సేతు మాహాత్మ్యంలో యుగం అంటే ఒక మానవ సంవత్సరంగా పేర్కొన్నట్లు శ్యామశాస్త్రి అంటారు. అదే ప్రామాణికత ప్రకారం యుగమనే దాన్ని ఒక పర్వంగాను, లేదా అర్థచంద్ర వర్తనం అంటే చంద్రమానంలో శుక్లపక్షం లేదా కృష్ణపక్షంగాను తీసుకోవచ్చు. యుగం అంటే ఎంతకాలం అవుతుందని వైదికులు ఉద్దేశించారో తెలుసుకోవటానికి ఈ ప్రయత్నాలు మనకు సహాయపడవు. వైదిక వాఙ్మయంలో యుగం అనే పదం వాడకం గురించి ఖచ్చితంగా ఏదీ లేకపోగా జ్యోతిషశాస్త్ర వాఙ్మయంలో యుగం అంటే ఒక ఖచ్చితమైన కాల పరిమితి కనిపిస్తుంది. యుగం అంటే (1) సంవత్సరం (2) పరివత్సరం (3) ఇద్వత్సరం (4) అనువత్సరం (5) వత్సరం అనే అయిదింటి కాలచక్రం.

ఇక కలి విషయానికి వస్తే కృత, త్రేత, ద్వాపర, కలి అనే నాలుగు యుగాల కాలచక్రంలో ఇది ఒకటి. కలి అనే పదానికి అసలు మూలం ఏమిటి? వేరు వేరు అర్థాలలో మూడు సందర్భాలలో కృత, త్రేత, ద్వాపర, కలి అనే పదాలను ఉపయోగించినట్లు తెలుస్తున్నది. అన్నింటికంటే ముందు ఈ పదాలను మొదట్లో పాచికల ఆటకు సంబంధించి వాడటం జరిగింది.

విభీతక చెట్టులోని గోధుమరంగు ఫలం నుంచి జాజికాయ పరిమాణంలో, దాదాపు గుండ్రంగా, అయిదు పార్శ్వాలను సమంగా నునుపుగా చేసిన పావును పాచికల ఆటలో

1 The Yugas : A question of Hindu Chronology and History. P. 9.
2 Drapsa. The Vedic cycle of Eclipses (1938) P. 38.

ఉపయోగించినట్లు ఋగ్వేదం నుంచి స్పష్టమవుతున్నది. ఆ తరువాత పాచికలను అయిదు పార్శ్వాలకు బదులు నాలుగు పార్శ్వాలుగా మార్పు చేశారు. వివిధ పార్శ్వాలకు 4, 3, 2, 1 అనే అంకెల గుర్తులు పెట్టారు. నాలుగుగా గుర్తించిన పార్శ్వానికి 'కృత' అని, మూడుగా ఉన్నదానికి 'త్రేత' అని, రెండుకు 'ద్వాపర' అని, ఒక అంకె గల దానికి 'కలి' అని పేర్లు పెట్టారు.

ఈ పాచికల ఆట బలిలో భాగం ఎలా అయిందో, దానిని ఎలా ఆడేవారో శ్యామశాస్త్రి వివరించారు.

"చాలామంది ఆటగాళ్ళు బలి ఇవ్వదలచిన వ్యక్తికి సంబంధించిన ఆవును తీసుకొని పట్టణం లేదా గ్రామంలోని వీధుల గుండా వెళ్ళేవారు. ఆవును పణంగా పెట్టి పాచికల ఆట జట్లుజట్లుగా ఆడేవారు. వారితో ఆడేవారు, ధాన్యాన్ని పందెంలో పణంగా పెట్టేవారు. వంద లేదా అంతకంటే ఎక్కువ గవ్వలను ఆటగాడు నేలమీద విసిరేవాడు. గవ్వలను నేలపై వేసినపుడు ముందుగా అనుకున్నట్లు బొమ్మ లేదా బొరుసు పడితే ఆ మొత్తం నాలుగు చేత విభాజ్యం అయితే బలి ఇచ్చే వ్యక్తి గెలిచినట్టు లేదా ఓడినట్టు. అలా గెలిచిన ధాన్యంలో నుంచి బలి ఇచ్చే రోజున నలుగురు బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి.

ప్రొఫెసర్ ఎగ్లింగ్ (Eggling) వైదిక వాఙ్మయం గురించి చేసిన ప్రస్తావన బట్టి చూస్తే పురాతన కాలం నుంచి పాచికల ఆట ఉన్నదనే విషయంలో సందేహం ఏమీ కనపడదు. ఈ ఆట అయిదు పాచికలతో ఆడేవారనీ, వాటిలో నాలుగు పాచికలను కృత అనీ అయిదో పాచికను కలి అనీ వ్యవహరించినట్టు ఆయన వివరణ[1] నుంచి తెలుస్తున్నది. ఆయన తెలిపిన అంశాల ప్రకారం ఈ ఆటను, వివిధ పద్ధతులలో ఆడేవారు. అతి ప్రాచీన పద్ధతి ప్రకారం పాచికల బొమ్మ లేదా బొరుసులను బట్టి (అన్నీ ఒకేవైపుకు పడటం లేదా పడకపోవటాన్ని బట్టి) ఆటగాళ్ళ గెలుపు, ఓటములను నిర్ధారించే వారని ఆయన చెప్పారు.

రాజసూయ యాగంలోను, యజ్ఞంలో ఉపయోగించే పవిత్రమైన హోమాగ్నిని వెలకొల్పటానికి సంబంధించిన యాగక్రతువులలోనూ కూడా ఈ పాచికల ఆట అంతర్భాగంగా ఉన్నది.

గణితశాస్త్రంలో కూడ ఈ కృత, త్రేత, ద్వాపర, కలి అనే పదాలను ఉపయోగించారు. జైన మతానికి సంబంధించిన "భగవతి సూత్రం" అనే ఉద్గ్రంథానికి అభయదేవసూరి రాసిన వ్యాఖ్యానంలోని ఈ దిగువ భాగాన్ని బట్టి ఇది తేటతెల్లమౌతున్నది. గణితశాస్త్ర పరిభాషలో బేసి సంఖ్యను 'ఓజా'గాను, సరిసంఖ్యను 'యుగ్మం'గాను పిలుస్తారు. ఇదిలా ఉండగా రెండేసి అంకెలను కూడా 'యుగ్మం'గాను, ఓజా'గాను పిలిచేవారు. మొత్తానికి యుగ్మం అనేది నాలుగు యుగ్మాలు అంటే నాలుగు అంకెలు అనే అర్థంలో ఉన్నది. వీటిలో కృత, యుగ్మ, కృత

1. ఆయన సంపాదకత్వంలో వెలువడిన శతపథ బ్రాహ్మణం (Satapatha Brahmana) సం. IV. పుట 107లో వారి వివరణ చూడండి.

అంటే సాధించబడినది, అంటే పూర్తి అయినది. ఎందుకంటే నాలుగు తర్వాత అంటే కృత మొదలైన నాలుగుపేర్లు కాక వేరే పేరు ఉన్న మరో సంఖ్య లేదు.

త్ర్యోజ వలెనూ తదితరమైన అంకెల వలెనూ అసంపూర్ణం కానిదీ ప్రత్యేకమైన సరిసంఖ్యగలదీ కృతయుగ్మ; కృతయుగ్మకు పైన సరిసంఖ్య కాకుండా ఒక ప్రత్యేకమైన బేసి సంఖ్యగా ఉండేదాన్ని త్ర్యోజ అంటారు. 'ద్వాపర యుగ్మ' అనేది కృతయుగ్మలాగనే సరిసంఖ్య. దానికి భిన్నమైనదిగా ఉండి అంటే రెండు నుంచి లెక్కించగా వచ్చేదికాని కృతయుగ్మ నుంచి లెక్కించగా వచ్చేది. కాని ద్వాపర యుగ్మ "ద్వాపర" అనేది ఒక ప్రత్యేకమైన వ్యాకరణ పదం. ఇక కల్యోజ గురించి – సరిసంఖ్య కాకుండా కలికి అంటే కృతయుగ్మకు బేసిగా ఉండే ప్రత్యేక బేసి సంఖ్యను 'కల్యోజ' అన్నారు. నాలుగు చేత విభాజ్యమైనప్పుడు పూర్తిగా విభాజ్యమయ్యే సంఖ్యలు "కృతయుగ్మ". అంకెల క్రమంలో నాలుగో అంకెను, అదే నాలుగు కాబట్టి నాలుగు చేత విభాజ్యం కానవసరం లేకపోయినా దానినీ కృతయుగ్మగా పిలిచేవారు.

మరో అర్థంలో ఈ పదాన్ని వాడటం గురించి శ్యామశాస్త్రి[1] చెప్పాడు. ఆయన ప్రకారం, వాటి అర్థం ఆ పేర్ల పర్వాలు అంటే కృతపర్వం, త్రేతపర్వం, ద్వాపర పర్వం, కలి పర్వం అని. పర్వం అంటే 15 తిథులు లేదా రోజుల కాలం. దీనినే పక్షం అని అంటారు. మత సంబంధమైన ఆచారాలకు సంబంధించిన కారణాల వల్ల పర్వం ముగిసే ఖచ్చితమైన సమయం చాలా ముఖ్యమైనదిగా భావించేవారు. పర్వాలు అవి ముగిసే సమయాన్ని బట్టి నాలుగు రకాలు అయ్యాయి. అవి (1) సూర్యోదయానికి గాని (2) రోజులోని పాతిక భాగం (ఒక పాదం) దగ్గరగాని (3) రెండు భాగాల (పాదాల) తర్వాతగాని (4) మూడు భాగాల (పాదాల) తర్వాతగాని ముగుస్తాయి. మొదటిదానిని కృతపర్వం అన్నారు. రెండోది త్రేతపర్వం, మూడోది ద్వాపర పర్వం, నాలుగోది కలిపర్వం.

ఒకప్పుడు కలి, యుగ అనే పదాలను ఏ అర్థంలో వాడినప్పటికీ చాలాకాలం నుంచి కలియుగం అనే పదం కాలాన్ని కొలవటానికి హిందూ పద్ధతిలోని ఒక భాగంగా ఉపయోగించారు. హిందువుల ప్రకారం, ఒక కాలచక్రం ఉంటుంది. అందులో నాలుగు యుగాలు ఉంటాయి, అందులో కలియుగం ఒకటి, మిగిలిన యుగాలు కృత, త్రేత, ద్వాపర.

## II

ప్రస్తుత కలియుగం ఎప్పుడు ప్రారంభమైనది? ఈ ప్రశ్నకు రెండు వేరు వేరు సమాధానాలున్నాయి.

వైవస్వత మనువు కుమారుడైన నాభ నేదిష్టతో కలియుగం ప్రారంభమైందని ఐతరేయ

1 Shamshastry Drapsa, పుటలు 92-93.

బ్రాహ్మణం చెబుతున్నది. మహాభారత యుద్ధం ముగిసిన తర్వాత. కృష్ణుని మరణంతో కలియుగం ప్రారంభమైనదని పురాణాలు చెబుతున్నాయి.

కలియుగం క్రీ.పూ. 3101 సంవత్సరంలో ప్రారంభమైందని డా॥ శ్యామశాస్త్రి లెక్కవేసి చెప్పారు. గోపాల అయ్యర్ అమిత జాగ్రత్తతో లెక్కించి మరొక లెక్క రూపొందించారు. ఆయన పరిశీలన ప్రకారం క్రీ.పూ. 1194 సంవత్సరం అక్టోబరు 14న ప్రారంభమై అక్టోబరు 31న మహాభారత యుద్ధం ముగిసినది. ఆయన వివరణ ప్రకారం యుద్ధం ముగిసిన 16 సంవత్సరాల అనంతరం కృష్ణుడు మరణించాడు. పరీక్షిత్తు తన పదహారవయేట సింహాసనాన్ని అధిష్టించిన వెంటనే పాండవులు మహాప్రస్థానం చేశారనీ, అదేరోజు కృష్ణుడు మరణించాడనీ వీటిమీద తన వివరణను ఆధారం చేసుకొన్నాననీ అయ్యర్ పేర్కొన్నారు. క్రీ.పూ. 1177లో కలియుగం ప్రారంభమైనదని దీని వల్ల అనుకోవాలి.

దీనితో మనకు కలియుగం ప్రారంభమైన రెండు వేరు వేరు సంవత్సరాలు అంటే క్రీ.పూ. 3101, క్రీ.పూ. 1177 తెలుస్తున్నాయి.

ఇది కలియుగానికి సంబంధించిన మొట్టమొదటి చిక్కుముడి. ఒకే యుగ ప్రారంభానికి సంబంధించి రెండు పరస్పర విరుద్ధమైన సంవత్సరాలను పేర్కొన్న వ్యాఖ్యలు మనకు కనిపిస్తాయి. క్రీ.పూ. 3101 అనేది కలియుగం ఆరంభమైన ఏడు కాదని, అది 'కల్పం' ప్రారంభమైన రోజేనని, వ్రాతప్రతిని వ్రాసిన వ్యక్తి కల్పానికి బదులు పొరపాటున కలిగా వ్రాశాడని ఒక వివరణ ఉంది. శ్యామశాస్త్రి మరో వివరణ ఇచ్చారు. దీని ప్రకారం గుర్తింపు పొందిన కలియుగ శకాలు రెండు ఉన్నాయి. ఒకటి క్రీ.పూ. 3101లోను, ఇంకొకటి క్రీ.పూ. 1260 లేదా క్రీ.పూ. 1240లో ప్రారంభమైనదని ఆయన పేర్కొన్నారు. మొదటి శకం 1840 లేదా 1860 ఏళ్ళు కొనసాగి, గతించి (ముగిసి) పోయింది.

## III

కలియుగం ఎప్పుడు అంతం అవుతుంది? అశోకుని అనంతరం రాజ్యాధికారానికి వచ్చిన నాలుగవ రాజు శాలిసుక మౌర్యుని గురించి చెబుతూ భారతదేశానికి చెందిన గొప్ప ఖగోళశాస్త్రజ్ఞుడు గర్గాచార్య ఈ ప్రశ్నపై చేసిన పరిశీలనలు కింది విధంగా ఉన్నాయి.

"అజేయ పరాక్రమంగల గ్రీకులు సాకేత పాంచాల దేశాన్ని, మధురను జయించి, కుసుమధ్వజ (పాట్నా) చేరుకుంటారు.........."

"పుష్పపురంలోని అన్ని రాష్ట్రాలను లోబరచుకోవడం వల్ల అది నిస్సంశయంగా అతలాకుతలం అవుతుంది. ఓటమి నెరుగని గ్రీకులు మధ్యలోనే నిలిచిపోరు, వారి మధ్య క్రూరమైన, భీతి గొలిపే యుద్ధం జరుగుతుంది. యుగాంతంలో గ్రీకుల వినాశనం తర్వాత ఔధ దేశాన్ని బలవంతులైన ఏడుగురు రాజులు పరిపాలిస్తారు."

"యుగాంతంలో", "గ్రీకుల వినాశనం తర్వాత" అనేవి దీనిలో ముఖ్యమైన పదాలు. ఈ పదాలు రెండు ప్రశ్నలను లేవనెత్తుతాయి. (1) గర్గుని మదిలో ఉన్న యుగం ఏమిటి? (2) భారతదేశంలో గ్రీకుల ఓటమి వినాశనం ఎప్పుడు జరిగినాయి? ఈ ప్రశ్నల సమాధానాలు ఇప్పుడు సందేహాస్పదంగా లేవు. యుగం అంటే కలియుగమనీ గ్రీకుల వినాశనం, ఓటమి క్రీ.పూ. 165 ప్రాంతంలో జరిగిందనీ ఆయన ఉద్దేశ్యం. వాస్తవాల నుంచి ఊహించినది ఏదో కాదు ఇది.

ఆటవిక శాక్యులు, యవనులు భరతవర్షాన్ని నాశనం చేస్తారని మహాభారతంలోని వన (అరణ్య) పర్వంలోని 188, 190 అధ్యాయాలలో సూటిగా వివరణలున్నాయి. ఈ రెండు వాఖ్యానాలను కలిపి చూస్తే తేలే ఫలితం ఏమిటంటే కలియుగం క్రీ.పూ. 165లో ముగుస్తుందని. ఈ నిర్ణయానికి బలం చేకూర్చేది, మరొక వాదం ఉన్నది. మహాభారతం ప్రకారం కలియుగం అంటే వెయ్యి ఏళ్ళ కాలం. కలియుగం క్రీ.పూ. 1171లో ప్రారంభమైందని మనం ఒప్పుకుంటే దానిలో నుంచి వెయ్యేళ్ళు తీసివేస్తే, అప్పుడు కలియుగం క్రీ.పూ. 171వ సంవత్సరంలో అంతమయిందనే విషయాన్ని ఒప్పుకోకుండా ఉండలేము. కలియుగాంతంలో ఒక చారిత్రక విషయం జరుగుతుందని గర్గుడు చెప్పిన విషయానికి ఇది ఏమంత దూరంలో లేదు. కాబట్టి ముఖ్య జ్యోతిష శాస్త్రజ్ఞుడు కలియుగం 165లో అంతం అయిందని చెప్పిన దాంట్లో అనుమానం ఏమి లేదు. ఏది ఏమైనా వాస్తవ పరిస్థితి ఏమిటి? వైదిక బ్రాహ్మణుల అభిప్రాయం ప్రకారం కలియుగం అనేది ఇంకా అంతం కాలేదు. అది ఇంకా కొనసాగుతున్నది.

ప్రతి హిందువు ఈనాటికీ తాను చేసే పూజ ముందు ప్రకటించుకునే 'సంకల్పం' పదాలలో ఇది స్పష్టమవుతున్నది.

సంకల్పం భావం ఇలా ఉంటుంది. "ఈ పుణ్యతిథిని ఈ ఘడియలో ప్రథమ బ్రహ్మ రెండో పరార్థంలో వైవస్వత మనువు కాలంలో కలియుగంలో, భరతుని రాజ్యమైన భరత వర్షంలోని, జంబూ ద్వీపంలో, ప్రభవతో మొదలై క్షయ లేదా అక్షయతో అంతమయ్యే ఇంకా కొనసాగుతూ ఉన్న అరవై సంవత్సరాల సూర్య చంద్ర పరిక్రమణంలో.......

విష్ణుదేవుడు ఆజ్ఞాపించినట్టుగా, పరిక్రమణలోని (పేరు).... నామ సంవత్సరంలో (సందర్భానుసారంగా దక్షిణ లేదా ఉత్తరాయణంలో), శుక్ల/కృష్ణ పక్షంలో ఈ తిథిన నేను (పేరు) భగవంతుని సంతృప్తి కోసం ఈ క్రతువు (పేరు)ను నిర్వహిస్తున్నాను.

ఖగోళ శాస్త్రజ్ఞుడు కలియుగం అంతమైందని నిర్ధారించినపుడు వైదిక బ్రాహ్మణులెలా కలియుగాన్ని ఇంకా కొనసాగిస్తున్నారనే ప్రశ్నను మాత్రం పరిగణనలోకి తీసుకోవలసి ఉంది. కలియుగం అంటే అసలు ఎంతకాలమో మొదలు మనం నిర్ధారించాలి.

2. క్రోనాలజీ ఆఫ్ ఏన్షెంట్ ఇండియా, పుట 117.

విష్ణు పురాణంలో పేర్కొన్నట్లు కృతయుగం 4000 సంవత్సరాలు, త్రేతాయుగం 3000 సంవత్సరాలు, ద్వాపర యుగం 2000 సంవత్సరాలు, కలియుగం 1000 సంవత్సరాలు అని కాలమానం చెప్పినవారు ప్రకటించారు.

దీనిని బట్టి అసలు కలియుగమనేది కేవలం వెయ్యి సంవత్సరాలు మాత్రమే అని తెలుస్తున్నది. వైదిక బ్రాహ్మణుల గణితాన్ని పరిగణనలోకి తీసుకున్నా కలియుగం ఎప్పుడో అంతం అయి ఉండాలి.

కాని అది అంతం కాలేదు. దానికి కారణం ఏమిటి? కలియుగానికి మొదట ఉన్న కాలాన్ని పొడిగించడం జరిగింది. ఇది రెండు విధాలా జరిగింది. యుగ ప్రారంభానికి, అంతానికి ముందు వెనక సంధ్య, సంధ్యాంశ అనే రెండు కాలాలను కలపడం వల్ల ఇది మొదట జరిగింది. ఇదివరకే ఉదహరించిన విష్ణు పురాణంలోని ఆ భాగంలోనే దీనికి సంబంధించిన ప్రమాణాన్ని చూడవచ్చు. ఆ భాగం ఈ క్రింది విధంగా ఉంది.

"యుగానికి ముందు వచ్చే కాలాన్ని 'సంధ్య' అన్నారు. యుగం తర్వాత వచ్చే కాలాన్ని 'సంధ్యాంశ' అన్నారు. ఇవి సమానమైన కాలాన్ని కలిగి ఉంటాయి. సంధ్య సంధ్యాంశల మధ్య విరామంగా వచ్చేవే కృత, త్రేత తదితర యుగాలు అని అంటున్నారు."

సంధ్య, సంధ్యాంశల కాలాల వ్యవధి ఏమిటి? యుగాలన్నీ ఒకే కాలాన్ని కలిగి ఉంటాయా లేక యుగయుగానికి అవి మారుతుంటాయా! సంధ్య, సంధ్యాంశల కాలాలు ఒకే వ్యవధిలో లేవు. యుగయుగానికి అది మారుతూ ఉంటుంది. క్రింద పేర్కొన్న పట్టిక ద్వారా నాలుగు యుగాలు, సంధ్య సంధ్యాంశలకు సంబంధించిన కొన్ని వివరాలను తెలుసుకోవడానికి వీలవుతుంది.

| మహాయుగ విభాగం | కాలం | తొలి సంధ్య | మలి సంధ్య | మొత్తం |
|---|---|---|---|---|
| కృతయుగం | 4000 | 400 | 400 | 4800 |
| త్రేతాయుగం | 3000 | 300 | 300 | 3600 |
| ద్వాపరయుగం | 2000 | 200 | 200 | 2400 |
| కలియుగం | 1000 | 100 | 100 | 1200 |
| మహాయుగం | | | | 12,000 |

సంధ్య సంధ్యాంశలను కలపడం వలన వెయ్యి ఏళ్ళకు పరిమితం కావలసిన కలియుగం 1200 ఏళ్ళకు పొడిగించబడింది. దీనికి ఒక కొత్త కల్పన అల్లారు. వైదిక బ్రాహ్మణులు యుగాలకు నిర్దేశించిన కాలం వాస్తవానికి దైవ సంబంధమైన సంవత్సరాలనీ మామూలు సంవత్సరాలు కాదనీ ప్రకటించారు. దైవ సంబంధమైన ఒకరోజు ఒక మానవ సంవత్సరంతో సమానమని ప్రకటించారు. దానితో కలియుగం వెయ్యేళ్ళు సంధ్య సంధ్యాంశల 2000

సంవత్సరాలతో కలుపుకొని మొత్తం 1200 సంవత్సరాలు ఉండవలసింది కాస్తా (1200x360) 4,32,000 సంవత్సరాలకు పెరిగిపోయింది.

ఖగోళ శాస్త్రజ్ఞుడు చెప్పిన విధంగా కలియుగాంతాన్ని క్రీ.పూ. 165గా ప్రకటించే బదులు వైదిక బ్రాహ్మణులు ఈ రెండు పద్ధతుల ద్వారా దాని జీవితకాలాన్ని 4,32,000 సంవత్సరాలకు పొడిగించారు. ఫలితంగా కలియుగం నేటికీ కొనసాగుతున్నది. ఇది ఇంకా ఇంకా కొన్ని లక్షల ఏళ్ళ దాకా కూడా కొనసాగుతుందనడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. 'కలియుగానికి అంతమే లేదు.'

## IV

కలియుగం దేని కోసం ఉన్నది? అది దేనికి ప్రతీక? కలియుగం అంటే అధర్మయుగం. నీతి బాహ్యమైన యుగం. రాజ శాసనాలకు విధేయులుగా ఉండవలసిన అవసరం లేని యుగం. అయితే, వెంటనే ఒక ప్రశ్న తలెత్తుతుంది. ముందు యుగాల కంటే కలియుగం ఎందుకు ఇంత ఎక్కువ అవినీతి పాలయింది? ప్రస్తుత కలియుగానికి ముందు ఉన్న యుగాలలో ఆర్యుల నైతిక పరిస్థితి ఎలా ఉండేది? ప్రాచీన ఆర్యుల తరువాత వచ్చిన ఆర్యుల అలవాట్లు, సాంఘిక ఆచారాలను పోల్చి చూస్తే వారి పద్ధతుల్లో నైతిక ప్రవర్తనలలో ఇంచుమించు ఒక సాంఘిక విప్లవం అనేటంత బ్రహ్మాండమైన అభివృద్ధి కనిపిస్తుంది.

వైదిక ఆర్యుల మతం మొత్తం అనాగరికం, బూతు ఆచరణల మయం. నరబలి వారి మతంలో ఒక భాగం. దానిని నరమేధ యజ్ఞం అనేవారు. ఈ క్రతువుకు సంబంధించిన సవివరమైన వర్ణన యజుర్వేద సంహిత, యజుర్వేద బ్రాహ్మణ, సాంఖ్యాయన, వైతాన సూత్రాలలో కనిపిస్తుంది. ప్రాచీన ఆర్యులలో లింగారాధన (శిశ్నపూజ) ప్రబలంగా ఉండేది. లింగపూజను "స్కంభ" అని పిలిచేవారు. దీనిని ఆర్యుల మతంలో భాగంగా గుర్తించారు. ఇది అధర్వవేదం X 7 శ్లోకంలో కనిపిస్తుంది. ప్రాచీన ఆర్యుల మతానికి మచ్చతెచ్చిన మరో బూతు సంఘటన అశ్వమేధ యజ్ఞానికి, అంటే గుర్రం బలికి సంబంధించినది. అశ్వమేధంలో ముఖ్యమైన అంశం ఏమంటే, బ్రాహ్మణ పూజారులు ఎడతెగకుండా మంత్రాలు చదువుతూ ఉంటే, యజమానుని (బలి ఇచ్చేవాని) ముఖ్య భార్య యోనిలో మేధ (చనిపోయిన గుర్రం) లింగాన్ని జొరబెట్టటం. గుర్రం లింగాన్ని యోనిలో పెట్టించుకొనే గౌరవం ఎవరికి దొరుకుతుందా అని రాణులు పోటీ పడుతూ ఉండేవారని వాజసనేయ సంహిత (XXIII 18)లో ఒక మంత్రం తెలుపుతున్నది. దీని గురించి ఇంకా ఎక్కువ తెలుసుకోవాలనుకొనేవారికి యజుర్వేదంపై మహీధరుని వ్యాఖ్యానంలో సమాచారం దొరుకుతుంది. అందులో ఆయన ఈ ఆర్యమతంలో భాగమైన బూతు ఆచార వివరాల పూర్తి వర్ణన ఇచ్చాడు.

ప్రాచీన ఆర్యుల నైతిక ప్రవర్తన వారి మతంకంటే గొప్పగా ఏమీ లేదు. ఆర్యులు జూదరుల జాతికి చెందినవారు. ఆర్యుల నాగరికత తొలి దినాలలోనే, వారు జూదాన్ని ఒక

శాస్త్రంగా అభివృద్ధి చేశారు. పాచికను కూడా కనుక్కొనే వరకూ వెళ్ళి, దానికి కొన్ని సాంకేతిక పదాలను వాడారు. అదృష్టం ఉన్న పాచికను కృత అన్నారు. దురదృష్టకరమైన పాచికను కలి అన్నారు. ఆ రెండింటి మధ్య వచ్చేవి త్రేత, ద్వాపరలు. ప్రాచీన ఆర్యులలో జూదం బాగా అభివృద్ధి చెందటమే కాక పందెం లేకుండా ఆడేవారు కాదు. వారు ఎంత విచ్చలవిడిగా జూదం ఆడేవారంటే జూదాలలో వారికుండే వ్యసనాన్ని పోల్చటానికి ఇంకొకటి ఏమీ లేకుండా పోయింది. జూదంలో రాజ్యాలను, ఆఖరికి భార్యలను కూడా ఒడ్డేవారు. నల మహారాజు తన రాజ్యాన్ని ఒడ్డి, రాజ్యం పోగొట్టుకున్నాడు. పాండవులు ఇంకా ముందుకుపోయారు; వారు రాజ్యాన్ని ఒడ్డడమే కాకుండా భార్య ద్రౌపదిని కూడా ఒడ్డారు. రెండూ పోగొట్టుకున్నారు. ఆర్యులలో జూదం ధనవంతులు మాత్రమే ఆడే ఆట కాదు, ఈ దురలవాటు చాలామందిలో ఉండేది.

ప్రాచీన ఆర్యులు తాగుబోతు జాతికి చెందినవారు కూడా. వారి మతంలో మద్యం చాలా ప్రధానమైన అంశం. వైదిక దేవుళ్లు మద్యం సేవించేవారు. దేవుళ్ల తాగే మద్యాన్ని సోమ అనేవారు. ఆర్యుల దేవుళ్లే మద్యం తాగినపుడు ఆర్యులకు ఇక అందులో శంక ఏమీ లేకుండా పోయింది. నిజం చెప్పాలంటే మద్యం సేవించడం అనేది ఆర్యుల మతంలో ఒక భాగం అయింది. ప్రాచీన ఆర్యులలో అనేకరకాల సోమయజ్ఞాలు ఉండేవి. అందువల్ల దాదాపుగా మద్యం సేవించని రోజంటూ ఉండేది కాదు. సోమపానం ఉన్నతవర్గాలైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు మాత్రమే పరిమితమయింది. అంటే శూద్రులు మద్యం సేవించేవారు కాదని కాదు, వారికి సోమపానం నిషేధం అయినందువల్ల వారు మామూలు బజారులో అమ్మే (పవిత్రం కాని) సురను తాగేవారు. ఆర్యులలో మగవారు మాత్రమే తాగేవారని కాదు, స్త్రీలు కూడా మద్యం సేవిస్తూ ఉండేవారు. నలుగురు లేదా ఎనిమిది మంది ముత్తయిదువులకు బాగా మద్యం ఇచ్చి మంచి భోజనం పెట్టి బాగా మత్తు ఎక్కిన తర్వాత వివాహ కార్యానికి ముందు రాత్రి వారి చేత నాట్యమాడించాలని కౌషితకి గృహ్యసూత్రం(1.11.12) చెబుతున్నది. మత్తు పానీయాలు సేవించే ఈ అలవాటు బ్రాహ్మణేతర స్త్రీలలో మాత్రమే ఉండేదని కాదు, బ్రాహ్మణ స్త్రీలు కూడా దీనికి అలవాటు పడ్డారు. మద్యపానం పాపంగా భావించేవారు కాదు. అది చెడు లక్షణం అని కూడా అనుకొనేవారు కాదు. అది చాలా మర్యాద పూర్వకమైన అలవాటు. ఋగ్వేదం ఏం చెబుతుందంటే :

"మదిర (మద్యం) తాగే ముందు సూర్యుణ్ణి ప్రార్థించాలి" అని.

యజుర్వేదం ఏం చెబుతుందంటే "ఓ సోమదేవుడా! సుర (మద్యం)ను సేవించి బలవంతుడవై శక్తివంతుడవై స్వచ్ఛమైన మద్యంతో దేవతలను సంతృప్తి పరచు; యజ్ఞం చేసిన వ్యక్తికి రుచిగల ఆహారమూ, బ్రాహ్మణ, క్షత్రియులకు శక్తినీ ప్రసాదించు."

మంత్ర బ్రాహ్మణం ఏం చెబుతుందంటే :

"సేవించిన పురుషులు స్త్రీలతో కలిసి పరవశులవుతారో, నీరు మద్యంగా (పురుషుల ఆనందంకోసం) మారుతుందో......"

రాముడు సీత ఇద్దరూ మద్యం సేవించేవారని రామాయణం ఒప్పుకుంటుంది. ఉత్తరకాండ ఏం చెబుతుందంటే :

ఇంద్రుడు తన భార్య శచిపట్ల చేసినట్టుగానే, రామచంద్రుడు తన భార్య సీత చేత శుద్ధమైన తేనె నుంచి చేసిన మద్యం తాగించాడు. సేవకులు రామచంద్రునికి మాంసం, మధుర ఫలాలు తెచ్చి ఇచ్చారు."

కృష్ణుడు, అర్జునుడు కూడా అదే విధంగా చేశారు. మహాభారతంలోని ఉద్యోగపర్వంలో సంజయుడు ఇలా అంటాడు :

"తేనె నుంచి చేసిన మద్యం సేవిస్తూ,, పరిమళాలు అద్దుకొని, పూల మాలలతో అలంకృతులై కృష్ణుడు, అర్జునుడు, వజ్రవైడూర్య ఖచితమైన సువర్ణ సింహాసనం మీద కూర్చున్నారు. శ్రీకృష్ణుని పాదాలు అర్జునుని ఒడిలోను, అర్జునుని పాదాలు ద్రౌపది సత్యభామల ఒడిలోనూ (ఉండటం) నేను చూశాను."

స్త్రీ పురుషుల వైవాహిక సంబంధాలు ఎలా ఉండేవో తరువాత పరిశీలిద్దాం. చరిత్ర ఏం చెబుతున్నది? మొదట ఆర్యులలో వివాహ శాసనం ఏదీ లేదు. సమాజంలోని ఉన్నత, నిమ్న వర్గాలు రెండూ మొత్తం సంకర సంబంధాలతో నిండి ఉండేది. పెళ్లి విషయాలలో నిషేధం ఏదీ లేదు. ఈ దిగువ సంఘటన ఆ విషయం తెలుపుతున్నది.

బ్రహ్మ తన స్వంత కూతురు శతరూపను పెళ్లి చేసుకున్నాడు. ఇక్ష్వాక, ఐలిన వంశాల స్థాపనకు ముందు ఉన్న పృధు వంశాన్ని స్థాపించిన మనువు వారి కుమారుడే.

హిరణ్యాకశిపుడు తన కూతురు రోహిణిని పెళ్లి చేసుకున్నాడు. తండ్రి కూతురుని పెళ్ళి చేసుకున్న ఇతర ఉదంతాలలో వశిష్ఠుడు శతరూపను, జహ్నువు జాహ్నవిని, సూర్యుడు ఉషను చేసుకోవటం కొన్ని. తండ్రీకూతుళ్ల మధ్య అటువంటి పెళ్లిళ్లు జరగటం సామాన్యమైన విషయం అనేది కానీనుడైన కొడుకును గుర్తించే సాంప్రదాయాన్ని బట్టి తెలుస్తుంది. కానీనుడు అంటే కన్యకు (పెళ్లికాని కూతురికి) పుట్టినవాడు అని అర్థం. వారు చట్టం దృష్టిలో ఆ కూతురి తండ్రికి పుట్టినవారు. అంటే తండ్రి ఆ కూతురికి పుట్టించినవారనే అర్థమవుతుంది.

తండ్రీ కొడుకులు ఒకే స్త్రీని సంభోగించిన ఉదంతాలు చాలా ఉన్నాయి. బ్రహ్మ కొడుకు మనువు, మనువు తల్లి శతరూప. ఈ శతరూప మనువు భార్య కూడా. శ్రద్ధ సంగతి మరొక ఉదంతం. ఈమె వివస్వతుని భార్య. వారి కుమారుడు మనువు. కాని శ్రద్ధ కూడా మళ్లీ మనువు భార్య. ఈ విధంగా తండ్రీ కొడుకులు ఒకే స్త్రీని పంచుకోవటం అనే ఆచారం ఉండేది. సోదరుని కూతురిని పెళ్లి చేసుకోవటం కూడా ఉండేది. దక్షుని కుమార్తెలు పదిమందిని

ధర్ముడు పెళ్లి చేసుకున్నాడు. ధర్ముడు, దక్షుడు అన్నదమ్ములు. పెదతండ్రి పినతండ్రి కూతుళ్లను పెళ్లి చేసుకోవటం కూడా ఉండేది. కశ్యపునికి పదముగ్గురు (13) భార్యలుండేవారు. వారందరూ దక్షుని కుమార్తెలు, దక్షుడేమో కశ్యపుని తండ్రి మరీచికి సోదరుడు.

ఋగ్వేదంలో చెప్పిన యమ-యమి సంవాదం ఎంతో ప్రఖ్యాతి చెందింది. అన్నాచెల్లెళ్ల మధ్య వివాహాల విషయంలో ఇది చాలా సమాచారాన్ని అందిస్తుంది. యముడు యమితో సంభోగించటానికి నిరాకరించాడన్నంత మాత్రాన అటువంటి వివాహాలు జరగలేదు అని అనటానికి వీల్లేదు.

మహాభారతం ఆదిపర్వంలో బ్రహ్మదేవునితో మొదలైన వంశవృక్ష వివరణ ఉంది. ఈ వంశవృక్షం ప్రకారం బ్రహ్మదేవునికి మరీచి, దక్షుడు, ధర్ముడు అనే ముగ్గురు కొడుకులు, ఒక కూతురు ఉండేవారు. దురదృష్టం కొద్దీ ఈ కూతురి పేరు వంశవృక్షంలో ఇవ్వలేదు. ఇదే వంశవృక్షంలో దక్షుడు బ్రహ్మ కూతుర్ని అంటే తన సోదరిని పెళ్లి చేసుకున్నట్టు ఉన్నది. వారికి చాలామంది యాభై నుంచి అరవై వరకూ కూతుళ్లు పుట్టారు. అన్నాచెల్లెళ్ల మధ్య జరిగిన పెళ్లిళ్ల ఉదంతాలు కొన్ని ఇంకా ఇవ్వవచ్చు. అవి : పూష, అతని సోదరి; అచ్ఛోద, అమావసు. పురు కుత్సుడు, నర్మద; విప్రచితి-సింహిక; నహుషుడు-విరజ; శుక్రుడు (ఉశనసుడు)-గో; అంమంతుడు-యశోద; దశరధుడు-కౌసల్య; రాముడు-సీత; శుకుడు-పీవరి; ద్రౌపది - ప్రస్తి(ష్టి) ఇవన్నీ కూడా అన్న చెల్లెల్ని పెళ్లి చేసుకున్న సందర్భాలే.

కొడుకు తల్లితో సంభోగించటంలో నిషేధం ఏదీ లేదని ఈ క్రింది ఉదంతాలు తెలుపుతాయి. పూష; అతని తల్లి; మనువు-శతరూప; మనువు-శ్రద్ధ; మరో రెండు ఉదంతాలు కూడా పరికించవలసి ఉంటుంది. అర్జునుడు-ఊర్వశి, అర్జునుడు-ఉత్తర. అర్జునుని కుమారుడైన అభిమన్యుడు తన 16వ ఏటనే ఉత్తరను పెళ్లి చేసుకున్నాడు. ఉత్తరకు అర్జునునితో సంబంధం ఉండేది. అతడు ఆమెకు సంగీతం, నాట్యం నేర్పించేవాడు. ఉత్తర అర్జునుని ప్రేమించిందని ఆ ప్రేమ ఫలితంగా వారిద్దరికీ వివాహం జరగటం సాధారణ విషయమే అనీ మహాభారతం చెబుతుంది. వారిద్దరికీ వాస్తవంగా వివాహం జరిగిందని మహాభారతం ఎక్కడా చెప్పటంలేదు. కాని వారికి పెళ్లి గనక జరిగిఉన్నట్లయితే అభిమన్యుడు తల్లిని పెళ్లి చేసుకున్నట్టు అవుతుంది. ఊర్వశి అర్జునుల కథ ఈ అంశంలో ఇంకా రూఢిగా ఉంది.

ఇంద్రుడు అర్జునుడికి స్వయాన తండ్రి. ఊర్వశి ఇంద్రుని ఉంపుడుగత్తె, అంటే అర్జునుడికి తల్లితో సమానం. ఆమె అర్జునుడికి గురువు. అతనికి సంగీతం, నాట్యం నేర్పిందామె. ఊర్వశి అర్జునుడిని మోహించి, అతనితో లైంగిక సంపర్కం కోసం అతని తండ్రి అయిన ఇంద్రుని అనుమతి తీసుకొని అర్జునుడి దగ్గరకు వెళ్లింది. ఆమె తన తల్లితో సమానం కాబట్టి అర్జునుడు అందుకు ఒప్పుకోలేదు. అర్జునుడి తిరస్కారం కంటే ఉర్వశి ప్రవర్తనకు చారిత్రకంగా ఎంతో ప్రాధాన్యత ఉన్నది. దీనికి రెండు కారణాలున్నాయి. ఊర్వశి అర్జునుడిని

కోరిన కోరిక, దానికి ఇంద్రుడు అంగీకరించటం చూస్తే ఊర్వశి బాగా నెలకొని ఉన్న ఒక సంప్రదాయం ప్రకారం వ్యవహరించిందని తెలుస్తుంది. రెండోదేమంటే, ఊర్వశి అర్జునుడికి సమాధానం ఇస్తూ, ఇది అందరూ అంగీకరించిన ఆచారమే అనీ, అతని తాతముత్తాతలందరూ ఎటువంటి అపరాధ భావంగాని లేకుండా అటువంటి ఆహ్వానాలను అంగీరించారనీ చాలా సూటిగా చెబుతుంది.

ప్రాచీన భారతదేశంలో భార్యాభర్తలుగా జీవించటానికి రక్త సంబంధాన్ని ఏ మాత్రమూ పట్టించుకోలేదని చెప్పటానికి, హరివంశం రెండో అధ్యాయంలో ఉదహరించిన కథ కంటే వేరే దృష్టాంతమూ ఎక్కువ చెప్పలేదు. దీని ప్రకారం, సోమునికి పదిమంది తండ్రులుండేవారు – ఇది ఏమి సూచిస్తుందంటే బహు భర్తృత్వ ఆచారం ఉండేదని వారిలో ఒక్కొక్కరిని ప్రచేత అనేవారు. సోమునికి 'మారిష' అనే కుమార్తె ఉండేది. సోముని తండ్రులు పదిమందీ, సోముడూ అందరూ మారీషతో సంభోగించారు. అంటే ఒక మనుమరాలిని, ఆమె తాతలు పదిమంది, తండ్రి తన కూతురునూ పెళ్లి చేసుకున్న సందర్భం ఇది. ఇదే అధ్యాయంలో దక్ష ప్రజాపతి కథ చెప్పాడు. సోముని కుమారుడైన దక్ష ప్రజాపతి తన 27 మంది కుమార్తెలను గర్భధారణ కోసం తన తండ్రికి అప్పగించాడు. హరివంశం మూడో అధ్యాయంలో గ్రంథకర్త ఏం చెబుతాడంటే దక్షుడు తన కుమార్తెను స్వయానా తన తండ్రి అయిన బ్రహ్మకిచ్చి పెళ్లి చేశాడు. బ్రహ్మ వలన ఆమెకు ఒక కొడుకు పుట్టాడు. అతనే ఎంతో ప్రఖ్యాతి గాంచిన నారదుడు. ఇవన్నీ కూడా సపిండ పురుషులు, సపిండ స్త్రీలతో సంభోగించిన సందర్భాలే.

ప్రాచీన ఆర్య స్త్రీలు అమ్ముడు పోతుండేవారు. కూతుళ్ల అమ్మకం ఆర్ష వివాహ పద్ధతి ద్వారా తెలుస్తున్నది. వ్యవహారంలో ఉండిన సాంకేతిక పదాలనుబట్టి, అబ్బాయి తండ్రి గో–మిథునం ఇచ్చి అమ్మాయిని తీసుకొనేవాడు. గో–మిథునం అంటే ఒక ఆవు, ఒక ఎద్దు. ఇది అమ్మాయికి సమంజసమైన ధర అనుకొనేవారు. తండ్రులు కూతుళ్లను అమ్ముకోవటమే కాకుండా, భర్తలు భార్యలను అమ్ముతుండేవారు. హరివంశం 79వ అధ్యాయం పుణ్యక వ్రతం అనే మత సంబంధమైన క్రతువును గురించీ పూజచేసే పూజారికి ఇవ్వవలసిన రుసుమును గురించీ వర్ణిస్తున్నది. బ్రాహ్మణుల భార్యలను వారి భర్తల నుంచి కొని పూజ చేసే పూజారికి రుసుముగా ఇవ్వాలని అది చెబుతున్నది. బ్రాహ్మణులు తమ భార్యలను ఇష్టపూర్వకంగా ఏదో ఒక ధరకు అమ్ముకొనేవారని దీని నుంచి స్పష్టమవుతున్నది.

ప్రాచీన ఆర్యులు తమ భార్యలను సంభోగం కోసం అద్దెకిచ్చే వారనేది కూడా వాస్తవమే. మహాభారతంలో 103, 123 అధ్యాయాలలో మాధవి జీవితం గురించి ప్రస్తావన ఉన్నది. ఈ కథనం ప్రకారం మాధవి, యయాతి రాజు కూతురు. యయాతి ఆమెను గాలవునికి కానుకగా ఇచ్చాడు. గాలవుడు ఒక ఋషి. అతనికి రుసుముగా ఆమెనిచ్చారు. గాలవుడు ఆమెను వరుసగా ముగ్గురు రాజులకు అద్దెకిచ్చాడు. కొడుకును కనేంత వరకూ ఆమె

ఒక్కొక్కరి దగ్గర ఉండాలి. మూడోరాజు దగ్గర కూడా అలా నియమం తీరిపోయిన తర్వాత గాలవుడు మాధవిని తన గురువు అయిన విశ్వామిత్రునికి అప్పగించాడు. అతడు ఆమెను భార్యగా చేసుకున్నాడు. విశ్వామిత్రుడు ఆమెను ఒక కొడుకు పుట్టేవరకూ ఉంచుకొని తిరిగి గాలవునికి ఇచ్చేశాడు. గాలవుడు ఆమెను ఆమె తండ్రి యయాతికి వాపసు చేశాడు.

ప్రాచీన ఆర్య సమాజంలో బహు భార్యాత్వం, బహు భర్తృత్వం చాల విరివిగా అమలులో ఉండేవి. అవి ఉండేవని దృష్టాంతాలు చెప్పి నిరూపించవలసిన అవసరం లేనంతగా అందరికీ తెలిసిన విషయాలవి. కాని సంకర సంబంధాలుండేవనే విషయం అంతగా తెలియనట్టిది. నియోగ పద్ధతిని పరిశీలిస్తే స్త్రీ పురుష సంబంధాలలో సంకర వ్యవహారం ఎంత తరచుగా ఉండేదో స్పష్టమవుతుంది. వివాహిత స్త్రీ తన భర్త నుండి కాక వేరే పురుషుని ద్వారా సంతానం కనే పద్ధతికి ఆర్యులు పెట్టుకున్న పేరు నియోగం. దీనిని అదుపులో పెట్టలేకపోయారు కాబట్టి దీనివల్ల మొత్తం అంతా సంకర వ్యవహారం అయిపోయింది. అసలు మొదట ఒక స్త్రీ ఎన్నిసార్లు నియోగం చేసుకోవచ్చునో పరిమితి పెట్టలేదు. "మధూతి"ని ఒక్క నియోగమే చేసుకోమని అనుమతించారు. "అంబిక"కు వాస్తవంగా ఒక్క నియోగానికే అనుమతించినా రెండోది ప్రతిపాదించారు. 'శార దాండాయని' తన భార్యను మూడు నియోగాలకు ప్రతిపాదించాడు. పాండురాజు తన భార్య "కుంతి"ని నాలుగు నియోగాలకు అనుమతించాడు. "వ్యుషితాశ్వ"కు ఏడు నియోగాలకు అనుమతి దొరికింది. వాలి 17 నియోగాల వరకూ భార్యలను అనుమతించాడు, పదకొండేమో మొదటి భార్య మీద, ఆరేమో రెండో భార్య మీద. నియోగాలపై పరిమితి లేనట్లే ఏ సందర్భాలలో నియోగం చేసుకోవచ్చునో అనేది కూడా నిర్దిష్టంగా లేదు. నియోగం భర్త బ్రతికి ఉన్న కాలంలోనే జరుగుతుండేది, పుట్టుకతోనే అతనికి పిల్లల్ని పుట్టించే శక్తి లేకపోవటం వల్లనే దీనిని అంగీకరించేవారనేది కూడా కాదు. తొలి ప్రయత్నం బహుశా భార్య నుండి వచ్చేది. పురుషుణ్ణి ఎన్నుకొనే అవకాశం ఆమెకే విడిచిపెట్టారు. ఎవరితో నియోగం ఆచరించాలో అతనినే తిరిగి ఎంచుకుంటే ఎన్నిసార్లు ఆచరించవచ్చునో అనేది ఆమె ఇష్టమే. స్త్రీ పురుషులు ఒకరితో ఒకరు అక్రమ సంబంధాలు పెట్టుకొని ఒక రాత్రిగాని లేదా పన్నెండు సంవత్సరాలు గాని ఇంకా అంతకు మించిన సమయంగాని గడపటానికి మారుపేరు ఈ నియోగాలు. ఇది భర్త ఇష్టంతోనే జరుగుతుంటుంది. అతడు ఈ వ్యభిచార వ్యాపారంలో నిష్క్రియా భాగస్వామిగా మాత్రమే ఉంటాడు.

ఇవీ ప్రాచీన ఆర్య సమాజపు సామాన్య మానవుని పద్ధతులూ, నైతిక ప్రవర్తనా. బ్రాహ్మణుల నైతిక ప్రవర్తన ఎలా ఉండేది? అది సామాన్య మానవుని కంటే గొప్పగా ఏమీ లేదనేది పరమ సత్యం. బ్రాహ్మణుల నైతిక ప్రవర్తన చాలా విచ్చలవిడిగా ఉండేదని చెప్పటానికి నిదర్శనాలు చాలా ఉన్నాయి. మచ్చుకు కొన్ని చాలు : బ్రాహ్మణులు తమ భార్యల్ని అమ్ముకున్న సందర్భాలు పైన వివరించటం జరిగింది. విచ్చలవిడితనానికి కొన్ని నిదర్శనాలు ఇస్తాను. ఉతంకుడు (మూడవ) జనమేజయుని పురోహితుడైన వేదుని శిష్యుడు. వేదుని భార్య

ఉతంకుని తన భర్త స్థానంలో తన దగ్గరకు రమ్మని చాల మామూలుగా కోరుతుంది. ఉద్దాలకుని భార్య విషయం కూడా ఈ సందర్భంగా ఉదహరించుకోవచ్చు. తన ఇష్టప్రకారంగా గాని తనకు కోరినపుడట గాని ఇతర బ్రాహ్మణుల వద్దకు వెళ్లే స్వేచ్ఛ ఆమెకు ఉన్నది. భర్త శిష్యులలో ఒకని ద్వారా ఆమెకు పుట్టినవాడే శ్వేతకేతు. ఇవి చంచల స్వభావానికీ, వ్యభిచారానికీ సంబంధించిన సంఘటనలు కావు. ఇవి బ్రాహ్మణ స్త్రీలకు అనుమతించబడిన సక్తింపు పొందిన స్వేచ్ఛావకాశాలు. జటిల గౌతమి ఒక బ్రాహ్మణ స్త్రీ. ఆమెకు ఏడుగురు భర్తలుండేవారు. వారందరూ ఋషులే. అయిదుగురు భర్తల మధ్య ఉన్న ద్రౌపదిని, ఏడుగురు భర్తలతో ఉండిన జటిల గౌతమితో పోల్చి పుర స్త్రీలు ఆమెను మెచ్చుకొనేవారని మహాభారతం చెబుతున్నది. మమత ఉతథ్యుని భార్య. బృహస్పతి ఉతథ్యుని సోదరుడు. ఉతథ్యుడు బ్రతికి ఉన్న కాలంలోనే బృహస్పతి మమత దగ్గరకు చాలా స్వేచ్ఛగా వెళ్తుండేవాడు. ఒక్కసారి మాత్రం మమత దానికి అభ్యంతరం తెలిపింది. ఎప్పుడంటే ఆమె గర్భవతిగా ఉన్నపుడు అంతేకాని, తన దగ్గరకు బృహస్పతి రావటం ఉచితం కాదనీ, ధర్మ సమ్మతం కాదనీ (ఆ కారణంగా) కాదు.

ఈ రకమైన ప్రవర్తన (నీతిమాలినతనం) బ్రాహ్మణులలో ఎంత సర్వసాధారణంగా ఉండేదంటే ఒకసారి దుర్యోధనుడు ద్రౌపదికి బహు భర్తృత్వం ఉండటం వల్ల ఆమెను 'ఆవు' అని అన్నాడు. దానికామె తన భర్తలు బ్రాహ్మణులుగా పుట్టనందుకు విచారిస్తున్నాని సమాధానం చెప్పింది.

ఋషులు ఎంత నీతిమంతులో పరిశీలిద్దాం. ఏం కనిపిస్తుంది మనకు?

ఋషులలో మొదట మనకు కనిపించేది పశుప్రాయత ఎక్కువగా ఉండటం. విభాండక ఋషి సంగతి ముందు చూద్దాం. విభాండకుడు ఆడలేడితో సంభోగించాడనీ, ఆ ఆడ లేడి అతనికి ఒక కొడుకును కన్నదని, అతనే ఋష్యశృంగుడనీ మహాభారతం వన (అరణ్య) పర్వం 100వ అధ్యాయంలో ఉన్నది. మహాభారతం ఆదిపర్వం ఒకటి, 118 అధ్యాయాలలో, పాండవుల తండ్రి పాండురాజు 'దమ' (కిందముడు) అనే 'ఋషి' చేత శాపం ఎలా పొందాడో వర్ణించి ఉన్నది. వ్యాసుడు ఏం చెబుతాడంటే ఒకసారి దమ ఋషి అడవిలో ఒక ఆడలేడితో సంభోగిస్తున్నాడు. అది జరుగుతున్నపుడు ఋషి తన కార్యం పూర్తి చేసుకోకముందే, పాండురాజు వారిపై బాణం వేశాడు. దాని ఫలితంగా దమ ఋషి చనిపోయాడు. కాని చనిపోక ముందు, పాండురాజు భార్యను తాకటానికి వెళ్తే తక్షణం చనిపోతాడని శపించాడు. అయితే ఈ సంఘటనను మరోరకంగా చెప్పారు. ఋషి అతని భార్య లేడి రూపాలలో పరిహాసాలాడు కుంటున్నారని చెప్తూ దమ ఋషి పశుప్రాయత్వాన్ని కప్పిపుచ్చటానికి వ్యాసుడు ప్రయత్నం చేశాడు. ప్రాచీన భారతీయ మత వాఙ్మయాన్ని శ్రద్ధగా ఎవరైనా పరిశీలిస్తే పశువులతో ఋషులు సంభోగించిన సంఘటనలు దొరకటం కష్టం ఏమీ కాదు.

ఋషులకు సంబంధించిన మరొక హేయమైన ఆచారం ఏమిటంటే, స్త్రీలతో బహిరంగంగా, జనం అంతా చూస్తూ ఉండగా సంభోగించటం. మహా భారతం ఆదిపర్వం 63వ అధ్యాయంలో, పరాశర మహర్షి ఒక బెస్తపిల్ల సత్యవతి (మత్స్యగంధి) తో ఎలా లైంగిక సంపర్కం పెట్టుకున్నాడో వివరంగా ఉన్నది. బహిరంగంగా అందరూ చూస్తుండగా ఆమెతో అతను సంభోగించాడని వ్యాసుడు చెప్తాడు. ఆది పర్వం 104వ అధ్యాయంలో అలాంటిదే మరో సంఘటన ఉన్నది. దీర్ఘతమస్ అనే ఋషి ఒక స్త్రీతో అందరూ చూస్తుండగా సంభోగించాడని అందులో ఉన్నది. మహాభారతంలో అటువంటి సంఘటనలు ఎన్నో ఉన్నాయి. వాటితోటి ఈ కథనాన్ని పెంపు చేయవలసిన అవసరం లేదు. ఈ అలవాటు సర్వసాధారణంగా ఉండేదని చెప్పటానికి 'అయోనిజ' అనే మాట చాలు. సీత, ద్రౌపది, తదితర ప్రసిద్ధ స్త్రీలను 'అయోనిజ' అని అనే వారని చాలామంది హిందువులకు తెలుసు. 'అయోనిజ' అని అనటంలో వారి ఉద్దేశం ఏమిటంటే శుద్ధమైన గర్భధారణ వల్ల పుట్టిన బిడ్డ అని. శబ్ద లక్షణ వ్యుత్పత్తికి సంబంధించి 'అయోని'కి అర్థం ఇవ్వవలసిన అవసరం ఏమీ కనబడదు. 'యోని' అనే దానికి ధాతువు అర్థం ఇల్లు అని. యోనిజ అంటే ఇంట్లో పుట్టిన, లేదా ఇంట్లో గర్భంలో పడిన శిశువు అని అర్థం. ఇదే ప్రకారం అయోనిజకు శబ్ద లక్షణ సంబంధమైన అర్థం తీసుకుంటే, బహిరంగంగా అందరూ చూస్తూ ఉండగా సంభోగం జరుగుతూ ఉండే ఆచారం వ్యాప్తిలో ఉన్నదనటానికి అది నిదర్శనం అవుతుంది.

రోత పుట్టించే ఋషుల అవినీతి ప్రవర్తన మరొకటి ఛాందోగ్యోపనిషత్తులో ఉంది. ఈ ఉపనిషత్తు ప్రకారం ఏం తెలుస్తుందంటే : ఋషులు ఒక నియమం పెట్టుకున్నారు. వారు యజ్ఞం చేస్తున్నపుడు ఎవరైనా ఋషితో సంభోగించాలనే కోరిక ఎవరైనా స్త్రీ వ్యక్తం చేసినట్లయితే, ఆ ఋషి, వెంటనే, యజ్ఞం పూర్తి కావటానికి ఆగకుండా, ఏకాంత స్థలంలోకి అయినా వెళ్లకుండా, అక్కడే, యజ్ఞ మంటపంలో ఆమెతో సంభోగించాలి. ఋషుల అవినీతి ప్రవర్తనకు అదేదో మత సంబంధమైన ఆచారంగా దానికి విలువ ఇవ్వటానికి ప్రయత్నించారు. దానికి వామదేవ-వ్రతం అని ఒక సాంకేతిక నామం కూడా పెట్టారు. దానినే తిరిగి వామ-మార్గంగా ఆచరించటం మొదలుపెట్టారు.

ప్రాచీన ఆర్యుల పవిత్ర వాఙ్మయంలో ఋషుల నైతిక ప్రవర్తన గురించి మనకు కనబడేది ఇంతేకాదు; వారి నైతిక ప్రవర్తనకు సంబంధించి మరొక దశ గురించి చెప్పటం మిగిలి ఉంది.

ఇతర పురుషుల దగ్గరకు తమ భార్యలను పంపించి మేలి సంతానాన్ని పొందాలనే వాంఛ ప్రాచీన ఆర్యులలో ప్రగాఢంగా ఉన్నట్టు కనిపిస్తున్నది. ప్రాచీన ఆర్యులు, ఋషులను 'మేలిమి సంతానాన్ని పుట్టించే పశువులు'గా భావించేవారు. ఇలా వ్యవహరించిన ఋషుల సంఖ్య చాలా ఎక్కువగానే ఉంది. నిజానికి ఈ అవినీతి ప్రవర్తనతో ఋషులు క్రమబద్ధమైన వ్యాపారం

చేస్తూ ఉండేవారు. వారు ఎంత అదృష్టవంతులంటే రాజులు సైతం వారిని పిలిపించి తమ రాణులకు గర్భధారణ చేయవలసిందిగా కోరేవారు. దేవతల సంగతి[1] ఇపుడు చూద్దాం.

దేవతలు చాలా శక్తివంతమైన, విచ్చలవిడిగా సంచరించే జాతి. ఋషుల భార్యలను కూడా వారు చెరిచేవారు. గౌతముని భార్య అహల్యను ఇంద్రుడు ఏ విధంగా మానభంగం చేశాడో అందరికీ తెలిసిన కథే. వీరు, ఆర్యుల స్త్రీలపై ఎన్ని అవినీతికరమైన అత్యాచారాలు చేశారో చెప్పటానికి వీల్లేదు. చాలా పురాతన కాలంలోనే, ఈ దేవతలు ఒకజాతిగా ఆర్యజాతిపై ఆధిపత్యాన్ని సంపాదించి పెట్టుకున్నారు. ఈ ఆధిపత్యం వల్ల దేవతల కామం తీర్చటానికి ఆర్య స్త్రీలు వ్యభిచారం చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. తన భార్యను ఒకదేవుడు ఉంచుకొని ఆమెకు గర్భధారణ చేస్తే దానిని ఆర్యులు గర్వంగా చెప్పుకొనేవారు. దీని విషయమై మహాభారతంలోను, విష్ణుపురాణం లోనూ ప్రస్తావన ఉన్నది. ఇంద్రుడు, యముడు, నాసత్య (అశ్వినులు), అగ్ని, వాయువు తదితర దేవతల వలన ఆర్య స్త్రీలు కొడుకులను కనేవారు. ఇది చాలా తరచుగా జరగటం చూస్తే, ఆర్య స్త్రీలు, దేవతల మధ్య అక్రమ సంబంధాలు ఎంత విస్తారమైన స్థాయిలో జరిగాయో అని మనకు ఆశ్చర్యం కలుగుతుంది.

కాలక్రమేణా దేవతలు ఆర్యుల మధ్య సంబంధాలు స్థిరపడి, భూస్వామ్య వ్యవస్థగా మారిందని అనిపిస్తుంది. ఆర్యుల నుంచి దేవతలు రెండు వరాలు పొందారు.

మొదటి వరం యజ్ఞం. ఇదేమిటంటే, రాక్షసులు, దైత్యులు, దానవులపై ఆర్యులు చేసే పోరాటాలలో దేవతలు తమని కాపాడుతున్నందుకు ప్రతిఫలంగా ఆర్యులు దేవతలకు అప్పుడప్పుడూ విందు ఇవ్వటం. యజ్ఞమంటే (భూస్వాములలాగా) దేవతలు గుంజుకోవటమే. ఈ రకమైన అర్థాన్ని గ్రహించలేకపోవటానికి కారణం 'దేవ' అనే పదాన్ని ఒక జాతి పేరుగా అనుకోకుండా దేవుని పేరు అనే అర్థంలో వాడటం వల్లనే. ఇది చాలా పెద్ద పొరపాటు, ఏమయినా గాని ఆర్య సమాజపు తొలిదశలో ఈ పొరపాటు జరిగింది.

ఆర్యుల నుంచి దేవతలు సంపాదించిన రెండో వరం ఏమిటంటే, ఆర్య స్త్రీలను ముందుగా వారు అనుభవించే హక్కు.[2] చాలా ప్రాచీన కాలంలోనే దీనిని క్రమబద్ధం చేసేశారు. ఋగ్వేదం X.85.40 లో దీని ప్రస్తావన ఉన్నది. దీని ప్రకారం, ఆర్య స్త్రీని మొదట అనుభవించే

---

1. దేవ అనే సంస్కృత పదానికి ఇంగ్లీషు పదం 'గాడ్' అని మొదట వాడిన అనువాదకుని గురించి ఏం చెప్పాలో తెలియటం లేదు. దీనివల్ల ఎంత ప్రమాదం జరిగిందంటే, వైదిక వాఙ్మయంలో చెప్పిన రీతిలో ఆర్యుల సామాజిక జీవనాన్ని సరిగ్గా అర్థం చేసుకోవటానికి ఇది అడ్డు పడుతున్నది. 'దేవ' అనేది ఒక జాతి పేరు, అనేదానిలో వివాదం ఏదీ లేదు. ఆర్యులు, దస్యులు ఉన్నట్టుగానే రాక్షసులు, దైత్యులు, దానవులు అనేవి కూడా జాతుల పేర్లు. ఈ విషయాన్ని సందేహించకుండా అంగీకరించాలి.
2. దేవతలు ఆర్యుల మధ్య, భూస్వామి–సేవకుల మధ్య ఉన్న విధంగా భూస్వామ్య సంబంధాలు ఉండేవా అనే విషయంపై ఎవరూ పరిశోధన చేసినట్టు లేదు. ఎందుకంటే, దేవతలను మానవజాతిగా పరిగణించలేదు గనుక. ఆర్యుల నుంచి దేవతలు సంపాదించిన వరాలు భూస్వామి తన సేవకుని వద్ద నుంచి తీసుకున్న వరాలలాంటివే, అవి (1) మొదటి ఫలాలు (పంట) (2) మొదటిరాత్రి అనుభవం.

హక్కు సోమునికి, రెండోసారి గంధర్వునికి, మూడోసారి అగ్నికి, నాల్గవసారి ఆర్య పురుషునికి ఉంటుంది. ప్రతి ఆర్య స్త్రీ కూడా ఏదో ఒక దేవునికి తాకట్టు పెట్టబడింది. దీనివల్ల ఆమె రజస్వల కాగానే ఆమెను అనుభవించే హక్కు అతనికి (ఆ దేవునికి) ఉంటుంది. ఆర్యునికి ఆమె నిచ్చి వివాహం చేసే ముందు, తగిన పరిహారం చెల్లించి ఆ దేవుని నుంచి ఆమెను విముక్తి చేయించాలి. ఈ పద్ధతి ఆచరణలో ఉండేదని ఖచ్చితంగా చెప్పటానికి ఆశ్వలాయన గృహ్యసూత్రం 1 వ అధ్యాయం 7వ ఖండికలో ఇచ్చిన వివాహ తంతు వర్ణన చూస్తే తెలుస్తుంది. ఈ సూత్రాన్ని జాగ్రత్తగా, విమర్శనాత్మకంగా పరిశీలిస్తే కనబడేదేమంటే – వివాహ సమయంలో ముగ్గురు దేవతలు అంటే అర్యమ, వరుణ, పూషలు ఆశీనులై ఉంటారు, ఎందుకంటే పెళ్లికూతురును మొదట అనుభవించే హక్కు వారికి ఉన్నది గనుక. పెళ్లి కొడుకు మొదట చేయవలసింది ఏమంటే, ఒక రాతి ఫలకం దగ్గరకు పెళ్లికూతురిని తీసుకువచ్చి ఆమెను అక్కడ నిలబెట్టి 'ఈ రాతిపై నడు, రాయివలె స్థిరంగా ఉండు' అని అంటాడు. ఇది ఎందుకంటే పెళ్లికుమారుడు తాను శత్రువులుగా భావించే ముగ్గురు దేవతల భౌతికాధీనం నుంచి పెళ్లికూతురును విముక్తి చేయటానికి అన్నమాట. దేవతలు ఆగ్రహించి పెళ్లికొడుకు మీదికి లేస్తారు. పెళ్లికూతురు అన్న జోక్యం చేసుకొని వివాదాన్ని పరిష్కరించటానికి ప్రయత్నిస్తాడు. పెళ్లికూతురు మీద దేవతలకు ఉన్న హక్కును కొనుగోలు చేసే ఉద్దేశంతో, అతడు, దేవతలకు ఇవ్వటానికి దంచిన ధాన్యాన్ని తెస్తాడు. పెళ్లికూతురి సోదరుడు ఆమెను దోసిలి పట్టమంటాడు. అపుడు ఆమె దోసిలిలో ధాన్యం పోసి, దానిపై చిలికిన వెన్నను వేసి, ఒక్కొక్క దేవతకు మూడేసిసార్లు అర్పించమని అడుగుతాడు. ఈ అర్పణనే 'అవదానం' అంటారు. దేవతలకు పెళ్లికూతురు ఈ విధంగా అవదానం చేస్తుండగా పెళ్లికూతురు సోదరుడు ఒక ప్రకటన చేస్తాడు, అది చాలా ముఖ్యమైనది. అతడేమంటాడంటే "అగ్ని ద్వారా అర్యమునికి (అర్యమ దేవతకు) ఈ అమ్మాయి అవదానం చేస్తున్నది. అర్యముడు ఈ అమ్మాయిపై తనకున్న హక్కుల్ని వదలుకోవాలి, పెళ్లికొడుకు అధీనంలో జోక్యం కలుగజేసుకోకూడదు." ఇతర ఇద్దరు దేవతలకు కూడా ఇదేవిధంగా పెళ్లికూతురు అవదానం చేస్తుంది, వారి విషయంలో కూడా పెళ్లికూతురి సోదరుడు అదే కోరిక కోరతాడు. అవదానం అయిన తర్వాత అగ్ని చుట్టూ ప్రదక్షిణం ఉంటుంది, దీనినే సప్తపది అంటారు, దీని తర్వాతనే పెళ్లికూతురు పెళ్లికొడుకు మధ్య వివాహం పూర్తి అయి సక్రమ సద్వివాహం అవుతుంది. ఇదంతా ఎన్నో విషయాలను బహిర్గతం చేస్తున్నది. ఆర్యులు దేవతలకు ఎంతగా లొంగిపోయి ఉన్నారో అన్న సంగతి, దేవతల ఆర్యుల నైతిక ప్రవర్తన ఎంతగా దిగజారిపోయిందో అన్న విషయాలనూ తెలియజేస్తున్నది.

హిందూ వివాహంలో సప్తపది అనేది చాలా ముఖ్యమైన అంశం అనీ, అది లేకపోతే అసలు వివాహమే చట్టం దృష్టిలో చెల్లదనీ న్యాయవాదులెరుగుదురు. కాని చాలాకొద్దిమందికి కూడా అదెందుకు అంత ముఖ్యమైనదో తెలియదు. పెళ్లికూతురును మొదటి రాత్రి

అనుభవించే హక్కు కలిగి ఉన్న దేవుడు అవదానంతో తృప్తి చెంది ఆమెను విడిచిపెట్టి వేయటానికి సిద్ధంగా ఉన్నాడా అన్నదానికి ఇది (సప్తపది) పరీక్ష. పెళ్లికొడుకు పెళ్లికూతురును సప్తపది వేసినంత దూరం నడిపించుకుపోవటానికి ఆ దేవుడు అంగీకరించి నట్టయితే, నష్టపరిహారంతో దేవుడు సంతృప్తి చెందాడనే దానికీ, తన హక్కు తీరిపోయిందనీ మరొకని భార్యగా మారటానికి ఆ అమ్మాయికి స్వేచ్ఛ కలిగిందని చెప్పటానికీ తిరుగులేని నిదర్శనం అవుతుంది. ఇంతకుమించి సప్తపదికి మరొక అర్థం ఉండటానికి వీల్లేదు. ప్రతి వివాహంలోను సప్తపది తప్పనిసరి అయిందంటే, సర్వత్రా వ్యాప్తి చెంది ఉన్న ఈ అవినీతి పద్ధతి ఆర్యులలోను దేవతలలోను ఎంతగా వ్యాపించి ఉందో తెలియజేస్తుంది.

కృష్ణుని నైతిక ప్రవర్తన గురించి చెప్పుకోకుండా ఈ పరిశీలన పూర్తి కాదు. కృష్ణుని మరణంతో మొదలైన కలియుగంలో మొదటి నుంచి, అతని నైతిక ప్రవర్తన చాలా ప్రాముఖ్యతను సంతరించుకున్నది. ఇతరులతో పోల్చి చూస్తే కృష్ణుని నైతిక ప్రవర్తన ఎలా ఉంటుంది? కృష్ణుడు తన జీవితాన్ని ఎలా గడిపాడో పూర్తి వివరాలు వేరేచోట ఇవ్వటం జరిగింది. వాటికి మరికొన్ని ఇక్కడ జోడిస్తాను. కృష్ణుడు వృష్ణి (యాదవ) వంశానికి చెందినవాడు. యాదవులు బహు భార్యలు కలిగి ఉండేవారు. యాదవరాజులకు ఎందరో భార్యలు, ఎందరో కుమారులు ఉండేవారు. కృష్ణుడు కూడా ఈ లక్షణానికి దూరంగా లేడు. యాదవ కుటుంబాలు, కృష్ణుని స్వంత కుటుంబం కూడా తండ్రికూతుళ్ల సంబంధం కలిగి ఉండటం అనే మచ్చకు దూరంగా లేరు. యాదవ కుటుంబంలో తండ్రి కూతుర్ని పెళ్లిచేసుకొన్న సందర్భాన్ని మత్స్య పురాణం చెబుతున్నది. మత్స్య పురాణం ప్రకారం, కృష్ణుని పూర్వీకుడైన తైత్తిరి అనే రాజు తన స్వంత కూతుర్నే పెళ్లి చేసుకొని ఆమెకు నలుడు అనే కొడుకుని కన్నాడు. కృష్ణుని కుమారుడు సాంబుని ప్రవర్తనలో కొడుకు తల్లితో సంభోగించటం బయటపడుతుంది. మత్స్య పురాణం ఏమి చెబుతుందంటే, తన తండ్రి అయిన కృష్ణుని భార్యలతో సాంబుడు, అక్రమ సంబంధాలు పెట్టుకొని ఉన్నాడని, అందుకు కృష్ణుడు కోపం చెంది అతనిని, తప్పుచేసిన తన భార్యలనూ శపించాడనీ. మహాభారతంలో కూడా ఈ ప్రస్తావన ఉన్నది. సత్యభామ ద్రౌపదిని, ఆమె అయిదుగురు భర్తలపైన అంత అధికారం కలిగి ఉండటంలో రహస్యం ఏమిటని అడిగింది. మహాభారతం ప్రకారం ద్రౌపది, సత్యభామను ఒంటరిగా సవతి కొడుకులతో మాట్లాడటం గాని ఉండటం గాని చెయ్యవద్దని హెచ్చరించింది. సాంబుని గురించి మత్స్య పురాణం చెప్పిన సంగతి మహాభారతం రుజువు చేస్తున్నది. సాంబుడు ఒక్కడే కాదు అలా చేసింది. అతని సోదరుడు ప్రద్యుమ్నుడు కూడా శంబరుని భార్యా తన పెంపుడు తల్లీ అయిన మాయావతిని పెళ్లి చేసుకున్నాడు.

కృష్ణుని మరణానికి పూర్వం ఆర్య సమాజంలో నైతిక విలువలు అలా ఉండేవి. చరిత్రను స్పష్టమైన యుగాలుగా విభజించి, కృత యుగంలో నైతిక విలువలు ఇలా ఉండేవని, త్రేతాయుగంలో మరోలా ఉండేవని, కృష్ణుని మరణంతో అంతమైన ద్వాపర యుగంలో ఇంకోలా

ఉండేవనీ చెప్పటానికి సాధ్యం కాదు. ఏమయినప్పటికీ ప్రాచీన ఆర్యులకు పురోగామి దృక్పథం ఉన్నదని మనం భావిస్తే, మొట్టమొదటి యుగం అయిన కృతయుగంలో నైతిక విలువలు చాలా చెడ్డగా ఉండేవని, త్రేతాయుగంలో అంత ఏహ్యంగా ఉండేవి కావని, ద్వాపర యుగంలో మరీ అంత ఏహ్యంగా లేవని, కలియుగంలో ఉత్తమంగా ఉన్నాయని చెప్పటం సాధ్యమవుతుంది.

ప్రపంచంలో అన్నిచోట్లా మనం చూస్తున్నట్టుగా మానవ సమాజం సాధారణంగా అభివృద్ధి చెందిన క్రమంలోనే ఇది జరిగిందని చెప్పుకోవటంతో సరిపోదు. ప్రాచీన ఆర్య సమాజం నైతిక దుష్ప్రవర్తనలో దిగజారిపోకుండా, సాహసోపేతమైన సంస్కరణలు చేపట్టటం ద్వారా సాంఘిక దురాచారాలను తీసివేయటంలో నిమగ్నమయింది. దాని చరిత్రే దీనిని వెల్లడిస్తున్నది.

సామాన్య ఆర్యుని దృష్టిలో దేవతలకు ఋషులకు ఎంతో ఉన్నతమైన స్థానం ఉన్నది. పైన ఉన్నవానిని కింద ఉన్నవాడు అనుకరించటం సహజమే. ఉన్నత వర్గాలు ఏమి చేస్తాయో అవే కింది వర్గాలకు ఆదర్శమవుతాయి. దేవతల, ఋషుల, అవినీతి ప్రవర్తనలను సామాన్య ఆర్యులు అనుకరించటం వల్లనే ఆర్య సమాజంలో అంత ఎక్కువగా అవినీతి ప్రవర్తనలు చోటు చేసుకున్నాయి. సమాజంలో ఈ అవినీతిని అరికట్టటానికి ఆర్యుల నాయకులు అత్యంత ప్రాముఖ్యం కలిగిన సంస్కరణలు ప్రవేశపెట్టారు. దేవతల, ఋషుల నడవడి ప్రవర్తనలను ఉదహరించకూడదనీ[1] వాటిని దృష్టాంతాలుగా స్వీకరించకూడదనీ ఆజ్ఞలు జారీ చేశారు. దీనిద్వారా అవినీతికి హేతువును, మూలాన్ని, సాహసోపేతమైన ధైర్యవంతమయిన ఒక్క దెబ్బతో కొట్టివేశారు.

ఇతర సంస్కరణలు కూడా అంత తీవ్రంగానూ ఉన్నాయి. మహాభారతంలో దీర్ఘతముడు, శ్వేతకేతు అనే ఇద్దరు సంస్కర్తల ప్రస్తావన ఉన్నది. వివాహం విచ్ఛిన్నం కాకూడదని విడాకులు ఉండకూడదని శ్వేతకేతు నిర్ధారించాడు. దీర్ఘతముడు రెండు సంస్కరణలు ప్రవేశపెట్టాడని చెపుతారు. బహు భర్తృత్వానికి ఆయన స్వస్తి చెప్పాడు, ఒక స్త్రీ ఒక కాలంలో ఒకే భర్తను కలిగి ఉండాలని ప్రకటించాడు. ఆయన తీసుకువచ్చిన రెండో సంస్కరణ ఏమిటంటే, నియోగాన్ని క్రమబద్ధం చేయటానికి షరతులు విధించాడు. ఈ షరతులలో అత్యంత ప్రధానమైనవి ఇవి:

1) విధవ తండ్రిగాని, సోదరుడుగాని, మామగాని, భర్త సోదరులుగాని, మృతుడైన ఆమె భర్తకు అతని బంధువులకు విద్యనేర్పిన (లేదా యాగం నిర్వహించిన) గురువులను సమావేశపరిచి,

---

1. ఋషుల ప్రవర్తనను ఉదహరించకూడదని, దృష్టాంతంగా స్వీకరించకూడదనే నియమం గౌతమ ధర్మసూత్రాలలో ఉన్నది. 'నదేవ చరితమ చరేత్' అనే శ్లోకం దేవతల నడవడి ప్రవర్తనను దృష్టాంతంగా స్వీకరించకూడదని చేసిన నియమాన్ని తెలుపుతుంది. ఈ శ్లోకం చాలాచోట్ల కనిపిస్తుంది. అయితే దీని మూలం తెలుసుకోవటానికి సాధ్యపడలేదు.

చనిపోయిన భర్తకు వారసుని కనేందుకు ఆమెను నియమించాలి.[1]

బి) బ్రతికి ఉన్న లేదా చనిపోయిన భర్తకు కొడుకులు ఉండకూడదు.

(2) కుటుంబ కూటమిలోని గురువులు, చనిపోయిన భర్తకు సంతానం కనే విషయాన్ని విధవకు అప్పగించాలి. (3) దానికి నియమితుడైన వ్యక్తి భర్త సోదరుడుగాని, అతని పిండుడుగాని, సగోత్రుడుగాని అయి ఉండాలి. లేదా (గౌతముని ప్రకారం) సప్రవరుడు గాని అతని కులానికి చెందిన వ్యక్తిగాని అయి ఉండాలి. (4) ఆవిధంగా నియమితమైన వ్యక్తి విధవ మోహంలో పడకుండా ఒక విధ్యుక్త ధర్మాన్ని నెరవేరుస్తున్నట్లుగా ప్రవర్తించాలి. (5) అందుకు నియమితమైన వ్యక్తి దేహమంతా నెయ్యితోగాని, నూనెతోగాని లేపనం చెయ్యాలి (నారద. స్త్రీ. పుంస. 82) ఆమెతో మాట్లాడకూడదు, ముద్దు పెట్టుకోకూడదు, ఆమెతో శృంగార కేళి జరపకూడదు. (6) ఈ సంబంధం ఒక కొడుకు (కొందరి ప్రకారం ఇద్దరు కొడుకులు) పుట్టేవరకూ కొనసాగాలి. (7) విధవ పురుషుని కంటే చిన్నవయస్సు గలదై ఉండాలి, పెద్ద వయసుగలదిగాని గొడ్రాలుగాని అయి ఉండకూడదు. పిల్లలు పుట్టే వయసు దాటిపోయినది గాని రోగిష్టిదిగాని, విముఖురాలు గాని, గర్భవతిగాని ఉండకూడదు. (బోధా.ధ.సూ. II 2.70, నారద – స్త్రీ. పుంస–83,84), (8) కొడుకు పుట్టిన తర్వాత వారిద్దరూ మామాకోడళ్లుగా భావించుకోవాలి. (మను. IX. 62). ఈ గ్రంథాలు ఇంకా ఏమి స్పష్టం చేస్తున్నాయంటే, పెద్దలు నియమించకుండా బావగాని, మరిదిగాని ఎవరైనా తన వదినతో సంభోగించినా లేదా పెద్దలు నియమించినప్పటికీ ఇతర పరిస్థితులు లేకపోయినప్పుడు (ఉదాః భర్తకు ఒక కొడుకు ఉండటం) వాటి వరుసలు తప్పి చరించినా అది వ్యభిచార నేరం చేసినట్టు లెక్క అవుతుంది."

తమ నైతిక ప్రవర్తనలను మెరుగు పరచుకోవటానికి ప్రాచీన ఆర్యులు ఇతర సంస్కరణలను కూడా చేపట్టిన సందర్భాలున్నాయి. తండ్రీ–కూతురు, అన్న చెల్లెలు, తల్లికొడుకు, తాత మనుమరాలు సంబంధం పెట్టుకోవటం జరగకుండా చూడటం కోసం వివాహం చేసుకోవటానికి కొన్ని నిషేధ సంబంధాలను ప్రవేశపెట్టటం ఇందులో ఒకటి. ఇంకోటి ఏమంటే, గురుపత్నితో శిష్యుడు లైంగిక సంపర్కం పెట్టుకోవటం హీనమైన పాపంగా ప్రకటించటం. జూదాన్ని అరికట్టటానికి చేసిన ప్రయత్నాల గురించి కూడా స్పష్టమైన సాక్ష్యాధారాలున్నాయి. ధర్మ సూత్రాలుగా వ్యవహారంలో ఉన్న ప్రతి గ్రంథంలోనూ, రాజ్యాధికారులు కఠోరమైన శాసనాలు చేయటం ద్వారా జూదాన్ని అరికట్టాలని చెప్పారు. ఆ బాధ్యత రాజు మీద పెట్టిన చట్టాల వివరణలు ఉన్నాయి.

కలియుగం ఆరంభమవటానికి చాలా ముందుగానే ఈ సంస్కరణలను ప్రవేశపెట్టటం జరిగింది. వాస్తవానికి నైతిక ప్రవర్తన దృష్ట్యా కలియుగం చాలా మంచి యుగంగా భావించటం ...ంగా ఉంటుంది. నైతిక విలువలు పడిపోతున్న యుగం అని దానిని పిలవటం ఆధార

1. కాణె. II సంపుటం, భాగం. 1, పుట 601.

రహితమే కాకుండా వాస్తవాలను పూర్తిగా వక్రీకరించటమే అవుతుంది.

## V

కలియుగానికి సంబంధించిన చర్చ మొదటగా ఎన్నో చిక్కు ప్రశ్నలను లేవనెత్తింది. మహాయుగం అనే భావన ఎప్పుడు ఎందుకు బయలుదేరింది? ప్రపంచమంతా భూతకాలంలో ఒక స్వర్ణయుగంగా ఉండేదనే భావన అందరిలోనూ ఉన్నది. కాని భారత దేశంలో ఎక్కడో వేరేచోట స్వర్ణయుగం ఉండేదనే భావనతో మహాయుగం భావన సంతృప్తి చెందుతుంది. ఎక్కడిదో ఎప్పటిదో బంగారు భూతకాలం మళ్లీ తిరిగి వస్తుందనే అనుకుంటున్నారు. ఇక ఎప్పటికీ తిరిగి రాకుండా పోయిందది. కాని మహాయుగం భావనలో ఈ బంగారు భూతకాలం ఎప్పటికీ రాకుండా పోలేదు. కాలచక్రం పూర్తయిన తర్వాత అది తిరిగి వస్తుంది.

రెండో చిక్కు ప్రశ్న ఏమంటే, కలియుగం క్రీ.పూ. 165లో ఎందుకు అంతం కాలేదు? జ్యోతిష శాస్త్రజ్ఞుల ప్రకారం అది అంతం కావలసి ఉండగా దానిని ఎందుకు కొనసాగించారు? మూడో చిక్కు ప్రశ్న ఏమంటే, కలియుగానికి సంధ్య సంధ్యాంశలను చేర్చటం. ఇవి తర్వాత కాలంలో చేర్చినవని తెలుస్తూనే ఉన్నది. ఎందుకంటే విష్ణు పురాణం వాటిని వేరేగా ప్రస్తావిస్తున్నది. అవి మొదట నుంచీ కలియుగం భాగాలే అయితే వాటిని వేరేగా ప్రస్తావించవలసిన పని లేదు, ఈ చేర్పులు ఎందుకు చేశారు? నాలుగో చిక్కుప్రశ్న ఏమంటే, యుగకాలాన్ని లెక్కించటంలో మార్పు తేవటం. మొదట్లో కలియుగ కాలం మానవ సంవత్సరాలన్నారు. తర్వాత అది దేవకాలం అని అనటంతో కలియుగం 1200 సంవత్సరాలు ఉండేది కాస్తా, 4,32,000 సంవత్సరాలకు పెరిగింది. ఇది కల్పనే అని స్పష్టమవుతున్నది. ఎందుకంటే, ఈ లెక్కింపు దేవ సంవత్సరాలలో ఉండటమనేది మహాభారతానికి తెలియదు. ఈ కల్పన ఎందుకు చేశారు? కలియుగాన్ని అనంతంగా పెంచుకు పోవటంలో వైదిక బ్రాహ్మణుల ఉద్దేశం ఏమిటి? ఈ కలియుగ సిద్ధాంతాన్ని కల్పన చేసి, దానిని అనంతంగా పొడిగించటంలో కొందరు శూద్రరాజులను భయపెట్టించి వారి పాలనలో ప్రజలకు నమ్మకం లేకుండా చేసే ఉద్దేశమా ?

అనువాదకులు : బొజ్జా తారకం

కె. రాహుల్

## చిక్కుముడి : 24

# కలియుగం

కాలాన్ని కొలవటానికి హిందువులు అవలంబించిన పద్ధతిలోని అసాధారణ లక్షణం పట్ల ఎవరూ అంత శ్రద్ధ చూపలేదు. వాస్తవానికి, పురాణాలలోని అతి ప్రధానమైన విషయాలలో ఇది ఒకటి. పురాణాల ప్రకారం కాలానికి అయిదు కొలమానాలున్నాయి. (1) వర్షం (2) యుగం (3) మహాయుగం (4) మన్వంతరం (5) కల్పం. వీటి విభాగాలేమిటో చూపటానికి నేను విష్ణు పురాణాన్ని ఉదహరిస్తాను.

'వర్ష'తో పరిశీలన మొదలుపెడదాం. దీన్ని గురించి విష్ణు పురాణం ఇలా వివరిస్తున్నది.[1]

"ఓ మహర్షీ! పదిహేను రెప్పపాట్లు ఒక 'కాష్ఠ', ముప్పై కళలు కలిపి ఒక ముహూర్తం. ముప్పై ముహూర్తాలు కలిపి మర్త్యులకు ఒక పగలు, ఒక రాత్రి. అలాంటి ముప్పైరోజులు (రెండు పక్షాలు) గలది ఒక నెల, ఆరునెలలు కలిపి ఒక అయనం (గ్రహణం దిశగా ఉత్తర లేదా దక్షిణంగా సూర్యుడు పయనించే కాలం) అవుతుంది. రెండు అయనాలతో ఒక సంవత్సరం ఏర్పడుతుంది."

విష్ణుపురాణంలోనే దీని గురించి మరోచోట మరింత విపులంగా వివరించటం జరిగింది.[2]

---

**"కలియుగం చిక్కుముడి" అనే పేరు మీద ఉన్న రెండో వ్యాసం ఇది. మాకు లభ్యమైన ఈ వకలు ప్రతిలో రచయిత దిద్దుబాట్లు గాని మార్పులుగాని చెయ్యలేదు. ఈ అధ్యాయంలో 40 పుటలు ఉన్నాయి. – సంకలనకర్త**

---

1. విల్సన్ 'విష్ణు పురాణం' పుట 22–23.
2. అదే పుస్తకం.

"పదిహేను రెప్పపాట్లు (నిమేషలు) కలిసి ఒక 'కాష్ఠ'. ముప్పై కాష్ఠలు కలిసి ఒక 'కళ', ముప్పై కళలు ఒక ముహూర్తం (నలభై ఎనిమిది నిమిషాలు); ముప్పై ముహూర్తాలు ఒక పగలు, రాత్రి; దినభాగాలు ముందు వివరించిన విధంగా ఎక్కువ, తక్కువలు కావచ్చు. కాని సంధ్యాకాలం మాత్రం ఆ ఎక్కువ తక్కువలలోనూ ఒకే విధంగా ఉంటుంది. ఎందుకంటే అది ఒక ముహూర్తం గనుక. సంధ్యా సమయం నుండి సూర్యునికి అడ్డంగా గీసినరేఖ (లేదా సగం సూర్యగోళం కనిపించే వరకు) నుండి మూడు ముహూర్తాల (2 గంటల 24 నిమిషాలు) కాలం గడిచేవరకు ప్రాతఃకాలం అంటారు. ఇది పగటిలో అయిదవ వంతు. ఆ తరువాత భాగం లేదా ఉదయం నుండి మూడు ముహూర్తాలు 'సంగవ' (ఉదయం)గా పిలుస్తారు. ఆపై మూడు ముహూర్తాలు మిట్ట మధ్యాహ్నం; ఆ తరువాతి మూడు ముహూర్తాలు మధ్యాహ్న భాగం; అనంతరం వచ్చే మూడు ముహూర్తాలు సాయంత్రం – ఈ విధంగా పగటి పదిహేను ముహూర్తాలను ఒక్కొక్కటీ మూడేసి ముహూర్తాల చొప్పున అయిదు భాగాలుగా విభజించారు."

"రోజుకు ముప్పై ముహూర్తాలు గల పదిహేను రోజులను పక్షం (చంద్రుని సంబంధమైన పక్షం) అని అంటారు. రెండు పక్షాలు కలిసి ఒక మాసం; రెండు మాసాలు కలిసి ఒక సౌరకాలం, మూడు ఋతుకాలాలు ఒక అయనం (దక్షిణ లేదా ఉత్తర); ఈ రెండు అయనాలు కలిసి ఒక సంవత్సరం అవుతుంది."[3]

యుగ భావనను విష్ణు పురాణం ఈ విధంగా వివరిస్తున్నది : "ఒక్కొక్క సంవత్సరానికి మూడువందల అరవై రోజుల చొప్పున 12 వేల దైవ సంవత్సరాలు, అంటే నాలుగు యుగాలు ఏర్పడ్డాయి. కృతయుగానికి నాలుగువేల సంవత్సరాలు, త్రేతాయుగానికి మూడువేల సంవత్సరాలు, ద్వాపరయుగానికి రెండువేల సంవత్సరాలు, కలియుగానికి వెయ్యి సంవత్సరాలు చొప్పున లెక్కించి విభజించినట్లు" కాలాన్ని గురించి తెలిసిన ప్రాచీన పండితులు ప్రకటించారు.

"యుగానికి ముందు వచ్చే కాలాన్ని సంధ్య అన్నారు. యుగంలో ఎన్నివేల సంత్సరాలుంటాయో దీనిలో అన్ని వందల సంవత్సరాలుంటాయి. యుగం తర్వాత వచ్చేకాలాన్ని 'సంధ్యాంశ' అంటారు. దాని కాలం కూడ అంతే. సంధ్య, సంధ్యాంశల మధ్య కాలమే యుగం – కృతయుగం, త్రేతాయుగం మొదలైన యుగాలు."

విష్ణు పురాణంలో 'యుగం' అనే పదాన్ని కాలాన్ని వేరే పద్ధతిలో లెక్కించటానికి ఉపయోగించారు. అది ఈ క్రింది విధంగా చెబుతున్నది.

"నాలుగు రకాల నెలలతో సంవత్సరాలు, అయిదు ప్రత్యేక రకాలుగా విభజించబడినాయి. ఈ రకాలన్నింటిని కలిపి సంయుక్తంగా యుగం లేదా భ్రమణం అంటారు. సంవత్సరం, ఇద్వత్సరం, అనువత్సరం, పరివత్సరం, వత్సరం అని సంవత్సరాలను అనేక పేర్లతో పిలిచారు.

3. విల్సన్ 'విష్ణు పురాణం', పుట 23.

ఈ కాలాన్ని 'యుగం' అని పిలిచారు."

యుగానికి విస్తరణ రూపమే మహాయుగం.[1] దీనిని విష్ణు పురాణం ఈ విధంగా వివరించింది.

"కృత త్రేత ద్వాపర కలి యుగాలు కలిసి ఒక మహాకాలం లేదా నాలుగు కాలాల మొత్తంగా ఏర్పడతాయి. ఇటువంటి వేలకొలది కాలాలు కలిసి ఒక బ్రహ్మదినం అవుతుంది."

మన్వంతరాన్ని గురించి విష్ణుపురాణంలో ఈ విధంగా వివరించటం జరిగింది.[2]

"నాలుగు యుగాలలోని సంవత్సరాల సంఖ్యకు డెబ్బై ఒక రెట్లకు సరిపోయే కాలానికి కొన్ని అదనపు సంవత్సరాలు కలిపితే మన్వంతరం అవుతుంది.

విష్ణు పురాణంలో కల్పం గురించి ఏం చెప్పారో చూద్దాం.

"బ్రహ్మ దినం, కల్పం" (కల్పం అంటే బ్రహ్మకు ఒకరోజు). కాలాన్ని ఇన్ని రకాల వ్యవధులతో విభజించారు. ఈ వ్యవధుల కాలాల గురించి తరువాత పరిశీలిద్దాం.

'వర్ష' అనేది సాధారణమైనది. అది సంవత్సరానికి అంటే 365 రోజుల కాలానికి సమానం. కాలాన్ని లెక్కించే యుగం, మహాయుగం, మన్వంతరం, కల్పం అంత సులభమైనవి కావు. కల్పాన్ని యుగాలకు కొన్నిరెట్లుగా చెప్పటం కంటె యుగం, మహాయుగం కల్పానికి ఉప విభాజకాలుగా లెక్కించటం సులభం. ఈ పద్ధతిలో పరిశీలించినపుడు కల్పం, యుగాల మధ్య ఉన్న సంబంధం ఏమంటే ఒక కల్పంలో 71 మహాయుగాలుంటాయి. ఒక మహాయుగంలో నాలుగు యుగాలుంటాయి. 71 మహాయుగాలకు కొన్ని అదనపు సంవత్సరాలను జోడిస్తే వచ్చేదే మన్వంతరం.

ఈ విభాగాలను ఆయా కాలాలచే లెక్కించటానికి యుగాన్ని ఆధారంగా తీసుకొని లెక్కించలేము. ఎందుకంటే యుగం అనేది స్థిరమైనదే; కాని, అది ఒకే విధంగా ఉండే కాలం కాదు. నాలుగు స్థిరమైన సమయాలు ఉండే "మహాయుగాన్ని" లెక్కించి వాటికి ప్రాతిపదికగా తీసుకోవాలి.

ఒక మహాయుగంలో నాలుగు యుగాలుంటాయి. ఆ యుగాల పేర్లు (1) కృతయుగం (2) త్రేతాయుగం (3) ద్వాపరయుగం (4) కలియుగం. ఆయా యుగాలకు స్థిరమైన కాలాన్ని నిర్ణయించారు. ప్రతి యుగానికి దాని కాలంతోపాటు స్థిర వ్యవధిగల తొలి, మలి అనే రెండు సంధ్యలుంటాయి. ఆయా యుగాలలో వాస్తవ కాలంతోపాటు తొలి, మలి సంధ్యల సమయాలు కూడ మారుతుంటాయి.

---

1. విల్సన్ విష్ణుపురాణం, పుట 23
2. అదే పుస్తకం, పుట 24.

| యుగం | కాలం | తొలి సంధ్య | మలి సంధ్య | మొత్తం |
|---|---|---|---|---|
| కృతయుగం | 4000 | 400 | 400 | 4800 |
| త్రేతాయుగం | 3000 | 300 | 300 | 3600 |
| ద్వాపరయుగం | 2000 | 200 | 200 | 2400 |
| కలియుగం | 1000 | 100 | 100 | 1200 |
| మహాయుగం | – | – | – | 12000 |

మహాయుగం లెక్కింపు దైవిక సంవత్సరాలలో ఉన్నది. అంటే 12000 దైవిక సంవత్సరాలు లేదా బ్రహ్మ సంవత్సరాలు కలిసి ఒక మహాయుగం అవుతుంది. ఒక మానవ సంవత్సరాన్ని దైవికమైన ఒక్కరోజుతో సమానం చేస్తే మానవ సంవత్సరాలలో మహాయుగం 43,20,000 (360x12000)ల సంవత్సరాలు అవుతుంది.

ఒక కల్పంలో డెబ్బై ఒక్క మహాయుగాలుంటాయి. దీని అర్థం కల్పం అంటే 3,06,72,000 (43,20,000x71) మానవ సంవత్సరాలు.

ఇక మన్వంతరం విషయానికి వస్తే ఇది 71 మహాయుగాలు ఇంకా మరికొన్ని అధిక సంవత్సరాలు. ఒక మన్వంతర కాలం అంటే కల్పమూ మరికొన్ని అధిక సంవత్సరాలు. కల్పంలోని 3,06,72,000 సంవత్సరాలకు మరికొన్ని అధిక సంవత్సరాలు కలిస్తే ఒక మన్వంతరానికి సమానం అవుతుంది. అందువల్ల కల్పం కాలం కంటె, మన్వంతర కాలం దీర్ఘమైనది. 'వర్ష' అనే కాలం జ్యోతిష శాస్త్రానికి, అనుగుణంగా ఉన్నందువల్ల కాలాన్ని లెక్కించటానికి అది అవసరమవుతుంది.

'కల్పం' అనే భావన పౌరాణికమైనది. విశ్వ నిర్మాణ శాస్త్ర సంబంధమైనది కూడ. విశ్వమనేది బ్రహ్మ చేతిలో నిర్మితమై, అంతం అవుతూ ఉంటుందని, ఈ సృష్టి వినాశనాల మధ్యకాలమే కల్పం అనే భావన మీద ఇది ఆధారపడింది. విష్ణు పురాణంలోని మొదటి అధ్యాయంలో ఈ విషయాలను పేర్కొనటం జరిగింది. సృష్టికి సంబంధించిన వివరాలతో అది ప్రారంభమౌతుంది. సృష్టి అనేది రెండు లక్షణాలు కలిగి ఉంటుంది. (1) ప్రాథమికం (సర్గ) అంటే విశ్వసృష్టి. ప్రకృతి నుండి లేదా శాశ్వత ముడి పదార్థం నుండి జరిగింది. (2) ద్వితీయం (ప్రతిసర్గ) అంటే ఇంతకు మునుపే వెలువడిన ప్రాథమిక పదార్థాల నుండి వస్తువుల రూపాలు ఏవిధంగా అభివృద్ధి చెందాయనేది, లేదా తాత్కాలిక వినాశనం నుండి తిరిగి ఎలా ఆవిర్భవించాయి అనేది. ఈ రెండు సృష్టులూ నియమిత కాలానుగుణమైనవే. కాని మొదటిదాని అంతం బ్రహ్మ జీవితానంతరమే. అపుడు దేవుళ్లందరు మాత్రమే కాకుండా ఇతర రూపాలన్నీ నిర్మూలనమౌతాయి. అలా కాకుండా ఒక ఆధ్యాత్మికజీవి మాత్రం అస్తిత్వంలో ఉంటుంది. అది ప్రతి కల్పాంతంలోగాని బ్రహ్మ దినాంతంలోకాని జరుగుతుంది. విశ్వ

పదార్థం, ఋషులకు, దేవుళ్లకు ఏ మాత్రమూ హాని కలుగజేయకుండా ఇతరమైన సమస్తంలోనూ తక్కువజాతి జీవాలలోనూ, అధోలోకాలలోనూ మాత్రమే మార్పు తెస్తుంది. కల్పం విషయంలో ఉన్న భావన అటువంటిది.

మన్వంతరంలో అంతర్భాగంగా ఉన్న భావన చారిత్రకం కాకపోయినా పౌరాణికమైనది. చేతనాచేతనమయిన సృష్టికి మూలకర్త బ్రహ్మ అనే నమ్మకంతో ఇది మొదలవుతుంది. అయితే చేతనమైన ప్రాణులు పునఃసృష్టి చేసుకోలేదు. అప్పుడు బ్రహ్మ తొమ్మిదిమంది మానసపుత్రులను సృష్టించాడు. కాని వారు పవిత్రజ్ఞానంతో ప్రభావితులై, విశ్వానికి ఎడంగా, వంశాభివృద్ధిపట్ల విముఖులై కోరికలు గాని మోహంగాని లేకుండా ఉన్నారు. దీనిని గ్రహించిన బ్రహ్మ కోపోద్రిక్తుడైనాడు. తర్వాత బ్రహ్మ ఇద్దరు వ్యక్తులుగా అంటే తొలి పురుషుడు (స్వాయంభువ మనువు) తొలిస్త్రీ (శతరూప)గా రూపం దాల్చాడు.

స్వాయంభువ మనువు శతరూపను వివాహం చేసుకున్నాడు. ఆ విధంగా మొదటి మన్వంతరం మొదలయింది. దీనినే స్వాయంభువ మన్వంతరం అన్నారు. పధ్నాలుగు మన్వంతరాలను ఈ క్రింది విధంగా వివరించారు.

'అనంతరం బ్రహ్మ తాను సృష్టించిన జీవుల రక్షణార్థం తన మాదిరిగానే తన నుండి స్వయంభువును, తన లోనిస్త్రీ భాగం నుండి శతరూపను సృష్టించాడు. కఠోరదీక్షవల్ల (నిషిద్ధ వివాహ పాపం నుండి) ఆమె పునీతురాలైంది. ఆమెను దివ్య మనువు స్వయంభువు భార్యగా స్వీకరించాడు. వీరిద్దరికి సౌందర్యవంతులు, ప్రతిభావంతులు అయిన ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కుమారులు, ప్రసూతి, ఆకూతి అనే ఇద్దరు కుమార్తెలు జన్మించారు. బ్రహ్మ ప్రసూతిని దక్షుడికి ఇచ్చాడు. ఆకూతిని రుచి ప్రజాపతికి ఇచ్చాడు. అతడు ఆమెను భార్యగా స్వీకరించాడు. రుచిద్వారా ఆకూతికి యజ్ఞుడు, దక్షిణ అనే ఇద్దరు కవలలు కలిగారు. వీరిద్దరు అనంతరం భార్యాభర్తలై పన్నెండుమంది కుమారులను కన్నారు. వీరినే స్వయంభువ మన్వంతరంలో యమదేవతలుగా పేర్కొన్నారు.

"మొదటి మనువు[1] స్వయంభువు, ఆ తర్వాత స్వారోచిషుడు, ఉత్తముడు, అనంతరం తామసుడు తర్వాత రైవతుడు, ఆ తర్వాత చాక్షుషుడు అనే ఆరుగురు మనువులు. ఈ ఆరుగురు మనువులూ గతించారు. ప్రస్తుత కల్పమైన ఏడవ మన్వంతరానికి ఆధిపత్యం వహిస్తున్న మనువు వైవస్వతుడు. ఇతడు సూర్యుని కుమారుడు."

"అపుడు భాసిల్లిన దేవతలు, ఋషులు, ఇతర వ్యక్తులతో కల్పం ప్రారంభమైంది. స్వయంభువు, కాలాన్ని ఇంతకు పూర్వమే నేను వివరించాను. స్వారోచిష మన్వంతరంలో అధిష్ఠితమైన దేవతలు, ఋషులు, మనువు కుమారులను గురించి నేనిప్పుడు వివరిస్తాను. ఈ

1. విల్సన్ 'విష్ణు పురాణం', పుటలు 259–264.

కాలంలో (రెండవ మన్వంతరంలోని) పారావారులు, తుషితులు, దేవతలు. శక్తివంతుడైన విపశ్చితుడు దేవతలకు రాజుగా ఉండేవాడు. ఏడుగురు ఋషులైన ఊర్జుడు, స్తంభుడు, ప్రాణుడు, దత్తోలి, రిషభుడు, నిశ్చరుడు, అర్వరివుడు సప్తర్షులు. చైత్రుడు, కింపురుషుడు, తదితరులు మనువు కుమారులు.

మూడవ కాలం లేదా ఉత్తముని మన్వంతరంలో దేవతలకు రాజు (ఇంద్రుడు)గా శాంతి ఉన్నాడు. అతని అనుయాయులు సుధాములు, సత్యులు, శివులు, ప్రతర్దనులు, వశవర్తులు. ఒక్కొక్కగణంలో పన్నెండుమంది దేవతలు. వశిష్ఠుని ఏడుగురు కుమారులు ఋషులు. అజుడు, పరశుడు, దివ్యుడు మొదలైనవారు మనువు కుమారులు.

"నాలుగవ మనువైన తామసుని కాలంలో ఒక్కొక్కగణంలో ఇరవై ఏడుమంది చొప్పున సురూపులు, హరులు, సత్యులు, సుధియులు అనే తరగతుల దేవతలున్నారు. శిబి ఇంద్రుడిగా ఉండేవాడు. వంద యజ్ఞాలను నిర్వహించినందున అతనికి శతక్రతు అనే పేరు కూడ ఉండేది. జ్యోతిర్ధామ, పృథు, కావ్య, చైత్ర, అగ్ని, ధనక, పీవర, అనేవారు ఏడుగురు ఋషులు. నరుడు, ఖ్యాతి, శాంతహయుడు, జానుజంఘుడు మొదలగు శక్తివంతులైన రాజులు తమసుని కుమారులు."

"అయిదవ విరామం వద్ద రైవతుడు మనువు. విభుడు ఇంద్రుడు. అమితాభులు, అభూత రాజసులు, వైకుంఠులు, సుమేధసులు ఒక్కొక్కరు పద్నాలుగు చొప్పున దేవతల గణాలుండేవి. హిరణ్యరోముడు, వేదశ్రీ, ఊర్ధ్వబాహుడు, వేదబాహుడు, సుధాముడు, పర్జన్యుడు, మహాముని అనేవారు ఏడుగురు ఋషులు. బలబంధుడు, సుసంభావ్యుడు, సత్యకుడు, తదితర సాహసవంతులైన రాజులు రైవతుడి కుమారులు. స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు అనే ఈ నలుగురు మనువులు ప్రియవ్రతుని సంతతి. ఇతడు తన భక్తితో విష్ణువును సంతృప్తిపరచి తన సంతతికి మన్వంతర పాలన హక్కు సాధించాడు.

"జనజవుడు (మనోజవుడు) ఇంద్రుడిగా ఉన్న ఆరవకాలంలో చాక్షుషుడు మనువుగా ఉండేవాడు. ఒక్కొక్కగణంలో ఎనిమిది మంది చొప్పున ఆద్యులు, ప్రసూతులు, భవ్యులు, పృథకులు, లేఖులు అనే అయిదు తరగతుల దేవతలుండేవారు. సుమేధుడు, విరజుడు, హవిష్మంతుడు, ఉత్తముడు, మధువు, అతినాముడు, సహిష్ణువు అనే పేర్లుగల ఏడుగురు మునులు ఉండేవారు. శక్తిమంతులైన ఊరువు, పూరువు, శతద్యుమ్నుడు తదితరులు పృథ్వీరాజులు. వీరు చాక్షుషుని కుమారులు."

ఉత్తరక్రియల అధినేత, విజ్ఞుడు, సూర్యుని ప్రతిభావంతమైన సంతతీ అయినవాడు వర్తమాన మనువు. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, దేవతలు. వారి ప్రభువు పురందరుడు. వశిష్ఠుడు, కశ్యపుడు, అత్రి, జమదగ్ని, గౌతముడు, విశ్వామిత్రుడు, భరద్వాజుడు, అనేవారు ఏడుగురు ఋషులు. ఇక్ష్వాకుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు,

కరూశుడు, పృషధ్రుడు, తదితర ప్రసిద్ధ రాజులు వైవస్వత మనువు పుణ్యసంతతి."

విష్ణుపురాణంలో భూత మన్వంతరాలుగా పేర్కొన్న ఏడుగురు మన్వంతరాలను గురించిన వివరాలను ఇంతవరకు విశదీకరించటం జరిగింది. మిగతా ఏడింటి గురించిన వివరాలను దిగువ చూడవచ్చు.

"విశ్వకర్మ కుమార్తె అయిన సంజ్ఞ సూర్యునికి భార్య. సూర్యుని వలన ఆమెకు వైవస్వత మనువు, యముడు, యామి (యమునా నది) అనే ముగ్గురు సంతానం కలిగారు. సంజ్ఞ తన భర్త తాపాన్ని భరించలేక ఆయనకు ఛాయ అనే ఆమెను పరిచారికగా ఉంచి తాను తపస్సు చేసుకొనేందుకై అడవులకు వెళ్లింది. సూర్యుడు ఛాయను సంజ్ఞగానే భావించి ఆమె ద్వారా ముగ్గురు సంతానాన్ని శనీశ్వరుడు, (ఇంకొక) మనువు (సవర్ణి అనే) కుమారులను, తపతి (తపతినది) అనే కుమార్తెను కన్నాడు. ఒక సందర్భంలో (సంజ్ఞ కుమారుడైన) యముడు అవమానించగా కోపితురాలైన ఛాయ అతన్ని శపించింది. అనంతరం తాను నిజంగా సంజ్ఞను కాదనీ ఆమె ఛాయను మాత్రమేనని సూర్యునికీ యమునికీ వెల్లడించింది. తన భార్య అడవిలోకి వెళ్లిందని ఛాయ ద్వారా తెలుసుకున్న సూర్యుడు దివ్యదృష్టితో పరిశీలించి ఆమె ఉత్తర కురు ప్రాంతంలో ఆడగుర్రం వేషంలో ఉన్నట్లు కనుగొంటాడు. తాను కూడా మగ గుర్రం రూపాన్ని ధరించి తన భార్యను చేరతాడు. వారికి అశ్వినులు (ఇద్దరు), రేవంతుడు అనే కుమారులు కలుగుతారు. అనంతరం సూర్యుడు సంజ్ఞను తిరిగి తన ఇంటికి తీసుకు వచ్చాడు. విశ్వకర్మ సూర్యుని తీవ్రతను, ప్రకాశాన్ని తగ్గించటానికి కోత పెడతాడు. దీనివల్ల ఎనిమిదో వంతు కాంతి తగ్గింది. అంతకంటె ఎక్కువ తీవ్రతను వేడినీ తగ్గించలేకపోయాడు. దైవజ్ఞ విశ్వకర్మ సూర్యుని కాంతి భాగాలను వదిలించటానికి చేసిన ప్రయత్నంలో కాంతిపుంజాలు భూమి మీద పడ్డాయి. ఆ కళాకారుడు అందులో నుండి విష్ణు చక్రాన్ని, శివుని త్రిశూలాన్ని, కుబేరుని ఆయుధాన్ని, కార్తికేయుని దండాన్ని ఇతర దేవతల ఆయుధాలను రూపొందించాడు. సూర్యునిలో నుండి పడిన కాంతి రజనులో నుండి విశ్వకర్మ వీటినన్నిటిని రూపొందించాడు.

తన అన్న వైవస్వతుని లాగే, అదే కులం నుండి వచ్చిన ఛాయ కుమారుడైన "సవర్ణి" మనువు అవుతాడు. అతను రాబోయే ఎనిమిదవ మన్వంతరాన్ని నిర్వహిస్తాడు. ఆ వివరాలను నేను ఇప్పుడు పేర్కొంటాను. సావర్ణి మనువు కాలంలో సుతపులు, అమితాభులు, ముఖ్యులు అనే దేవత వర్గాలున్నాయి. ఒక్కొక్కరికి ఇరవై ఒక్క దైవత్వాలున్నాయి. దీప్తిమంత, గాలవ, రామ, కృప, ద్రౌణి అనే అయిదుగురు ఋషులు, నా కుమారుడు వ్యాసుడు ఆరవవాడుగా, ఋష్యశృంగుడు ఏడో ఋషిగా ఉంటారు. బలి ఇంద్రుడు. పాతాళలోకంలో కొంతభాగానికి ప్రభువైన విరోచనునికి విష్ణు వరప్రసాదం వల్ల కలిగిన పాపరహిత కుమారుడే బలి. విరజుడు, అర్వరివుడు, నిర్మోహుడు మొదలైనవారు మనువు సవర్ణి సంతానం."

"దక్షసావర్ణి తొమ్మిదవ మనువుగా ఉంటాడు. ఒక్కొక్క తరగతిలో పన్నెండుమంది

చొప్పున పారులు, మరీచిగర్భులు, సుధర్ములు దేవతలు. వీరికి అద్భుతుడు ఇంద్రుడు. సవన, ద్యుతిమంతభవ్య, వసు, మేధాతిథి, జ్యోతిష్మంత, సత్య అనే ఏడుగురు ఋషులు ఉంటారు. ధృతితకేతు, దృష్టికేతు, పంచహస్త, నిరామయ, పృథుశ్రవ(య), తదితరులు మనువు కుమారులు.

"పదవ మన్వంతరంలో బ్రహ్మ సావర్ణి మనువుగా ఉన్నాడు. సుధాములు, విశుద్ధులు శతసంఖ్యలు దేవతలు. శక్తివంతుడైన శాంతి ఇంద్రుడుగా ఉంటాడు. హవిష్మంత, సుకృతి, సత్య, అపోమూర్తి (తపోమూర్తి) నాభాగ, అప్రతిమౌజ, సత్యకేతులు ఋషులుగా ఉంటారు. సుక్షేత్ర, ఉత్తమౌజ, హరిసేన, తదితరులు మనువు పదిమంది కుమారులు."

"ధర్మ సావర్ణి పదకొండవ మన్వంతరంలో మనువుగా ఉంటాడు. ఒక్కొక్కరు ముప్పైమంది చొప్పున విహంగము, కామగము, నిర్మాణరతులు, ప్రధానమైన దేవ వర్గాలుగా ఉంటారు. వారిలో వృషుడు ఇంద్రుడిగా ఉంటాడు. నిశ్చర, అగ్నితేజ, వపుష్మంత, విష్ణు, అరుణి, హవిష్మంత, అనఘులు ఋషులుగా ఉంటారు. మనువు కుమారులైన సవర్గ, సర్వధర్మ, దేవానిక తదితరులు భూమిపై రాజులు.

"పన్నెండవ మన్వంతరంలో రుద్రుని కొడుకైన సవర్ణి మనువుగా ఉంటాడు ఋతుధాముడు ఇంద్రుడిగా ఉంటాడు. ఒక్కొక్కరు పదిహేను మంది చొప్పున హరితులు, లోహితులు, సుమనసులు, సుకర్ములు దేవవర్గాలుగా ఉంటారు. తపస్వి, సుతపుడు, తపోమూర్తి, తపోరతి, తపోధృతి, తపోద్యుతి, తపోధనుడు అనేవారు ఋషులు. మనువు కుమారులైన దేవవంత, ఉపదేవ, దేవశ్రేష్ఠ తదితరులు భూమిపైన అత్యంత శక్తివంతులైన చక్రవర్తులు."

"రౌచ్యుడు పదమూడవ మన్వంతరంలో మనువుగా ఉంటాడు. ఒక్కొక్కవర్గంలో ముప్పైమూడు మంది చొప్పున, సుధామనులు, సుధర్మనులు, సుకర్మణులు అనే దేవతల వర్గాలు ఉంటాయి. దివస్పతి వీరికి ఇంద్రుడు, నిర్మోహ, తత్వదర్శి, నిష్ప్రకంప, నిరుత్సుక, ధృతిమంత, అవ్యయ, సుతపులు ఋషులుగా ఉంటారు. చిత్రసేన, విచిత్ర, తదితరులు రాజులుగా ఉంటారు."

"పద్నాలుగవ మన్వంతరంలో భౌత్యుడు మనువుగా ఉంటాడు. 'శుచి' ఇంద్రుడుగా ఉంటాడు. చాక్షుషులు, పవిత్రులు, కనిష్ఠులు, భ్రాజితులు, వాచావృద్ధులు అనే అయిదు వర్గాలుగా ఉన్నవారు దేవతలు. అగ్నిబాహు, శుచి, శుక్ర, మాగధ, గృధ్ర, యుక్త అజిత అనే ఏడుగురు ఋషులుగా ఉంటారు. ఉరు, గభీర, బ్రధ్న తదితరులు మనువు కుమారులు. వీరే రాజులుగా ఉంటూ భూమండలాన్ని పరిపాలిస్తారు."

మన్వంతర కాలంలో విశ్వానికి ఒక పాలకవర్గాన్ని ఏర్పాటు చేసే నిమిత్తం 'మన్వంతరా'లు అనే పథకాన్ని రూపొందించినట్లు తెలుస్తున్నది. ప్రతి మన్వంతరంలోను శాసనకర్తగా ఒక

మనువు అధిష్ఠుడై ఉంటాడు. పూజలందుకోవటానికి దేవతలు, ఏడుగురు ఋషులు, పరిపాలనా నిర్వహణకు గాను ఒకరాజు ఉండేవారు.

విష్ణు పురాణం[1] ఈ విధంగా చెబుతున్నది: "వివిధ వర్గాల దేవతలు ,వారుండే ఆయా మన్వంతరాలలో క్రతువులను పొందేవారు. స్వయానా మనువు కుమారులూ, ఆ తర్వాత వారి వారసులూ, ఆ కాలం పూర్తయ్యేవరకూ భూమిపై సార్వభౌమత్వం కలిగి ఉండేవారు. ప్రతీ మన్వంతరంలోను మనువు, సప్తర్షులూ, దేవతలు, రాజులైన మనువు కుమారులు, ఇంద్రుడు, ప్రపంచాన్ని పాలించేవారు.

కాని "మహాయుగం" అనేదాని కాలన్నిర్ణయం మాత్రం ఒక అయోమయమైన వ్యవహారం.

కల్పాన్ని మహాయుగాలుగా ఎందుకు విడగొట్టవలసి వచ్చింది? కృత, త్రేత, ద్వాపర, కలి అనే నాలుగు కాలాలుగా మహాయుగాన్ని ఎందుకు ఉప విభాగాలుగా విభజించవలసి వచ్చింది అనేది ఒక చిక్కుముడిగా అయింది. దానిని వివరించవలసిన అవసరం ఉంది. యుగం ఏర్పడినట్లుగా ఇది (మహాయుగం) పురాణాలపైన ఆధారపడి లేదు; హైందవుల నిజమైన లేదా ఊహాజనితమైన చరిత్రకు సంబంధించినదీ కాదు.

యుగానికి సంబంధించిన కాలన్నిర్ణయాన్ని ఒక అద్భుతమైన అల్లికగా అనిపించేటట్టుగా మొత్తంగా ఎందుకు ఇంత దీర్ఘంగా పొడిగించారు? అనేది మొదటి ప్రశ్న.

ఋగ్వేదంలో యుగమనే పదం ముప్పై ఎనిమిదిసార్లు వస్తుంది. వయస్సు, వంశం, బంధం లేదా జాతికి సంబంధించిన అర్థాలలో ఈ పదాన్ని ఉపయోగించారు. కొన్ని సందర్భాలలో దీనిని అతి తక్కువ కాలాన్ని సూచించేదిగా కూడా వాడినట్లు కనిపిస్తుంది. ఎక్కువ సందర్భాలలో ఈ పదాన్ని అతి తక్కువ కాలాన్ని సూచించేదిగానే వాడారు. 'యుగేయుగే' అంటే 'ప్రతిదినం' అనే వరకూ సాయణాచార్యులు వెళ్లాడు.

నాలుగు యుగాల భావన అనేది, సమాజంలో నైతిక విలువలు దిగజారిపోవటానికి సంబంధించి ఉన్నట్టుగా మరోచోట కనిపిస్తుంది. మహాభారతం నుండి[2] తీసుకున్న ఈ క్రింది పంక్తులలో ఆ అభిప్రాయాన్ని బాగా వ్యక్తపరిచారు.

"ధర్మం శాశ్వతంగా ఉన్న యుగం కృతయుగం. యుగాలలో అత్యంత శ్రేష్ఠమైన ఆ కాలంలో ప్రతిదీ జరిగేది(కృత). చేయవలసింది ఇక ఏమీ ఉండేది కాదు. కర్తవ్యాల పట్ల బడలిక లేదు. ప్రజలు వాటిని నిరాకరించనూ లేదు. ఆ తర్వాత కాల ప్రభావం వల్ల ఈ యుగం హీనదశకు పడిపోయింది. ఆ కాలంలో దేవతలుగాని, దానవులుగాని, గంధర్వులు గాని,

1. విల్సన్ 'విష్ణు పురాణం', పుటలు 269–70.
2. మూయిర్స్ సంస్కృత గ్రంథాలు 1 సం. పుటలు144–146

యక్షులుగాని, రాక్షసులుగాని, పన్నగులు గాని ఎవరూ లేరు. క్రయ, విక్రయాలు జరుగలేదు. వేదాలను సామ, ఋక్, యజుర్ వేదాలుగా విభజించలేదు. పురుషులు ఏ ప్రయత్నమూ చేసేవారు కారు. భూమి నుండి వారి ఇష్టానుసారంగా ఫలాన్ని పొందారు. ధర్మనియతి, (ప్రపంచ) పరిత్యాగం ఉండేవి. వయస్సు ప్రభావంగా ఎలాంటి రోగాలు రావటంగాని, జ్ఞానేంద్రియాలు మందగించటంగాని ఉండేది కాదు. ఆ కాలంలో అసూయ, రోదన, గర్వం, మోసం, వివాదం ఉండేవి కావు. అటువంటప్పుడు అలసటకు తావేది? ఆ కాలంలో ద్వేషం, క్రూరత్వం, భయం, బాధ, అసూయ, ఈర్ష్య అనేవి లేవు. అందుకనే యోగులంతా పరబ్రహ్మ శరణుజొచ్చేవారు.

అన్ని జీవరాసుల ఆత్మ అయిన నారాయణుడు శ్వేతవర్ణంలో ఉండేవాడు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు కృతయుగపు లక్షణాలను కలిగి ఉండేవారు. ఈ కాలంలోనే తమ విధులకు అంకితమైన జీవాలు ఉద్భవించాయి. వారు విశ్వాస విషయంలోను, ఆచారాలలోను ఆచరణలోను ఒకే విధంగా ఉండేవారు. ఒకే విధమైన విధులు కలిగి ఉండి తమ కర్తవ్యాలను (కులవిధులు) నెరవేరుస్తుండేవారు. ఒకే దేవుణ్ణి ఆరాధించేవారు. ఒకే మంత్రాన్ని, ఒకే నియమ నిబంధనను ఆచరించేవారు. వారికి వేరు వేరు విధులు ఉన్నప్పటికీ ఒకే వేదం ఉండేది. ఒకే కర్తవ్యాన్ని పాటించేవారు. నాలుగు క్రమాల పనులతో సంబంధం ఉండి, కాల సంయోగంపై ఆధారపడి ఉండి, వివిధ కోర్కెలను అధిగమించినవారై ప్రతిఫలేచ్ఛ లేనివారై అత్యంతానందాన్ని పొందుతుండేవారు.

కృతయుగంలో ఈ నాలుగు కులాల సంపూర్ణ శాశ్వతధర్మ నియతి ఆ యుగ లక్షణంలో వ్యక్తమయ్యేది, పరమాత్మలో విలీనాన్ని కోరుకొనేది. మూడు విషయాల నుండి కృతయుగం విముక్తం అయ్యింది. త్రేతాయుగం గురించి పరికించండి. యాగం మొదలై ధర్మనియతి నాల్గవవంతు పడిపోయింది. విష్ణువు ఎర్రబారాడు. మనుషులు సత్యవర్తనులయ్యారు. ఆచారాలపై ఆధారపడిన ధర్మనియతిపట్ల శ్రద్ధ చూపారు. వివిధ రకాల వ్రతాలు, పుణ్యకార్యాల కారణంగా యాగాలు జరుగుతుండేవి. త్రేతాయుగంలో పురుషులు తమ పోరాటాలకు, పూజలకు ఫలితాన్ని ఆశిస్తూ ఒక లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రవర్తించసాగారు. తపోదీక్షకూ, క్రతుకర్మలకూ అంకితమై ఉండటం అనేది కాని, విధిపట్ల ఉదాసీనత కాని ఉండేది కాదు. ఏది ఏమైనా వారు తమ సొంత విధులకు, మతపరమైన వ్రతాలకు ఈ యుగంలో ప్రాధాన్యత నిచ్చారు.

ద్వాపర యుగంలో వేదాలు నాలుగింతలై, విష్ణువు పసుపుపచ్చగా మారగా, ధర్మనియతి మాత్రం సగానికి తగ్గింది. కొందరు నాలుగు వేదాలను, కొందరు మూడు, మరికొందరు రెండు, ఇంకొందరు ఒక వేదాన్ని చదివేవారు, కొందరైతే అసలు ఏ వేదాన్నీ చదివేవారు కాదు. ఆ విధంగా వేదాలు విభాజ్యమైనాయి. అనేక భిన్నరీతులలో వ్రతాలు జరుపుతుండేవారు.

క్రతుకర్మలు చేయటంవల్లనూ, కానుకలు సమర్పించుకోవటం వల్లనూ ప్రజలు మోహపరులై రాజసగుణం కలవారైనారు. ఒక వేదాన్ని తెలుసుకోలేనివారై వేదాలను గుణీకరించారు. సత్య భావం సన్నగిల్లటం వల్ల కొద్దిమంది మాత్రమే సత్యబద్ధులైనారు. ఎప్పుడైతే మనుషులు మంచితనానికి దూరమైనారో, విధి ప్రభావం వలన అనేకమైన వ్యాధులు, వాంఛలు, ఆపదలు వారికి ఎదురయ్యాయి. వాటివల్ల వారు చాలా దెబ్బతిన్నారు. కఠోర నియమాలు ఆచరించవలసి వచ్చింది. కొందరు ఆనందాన్నీ, స్వర్గ సౌఖ్యాన్ని కోరుతూ బలులు ఇచ్చారు. ద్వాపరయుగం చేరేసరికి, అధర్మపరతలో ఇంకా దిగజారిపోయారు. కలియుగంలో ధర్మం ఒకపాదం మీదనే నిలబడింది. అంధయుగంలో ప్రవేశించటం వల్ల బ్రహ్మ నల్లబడిపోయాడు. వేదాలు విధించిన ఆచారాలు, ధర్మకార్యాలు, యాగక్రతువులు ఆగిపోయాయి. ఆపదలు, రోగాలు, అలసట, కోపం మొదలైన దోషాలు, కష్టాలు, ఆందోళన, ఆకలి, భయం ఆవహించాయి. యుగాలు పరిభ్రమించటంతో ధర్మం తిరిగి పతనమయింది. ఇది జరగటంతో ప్రజలూ దిగజారిపోయారు. వారు పతనమవటంతో వారిని ముందుకు నడిపించే ప్రేరణలు కూడా పతనమయ్యాయి. యుగాలు ఈ విధంగా పతనమవటం మూలంగా ఉత్పన్నమైన ఆచారాలు మనుషుల ఉద్దేశాలను నిరాశపరిచాయి. అటువంటిది కలియుగం. అది తక్కువ కాలమే ఉన్నది. చిరకాలం జీవించినవారు యుగ లక్షణాలకు అనువుగా ప్రవర్తించేవారు."

ఇది నిస్సందేహంగా చాలా విచిత్రమైన స్థితి. ప్రాచీన వైదిక వాఙ్మయంలో కృత, త్రేతా, ద్వాపర, అస్కంద అనే పదాలు ఐతరేయ బ్రాహ్మణ, శతపథ బ్రాహ్మణ, వాజసనేయ సంహిత, తైత్తిరీయ సంహితలలో తారస పడతాయి. ప్రాచీన వైదిక వాఙ్మయంలో ఈ పదాల ప్రస్తావన ఉంది. శతపథ బ్రాహ్మణం ప్రకారం "కృత అంటే ఆటలో తప్పుల ఆధారంగా ఆధిక్యతను సాధించేవాడు అని. త్రేత అంటే క్రమపద్ధతి ప్రకారం ఆడేవాడు. ద్వాపర అంటే తన ప్రత్యర్థి కంటె ఎప్పుడూ అగ్రభాగాన ఉండటానికి పథకం వేసేవాడు. అస్కంద అంటే కేళీమందిరంలో ఉన్న స్తంభం. ఐతరేయ బ్రాహ్మణ, తైత్తిరీయ బ్రాహ్మణాలలో అస్కందకు బదులు కలి అనే పదాన్ని ఉపయోగించారు. తైత్తిరీయ బ్రాహ్మణం 'కృతను కేళీమందిరం యజమానిగాను, త్రేతను తప్పుల వల్ల లాభం పొందేవాడిగాను, ద్వాపరను వెలుపల కూర్చునేవాడుగాను కలిని కేళీమందిర స్తంభాన్ని ఎప్పటికీ వదలనివాడిగాను (కదలనివాడిగా) చెప్పింది.

"ఇక్కడ ఆశించేదంతా గెలుపే, ఎందుకంటే దురదృష్టవంతుడు మరణిస్తాడు. కలి అక్కడే పడి ఉన్నాడు. మిగతా ఇద్దరు నెమ్మదిగా జరుగుతూ సగం పడిపోయారు. కాని అత్యంత అదృష్టవంతుడైన కృత మంచి కదలికలో ఉన్నాడు." ఎక్కడైనాగాని ఈ మాటలకు జూదంలో పాచికల అర్థం తప్ప మరేమీ కాదని స్పష్టమవుతున్నది.

మనువు ఈ పదాలను ఏ విధంగా ఉపయోగించాడో పరిశీలిద్దాం. అతను ఈ విధంగా అన్నాడు – 'కృత, త్రేత, ద్వాపర, కలియుగాలు అనేవి రాజు చర్యావిధానాలు. ఎందుకంటే

రాజుని యుగంగా పిలుస్తారు. అతడు నిద్రలో ఉన్నప్పుడు కలి. మేల్కొని ఉన్నప్పుడు ద్వాపరయుగం. ఏదైనా చర్యకు ఉపక్రమించినపుడు త్రేత, కదులుతున్నపుడు అతడు కృతయుగం."

మనువుతో అతని పూర్వీకులను పోల్చి చూసినపుడు ఈ పదాల అర్థంలో ఒక స్పష్టమైన మార్పు జరిగిందనే విషయాన్ని అంగీకరించాలి. జూదరులు తమ పరిభాషలో వాడే మాటల్లో భాగమైన పదాలు రాజకీయ పదాలయ్యాయి. అది కూడ రాజు తన కర్తవ్యాన్ని నిర్వహించటానికి సంసిద్ధుడై ఉంటాడనే భావంతో ఉపయోగించటం జరిగింది. చురుకైన, పని చెయ్యాలనే ఉద్దేశం ఉన్న, మెలకువతో ఉన్న, నిద్రాణమై ఉన్న అంటే సమాజం భ్రష్టుపడుతూ ఉంటే చూస్తూ ఊరుకున్న రకరకాల రాజుల మధ్య వ్యత్యాసాన్ని చూపటానికి ఈ పదాలను వాడటం జరిగింది.

ప్రశ్న ఏమిటంటే, బ్రాహ్మణులు కలియుగ సిద్ధాంతాన్ని కనుగొనడానికి ఏయే స్థితులు ఒత్తిడి తెచ్చాయి? కలియుగాన్ని దిగజారిన సమాజ పరిస్థితికి సమానంగా ఎందుకు చేశారు? నిద్రాణమై ఉన్న రాజును కలిరాజుగా మనువు ఎందుకు పిలిచాడు? మనువు కాలంలో పరిపాలన చేసిన రాజు ఎవరు? ఆ రాజును మనువు నిద్రాణమై ఉన్న రాజు అని ఎందుకు పిలిచాడు? కలియుగ సిద్ధాంతం రేకెత్తించే అనేక చిక్కుముడులలో ఇవి కొన్ని.

కలియుగ సిద్ధాంతాన్ని నిశితంగా పరిశీలించినట్లయితే ఈ చిక్కుప్రశ్నలే కాక మరికొన్ని కూడ మన దృష్టికి వస్తాయి. అసలు కలికాలమనేది ఎప్పుడు మొదలైంది?

కలియుగం కచ్చితంగా ప్రారంభమైన తేదిని గురించి వివిధ సిద్ధాంతాలున్నాయి. పురాణాలు రెండు తేదీలనిచ్చాయి. క్రీ.పూ. దాదాపు 15వ శతాబ్ది ప్రారంభంలో కలియుగం మొదలైందని కొందరు చెబుతారు. మరికొందరు అది క్రీ.పూ. 18 ఫిబ్రవరి 3102 నాడు మొదలయిందంటారు. ఈ తారీఖున కౌరవ పాండవుల మధ్య యుద్ధం ప్రారంభమైనట్టు తేలిందని అనుకుంటున్నారు. భారతదేశంలో క్రీ.శ. ఏడవ శతాబ్దికి పూర్వం, కలియుగాన్ని గురించిన ప్రస్తావన ఏ ప్రాంతంలో కూడ ఎక్కడా లేదని ప్రొఫెసర్ అయ్యంగార్ పేర్కొన్నారు. బాదామీ వద్ద 610 నుండి 642 వరకు పరిపాలించిన రెండవ పులకేశి రాజ్యానికి సంబంధించిన శిలాఫలకంపై ఇది మొదటిసారి కనిపించింది. శకతేదీ 556, కలి తేదీ 3735 అని రెండు తారీఖులను ఇది నమోదు చేసింది. క్రీ.పూ. 3102ని కలియుగ ప్రారంభ తేదీగా, ఈ రెండు తారీఖులు తీసుకున్నాయి. అది తప్పు. క్రీ.పూ. 3102 అనేది మహాభారత యుద్ధం ప్రారంభమైన తేదీ కాదు. లేదా కలియుగం మొదలైన తేదీ కూడా కాదు. శ్రీ కాణే దీనిని నిర్ధారించాడు. పాండవుల కుమారుడైన పరీక్షిత్తు కాలం నుండి వివిధ వంశాల రాజులకు సంబంధించిన స్పష్టమైన వ్యాఖ్యానాల ప్రకారం మహాభారత యుద్ధం మొదలైన కచ్చితమైన తేదీ క్రీ.పూ. 1263. అంతేకాని క్రీ.పూ. 3102 మాత్రం కాదు. క్రీ.పూ. 3102 అనేది కల్పం

ప్రారంభానికి సంబంధించినదే కాని, కలి ప్రారంభానికి సంబంధించినది కాదనీ కలిని కల్పంతో కాకుండా క్రీ.పూ. 3102 తేదీతో ముడిపెట్టడం అనేది 'కల్పాది' అనే పదాన్ని 'కల్యాది' అనే పదంగా తప్పుగా రాయడం వల్లనో, చదవటం వల్లనో జరిగిందనీ కూడా కాణే చెప్పారు. అందువల్ల కలియుగ ప్రారంభానికి ఒక కచ్చితమైన తేది ఇవ్వటానికి బ్రాహ్మణుల దగ్గర ఏదీ లేదు. ఇంతటి విషయానికి (ఏదీ) ఒక కచ్చితమైన ఆరంభం ఉండాలని ప్రయత్నించటం ఒక చిక్కుముడి.

ఇక్కడ మరికొన్ని చిక్కుముడులను గురించి కూడా చెప్పుకోవాలి.

కలియుగానికి అనుబంధంగా రెండు సిద్ధాంతాలున్నాయి. కలియుగంలో కేవలం రెండు వర్ణాలు అంటే మొదటిదైన బ్రాహ్మణులు, చివరిదైన శూద్రులు మాత్రమే ఉన్నారని బ్రాహ్మణులు గట్టిగా విశ్వసిస్తారు. మధ్యలోని క్షత్రియ, వైశ్య వర్ణాలు రెండూ అసలు ఉనికిలోనే లేవని వారంటారు. ఈ వాదానికి ఆధారం ఏమిటి? ఈ వాదం ఏం చెబుతున్నది? ఈ వర్ణాలు బ్రాహ్మణ వాదానికి లొంగిపోయాయనా లేక అసలు ఇవి లేకుండా పోయాయని వారి ఉద్దేశమా?

భారతదేశ చరిత్రలో ఏ కాలం ఈ వాదాన్ని వాస్తవంగా సమర్థిస్తుంది? ఈ రెండు వర్ణాలు బ్రాహ్మణ వాదానికి లొంగి పోవటమే కలియుగ ప్రారంభమని ఇది చెబుతున్నదా!

కలియుగ సిద్ధాంతంతో అనుబంధంగా ఉన్న రెండోవాదాన్ని కలివర్జ్య అన్నారు. అంటే కలియుగంలో పాటించనవసరం లేని ఆచార వ్యవహారాలు. వివిధ పురాణాలలో ఇవి అక్కడక్కడా ఉంటాయి. కాని వీటన్నిటిని ఆదిత్య పురాణం ఒక దగ్గరికి చేర్చింది. కలివర్జ్యలోని ఆచారాలను ఈ క్రింద ఇవ్వడం జరిగింది.[1]

(1) "వితంతువు ద్వారా సంతానం కనటానికి ఆమె భర్త సోదరుణ్ణి నియమించటం."[2]

(2) "పెళ్లి అయి గర్భాదానం జరగని స్త్రీకి, గర్భాదానం జరిగిన స్త్రీకి ఆమె మొదటి భర్త మరణిస్తే రెండో పెళ్లి చేయడం.[3]

(3) [4]"మూడు ద్విజ వర్ణాల వ్యక్తుల మధ్య వివిధ వర్ణానికి చెందిన స్త్రీలతో వివాహం".[5]

---

1. కలివర్జ్య పి.వి. కాణే, పుటలు 8-16.
2. ఇది నియోగ పద్ధతికి సంబంధించినది. గౌతముడు (18-9-14) నారదుడు (స్త్రీ, పుంస 58వ శ్లోకం) యాజ్ఞవల్క్యుడు (1-68-69) దీనిని అంగీకరించారు. మనువు (9-64-68), బృహస్పతి దీనిని ఒప్పుకోలేదు.
3. వితంతు పునర్వివాహానికి సంబంధించినది. కొన్ని విపత్తులలో బ్రాహ్మణ వితంతువు కూడా రెండో పెళ్లి చేసుకోవచ్చని నారద (స్త్రీ పుంస, శ్లోకాలు 98-100) చెబుతుంది; పరాశరుడు కూడ ఇదే చెబుతున్నాడు. కాగా వశిష్ఠ (17.74) బౌద్ధాయన ధర్మసూత్రాలు (IV. 1-18) మొదటి వివాహంలో గర్భాదానం జరగని స్త్రీ మాత్రమే రెండో పెళ్లి చేసుకోవచ్చు అని చెబుతున్నది.
4. కలివర్జ్య పి.వి. కాణే, పుట 8-16.
5. అత్యంత ప్రాచీన స్మృతులు కూడా అనులోమ వివాహాన్ని అంగీకరించాయి. ఉదా. బోధాయన ధర్మసూత్రం 1.8.2-5; వశిష్ఠ 1.24-27; మను III 14-19; యాజ్ఞవల్క్య 1.56-57

(4) 'తెగించి ఉన్న బ్రాహ్మణులను ముఖాముఖి పోరాటంలో అయినా చంపటం.[6]

(5) ఓడలో ప్రయాణం చేసే అలవాటు ఉన్న ద్విజునితో అతను ప్రాయశ్చిత్తం చేసుకున్న తర్వాత అయినా కలిసి భోజనం చేయటం లాంటి సాధారణ సంబంధం పెట్టుకోవటానికి) అంగీకరించటం.[7]

(6) సత్రం నెలకొల్పటం.[8]

(7) కమండలం గ్రహించటం.[9]

(8) మహాయాత్ర ప్రారంభించటం[10]

(9) గోమేధ యజ్ఞంలో ఆవును చంపటం.[11]

(10) సౌత్రామని యజ్ఞంలో కూడా మద్యం సేవించటం.[12]

---

6. కలివర్జ్య పి.వి. కాణే. పే. 8-16.
7. ధర్మంపై గ్రంథాలు వ్రాసినవారి మేధస్సుకు ఎంతో పని కల్పించిన విషయం ఇది; మను (8.350-351); విష్ణు V.180-80; వశిష్ట(III-15-18) స్మృతులు అతతాయి బ్రాహ్మణున్ని చంపవచ్చునని అంగీకరిస్తే, సుమంతుడు ఏమంటాడంటే 'బ్రాహ్మణునీ, ఆవునూ తప్ప అతతాయిని చంపితే పాపం లేదు' అని. అంటే అతతాయి బ్రాహ్మణుని చంపరాదని అర్థం. దీనిపై చర్చకు యాజ్ఞవల్క్యస్మృతి పై రాసిన మితాక్షర గ్రంథం చూడండి.
8. బౌధ్ధాయన ధర్మసూత్రం(1.1.20), ఉత్తర భారతదేశ బ్రాహ్మణులలో ప్రయాణం చేయటం అనే ఒక వింత ఆచారం ఉండటాన్ని ఉదహరిస్తూ పతనీయాలలో ఇది మొదటిది అంటుంది. (11.1:41) "నౌయతు" అనే పదం తెలుపుతున్నట్టుగా, కొంతమంది రచయితలు సముద్రాన్ని దాటేవానికి ఈ నిషేధం వర్తిస్తుందని అంటారు. ఉశనసుడు 'సముద్రగ' పతితుడని అంటాడు. (జీవానంద, పుట 525).
9. బౌధ్ధాయన-ధర్మసూత్రం(1.3.4) స్నాతకుల( చదువు పూర్తి చేసుకొని వివాహం చేసుకున్నవారుగాని చేసుకోవటానికి సిద్ధమైనవారుగాని) ఆచారాలలో, నీటితో నిండిన కుండను (మట్టిదిగాని చెక్కదిగాని) మోసుకు వెళ్లాలి. వశిష్ఠ 12.14; మను 4.36; యాజ్ఞ 1.132 స్మృతులు కూడా ఇదే చెపుతాయి. మదన పారిజాత (పే. 15-16) ఈ శ్లోకాలను ఉదహరిస్తూ 'కమండలు విధారణ' అంటే నిత్య విద్యార్థిత్వం అని అంటున్నది. కాని ఇది సరైనది కాదు ఎందుకంటే నారదీయ పురాణంలో ఈ నిషేధాలను రెంటినీ ప్రత్యేకంగా చూపించటం జరిగింది.
10. అరణ్యావాసం చేసినవారు ఈశాన్యంవైపు వేళ్లే ఆచారం గురించి ఇది చెబుతుంది. (మను.VI.31; యాజ్ఞ I.55 ) మహాయాత్ర మొదలుపెట్టి చనిపోయేవరకూ నడవటం గానిఏదైనా ఏటవాలు కొండ గుట్టమీద నుంచి దూకటం గాని గంగానదిలో ప్రయాగ లాంటి పుణ్యస్థలాలలో దూకి చనిపోవటంగాని. అగ్నిలో దూకటంగాని ఉదహరిస్తుంది. అపరార్క, పే. 536లో దీనిని అనుమతించే వాక్యాలు ఉటంకించింది. ప్రఖ్యాతి గాంచిన మృచ్ఛకటిక రచయిత శూద్రకుడు కూడా అగ్నిలో ప్రవేశించాడని అంటాడు. మనువుపై మేధాతిథి వ్రాసిన పుస్తకంలో రఘువంశం 8.94; అత్రి 218-219 శ్లోకాలు ఉదహరిస్తూ రాజులు ప్రయాగవద్ద గంగానదిలో దూకి చనిపోయేవారని చెప్పాడు.
11. సాంఖ్యాయన శ్రౌత 14-15.1 6; కాత్యాయన శ్రౌత XXII II.3-4; మను XI.74.
12. సుత్రాముడు( అంటే ఇంద్రుడు) ప్రధానంగా చేసే యాగం ఇది. ఇందులో అశ్వని, సరస్వతి, ఇంద్రునికి మూడు కప్పుల మద్యం అర్పిస్తారు. అర్పించిన మద్యాన్ని తాగటానికి ఒక బ్రాహ్మణుడిని అద్దెకు తెచ్చుకోవాలి. తైత్తిరీయ బ్రాహ్మణం 1.8.6.2; సాంఖ్యాయన శ్రౌత. 15.15.15-1-14 పూర్వ మీమాంస సూత్రంపై శబర III 5.14-15.

(11)(12) అగ్నిహోత్రం తరువాత గరిటెకు అంటుకుని ఉన్న దానిని నాకటం, దానినే తిరిగి అగ్నిహోత్రంలో వాడటం.[13]

(13) శాస్త్రాలు విధించినట్టుగా అరణ్య వాసానికి వెళ్ళటం.[14]

(14) మనిషి ప్రవర్తన, వైదిక జ్ఞానాలను బట్టి (మరణం లేదా పుట్టుక వల్ల కలిగిన) అశౌచ కాలాన్ని తగ్గించటం.[15]

(15) బ్రాహ్మణులకు మరణాన్ని ప్రాయశ్చిత్తంగా నిర్ణయించటం.[16]

(16) (బంగారం) దొంగతనం కాక (ప్రాయశ్చిత్తం రహస్యంగా చేసుకోవటం) ఇతర మానవ సంబంధమైన పాపాలకూ మహాపాతకాలు చేసినవారితో సంబంధం పెట్టుకున్నందుకూ[17]

(17) పెళ్లికొడుకుకు, అతిథి పితరులకు మంత్రాలతో జంతుమాంసాన్ని సమర్పించటం.[18]

(18) [19]ఔరస (సహజ) దత్త పుత్రలనే కాకుండా ఇతర రకరకాల పుత్రులను కూడా కొడుకులుగా అంగీకరించటం.[20]

---

13. తై–బ్రా. 11.1.4; సత్యసాధశ్రౌత చూ.
14. ఆప ధర్మ–సూత్ర II 9.21.18; 11.9.23.2; మను. VI. 1–32; వశిష్ఠ IX 1–11లలో ఈ దశపై నియమాలు విస్తారంగా ఉన్నాయి.
15. పరాశరుడు పైన ప్రస్తావించిన విధంగా ఏం చెబుతాడంటే వైదిక జ్ఞానం కలిగి ఉండి, అగ్నిహోత్రం చేసే బ్రాహ్మణుడు ఒక్కరోజుకే అశౌచం ఆచరించాలి. కేవలం జ్ఞానం ఉన్నవాడు మూడురోజులు ఆచరించాలి. గౌతమంపై హరిదత్తుడు 141 బృహస్పతిని సూచిస్తూ చెప్పినది కూడా చూడండి. కలిలో అందరికీ 10 రోజుల నియమం పెట్టారు. యాజ్ఞవల్క్యంపై విశ్వరూప III 30. ఈ విషయంలో విపుల వర్ణన ఇస్తూ పేరాశ లేకపోవటం, సత్ప్రవర్తన కలిగి ఉండటం కేవలం అర్థవాదంగా కొట్టిపారేశాడు. కలివర్జ్యపై ఉన్న శ్లోకాలు విశ్వరూపునికి తెలిసి ఉన్నా, లేదా వాటికి అతను ఏ మాత్రమైనా విలువ ఇచ్చి ఉన్నా పరాశరుని విడమర్చి చెప్పటంలో వాటిని వాడుకోకుండా ఉండే వాడు కాదని భావించటం అసమంజసం ఏమీ కాదు.
16. మను II.89, II.146)ఏమంటాడంటే బ్రాహ్మణున్ని ఉద్దేశపూర్వకంగా చంపినందుకు మద్యపానం చేసినందుకు ప్రాయశ్చిత్తం మరణం అని. గౌతముడు 21.7, మనువును అనుసరిస్తూ అదే అన్నాడు.
17. మనువు XI-54 నాలుగు మహా పాతకాలను చేసిన వానితో సంబంధం పెట్టుకోవటం అయిదో మహా పాతకం అంటాడు. గౌతమ 24, వశిష్ట 25 సూత్రాలు బ్రహ్మహత్యలాంటి మహాపాతకానికి కూడా రహస్య ప్రాయశ్చిత్తాలను సూచిస్తున్నాయి. కలియుగంలో బ్రాహ్మణ హత్యకు మద్యపానానికి వావివరుసలు లేకుండా వ్యభిచరించినదానికి, రహస్య ప్రాయశ్చిత్తాలు లేవని ఈ నియమం చెబుతున్నది. ఎవరు రహస్య ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చునో చెప్పిన నియమాల కోసం అపరార్క పే. 1212 చూడండి.
18. మధుపర్కం సమర్పించదగిన ఆదరణీయ అతిథులలో పెళ్లికొడుకును కూడా చేర్చారు. గౌతమ V. 25–35 యాజ్ఞ 1.109. శ్రాద్ధకర్మలో వివిధ జంతువుల మాంసాన్ని సమర్పించటం పితృ సంతృప్తికోసమని అంటారు. యాజ్ఞ 1.258–260. మనువు III123; ఆశ్వలాయన గృహ్యసూత్రాల ప్రకారం 1.24–26, మాంసం లేకుండా మధుపర్కం సమర్పించకూడదు. వశిష్ట IV 5.6 చూడండి.
19. కాణే. కలివర్జ్య, పుట 8–16.
20. మను 9.165–80 యాజ్ఞ II 128–132 తదితరులు పన్నెండు రకాల కుమారుల గురించి చెప్పారు.

(19) అగ్రకులాల స్త్రీలతో లైంగిక సంబంధం పెట్టుకున్న పాపం చేసిన వారితో వారు ప్రాయశ్చిత్తం చేసుకున్నా కూడా సాధారణ సంబంధాలు పెట్టుకోవటం.[1]

(20) ఒక పెద్ద మనిషి (లేదా గౌరవించదగిన వ్యక్తి) భార్య తీవ్రంగా గర్హించదగిన వ్యక్తితో లైంగిక సంబంధం పెట్టుకుంటే ఆమెను త్యజించటం.[2]

(21) [3]ఇతరుల కోసం తన్ను తాను చంపుకోవటం.[4]

(22) ఒకరు తిని విడిచిపెట్టిన ఆహారాన్ని విడిచిపెట్టి వేయటం.[5]

(23) జీవితాంతం ఒక నిర్దిష్టమైన విగ్రహారాధన (చెల్లింపుబదులీగా)[6]

(24) (మరణం వలన) బూడిదైన ఎముకలు ప్రోగు చేయటంవల్ల అశౌచం కలిగి ఉన్న వ్యక్తుల శరీరాన్ని తాకటం.[7]

(25) యజ్ఞ పశువును బ్రాహ్మణులు స్వయంగా నరకటం.

(26) [8]బ్రాహ్మణులు సోమ మొక్కను అమ్మటం".[9]

---

1. గౌతమ IV20,22-23 క్రింది కులాలవారు పై కులాల స్త్రీలతో లైంగిక సంబంధం పెట్టుకోవటాన్ని తీవ్రంగా నిరసిస్తూ వారి సంతానాన్ని ధర్మహీనులు అన్నాడు.
2. నాల్గురకాల స్త్రీలను అంటే శిష్యునితో సంబంధం పెట్టుకున్న ఆమె లేదా భర్త గురువుతో సంబంధం పెట్టుకున్నామె, లేదా భర్తను చంపిన ఆమె లేదా తక్కువ కులం పురుషునితో వ్యభిచరించిన ఆమెను త్యజించాలని వశిష్ఠ 21.10 చెబుతున్నది. యాజ్ఞ స్మృతి III 296-297 దీనిని వ్యతిరేకిస్తూ, అటువంటి స్త్రీలను కూడా ఇంటిదగ్గరే అట్టిపెట్టుకొని వస్తులు పెడుతూ ఉండాలని అంటున్నది.
3. కాణే కలివర్జ్య పుట 8-12.
4. ఆవుల కోసం బ్రాహ్మణులకోసం ప్రాణాలనైనా త్యజించాలని స్మృతులు చెబుతున్నాయి. మను XI 79, విష్ణు III 45.
5. వశిష్ఠ 14-20.21 ప్రకారం తన కోసం తీసుకున్న ఆహారం తిని మిగిల్చిన ఆహారాన్ని, అడుగున మిగులు ఆహారం అంటుకున్న ఇతర ఆహారాన్ని విడిచిపెట్టాలి. లేదా మిగిలిన ఆహారం ఇతరులకు ఇవ్వటం అనే అర్థం కూడా వస్తుంది. కొన్ని స్మృతులు ఉచ్ఛిష్టాన్ని శూద్రులకు, అటువంటివారికి ఇవ్వవచ్చని అంటున్నాయి. ఇక్కడ అది నిషిద్ధం. గౌతమ X 61, మను X 125.
6. డబ్బుకోసం ఆరాధన చేసే బ్రాహ్మణుల్ని శ్రాద్ధకర్మకు, దేవకృత్యానికి పిలవకూడదని మను III 152 చెబుతున్నది.
7. దహనం అయిన నాలుగోరోజున కాలిన ఎముకలు పోగు చేసుకుంటారు. విష్ణు 19.10-12 వైఖానస స్మార్త సూత్ర V 7, సంవర్త, శ్లోకాలు 38-39.
8. కాణే కలివర్జ్య. పుట 13.
9. కాత్యాయన శ్రౌత (VII 6.2-4) కౌత్సగోత్రానికి చెందిన బ్రాహ్మణుని నుంచిగాని శూద్రుని నుంచిగాని సోమం తీసుకోవచ్చని చెబుతుంది. కాని మనువు X 88 బ్రాహ్మణుడు తాను వ్యవసాయ వృత్తిలో జీవిస్తున్నా, వైశ్యుని వృత్తిలో జీవిస్తున్నా చాలా వస్తువులతో పాటు సోమం అమ్మకాన్ని గర్హించాడు. మనువు (III 158, 176) సోమం అమ్మే బ్రాహ్మణుడు శ్రాద్ధానికి అనర్హుడని అన్నాడు.

(27) బ్రాహ్మణుడికి ఆరుసార్లు (మూడురోజులు) భోజనం లేకపోయినప్పుడు శూద్రుని వద్ద నుంచి ఆహారం తేవటం.[1]

(28) శూద్రుల నుంచి, వారు అతని దాసులైనా, పశుపాలకులైనా, వంశపారంపర్యంగా వస్తున్న స్నేహితులైనా, పంటలో కొంతభాగం ఇచ్చే షరతు మీద తన భూమిని సాగుచేస్తున్న వారైనా వారి దగ్గర నుంచి వండిన అన్నం తీసుకోవటానికి బ్రాహ్మణుడికి అనుమతి ఉన్నది.[2]

(29) దూరయాత్రలకు వెళ్ళటం.[3]

(30) శిష్యుడు గురుపత్నిని గురువు మాదిరిగానే స్మృతులు చెప్పినట్టుగా చూడటం.[4]

(31) కష్టాలలో అనుచితమైన వ్యవహారాలు చేపట్టటం ద్వారానైనా బ్రాహ్మణులు బ్రతకటం, రేపటికి మిగుల్చుకోకుండా బ్రాహ్మణుడు బ్రతికే విధానం.[5]

(32) [6]బాలుని జాతకర్మ నుంచి అతని వివాహం వరకూ అన్ని క్రతువులూ అందులోనే జరుగుతాయని బ్రాహ్మణులు అరణి (నిప్పు పుట్టించటానికి రెండు కట్టెలు) స్వీకరించటం.[7]

(33) బ్రాహ్మణులు నిత్యయాత్రలు చేయటం.

(34) నోటితో నిప్పు రాజేయటం (గెడగొట్టం ఉపయోగించకుండా)[8]

---

1. మనువు. XI 16. మూడు రోజుల నుంచి ఆహారం లేని బ్రాహ్మణుడు తక్కువ పనులు చేసేవారి వద్ద నుంచి ఒకసారి ఆహారం తీసుకోవచ్చని అంటాడు. యాజ్ఞ III 43 కూడా అదే చెపుతుంది. 'హీనకర్మణు ల నుంచి అంటే నీచమైన పనులు చేస్తున్నవారి నుంచి (అడుక్కోవటం, దొంగతనం లేదా నారద. అభ్యుపేత్య శుశ్రూష లో (VV.5-7) చెప్పిన పనులు లాంటివి) అని అర్థం వస్తుంది.
2. శూద్రుని నుంచి, వారు తమ దాసులైనా, మంగలి పశువుల కాపరి, తమ పొలం సాగుచేస్తున్న వ్యక్తి వంశపారంపర్యమైన స్నేహితులైతే వారి నుంచి బ్రాహ్మణులు వండిన అన్నం తీసుకోవచ్చునని మనుస్మృతి చెబుతున్నది. గౌతమ 17.6; మను IV 25.3 యాజ్ఞ 1.166 (మొదటి భాగం ఇలా ఉంటుంది) అంగిరస 120, పరాశర XI.
3. కాణే కలివర్జ్య పే. 14
4. తన గురుపత్ని గురువు కులానికి చెందినదైతే గురువు మాదిరిగా గౌరవించాలని, కాకపోతే లేచి నమస్కరించాలని మనువు 11–210 చెప్పాడు.
5. కష్టాలలో బ్రాహ్మణుడు క్షత్రియ లేదా వైశ్య వృత్తి చేసుకొని బ్రతకవచ్చని గౌతమ VII 1–7; ఆపదర్మ సూ. 1.7.20, 11–17, 21, 4. యాజ్ఞ. III 35, 44 ఇతర సూత్రాలు చెబుతున్నాయి. బ్రాహ్మణుడు మూడు రోజులకు సరిపోయే ధాన్యం లేదా ఆరోజుకు సరిపోయే ధాన్యం తప్ప ఎక్కువ పోగు చేసుకోకుండా ఉండటం ఆదర్శవంతమైనదని మనువు (IV-7) చెప్పాడు. అతిగా ఉన్న ఈ రెండూ ఇక్కడ నిషేధం అయ్యాయి.
6. కాణే కలివర్జ్య పే. 14
7. దీనికి సంస్కార్య కౌస్తుభం ఒక గృహ్య పరిశిష్టను సూచిస్తుంది.
8. మను. (IV 53) లో కూడా ఇదే నిషేధం ఉన్నది. నోటి నుంచి తిన్నగా నిప్పు రాజేయటం అనేది వైదిక గ్రంథ భాగాలలో కూడా ఉన్నది. ఆప.ధ. సూ.పై.హరదత్తం (1.5.15.20) చూడండి.

(35) మానభంగం మొదలైన వాటివల్ల అపవిత్రమైన స్త్రీలను, శాస్త్రగ్రంథాలలో చెప్పిన రీతిగా ప్రాయశ్చిత్తం చేసుకున్న తర్వాత కులంలో తిరిగి స్వీకరించటం.[1]

(36) అన్ని వర్ణాల (శూద్రులతో సహా) వారి నుంచి సన్యాసులు భిక్ష[2] తీసుకోవటం.[3]

(37) అప్పుడే నేల తవ్వి తీసిన నీరు (బావి) వాడకుండా పదిరోజులు వేచి ఉండటం.

(38) శాస్త్రాలలో నిర్ణయించిన నియమాల ప్రకారం (విద్యాభ్యాసం పూర్తయిన తర్వాత) గురువు అడిగిన దక్షిణ ఇవ్వటం.[4]

(39) [5]బ్రాహ్మణులూ, ఇతరులూ శూద్రులను వంటమనుషులుగా నియమించుకోవటం.[6]

(40) ఏటవాలు కొండ మీద నుంచి అగ్నిలోకి దూకటం ద్వారా ముసలివారు ఆత్మహత్య చేసుకోవటం.[7]

(41) ఆవు కడుపునిండా నీరు త్రాగిన తర్వాత ఇంకా మిగిలిన నీటిలో మర్యాదస్తులు ఆచమనం చేయటం.[8]

(42) తండ్రీ కొడుకుల వివాదంలో సాక్ష్యం ఇచ్చే సాక్షులకు జరిమానా విధించటం.[9]

43. సాయంకాలానికి ఎక్కడ ఉంటే అక్కడే సన్యాసి ఆగిపోవటం.[10]

---

1. తర్వాతి కాలంలో వచ్చిన దేవల స్మృతి కూడా (47వ శ్లోకం) మ్లేచ్ఛుడు మానభంగం చేసిన స్త్రీ కూడా మూడురోజులు ఆమె ప్రాయశ్చిత్తం చేసుకుంటే పవిత్రురాలయిపోతుందని ఒప్పుకుంటుంది. అమాయకులైన, అభాగ్యులైన స్త్రీలపై ఆదిత్య పురాణం చాలా కఠినంగా ఉంటుంది
2. కాణే కలివర్జ్య పే. 15
3. బౌదాయన ధర్మ సూత్రం 11.10, అన్ని వర్ణాల నుంచి సన్యాసి బిచ్చమడగవచ్చని చెప్తుంటే మను VI 3; యజ్ఞ్ III 59 మాత్రం గ్రామంలో సాయంకాలం మాత్రం అతను భిక్షాటన చెయ్యాలని చెప్తున్నాయి. వశిష్ఠ ధ.శా. (X.7) ముందు ఎంపిక చేసుకోకుండా 7 ఇళ్లలో భిక్షం అడగవచ్చని చెబుతుంది. కాని కొంతముందుకు వెళ్లిన తర్వాత వశిష్ఠ ధ.సూ. ఏం చెబుతుందంటే (X.24) బ్రాహ్మణుల ఇళ్లల్లో ఏమి దొరికితే దానితోనే బ్రతకాలని చెబుతుంది.
4. వైదిక విద్య చదవటం పూర్తయి వ్రతాలు ఆచరించిన తర్వాత విద్యార్థి గురువు కోరినంత దక్షిణ ఇవ్వాలి. ఆచార సంబంధమైన స్నానమాచరించాలని యాజ్ఞ్ 1.51 నిర్ధారిస్తుంది.
5. కాణే కలివర్జ్య. పుట 15
6. ఆర్యుల పర్యవేక్షణలో మూడు అగ్రవర్ణాలకు శూద్రులు వంట మనుషులుగా ఉండటానికి ఆపస్తంబ ధర్మసూత్రం 11.2.3.4 అంగీకరిస్తుంది.
7. పై పుస్తకంలో అంశం 8.
8. నేలపై రంధ్రంలో ఉన్న (గుంటలో చేరిన) నీరు ఆవు దాహం తీర్చేటంత ఉంటే అది ఆచమనకు తగినదని వశిష్ఠ III.35 చెబుతున్నది. మను V.128, యాజ్ఞ్ 1.192.
9. తండ్రీ కొడుకుల వివాదంలో సాక్ష్యం ఇచ్చిన వ్యక్తికి యాజ్ఞ్ II 239 మూడు పణాలు జరిమానా విధిస్తుంది.
10. సాయంత్రం సన్యాసి ఒక ఇంటిలో ఉండాలి అనే అర్థం కూడా వస్తుంది.

ఇవి ఆదిత్య పురాణంలో పేర్కొన్న కలివర్జ్యాలు.

ఈ కలివర్జ్య స్మృతి గురించిన చిత్రమైన విషయం ఏమంటే దీని ప్రాధాన్యతను పూర్తిగా గమనించకపోవటం. కలియుగంలో నిషేధం అయిన విషయాల జాబితాగా దీనిని ప్రస్తావించటం జరిగింది. ఈ నిషేధాల జాబితా వెనుక ఇంకా ఎంతో ఉన్నది. కలివర్జ్య స్మృతిలో పేర్కొన్న ఆచారాలను ప్రజలు అనుసరించటం నిషేధించిన మాట నిజమే. ప్రశ్న ఏమంటే, ఈ ఆచారాలను నిరసించింది అవి అవినీతి మయమైనవనా? పాప భూయిష్ఠమైనవనా లేక ఇతర విధంగా సమాజానికి నష్టదాయకమనా? దీనికి జవాబు 'కాదు' అనే వస్తుంది. ఈ ఆచారాలు నిషిద్ధాలైతే మరి వాటిని ఎందుకు నిరసించలేదో తెలుసుకోవాలని ఎవరికైనా ఉంటుంది. ఇక్కడే కలివర్జ్య స్మృతిలో చిక్కుమెలిక ఉన్నది. ఒక ఆచారాన్ని నిరసించకుండా నిషేధించటం అనే ఎత్తుగడ ముందు యుగాలలో అనుసరించిన విధానానికి పూర్తి వ్యతిరేకంగా ఉన్నది. ఒక్క ఉదాహరణే తీసుకుందాం. ఆస్తి మొత్తం పెద్ద కొడుకుకే ఇచ్చివేసే ఆచారాన్ని ఆపస్తంబ ధర్మసూత్రం నిషేధించింది. కాని దానిని అతడు నిరసించాడు. నిరసించకుండా నిషేధించటం అనే ఎత్తుగడలను బ్రాహ్మణులు ఎందుకు కనుగొన్నారు? పాతపద్ధతిని విడిచిపెట్టటానికి కొన్ని ప్రత్యేక కారణాలు ఉండి ఉంటాయి. ఏమిటి ఆ కారణాలు ?

**అనువాదకులు : బొజ్జా తారకం**
**కె. రాహుల్**

అనుబంధం : 1

# రామకృష్ణుల చిక్కుముడి

వాల్మీకి రాసిన రామాయణం కథానాయకుడు రాముడు. రామాయణం కథ చాలా చిన్నది. అంతేకాదు, కథ కూడా చాల మామూలుదే. అందులో సంచలనాత్మక మయింది ఏమీ లేదు.

అయోధ్య రాజు దశరథుడు. ఆయన కుమారుడు రాముడు. అయోధ్య అంటే ఇప్పటి వారణాసి. దశరథునికి కౌసల్య, కైకేయి, సుమిత్ర అని ముగ్గురు భార్యలుండేవారు. వీళ్ళు కాకుండా ఆయనకు ఎన్నో వందలమంది ఉంపుడుగత్తె లుండేవారు. వివాహంనాడు కొన్ని షరతులు పెట్టి కైకేయి దశరథుణ్ణి వివాహమాడింది. ఆ షరతులేవో పెళ్ళినాడు నిర్దిష్టం చేయలేదు. కాని కైకేయి ఎప్పుడు అడిగితే అప్పుడు వాటిని దశరథుడు నెరవేర్చాలి.

చాల ఏళ్ళ వరకూ దశరథునికి సంతానం కలగలేదు. రాజ్యానికి వారసుడు కలగాలని ఆయన చాల తీవ్రంగా వాంఛిస్తూ ఉండేవాడు. తన ముగ్గురు భార్యల్లో ఏ ఒక్కరూ తనకు సంతానం అందించే ఆశ కనపడక పోయేసరికి ఆయన పుత్రకామేష్టి యజ్ఞం చేయాలని తలపెట్టాడు. అందుకు శృంగ మహర్షిని పిలిపించాడు. ఆయన మూడు పిండాలను తయారుచేసి దశరథుని ముగ్గురు భార్యలకూ తినమని ఇచ్చాడు. ఈ ముగ్గురు భార్యలూ ఆ పిండాలను తినిన

---

ఇది 49 పుటల టైపు ప్రతి. హిందూయిజం ప్రతీకలు ('Symbols of Hinduism')అనే రాతప్రతితో బాటు చక్కగా బైండు చేసిపెట్టిన ఒక ఫైలులో పెట్టి ఉన్నది. చిక్కుముడుల అసలు పట్టికలో ఇది లేదు; అందుచేత ఈ భాగానికి అనుబంధంగా చేర్చాం. – సంకలనకర్త

---

గమనిక : ఈ అధ్యాయంలో వెలిబుచ్చిన అభిప్రాయాలతో ప్రభుత్వం ఏకీభవించటం లేదు.

తర్వాత గర్భవతులై కుమారులను కన్నారు. కౌసల్యకు రాముడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులు పుట్టారు. కొంత కాలానికి రాముడు సీతను పెళ్ళి చేసుకున్నాడు. రామునికి యుక్తవయసు వచ్చిన తర్వాత రాజ్యాధికారాన్ని అతనికి అప్పగించి తను వానప్రస్థానికి వెళ్ళిపోదామని అనుకున్నాడు దశరథుడు. ఇందుకోసం ఏర్పాట్లు జరుగుతున్నప్పుడు, ఏ షరతులపైన తాను దశరథుణ్ణి వివాహం చేసుకున్నదో, వాటిని నెరవేర్చాలని కైకేయి అడిగింది. షరతులు ఏమిటో తెలపవలసిందిగా దశరథుడు ఆమెను అడిగాడు. రామునికి బదులుగా తన కుమారుడైన భరతునికి పట్టాభిషేకం చేయాలనీ, రాముడు 12 సంవత్సరాలు వనవాసం చెయ్యాలనీ ఆమె తెలిపింది. ఎంతో అయిష్టంతో దశరథుడు అందుకు అంగీకరించాడు. భరతుడు అయోధ్యకు రాజు అయ్యాడు. రాముడు తన భార్యసీత, సవతి తమ్ముడు లక్ష్మణుడు వెంటరాగా వనవాసానికి వెళ్ళిపోయాడు. ఈ ముగ్గురూ అడవులలో నివసిస్తుండగా, లంకాధిపతి రావణుడు సీతను ఎత్తుకుపోయి, ఆమెను భార్యగా చేసుకొనే ఉద్దేశంతో తన రాజ్యంలో ఉంచాడు. రాముడు, లక్ష్మణుడు సీత కోసం వెదకడం ప్రారంభించారు. దారిలో వారు వానరజాతిలో ముఖ్యులైన సుగ్రీవుణ్ణి, హనుమంతుణ్ణి కలుసుకున్నారు. వారి సహాయంతో సీతను దాచిపెట్టిన స్థలం తెలుసుకొని లంకపై దండెత్తి, యుద్ధంలో రావణుణ్ణి జయించి సీతను రక్షించారు. రాముడు సీతా లక్ష్మణులతో అయోధ్యకు తిరిగివచ్చాడు. అప్పటికి పన్నెండు సంవత్సరాలు గడిచి పోయాయి. కైకేయి పెట్టిన షరతులు కూడా పూర్తయ్యాయి. దానితో భరతుడు సింహాసనం విడిచిపెట్టాడు. అతని స్థానంలో రాముడు అయోధ్యకు రాజు అయ్యాడు.

ఇదీ సంక్షిప్తంగా వాల్మీకి చెప్పిన రామాయణ గాథ.

రాముణ్ణి ఆరాధ్య దైవంగా చేసే అంశం ఏదీ ఈ కథలో లేదు. కేవలం అతడు ఒక విధేయుడైన కుమారుడు మాత్రమే. కాని రామునిలో అసాధారణమైనది ఏదో వాల్మీకికి కనిపించింది. అందుకే ఆయన రామాయణం వ్రాయడానికి సంకల్పించాడు. వాల్మీకి నారదుణ్ణి ఈ క్రింది ప్రశ్న అడిగాడు.[1]

"ఓ మహర్షీ! ప్రస్తుతం భూమి మీద పరిపూర్ణుడైన మానవుడు ఎవరో చెప్పు?" ఇలా అడిగి పరిపూర్ణ మానవుడిగా ఆయన ఎవరిని అనుకుంటున్నాడో వివరించసాగాడు. పరిపూర్ణ మానవుణ్ణి ఈ క్రింది విధంగా ఆయన నిర్వచించాడు.

"పరాక్రమవంతుడు, మత రహస్యాలను ఎరిగినవాడు, కృతజ్ఞత ఎరిగినవాడు, సత్యసంధుడు, మత సంబంధమైన వాగ్దానాన్ని నెరవేర్చడం కోసం కష్టకాలంలో అయినా స్వప్రయోజనాన్ని త్యజించగలిగినవాడు, సత్ప్రవర్తకుడు, పరహితాభిలాషి బలశాలి, జితేంద్రియుడు, సుందరరూపి, ప్రతిభాశాలి, ఇతరుల సంపదపై అసూయ లేనివాడు, యుద్ధంలో దేవతల హృదయాలలో

1. బాలకాండ-సర్గ 1. శ్లోకాలు : 1-5

కూడా భయోత్పాదన కలిగించగలిగినవాడు."

అయితే ఆలోచించుకోడానికి కొంత వ్యవధి కావాలన్నాడు నారదుడు పరిపక్వమైన పరిశీలన తర్వాత "ఇన్ని లక్షణాలు కలిగినవాడు దశరథుని కుమారుడయిన రాముడు ఒక్కడే అని చెప్పవచ్చును" అన్నాడు.

అంతటి సకల సద్గుణవంతుడు కాబట్టే రాముణ్ణి అవతారమూర్తిగా చేశారు.

కాని రాముడు అవతరమూర్తిగా ఆరాధించదగిన వ్యక్తియేనా?

అతణ్ణి భగవంతునిగా భావించి ఆరాధించే వ్యక్తులు ఈ క్రింది వాస్తవాలను పరిశీలించాలి.

రాముని పుట్టుక మహిమాన్వితమైనట్టిదని, శృంగమహర్షి తయారు చేసిన పిండాలలోంచి రాముడు జన్మించాడని సూచిస్తున్నారు. ఇలా అనడం భార్యాభర్తలుకాని కౌసల్యకూ శృంగ మహర్షికీ రాముడు పుట్టాడు అనే నగ్నసత్యాన్ని కప్పిపుచ్చడానికి వాడుతున్న ఒక మేలి ముసుగు మాత్రమే అని చెప్పవచ్చు. ఏమయినప్పటికీ రాముని పుట్టుక ఆదిలో అగౌరవకరమైనది కాకపోయినా కచ్చితంగా అది అసహజమే.



రామాయణంలో రాముని పాత్ర చాల నిస్సారమైనది. ఆయన జన్మకు సంబంధించిన రుచించని ఇతర సంఘటనలు కొన్ని ఒకప్పుకోకుండా ఉండలేము.

రాముడు విష్ణువు అవతారమనీ, విష్ణువే దశరథుని కొడుకు రామునిగా జన్మించడానికి అభయమిచ్చాడనే విషయాన్ని నొక్కి చెబుతూ వాల్మీకి తన రామాయణం ప్రారంభిస్తాడు. విష్ణువు అవతారం దాల్చబోతున్న విషయం బ్రహ్మకు తెలిసింది. రామావతారం దిగ్విజయంగా పరిపూర్తి కావాలంటే రామునికి అనుచరులుగా ఉండడానికి, అతనికి తోడ్పడడానికి పరాక్రమవంతులైన సహచరులు ఉండే ఏర్పాట్లు జరగాలని భావించాడు. అప్పట్లో అటువంటివారు ఎవరూ లేరు.

బ్రహ్మ ఆజ్ఞను నెరవేర్చడం కోసం దేవతలు వెలయాలులైన అప్సరసలతో వ్యభిచరించడమే కాకుండా యక్షుల, నాగుల అవివాహిత కుమార్తెలతోనూ వ్యభిచరించి యక్ష, విద్యాధర, గంధర్వ, కిన్నెర, వానరుల ధర్మపత్నులతో కూడా మూక ఉమ్మడిగా వ్యభిచరించి వానరులను పుట్టించారు. వారే తరువాత రాముని సహచరులయ్యారు.

ఆయన జన్మ విషయంలో అయినా కాకపోయినా అతని సహచరుల జన్మ విషయంలో మాత్రం రాముని పుట్టుక వ్యభిచారాన్ని పెద్ద పెట్టున మోసుకు వచ్చింది. కచ్చితంగా సీతతో అతని వివాహ విషయం కూడా వివాదాలకు అతీతం కాదు. బౌద్ధ రామాయణం ప్రకారం సీతారాములు అన్నా చెల్లెళ్ళు. ఇద్దరూ దశరథుని సంతానమే. బౌద్ధ రామాయణంలో చెప్పిన

బంధుత్వాన్ని వాల్మీకి రామాయణం అంగీకరించదు. వాల్మీకి ప్రకారం సీత విదేహ రాజయిన జనకుని కూతురు. కాబట్టి ఆమె రాముని చెల్లెలు కాదు. ఇది నమ్మదగిందిగా లేదు. ఎందుకంటే, వాల్మీకి ప్రకారం కూడ సీత జనకుని స్వంత కూతురు కాదు. ఆమె ఎవరో ఒక రైతు తన పొలం దున్నుకుంటుంటే దొరికిన శిశువు. అతడు ఆమెను తీసుకువెళ్ళి జనకునికి ఇచ్చాడు. జనకుడు ఆమెను పెంచాడు. కాబట్టి సీత జనకుని కూతురని ఏదో పైకి చెబుతారు, అంతే.

బౌద్ధ రామాయణంలోని కథ చాలా సహజంగా ఉంది. ఆర్యుల వైవాహిక సూత్రాలకు విరుద్ధంగా[1] కూడా ఉండదు. ఈ కథే కనుక నిజమయితే సీతారాముల వివాహం అందరూ అనుకరించదగినంత ఆదర్శవంతమైనదేమీ కాదు. మరొకలా చెప్పాలంటే, అసలు సీతారాముల వివాహం అనుకరించదగిందీ, ఆదర్శవంతమైనదీ కానేకాదు. రామునికి ఆపాదించే గుణాలలో ఒకటి అతను ఏకపత్నీవ్రతుడని. ఈ అభిప్రాయం అందరూ అంగీకరించేలా ఎలా ప్రచారంలోకి వచ్చిందో తెలుసుకోవడం కష్టం, ఎందుకంటే, నిజంగా దీనికి ఏ ఆధారాలూ లేవు. వాల్మీకి సైతం రామునికి ఎందరో భార్యలుండేవారని అంటాడు.[2] వీరికి తోడు అతనికి ఇంకా ఎదరో ఉంపుడుగత్తెలు కూడా ఉండేవారు. ఈ విషయంలో రాముడు తన నామమాత్రమైన తండ్రి దశరథునికి నిజమైన తనయుడే. ఎందుకంటే దశరథునికి ముగ్గురు భార్యలే కాదు, ఇంకా ఎందరో భార్యలుండేవాడు.

ఒక వ్యక్తిగా, రాజుగా రాముని శీలం ఎటువంటిదో ఇప్పుడు పరిశీలిద్దాం.



రాముణ్ణి ఒక వ్యక్తిగా చెప్పుకొనేటప్పుడు కేవలం రెండే రెండు సంఘటనలు ప్రస్తావిస్తాను. ఒకటి, వాలిపట్ల ఆయన ప్రవర్తన. రెండోది, తన భార్య అయిన సీత పట్ల ఆయన వ్యవహరించిన తీరు. ముందుగా వాలి కథ పరిశీలిద్దాం.

వాలి సుగ్రీవులిద్దరూ అన్నదమ్ములు. వానర జాతికి చెందినవారు. వారిది రాజవంశం. వారికి స్వంతరాజ్యముండేది. దానికి కిష్కింధ రాజధాని. సీతను రావణుడు అపహరించుకొని పోయేనాటికి కిష్కింధను వాలి పరిపాలిస్తూ ఉండేవాడు. వాలి సింహాసనం అధిష్ఠించిన రోజుల్లో మాయావి అనే రాక్షసునితో యుద్ధానికి తలపడ్డాడు. ఆ ద్వంద్వ యుద్ధంలో మాయావి ప్రాణ రక్షణకోసం పారిపోయాడు. వాలి సుగ్రీవులు అతన్ని తరుముకుంటూ వెళ్ళారు. మాయావి ఒక పెద్ద సొరంగంలోకి వెళ్ళి దాక్కున్నాడు. సొరంగం ముఖద్వారం దగ్గర సుగ్రీవుణ్ణి ఉండమని చెప్పి వాలి సొరంగం లోపలికి వెళ్ళాడు. కొంతసేపటికి సొరంగంలో నుంచి రక్తం వరదగా ప్రవహిస్తూ వచ్చింది. మాయావి వాలిని చంపేసి ఉంటాడని నిశ్చయించుకొని,

1. అన్నాచెల్లెళ్ళ మధ్య వివాహం ఆర్యులలో సమ్మతమే
2. అయోధ్యకాండ – సర్గ 8, శ్లోకం : 12.

సుగ్రీవుడు కిష్కింధకు తిరిగివచ్చాడు. వాలి స్థానంలో తనను రాజుగా ప్రకటించుకొని హనుమంతుణ్ణి ప్రధానమంత్రిని చేశాడు.

వాస్తవానికి వాలి చనిపోలేదు. వాలి చేతుల్లో మాయావి చనిపోయాడు. సొరంగంలోంచి వాలి బయటకు వచ్చాడు. అయితే అక్కడ అతనికి సుగ్రీవుడు కనిపించలేదు. కిష్కింధకు బయలుదేరాడు. అక్కడ సుగ్రీవుడు రాజుగా ప్రకటించుకొని ఉండడం చూసి ఎంతో ఆశ్చర్యపోయాడు. తన సోదరుడు చేసిన ఈ ద్రోహపూరితమైన చర్యకు వాలికి చాలా కోపం వచ్చింది. కోపం రావడానికి తగిన కారణాలున్నాయి కూడా. సుగ్రీవుడు తిరిగి వెళ్ళేముందు వాలి చనిపోయాడని నిర్ధారణ చేసుకొని ఉండవలసింది. వాలి చనిపోయి ఉంటాడని ఊరికే ఊహించుకొని వెళ్ళి ఉండవలసింది కాదు. రెండోది ఏమంటే, వాలికి అంగదుడు అనే కొడుకు ఉన్నాడు. వాలి తరువాత ధర్మ సమ్మతమైన వారసుడుగా అతనిని సుగ్రీవుడు రాజుగా చేసి ఉండవలసింది. ఈ రెండింటిలో సుగ్రీవుడు ఏదీ చెయ్యలేదు. రాజ్యాన్ని ఆక్రమించుకున్నాడు. అంతే. వాలి సుగ్రీవుణ్ణి తరిమివేసి సింహాసనాన్ని తిరిగి అధిష్టించాడు. అన్నదమ్ములిద్దరు ఒకరినొకరు చంపుకునేంత శత్రువులయ్యారు.

ఇంచుమించుగా రావణుడు సీతను ఎత్తుకు పోయినప్పుడే ఇది జరిగింది. ఆమెను వెతుక్కుంటూ రామలక్ష్మణులు తిరుగుతున్నారు. వాలి దగ్గర నుంచి సింహాసనం తిరిగి సంపాదించుకోడానికి సహాయం చేసే స్నేహితుల కోసం సుగ్రీవుడు, హనుమంతుడు వెతుకుతూ ఉన్నారు. అనుకోకుండా ఈ ఇద్దరూ కలిశారు. ఒకరి కష్టాలు ఒకరు చెప్పుకున్న తర్వాత ఇద్దరి మధ్య ఒక ఒప్పందం కుదిరింది. వాలిని చంపి తిరిగి కిష్కింధ సింహాసనం అధిష్టించడంలో అతనికి రాముడు సహాయం చేయడానికీ, దానికి బదులుగా సుగ్రీవుడు, హనుమంతుడు, సీతను వెదకడంలో రామునికి సహాయం చేయడానికి అంగీకారం కుదిరింది. ఈ ఒప్పందాన్ని పూర్తి చేయడంలో రాముని కర్తవ్యం సుకరం చేయడానికి సుగ్రీవుడు ఒక పథకం వేశాడు. వాలి సుగ్రీవులు యుద్ధం చేస్తున్నపడు ఎవరో ఎవరో సులువుగా గుర్తించడం కోసం సుగ్రీవుడు మెడలో ఒక హారం ధరిస్తానని చెప్పాడు. అప్పుడు రాముడు చెట్టు చాటున దాక్కొని బాణం తీసుకొని వాలిని కొట్టి చంపాలి. ఆ ప్రకారంగా మల్ల యుద్ధం ఏర్పాటు చేశారు. సుగ్రీవుడు మెడలో హారం వేసుకున్నాడు. ద్వంద్వ యుద్ధం జరుగుతూ వుండగా రాముడు చెట్టు చాటున దాక్కొని వాలిని బాణంతో కొట్టి చంపి సుగ్రీవుడు కిష్కింధ రాజుగా అవడానికి మార్గం సుగమం చేశాడు. ఈ వాలి హత్య రాముని శీలంపై ఒక మాయని మచ్చ. ఏ మాత్రమూ కవ్వింపు లేకుండా రాముడు చేసిన నేరమిది. ఎందుకంటే రామునితో వాలికి ఏ శత్రుత్వమూ లేదు. ఇది చాలా పిరికి పందలు చేసేపని ఎందుకంటే వాలి నిరాయుధుడు. ముందే ఆలోచించుకొని ఒక పథకం ప్రకారం చేసిన హత్య ఇది.

★ ★ ★

చూస్తుంటేనే నాకు అసహ్యం వేస్తున్నది. ఓ జనకుని కూతురా! నీ ఇష్టమొచ్చిన చోటుకి నిన్ను వెళ్ళిపోనిస్తాను. నీతో నాకే సంబంధమూ లేదు. నిన్ను తిరిగి జయించు కున్నాను. నాకు తృప్తిగా ఉన్నది. ఎందుకంటే నా లక్ష్యం అదే. నీ అంత సౌందర్యవతి అయిన స్త్రీని అనుభవించకుండా రావణుడు విడిచిపెట్టి ఉంటాడని నేను అనుకోవడం లేదు."

సహజంగానే సీత రాముణ్ణి, నీచుడు, అధముడు అని అన్నది. "హనుమంతుణ్ణి నా దగ్గరకు పంపినప్పుడే రావణుడు నిన్ను ఎత్తుకు పోయాడు కాబట్టి నేను నిన్ను విడిచి పెట్టేస్తున్నానని కబురు చేసివున్నట్లయితే ఆత్మహత్య చేసుకొని, నీకీ శ్రమ లేకుండా చేసేదానిని కదా?" అని అన్నది. అతని కేమీ మాట రానీయకుండా తన పాతి వ్రత్యాన్ని రుజువు పరుచుకుంటానని ప్రతిజ్ఞ చేసింది. అగ్ని ప్రవేశం చేసి పునీతురాలుగా బయటకు వచ్చింది. ఈ రుజువుతో దేవతలు సంతృప్తి చెంది 'సీత పరమ పావని అని ప్రకటించారు. అప్పుడు ఆమెను అయోధ్యకు తీసుకు వెళ్ళడానికి రాముడు అంగీకరించాడు.

అయోధ్యకు తిరిగి తీసుకువచ్చిన తర్వాత అయినా ఆమెను ఏమి చేశాడు? అతను రాజు అయ్యాడు. ఆమెను పట్టమహిషిని గావించాడు. అంతే, కాని రాముడు రాజుగానే ఉండిపోయాడు. చాల తొందరలోనే సీత రాణిగా కొనసాగలేకపోయింది. ఈ సంఘటన రామునికి ఎంతో అపఖ్యాతిని తెచ్చి పెట్టింది. సీతారాముల పట్టాభిషేకం అయిన కొన్ని రోజులకు సీత గర్భవతి అయిందని వాల్మీకి రామాయణంలో చెప్తాడు. ఆమెను గర్భవతిగా చూసిన కొందరు దుర్మతులు ఆమె లంకలో ఉన్నప్పుడు రావణుని వల్లనే గర్భం దాల్చిందని నింద మోపి, అటువంటి స్త్రీని భార్యగా తిరిగి తీసుకొచ్చినందుకు రాముణ్ణి నిందించారు. ద్వేషపూరితమైన ఈ వదంతిని విదూషకుడయిన భద్రుడు రామునితో చెప్పాడు. ఈ నింద రాముణ్ణి చాల నొప్పించింది. చాల అవమానం జరిగిందని బాధపడ్డాడు. ఇది చాలా సహజం కూడా. అయితే ఇందులో అసహజమైన దేమంటే, ఆ అవమానాన్ని వదిలించుకునేందుకు ఆయన అవలంబించిన తీరుతెన్నులే.

ఈ అవమానాన్ని శ్రీఘ్రగతిని తొలగించుకోవడానికి ఆయన అడ్డదారి తొక్కాడు. అంటే, నిండు చూలాలు అయిన సీతను చెలికత్తెలు ఎవరూ లేకుండా, తిండి సౌకర్యం లేకుండా, ఆఖరికి ఆమెకు చెప్పా చెయ్యకుండా చాల ద్రోహబుద్ధితో ఒక అడవిలో విడిచి పెట్టేయాలని నిశ్చయించుకున్నాడు. సీతను విడిచిపెట్టేయాలనే భావం అతనికి ఆకస్మాత్తుగా క్షణికోద్రేకంలో వచ్చినట్టిది కాదు. ఆ భావం అతనికి ఎలా పుట్టింది, దాని నేవిధంగా పెంపుచేశాడు, ఏ విధంగా దానిని అమలు పరిచాడు అనే విషయాలు కొంచెం వివరంగా చెప్పుకోవలసి ఉంది.

నగరంలో సీత గురించి వచ్చిన అపవాదు గురించి ప్రజలు ఏమనుకుంటున్నారో భద్రుడు వచ్చి తనకు చెప్పినప్పుడు, రాముడు తన సహోదరులను పిలిపించి తన భావాలను

వెల్లడించాడు. సీత పాతివ్రత్యమూ, పవిత్రతా లంకలో రుజువైనాయని, దానికి దేవతలు సాక్ష్యంగా నిలిచారని, ఆమె అమాయకత్వాన్ని, పాతివ్రత్యాన్ని, పవిత్రతనూ తాను సంపూర్ణంగా విశ్వసిస్తున్నానని వారితో చెప్పాడు, "ఇంత జరిగినప్పటికీ సీతపై ప్రజలు అపనింద మోపి నన్ను నిందిస్తూ, నన్ను అవమానపరుస్తున్నారు. ఈ అవమానాన్ని ఎవరూ సహించలేరు. గౌరవమనేది చాల గొప్ప సంపద. దానిని నిలబెట్టుకోవడానికి దేవతలు, ఉత్తమ పురుషులూ ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటారు. ఈ అగౌరవాన్ని, అవమానాన్ని నేను సహించలేను. ఇటువంటి అగౌరవం, అవమానాన్నుంచి నన్ను కాపాడుకోవడానికి ఆఖరికి మిమ్మల్ని విడిచిపెట్టడానికి కూడా నేను సిద్ధమే. సీతను విడిచిపెట్టడానికి నేను వెనుకంజ వేస్తానని భావించకండి" అని వారితో అన్నాడు.

అది మంచో, చెడో అనే ఆలోచనకు తావీయకుండా ప్రజల నిందనుంచి తప్పించుకోవడానికి సీతను విడిచిపెట్టేయడ మొక్కటే సులువైన మార్గమని రాముడు అప్పటికే నిర్ణయించుకొని ఉన్నాడని మనకు దీనివలన తెలుస్తుంది. సీత జీవితం గురించి అసలు ఆలోచించనే లేదు. ఆలోచించినదల్లా తన పేరు ప్రతిష్ఠలు. ఈ అపవాదును అరికట్టడానికి ఆయన ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు. రాజుగా ఆ పని చెయ్యవచ్చు. తన భార్య పవిత్రురాలని నమ్మిన భర్త తప్పకుండా ఆ పని చేసి తీరుతాడు. జనులు వేస్తున్న అపనిందకు రాముడు లొంగిపోయాడు. అపనిందలకు కొదవ ఏముంది? ఇతరులు ఆయనను బలహీనుడు, పిరికివాడైన రాజని అంటున్నా రామునికి ప్రజాస్వామ్యంలో చాల నమ్మకం ఉందని చెప్పే హిందువులకు కొదవలేదు. ఏది ఎలా ఉన్నప్పటికీ తన కీర్తి ప్రతిష్ఠలను నిలుపుకోవడానికి తాను ఎన్నుకున్న దుష్టమైన మార్గాన్ని రాముడు తన సోదరులకే చెప్పాడు. ఎవరికైతే ఈ విషయం తెలియవలసి ఉన్నదో ఎవరికైతే దీనివలన నష్టం వాటిల్లుతున్నదో ఆ సీతకు మాత్రం చెప్పలేదు. అంతేకాక ఆమెను పూర్తి అంధకారంలో ఉంచాడు. ఈ వ్యవహారాన్ని చాలా రహస్యంగా ఉంచి, దానిని అమలు చేయడానికి సమయంకోసం ఎదురుచూస్తూ ఉన్నాడు.

రాముడు ఎదురుచూస్తున్న ఈ అవకాశాన్ని సీతను వెన్నాడుతున్న క్రూరవిధి అందజేసింది. గర్భవతులైన స్త్రీలు రకరకాల వస్తువులమీద రకరకాల అభీష్టాలను వ్యక్తం చేస్తుంటారు. రామునికిది తెలుసు. ఒక రోజు సీతతో, నీకు దేని మీదయినా మనసు కలుగుతున్నదా? అని అడిగాడు. అవునని చెప్పిందామె. దేనిమీద, అని రాముడు అడిగాడు. గంగానది ఒడ్డున ముని ఆశ్రమ పరిసరాలలో కందమూల ఫలాలు తింటూ కనీసం ఒకరాత్రి అయినా గడపాలని ఉంది అని ఆమె చెప్పింది. సీత అలా చెప్పగానే రామునికి ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. "రేపే నిన్ను పంపించే ఏర్పాటు చేస్తాను. బెంగపడకు" అని చాలా ప్రేమతో అన్నాడు. భార్యమీద ఎంతో ప్రేమ ఉన్న భర్త చేసిన వాగ్దానంగా సీత భావించింది. కాని రాముడు ఏమి చేశాడు సీతను విడిచిపెట్టేయాలని తాను చేసుకున్న నిర్ణయాన్ని

అమలు చేయడానికి ఇది మంచి అవకాశంగా భావించాడు. ఆ ప్రకారం తన సోదరులతో రహస్య సమాలోచనలు చేసి సీతను విడిచి పెట్టేయాలనే తన పథకాన్ని అమలు చేయడానికి సీత కోరిన కోరికనే ఒక అవకాశంగా ఉపయోగించుకుంటున్నానని వారితో చెప్పాడు. సీత తరపున తనను ఎవరూ బ్రతిమాలవద్దని వారితో చెప్పాడు. తనకు అడ్డం గనుక వచ్చినట్లయితే వారిని శత్రువులుగా భావిస్తానని కూడా వారిని హెచ్చరించాడు.

మరుసటి రోజునే రథంమీద తీసుకొని వెళ్ళి గంగానది ఒడ్డున అరణ్యంలో ఉన్న ముని ఆశ్రమం దగ్గర సీతను విడిచిపెట్టిరమ్మని లక్ష్మణుడిని ఆజ్ఞాపించాడు. సీత గురించి రాముడు చేసుకున్న నిర్ణయం ఆమెకు చెప్పడానికి ధైర్యం ఎలా కూడగట్టుకోవాలో లక్ష్మణుడికి తెలియలేదు. లక్ష్మణుడి అవస్థ చూసి రాముడు నది ఒడ్డున ముని ఆశ్రమం పరిసరాలలో కొంతకాలం గడపడానికి సీత ఇదివరకే తన కోరికను వెల్లడించి ఉన్నదని అన్నాడు. దానితో లక్ష్మణుడి మనసు తేలికపడింది. ఈ సంభాషణ రాత్రి సమయంలో జరిగింది.

మరుసటి రోజు ప్రొద్దున రథాన్ని సిద్ధం చేయమని సుమంతుణ్ణి లక్ష్మణుడు ఆదేశించాడు. రథాన్ని సిద్ధం చేశానని సుమంతుడు లక్ష్మణునితో చెప్పాడు. ఆ తరువాత లక్ష్మణుడు అంతఃపురానికి వెళ్ళి, సీతను కలుసుకొని ఆశ్రమ పరిసరాలలో కొన్ని రోజులు గడపాలని తనకు కోర్కె ఉన్నదని ఆమె రామునితో చెప్పిన విషయం, రాముడు ఆమె కోరికను నెరవేరుస్తానని చేసిన వాగ్దానం ఆమెకు గుర్తుచేసి అందుకు అవసరమైన ఏర్పాట్లు చేయడానికి రాముడు తనను నియమించాడని ఆమెతో అన్నాడు. రథం సిద్ధంగా ఉన్నదని ఆమెతో చెప్పి "వెళ్దాం పదండి" అన్నాడు. రామునిపట్ల కృతజ్ఞతతో నిండిన హృదయంతో ఆమె రథం ఎక్కింది. సుమంతుడు రథాన్ని నడుపుతూ వుండగా, లక్ష్మణుడు ఆమె తోడురాగా రథం గమ్యస్థానాన్ని చేరుకుంది. గంగ ఒడ్డున వారు చేరారు. బెస్తవాళ్ళు వారిని నావలో అవతలి ఒడ్డుకి దాటించారు. లక్ష్మణుడు సీత కాళ్ళపై పడ్డాడు. వెచ్చని కన్నీళ్ళు బొటబొట కారుతూ ఉండగా "ఓ మచ్చలేని మహారాణీ! నేను చేస్తున్న పనికి నన్ను క్షమించు. నిన్ను తన ఇంట్లో పెట్టుకొని ఉన్నందుకు తనను ప్రజలు నిందిస్తున్నందువల్ల నిన్ను ఇక్కడ వదిలివేయమని మా అన్నగారి ఆజ్ఞ" అని అన్నాడు.

రాముడు వదిలివేయగా అడవిలో చనిపోవలసిన సీత అక్కడకు సమీపంలో ఉన్న ఆశ్రమానికి చేరుకున్నది. వాల్మీకి ఆమెకు రక్షణ కల్పించి తన ఆశ్రమంలో ఉంచుకున్నాడు. కొంత కాలానికి, ఆ ఆశ్రమంలో సీత కుశలవులు అనే ఇద్దరు కవల పిల్లల్ని ప్రసవించింది. వారు ముగ్గురూ వాల్మీకితోనే జీవించారు. వాల్మీకి ఆ బాలురను పెంచి పెద్దచేసి తాను రచించిన రామాయణం గానం చేయడం నేర్పించాడు. ఆ అరణ్యంలో వాల్మీకి ఆశ్రమంలో పన్నెండు సంవత్సరాలు ఆ పిల్లలు పెరిగారు. రాముడు పరిపాలిస్తున్న అయోధ్యకు ఆ అరణ్యం ఎంతో దూరంలో లేదు. ఆ పన్నెండు సంవత్సరాలలో సీత బ్రతికి ఉందో, చనిపోయిందో తెలుసుకోడానికి ఆ ఆదర్శవంతుడైన భర్త, ప్రేమమూర్తి అయిన తండ్రి ఏ ఒక్కసారి కూడా

అమలు చేయడానికి ఇది మంచి అవకాశంగా భావించాడు. ఆ ప్రకారం తన సోదరులతో రహస్య సమాలోచనలు చేసి సీతను విడిచి పెట్టేయాలనే తన పథకాన్ని అమలు చేయడానికి సీత కోరిన కోరికనే ఒక అవకాశంగా ఉపయోగించుకుంటున్నానని వారితో చెప్పాడు. సీత తరపున తనను ఎవరూ బ్రతిమాలవద్దని వారితో చెప్పాడు. తనకు అడ్డం గనుక వచ్చినట్లయితే వారిని శత్రువులుగా భావిస్తానని కూడా వారిని హెచ్చరించాడు.

మరుసటి రోజునే రథంమీద తీసుకొని వెళ్ళి గంగానది ఒడ్డున అరణ్యంలో ఉన్న ముని ఆశ్రమం దగ్గర సీతను విడిచిపెట్టిరమ్మని లక్ష్మణుడిని ఆజ్ఞాపించాడు. సీత గురించి రాముడు చేసుకున్న నిర్ణయం ఆమెకు చెప్పడానికి ధైర్యం ఎలా కూడగట్టుకోవాలో లక్ష్మణుడికి తెలియలేదు. లక్ష్మణుడి అవస్థ చూసి రాముడు నది ఒడ్డున ముని ఆశ్రమం పరిసరాలలో కొంతకాలం గడపడానికి సీత ఇదివరకే తన కోరికను వెల్లడించి ఉన్నదని అన్నాడు. దానితో లక్ష్మణుడి మనసు తేలికపడింది. ఈ సంభాషణ రాత్రి సమయంలో జరిగింది.

మరుసటి రోజు ప్రొద్దున రథాన్ని సిద్ధం చేయమని సుమంతుణ్ణి లక్ష్మణుడు ఆదేశించాడు. రథాన్ని సిద్ధం చేశానని సుమంతుడు లక్ష్మణునితో చెప్పాడు. ఆ తరువాత లక్ష్మణుడు అంతఃపురానికి వెళ్ళి, సీతను కలుసుకొని ఆశ్రమ పరిసరాలలో కొన్ని రోజులు గడపాలని తనకు కోర్కె ఉన్నదని ఆమె రామునితో చెప్పిన విషయం, రాముడు ఆమె కోరికను నెరవేరుస్తానని చేసిన వాగ్దానం ఆమెకు గుర్తుచేసి అందుకు అవసరమైన ఏర్పాట్లు చేయడానికి రాముడు తనను నియమించాడని ఆమెతో అన్నాడు. రథం సిద్ధంగా ఉన్నదని ఆమెతో చెప్పి "వెళ్దాం పదండి" అన్నాడు. రామునిపట్ల కృతజ్ఞతతో నిండిన హృదయంతో ఆమె రథం ఎక్కింది. సుమంతుడు రథాన్ని నడుపుతూ వుండగా, లక్ష్మణుడు ఆమె తోడురాగా రథం గమ్యస్థానాన్ని చేరుకుంది. గంగ ఒడ్డున వారు చేరారు. బెస్తవాళ్ళు వారిని నావలో అవతలి ఒడ్డుకి దాటించారు. లక్ష్మణుడు సీత కాళ్ళపై పడ్డాడు. వెచ్చని కన్నీళ్ళు బొటబొట కారుతూ ఉండగా "ఓ మచ్చలేని మహారాణీ! నేను చేస్తున్న పనికి నన్ను క్షమించు. నిన్ను తన ఇంట్లో పెట్టుకొని ఉన్నందుకు తనను ప్రజలు నిందిస్తున్నందువల్ల నిన్ను ఇక్కడ వదిలివేయమని మా అన్నగారి ఆజ్ఞ" అని అన్నాడు.

రాముడు వదిలివేయగా అడవిలో చనిపోవలసిన సీత అక్కడకు సమీపంలో ఉన్న ఆశ్రమానికి చేరుకున్నది. వాల్మీకి ఆమెకు రక్షణ కల్పించి తన ఆశ్రమంలో ఉంచుకున్నాడు. కొంత కాలానికి, ఆ ఆశ్రమంలో సీత కుశలవులు అనే ఇద్దరు కవల పిల్లల్ని ప్రసవించింది. వారు ముగ్గురూ వాల్మీకితోనే జీవించారు. వాల్మీకి ఆ బాలురను పెంచి పెద్దచేసి తాను రచించిన రామాయణం గానం చేయడం నేర్పించాడు. ఆ అరణ్యంలో వాల్మీకి ఆశ్రమంలో పన్నెండు సంవత్సరాలు ఆ పిల్లలు పెరిగారు. రాముడు పరిపాలిస్తున్న అయోధ్యకు ఆ అరణ్యం ఎంతో దూరంలో లేదు. ఆ పన్నెండు సంవత్సరాలలో సీత బ్రతికి ఉందో, చనిపోయిందో తెలుసుకోడానికి ఆ ఆదర్శవంతుడైన భర్త, ప్రేమమూర్తి అయిన తండ్రి ఏ ఒక్కసారి కూడా

ప్రయత్నించలేదు.

పన్నెండు సంవత్సరాల తర్వాత చాలా విచిత్రమైన పరిస్థితులలో రాముడు సీతను కలుసుకున్నాడు. ఒక యజ్ఞం చేయాలని రాముడు సంకల్పించాడు. అందులో పాల్గొనవలసిందిగా ఋషులందరికీ ఆహ్వానాలు పంపాడు. అయోధ్యకు దగ్గరలోనే వాల్మీకి ఆశ్రమం ఉన్నప్పటికీ కావాలనే రాముడు వాల్మీకికి ఆహ్వానం పంపలేదు. ఎందుకు ఆహ్వానం పంపలేదో రామునికి తెలుసు. కాని వాల్మీకి తనంతట తాను సీత కుమారులను ఇద్దరినీ తీసుకొని యజ్ఞం వద్దకు వచ్చాడు. ఆ పిల్లలు తన శిష్యులని పరిచయం చేశాడు. యజ్ఞం జరుగుతూ ఉండగా ఆ బాలురిద్దరూ సభికులముందు రామాయణం గానం చేయసాగారు. రాముడు చాలా ఆనందించాడు. ప్రశ్నలడిగి, వారు సీత కుమారులని తెలుసుకున్నాడు. అప్పుడు అతనికి సీత జ్ఞాపకానికి వచ్చింది. అప్పుడయినా ఏమి చేశాడు? సీత కోసం ఎవరినీ పంపలేదు. ఆ అమాయకులయిన బాలుర నిద్దరినీ పిలిచాడు. వారికి తన తండ్రి చేసిన పాపాలు ఏమీ తెలియవు. ఒక క్రూరమైన విధికి బలి అయ్యారు వారు. వారిని పిలిచి సీత నిజంగా పతివ్రత, పవిత్రురాలు అయితే తనపైన తన భర్తపైన వచ్చిన అపనిందను రూపుమాపుకోడానికి ఈ సభలోకి తనంత తానుగా వచ్చి ప్రతిజ్ఞ గైకొనవలసిందని వాల్మీకితో చెప్పమన్నాడు.

ఈ పని లంకలో ఒకసారి ఆమె చేసింది. ఆమెను విడిచిపెట్టేముందు ఇదే పని మరొకసారి చేయించి ఉండాల్సింది. సీత తన పాతివ్రత్యాన్ని రుజువు చేసుకుంటే ఆమెను భర్త తిరిగి స్వీకరిస్తాడనే వాగ్దానం ఏదీలేదు.

వాల్మీకి ఆమెను సభ ఎదుటకు తీసుకువచ్చాడు. ఆమె రామునికి ఎదురుగా నిలబడింది. అప్పుడు వాల్మీకి "ఓ దశరథుని కుమారుడా! ప్రజలు అపనింద వేశారని నీవు విడిచిపెట్టేసిన సీత ఇదుగో! నీవు అనుమతిస్తే ఆమె తన పాతివ్రత్యాన్ని రుజువు పరుచుకుంటుంది. వీరు నీ కవల పిల్లలు. నా ఆశ్రమంలో వారిని పెంచాను" అని అన్నాడు.

"సీత పవిత్రురాలనీ, వారు నా కుమారులనీ నాకు తెలుసు" అని అన్నాడు రాముడు. ఆమె తన పాతివ్రత్యాన్ని రుజువు చేసుకోడానికి లంకలో అగ్ని ప్రవేశం చేసింది. అందుకనే ఆమెను తిరిగి స్వీకరించాను. కాని ఇక్కడి ప్రజలకు ఆమెపై అనుమానాలు ఇంకా పోలేదు. అందుకని మళ్ళీ ఇక్కడ సీత అగ్ని ప్రవేశం చేయాలి. ఈ ఋషులూ, ఈ ప్రజలూ దీనికి సాక్ష్యంగా ఉంటారు" అని అన్నాడు.

ముకుళిత హస్తాలతో సీత భూదేవి కేసి చూస్తూ "రాముని తప్ప మనసులో కూడా ఏ పరుషుణ్ణీ నేను తలంచలేదు. కాబట్టి ఓ భూమాతా! నన్ను నీ ఒడిలోకి తీసుకో! మనసా, వాచా కర్మణా రాముణ్ణే నేను ఎప్పుడూ ప్రేమించాను. కాబట్టి ఓ భూమాతా! నన్ను నీలోనికి తీసుకొని వెళ్ళిపో" అని ప్రతిజ్ఞ చేసింది. ఆమె ప్రమాణం స్వీకరించగానే, భూమి భళ్ళున తెరుచుకొన్నది. బంగారు సింహాసనం మీద సీతను కూర్చుండ బెట్టుకొని, లోపలికి

తీసుకువెళ్ళి పోయింది. మంత్రముగ్ధులై ప్రజలు వీక్షిస్తుండగా సీతపై దేవతలు పూలవర్షం కురిపించారు.

దీనిని బట్టి తెలిసేదేమిటంటే, మూర్ఖునికంటే తక్కువ ఏమీ కాని విధంగా ప్రవర్తించిన రాముని దగ్గరకు తిరిగి వెళ్ళడం కంటే, మరణించడమే మేలని సీత భావించింది అని.

ఇదీ సీత విషాద గాథ, దేవుడైన రాముడు చేసిన నేరమూను.



మహారాజు అయిన రాముని ప్రవర్తన ఎలా ఉండేదో తెలియజేయడానికి కొన్ని విషయాలు వెలుగులోకి తెస్తాను. రాముణ్ణి ఒక ఆదర్శప్రాయుడైన రాజుగా అభివర్ణిస్తారు. ఆ అభిప్రాయం ఏవైనా వాస్తవాల ఆధారంతో ఏర్పరచుకొన్నదేనా? నిజం చెప్పాలంటే, రాముడు ఎప్పుడూ రాజ్య పరిపాలన చేయలేదు. నామమాత్రానికే ఆయన రాజు. పరిపాలనా భారం అంతా తమ్ముడైన భరతునికి అప్పగించాడని వాల్మీకి చెబుతాడు. రాజ్య వ్యవహారాలు, ప్రజల మంచిచెడ్డలు, బాధలు ఆయన ఎన్నడూ పట్టించుకోలేదు. రాజయిన నాటినుంచీ రాముని దినచర్యను, దైనందిన జీవితాన్నీ చాలా వివరంగా వాల్మీకి వర్ణించాడు.[1] ఆయన రాసిన దాని ప్రకారం రోజును రెండు భాగాలుగా విభజించవచ్చు. మధ్యాహ్నం వరకు ఒకటి, ఆ తర్వాత నుంచి రెండవది. ఉదయం నుంచి మధ్యాహ్నం వరకూరాముడు పూజా పునస్కారాలలో ఆరాధనా కార్యక్రమాలలో మునిగిపోయేవాడు. మధ్యాహ్నం తరువాత ఒక రోజు విదూషకులతోను, మరొక రోజు అంతఃపుర కాంతలతోనూ గడుపుతూ ఉండేవాడు. అంతఃపుర కాంతలతో ఆయనకు విసుగెత్తినప్పుడు విదూషకులతో గడిపేవాడు. విదూషకులతో విసుగెత్తినప్పుడు అంతఃపుర కాంతల దగ్గరకు వెళ్ళేవాడు.[2] అంతఃపుర కాంతలతో రాముడు ఏ విధంగా కాలక్షేపం చేసేవాడో వాల్మీకి చాలా వివరంగా వర్ణించాడు. ఈ అంతఃపురం అశోకవనంలో ఉండేది. రాముడు అక్కడ భోజనం చేస్తూ ఉండేవాడు. ఆయన భోజనం పంచభక్ష్య పరమాన్నాలతో చాలా రుచిగా ఉండేదని వాల్మీకి వ్రాశాడు. ఇందులో మాంసము, పండ్లు, మద్యం తప్పక ఉండేవి. రాముడు మద్యం ముట్టనివాడేమీ కాదు. చాల అధికంగా ఆయన మద్యపానం చేసేవాడు. సీత కూడా తనతో కలిసి మద్యం సేవించేలా రాముడు చూసేవాడని వాల్మీకి వ్రాశాడు.[3] వాల్మీకి వర్ణించిన రాముని అంతఃపుర కాంతలను చూస్తే వారేమీ తక్కువ కాదనిపిస్తుంది. నృత్య సంగీతాలలో ప్రవీణురాండ్రయిన అప్సరసలు, నాగకన్యలు, కిన్నెరలు ఉండేవారు. వీరేగాక వివిధ దేశాలనుంచి తెచ్చుకున్న సుందరాంగులు కూడా ఉండేవారు. మద్యం సేవిస్తూ, నృత్యం చేస్తూ ఆ స్త్రీల మధ్య రాముడు కాలం

1. ఉత్తరకాండ సర్గః 42, శ్లోకం 27
2. ఉత్తరకాండః సర్గ 43, శ్లోకం 1
3. ఉత్తరకాండః సర్గ 42, శ్లోకం 8

గడుపుతుండేవాడు. రాముణ్ణి వారు ఆనందపరిచేవారు. రాముడు వారికి పూలహారాల వేసేవాడు. వాల్మీకి రాముణ్ణి "స్త్రీలోలురలో రాజకుమారుడు" అని వర్ణించాడు. ఇది ఒక రోజ కథ కాదు. ఆయన జీవన విధానమే అంత.

ఇదివరకే చెప్పినట్లుగా రాముడు ఎప్పుడూ ప్రజల మంచి చెడ్డలను పట్టించుకోలేదు ప్రజలకు జరిగిన అన్యాయాలు విచారించి, వాటిని సరిదిద్దడానికి ప్రయత్నం చేయడమనేద అనాదిగా భారతీయ రాజులు పాటిస్తున్న నియమం. దానిని ఆయన ఎన్నడూ పాటించలేదు తన ప్రజల గోడును రాముడు ఒకే ఒకసారి స్వయంగా విన్నట్టు వాల్మీకి ఉటంకించాడు. కాని ఆ సంఘటన దురదృష్టవశాత్తు విషాద ఘట్టమయింది.

ఒక దోషాన్ని సవరించే పని నెత్తిన వేసుకున్న ప్రయత్నంలో చరిత్రలో ఎక్కడా నమోదు కాని ఒక ఘోర దురంతానికి రాముడు ఒడిగట్టాడు. అదే శూద్రుడైన 'శంబుక వధ గాథ. రాముని పరిపాలనలో అకాల మరణాలు ఉండేవి కావని వాల్మీకి[1] అంటాడు. అయితే, ఎందుకనో ఒక బ్రాహ్మణ కుమారుడు అకాల మరణానికి గురయ్యాడు. శోకతప్తుడైన తండ్రి తన కుమారుని మృతదేహాన్ని మోసుకొని వెళ్ళి రాజప్రసాద ద్వారం ముందు ఉంచి బిగ్గరగా రోదిస్తూ తన కుమారుని మరణానికి రాముణ్ణి నిందిస్తూ ఉన్నాడు. రాముని పరిపాలనలో ఎక్కడో పాపం జరిగిందనీ దాని ఫలితంగానే తన కుమారుడు మరణించాడనీ, ఆ పాపాన్ని పరిహరించక పోయినట్లయితే రాజే స్వయంగా నేరం చేసిన వాడవుతాడనీ తన కుమారుణ్ణి గనుక తిరిగి బ్రతికించకపోయి నట్లయితే రామునికి వ్యతిరేకంగా రాజప్రసాదం ఎదుటనే (ధర్నా చేస్తూ) తన ప్రాణాన్ని కూడా అంతం చేసుకుంటాననీ బెదిరించాడు. దాని మీదట రాముడు తన కొలువులో ఉన్న విద్వాంసులైన ఎనిమిది మంది ఋషులతో సంప్రదింపులు జరిపాడు. వారిలో నారదుడు రాముని రాజ్యంలో ఎవరో శూద్రుడు తపస్సు చేస్తున్నాడనీ, తద్వారా ధర్మానికి విరుద్ధంగా నడుచుకుంటున్నాడనీ రామునితో చెప్పాడు. ఎందుకంటే ధర్మ సూత్రాల ప్రకారం తపస్సుచేసే ఆచారం ద్విజులకు మాత్రమే ఉంటుంది. శూద్రుల కర్తవ్యం ఏమంటే ద్విజులకు సేవ చేయటమే. ఒక శూద్రుడు ఆ విధంగా తపస్సు చేయటం ద్వారా ధర్మాన్ని అతిక్రమిస్తున్నందువల్లనే బ్రాహ్మణ కుమారుడు మరణించి ఉంటాడని రామునికి గట్టి నమ్మకం కుదిరింది. అంతే, వెంటనే రాముడు తన వాయురథం ఎక్కి నేరస్థుని కోసం రాజ్యమంతా గాలించడం మొదలుపెట్టాడు. ఆఖరికి దక్షిణంవైపు దూరంగా ఎక్కడో ఒక అడవి ప్రాంతంలో ఒక రకమైన కఠోరతపస్సు చేస్తున్న మనిషిని వీక్షించాడు. అంతే, రాముడు ఆ మనిషిని సమీపించి, అతను ఎవరో ప్రశ్నవేసి అతనొక శూద్రుడనీ, అతని పేరు శంబుకుడనీ

1. "రామరాజ్యం–బానిసలు–మన సనాతనుల మనోభావాలు" ("On Ramarajya and the Slave - Mentality of our Orthodox - An expostulatory letter to the Createst Hindu of the Age from a critical coreligionist") అనే విషయంపై శ్రీ యస్.డి. నాదకర్ణిగారి పుస్తకం. సమాజ్ సమతా సంఘ్ (బొంబాయి) వారు ప్రచురించినది (1932). పుట 15 చూడవచ్చు. రాతప్రతిలో రచయిత దీనిని సూచించారు. – సంకలనకర్త

బొందితో కైలాసానికి వెళ్ళడంకోసం ఘోరమైన తపస్సు చేస్తున్నాడనీ తెలుసుకోవడం తప్ప, ఇంక ఏమీ చేయకుండా, కనీసం హెచ్చరిక లాంటిది అయినా చేయకుండా, పోనీ తపస్సు మానివేయమని నచ్చ చెప్పడం లాంటిది కూడా చేయకుండా అతని శిరస్సును నరికివేశాడు. అంతే! ఆశ్చర్యం! అతని తల నేలకు పడగానే ఎక్కడో దూరంగా ఉన్న అయోధ్యలో, మరణించిన బ్రాహ్మణ బాలుడు తిరిగి శ్వాస పీల్చుకోవడం ఆరంభించాడు. ఇక్కడ, ఈ అరణ్యంలో అర్హతలేని ఒక శూద్రుడు తపో మహిమతో దేవలోకంలోకి ప్రవేశించకుండా నిరోధించినందుకు ఆనందంపట్టలేక దేవతలు రాముని మీద పూలవర్షం కురిపించారు. అంతటితో ఆగక, ఆ అడవిలో ప్రత్యక్షమై చేసిన పనికి రాముణ్ణి అభినందించారు. అయోధ్యలో రాజ ప్రసాదం ముందు చనిపోయి పడిఉన్న బ్రాహ్మణ కుమారుని తిరిగి బ్రతికించవలసిందిగా ఆ దేవతలను రాముడు ప్రార్థిస్తే అతను ఎప్పుడో బ్రతికి వచ్చాడని వారు సమాచారం ఇచ్చారు. ఆ తరువాత వారు అంతర్ధానమయ్యారు. రాముడు అక్కడకు సమీపంలో ఉన్న అగస్త్య మహాముని ఆశ్రమానికి వెళ్ళి ఆయన దర్శనం చేసుకుంటే శంబుకుని చంపడానికి రాముడు తీసుకున్న నిర్ణయం ఎంతో సముచితమైనదని, అతణ్ణి అభినందించి ఒక దివ్యమణి కంకణాన్ని రామునికి బహూకరించాడు. రాముడు ఆ తరువాత రాజధానికి తిరిగి వచ్చాడు. అటువంటివాడు రాముడు.

**అనువాదం : బొజ్జా తారకం**

# ఇక ఇప్పుడు కృష్ణుని గురించి

కృష్ణుడు మహాభారత నాయకుడు. నిజం చెప్పాలంటే మహాభారతం ప్రధానంగా కౌరవులకూ, పాండవులకూ సంబంధించిన గాథ. ఈ ఇరువురూ తమ పూర్వీకులకు సంబంధించిన రాజ్యంపై హక్కు కోసం పోరాడిన యుద్ధ గాథ అది. అందులో ప్రధాన పాత్ర వారిదే కావాలి, కాని అలా కాలేదు. కృష్ణుడు ఆ ఇతిహాస నాయకుడు. ఇది కొంచెం వింత సంగతే. అయితే ఇంకా వింత సంగతి ఏమిటంటే కృష్ణుడు కౌరవులకూ, పాండవులకూ సమకాలికుడు కాకపోవటానికి అవకాశం ఉండటం.

కృష్ణుడు ఒక రాజ్యానికి చక్రవర్తులైన పాండవులకు మిత్రుడు. అలాగే మరొక రాజ్యాధిపతియైన కంసునికి శత్రువు. కృష్ణుడు పాండవులకు మిత్రుడు. వారికి ఒక సామ్రాజ్యం ఉంది. కృష్ణుడు కంసునికి శత్రువు. అతనికీ ఒక సామ్రాజ్యం ఉంది. ఇలాంటి రెండు సామ్రాజ్యాలు పక్కపక్కన ఏక కాలంలో ఉండటం అనేది సంభవనీయమైన విషయంగా కనిపించటం లేదు. ఇక రెండోదేమిటంటే ఈ రెండు సామ్రాజ్యాలకూ పరస్పర సంబంధముండేదని చెప్పే అంశాలేవీ మహాభారతంలో లేవు. కృష్ణునికీ, పాండవులకూ సంబంధించిన భిన్న గాథలు రెండూ ఆ తర్వాత ఎప్పుడో, ఎవరో, కలిపేసి కృష్ణుడు మరింత గొప్పపాత్ర అభినయించేందుకు వీలుగా రంగస్థలాన్ని విశాలం చేశారు. కృష్ణుని సర్వోన్నతునిగా కీర్తించి అన్నిటికీ అతీతునిగా నిలపాలనే వ్యాసుని ఉద్దేశపూర్వక పథకమే ఈ రెండు కథల కలయికకు కారణం.

వ్యాసుని ప్రకారం కృష్ణుడు పురుషులలో దైవం. అందుకే అతడు మహాభారత నాయకుడైనాడు. నిజంగా కృష్ణుడు పురుషులలో దైవం అని చెప్పటానికి తగినవాడేనా? అతని

జీవిత ఘట్టాల స్థూల పరిశీలనమే దీనికి తగిన సమాధానం ఇవ్వటానికి సహకరిస్తుంది.

కృష్ణుడు భాద్రపద మాసంలో ఎనిమిదవ దినాన అర్ధరాత్రి మధురాపురిలో జన్మించాడు. అతని తండ్రి యదువంశానికి చెందిన వసుదేవుడు. తల్లి దేవకి దేవకుని కుమార్తె. దేవకుడు మధుర రాజైన ఉగ్రసేనుని సోదరుడు. ఉగ్రసేనుని భార్యకు సౌభరాజైన దానవ ద్రుమిళునితో అక్రమ సంబంధం ఉంది. ఈ అక్రమ సంబంధం ఫలితంగా జన్మించిన కంసుడు ఒక రకంగా దేవకికి జ్ఞాతి సోదరుడు. కంసుడు ఉగ్రసేనుని బంధించి సింహాసనం చేజిక్కించుకొన్నాడు. దేవకి అష్టమ సంతానం తనను వధిస్తుందని నారదుని (లేదా దివ్యవాణి; అశరీరవాణి) వల్ల తెలుసుకొన్న కంసుడు దేవకినీ ఆమె భర్తనూ కారాగారంలో ఉంచి వారికి పుట్టిన ఆరుగురు పిల్లలనూ పుట్టిన వెంటనే చంపుతూ వచ్చాడు. ఏడో సంతానం, బలరాముడు విచిత్రంగా దేవకి గర్భం నుంచి వసుదేవుని మరో భార్య అయిన రోహిణి గర్భానికి మార్చబడ్డాడు. ఎనిమిదో సంతానమైన కృష్ణుడు పుట్టగానే తండ్రి అయిన వసుదేవుని చేత అతిరహస్యంగా యమునానది అవతలి ఒడ్డున వ్రజవాసులైన యశోదానందుల దగ్గరకు చేరవేయబడ్డాడు. దివ్య శిశువుకు మార్గాన్నిస్తూ యమునా నది తన తరంగాలను తిరోగమింప చేసింది. సరిగ్గా అదే సమయంలో కుంభవృష్టిగా పడుతున్న వర్షధారలు శిశువు మీద పడకుండా సర్పముఖుడైన అనంతుడు తన విశాలమైన పడగలను గొడుగుగా పట్టాడు. ఇదివరకే చేసుకొన్న ఏర్పాటు ప్రకారం, వసుదేవుడు, నందుని నవజాత శిశువు (యోగీంద్ర లేదా మహామాయ)తో తన కుమారుని మార్పిడి చేసుకొని ఆ బాలికను తన ఎనిమిదో సంతానంగా కంసునికి సమర్పించాడు. అయితే – యశోదానందుల చేత పెంచబడుతున్న బాలుడు కంసుని సంహరిస్తాడని చెప్పి ఆ బాలిక అంతరిక్షానికి ఎగిరిపోయింది. బాలకుడైన కృష్ణుని చంపడానికి కంసుడు అనేక వ్యర్థ ప్రయత్నాలు చేస్తూ పోవటానికి ఈ సంఘటన దారితీసింది. ఆ లక్ష్యంతోనే కంసుడు ఎందరో అసురులను అనేక రూపాలలో వ్రజగ్రామానికి పంపాడు. ఇలా వచ్చిన అసురులను సంహరించటమూ, సామాన్య మానవ బాలకులకు అసాధ్యమైన అనేకమైన వీరోచిత కృత్యాలూ కృష్ణుని బాల్య జీవితంలోని ముఖ్య ఘట్టాలుగా పురాణాలలో చోటుచేసుకొన్నాయి. అందులో కొన్ని మహాభారతంలోనూ ఉటంకితమైనాయి. ఆధారాలు వేర్వేరుగా ఉండటంవల్ల ఆయా ఘట్టాల కథనంలో కొంత వ్యత్యాసం కనిపిస్తున్నది. అర్వాచీనమైన ఆధారాలను ప్రధానంగా గ్రహిస్తూ అలాంటివి కొన్ని మాత్రం ఇక్కడ పేర్కొంటున్నాను.

వాటిలో మొట్ట మొదటిది లేదా ఇలాంటి కృత్యాలలో మొదటిది పూతన సంహారం. హరివంశం ప్రకారం ఆమె కంసుని దాది. ఆడ రాబందు రూపంలో కృష్ణుని చంపటానికి కంసునిచేత పంపబడింది. భాగవతం ప్రకారం ఆమె ఒక సుందరమైన స్త్రీ.కృష్ణునికి పాలిచ్చే ప్రయత్నంలో విషపూరితమై తన రొమ్మును బాల కృష్ణుని నోటిలో పెట్టినట్టూ కృష్ణుడు అమితమైన శక్తితో ఆమె రక్తప్రాణాలనే పీల్చివేసినట్టూ ఆమె నిజరూపంతో నేలకూలి మరణించినట్టూ ఈ గాథ చెబుతున్నది.

ఇలాంటిదే మరో సాహస (అద్భుత) కృత్యం కృష్ణుడు మూడు నెలల శిశువుగా ఉన్నప్పుడు చేశాడు. అది ఒక శకటాన్ని పడగొట్టడం. ఆ బండిని ఒక అలమర లాగ ఉపయోగిస్తుండేవారు. దానిమీద పాలతోనూ, పెరుగుతోనూ నింపిన జాడీలు, భాండాలూ దొంతరలుగా పెడుతుండేవారు. కంసుడు పంపిన శకటుడనే అసురుడు బండిని ఆవహించి బండిని పైకెత్తి కిందపడవేసి ఆ బరువుకు దాని కింద ఉన్న బాల కృష్ణుడు నలిగి చనిపోయేలాగ చేయాలని ప్రయత్నించినట్టు హరివంశం చెప్తున్నది. యశోద, కృష్ణుని ఆ బండి కింద పడుకోబెట్టి యమునలో స్నానానికి వెళ్ళింది. ఆమె తిరిగి వచ్చేసరికి, కృష్ణుడు ఆ బండికి కొట్టుకొని దాన్ని తిరగదోసి బండిమీద ఉన్న సమస్త సామాగ్రితో పాటు బండిని తునా తునకలు చేసినట్టు ఆమెకు చెప్పారు. ఈ సంఘటన యశోదను భయభ్రాంతురాలిని చేసింది. అశుభ నివారణార్థం ఆమె పూజలు చేసింది.

కృష్ణుని చంపటానికి పూతన, శకటుడు, చేసిన ప్రయత్నాలు ఫలించక పోవటంతో కంసుడు అదే ప్రయత్నం మీద తృణావర్తుడనే అసురుని పంపాడు. అతడు ఒక పక్షి రూపంలో వచ్చి ఏడాది వయసువాడైన ఈ దివ్య శిశువును చిక్కించుకుని పైకి ఎగర వేసుకుపోయాడు. అయితే వెనువెంటనే మరణించి కింద పడ్డాడు. శిశువు మాత్రం అతని కంఠాన్ని గట్టిగా పట్టుకొని సురక్షితంగా ఉన్నాడు. ఆ తర్వాత సాహస కార్యం పక్క పక్కన పెరుగుతున్న రెండు అర్జున వృక్షాలను కూల్చటం. ఆ రెండు చెట్లూ శాప వశాత్తు ఆ రూపం ధరించిన ఇద్దరు యక్షులు అనీ కృష్ణుని ఈ సాహస కృత్యమే వారికి శాప విమోచన కలిగిస్తుందనీ చెప్పారు. పాకే వయస్సులో ఒకరోజు కృష్ణుని అల్లరి భరించలేక యశోద అతనిని ఒక తాటితో కొయ్యరోలుకు కట్టివేసి ఇంటిపని చూసుకుంటున్నది. ఆమె కనుమరుగు కాగానే కృష్ణుడు పాకుకుంటూ వెళ్ళి ఆ రెండు వృక్షాల మధ్యనుంచీ ముందుకు వెళ్ళి ఆ రెండు అర్జున వృక్షాల మధ్యా రోలు అడ్డం తిరిగి ఇరుక్కునేలా చేశాడు. కృష్ణుడు రోలును గట్టిగా ఈడ్చటంతో ఆ రెండు వృక్షాలూ వేళ్ళతో సహా పెల్లగించబడి మహా ధ్వనితో నేలమీద పడ్డాయి. వాటివల్ల కృష్ణునికి చిన్న దెబ్బకూడా తగల్లేదు.

ఈ సంఘటనలన్నీ నందునికి భీతి కలిగించాయి. వ్రజ గ్రామాన్ని వదిలిపెట్టి మరోచోట స్థిరపడాలని అతడు దృఢంగా నిశ్చయించుకొన్నాడు. అతడు ఆ ఆలోచనలో ఉండగానే ఆ ప్రాంతమంతటా తోడేళ్లు ఎక్కువ కావటమూ, పశుగణ క్షేమానికి ఆపద తటస్థించటమూ జరిగింది. దాంతో అనిశ్చితంగా ఉన్న సంకల్పానికి స్థిరరూపం ఏర్పడి యాదవులంతా ఆ ప్రదేశం విడిచి తమకున్నదంతా వెంటపెట్టుకొని ఆహ్లాదకరమైన బృందావనానికి తరలిపోయారు. కృష్ణుడు అప్పటికి ఏడేళ్ళ ప్రాయంవాడు.

ఈ కొత్త ప్రాంతానికి వచ్చాక కూడా కృష్ణుడు చాల మంది అసురులను చంపాడు. అందులో ఒకడు అరిష్టుడు. ఎద్దు రూపంలో వచ్చాడు. మరొకడు కేశి. ఇతడు గుర్రం రూపంలో వచ్చాడు. మరో అయిదుగురు వృత్రాసుర (**వత్సాసుర**), **బకాసుర, అఘాసుర,**

భోమాసుర, శంఖాసురులనే వారు. వీరిలో చివరివాడు ఒక యక్షుడు. వీరందరి కంటే ముఖ్యుడు కాళియుడనే సర్పముఖ్యుడు. ఇతడు యమునా నదిలో ఒక మడుగులో తన కుటుంబంతో నివసిస్తూ ఆ జలాలను విషపూరితం చేశాడు. కృష్ణుడు ఒకనాడు ఆ కాళియుని మీదికి ఉరికి అతని పడగమీద నిలబడి ఆ కాళియుడు రక్తం కక్కుకునేంత ఉధృతంగా నాట్యం చేశాడు. కాళియుని చంపేసేవాడే కాని అతని కుటుంబ సభ్యుల విన్నపంపై దయదలిచి మరోచోటికి పోయి నివసించమని చెప్పి అతనిని ప్రాణాలతో వదిలేశాడు. కాళియమర్దనం తర్వాతది గోపికా వస్త్రాపహరణం. ఈ ఉదంతం పురాణ కృష్ణుని ఆరాధకులకూ, భక్తులకూ కొరుకుడు పడని విషయం. ఈ కథ మొత్తం ఎంత అసభ్యంగా ఉన్నదంటే కేవలం టూకీగా చెప్పాలన్నా సంకోచంగా ఉంది. అయినాగాని కృష్ణుని గురించి పూర్తిగా చెప్పాలంటే ఆ విషయాన్ని వీలైనంత సభ్యంగా చెప్పక తప్పదు మరి. కొంతమంది గోపికలు యమునా నదికి స్నానానికి వెళ్ళి బట్టలు ఒడ్డునపెట్టి నదిలో దిగారు. ఇలా స్నానం చేసే అలవాటు ఇప్పటికీ కొన్ని చోట్ల ఉంది. కృష్ణుడు ఆ బట్టలన్నీ తీసుకుని ఆ ఒడ్డునే ఒక చెట్టుమీద ఎక్కి కూచున్నాడు. తమ బట్టలు తమకు ఇచ్చేయవలసిందిగా గోపికలు కోరితే అతడు నిరాకరించాడు. ఆ స్త్రీలందరూ తానున్న చెట్టు దగ్గరకు వచ్చి ఒక్కొక్కరూ స్వయంగా తమతమ దుస్తుల కోసం అర్థిస్తేనే వాటిని తిరిగి ఇస్తానన్నాడు. అలా చెయ్యాలంటే వారు నీళ్ళలో నుంచి నగ్నంగా పైకివచ్చి కృష్ణుని ఎదుట నిలవాల్సి ఉంటుంది. వారు అలా చేశాకనే కృష్ణుడు సంతోషించి వారి బట్టలు వారికి తిరిగి ఇచ్చాడు. ఈ కథ భాగవతంలో ఉంది. దీని తర్వాత కృష్ణుడు చేసిన మరో అద్భుతకృత్యం గోవర్ధనగిరిని ఎత్తటం. వర్షాధిపతియైన ఇంద్రునికి తాము ఏటా చేసే ఉత్సవాలకు గోపాలురు సన్నాహాలు చేస్తున్న తరుణం అది. తమది వ్యావసాయిక తెగ కాదనీ, తాము సంచార జాతులమనీ కృష్ణుడు వారికి గుర్తు చేశాడు. తమకు నిజమైన దేవతలు, ప్రకృతి - పశువులు, పర్వతాలు, అరణ్యాలు మాత్రమే అని వారికి నచ్చచెప్పాడు. వాటినే తాము పూజించాలనీ వర్షాలు కురిపించే ఇంద్రుని వంటి దేవతలను తాము ఆరాధించనవసరం లేదనీ వారికి చెప్పాడు. గోపాలకులకు అతని మాటలు సమంజసంగానే తోచాయి. ఇంద్రుని పూజించాలనే సంకల్పం విరమించి పశుసంవర్ధకమైన గోవర్ధనగిరికి పెద్ద ఎత్తున పూజలు చేశారు. నృత్య గానాదులతో, విందులతో సంబరాలు జరుపుకొన్నారు. తనకు జరిగిన ఈ అవమానానికి క్రుద్ధుడైన ఇంద్రుడు వారికి శిక్షగా గోపాలుర పల్లెపై ఏడు రోజులు రాత్రింబవళ్ళు ఎడతెరిపి లేకుండా కుంభవర్షం కురిపించాడు. కృష్ణుడు ఏమాత్రం బెదరకుండా ఆ మొత్తం పర్వతాన్ని పెకలించి పైకి ఎత్తి పల్లె పైన గొడుగులాగ నిలబెట్టి పట్టుకొని మొత్తం గోపాలకులనూ, పశుగణాన్నీ ఇంద్రుని కోపాగ్ని నుంచి కాపాడాడు. ఋగ్వేదం నుండి తెలుస్తున్న ఇంద్రునికి, కృష్ణునికి మధ్యగల అసూయను గురించీ, శతపథ బ్రాహ్మణం నుంచి తెలుస్తున్న ఇంద్రునికీ విష్ణువుకూగల వైషమ్యాల గురించీ నా మొదటి ఉపన్యాసంలో నేను చెప్పే ఉన్నాను.

కృష్ణుని యౌవనదశ అంతా బృందావనంలోని జవరాండ్ర తోడి అక్రమ సంబంధాలతో కూడుకొని ఉంది. ఇవే అతని రాసలీలలు (రాసక్రీడలు). స్త్రీ పురుషులు వలయాకారంలో నిలబడి ప్రక్కవారితో చేతులు కలుపుకొని చేసే నృత్యం రాసనృత్యం. ఈ నృత్యం ఇప్పటికీ దేశంలో కొన్ని ఆటవిక తెగలలో ఉన్నట్లు తెలుస్తున్నది. తనను మోహించి వచ్చే బృందావన గోపికలతో తరచు ఈ నృత్యం చేస్తూ ఆనందించే అలవాటు కృష్ణునికి ఉన్నదని చెబుతారు. ఇలాంటి నృత్య వర్ణనలు విష్ణుపురాణంలోనూ, హరివంశ భాగవతాలలోనూ ఉన్నాయి. ఇవన్నీ గోపికలకు కృష్ణుని పట్ల ఉన్న ప్రేమను భగవంతుని పట్ల గల ప్రేమగా వ్యాఖ్యానిస్తూ వారికి అతనితో గల కాముక సంబంధాలలో ఏమీ తప్పులేదని చెప్తున్నాయి. ఇవే సంబంధాలు మరి ఏ ఇతర పురుషుల విషయంలోనైనా గాని అయి ఉంటే వారి న్యాయం ప్రకారమే అవి దూషితమూ, గర్హనీయమూ అయి ఉండేవి. దీనికి సంబంధించిన దృశ్య కాలాదుల విషయంలోగాని ఋతుధర్మాల విషయంలోగాని మధురమైన సమ్మోహనకరమైన గానంతోనూ, నృత్యంతోనూ కృష్ణుడు స్త్రీలను ఆకర్షించేవాడన్న విషయంలో గాని, కృష్ణుని పట్ల ఆ స్త్రీలకున్న మోహ సంబంధమైన భావాల విషయంలో వాటిని వారు వెలువరించిన రీతుల విషయంలోగాని ఈ వ్యవహారపు సాధారణ లక్షణాలను అందరూ అంగీకరిస్తున్నారు. అయితే విష్ణుపురాణం ఈ సిగ్గుమాలిన పనులను సభ్యతకూ, హద్దులకూ లోబడి ఉండేలాగ చిత్రించటానికి ప్రయత్నించింది. (అన్ని సందర్భాలలోనూ ఆ ప్రయత్నం సఫలం కాలేదు). హరివంశం ఈ అసభ్యతను దాచే ప్రయత్నం కూడా చేయకుండా స్పష్టంగా చూపింది. ఇక భాగవతం అన్ని హద్దులనూ, నిబంధనలనూ తోసిరాజని అసభ్యతను ప్రదర్శించింది.

ఈ అసభ్యకరమైన పనులన్నింటిలోనూ మరీ నికృష్టమైనది రాధ అనే గోపికతో కృష్ణునికి గల అక్రమ సంబంధం. రాధతో కృష్ణునికి గల అక్రమ సంబంధాలు బ్రహ్మవైవర్త పురాణంలోనూ చిత్రితమైనాయి. కృష్ణుడు రుక్మాంగద రాజు కుమార్తె అయిన రుక్మిణిని వివాహం చేసుకున్నాడు. రాధకూ వివాహమైంది. కృష్ణుడు తాను న్యాయబద్ధంగా వివాహం చేసుకున్న రుక్మిణిని వదిలిపెట్టి పరస్త్రీ– మరొకరి భార్యా అయిన రాధను చెరిచాడు. ఇసుమంత అనుతాపమైన లేకుండా ఆమెతో పాప పంకిలమైన జీవితం గడిపాడు.

చాలా చిన్న వయసునుంచే అంటే తన పన్నెండో యేట నుంచేకృష్ణుడు యోధుడూ రాజనీతి వేత్తా అని చెబుతున్నారు. యోధుడుగా గాని రాజనీతి వేత్తగాగాని అతడు చేసిన ప్రతిపనీ అవినీతికరమైనదే. ఈ రంగంలో అతని మొట్ట మొదటి కృత్యం మేనమామ అయిన కంసుని హత్య చేయటం. 'హత్య చేయటం' అనేది ఇక్కడ పెద్దమాట కాబోదు. ఎందుకంటే కంసుడు కృష్ణుని కవ్వించి ఉన్నప్పటికీ కృష్ణుడు అతనిని మామూలు పోరాటంలో గాని కనీసం ద్వంద్వ యుద్ధంలో గాని చంపటం జరగలేదు. దీని అసలు కథ ఏమిటంటే బృందావనంలో కృష్ణ భగవానుడు చేసిన సాహస కృత్యాల గురించి విని కంసుడు భయపడ్డాడు. ధనుర్యాగం నెపంతో వారిని మధురకు ఆహ్వానించి ఆ యాగంలో వారు ఒక బలిష్ఠుడైన యోధునితో

తలపడి బాహాటంగా మరణించే లాగున చేయాలని నిశ్చయించాడు. తదనుగుణంగా ధనుర్యాగం ప్రకటించి ఆ ఉత్సవానికి కృష్ణునీ, బలరామునీ వారి గోపమిత్రులనూ ఆహ్వానించాడు. ఈ సోదరులను మధురకు తెచ్చేపని కృష్ణుని భక్తుడూ, కంసుని దగ్గర ఉద్యోగీ అయిన అక్రూరునికి అప్పగించారు. కృష్ణుని చంపాలన్న కృతనిశ్చయంతోనే ఈ పథకం వేశారు. కంసుడు, ఈ సోదరులను మాత్రమే కాదు, యాదవులను హింసించి, పీడించి, వారు మధురా నగరం వదలి పోవటానికి కారకుడై వారందర్నీ కూడా కవ్వించాడు. అంచేత కంసునికి వ్యతిరేకంగా జరిగిన పెద్ద కుట్ర ఈ సోదరులకు ఆలంబనమైంది.

మధురకు చేరుకొన్న గోపాలురకు తమ సాధారణ గోప దుస్తులకు బదులుగా నాగరకమైన దుస్తులు ధరించాలనే కోరిక కలిగింది. కంసుని బట్టలు ఉతికే రజకుడు వీదిలో ఎదురైతే అతనిని బట్టలకోసం అడిగారు. అతడు దురుసుగా మాట్లాడటంతో అతనిని చంపి అతని దగ్గర ఉన్న మూటలో నుంచి తమకు కావలసిన బట్టలు తీసుకొన్నారు. ఆ తర్వాత, కంసునికి విలేపనాలు అందించే గూనిస్త్రీ కుబ్జ వారికి ఎదురైంది. వారి కోరికపై ఆమె వారికి అనులేపనాలు ఇచ్చి ప్రసన్నులను చేసింది. అందుకు ప్రతిగా కృష్ణుడు ఆమె శరీర వక్రతను పోగొట్టాడు. ఆ తర్వాత కృష్ణుడు మరో సందర్భంలో ఆమె యింటికి వెళ్ళి ఆమెతో సంభోగించిన సిగ్గుమాలిన శృంగార క్రీడలను భాగవతం లక్షణయుక్తంగా వర్ణించింది. ఇక ప్రస్తుతానికి వస్తే బలరామకృష్ణ సోదరులిద్దరూ లేపనాలంకృతులై సుదాముడనే మాలాకారుడు ఇచ్చిన పూలహారాలు ధరించి, ధనుర్యజ్ఞం జరుగుతున్న ప్రదేశానికి వెళ్ళి యజ్ఞ పూజకోసం నిర్దేశించిపెట్టిన మహాధనుస్సును విరగ్గొట్టారు. భయవిహ్వలుడైన కంసుడు వారిని చంపేందుకు వారి మీదికి కువలయాపీడమనే ఏనుగును పంపాడు. కృష్ణుడు ఆ ఏనుగును చంపి మల్లరంగంలో ప్రవేశించాడు. అక్కడ కంసుని ఆదేశం ప్రకారం చాణూర, ముష్టిక, తోశలక ఆంధ్రులనే మల్లయోధులు ఈ సోదరులను ఎదుర్కొన్నారు. చాణూర తోశలకులను కృష్ణుడూ మిగతా ఇద్దరినీ బలరాముడూ సంహరించారు. కృష్ణుని చంపాలన్న పథకం ఫలించక పోవటంతో కంసుడు విసుగుచెంది ఈ సోదరులనూ వారి గోప మిత్రులనూ పంపివేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. వారిని రాజ్యం నుంచి బహిష్కరించాలనీ వారి ఆలమందలను స్వాధీనపరచుకోవాలనీ వసుదేవునీ, నందునీ, ఉగ్రసేనునీ (కంసుని తండ్రి) హతమార్చాలనీ ఆజ్ఞ పెట్టాడు. వెంటనే కృష్ణుడు కంసుడు ఆసీనుడైన వేదిక మీదికి లంఘించి అతనిని జుట్టు పట్టుకొని సింహాసనం మీదినుంచి కిందికి పడదోసి నేలమీదికి ఈడ్చి చంపేశాడు. ఆ తర్వాత రోదిస్తున్న కంసుని భార్యలను ఓదార్చి అతనికి రాజోచితంగా దహన క్రియలు ఏర్పాటు చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. మధుర రాజ్యం స్వీకరించవలసిందిగా ఉగ్రసేనుడు అభ్యర్థించినప్పటికీ కృష్ణుడు అందుకు అంగీకరించక, ఉగ్రసేనునికి పట్టం కట్టి దేశ బహిష్కృతమైన బంధువర్గాన్నంతనూ మధురకు తిరిగి రావలసిందిగా ఆహ్వానించాడు.

మగధ చక్రవర్తి అయిన జరా సంధునితోనూ, కాలయవనునితోనూ, కృష్ణుడు చేసిన

పోరాటం దీని తర్వాతి ఉపాఖ్యానం. జరాసంధుడు కంసుని మామ. కృష్ణుడు కంసుని చంపినందుకు కోపోద్రిక్తుడై ఇతడు మధుర మీదికి 17 పర్యాయాలు దండెత్తాడు. ప్రతిసారీ కృష్ణుడు అతనిని అడ్డగిస్తూ వచ్చాడు. ఇక పద్దెనిమిదో పర్యాయం, జరా సంధుని దండయాత్ర నగరానికి వినాశకారి కాగలదన్న భయంతో కృష్ణుడు యాదవులందర్నీ (గుజరాత్ సముద్రతీర ప్రాంతపు పశ్చిమ కొనలో ఉన్న) ద్వారకకు తరలించాడు, తర్వాత ఆ నగరాన్ని జరాసంధుని ప్రోద్బలంతో కాలయవనుడు ముట్టడించాడు. కాలయవనుడు నిరాయుధుడైన కృష్ణుని వెన్నాడి తరుముతూ నగరం వెలుపల ఒక పర్వత గుహలో నిద్రిస్తున్న ముచికుందుడనే రాజును చూసి కృష్ణుడని భ్రమించి అతనిని తన్ని లేపి అతని నేత్రాగ్ని జ్వాలలకు భస్మమైపోయాడు. కృష్ణుడు కాలయవనుని సైన్యాన్నిజయించి ఆ సంపదతో ద్వారకకు వెళ్తుండగా జరాసంధుడు అతనిని సైన్యంతో చుట్టుముట్టాడు. చివరికి ఎల్లాగైతేనేం కృష్ణుడు ఒక పర్వతం మీదికి ఎగబ్రాకి దానిమీంచి ద్వారక వైపు దూకి జరాసంధుని బారినుంచి తప్పించుకున్నాడు.

ఇక కృష్ణుని వివాహాల విషయం చూద్దాం. అతని మొదటి వివాహం విదర్భ రాజైన భీష్మకుని కుమార్తె రుక్మిణితో జరిగింది. దాని వివరాలు ఇవి – జరాసంధుని ప్రోద్బలం మీద భీష్మకుడు రుక్మిణిని చేది రాజయిన శిశుపాలునికి ఇచ్చి వివాహం చేయటానికి సన్నాహాలు చేశాడు. ఈ శిశుపాలుడు కృష్ణుని జ్ఞాతి. అయితే వివాహం ముందురోజున కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకుపోయాడు. రుక్మిణి కృష్ణుని ప్రేమించిందనీ అతనికి ప్రేమలేఖ రాసిందనీ భాగవతం చెప్తున్నది. ఇది సత్యమని తోచదు. ఎంచేతనంటే కృష్ణుడు రుక్మిణికి బద్ధానురాగుడూ, విశ్వాసపాత్రుడూ అయిన భర్తగా ఉండలేదు. రుక్మిణి సవతుల సంఖ్య దినదినాభివృద్ధి చెందుతూ అపారమైన సైన్యంలాగ విస్తరించింది. కృష్ణుని అంతఃపురకాంతల సంఖ్య పదహారువేల నూట యెనిమిది. అతని సంతానం ఒక లక్షా ఎనభై వేలమంది. అతని భార్యలలో ముఖ్యులైన రుక్మిణి, సత్యభామ, జాంబవతి, కాళింది, మిత్రవంద, సత్య, భద్ర లక్షణలు అష్టమహిషులుగా పేరొందారు. మిగతా పదహారువేల ఒక వందమందీ ఒక్కరోజునే అతనిని వివాహం చేసుకున్నారు. వాస్తవానికి వారంతా ప్రాగ్జ్యోతిషానికి చెందిన నరకుని అంతఃపురానికి చెందినవారు. ఇంద్రుని తల్లి (అదితి) కర్ణకుండలాలు నరకుడు ఎత్తుకుపోయాడు. కృష్ణుడు ఇంద్రుని విన్నపాన్ని అనుసరించి నరకునిపై దండెత్తి అతనిని చంపాడు. యుద్ధానంతరం సత్యభామతో సహా స్వర్గలోకానికి వెళ్లి కర్ణకుండలాలు అదితికి ఇచ్చి వేశాడు. ఇంద్రుని ఉద్యానవనంలో ప్రసిద్ధమైన పారిజాత వృక్షం మీద సత్యభామ మోజుపడింది. భార్య కోరిక తీర్చటానికి కృష్ణుడు తాను అంతకుముందే సహాయం చేసి మన్నించి ఉన్న, దేవరాజు ఇంద్రునితోనే యుద్ధం చేశాడు. ఇంద్రుడు వైదిక దేవతాముఖ్యుడైనప్పటికీ అంతకుముందే కృష్ణుడు అతనికి సహాయం చేసి ఉన్నప్పటికీ ఈ సందర్భంలో మట్టుకు దివ్యావతారునికి ఎంత మాత్రమూ సరితూగడు. అంచేత ఇంద్రుడు తనకు అత్యంత ప్రీతిపాత్రమైన పారిజాత

వృక్షాన్ని వదులుకోక తప్పలేదు. ఆ చెట్టును ద్వారకకు తీసుకువెళ్ళి అక్కడ నాటారు.

కృష్ణుడు అష్టమహిషులనూ పొందిన విధం చాలా ఆసక్తికరంగా ఉంటుంది. రుక్మిణితో అతని వివాహమైన కథ ఇదివరకే చెప్పుకున్నాం. ఇక సత్యభామ విషయం. సత్యభామ సత్రాజిత్తు అనే యాదవ ప్రముఖుని కుమార్తె. ఆయన కృష్ణునికి భయపడి అతని అనుగ్రహం పొందడం కోసం కుమార్తెనిచ్చి వివాహం చేశాడు. జాంబవతి భల్లూక ముఖ్యుడైన జాంబవంతుని కూతురు. జాంబవంతుడు ఒక యాదవుని నుంచి తీసుకొన్న ఒక అమూల్యాల మణికోసం కృష్ణుడు అతనితో యుద్ధం చేశాడు. జాంబవంతుడు ఓడిపోయి శాంతి కానుకగా తన కుమార్తెను కృష్ణునికి సమర్పించాడు. కాళింది కృష్ణుని భర్తగా పొందటానికి ఎంతో తపస్సు చేసింది. చివరకు ఆమె భక్తి ఫలించి కృష్ణునితో ఆమె వివాహం జరిగింది. మిత్రవింద కృష్ణునికి మేనత్త కూతురు. స్వయంవర స్థలం నుంచి కృష్ణుడు ఆమెను ఎత్తుకొచ్చాడు. సత్య అయోధ్య రాజైన నగ్నజిత్తు కుమార్తె. పొగరుబోతు ఎద్దులను చంపటం అనే సాహసకృత్యం చేసి కృష్ణుడీమెను పొందాడు. భద్ర కృష్ణుని మరో మేన మరదలు. ఈమెను కృష్ణుడు యధావిధిగా పెళ్ళి చేసుకున్నాడు. లక్షణ మద్రరాజైన బృహత్సేనుని కుమార్తె. స్వయంవర స్థలం నుంచి కృష్ణుడు ఈమెను ఎత్తుకవచ్చాడు. సుభద్రార్జునుల వివాహ విషయంలో కృష్ణుని పాత్ర గమనించదగ్గది.సుభద్ర బలరాముని చెల్లెలు. కృష్ణునికి మారుటి చెల్లెలు. అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ ప్రభాస తీర్థానాకి వచ్చినప్పుడు కృష్ణుడు రైవతక పర్వతం దగ్గర అతనికి స్వాగతం పలికాడు. సుభద్రను గురించి విని మోహపరవశుడై ఉన్న అర్జునుడు ఆమెను ఎలా పొందాలో చెప్పవలసిందిగా కృష్ణుని కోరాడు. క్షత్రియ వివాహ పద్ధతి అయిన స్వయంవర ప్రకటన పైనా ఇతరావకాశాలపైనా ఆధారపడకుండా క్షత్రియధీరునికి ఉచితమైన రీతిలో ఆమెను ఎత్తుక పోవలసిందిగా కృష్ణుడు అతనికి సలహా ఇచ్చాడు. (అర్జునుడు ఆ సలహా పాటించాడు). ఆ బలాత్కార చర్యకు యాదవులు మొదట మండిపడ్డారు. కాని, సుభద్రకు అర్జునుడే తగిన వరుడనీ అలా ఎత్తుకు పోవటం అనేది వీరులకు తగినదేననీ కృష్ణుడు సర్దిచెప్పటంతో శాంతపడ్డారు. గత్యంతరం మాత్రం ఏమున్నది గనుక? కృష్ణుడు మనలాగ ఉత్తుత్తినే వాదించే మనిషి కాదు. ఇదివరకే అతడు అవన్నీ ఆచరణలో పెట్టి ఉండటం మనం చూసే ఉన్నాం.

యుధిష్ఠిరుడు చేసిన రాజసూయ యాగ సందర్భంగా, తనకు అహితులైన జరాసంధునీ శిశుపాలునీ కృష్ణుడు ఎలా నిహతులను చేశాడో గమనించటం ఆసక్తికరంగా ఉంటుంది. జరాసంధుడు ఎందరో రాజులను బందీలుగా చేసి రుద్రునికి బలి ఇవ్వాలని తలపెట్టాడు. జరాసంధుని చంపి ఆ రాజులందరనూ విడుదల చేసి వారంతా యుధిష్ఠిరునికి సామంతులుగా ఉండే అవకాశం కల్పిస్తే తప్ప యుధిష్ఠిరుడు కోరుకొంటున్న చక్రవర్తిత్వం స్థాపితం కాదు. అంచేత కృష్ణుడు భీమునితోనూ, అర్జునునితోనూ జరాసంధుని రాజధానీ నగరమైన రాజగృహానికి బయలుదేరి వెళ్లి తమలో ఎవరితోనైనా ద్వంద్వ యుద్ధం చేయాలని జరాసంధుని సవాలుచేశాడు. క్షత్రియుడైన వాడెవడూ అలాంటి సవాలును తిరస్కరించలేడు.

శత్రువు చేతిలో మరణం ఊహించిన జరాసంధుడు కొడుకైన సహదేవుని తన వారసునిగా ప్రకటించి ద్వంద్వ యుద్ధానికి సిద్ధమై భీముని తన ప్రతిస్పర్ధిగా ఎంచుకొన్నాడు. వారిపోరు పదమూడు రోజులపాటు సాగింది.చివరకు జరాసంధుడు తన ప్రత్యర్థి చేతిలో బాధాకరమైన మరణాన్ని పొందాడు. సహదేవుని సింహాసనంపై అభిషేకించి విడుదలైన రాజులందరినీ యుధిష్ఠిరుడు చేస్తున్న రాజసూయ యాగానికి రావలసిందిగా ఆహ్వానించి కృష్ణుడూ అతని మిత్రులూ ఇంద్ర ప్రస్థానానికి తిరిగివెళ్ళారు.

రాజసూయ యాగం యథావిధిగా మొదలైంది. యాగానికి సంబంధించి చేయవలసిన విధులు, కర్మలు చాలా ఉన్నాయి. వాటిలో బ్రాహ్మణుల పాదాలు కడిగేపని బాధ్యత కృష్ణుడు స్వీకరించాడని అంటారు. తులనాత్మకంగా మహాభారతం ఇటీవలిది అని చెప్పటానికి ఇదొక బలమైన సూచన. ఎందుకంటే ప్రాచీనకాలంలో బ్రాహ్మణుల సర్వోన్నత్యం సుప్రతిష్ఠితమైన రోజులలో కూడా క్షత్రియులు వారికి సేవా గౌరవం ఇవ్వలేదు.

యాగం పూర్తయ్యాక అక్కడ కూడిన రాజులనూ, ఆచార్యులనూ, గౌరవనీయులైన తదితరులనూ (యాజన సదస్యగురు ద్విజకోటిని ) సత్కరించి పంపాల్సిన సమయం ఆసన్నమైంది. అందులో, అగ్ర పూజార్హులెవరు, మొదటి సత్కారం ఎవరికి చేయాలన్న విషయంలో యుధిష్ఠిరుడు భీష్ముని అభిప్రాయం అడిగాడు. కృష్ణుడే ఆ గౌరవానికి తగినవాడని ఆయన చెప్పాడు. తదనుగుణంగానే సహదేవుడు తీసుకొని వచ్చి ఇచ్చిన గౌరవ సూచకమైన అర్ఘ్యాన్ని యుధిష్ఠిరుడు కృష్ణునికి సమర్పించాడు. కృష్ణుడు దానిని స్వీకరించాడు. ఇది శిశుపాలుని కలవర పరచింది. కృష్ణునికి శిష్టపూజ చేసిన పాండవులనూ పూజ అందుకొన్న కృష్ణుణ్ణే నిందిస్తూ కృష్ణునికి అర్ఘ్యదాన యోగ్యత ఉన్నదా అని ఆక్షేపిస్తూ పెద్ద ఉపన్యాసం ఇచ్చాడు. దానికి సమాధానంగా కృష్ణుని లీలామానుష కృత్యాలను ఏకరువు పెడుతూ ఆయన దివ్యత్వాన్ని రూఢిపరుస్తూ భీష్ముడు ఇంకో ఉపన్యాసం ఇచ్చాడు. శిశుపాలుడు ఊరుకోకుండా భీష్ముని వాదనను ఒక దాని తర్వాత ఒకటిగా ఖండించి భీష్ముని నిందించాడు. శిశుపాలుడు కృష్ణుని నిందించిన మాటలలో బృందావన గోపికలతో కృష్ణుడు చేసిన క్రీడా విశేషాలు లేకపోవటాన్ని ఇటీవల కృష్ణుని జీవిత చరిత్ర రాసినవారు గమనించారు. వారి అభిప్రాయం ప్రకారం మహాభారత రచన నాటికి పురాణకర్తలూ ఆ తర్వాతి కవులూ ఇంతగా చెప్తున్న ఈ బృందావన వ్యవహారాలు వెలికి రాలేదు. ఆ విషయం అలా ఉంచితే, శిశుపాలుని ఉపన్యాసం తర్వాత శిశుపాలుడూ అతని అనుయాయులూ యజ్ఞ సంపూర్తికి భంగం కలిగిస్తారేమోనని యుధిష్ఠిరుడు భయపడటం చూసి, భీష్ముడు వారిని ఉద్దేశించి, వారు గనక చావుకు సిద్ధపడిన వారైతే అప్పుడు కృష్ణుని సవాలుచేసి పోరాటానికి పిలుస్తారని అన్నాడు. దాంతో శిశుపాలుడు కృష్ణుని సవాలు చేశాడు. దానికి సమాధానంగా కృష్ణుడు తన విరోధి దురాగతాలను వరుసపెట్టి చెప్పాడు. "నా అత్త(శిశుపాలుని తల్లి) అభ్యర్థనపై వీని నూరు తప్పులు సహించాను. ఇప్పుడు ఇందరు రాజుల ఎదుట నన్ను అవమానిస్తూ పలికిన మాటలు ఇక సహించబోను, మీ అందరి

1. సోమదత్తుని పుత్రుడైన భూరిశ్రవుడు కృష్ణుని మిత్రుడైన సాత్యకిని గట్టిగా అదిమి పట్టుకొని ఉండగా కృష్ణుడు అర్జునుని ప్రోత్సహించి భూరిశ్రవుని చేతులు నరికి వేయించాడు. అప్పుడు సాత్యకి భూరిశ్రవుని చంపటం సులువైంది.

2. ఏడుగురు కౌరవ యోధులు అభిమన్యుని అధర్మంగా చుట్టుముట్టి చంపినప్పుడు, ఆ మర్నాడు సూర్యుడు క్రుంకే లోపల అభిమన్యుని దుర్మరణానికి (ముఖ్య) కారకుడైన జయద్రధుని చంపుతాననీ అలా చేయలేని పక్షంలో అగ్నిలో దూకి ప్రాణత్యాగం చేస్తాననీ అర్జునుడు ప్రతిజ్ఞ చేశాడు. ఆమర్నాడు సూర్యుడు క్రుంకే సమయం ఆసన్నం కావటమూ జయద్రధుడు హతం కాకుండా ఉండటమూ చూసి, కృష్ణుడు చిత్రంగా సూర్యుని మరుగుపరచి, సూర్యాస్తమయ భ్రాంతితో జయద్రధుడు బయటకు రాగానే తిరిగి సూర్యుడు కనిపించేలా చేశాడు జయద్రధుడు కనిపించగానే అర్జునుడు అతనిని సంహరించాడు.

3. ఏ సాధనాలతోనూ ద్రోణుణ్ణి చంపటం సాధ్యపడక నిరాశ చెంది ఉన్న పాండవులకు అతనిని అధర్మంగా చంపవచ్చునని సలహా ఇచ్చింది కృష్ణుడే. అస్త్ర సన్యాసం చేసిన ద్రోణుని చంపటం సులువనీ పుత్రుడైన అశ్వత్థామ మరణవార్త వింటే ద్రోణుడు అస్త్ర సన్యాసం చేస్తాడనీ కృష్ణుడు వారికి చెప్పాడు. ఈ ఆలోచనకు భీముడు కార్యరూపం ఇచ్చాడు. అశ్వత్థామ అనే పేరుగల ఒక ఏనుగును చంపి అశ్వత్థామ చనిపోయినట్లు చెప్పాడు. ద్రోణుడు ఆ వార్త విని దిగులుపడ్డాడు. కాని ఆ వార్త పూర్తిగా నమ్మలేకపోయాడు. సరిగా అదే సమయంలో చాలామంది మునులు వచ్చి యుద్ధం మానివేయవలసిందనీ బ్రాహ్మణోచితమైన జపధ్యానాదులతో స్వర్లోక యాత్రకు సిద్ధం కావలసిందనీ ద్రోణుని బలవంతపెట్టారు. అది ఆ యోధుని మరింత నిర్వీర్యుని చేసింది. తన కుమారుని గురించిన వాస్తవ సమాచారం కోసం ఆయన సత్యసంధునిగా పేరొందిన యుధిష్ఠిరుని వేడుకొన్నాడు. అసత్యం చెప్పటానికి యుధిష్ఠిరుడు ఇష్టపడక పోవటం చూసి కృష్ణుడు అతనికి సుదీర్ఘమైన హితబోధ చేశాడు. అసత్య భాషణం గురించి వాసిష్ఠ స్మృతిలోని నీతులన్నీ చెప్పి, ధర్మరాజు విముఖతను పోగొట్టాడు. 'వివాహాలలోనూ, వ్యవహారాలలోనూ, ప్రాణాపాయ స్థితిలోనూ' ధనంగాని, మానంగాని భంగపడే స్థితిలోనూ, బ్రాహ్మణ రక్షణ కొరకూ అసత్యం పలకవచ్చు. ఈ అయిదు సందర్భాలలోనూ అసత్యం చెప్పటం పాపం కాదని విజ్ఞులు చెప్పారు. యుధిష్ఠిరుని సందేహాలకు తావు లేకుండా పోయింది. 'అవును. అశ్వత్థామ మరణం సత్యమే.' అంటూ పెద్దగా చెప్పి 'అది ఒక ఏనుగు' అని మెల్లిగా తగ్గు స్వరాన చేర్చాడు. ఆ చివరి మాటలు ద్రోణుని

చెవి సోకనేలేదు. ఆయన అంతరంగం వ్యాకులతతో నిండిపోయింది. ఆ పైన భీముని పరుష వాక్యాలూ ఎత్తిపొడుపులూ విని ఆయన ఆయుధాలు వదిలేశాడు. ధ్యానమగ్నుడై సమాధి స్థితిలో వున్న ద్రోణుని ఆ దశలో ధృష్టద్యుమ్నుడు చంపాడు.

4. ద్వైపాయన సరస్సు దగ్గర దుర్యోధనునితో పోరాడుతూ అతనిని జయించ లేకుండా ఉన్న భీమునికి, తన విరోధి తొడలు పగలగొడతానని భీముడు అంతకు ముందు చేసివున్న ప్రతిజ్ఞను కృష్ణుడే అర్జునుని ద్వారా గుర్తుకు తెచ్చాడు. శత్రువును నాభి క్రింది ప్రదేశంలో కొట్టడం అధర్మం. అలాంటి అధర్మ మార్గాలద్వారా తప్ప దుర్యోధనుని జయించటం సాధ్యం కాకపోవటం వల్ల కృష్ణుడు భీమునికి ఆ మార్గం అవలంబించవలసిందిగా సలహా ఇచ్చాడు. భీముడు ఆ ప్రకారమే చేశాడు.

కృష్ణుని మరణ ఘట్టం అతని నైతిక విలువలను గురించిన ఎన్నో విషయాలను వెలుగులోనికి తెస్తున్నది. కృష్ణుడు ద్వారకాపురీశుడుగా మరణించాడు. అసలు ఈ ద్వారక ఎలాంటిది? అతనికి సంభవించిన మరణం ఎలాంటిది?

ద్వారకా నగరాన్ని వెతుక్కునేటప్పుడు కృష్ణుడు వేలాదిమంది అభాగ్యులు అక్కడ స్థిరపడేట్టు శ్రద్ధ వహించాడు. హరివంశం దీని గురించి ఇలా చెప్తున్నది. 'శౌర్యవంతులైన యాదవుల సహాయంతో దైత్యయోధుల స్థావరాలను జయించిన భగవానుడు ద్వారకలో వేలాదిమంది వేశ్యలకు స్థిరనివాసం కల్పించాడు. నృత్యగాన పాన ప్రియులైన స్త్రీ పురుషులు, వివాహితులు, వేశ్యలతో ద్వారక నిండి ఉండేది.

ఇలాంటి వర్ణనలలో సముద్రతీర విహారయాత్ర ఒకటి మనకు లభిస్తున్నది. ఆనాటి వేడుకలో స్త్రీలదే ముఖ్యపాత్ర. వారి నృత్యగానాదులతో ఉత్తేజితులై బలరామకృష్ణ సోదరులు కూడా తమ భార్యలతో ఆ వినోదాలలో పాల్గొన్నారు. వారిని ఇతర యాదవ ప్రముఖులు అనుసరించారు. అర్జున నారదాదులు కూడా అందులో ఉన్నారు. అప్పుడు వారికి ఒక సరికొత్త క్రీడ స్ఫురించింది. కృష్ణుని ఆదేశం ప్రకారం స్త్రీలు పురుషులు అంతా సముద్ర జలాలలోకి దిగారు. పురుషులు స్త్రీలతో జలక్రీడ ఆరంభించారు. ఒక పక్షానికి కృష్ణుడు నాయకుడు. రెండో పక్షానికి బలరాముడు నాయకుడు. వేశ్యల సంగీతం వారి ఆనందాన్ని ఇనుమడింప జేసింది. ఆ తర్వాత విందు భోజనం. తినటం, తాగటం అయ్యాక మళ్ళీ ప్రత్యేక సంగీత కార్యక్రమం మొదలైంది. ఇరుపక్షాల నాయకులూ వివిధ సంగీత వాద్యాలలో తమకున్న కౌశలాన్ని ప్రదర్శించారు. ఇలాంటి వర్ణనలు చూస్తే యాదవులు ఎంత విలాస పురుషులో తెలుస్తుంది. వేశ్యా వినోదాల గురించీ జానపద రంగశాలల గురించీ ఈ రోజుల్లో బ్రాహ్మణులూ తదితర ఛాందసులూ లేవనెత్తుతున్న అభ్యంతరాలను వారు ఏ విధంగా ఈసడించి ఉండేవారో ఇలాంటి విలాసాలలోనే మద్యపాన మదోన్మత్తులై యాదవులు సర్వనాశనమయ్యారు.

యాదవ బాలకులు కొందరు చేసిన ఒక కొంటెపని, కొందరు మునులకు అప్రసన్నత కలిగించినందువల్లనే యాదవుల వినాశం జరిగిందని చెప్తున్నారు. కొందరు యాదవ బాలురు కృష్ణుని కుమారులలో ఒకడైన సాంబునికి ఆడవేషం వేసి ఇక ఇనుప ముసలాన్ని బొడ్డు

కిందిభాగాన పెట్టి కట్టి, గర్భవతిలా కనిపించేలాగ చేసి మునుల దగ్గరకు తీసుకువెళ్ళి ఆమెకు ఏ బిడ్డ కలుగుతుందో సెలవీయవలసిందిగా కోరారు. కోపావిష్టుడైన ముని 'ఆమెకు ఒక ముసలం పుట్టి యాదవులను నాశనం చేస్తుందని చెప్పాడు. ఆ శాప పర్యవసానానికి భయపడి వారు ఆ ముసలాన్ని సముద్ర తీరానికి తీసుకువెళ్ళి అరగదీశారు. దాని రేణువులన్నీ 'ఎరకలు'గా బయటపడి తీరానికి కొట్టుకొచ్చి రెల్లుగా మొలిచాయి. ముసలాన్ని అరగదీయగా మిగిలిన ముక్కను వారు సముద్రంలోకి విసిరేస్తే అది ఒడ్డుకు కొట్టుకొచ్చి ఒక వేటగానికి దొరికి అతనికి బాణపు ములికిగా అమరింది. ముసలపు రేణువులతో మొలిచిన రెల్లుగడ్డితోనే యాదవులు తమలో తాము కొట్టుకుని మరణించారు. ఒకప్పుడు యాదవులు చాలామంది పెద్ద సంఖ్యలో ప్రభాస తీర్థానికి వెళ్ళారు. అక్కడ విందులు, వినోదాలతో సురాపానం సాగించారు. అదే వారి వినాశనానికి దారితీసింది. ఆ మత్తులో వారు తమలో తాము కలహించుకొని కొట్టుకోవటం మొదలుపెట్టారు. మద్యపానపు ఈ దుష్ఫలితాలు దూరాన ఉన్న కృష్ణునికీ ఇతర యాదవ ప్రముఖులకూ తెలిశాయి. మద్యపానాన్ని నిషేధిస్తూ వారు చాటింపు వేయించారు. మద్యపానం చేసినవారికి మరణశిక్ష అని కూడా ప్రకటించారు. అయినా ఫలితం లేకపోయింది. తాగిన మత్తులో యాదవులు కలహాలకు దిగారు. తర్వాత కొట్టుకోవటం, చంపుకోవటం సాగించారు. కృష్ణుని సొంత కొడుకులు ఆ తగాదాలలో మరణించటంతో కృష్ణుడు కూడా రంగంలో దిగి చాలామందిని చంపాడు. ఆ తర్వాత బలరాముని వెతుక్కుంటూ వెళ్ళాడు. బలరాముడు ధ్యానమగ్నుడై సమాధి స్థితిలో ఉండటమూ ఆయన ఆత్మ శరీరంలోనుంచి ఒక దివ్య సర్పం రూపంలో వెలుపలికి రావటమూ చూశాడు (బలరాముడు ఆదిశేషుని అంశావతారం). తాను కూడా వెళ్ళాల్సిన సమయం వచ్చిందని కృష్ణుడు గ్రహించాడు. తండ్రి దగ్గరా భార్యల దగ్గరా సెలవు తీసుకున్నాడు. అర్జునుని కోసం కబురు పంపాననీ, అతను వచ్చి వారి బాధ్యత వహిస్తాడనీ వారితో చెప్పాడు. తర్వాత కొమ్మలు బాగా కిందికి వంగి ఆకులు దట్టంగా ఆవరించి ఉన్న ఒక చెట్టుకింద నిశ్చల ధ్యానంతో కూర్చున్నాడు. అలా కూచుని ఉండగా 'జరు'డనే ఒక వేటగాడు అతనిని లేడిగా భ్రమించి బాణంతో కొట్టాడు. యాదవ ప్రాణాంతకమైన ముసలంలోని చివరి ముక్క ఆ బాణానికి ములికిగా ఉంది. ఆ వేటగాడు తర్వాత తన పొరపాటు తెలుసుకుని కృష్ణుని పాదాలపై పడి అభయం పొంది దివ్యకాంతులు వెదజల్లుతూ స్వర్గారోహణం చేశాడు. అర్జునుడు వచ్చి చావగా మిగిలిన యాదవులను, స్త్రీలనూ, పురుషులనూ తీసుకొని హస్తినాపురికి బయలుదేరాడు. కాని అర్జునుడు మిత్రుడైన కృష్ణునితోపాటు సాటిలేని భుజబల సంపదనూ, విలువిద్యా నైపుణ్యాన్నీ కూడా కోల్పోయాడు. కేవలం కర్రలు చేతపట్టుకుని ఉన్న 'ఆహీరు'లనే వారు కొందరు యాదవ బలగంమీద పడి చాలమంది స్త్రీలను ఎత్తుకుపోయారు. చాల కొద్దిమందిని మాత్రమే అతడు హస్తినాపురికి చేర్చగలిగాడు. అర్జునుడు ద్వారక నుంచి నిష్క్రమించగానే సముద్రం ఉవ్వెత్తున పొంగి నగరాన్ని ముంచివేసింది. యాదవుల గురించీ, వారి వైభవాన్ని గురించీ,వారి గృహ కలహాల గురించీ మద్యపాన మత్తత గురించీ చెప్పటానికి అక్కడ ఏమీ మిగల్లేదు.

**అనువాదం : డాకర్ బి. విజయభారతి**

డాక్టర్ అంబేడ్కర్ దస్తూరి. దీనిని చిక్కుముడి-22 "బ్రహ్మ ధర్మం కాదు" అనే దాని నుంచి తీసుకోవడం జరిగింది. ~~6 not Dhatma~~.

To support Democracy because we are all children of God is a very week foundation for Democracy to rest on. That is why Democracy is so shaky wherever it made to rest on such a foundation. But to recognize & to realize that you and I are parts of the same cosmic principle leaves room for no other theory of associated life except democracy. It does not merely preach Democracy. It makes democracy an obligation of one and all.

Western students of Democracy have ~~cultivated~~ spread the belief that Democracy has stemmed either from Christianity or from Plato and that

T.O.

there is no other source of inspiration for democracy. If they had known that India too had developed the doctrine of Bramhaism which furnishes a better foundation for Democracy they would not have been so dogmatic. India too must be admitted to have a contribution towards a theoretical foundation for Democracy.

The question is what happened to this doctrine of Bramhaism? It is quite obvious that Bramhaism had no social effects. It was not made the basis of Dharma. When asked why this happened the answer is that Bramhaism is only philosophy. As though philosophy arises not out of social life but out of nothing and for nothing.

Philosophy is no purely theoretic matter. It has practical potentialities. Philosophy has its roots in the problems of life and whatever theories philosophy propounds must return to society as instruments of re-constructing Society. It is not enough to Know. Those who Know must endeavour to fulfil.

Why then Bramhaism failed to produce a new society? This is a great riddle. It is not that the Brahamins did not recognize the doctrine of Bramhaism. They did. But they did not ask ~~this question~~ how they could support inequality between the Brahamin & the Shudra;

between man and ~~man~~ woman
between Casteman and outcastes?
But they did not. The result
is that we have on the one hand
the most democratic principle of
Bramhaism and on the other hand
a society infested with castes,
sub-castes, outcastes, primitive tribes
and criminal tribes. Can there
be a greater dilemma than this
What is ~~most~~ more ridiculous is
the teaching of ~~Shank~~ the Great
Shankaracharya. ~~Than whom there~~
~~cannot be a greater idiot~~. For it
was this Shankarachkarya who taught
that there is Bramha and this
Bramha is real and that it pervades
all and at the same time upheld

all these inequities of the Brahmanic Society. Only a lunatic could be happy with two such ~~contradictions~~ ~~Cheers~~ being the propounder of two such contradictions. ~~How~~ ~~the Brahma~~ miss killed ~~Brahmaism~~ is a ~~&~~ ~~riddle~~ that calls ~~for an Solution.~~ ~~Explanation~~.

Surely as the Brahamin is like a Cow. He can eat any thing and every thing as the Cow does and remain a Brahamin.

# BIBLIOGRAPHY

*The books and journals listed here include the works cited by the author. The details about the publications have been sorted out from the Asiatic and the Bombay University libraries. further details could not be sought for want of time before the release of this book-Editor.*

**Abhayadevasuri :** *Commentary on Bhagavati Sutra*

**Aufrecht, Prof. :** *Katyayana's Srauta Sutras :* Reading of the Veda in one's own Sakhas

**Avalon, Arthur :** *inciples of Tantra*

**Bohtlingk, Otto and Roth, Rudolph :** *Sanskrit Worferbuch :* (St. Petersburg, Buchdruckerei Der Kaiserlvehen Akademie Der Wissens Chaften. 1865)

**Belvalkar, Shripad Krishna :** *Vedanta Philosophy* (Basu-Mallik Lectures, University of Calcutta; Poona 1929)

**Bhava Raju, Vyankat Krishna Rao :** *Early Dynasties of Andhra Desha*

**Blacquiere, W.C. :** *Asiatic Researches Volume*

**Colebrooke :** *Miscellaneous Essays, Vols. I-II (Madras, Higginbotham & Co 1872)*

**Dandekar, prof. :** *Vishnu in the Vedas*

**Dewey, John :** *Democracy and Education* (New York, Macmillan 1916)

**Dutt, R.C. :** *Civilization in Ancient India* (1888 Chronology of Ancient India)

**Eggeling, Julius :** *Satapatha Brahmana, Part I-V* (London Sacred Books of the East, Oxford 1885)

**Hopkins, E.Washerman :** *The Great Epics of India* (New York, Charles Scribner's Son. 1901)

**Jaiswal :** *Hindu Polity*

**Kane, P.V. :** *Paper on Kali Varjya : History of Dharma Shastra* (Ancient and Medieval Religious and Civil Law) Vol. 1

**Law, B.C.** : *The Magadha in Ancient India I(The Royal Asiatic Society, London 1946); Kshatriya Clans in Buddhist India* with a foreword by the Hon'ble Sir Asutosh Mookerji (Calcutta 1922)

**Max Muller** : *The Satapatha Brahmanas, Parts 1-5 tr.* by J.Eggeling, Sacred Books of the East Series Vols. 12, 26, 43&48 ed. by F.Max Muller (Oxford 1885, 1894, 1897, 1900)

**Mayne** : *Hindu Law and Usage*

**Medhatithi** : *Commentary on Manu* Ed. by V.N. Mandlik (Bombay 1886)

**Mitra Rajendralal** : *Indo Aryans* : Constitutions towards the elucidation of their ancient and medieval History (W. Newman & Co., Calcutta 1881)

**Moore, Edward** : *Hindu Pantheon* (London W.O. Simpson, 1810)

**Muir, J.** : *Original Sanskrit Texts* (Vol. I-IV, London Trubner & Co., 57&59 Ludgate Hall, 1873-II Ed.)

**Mukerjee, Radha Kumud** : *Ancient Indian Education* (Brahmanical & Buddhist) (London, Macmillan & Co. 1947)

**Rangacharya, Mr.** : *The Yugas, A question of Hindu Chronology*

**Sham Shastri** : *Drapsa, The Vedic Cycle of Eclipses*

**Weber, Albrecht** : *Indische Studies,* (Berlin 1868-69)

**Wilson** : *Vishnu Puran* (Essays on Sanskrit Literature). A system of Hindu mythology and tradition, ed. Fitz Edward Hall, Vol.1-5, (London, Trubner & Co., 1864)

# ముఖ్య పదసూచి


అంగిరసుడు 177
అంధకుడు 177
అంబిక 116
అక్రూరాసురుడు 196
అగ్ని 96, 99
అగ్ని పురాణం 249
అత్రి 191
అదితి 115
అధర్వణ వేదం 20, 21, 25, 51, 60, 76, 148-154, 190, 253, 330
అధర్వణుడు 76
అనసూయ 191-192
అనులోమ 78, 179, 243, 244, 248
అన్నపూర్ణ 118
అప్సర 115
అభయ దేవసూరి 325
అభిమన్యుడు 333, 385
అయనం 344
అయోనిజ 337
అయ్యంగార్ 355
అరణులు 241
అరుణ 207
అర్యముడు 339
అర్జునుడు 108, 118, 128, 333, 334, 387
అలెగ్జాండర్ 252
అశోకుడు 327
అశ్వత్థామ 111
అశ్వపతి 80
అశ్వమేధం 330
అశ్వమేధక్రతువు 44, 49, 139
అస్కంద 354
అసురులు 122, 221
అహల్య 338
అహింస 147
ఆంగిరసుడు 76
ఆంధ్రులు 252
ఆగ్నేయి 115, 116
ఆదిత్య పురాణం 361, 362
ఆదిత్యులు 33, 221
ఆపస్తంబ ధర్మసూత్రం 28, 66, 130, 131, 169, 358
ఆబెడ్విగో 7, 200
ఆరణ్యకాలు 169
ఆరమతి 115
ఆల్టేకర్ 66, 67
ఆశ్రమధర్మ 284, 286, 288
ఆశ్వలాయన గృహ్యసూత్రం 144, 188, 339
ఆహీరులు 252, 387
ఇంద్రాణి 115, 206
ఇంద్రుడు 96, 99, 112, 123
ఇక్షు 133
ఇతిహాసాలు 63, 170, 177
ఇమాంషా 15
ఇస్లాం 13
ఈశానుడు 220
ఈశ్వరుడు 92
ఉత్తర 333
ఉపనిషత్తులు 169, 176
ఉపమన్యు 111
ఉమ 93
ఉశనుడు 245, 249, 357
ఉష 115
ఊర్వశి 333, 334
ఋగ్వేదం 20, 24-26, 32, 34, 48-49, 77, 115, 127, 149-154, 156, 165, 177, 189, 190, 210-212, 218, 226, 228-230, 273, 283, 286
ఎగ్లింగ్ 325
ఏక దేవతారాధకులు 13
ఏకేశ్వరోపాసన 15, 93
ఐతరేయ బ్రాహ్మణం 149
ఓజ 325
ఔఫ్రెక్ట్ 209
కందర్పుడు 119
కఠోపనిషత్తు 77, 178
కథక సంహిత 217
కపిలుడు 35

కమలాకరుడు 66
కమలాత్మిక 206
కర్ణుడు 253
కలి 125,
కలియుగం 18, 323, 325-330, 342-356, 362
కలివర్జ్య 356-362
కల్లు 133
కల్పము 18, 19, 327, 345-47, 352
కాణే 66, 69, 78, 342, 355, 361
కాత్యాయన శ్రౌత సూత్రాలు 357, 359
కాత్యాయనుడు 31, 32, 154
కాదంబరి 133
కామదేవుడు 119
కామాఖ్యా దేవి 134, 137-140
కామేశ్వరి 207
కార్తికేయి (మయూరి) 206
కాళరాత్రీయ మంత్రం 138
కాళి 119, 138, 147, 206, 207
కాళీ పురాణం 136, 143, 144
కుంతి 126, 335
కులవ్యవ 16
కులీన వ పాలన 316
కుల్లూక ట్టు 18, 19, 71, 135
కృత 125
కృతయుగం 18, 324, 325, 330, 331, 345-354
కృష్ణ యజుర్వేదం 217
కృష్ణుడు 95, 103, 110-112, 284, 327, 376-387
కొవెల్ 179
కోలి 133
కౌలేశి 207
కౌషీతకి 127, 149, 331
క్రైస్తవం 322
క్రైస్తవుడు 13, 15, 16
ఖర్జూరీ 133
ఖురాన్ 15
గంగానది 196
గణిక 126
గాయత్రి 26, 49, 135, 153
గుహుడు 253
గృహస్థాశ్రమం 232, 233, 240, 241, 296-300
గోపాల అయ్యర్ 327
గోవధ 125
గౌడి 133
గౌతమ ధర్మసూత్రాలు 28, 74, 167 176,
గౌతమ సంహిత 253, 358, 361
గౌతముడు 35, 45, 176, 356
గౌరి 117
చండముండులు 121
చండిక 137
చంపారన్ 253
చతుర్వర్ణాలు 216, 231, 254
చతురాశ్రమాలు 232, 296
చార్వాకుడు 43, 44, 179
చులనిద్దెస్స 98, 99, 186, 187
ఛాందోగ్యోపనిషత్తు 23, 151, 177, 337
ఛిన్న మస్తక 118, 206
జంతుబలి 143, 144
జటిల గౌతమి 336
జనకుడు 80, 113, 253
జనమేజయుడు 229, 280
జయిని 207
జరుడు 387
జర్పరీ (తుర్పరీ) 44, 180
జొరాష్టర్ 13
జూదం 331, 342
జెనోఫీన్స్ 93
జైమిని 36, 39, 42, 45, 79, 82, 180-184
జ్యోతిష్టోమ క్రతువు 44
టంక 133
డూరా 6
డ్యూవే 317
తంతరంగ 140
తంత్రాలు 71, 134
తాంత్రిక ధర్మం 203
తాంత్రిక పూజ 133-207
తార 206
తిలోత్తమ 119
తైత్తిరీయ ఆరణ్యకం 74, 176
తైత్తిరీయ బ్రాహ్మణం 23, 221, 273, 354, 357

తైత్తిరీయ సంహిత 188, 217, 218, 283
పుర 206
మూర్తి 185, 187, 192, 198
త 125
తాయుగం 18, 324, 325, 330, 331, 345-354
త్ర్యోజ 326
దండేకర్ 189, 190
దక్షుడు 100-102, 188, 280
దత్తత 67
దధ్యంచుడు 219
దమఋషి 336
దశభుజ 118
దశరథుడు 113
దితి 115, 116
దీర్ఘతముడు 341
దుర్గ 118, 120-124
దేవంభట్టు 67
దేవల స్మృతి 361
దేవయజ్ఞం 209
ద్రౌపది 331, 340
ద్వాపర యుగం 18, 324, 325, 330, 331, 345-354
ధూమవతి 206
నరబలి 140, 142, 330
నల మహారాజు 331
నవాగ్వా ఋషులు 34
నాదకర్ణి 374
నారదుడు 356
నారాయణీయం 193
నారికేళ 133
నియంతృత్వం 316
నియోగం 335
నిరుక్తం 189,190
నిష్టిగ్రి 115, 116
నిశుంభుడు 119-121
నీలకంఠుడు 66
నెబుచడ్నెజార్ 6,7, 199
నైయాయికుడు 158
పంచ్ పీరియా 14
పంచ గౌడులు 128
పంచ ద్రావిడులు 128
పంచ మహాయజ్ఞాలు 236, 306
పంజాబ్ 252
పతంజలి 252
పద్మ పురాణం 196
పరశురాముడు 113, 114
పరాశరుడు 228, 280, 356, 358
పరీక్షిత్తు 327, 355
పాండవులు 353, 331, 336
పాచికలు 324, 325, 331
పాణిని 253
పార్సీ 13
పార్వతి 117, 118, 123, 191
పాశుపత 134
పితృతర్పణ 67
పితృయజ్ఞం 209
పితృస్వామికం 256
పీర్ 5, 14
పుణ్యక వ్రతం 334
పురాణాలు 63, 69,170, 172, 177
పురుష సూక్తం 9, 217, 219, 276, 283
పురూరవుడు 225, 276
పులస్త్యుడు 133
పూర్వమీమాంస 45
పూష 218, 273, 339
పృథ్వి 115, 116
పైష్టి 133
ప్రజాపతి 22, 24, 25, 84, 149–153, 170, 192
ప్రజాస్వామ్యం 316-319, 321, 322
ప్రతిలోమ 78, 179, 243, 244, 248
ప్రభాకర పండితుడు 37, 159
ళయం 19
స్ని 115
తి 33, 154
ప్లినీ 252
ప్లేటో 322
బకిల్ 7
బలి 137-143, 209, 217
బహు దేవతారాధకులు 13, 15, 93
బాదరాయణుడు 79, 81, 82, 180-184
బాబిలోన్ 6
బాలిని 207

బావా మలాంగ్గా 5
బృహత్ సర్వానుక్రమణిక 32
బృహదారణ్యకోపనిషత్తు 23, 76, 78, 178
బృహద్విష్ణు పురాణం 250
బృహస్పతి 33, 179, 218, 336, 356, 358
బోధాయనుడు 28, 29, 130, 168, 169, 245, 249 250, 356, 357
బౌ మతం 300
బౌ రామాయణం 365-366
బ్ర 83, 84, 88, 99, 100, 101, 107, 112, 117, 153, 185, 191-195, 229
బ్రహ్మచర్యం 231, 232, 234, 241ం 296
బ్రహ్మయజ్ఞం 209, 210
బ్రహ్మవాదం 320, 322
బ్రహ్మ వైవర్త పురాణం 70, 173, 253
బ్రహ్మ సూత్రాలు 241
బ్రాహ్మణాలు 63, 65, 169, 171
బ్రాహ్మి 206
బ్లంట్ 14
భగవద్గీత 176, 283
భరద్వాజుడు 177, 277
భస్మాసురుడు 92, 197
భాగవత పురాణం 70, 152, 173, 193, 228, 380
భావరాజు వెంకట కృష్ణారావు 252
భీష్ముడు 110-111
భువనేశ్వరి 206
భూతయజ్ఞం 209
భృగువు 101, 225, 226, 277, 278
రవి 206
రవుడు 137, 140
త్స్య పురాణం 70, 340
మత్స్యాహారం 208
మదన పారిజాత 357
మద్యం 132-135, 331, 373
మద్యపానం 208
మధుపర్కం 129, 130, 358
మధూక 133
మధ్వాచార్యుడు 134
మనువు 212, 234-241, 242-45, 248-55, 286, 309
మనుష్య యజ్ఞం 209
మనుస్మృతి 66, 71, 135, 151, 172, 223, 233, 235, 242, 274-84
మన్వంతరం 18, 19, 309, 311-15, 344, 348-51
మల్కాణులు 14
మహాదేవుడు 188, 207
మహా భారతం 128, 194, 223-226, 275, 276, 327, 333, 337, 343
మహాయుగం 18, 343, 352
మహావిద్యలు 206
మహాసాల శౌనకుడు 76
మహిషాసుర మర్దని 118, 122-123
మహేశ్వరుడు 83, 185, 187, 191-95
మాక్స్‌ముల్లర్ 32, 64, 75, 154, 171, 175
మాతంగి 206
మాతృదేవతలు 206, 207
మాతృస్వామికం 256
మాధవాచార్యుడు 179
మాధవి 334, 335
మాయావాదం 82
మార్కండేయ పురాణం 119, 130, 152
మితాక్షర 357
మిత్రమిస్త్రుడు 66, 67
మిథిల 253
మిశ్రమ కులం 246
మీమాంసకుడు 29, 36, 158, 160
ముండకోపనిషత్తు 176, 177
ముల్లర్ 210
మూయిర్ 42, 45, 164, 172, 194, 220 273, 275, 278, 280-81, 352
మెగస్తనీసు 252
మెషాక్ 7, 200
మేదిని 207
మేయిన్ 256
యణి సంహిత 217, 283
యుడు 228, 279, 280
యం 133
మోహిని 197
యజ్ఞం 138-146, 151
యజుర్వేదం 20, 22, 24, 25, 49, 149-154, 170, 188, 211, 216,

228-230, 253, 273, 330, 331
యజుర్వేద సంహిత 283
యతులు 286
యమి 47 162, 163
యముడు 47, 162, 163
యాజ్ఞవల్క్య స్మృతి 66, 249, 250, 356, 357-361
యాస్కుడు 46, 164
యుగం 18, 344-352
యుగ్మం 325
యుధిష్ఠిరుడు 110, 383
యూదులు 6
యోగినులు 207
రంగాచార్య 324
రంభ 119
రక్తబీజుడు 121
రఘువంశం 357
రాక 115
రాక్షసులు 120, 123
రాజరికం 316
రాజసూయ యజ్ఞం 220
రాజసూయ యాగం 227, 273, 383, 384
రాజేంద్ర (లాల్) మిత్రా 74, 133, 135, 144
రాధాకుముద్ ముఖర్జీ 241, 299
రామమిశ్ర శాస్త్రి 134
రామానుజాచార్యుడు 134
రామాయణం 127, 130, 223, 253, 275
రాముడు 95, 104, 111-114, 127, 333
రాసనృత్యం 380
రుద్రుడు 145, 189, 220
రుధిరాధ్యాయం 136, 143
రెగే 185
రోదసి 115, 116
లక్ష్మి 191
లింగ పురాణం 194
లింగపూజ 189, 190, 191
లింగారాధన 330
వగల (బగళ) 206
వరాహ పురాణం 116, 193
వరుణాని 115, 116
వరుణుడు 97, 220, 339
వర్ణవ్యవస్థ 216, 217, 226, 227, 275, 283
వ ము 18
వ। ణస 137
వ వులు 96, 218
వశిష్ట ధర్మసూత్రం 167, 169
వశిష్టుడు 113, 245, 249, 250, 356, 357-361
వాజసనేయకం 131
వాజసనేయ సంహిత 217, 218, 330
వానప్రస్థం 235-241, 296-305
వామదేవ వ్రతం 337
వాయుదేవుడు 276, 277
వాయుపురాణం 69, 172, 193, 230, 281, 283
వార్ధీణస 137
వారుణి 133
వాల్మీకి 224, 276, 361, 364, 372
వాసుదేవుడు 109
విమల 207
విరాట్పురుషుడు 216
విల్సన్ 51, 164, 344, 345, 346, 348, 352
విల్కిన్స్ 116
విశ్వకర్మ 312
విశ్వదేవులు 62
విశ్వామిత్రుడు 67, 335
విష్ణు పురాణం 25, 194, 227, 228, 252, 278, 279, 283, 311, 312, 338, 343, 344, 348, 352, 357, 380
విష్ణువు 83-85, 89, 185-195, 206, 229, 280
విష్ణువు అవతారాలు 84
వెబర్ 211, 324
శంపాయనుడు 229, 280
ష్ణవి 206
ష్ణవి తంత్రం 136
వ్యాహృతులు 26, 152
వ్రతికులు 186, 187
వ్రాత్యులు 217, 243, 253
వ్యాసుడు 376
శంకరాచార్యులు 70, 81, 241, 322
శచీదేవి 127
శతపథ బ్రాహ్మణం 21-23, 149-151, 212,

220, 325, 354
శతుబలి 144
శబ్దం 159-161
శాతవాహనులు 252
శాలిసుకమౌర్యుడు 327
శిపివిష్ట 189, 190
శివకుమార శాస్త్రి 134
శివుడు 84, 95, 101, 117, 188-189, 191, 194-195
శిష్టులు 168
శుంభుడు 119-121
శుక్ల యజుర్వేదం 217, 230, 283
శునశ్శేపుడు 67
శూద్రకుడు 357
శృంగి బేరపురం 253
శేప 189
శౌనకుడు 31, 147, 154
శ్యామశాస్త్రి 325
శ్రద్ధ 115
ద్ధం 180
దేవి 104
తులు 63, 65
తధర్మ 203, 207
త సూత్రం 209
్వేతకేతు 336, 341
ష్రాద్రక్ 7, 200
షేఖాదా 15
షోడశి 206
సంకర కులాలు 245
సంకరజాతులు 254
సంధ్య 329, 343, 345
సంధ్యాంశ 329, 343, 345
సతి 67, 102
సత్యభామ 340
సత్యార్థ ప్రకాశిక 104
సత్వగుణం 223
సనత్ కుమారుడు 77, 178
సన్యాసాశ్రమం 232, 235-241, 296-305
సప్తపది 339
సప్తర్షులు 309, 311
సప్తశీర్ష మంత్రం 33
సరస్వతి 115-117, 191
స దర్శన సంగ్రహం 179
స దేవతారాధకులు 13, 15
శ్వరి 207
సాంఖ్యాయన శ్రౌత సూత్రాలు 357
సాఖీ సర్వర్ 14
సామవేదం 22, 24, 25, 32, 148-154, 253, 273
సామ్యవాదం 126
సారా 132, 134, 139
సింధ్ 252
సింహవాహిని 118
సినీవాలి 115, 191
సీత 111, 127, 253, 333, 364, 366-373
సుగ్రీవుడు 120, 121
సుర 133, 135, 331
సూత సంహిత 245, 246, 249, 250
సూత్రాలు 63, 65, 169
సూర్య 115
సూర్యుడు 97, 99, 127, 163, 195, 331, 332
సృష్టి 19, 347
సైర 133
సోముడు 97, 220
స్వర్గం 180, 309
స్కంద పురాణం 197
స్కంధ 21, 26, 149, 330
స్మశానం 140
స్మృతి చంద్రిక 67
స్మృతులు 63, 66, 72
హరిదత్తుడు 74
హరివంశం 84, 152, 193, 231, 280, 334, 380
హాప్కిన్ 320
హింస 147
హిరణ్యగర్భుడు 25
హేమ చంద్రకౌర్ 144
హేరుక 140

# శుద్ధపత్రం

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 22 | 18 | ఆవ్రునోత్ | ఆవృణోత్ |
| 22 | 18 | వర్ | వార్ |
| 51 | 14 | (తక్మ) జ్వరానికి | జ్వరానికి (తక్మ) |
| | 18 | తక్మన్ జ్వర | జ్వర (తక్మ) |
| 55 | 16 | ఆపామార్గ | అపామార్గ |
| 66 | 3 | మైత్రామిస్తుడు | మిత్రమిస్త్రుడు |
| 67 | 14, 20 | మిత్రమిశ్రుడు | మిత్రమిస్త్రుడు |
| 69 | 22 | అయ | అయా |
| 76 | 26 | ఛాందోగ | ఛాందోగ్య |
| 130 | 8 | సౌత్రమణియాగం | సౌత్రా మణియాగం |
| | 13 | హరితగృహ్య సూత్రం | హారీతగృహ్య సూత్రం |
| 137 | 21 | బర్హీనస | వార్ధీణస |
| | 23 | బర్హీనాశ | వర్ధీణస |
| 140 | 21 | తంతరంగేగం | తంతరంగం |
| 163 | 28 | దుర్నామరాగం | దుర్నామరోగం |
| 175 | 16 | Vendante | Vedanta |
| 176 | 12 | వేదాంత విజ్ఞాన | వేదాంత విజ్ఞాన |
| | | సునిష్కితరాః | సునిశ్చితార్థాః |
| 189 | 21 | శిపివిస్త | శిపివిష్ట |
| 190 | 18 | సినీవాలి అథ (VII. 46.3)తో | సినీవాలి(అథ VII.46.3)తో |
| 190 | 23 | విష్ణునిసిక్తప | నిషిక్తప |
| 190 | 24 | వీలు కల్పించేది | వీలు కల్పించే |
| 190 | 26, 29 | వృకపి | వృషాకపి |
| 194 | 24 | వానపర్వ | వనపర్వం |
| 199 | 20 | నెబుబాడ్ నెజ్జార్ | నెబుచడ్ నెజార్ |
| | 20-21 | నెబ్-ట-చాడ్నెజ్జార్ | నెబుచడ్ నెజార్ |
| | 24 | నెబుచాదీ నెజ్జార్ | నెబుచడ్ నెజార్ |
| 200 | 2 | నెబుచాద్ నెజ్జార్ | నెబుచడ్ నెజార్ |
| 200 | 19 | ఫాద్రక్ | షాద్రక్ |
| | 29 | అవెడ్నెగో | అబెడ్నెగో |
| 206 | 16 | భిన్నమస్తక | ఛిన్నమస్తక |
| 208 | పాదసూచి | చేర్చాం | చేర్చాం. సంకలనకర్త |

| | | | |
|---|---|---|---|
| 210 | 9 | నేను సెలయేళ్ళు | నేతి సెలయేళ్ళు |
| | 20 | తెనె | తేనె |
| | పాదసూచి 4 | ఈ మాటలు కట్టెలతో | కట్టెలతో |
| 217 | 5 | సమిదః | సమిధః |
| | 27 | కామోద్రేకుడైన | కామోద్రిక్తుడైన |
| 219 | 15 | దధ్యంచి | దధ్యంచుడు |
| 243 | పాదసూచి | శూద్రుడ్ని | శూద్రుణ్ణి |
| 273 | 17 | కత్ర | క్షత్ర |
| 279 | 19 | కత్రి | క్షత్రి |
| 292 | 20 | ఎదురు చేసే | ఎదురు చూసే |
| | 22 | ఆఃత్మ | ఆత్మ |
| 356 | 21 | ఆదిపర్వం ఒకటి | ఆదిపర్వం .1 |
| 358 | 13 | ఆపధర్మ | ఆప. ధర్మ. |